శారదాతనయ విరచిత

# భావప్రకాశనము

భావాలోకము : జమ్మలమడక మాధవరామశర్మ

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రచురణ

# తొలిపలుకు

నృత్య, సంగీత, నాటకోత్సవాలను నిర్వహించటం, ఆ యా కళలలో శిక్షణాల యాలకు, సాంస్కృతిక సంస్థలకు, సహాయముచేయటం, మరుగునపడి పోతున్న మన సంప్రదాయ, జానపద కళారూపాల పునర్వికాసానికి కృషిచేయటం మున్నగు కార్యక్రమాలతో పాటు ఆ యా కళారంగాలలో పరిశోధన చేయించి, గ్రంథాలు ప్రచురించే కార్యక్రమాన్ని కూడా ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ చేపట్టింది.

తెలుగునాట సంగీత, నృత్య, నాటక కళా వికాసాలను తెలియపరిచే స్వతంత్ర రచనలను ప్రచురించాలని, ప్రస్తుతం లభ్యంకాని శాస్త్రీయ గ్రంథాలను పునర్ముద్రించాలని, ప్రాచీన సంస్కృత గ్రంథాలను అనువదింపజేసి ప్రచురించాలని అకాడమీ సంకల్పించింది. ఈ కార్యక్రమం క్రింద 'సంగీత రత్నాకరం' మొదటి భాగాన్ని, 'నృత్తరత్నావళి' సంస్కృత మూలంతోసహా తెలుగు అనువాదాన్ని, కూచిపూడి నృత్య సాహిత్యానికి మకుటాయమానమైన 'భామాకలాపా' న్ని కర్ణాటక సంగీతానికి సర్వస్వంగా ప్రసిద్ధిచెందిన 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని' మొదటి సంపుటాన్ని, తెలుగు నాటక కర్తలు గురించిన గ్రంథాలను అకాడమీ ప్రచురించింది.

రసనాట్య తత్త్వముల వివరించు శారదాతనయవిరచిత 'భావప్రకాశనము' ను ఇప్పుడు తెలుగు పాఠకులకు అందజేస్తున్నాము. ఈ ప్రచురణము కళాకారులకు, కళాభిమానులకు కూడా ఉపయోగకరం కాగలదని మా విశ్వాసము.

# తొలిపలుకు

నృత్య, సంగీత, నాటకోత్సవాలను నిర్వహించటం, ఆ యా కళలలో శిక్షణాల యాలకు, సాంస్కృతిక సంస్థలకు, సహాయముచేయటం, మరుగునపడి పోతున్న మన సంప్రదాయ, జానపద కళారూపాల పునర్వికాసానికి కృషిచేయటం మున్నగు కార్యక్రమాలతో పాటు ఆ యా కళారంగాలలో పరిశోధన చేయించి, గ్రంథాలు ప్రచురించే కార్యక్రమాన్ని కూడా ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ చేపట్టింది.

తెలుగునాట సంగీత, నృత్య, నాటక కళా వికాసాలను తెలియపరిచే స్వతంత్ర రచనలను ప్రచురించాలని, ప్రస్తుతం లభ్యంకాని శాస్త్రీయ గ్రంథాలను పునర్ముద్రించాలని, ప్రాచీన సంస్కృత గ్రంథాలను అనువదింపజేసి ప్రచురించాలని అకాడమీ సంకల్పించింది. ఈ కార్యక్రమం క్రింద 'సంగీత రత్నాకరం' మొదటి భాగాన్ని, 'నృత్తరత్నావళి' సంస్కృత మూలంతోసహా తెలుగు అనువాదాన్ని, కూచిపూడి నృత్య సాహిత్యానికి మకుటాయమానమైన 'భామాకలాపా'న్ని కర్ణాటక సంగీతానికి సర్వస్వంగా ప్రసిద్ధికెక్కిన 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని' మొదటి సంపుటాన్ని, తెలుగు నాటక కర్తలు గురించిన గ్రంథాలను అకాడమీ ప్రచురించింది.

రసనాట్య తత్త్వముల వివరించు శారదాతనయవిరచిత 'భావప్రకాశనము' ను ఇప్పుడు తెలుగు పాఠకులకు అందజేస్తున్నాము. ఈ ప్రచురణము కళాకారులకు, కళాభిమానులకు కూడా ఉపయోగకరం కాగలదని మా విశ్వాసము.

శారదాతనయుని భావప్రకాశనమును భావలోచనముతో ప్రచురణార్థం అకాడమీకి అందజేసిన శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారికి, దీనిని నిర్దుష్టముగా ముద్రించుటలో సహాయపడిన డాక్టర్ పోణంగి శ్రీరామ అప్పారావు గారికి కృతజ్ఞతలు తెలియపరుస్తున్నాము.

కె. ఆర్. పరమహంస
స్పెషల్ ఆఫీసర్
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ

మహామహోపాధ్యాయ, దర్శనాచార్య, బిరుదాంకితులైన శ్రీ జమ్ములమడక మాధవ రామశర్మగారు రచించిన గ్రంథములు: 1. నవరస గంగాధరము 2. ఆంధ్ర ప్రతాపరుద్రము 3. ధ్వనిసారము 4. కావ్యప్రకాశము 5. అలంకార సూత్రము 6. నాట్యవేదము 1, 2, 7. ఔచిత్యవిచారచర్చ 8. శృంగార ప్రకాశము 9. రసభారతి నాటకమీమాంస 10. లక్షణాలంకారము 11. నృత్తరత్నావళి 1, 2 12. భావప్రకాశనము 13. వక్రోక్తి జీవితము 14. ఏకావలి 15. నటసూత్రమ్ 16. సహృదయాలోకలోచనమ్ 17. వక్రోక్తిసారము 18. వ్యక్తివివేకసారము

# విషయసూచిక

## పూర్వరంగము



## భావప్రకాశనము

# భావనివేదనము

## 1. అనువాదము

శ్రీశారదాతనయుడు కాశ్మీరదేశవాసి. భోజశృంగారప్రకాశమును, మమ్మట కావ్యప్రకాశమును సందర్భసముచితముగ ననుసరించి యీ భావప్రకాశనమును-భావ ప్రకాశికను-భావప్రకాశమును నిర్మించెను. ఈ భావప్రకాశనము నర్వాచీను లనేకులా మోదించి గ్రహించిరి. కావున A. D. 1175-1250 సమయమున శారదాతయుడు తన భావప్రకాశనము నావిష్కరించి యుండును. విశిష్టవిషయములను తానె స్పష్ట మొనరించెను. అది విశద మగును. విజయనగరమహారాజ సంస్కృత కళాశాలలో నేను విద్యా వ్యాసంగ మొనరించునపుడు భావప్రకాశనము కలదని వింటిని. తెనాలి సంస్కృతకలా శాలాధ్యాపకుడుగా నున్న సమయమున భావప్రకాశనము నందుకొంటిని. ఏమో సంకల్పిం చితిని. నలుబది సంవత్సరము లటు నిటు దీని నవధరించి యిట్లు సుహృత్సంవాసమున సహకారమున సుప్రకాశ మొనరింపగలిగితిని. ఇది యింతటి స్వరూపసౌందర్యము కలదగు టలో సంగీతనాటక అకాడమి సర్వహేతువు. నాటి అకాడమి అధ్యక్షులు శ్రీ పసల సూర్యచంద్రరావు ప్రముఖులు నా గ్రంథవిషయమున సుముఖులు. ఇది అకాడమిప్రకాశ నముగా వెలయుట నన్ను నిత్యము స్పందింప జేయును. ఇట్టి స్వస్పందసౌందర్య మందరకు గలదు, నాకను గలదు. కేంద్రసంగీతనాటకఅకాడమి, ఆంధ్రప్రదేశ సంగీతనాటక అకాడమి నా గ్రంథముల నాదరించినవి. యథాపూర్వము సహృదయలోక మాదరము చూపును. నేను నా కర్తవ్యమున సమాదరము వహింతును. శ్రీయదుగిరి యతిరాజ స్వామి పాదులు, శ్రీ K. S. రామస్వామిశాస్త్రిశిరోమణులు సూచించిన భావములను నేను సంగ్రహముగా సవినయముగా స్వీకరించితిని.

ఈ గ్రంథము సర్వగ్రంథసూత్రాత్మకము. నాట్యవేదము ఆరంభముగా తన నాటివరకు వెలసిన ఉపజీవ్య గ్రంథముల స్వరూపపరిస్పందములు వీనిలో కలవు. సుజ్ఞా తములైన నాట్యవేదము, అభినవభారతి, శృంగారప్రకాశము, కావ్యప్రకాశము, ధ్వన్యాలోకము, అభినవలోచనము, రుద్రటకావ్యాలంకారము, దండి కావ్యాదర్శము, భామహ కావ్యాలంకారము మొదలగు ప్రాక్తనగ్రంథములలోని అపేక్షితభావములు సూత్రభాషలో నిందున్నవి. ఈ పరిమితార్థప్రతిపాదనమునకు తదాకరగ్రంథములలోని భావములను కొంతకొంతగా వివరించితిని. ఇంతకు పూర్వము రచించి ప్రకటించిన నాట్య వేదాది గ్రంథములలోని వాక్యములను. భావములను నిరూపించితిని. ఆ సర్వనిరూపణ

మున క్లిష్టపడినపుడు తత్తన్నామోల్లేఖ మొనరించితిని. సమానార్థములిం దుల్లిఖితములైనపుడు సంవాదివిసంవాది భావసమీక్షకు నేను నేనై యత్నింపలేను. నారచనములలో సంవాది విషయము లున్నవి. విసంవాదము గోచరింపవచ్చును. ఏకనిశ్చయవివేకమునకు సర్వేక్షణ మపేక్షితము. ఆ ఏకనిశ్చయమును నేనే యేల వ్రాయ నుంటిని? పాఠకప్రభువుల యధికారమును నేన యందుకొనుట నాధర్మము కాదు. ఒక్కొక్క విషయమున ఒక్కొక్కగ్రంథమంత వ్రాసి విషయగ్రహణ మతుల మతి శ్రద్ధామాంద్యముల నేను హేతువు కాజాలను.

దీనిని వ్రాయుటలో పూర్వరచితములయిన నాగ్రంథముల విషయములు, అందలి పంక్తులు పంక్తులు నాకంటికి కనబడుచున్న నా నానా గ్రంథములు సహాయోగ మిచ్చినవి. ఎవరినేని అడుగ తలచినప్పుడు నేను ఎవరినడుగుదును? మా రాయడు లేడు. సంగీతవిదుల నడుగుదునా? వారు సంగీతశాస్త్రవేత్తలవారయినను కవితాచుంబనము లేనివారుకదా? కవితాభావుకుల నడుగుదునా? వారలకు సంగీతశ్రుతుల లేకున్నను శ్రుతి పరిచితి యుండునా? కామశాస్త్రి ఈ మోక్షశాస్త్రమును గుర్తించునా? వేదాంతవాది సాహితీ సంవాది యగునా? ఎవరికి ప్రత్యభిజ్ఞాపరిచయ మున్నది? ఎందరు స్పందవాద ప్రస్పందితులు? అన్నియున్నను వారు శృంగారప్రకాశభోజు లగుదురా? అభినవగుప్త మహార్థమహామార్గము వారెరుగుదురా? ఇది కామశాస్త్రము, ఇది నాట్యశాస్త్రము, ఇది కావ్యశాస్త్రము, ఇది స్త్రీశాస్త్రము, ఇది పురుషదర్శనము, ఇది వ్యాకరణ నిరుక్తి, ఇది సంవిచ్ఛాస్త్రము, ఇది అభినవదర్శనము, ఇది అభినయదర్శనము. ఇది కావ్యాలోకము, ఇది కావ్యప్రకాశము, ఇది రూపకదర్శనము, ఇది సాహిత్యతంత్రము, ఇది సకల తంత్రము. మా రాయడు వలె నాకభిగమ్యులెందరు గలరు? నారచన ననక, నన్నె యనువారి నెట్లు చేరగలను? నేనిన్ని తెలిసి యిది వ్రాసితినా? శారదాతనయునకు శారద యున్నది నాకును కలదని నా సంతుష్టి.

నానావిధ దేశీమార్గపీఠులలో భావప్రకాశనము ఉపన్యసించితిని. వినీవినిన తోడనే విస్ఫారితనేత్రహృదయుడగు శ్రీ సూర్యచంద్రసహృదయుడు ఏది యేది యని, ఎట్లెట్లు అని నన్నుచూచి దీనిని చూచెను. తనచూపు సహృదయచేతసుల చూపుకాదా? ఈ ప్రకాశమునకు ప్రకాశన మిచ్చుట కంగీకరించెను. నన్నుచూచి, భావప్రకాశనము చూచి భావాలోకము చూచెను. నాయీ రచన భావాలోక మయినది. గ్రంథమునందలి నాట్యసంగీత సంపత్తికి సంగీత నాటక సంస్థానసంవిత్సంపత్తికి, సచేతోలోకాలోకమునకు నేనేమేని వ్యక్తవివేకుడనై యొనరింపగలిగినచో అట్లునేను భావుకముఖమున గుర్తింపగలిగినచో నది సర్వము భావికృతులకు జీవితము కాగలదు. ఇంతటి జీవన ముజ్జీవనము శ్రీ శారదాతనయుడు పొందియుండును. ఇట్టి సంతుష్టి నాకంతరున్మేషము సంపాదింపగలదు.

## 2. భావప్రకాశనము

శ్రీశారదాతనయ విరచిత మయిన ఈ భావప్రకాశనము రస–నాట్యతత్త్వముల ప్రతిపాదించుట కత్యంతము సమర్థ మయిన విశిష్టగ్రంథము. భరతుని నాట్యవేదము అవతరించిన నాటినుండి యనేకులు రసనాట్యరంగమున అవతరించిరి. కోహలుడు మాతృగుప్తుడు హర్షుడు సుబంధువు మొదలగు వారీ విషయమున ననేకగ్రంథములను రచించి స్వరూపశోభ సంపాదించిరి. కాని వారి గ్రంథములు లభింప లేదు. వారి భావములు మాత్రమే కొన్ని యందుచున్నవి. ఈ భావప్రకాశనము కొన్ని లుప్తభావములను అభ్యూహములను సూచించు చున్నది ఇట్టిది భరతభావప్రకాశము అన్వాఖ్య భావప్రకాశనము నయినది. అనంతరకాలము వారు శారదాతనయ సూక్తులను బహుమానించిరి. శారదాతనయుడు నానావిధము లయిన రూపకములనుండి ఉపరూపకముల నుండియు ననేక లక్ష్యముల నుదాహరించినాడు. వీనిలో గొన్ని యెచట నున్నవో తెలియుటయే లేదు. భరతుడు మొదలు క్షేమేంద్రుని వరకు గల సాహిత్యాలోచకులను భావప్రకాశనము స్మరింప జేయుచున్నది. నాట్యములో సంగీతములో సాహిత్యములో ఉల్లసన సముల్లసనముల రీతి నీ గ్రంథము విశదము చేయుచున్నది నాటకమీమాంసకు సంబంధించిన శాస్త్రీయమగు తాత్త్విక విజ్ఞానము దీనిలో స్పష్టముగ నున్నది.

అర్వాచీనకాలము వారనేకులు భావప్రకాశన వచనములను ప్రమాణపదవిలో నిరూపించిరి. నానారూపకవ్యాఖ్యాతలు భావప్రకాశనమును చూచి తీరవలయునన్న భావము గలుగజేసిరి. ప్రాచీనాలంకారికులు కొందరు చూచి సరిచూచి తలయూచిరి. 1893 లో భావప్రకాశనము కొంత తెలిసినది. అటు నిటు కలవానిని చేర్చి కూర్చి ఇంతటి గ్రంథముగా బరోడా ముద్రించినది. 1929 నాటినుండి లోకమున నట నట నిది చేరినది. 1951 నుండి నేను సంస్కృతకళాశాలాధ్యాపకుడనై నియతవ్యాసంగ మొనరించునపుడు ఈ భావప్రకాశనము నా హృదయప్రకాశన మయినది. మా రాయడుశాస్త్రి వేటూరి ప్రభాకరశాస్త్రి మానవల్లి రామకృష్ణకవి నాకు భావదీక్ష నిచ్చినట్లు కాగా నేను శారదాతనయారాధన మొనరించితిని. తత్ర తత్ర సభలలో నేను పలుకు నపుడు పలుకు లన్నియు నావి యని లోక మనుకొనునట్లు శారదాతనయుడు నాకు సభాసంభావన మిచ్చినాడు.

## 3. శారదాతనయుడు

శారదాతనయుడు తన విశేషమును భావప్రకాశనమున స్పష్టముగనె సూచించినాడు. మనకిక చరితాలోచనశ్రమ మక్కరలేదు. శారదాతనయుడు బ్రాహ్మణుడు. కాశ్యపగోత్రుడు. ముప్పదియాగము లొనరించి విష్ణుప్రీతిపాత్రుడయిన "లక్ష్మణుడు" బహుశ్రుతుడు వేదములకు వేదభూషణ మను భాష్యము రచియించినవాడు ఈతని తాతకు

తండ్రి. తండ్రి తండ్రి యయిన కృష్ణుడును వేదశాస్త్రవిద్యాపారంగతుడు. కృష్ణుడు మహాదేవు నారాధించి భట్టగోపాలుని కనెను. భట్టగోపాలుడు శారదాతనయుని తండ్రి. ఈతడు అష్టాదశవిద్యాపారీణుడు. శారదాదేవ్యుపాసకుడు. శారదానుగ్రహమున గలిగిన తనయుడు శారదాతనయు డయినాడు. దివాకరుడు శారదాతనయుని గురువు. శారదాతనయుడు సర్వవిధముల శా ర దా త న యు డు. శారదీయ మను పేరిట సంగీతగ్రంథము వ్రాసినాడట; అది యెప్పుడు లభించునో? కావ్యప్రకాశగ్రంథమునకు వ్యాఖ్యానము వ్రాసినాడట; అది యెచ్చటనున్నదో? ఈ భావప్రకాశనమె యిప్పు డున్నది. ఈ తనయుని వంశము వారు హరిహరుల నారాధించు వారయినను కాశ్మీరికు లయినందున ప్రత్యభిజ్ఞాసంప్రదాయమున నభినివిష్టులు. తానభినవగుప్తానుయాయి నని తన యుడు చెప్పికొనెను. షట్త్రింశత్తత్త్వముల నభిమానించెను. రాగ విద్యా కలాభిమాని యయ్యెను. శివాగమభావముల నిరూపించెను. ఆర్యావర్తమున మేరూత్తరజనపదమున మాఠరపూజ్యగ్రామమున నీతడుండెనని యీ గ్రంథము నందె కలదు. ఈ స్థలసంకేతము నేటి సంకేతము నభిమానించు వారి భావానుసారమున సంచార మొనరింప వలసిన దగు చున్నది.

సదాశివ వ్యాసనారదాది రస-నాట్య సమాలోచకుల భావసారములను శారదా తనయుడు నిరూపించెను భరతుని నాట్యవేదప్రణాళికను తా ననుసరించెను. భరత విసంవాదులభావములను నిరూపించెను. ఆరంభముననె భావములను ప్రతిపాదించి యవి రసాస్వాదమునకు సహకరించు రీతిని నిరూపించెను. భరతుని ముందుగా రసములనె యుల్లేఖించి పిమ్మట భావముల ప్రతిపాదించెను. దశవిధరూపకములను జెప్పి యవి రస భావాస్వాదమునకు సహకరించు విధానమును సూచించెను నటుని చతుర్విధాభినయము లచే నవి సుప్రకాశము లగుటను భరతుడు ప్రతిపాదించెను. శారదాతనయుడు ఇరువది ఉపరూపకములు నుపయోగించుటను నిరూపించెను. ధనిక భోజాభినవగుప్తుల ప్రామాణ్య మును ప్రదర్శించెను. ఉపరూపకముల స్వరూపనిర్వచనముల నిరూపించి యందలి లక్ష్యముల నిరూపించి, నాట్యోపయోగిగీతార్థము నిరూపించి తన వ్యాసంగవిశిష్టతను విశద మొనరించెను.

సారస్వతమీమాంసలో రససిద్ధాంతవిషయమున భావభేదములు గలవు. భరత సంవాదుల భావములను విసంవాదుల భావములను తనయుడు ప్రతిపాదించెను. భట్టాభినవ గుప్తార్యపాదచ్ఛాయలో తాను సంచరించెను. రసము కావ్యాత్మ యని సంభావించెను. రీతి గుణాలంకారములు కావ్యశోభాధాయకము లగుటను నిరూపించెను. అభినవగుప్తు నంతట ననుసరించు వాడయినను కొన్నిట విసంవాదము చూపెను. అభినవగుప్తభావమున రసము వ్యంగ్యమె; వాచ్యము కాదు. ఈ విషయమున తనయుడు దశరూపకభావము నాశ్రయించెను. దశరూపకభావమున "రసము కావ్యాత్మ యగును; అది కావ్యమున ప్రతి పాద్యము నగును. దానికై వ్యంజన యావశ్యకము కాదు. రసము తాత్పర్యశక్తిచే

భాసించును. వ్యంజనయు తాత్పర్యాధీనము. తాత్పర్యమునకు గల ప్రాధాన్యము ధ్వనికి లేదు." అని భావింపవచ్చును. లోల్లట శంకుక భట్టనాయకాభినవగుప్తులు రసవాద మూర్ధన్యులు: అర్వాచీను లందరు అభినవగుప్తునె రసవాదమున ననుసరించిరి. శారదాతనయుడు భట్టనాయక రసవాదము నభిమానించెనా? ధనిక దశరూపకావలోకము ననుసరించెనా? అనిపించును. కావ్యరసముల సంబంధము భావ్యభావకభావసంబంధమె కాని వ్యంగ్యవ్యంజకభావసంబంధము కాదని భట్టనాయకభావమున నిశ్చిత మగును. అభిధాలక్షణాతాత్పర్యములు కావ్యార్థ మాస్వాదించుటకు సహకారులు. సహృదయులు భావనావ్యాప్తిద్వారమున రసభోగ మనుభవింతురు. రసభోగము బ్రహ్మానందసదృశము. కావ్య-రసములకు నిట్టి భావ్యభావకభావసంబంధము కలదు. కావ్యము నందలి విభావాదులు రసభావకము లగును. ఇట్లు తలచు భట్టనాయకుడు శారదాతనయున కనుసరణీయు డయినట్లనిపించును.

శాంతము రసమని సిద్ధరసమని అభినవగుప్తసిద్ధాంతము. శాంతరసస్వరూపవివేచనమున శారదాతనయుడు శాంతము నాట్యరస మనుటలో విప్రతిపన్నుడుగా గోచరించును. శాంతమును రసమగుననుట నుద్భటుడె మొదటగాననెనట. అభినవుడు శాంతము సర్వరసపర్యవసానభూమి యనెను. శాంతము నుండియె యితరరసము లావిర్భవించు నని శాంతము నందె యవి పర్యవసించునని అభినవభావము. రుద్రటుడు శాంతము నంగీకరించి ప్రేయోరసమును గూడ జెప్పెను. వ్యభిచారిభావములు కాని సాత్త్వికభావములు గాని శృంగారకరుణాదుల వలె పరిపోషము పొందునవి యగునేని రసములె యగునెను. శారదాతనయుడు ధనంజయభావము ననుసరించి యీ వాదముల గాదనెను. శాంతము నాట్యరసము కాజాలదనెను. శాంతస్థాయి యగు శమమునకు విభావాదులు సంభవింపవనెను. అభినేయము కాజాలదనెను. కాని కావ్యములలో శాంతమునకు స్థితి కలదనెను భరతుని యనంతర ముదయించిన సాహిత్యవాదముల నన్నింటిని సమీకరించి నిరూపించి పరిశీలించి శారదాతనయుడు పరిష్కరించుట యిందు గోచరించును. భోజుడు శృంగారప్రకాశములో నిరూపించిన విధమున శృంగారరసతత్త్వమును వెలయించిన విధమున శారదాతనయుడు రససంవేదనమును నివేదించుట యిందు గోచరించును. ఈ విషయ మింకను వివేచితము కాగలదు.

ఈ శారదాతనయ రచన లలితనిబంధము. మిత్రసమ్మితము. అర్థప్రవణము. ఛందోయోజనమునగాని వ్యాకరణవిశేషమున గాని ఆలంకారికవిధానమునగాని యిందంతగా శ్రద్ధావిశేషమును తనయుడు ప్రదర్శింపలేదు. కతిపయస్థలములందు వ్యత్యస్తము లుండవచ్చునని తనయుడే తలచెను. నాట్యరసవిషయమున నితరుల భావవ్యూహసమాకలనమె యిందు ముఖ్యమయినది. నాట్యశాస్త్ర దశరూపక కావ్యప్రకాశ శృంగారప్రకాశములలోని విశిష్టవిషయముల ననామసంకేతముననె శారదాతనయు డనేకస్థలములందు నిబంధించెను. ఇంక నేవోకొన్ని యనదగినవి కలవు కాని యవి ప్రతిపాద్యప్రతిబోధకములు కావు. ఇంతటి గ్రంథమున నట్టివానిని గట్టిగా పట్టరాదు.

# 4. రససంప్రదాయము

సాహిత్య ప్రస్థానమున సర్వసంప్రదాయములలో రససంప్రదాయము ప్రధానము సర్వమూలము. రసము సాహిత్యాత్మ. గుణరీత్యలంకారములు రసాంగములు. భరతనాట్యవేదమున రసమునకు సంబంధించిన సంపూర్ణనిరూపణము కలదు. భరతుని తరువాతి వారు కొందరు రసవాదమునె ప్రధానమని భావింప లేదు. శారదాతనయుడు తననాట తాను గుర్తించిన వానిని తన గ్రంథమున నిబంధించెను. భరతానంతరము రస విషయమున గలిగిన విశేషములను చేర్పులను మార్పులను కూర్చెను. రసాస్వాదమునకు వలయు సర్వవిశేషములను సాక్షాత్కరింప జేయుటకు శారదాతనయుడు సఫలయత్న మొనరించెను. భారతీయవాఙ్మయములో రసపద మనేకార్థము లందు ప్రయుక్తమయినది. "రసో వై సః" శ్రుతి పరబ్రహ్మ నిరూపకముగా నున్నది. దీనిని సాహిత్యరసపరముగ పండితరాయలు పరిభాషించెను. వాల్మీకి శోకము శ్లోక మయినది. వాల్మీకి శోకము శోకము కాదు. అది కరుణరసస్థాయిభావము. రససంప్రదాయమునకు వాల్మీకి నాన్న యయినాడని ఆనందవర్ధనుడు భావించెను వాల్మీకి భరతుల మధ్యకాలమున రస వికసన మెట్లున్నదో తెలియరాదు. భరతునకు పరిపక్వరసఫలమె లభించినది. వాల్మీకి రసదృష్టిని రూపకరచయితలును అందుకొనిరి. నటులకు నాటకరచయితలు నటసూత్రము రచించిన వారిని పాణినియు ప్రస్తుతించెను. నటామ్నాయము వచ్చినది. నాట్యసంగ్రహము వెలసినది. "రసానేవ తావదాదౌ వ్యాఖ్యాస్యామః. నహి రసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే" –ఇది భరతుని రససూత్రము. రసమె నాట్యము. నాట్యమె రసము. భామహాదులీ రస ప్రాధాన్యము నంగీకరింపలేదు. కోహలాదుల భావములు భామహాదుల భావములకు మూలములు కావచ్చును కాని యా మూలములు లభింపలేదు. భామహుడు మేధావి ప్రభృతులను స్మరించెను వారును లేరు. వారి వారి భావబలముతో రససంప్రదాయాతిరిక్తముగా అలంకారసంప్రదాయమును భామహుడు నెలకొలిపి పట్టుదలతో రసము నలంకారములలో జేర్చెను. దండి రసముల నామోదించెను. ఉదాహరించెను కాని గుణముల కాత్మరూప మిచ్చెను. రస విషయమున భామహు నంతటి ప్రతిపక్షవాదుడు కాలేదు. వామనుడు రీతివాది – "రీతిరాత్మా కావ్యస్య." భామహుడు దండి నిరూపించిన గుణాలంకారములను గుర్తించెను. గుణముల కింకను ప్రాధాన్య మిచ్చెను. రసమును కాంతిగుణములో జేర్చెను. "సందర్భేషు దశరూపకం శ్రేయః" అని సూత్రించి రూపకములందు రసోల్లాస మామోదించుచున్నాననెను. ఉద్భటుని సమయమున రసమునకు సముల్లసము కలిగినది. కాని రసము కావ్యాత్మ కాలేదు. ఉద్భటుడును నాట్యవేదమున వ్యాఖ్యానము రచించెనట. "వ్యాఖ్యాతారో భారతీయే లోల్లటోద్భట శంకుకాః". ఉద్భటుని కావ్యాలంకారసార సంగ్రహమున రసాలంకారములకు దండిభామహు లిచ్చిన సమాదరమె యున్నది. భావములపై ఆదరభావ మొకింతచూపెను. రీత్యలంకారసంప్ర

దాయసమాదరముతో రససంప్రదాయసమాదరమును గూడ ఉద్భటుడు ప్రదర్శించుట భావనీయము.

వాల్మీకి భరతసమారంభ మయిన రససంప్రదాయము నాట్యగోష్ఠిలోననె యున్నట్లు సంభావిత మయినది. గుణాలంకారరీతివాదములు పడగలు విప్పినవి. పలనో యొక యున్మేషము రాగా రీతిగుణాలంకారములకు వలె రసమునకు కావ్యపీఠప్రతిష్ఠ కలిగినది. రుద్రటుడు కావ్యాలంకారములో సంగతి ప్రదర్శించెను. కవి రసనిబంధనైకతా సహృదయుడు కాదగుననెను. శాంతరసమును ప్రేయోరసమును జెప్పెను. ఎన్నియేని రసము లుండదగుననెను. అంతట రసప్రసరము భావించెను. ముక్తకమునను రస ప్రకాశము చూపెను.

"కావ్యస్యాత్మా ధ్వనిః" అని వ్యవస్థాపన మొనరించిన ఆనందవర్ధనుడు సర్వముఖ్యమయిన రసధ్వని కన్నియు సంగము లగుటను సర్వసమన్వయము చూపి సహృదయాలోక మిచ్చెను. వైయాకరణుల స్ఫోటవాద మాధారముగా ధ్వనివాదము నున్మిషింపజేసి వ్యంజనాస్థాపన మొనరించెను. అభిధాలక్షణల కన్న వ్యంజన భిన్నమని సిద్ధాంతము చేసెను. గుణాలంకారాదులపై రసాధిపత్యము స్థాపించెను. అవి యన్నియు రసమును పోషించునని కావలయు ననెను. భరతుని రసము వేని ఆనందుని రసము వేరని యను వారి నేమనవలెను? ప్రతీహారేందురాజు భట్టనాయకుడు ధనంజయుడు ధ్వనినిరాసమునకె యత్నించిరి. భామహోద్భటవాదములకు మాటనిచ్చి ప్రతీహారేందురాజు వస్త్వలంకారరసధ్వనులను అలంకారోదరముననె చూచెను. భట్టనాయకుడు ధ్వనివాద మంగీకరింపడు. రసమాత్మ యనును. భరతుని భావవిభావాదుల నిర్వచనముల భావించి, భావకత్వభోజకత్వవ్యాపారముల నంగీకరించి రసమునె కావ్యాత్మరూపమున భోజ్యము చేసెను. సత్త్వోద్రేక ప్రకాశానందమయ మయిన తన "హృదయదర్పణమున" రస మట్లవభాసించి యుండును. ధనికధనంజయులు ధ్వనివాద మొల్లని యన్నదమ్ములు. కాని రసవాదసంవాదము కలవారు ధనికుడు రసకావ్యములకు వ్యంగ్యవ్యంజక భావము తగదని భావ్యభావకభావమె తగునని భట్టనాయకుని వలె భావించెను. ఇట్టిట్టి వారు ధ్వనిధ్వంసమునకు యత్నించిరి. రసము రస్యమని భావించిరి. ఇట్టి సమయమున శ్రీమదభినవగుప్తు డవతరించెను. అభినవుడు ధ్వన్యనుయాయి. రససిద్ధాంతప్రవక్త. ధ్వనివాదాక్షేపముల నాక్షేపించెను. ఆనందవర్ధనసిద్ధాంత మప్రతిక్షేప్యము చేసెను. అర్వాచీనాలంకారికు లందరు ధ్వనివాద మంగీకరించిరి. అభినవుని లోచనము అభినవభారతి అందర కారాధ్యమయినవి. కుంతకుని వక్రోక్తి మహిముని అనుమితి ధ్వనినిరాసమునకు యత్నించినవి. కాని రసాత్మతావిషయమున వీరలకు వైమత్యము లేదు.

శ్రీధారాప్రభువు భోజరాజు శృంగారప్రకాశములో శృంగార మొక్కటియె రసమని యనెను. ఇతరములు మిథ్యారసప్రవాదము లనెను. "శృంగారో హి నామ

......ఆత్మనః అహంకారవిశేషః స చేతసా రస్యమానో రస ఇత్యుచ్యతే యదస్తిత్వే రసికః, అన్యథాత్వే నీరస ఇతి''. ఈ అహంకారమే సర్వభావములకు మూలమనెను. విభావాదిసంయోగమున స్థాయి రసమగుట నాక్షేపించెను. భావములు స్థాయి సాత్త్విక వ్యభిచారి భేదమున మూడు విధము లనుట నంగీకరింపలేదు. నాల్గురసములు నాల్గురసములకు హేతువు లగుననుట నాదరింపలేదు. ''స శృంగారః సోఽభిమానః స రసః తత ఏతే రత్యాదయో జాయంతే" అనెను. భోజవాదమును నేను నా శృంగారప్రకాశమున వివరించితిని. శారదాతనయుడు రసమీమాంసలో భోజవాదము నందు కొనెను. కాశ్మీరకు లయిన ఆనందాభినవు లితరులను కాదనిరని భోజభూపతి కాశ్మీరకుల నేమో యనెను శారదాతనయు డుభయానుసంధానమునకు యత్నించెనా? అనిపించును భోజానంతరము క్షేమేంద్రుడు ఔచిత్యవిచారచర్చలో సర్వసాహితీసామగ్రీసంగ్రహమును ఔచిత్యమునకు సంబంధింపజేసి ఔచిత్యమును కావ్యజీవితముగ పరిగణించెను. గుణాలంకార ప్రసాదు లన్నియు "ఔచిత్యమనుభావంతి" అనెను. ఆనందవర్ధనుడె ఔచిత్యమును మొదట గుర్తించి యది "రసోపనిషత్తు" అని సూచించెను. ఆనందవర్ధనానుయాయి యయిన క్షేమేంద్రుడు శాంతరసము నామోదించెను.

ఇన్ని విధముల సాహిత్యసంప్రదాయములున్నను రససంప్రదాయమె యన్నిట ననుగతముగా వ్యాపించినది. సర్వవాదముల సమన్వయించుకొని మమ్మటుడు కావ్యప్రకాశమును ప్రకాశింపజేయగా ననంతరకాలము నందలి యాలంకారికులకు జెప్పవలయునది మిగులలేదు. మమ్మటానుయాయిగా శారదాతనయుడు ప్రతిపాద్యము ప్రతిపాదించి రస విషయమున భరత కోహల ఆనందవర్ధన భట్టనాయక ధనంజయ అభినవ భోజులను తన భావప్రకాశములో గోచరించునట్లు చేసెను ఇట్టి భావప్రకాశన మీ పట్టున సముపాదేయ గ్రంథ మయినది.

శారదాతనయుడు తన గ్రంథమునకు భా వ ప్ర కా శ న మను పేరు పెట్టుట సముచితముగా నున్నది. భారతీయు లే విషయము నేని దివ్యసంబంధముతో నున్నట్లు భావింతురు. ఈ గ్రంథము నాట్యవేదముతో సంబంధించి యున్నది. బ్రహ్మ భరతునకు నాట్యవేద ముపదేశించెను. అది మొదట ద్వాదశసాహస్రి. నేడు షట్సాహస్రిగా నున్నది. నేటి గ్రంథములో ప్రాక్తన భావములుగా సూచితములు కొన్ని కలవు. భరతానుయాయులు నేటి నాట్యవేదమునకు సంకలన కర్త లని కొందరందురు. అభినవు డట్లనడు. శారదాతనయుడు సదాశివసంప్రదాయమును బ్రహ్మసంప్రదాయమును గుర్తించి భావప్రకాశనము రచించినట్లు మొదట నిరూపించెను. కోహల మాతృగుప్త సుబంధు ద్రౌహిణి హర్షుల కృతులు తనయునకు పరిచితములై యుండును. వానిని తాను స్మరించి యనుసరించెను. భరతానుయాయులను ధనంజయాదులను తానభిమానించెను. ఈ గ్రంథము నాలుగు ముఖ్యవిభాగములతో నున్నది. పది యధికారములతో నున్నది. ఇట్టి విభాగము యుక్తి సంగతము. రసాభియోగమునకు వలసిన విశేషము లన్నియు

నిందు శాస్త్రీయముగా నిదర్శితము లయినవి. రూపకోపరూపకముల స్వరూపవివేచన మొనరించి శారదాతనయుడు భావకాభిముఖ్యము సంపాదించెను. భావరసములు పరస్పరసంబద్ధములు. వాని నిరూపణ మయిపర్ధి రసములకు పైగా నిందున్నది. భావములు రససముల్లాసమునకు సమర్థములు. ఆ భావముల భావవిభాగములను భరతునకు నిర్దేశించి రమ్యముగ వాని నిరుక్తిని నిరూపించెను. ఉద్దీపనవిభావములను నిర్దేశించి అనుభావముల చాతుర్విధ్యము ప్రతిపాదించెను నాయక నాయికావిశేషముల నిర్దేశించుటలో సరస్వతీకంఠాభరణము దశరూపకము శృంగారప్రకాశము భావప్రకాశనమున కాధారము లయినవి. రుద్రటుని కావ్యాలంకారములో రుద్రభట్టు శృంగారతిలకములో నిరూపితము లయిన వ్యభిచారిభావముల స్వరూపతత్త్వములను విశద మొనరించెను. భావముల నిరుక్తి యిందు సవిశేషముగా భావనీయము ఇట్టి నిరుక్తి నితరాలంకారికులు నిర్దేశింపలేదు.

రసతత్త్వవివేచనమున శారదాతనయుడు భరతభాషాభాషి యయినను వాసుకి మతమును జెప్పెను. భట్టలోల్లట భావమును జెప్పి రసాశ్రయము వివేచించి యోగమాలాసంహితాభావముల వివేచించెను. శృంగారప్రకాశమునందలి అహంకారాత్మక మయిన అభిమానవృత్తిని రసమూలతత్త్వముగ నిశ్చయించి నిర్దేశించెను. సాంఖ్యమతము వాకంగీకరించు ప్రకృతి వికారవాదములకు సంబంధించిన అహంకారము నభిమానము సత్త్వరజస్తమోగుణముల వివేచనముతో విశద మొనరించెను. పద్మభూమతమును; అనగా బ్రహ్మవాదమును సముల్లేఖించెను. శాంతరసమునకు ప్రయోగార్హతలేదని తగిన విభావాదులుండవని యనెను. రస మీమాంసలో నారద వాదమును గలదు. అది యోగమాలా సంహితకు కొంత సంబంధించి యున్నది. శాంతరసము నారదవాదమున గలదు శ్రీశంకుక రసవాదము సమీక్షించునపుడు చిత్రతురగన్యాయమున గలుగు చిత్తవృత్తులను జెప్పి అది కాదనుటలో సమ్యక్ జ్ఞానముండుట నిర్ధారించెను. శారదాతనయుడు భట్టనాయకుని రసవాదము నాదరించెను. భరతసూత్రాధారమున వెలువడిన లోల్లట శంకుక భట్టనాయకాభినవగుప్తుల భావములలో ఉత్పత్తి - అనుమతి - భుక్తి - వ్యక్తివిశేషములు కలవు ఇందు భట్టనాయకుని భుక్తివాదము రసానుభవమున పరబ్రహ్మానందమగుటను భావించెను శారదాతనయుని దృష్టిలో నిదియును గలదు. శివాది క్షితిపర్యంతము కల ముప్పదియారు తత్త్వములలో రాగ-విద్యా-కలా తత్త్వములు కలవు. రసానుభూతిలో జీవునకివి శివానుభూతి సంపాదింప గలవు. జీవుడు రాగవిద్యాకలాశ్రయమున విశ్వానుభూతిని సంపాదింప గలడు. విశ్వోత్తీర్ణ విశేషము నందుకొనగలడు. నానారసమగు లోకచరిత మంతయు త్రైగుణ్యోద్భవము. నాట్యమనునది త్రైలోక్యభావానుకీర్తనము. అణువగు జీవునకు నిత్యజీవితములో నివి యన్నియు సర్వదా అనుభూతములగును. ఇది సంసారానందమై సంవిత్సారమున భాసించునని శారదాతనయుడు స్వస్పందసంవాదము సూచించుటచే కాశ్మీరికుల స్పందసిద్ధాంతమును ప్రత్యభిజ్ఞావాదమును శైవాద్వైతమును శివాగమమున సంభావించి సమన్వయించెనని నిశ్చయింప వచ్చును.

## 5. శబ్దార్థసంబంధము

రసములు రసాంతరములకు హేతువులుగా నుండుటను వానిని పరస్పరాశ్రయకముగా వ్యాసనారదాదుల భావముల నిరూపించెను. భరతప్రణీతమును గోచరించు ప్రయోగకథలను తనయుడు సంక్షిప్తముగా నిర్దేశించెను. రసాస్వాదవిషయమును వాక్యార్థత కలదో వ్యంగ్యత కలదో మీమాంసించెను. శబ్దార్థములకు గల సంబంధముల నిమీక్షించునపుడు ద్వాదశవిధానములను శృంగారప్రకాశానుసారమున నిర్దేశించెను. భోజదేవుడు వీనిని తన గ్రంథములో విస్తరముగ వివేచన మొనరించెను. విశదముగ నుదాహరించెను. శారదాతనయుడు వాని నన్నిటిని సూత్రీకరించి నిరూపించెను. తాత్పర్యశక్తి ప్రభావములు ధ్వనిసంప్రదాయమున నెట్లు సంక్రాంతము లయినవో దీని ననుసరించి తెలియవచ్చును. ఈ ద్వాదశలక్షణ నిరూపణమున నేను శృంగారప్రకాశమును అనుసరించుట యిందు స్పష్ట మగును.

అప్రస్తుతము కాని యొక విషయము నిచట సంభావింపవలసి యున్నది. భోజుడు శృంగారప్రకాశములో నిట్లుపపాదించెను—

శబ్దార్థముల సాహిత్యము కావ్యము కాగా, శబ్దము ద్వాదశవిధము, అర్థము ద్వాదశవిధము, శబ్దార్థముల సంబంధరూపమయిన సాహిత్యము ద్వాదశవిధము. సాహిత్య ద్వాదశి యిట్లున్నది—

అభిధ వివక్ష తాత్పర్యము ప్రవిభాగము వ్యపేక్ష సామర్థ్యము అన్వయము ఏకార్థీభావము దోషహానము గుణోపాదానము అలంకారయోగము రసావియోగము నని.

వీనిలో వృత్తి అభిధాలక్షణాగౌణీరూపము, వివక్ష కాక్వాది ప్రకరణాది అభినయాది వ్యంగ్యమని త్రివిధము. ఇందు కాక్వాదివ్యంగ్యవివక్షలో నవాంతరభేదములు కలవు. మూడవది యయిన తాత్పర్యము అభిధేయ ప్రత్యాయ్య ధ్వనిరూపములు మూడు విధము లగును. ఇందు ధ్వనిరూపతాత్పర్యము శాబ్దమూర్థన్యమై అనునాద ప్రతిశబ్దరూప భేదమున చతుర్విధమయినది. తాత్పర్యము ధ్వని యిట్లున్నవి. వీనికి భేదము కలదని కొందరందురు. అభేదమునె కొందరాదరింతురు. శారదాతనయుడు సమన్వయమునకు సామరస్యము సామంజస్యము సంపాదించెను "ధ్వనితాత్పర్యయోర్భేదో బ్రాహ్మణబ్రహ్మచారివత్"–తాత్పర్యము బ్రాహ్మణుడు; ధ్వని బ్రహ్మచారి

ఇట్లు శబ్దార్థసంబంధవివేచనమున శబ్దమునకు షోఢావిభాగమును నిరూపించెను. వాచక లక్షక వ్యంజక గమక ప్రత్యాయక ద్యోతక శబ్దములు అభిధా లక్షణా వ్యంజనా గతి ప్రతీతి ద్యుతి వ్యాపారములు కలవై వాచ్య లక్ష్య వ్యంగ్య గమ్య ప్రత్యాయ్య ద్యోత్య రూపార్థములను నిరూపించునవి యగునని అభినవాదృతవిధానమును సూచించెను. వాచక లక్షక వ్యంజక విభాగము నిర్దేశించిన పిమ్మట భావ మాదరించెను. కావ్య

ప్రకాశగ్రంథములోని ఉల్లాసపంచకమును సూత్ర వృత్తి సహితముగా శారదాతనయుడు సర్వమః శ్లోకీకరించెను. ఇట్టివాని వివరణమున నేను నా కావ్యప్రకాశార్థము నిందు సంతరించితిని. వాచికాభినయ ప్రసక్తి వచ్చినప్పుడు శైవతంత్రనియమానుసారమున నిరూపణీయము నిరూపించెను. గీతి తత్త్వము వివేచించెను. తానభినవగుప్తానుయాయి యగుట స్పష్టము చేసెను. నాట్యనృత్యనృత్త వివేచనమున మార్గ దేశీపద్ధతులలో రూపక ముల ఉపరూపకముల స్వరూపముల వివరించుటలో రసోపయోగిచ్ఛందో వివేచనములో నుండవలయునవి యన్నియు నిందున్నవి. నాటకాదుల స్వరూపవివేకమునకు తత్తల్లక్ష్య రమ్యతా సమీక్షణమునకు భావప్రకాశనమున దృష్టిసారించినవారు జ్ఞానప్రకాశనము కల వారు కాగలరు.

## 6. దేశ విభాగము

తన నాటి కాలమున భారతవర్ష భావన మే విధమున నున్నదో శారదా తన యుడు నిరూపించెను. ఉత్తరభాగమున హిమప్రలయము వచ్చినది. అటుపై భారతము ద్విసహస్రయోజనములతో నున్నది. ఇరువదినాలుగు ప్రదేశము లున్నవి. పదునెని మిది భేదముల ప్రాదేశికభాషావ్యవహార మున్నది. సంస్కృత ప్రాకృత పైశాచి మాగధి శౌరసేని అపభ్రంశ భాషలు రూపకప్రయోగము లందు గలవు. శకార ఆభీర చండాల పులింద శబర హాలిక భైరవ వర్గముల పామరు లున్నారు. అప్పటి దేశనామములు—

పాండ్య—కేరల-చోల-సింధు-సింహల-పామర-కలింగ-యవన-మ్లేచ్ఛ-పారసీక -శక-గౌడ-లాట-విదర్భ-కామరూప-ఆంధ్ర-కోంకణ-కర్ణాటక - సుహ్మ - కాంభోజ- హూణ-కరూశ-గూర్జర-సౌరాష్ట్ర-మహారాష్ట్ర-హమ్మీర-అవంతి-అనూపజ-అంగ-వంగ -వంగాల-కాశీ-కోసల-మైథిల-కిరాత-వార్ధ్రిక-అరట్ట - కరు-పాంచాల-కేకయ-ఔడ్ర- మాగధ-సౌవీర-దాశార్ణ-మాగధ-నేపాల-జైన-బాహ్లీక-పల్లవ-క్రథకైశిక-శూరసేన- కాజాన-కారూశ-యవన- యదు-చక్ర- కురవ-పార్వతీయ- హైమన-కాశ్మీర- మరు- కెంకాణ-నగ్న-మంకణములు.

ఈ దేశములన్నియు నీ నాట నే యే నవనవనామములతో నున్నవో నాకు దెలి యుట శక్యము కాదు. ఈ అరువదినాలుగు రాష్ట్రములలో నీ పదునెనిమిది భాషలు వ్యవహారమున నున్నవట—ద్రమిడ-కన్నడ-ఆంధ్ర-హూణ- హమ్మీర-సింహల-పల్లవ- యవన-జైన-పార్వతీయ-పామర-కశ-వార్ధ్రిక-కాంభోజ-శక-నగ్న-వాకట - కోంకణ ములు. ఈ నాడివి యే భాషలపేరులతో నున్నవో నన్ను వేను ప్రశ్నించుకొని యూర కుందును.

# భావప్రకాశన సారము

శ్రీ శారదాతనయుడు నాట్యశాలాపతి శ్రీదివాకరద్విజుని సమీపమున నాట్యవేద మధ్యయనించెను. దివాకరుడు సదాశివాదుల నాట్యసంప్రదాయములను తనయున కుపదేశించెను. శారదాతనయుడు భావప్రకాశనమును రచించెను. దీనిలో పది యధికారములు గలవు – 1. భావనిర్ణయము 2 రసస్వరూపాశ్రయవృత్తి నిర్ణయము. 3 రసభేదశబ్దప్రకార నిర్ణయము. 4 శృంగారాలంబన నాయకనాయికాదిస్వరూపనిర్ణయము. 5 నాయకనాయికాభేద తత్తదవస్థాదినిరూపణము. 6 శబ్దార్థసంబంధ తద్భేద ప్రకారనిర్ణయము. 7 నాట్యోత్పత్తి వృత్తశరీరలక్షణాభిధానము. 8 దశరూపకలక్షణము. 9 నృత్యభేదస్వరూప నిరూపణము 10. నాట్యప్రయోగభేదప్రకారవిశేషనిర్ణయము అనునవి యాయా యధికారములలో వివేచితము లయినవి. వీనికి సంబంధించిన యవాంతర విశేషములు నిందు గలవు.

## 1. భావనిర్ణయము

భవనము భూతి భావింపజేయునది భావమని భావసామాన్యలక్షణము. విభావానుభావస్థాయిభావవ్యభిచారిభావసాత్త్వికభావములుగా భావ మయిదు విధములు. శృంగారాదిరసములకు సంబంధించిన విభావము లీవిధముగ నుండును– 1. శృంగారమున లలితములు. 2. హాస్యమున లలితాభాసములు. 3. వీరమున స్థిరములు. 4. అద్భుతమున చిత్రములు. 5. రౌద్రమున ఖరములు. 6. కరుణమున రూక్షములు. 7. భయానకమున వికృతములు. 8. బీభత్సమున నిందితములు. ఆలంబనవిభావము లీ విధమున నుండును– 1. శృంగారమున మధురములు సుకుమారములు. 2. హాస్యమున కుహకములు వ్యంగ్యములు. 3. వీరమున శూరవిక్రమములు. 4. అద్భుతమున విచిత్రమాయలు. 5. రౌద్రమున క్రూరఉద్వృత్తములు. 6. కరుణమున కృశవిషణ్ణమలినములు. 7. బీభత్సమున నిందితములు. 8. భయానకమున గురురాజాపరాధులు. విభావములు స్థాయిపోషకములు. అనుభావములు మనో వాక్ కాయ బుద్ధిభేదమున నాల్గువిధములు. మానసములు పది. వాచికములు ద్వాదశ. కాయికములు పది. బుద్ధ్యారంభములు రీతి వృత్తి ప్రవృత్తులు.

సాత్త్వికభావము లెనిమిది వ్యభిచారులు ముప్పదిమూడు. స్త్రీలకు సత్త్వజన్యాలంకారములు ఇరువది. సత్త్వరజస్తమోగుణ పరిణామమున మనః ప్రాణ వాక్కులు కలుగును. సూర్యచంద్రాగ్నులు వాని యధిష్ఠానములు. యోగుల వ్యవస్థ యిట్లు సిద్ధము. భావ హావాదులు మానసములు. లీలావిలాసాదులు కాయికములు. శోభావిలాసాదులు పురుషుల అనుభావములు. స్థైర్యము గాంభీర్యము మానసములుగా, క్రీడితము కేలి కాయికములుగా కొందరిభావమున ప్రసిద్ధములు. ఆలాపాదులు వాగారంభములు. బుద్ధ్యారంభములలోని రీతి వైదర్భ పాంచాల లాట గౌడ సౌరాష్ట్ర ద్రావిడి భేదమున నున్నది. వృత్తి భారతీ సాత్త్వతీ కైశికీ ఆరభటీ భేదమున నున్నది. వృత్తులు రసాభినయములలో వ్యవస్థితములు.

1. శృంగారము—కైశికీవృత్తి—ఆహార్యాభినయము
2. రౌద్రబీభత్సములు-ఆరభటీవృత్తి-ఆంగికాభినయము
3. సర్వరసములు-భారతీవృత్తి-వాచికాభినయము
4. వీరరసము—సాత్త్వతీవృత్తి-సాత్త్వికాభినయము

ప్రవృత్తులు దేశభాషాక్రియాభేదమున నుండును. దేశభాష లేను విధములు. విభాషలు నేడు విధములు. కవి నటులు వీని గుర్తించి ప్రయోగింప దగును.

విభావానుభావములు హేతుకార్యరూపములు. రసోత్కర్ష హేతువులు. సాత్త్వికభావములు సత్త్వము వలన గలుగును. సత్త్వము బుద్ధిజ్ఞానానంద భేదమున నున్నది. స్తంభాదు లెనిమిది సాత్త్వికములు. నిర్వేదాదులు వ్యభిచారిభావములు. సాత్త్వికములు వ్యభిచారిభావములు పరస్పరము విభావానుభావము లగుట కలదు. మరికొన్ని వ్యభిచారి భావము లుండవచ్చును గాని యవి వీనియందే యంతర్భవించును. కవులు విభావాదులను ఆస్వాదమునకు అభినయచాతుర్యమునకు రసపరిపోషమునకు నిబంధింపవలెను. భావము లన్నియు స్థాయి భావానుసారమున వ్యవస్థితములై యుండవలెను. రసములకు వ్యభిచారిభావములకును సంబంధము కలదు. ఇవి సాగరమున తరంగములవలె నుండును. రసమును పోషించును. ఒకప్పుడు రతాత్మతను పొందుటయు గలదు. శమస్థాయికమగు శాంతరసము ఉండవచ్చునని కొందరు తలంతురు. శమమున ననుభావములుండవు. నాట్యమున నభినయముండదు. నిర్వేదాదులు స్థాయిత్వము పొందజాలవు. వాని పోషము వైరస్యహేతువగును. భావస్థితి యనుభవపరముగా నుండవలెను. కవివర్ణనాచాతుర్యమున

విభావ మనుభావ మగును; అనుభావము విభావమగును. రెండును వ్యభిచారులు కాగలవు. ఏకవిషయమున నివి యిట్లు మారవు. రసభేదవశమున పరస్పరోపకార్యోపకారిత యుండును.

## ౨. రసస్వరూపాశ్రయవృత్తి నిర్ణయము

సర్వభావములకు సముచిత మయిన నిర్వాహము నిరుక్తి కలదు. భావేతరములుగా నుండునవియు కొన్ని భావ్యమానములుగా నున్నందున నిరుక్తము లయినవి. సాత్త్వికవ్యభిచారిభావముల నిర్వాహములు నిరుక్తులు యోగార్థానుసారమున రూఢ్యర్థానుసారమున నిరూపితము లయినవి. భావముల కన్నిటికి ఉపకార్యోపకారకభావమున్నది. నియమముగా రససంబంధము కలదు. రసోదయమున నివి యన్యోన్యసామర్థ్యము ప్రదర్శింప గలవు. స్థాయిభావములు రసోపాదనములు. మనోనుకూలార్థములందు సుఖసంవేదనాత్మక మయిన యిచ్ఛ రతి యగును. రతి యని ప్రీతి యని యిది ద్వివిధము. రతిప్రీతులు సాధారణభేదము సప్తవిధముల నున్నది. ఇట్లే యితరములు భావనీయములు. విభావాదులచే ఆంగికాదులచే సముల్లసితమయిన స్థాయి రసమగు చున్నది. విభావానుభావవ్యభిచారిసంయోగాత్ రసనిష్పత్తిః - ఈ భరతసూత్రము ననేకవిధముల వ్యాఖ్యానించిరి. వ్యంజనౌషధిసంయోగమున నన్నము స్వాదువగుట యిందు నిదర్శనము. భావముల వలన రసములు సంభవించుటను వాసుకి భావించెను. రసము ద్రవ్యాదిషట్పదార్థరూపము కాదు. పదార్థాంతరమును గాదు. బాహ్యార్థాలంబనాత్మక మయిన మానసవికారము విభావాదిపరిపుష్టమై రస మగును. షట్పదార్థములు రసానుభవాత్మకములు.

భరతమతానుసారమున విభావాదుల స్వరూపమును గుర్తింప దగును. కావ్యార్థమును భావింప జేయునది భావమగును. కవి భావమును భావింపజేయునదియును భావ మగును. విభావము వాగంగసత్త్వాభినయము భావింపజేయును. అనుభావము అభినీతార్థమును అనుభవింపజేయును. వ్యభిచారు లావిర్భావతిరోభావములు కలవయి రసమున సంచరించును. సాత్త్వికభావములు సత్త్వము వలన గలుగును. ఈ భావములు రసము నుత్కర్షింపజేయును. రస మొక్కటియే యయినను చిత్తవృత్తిభేదమున నానావిధముగ నుండును. శృంగారమె ప్రధానముగా నాస్వాద్యమగును. మనసునకు హ్లాద మొదవించు స్వాదము రసము. శృంగారమునకె రసవ్యవహారము యుక్తము. సామాజికుల కాస్వాద్యమానములన్నియు

రసము లగును. ఒక్కొక్కసమయమున నొక్కొక్కటి యాస్వాద్యము కాగా నట్టివన్నియు రసము లగును. ఇట్లు శృంగారాదులుకూడ రసపదవ్యవహార్యము లగునని కొందరాచార్యులు (భోజుడు) వ్యవస్థను సంపాదించుచున్నారు. కొందరు రసములు వ్యంగ్యము లందురు. కొందరు వాచ్యము లందురు. ప్రత్యాయ్యము లందురు. గమ్యము లందురు. అవాంతరవాక్యార్థము లందురు. కొందరు మహావాక్యార్థము లందురు. ఒక్కొకచో నట్లు భాసించుటచే విభావాదులు సంగతములుకావచ్చును. నిరూపితము లయిన భావములచే భావితులు వాసితులు నయిన సహృదయులు రసాశ్రయులుగా నున్నారు.

రసతత్త్వప్రకాశమునకు అహంకారస్వరూపమును సంవిద్రూపమును నిశ్చయింపవలెను. సంవిత్ అనునది ప్రకాశానందాత్మకము. ప్రకాశించునది చెప్ప దగినది ఆత్మ. సంవిదనుభూతి బాహ్యార్థములతో అహంకారాత్మకము అభిమానాత్మకముగా నుండును. పరమాత్మవలన జ్ఞానానందక్రియాప్రభాసములు గలుగును. చైతన్యమున గలుగుజ్ఞానప్రభాసములు జీవుని శరీరమున వ్యాపించును. ఇది పరాత్మచేతన. ఆనందప్రభాసము పురుషాభివ్యక్తమై వైషయిక సుఖమగును. క్రియాభాసము ప్రాణము. ఆనందసహిత మయిన జ్ఞానమున సత్త్వ ముదయించును. క్రియానందప్రభాసంబంధమున రజోగుణము గలుగును. మనోమయ ప్రాణమయ అన్నమయములు జ్ఞానానందక్రియల కధిష్ఠానములు. సత్త్వాదిగుణభేదమున అహంకారము మూడు విధముల నుండును — సాత్త్వికము వైకారికము తామసము నని. అహంకారవృత్తి యభిమానము. ఈ యభిమానాత్మకమయిన వృత్తి బాహ్యార్థాలంబనము కలదై శృంగారాదిరసస్వరూపము పొందును. మొదట శృంగారాత్మకముగా నుండి విభావాది భేదమున నితరరస స్వరూపము పొందును. శృంగారము నందు గుణసంబంధము లేదు. ఇతరము లందు కలదు. ఇట్టి రసోత్పత్తి మనోవృత్తి యోగమాలాసంహితలో నిరూపితమయినది. అందే తాండవము లాస్యము శివుడు ప్రదర్శించుట నిరూపితమయినది. లాస్యమును గుండలి యందురు. నటకర్మ నాట్యము. నాట్యధర్మలో సభ్యుల మనోవృత్తి యెనిమిదివిధముల నుండును. కొందరు తొమ్మిది విధము లనిరి. కాన శాంతరసము నుండు నందురు. నాటకాది నిబంధనమున శాంతముండదు. అది యభినేయము కాజాలదు. నాట్యరసము లెనిమిది యని పద్మభూమతము. రసవిషయమున నారదమతము కలదు. గుణసంబంధము నిరూపించుటలో నిందు విశేషము కలదు. శృంగారాదిపదముల యుత్పత్తివ్యుత్పత్తులను నిరుక్తులను భావించుట

యుక్తము. నిరుక్తకారులు నిరూపించిన విధానమింకను సంగతమగును. రసతత్త్వ వివేచనమున మతభేదములు కలవు. శ్రీశంకుకుడు నాలుగు విధముల జ్ఞానవిశేషము లుండుట నంగీకరించి యవి యేవియు రసవిషయమున నుండవనెను. విలక్షణప్రతీతి యుండునని నెను. కృత్రిమము లయినను అకృత్రిమములుగా భాసించు విభావాదులు గమకములు కాగా రసము గమ్యమగు ననెను. వస్తుసౌందర్యమున నది రసనీయమై రసమగుననెను ఇది యనుమితియవిలక్షణ మనెను. భరతనాట్యార్థవేదులీ శంకుకవాద మంగీకరింపరు. నాట్యవిదులలో ప్రముఖుడయిన భట్టనాయకుడు ఇట్లు రసము భావించెను. కావ్యనాట్యములలో అభిధ-భావన – భోగీకృతి యను మూడువ్యాపారములు కలవు. పదపదార్థజ్ఞాన మభిధచే గలుగును. భావనావ్యాపారమున సాధారణ్యము కలుగును. భోగీకృత వ్యాపారమున రసభోగము గలుగును. ఈ భోగము సంవిదానందమయము. సత్త్వాతిశయమున ప్రకాశానందమయ సంవిత్తువిశ్రాంతిశయమున నుండును ఇట్టిభోగము సహృదయగతము. శివాగమప్రోక్తము లయిన షట్త్రింశత్తత్త్వములలో జీవుడు రాగ విద్యా కలా తత్త్వములు కల బుద్ధి విశేషము వలన విశిష్ట ప్రవృత్తి కలవాడగును. అప్పుడు రసభోగము కలుగును. ఈ రసవాదమును శారదాతనయుడు ఖండింపలేదు.

## 3. రసభేద తత్ప్రకారనిర్ణయము

ప్రకారాంతరమున రసోత్పత్తి కలదు. సామమున శృంగారము, ఋగ్వేదమున వీరము, అథర్వణమున రౌద్రము, యజుర్వేదమున బీభత్సము కలిగినవి. సామసంకల్పమున బ్రహ్మకు కలిగిన సిసృక్ష విషయసంవలితమై రతిగాగా శృంగారము కలిగినది. ఇచ్ఛాశక్తి శృంగారమూలము. ఋక్కుల స్మరణమున ఇచ్ఛాక్రియాత్మకమయిన జ్ఞప్తి యుత్సాహాత్మకమై వీరమయినది. అథర్వస్మరణమున కలిగిన హింసాత్మక మయిన మతి క్రియాసంవలితమై రౌద్రమయినది. యజుఃస్మరణమున నయిన క్రియాత్మక ప్రవృత్తి బీభత్సమూల మయినది. ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తుల సంబంధమున శృంగారాదిరసచతుష్టయము వేదముల నుండి యిట్లావిర్భవించినవి ఈ శృంగారవీరరౌద్రబీభత్సములు హాస్యాద్భుతకరుణభయానకములకు జనకరసములు. ప్రధానాప్రధానజ్ఞానము నాట్యోపకారకము. జనకరసములు స్వతంత్రరసములు.

కల్పాంతమున శివుడు లోకముల దహించి యానందమంథరముగా నర్తన మొనరించెను. శివాదేశమున బ్రహ్మ లోకముల సృజించెను. కాని

చింతాపరుడై యుండగా నంది సాక్షాత్కరించి నాట్యవేదము చెప్పెను. తదను సారమున రూపకరచన మొనరింపు మనగా బ్రహ్మ త్రిపురదాహము రచించి నాట్యభరతుల ప్రయోగమున కిచ్చెను. వారు బ్రహ్మసభలో ప్రయోగించిరి. అప్పుడు బ్రహ్మముఖము లనుండి వృత్తిసహితముగా రసము లావిర్భవించినవి. ఇట్లు శంకరాదులు సూచించిరి.

1. దేవీదేవసంభోగాభినయనమున బ్రహ్మ పూర్వముఖమునుండి కైశికీసహితశృంగారము.

2. త్రిపురమర్దనప్రయోగమున దక్షిణముఖమునుండి సాత్వతీ సహిత వీరరసము.

3. దక్షాధ్వరధ్వంసనమయమున పశ్చిమముఖమునుండి ఆరభటీసహిత రౌద్రము.

4. శివుని కల్పాంతకర్మాభినయమున ఉత్తరముఖము నుండి భారతీ సహిత బీభత్స ముదయించినది.

5. శివదేవుడు భస్మాంగరాగుడై దేవిని కామింపగా శృంగారమున హాస్యముత్పన్నమయినది.

6. త్రిపురదాహసమయమున శివుని వీరమునుండి అద్భుత ముద యించినది.

7. దక్షయాగధ్వంస సమయమున శివరౌద్రమున కరుణము కలిగినది.

8. శ్మశానభస్మలేపనమున శివుడు నృత్త మొనరించునపుడు బీభత్స మున భయానక ముదయించినది

ఇట్లు రసోత్పత్తిని నారదుడు భరతునకు చెప్పెను. ఆ విధానమున రసముల ఉత్పాదోత్పాదకత భావనీయము.

తంతువులు వస్త్రముగా మారునట్లు మన్ను ఘటముగా మారునట్లు భావ ములు రసములుగా పరిణమించుచున్నవి. తంతు భేదమున పట భేదముండునట్లు భావ భేదమున రసభేదము నుండును. భావముల వైకల్యమున్నచో రసముదయింపదు. భావసాకల్యమున రసముదయించును. నటులు నాట్యమున రసము ననుకరింతురు. అనుక్రియమాణ మగునవి సామాజికమనస్సులలో రస్యమానములై రసము లగు చున్నవి. నాట్యమున రస్యమానము లగుటచే నాట్యరసము లనదగును. రస

నిష్పత్తిలో స్థాయిసముల్లాస మావశ్యకము. ఆ యా రసములకు సంబంధించిన ఆ యా స్థాయిభావములను తత్తద్విశేషానుసారమున సముల్లసింప జేయదగును. శృంగారాదిరసములు వాచిక నైపథ్య క్రియావిశేషములచే మూడువిధము లగును. పదార్థానుభవము పదార్థభేదమున భిన్నభిన్నముగా నుండును. దేశ కాలముల లోని జాతిగుణాదిభేదమున భావపదార్థముండును. వాని విశేషముల నట్లు గుర్తింపవలెను. శృంగారాదిరసములకు అధిదైవతములు వర్ణములు శివాగమ సంహితానుసారముగా విభావనీయములు. రసములకు సంబంధించిన విభావా దులు ఒకప్పుడు గుణానుభావములుగా నుండుట కలదు. రసాలంబనములకు సంబంధించిన సాధారణగుణములు కొన్నికలవు. రూపలావణ్యసౌందర్య సౌకు మార్యాదు లట్టివి. వీనిలో అంగప్రత్యంగోపాంగవిశేషములు గుర్తింపదగినవి. శ్యామాదిముఖరాగములు రసములం దుపయుక్తము లగును. మాననము భాషామాధుర్యము త్యాగము మొదలగు వాని నిందు గుర్తింపదగును. ఇట్టి వానిని రసోచితముగా వఖ్యాహించుట యుక్తము. ఇట్లనుట కవ్యుపదేశపరము.

## 4. శృంగారాలంబననాయకనాయికాది స్వరూప నిర్ణయము

రసాలంబన భావగుణములు సుఖేప్సతో నుండును. భోగము సుఖ సాధనము. భోగమె శృంగారము. భోగద్రవ్యోపభోగమునకు భోగమని పేరు. దేశకాలసమేధితభోగ ముపభోగమగును. కామోపచారమునకు సంభోగ మని పేరు. స్త్రీపురుషుల సుఖము కామము. వారి పరస్పరసమ్మర్దజన్య మయిన యానందసంభేదము సుఖము. సంభోగానందకారక మయిన కర్మ ఉపచారము. స్త్రీలు సుఖాశ్రయముగా నుందురు. వారల కామోద మిచ్చునది శృంగారమె. కావున శృంగారమును విస్తరముగా నిరూపించుట సముచితము. అనురాగము కల ప్రేయసీప్రియుల పరస్పరానుభూతి రతి యగును. నారీపురుషుల స్పృహా రూప మయిన చిత్తవృత్తి రతి. అది యుభయప్రార్థనారూపమగు యిచ్ఛ. సుఖాత్మకమయిన మనోవృత్తి. అన్యోన్యభోగ్యబుద్ధి రతి. రతి ప్రేమచే అంకు రితము, మానమున పల్లవితము, ప్రణయమున ముకులితము, స్నేహమున కుసు మితము, రాగమున ఫలయుక్తము, అనురాగమున ననుభూతము నగును. ప్రేమ మాన ప్రణయ స్నేహ రాగ అనురాగస్వరూపములు తెలియదగినవి. ప్రేమ రతిని పోషించును. ప్రీతికారక మగును. ప్రేమ కౌటిల్యము రమ్యము. ఒకరి స్వాతంత్ర్యమితరుల కభీష్టము. స్వాతంత్ర్యమనునది యితరుల మనోరథనిరోధనము.

ఈ మనోరథనిరోధనమును మాన మందురు. ఈర్ష్యామానము ప్రణయమానమని మానము రెండు విధములు. ప్రేమ ప్రకర్షను పొందునేని ప్రణయమగును. ప్రణయమాన మిద్దర కుండవచ్చును. ఈర్ష్యామానమును పురుషులకు వర్ణింప రాదు. మనసున నున్న మమత్వాభిమానము స్నేహము. కృత్రిమ మకృత్రిమ మని యిది రెండువిధములు. ఈ స్నేహమున ప్రౌఢ మధ్య మందరీతులు, స్థిర గత్వర సత్వర రీతులు కలవు. స్నేహము గుణముచే రాజితమగునేని రాగ మగును. రాగమున నీలి గము కుసుంభరాగము మంజిష్ఠా రాగము నను భేద ములు గలవు. అవిచ్ఛిన్న మనస్సంతతముగ రాగ మనురాగమగును. ఈ ప్రేమాదిభావములను భట్టాభినవగుప్తాదులు సూచించిరి. ఇట్టి ప్రమోదా దాత్మక మయిన రతి ప్రకృష్యమాణమై శృంగార మగును.

కావ్యమున శృంగారమును నిరూపించుటకు కవు లీ యుపదేశమును స్వీకరింప వలెను. శృంగారోచితములగు దేశ కాలాంగవేషములును తత్తత్స మయ చేష్టావిశేషములను గ్రహింపదగును. విభావప్రాధాన్యమున రసమున కుత్కర్ష కలుగును. ఇతరభావముల ప్రాధాన్యమునను రసోపక్షయమును కలుగును. శృంగారము మూడు విధములు - వియోగము అయోగము సంభోగము నని. అయోగశృంగారమున దశావస్థలు గలుగు చుండును. వియోగము మాన వియోగము ప్రవాసవియోగము నని రెండువిధములు. ఇం దవాంతరభేదములును గలవు. సామాద్యుపాయషట్కమున సంచరించుట యావశ్యకము. అయోగ వియోగములలో విభావాదులు సాధారణముగ నుండును. వీనిలో కరుణాను రూప్య మున్నదనిపించును. కాని యివి కరుణాత్మకములు కావు. ఇందు శోకము లేదు. రతిస్థాయి యనువృత్తమై యున్నది. రెండును శృంగార భేదములె. సంభోగమె కామము. ఇది నాలుగువిధములు — మితము - సంక రము - సంపన్నము - సమృద్ధము నని. సంభోగ వియోగ చేష్టావిశేషము లనేక ములు కలవు. ఇచ్ఛాదులు మన్మథావస్థలు.

శృంగారము సమగ్రగుణవర్ణనాధారమున వృద్ధి పొందును. ఇట్లు రసో త్కర్ష హేతువు లయిదు గలవు. నాయకనాయికాదులు నాట్యపాత్రములు. నాయ కులు ధీరలలితాదులు నలుగురు. వీరు ఆభిగామిక సాంగ్రామికగుణములతోనుందురు. ధీరలలితాదినాయకులకు అనుకూలాదిభేదమున విశేషము కలుగగా నలుబది యెనిమిది నాయకసంఖ్య కలుగును. ఉపనాయకుడు నాయకసహాయులు

కామసచివులు నాయకసహాయులుగా నుందురు. నాయికానాయకులకు దౌత్యము నిర్వహించుటకో దూతదూతీగణము కలరు. వారనేకవిధముల సమాగమోపాయములను సూచింతురు. నాయికా వారి వారి భేదప్రభేదముల కూడి మూడు వందల యెనభైనాలుగు భేదములు కలవారగుచున్నారు. స్వీయాపరకీయా వేశ్యాభేదమున, ముగ్ధామధ్యాప్రౌఢాభేదమున, ధీరాధీరాధీరాధీరాభేదమున, జ్యేష్ఠాకనిష్ఠాభేదమున, అష్టావస్థాసంబంధమున, ఉత్తమామధ్యమాధమాభేదమున యథాసంభవముగా సంకలన మొనరించిన పైసంఖ్యకలుగును. ఉపభోగమున కింద రుందురని రుద్రటాచార్యవచనము. భర్తను విడనాడి వేరొకనితో నుండు వనిత, వేశ్యావృత్తిని విడనాడి యొకనితోడనేయుండు వనిత వేరొకవిధమున పరిగణింప దగుదురు. వేశ్యలకు రాగముండదని కొందరనుటను రుద్రటుడు సహింపడు. వారలకు నది యుండుననును. వేశ్యలందు సురత ముత్తమసురతము. నాయికల వివిధస్వరూపములు లక్షణములు భావనీయములు. ఆ యా నాయికలకు సంబంధించిన మదనోత్సవములు విలాసములు విశిష్టములుగా నున్నవి. నాయక సమీపమున ఆయా నాయికల చేష్టావిశేషములును భావనీయములు. నాయికలందున్న ఉత్తమమధ్యమాధమభావములు గుర్తింపదగినవిగా నున్నవి. వారి వారి స్వభావరీతులను తద్విదు లభ్యూహింపదగును.

## 5. నాయకనాయికాభేద తత్తదవస్థాదినిరూపణము

స్త్రీలకందరకును యౌవనము నాలుగు విధములుగా నుండును. ప్రతి యౌవనమునను వారి విచేష్టితము వేరుగా నుండును. ప్రథమయౌవనములో నన్నియు కించిత్ కించిత్ రూపమున నుండును. యౌవనములో మృదుస్పర్శ కోరుదురు. రతిక్లేశము సహింపరు. అంగసంస్కారమున ఆదరము, సఖీక్రీడలలో లాలస యుండును. సవతుల విషయమున హర్షముండదు, శోకముండదు. ప్రియసంగమమున విరక్తకాదు, రక్తకాదు. ద్వితీయయౌవనమునందు దేహసౌష్ఠవము కలదై రతిక్రీడలో నిబ్బరముగానుండదు. అపరాధము సహింపదు. ప్రసన్నకాదు. మానము పట్టును. గర్వపడును. తృతీయ యౌవనములో ఛాయావైగుణ్యము కఠినస్పర్శ మ్లానకపోలత సడలింపు నుండును. కామతంత్రములలో వైదగ్ధ్యము ప్రియానుకూల్యముండును. అపరాధముల పట్టించుకొనదు. మత్సరముండదు. ప్రియుని విడనాడదు. ఆకర్షించును. చతుర్థయౌవనములో అవయవములన్నియు వాడిపోగా జారిపోగా రతి

కేళిలో అశక్తయై ఉత్సాహములేనిదై అందరకనుకూలయై ప్రియసహాసనమున నుండునది యగును. పురుషునకు షోడశవత్సరములు వచ్చినప్పటినుండి ముప్పది రెండువఱకు యౌవనచేష్టితము లుండును. అందొకది యొకవిధమౌ కాని సంపద ప్రకృతి గుణము మొదలగు వానిచే పరివర్ధితమై విశిష్టముగా నుండును. మహోదయత్వాదిగుణములు కలవాడు స్త్రీలకభిగమ్యుడు. విజ్ఞానసంపదాదులు కల వనిత పురుషుల కభిగమ్య యగును. వైశిక పురుషవిశేషములు కలాసంబంధము నతిశయింప జేయును. ఉత్తమమధ్యమాధమభేదమున వైశికుడు మూడువిధముల నుండును. అవశుడయినను కామవశుడగును. అసంగుడయినను ససంగుడగును. కామతంత్రనిపుణుడగును. కోపించిన అనునయింపగలడు. అనాదరము స్ఫురించెనా విరక్తుడగును. ఉపచారపరుడు నగును. ఇట్టివాడు ఉత్తముడు. నాయికా వ్యలీకము గోచరించిన కోపింపడు. రక్తుడుకాడు. ఆయా సమయములందు వసనాదు లిచ్చును. దోషము కన్పడినచో విరక్తుడగును. ఈతడు మధ్యముడు. అధముడు కామతంత్రములలో లజ్జారహితుడు. రతిక్రీడలో కర్కశుడు. భయామర్షము లుండవు. కృత్యాకృత్యములు లుండవు. మూర్ఖుడు. విరక్తయందును సంసక్తుడగును. మిత్రులు వారించినను పరుషము పలికినను భర్తతో నున్న నితరునితో నున్నను స్త్రీని కామించును.

స్త్రీలు ప్రీతిప్రయోజితలై నాయకుని ప్రణయ దయిత కాంత నాథ స్వామి ప్రియ సుహృత్ నందన జీవితేశ సుభగ రుచిర సంజ్ఞలతో వ్యవహరింతురు. కోపము కలిగెనేని స్త్రీలు నాయకుని వామ విరూప దుశ్శీల నిర్లజ్జ నిష్ఠుర శఠ ధృష్ట దురాచార సంజ్ఞలతో వ్యవహరింతురు. ఇట్లు నాయక భేదములను భరతుడు ప్రదర్శించెను. స్త్రీల కందరకు సత్త్వమిట్లుండును. ధర్మమున నర్థ మర్థమున కామము కామమున సుఖఫలోదయము. స్త్రీలు సుఖమునకు మూలము. వారియందు సంభోగమిష్టము స్త్రీలు నానాశీలములతో నుందురు. వారివారి సత్త్వశీలానుసారమున కూడినచో తృప్తలగుదురు. మంచి రతి నిత్తురు. ఇందు ఇరువదిరెండు శీలములు నిరూపితము లయినవి—దేవ-దానవ-గంధర్వ-యక్ష—రాక్షః-పక్షి—పిశాచ-నాగ—వ్యాల-నర-వానర-హస్తి-మృగ-మీన—ఉష్ట్ర-మకర—ఖర-సూకర-వాజి—మహిష-అజ-గోశీల లున్నారు. ఇంకను శీలములు గలవు. అవి యన్నియు సావధానముగా భావింపదగి యున్నవి. శీలము గుర్తించి సత్త్వానుసారమున స్త్రీలను భోగింపవలెను. అల్పముగానయినను. యథాసత్త్వముగా

నుపచరించిన స్త్రీలకు హర్షము కలుగును. అతభాయుక్తమయిన యుపచారము గొప్పగా నున్నను స్త్రీలకు తుష్టికరము కాదు.

ఉపచారస్వరూప మిట్లున్నది. "యత్ర యత్ర స్పృహా తత్తద్దేశకాలానుకూలతః అత్యాదరేణ సత్కారః ఉపచార ఇతీరితః" అనగా దేశకాలానుకూలముగా స్పృహ యున్నపు డత్యాదరమున సత్కార మొనరించుట యుపచారమగును. కావున స్త్రీలయందు శీలానుకూలముగా యథానుకూలముగా పురుషు లుపచార మొనరింపదగును. వేశ్యా కులజా అన్యాపిభాగమున నుపచారము మూడు విధముల నుండును. కామ ముత్తమమధ్యమాధమరూపమున నుండును. తత్తదాలంబనగుణానుసారముగ నీ విభాగము సంగతము. వాసోంగరాగాభరణమాలాశయ్యాసనాదులు స్త్రీలకు సాధారణములు. కులాంగనోపచారమార్జవపురస్సరముగా నుండును. అన్యవనితోపచార మవస్థాదేశకాలాదిప్రధానముగా నుండును. స్త్రీపురుషు లనురాగము కలిగినప్పు డొకరొకరి రక్తి విరక్తి గుర్తింపవలెను. మొదట స్త్రీ రక్త యయినచో ననంతరము పురుషు డనురక్తుడు కాదగును. అప్పుడు స్వభావసుభగమగు సంభోగముండును. అన్యోన్యరక్తిమ యేకకాలీనమయినచో నా సంభోగలీల మధ్యమము. ఏకత్రానురాగమయినచో నది యధమము.

స్త్రీల రాగాపరాగము లనేకవిధముల నుండును. వానిని గుర్తింపవలెను. కులాంగనారాగచేష్టలు వేశ్యారాగచేష్టలు పరవనితారాగచేష్టలు వేరు వేరుగా నుండును. వానిని సావధానముగా గుర్తించి వారిని సేవింపవలెను. స్త్రీలకందరకు రాగచేష్టలు సమానములె యని మారుతి భావము. రక్తవనితల యభ్యంతరోపచారములు భావనీయములు. వివిక్తవసతికాంక్ష, ప్రియగుణాఖ్యానము, సఖులకు స్వధనదానము, మిత్రపూజనము, శత్రుద్వేషము, సంగమాభ్యర్థనము, తద్వచోభంగిచే సంతోషము, పశ్చాత్తాపము, చుంబనము, ఆలింగింపజేసికొనుట, ఆలింగనము చేయుట, బాహ్యాభ్యంతరరతములతో తానే మొదట ఆరంభించుట, ఆలింగనము విడదీయమి, తదోభగ్యవస్తుభోగము, రతిక్రీడలో వనిభృతముగా నుండుట - అనువిట్టివి రక్తవనితల యుపచారములు. విరక్తవనిత లిట్లుందురు- చూడగానె క్రాచి యుమ్ముట, వెంటనే ముఖాచ్ఛాదనము, గూఢావస్థానము, అనాదరము, అదేశకాలగమనము, పిలిచినప్పుడు కాలయాపనము, ఇచ్చిన దానిని పుచ్చుకొనకుండుట, వేరుగా నేలపై వేయుట, పిలువగా నొడలు బడలికగా నున్నదనుట, దగ్గరకు రాగా దూరమేగుట, అడిగినప్పుడేదో చెప్పుట,

చుంబింపగా ముఖము తుడుచుకొనుట, అనిష్టము పలుకుట, చూడకుండుట, ముందుగా శయనించి నిద్రించుట, మేల్కొలిపినను కాలయాపనము, సంభోగ మిష్టపడమి, తాకగా నంగసంకోచము, పడ్డిగా జిడ్డుగా నుండుట, అవలించుట, ఉమ్ముట, ఎదురుమాటలాడుట, ముడుచుకొనుట, ఏదో చెప్పి సురతము మానుట, అన్యాపదేశమున నాకపికోలు, నీవి స్పృశింపగా వాలుమ్మనుట, సుప్తిగా నున్నదని పరాఙ్ముఖముగా పడుకొనుట మొదలగునవి. విరక్తిచిహ్న మొకటియున్న నుత్తముడు విరక్తుడగును విరక్తచిహ్నములను గుర్తించి యామెను విడనాడుట మంచిది. రాగపరాగచిహ్నములందు నేని నేర్పుగా నుపచరించుట యుక్తము. రంతుకాములు కాని గంతుకాముల చిహ్నములిట్లుండును. కూర్చొనకుండుట, ఆసనచాలనము, నగవు మోపుట. అటునుంచి యిటు అంగచాలనము, ఆవలింతలు, ముహుఃద్వారనిరీక్షణము, కాళ్లుసాచి ముడుచుట, గొంతు కూర్చొనుట, ఒడలు విరుపు, చిటికెలు వేయుట_ ఇట్టివి తేలిపోవువారి చేష్టలు. విరక్తిహేతువులెన్నియో కలవు — బక్కచిక్కుట, వ్యాధి, పడుపు, పారుష్యము, రూపము మాయుట, దోషాపవాదశ్రవణము, మతిలోపము మొదలగునవి. ఇట్లున్న విరక్తులకు సంగమ ముండదు. ప్రణయకోపవిరాగము హృద్యము. అది యనునయమున మాసి పోవును. మరల అన్యోన్యానురాగము వృద్ధి చేయును. మంచి రతిని సంపాదించును.

రాగచిహ్నముల విభావనము లనేకములున్నవి. వాని భావముల గుర్తించి పురుషులు ప్రవర్తింప వలెను. స్త్రీల దృష్టివిశేషములు శృంగారోపయోగులు. కొన్ని భావాశ్రయములు. కొన్ని రససంశ్రయములు. ఇట్టి దృష్టి సంశ్రయము లయిన వికారము లిరువదినాలుగు గలవు; రౌద్రమున 12, శోకమున 9, వీరమున 11, బీభత్సభయానకములలో 8– మొత్తము 104. వీని స్వరూపలక్షణములను సాభిలాషముగా గుర్తింపదగును. దృష్టుల స్వరూపవినియోగములను భావింపవలెను. ముఖభ్రూదృష్టిసంయుత మయిన నేత్రము యొక్క ప్రసారము ననుసరించి ముఖరాగమును నిరూపింపదగును.

## 6. శబ్దార్థసంబంధ తద్భేద ప్రకారనిర్ణయము

ఈయధికారమున రసానుభూతి ప్రకారములు గతులు ఆభాసరీతులు అన్యోన్యమేలనములు తద్వికల్పాదులు భావములు వాక్యార్థత నిరూపిత మగును. దర్శనాదులచే నుత్పన్నమయిన రతి విభాగములచే దీప్యమానమై వాగారంభాను

భావనమున హృదయారంభానుభావమున శృంగారమును విశేషయుక్తముగ జేయును. అభినయాశ్రయములయిన రసగతు లేకమిది యున్నవి. ఆశ్లేష-లీన-విచ్ఛేద-సూక్ష్మ-వ్యతికర-స్థిర-శోభన-సమయము లను పేరులు గల గతులు భావ నియమములు. వర్తమానరసమున కన్యరసముతో సంగతియుండుట, అనుభూత రస మన్యరసమున తిరస్కృత మగుట, విరుద్ధములచే విచ్ఛిన్నమగుట, ఆలంబన గుణస్థైర్యమున సంస్కారానువర్తమున ననుగతమగుట, సమకాలోత్పన్నములతో వ్యతికీర్యమాణ మగుట. ఆవిర్భావ తిరోభావములు పొందుచు నితరరసములు ప్రకృతమునకు స్థైర్యమాపాదించుట, సమకాలసముత్పత్తివలన సమకాలానుభూతు లచే నితరములతో సామ్యముండుట, విరోధిమిత్రశత్రురసముల సాంకర్యమున్నను స్వమహిమచే శోభించుట యనునవి యీగతులలో భావింపదగియున్నవి శృంగా రము హాస్యాభిభూతమయినను, హాస్యము బీభత్సమిలిత మయినను, వీరము భయానకావిష్టమయినను, అద్భుతము బీభత్సకరుణాశ్లిష్టమయినను. రౌద్రము శోకభయావిష్టమయినను, కరుణము హాస్యశృంగారాభిభూతమయినను బీభత్స మద్భుతశృంగారములతో నున్నను, భయానకము రౌద్రవీరానుషక్తమయినను రసాభాస మేర్పడును. ఇట్టి యాభాసవిశేషము లింకను గలవు. వానిని వివేచన మున కవులు గుర్తింపవలెను. భాగద్వయమున నుండదగు ప్రధానరస మితర రసములలో నొకభాగముననె యుండునది యగుట రసాభాసస్వరూపము.

సమానములగు భావములు పౌర్వాపర్యమున నుండుట రసమేలన మగును. శృంగారవీరములకు రౌద్రబీభత్సములకు అద్భుతహాస్యములకు కరుణ భయానకముల కన్యోన్యమేలన ముండును. రసములు మిళితములగుచునె యుండును. మొదట ప్రఖ్యాతమగునది ప్రధానమగును. రెండిటి సంబంధ మున్న సంసర్గ మగును. రెండుమూడు రసములకు సంసర్గసామ్యమున్నచో సంకరమగును. ఆద్యంతములలో ప్రగుణిత మగునది ప్రధానమగును రాగాప రాగములలో స్వతంత్రములు ఆభాసరూపములు మిళితములు సంకరములు నయిన రసముల తారతమ్యమును గుర్తించి కవులు కావ్యముల రచింపదగును. రసభావ వివేచకులు కావ్యబంధముల నిట్లు వివేచింపవలెను. కవిప్రయత్నసాఫల్యము శాశ్వత ముగా కీర్తిని పోషించును. దేశకాలాదులను భావలింగములను తెలిసి రసస్థితిని గుర్తింపదగును. ఈ ప్రకారముల నాలోచించి విని యనుభవించి ఇతరులకు చూపించి వినిపించి యనుభవింపజేసి సర్వప్రకారముల సంపూర్ణకాముడై

సంతుష్టమానసుడై మానవుడు తుదకు శాంతరసమున ముక్తిని పొందును. శమాత్మక మయిన శాంతరస మే యొకటికో యుండును. శాంతమున యోగులలో దుఃఖ పరిత్రాణాదివిశేషము లుండును. మానాపమానాదులలో శాంతుడు సమవృత్తిగా నుండును గావున సామాన్యముగా ననుభావము లుండవు. ఒకప్పు డానందబాష్పాదులుండును. రోమాంచ మొక్కటియె శాంతానుభావమని కొందరందురు. సంచారులు శాంతమున ఉపకరింపవందురు. కావున శాంతము వికలాంగము. విషయాసంగము నశింపగా, స్వాంతము శాంతము కాగా ననుభావము లేమియు నుండవు. కాని సత్త్వామాత్రమున శాంతమున్న దనవచ్చును. శాంతము వికలాంగమయినను శ్రేష్ఠము. దేహధారులకు ప్రకృష్టపురుషార్థముల కుపయోగించు భావరసములను భావింపవలెను.

ఈ భావరసములకు దేశకాలాదిదర్శనశ్రవణాదులచే స్వసంవేద్యములగు ననుభావము లున్నవి. దేశాదివిభావములు చేష్టల నుత్పాదింపజేయును. చేష్టలచే ననుభావము లనుమీయమానము లగును. చేష్టలు లేకున్న భావములు భాసింపవు. కాన చేష్టావిశేషజ్ఞుడు భావుకుడు రసికుడునగును. దేశము కృత్రిమ మకృత్రిమ మని రెండువిధములు. నగరగ్రామాదులు కృత్రిమములు. నదీశైలవేలాదు లకృత్రిమములు. అకృత్రిమములను శిల్పజ్ఞులు కృత్రిమములు చేయుదురు. వసంతాదికాలము బహువిధము. దేశకాలము లందాయారసములలో ననేకవినోదము లున్నవి. శాంతమున భయానకమున వినోదముండదు. ఆరు ఋతువులకు సంబంధించిన నియతవినోదములు భావనీయములు. స్థిరానురాగము కల ప్రేయసీ ప్రియులకు పరస్పరోపచారములచే నిట్టివినోదములచే సంభోగము పరిపోషము పొందును.

భుజిధాత్వర్థయోగమున సంభోగము నాలుగువిధములు. పాలనము కౌటిల్యము అభ్యవహారము అనుభవము అనునవి భుజిధాత్వర్థములు. నవరాగానంతర సంభోగము పాల్యము. మానానంతరసంభోగము కౌటిల్యముతో నుండును. ప్రవాసానంతరసంభోగము హృద్యాన్నాభ్యవహారమువలె హృద్యము. కరుణానంతరసంభోగము విస్రంభానుభవము సంపాదించును. ఈ నాలుగుసంభోగములును మిత సంకర సంపన్న సమృద్ధభేదమున నుండును. నవానురాగమున మితము, మానమున సంకరము, ప్రవాసానంతరము సంపన్నము, కరుణానంతరము సమృద్ధము. స్నేహమున్న భయముండును. ఈర్ష్యయున్న రాగముండును. వైమనస్యము వ్యలీకము స్నేహమున భయమున గలుగును. ఈర్ష్యవలన రాగము వలన విప్రియము మన్యువు కలుగును. ఇట్టిసమయము లందు గలుగు చేష్టలను భావము

లను బాగుగా భావింపవలెను. ప్రణయరోషములు భూయోభూయః సమాగమములు వై మనస్యాదులు. శృంగారమును పోషించునవి యగును. విషయములు సుఖరూపమున రతిపోషకములు. ఇంద్రియార్థ మనుభావితమై మనసా భావిత మగును. ఇష్ట మనిష్టము మధ్యమ మని మనోభావము మూడువిధము లందురు. విషయానుభవాత్మకము లయిన యనుభావములు దూరసమీపవస్థసూక్ష్మవ్యవహితాత్మకములుగా నుండును. ఇవి యొక్కొకసారి కలుగుటయు సముచ్చితములై యుండుటయు గలదు. అనురక్తులయిన వారలకు మానవిరహమున గోత్రవైకృతమున నుండుచేష్టలు విశిష్టముగా నున్నవి. ఇట్టిచేష్టలు స్వప్నాపరాధమున నత్యంతము మనోహరములు మానవియోగమున ప్రవాసవిరహమున నిట్టివి యుండును. సంభ్రమసముత్పన్న విరహమున, దైవికవిరహమున, ఆకస్మికవిరహమున, బుద్ధిపూర్వకమయిన వియోగమున, శాపహేతుక మయిన విరహమున నివి విశిష్టముగా నుండును. అయోగవిరహమున నిట్టివి యున్నవి. వీని నన్నిటిని భావించి కవిపుంగవులు ప్రబంధముల నిర్మాణింపవలెను. కాకున్న వైరస్యము కలుగును.

ఇట్లు నిరూపితము లయిన రసముల కర్థతత్త్వానుసారమున శాస్త్రమార్గానుసారముగా వాక్యార్థత వ్యంగ్యత నిరూపితమగును. మహాకవి సాలంకార రసవత్కావ్యముల నొకప్రయత్నముననె నిర్వర్తించును. స్థాయిభావము వేధకము లయిన స్వేతరభావములచే నతిరస్కృతమై భావాంతరముల నన్నిటి నాత్మాధీన మొనరించును. ఒక వాక్యమునగాని ముక్తకపద్యమున గాని కులకాదులందు గాని రెండురసముల సన్నిపాత మున్నచో, నొకటి ప్రధానమగును. వేరొకటి గుణము - అప్రధానమగును. రెండును తుల్యవత్ — సమానములుగ నుండునేని సంసర్గాలంకారమందురు. కాకువిశేషమున గాని విభావాది బలమున గాని ప్రాబల్యము కల రసమునకు ప్రాధాన్యముండును. కాకు విశేషము లేకున్నచో రెండును సమానములగును. గావున నది దుష్ట మగును. శ్లేషవలన వాక్యమున వాక్యద్విత్వము గోచరింపగా రసభేదప్రతీతి యుండుట గుణమే యగును. స్థాయి భావము ప్రకృష్యమాణమై ప్రకాశానందచిద్రూపమయిన రసత్వమును పొందును. కావ్యోపాత్తము లయిన విభావాదులచే సముపబృంహిత మయిన స్థాయి రసత్వము పొంది వాక్యార్థమగును వాక్యమగు క్రియ కారకములతో గూడి వాక్యార్థత్వము పొందును. ప్రకరణాదుల వలన బుద్ధిస్థ మయిన క్రియయు కారకములతో గూడినదై వాక్యార్థత్వము పొందును. అట్లే విభావాదులతో గూడుకొనిన విశిష్టమగు స్థాయి కావ్యాది వాక్యార్థ మగు

చున్నది కావున నెచటనేని రత్యాదిశబ్దములు లేకున్నను ఆయావాక్యము లందు రసభావప్రతీతి యుండును. రసమునకు కావ్యమునకు వాక్యరూపమైన సంబంధముండును. కావ్యము సామాజికోల్లేశమునకె ప్రవృత్తము కదా! సామాజికులా కావ్యమున రసమునె వాక్యార్థముగ భావింతురు. కావ్యనిబంధబద్ధమయిన రసమునకు స్థాయిభావమునకు వాక్యార్థత్వ మనునది శబ్దార్థసంబంధము వలన గోచరించును.

శబ్దార్థముల సంబంధము సాహిత్యము. అది ద్వాదశవిధము— వృత్తి-వివక్ష-తాత్పర్యము-ప్రవిభాగము-వ్యపేక్ష—సామర్థ్యము - అన్వయము - ఏకార్థభావము-దోషహానము—గుణాదానము-అలంకారయోగము-రసావియోగమునని. వీనిస్వరూపనివేదనము భోజరాజు శృంగారప్రకాశమున విస్తరముగా గలదు. తత్సంగ్రహము భావప్రకాశములో నిరూపితమైయున్నది తత్సంగ్రహ మిచట నిదర్శిత మగును.

1. వృత్తిమూడువిధములు - అభిధ-లక్షణ-గౌణి.

2. వివక్ష మూడువిధములు—సమ-న్యూన—అధికవివక్ష. ఈ వివక్ష కాకువిచ్ఛేదాదికము ప్రకరణాదికము అభినయాదికమను మూడు హేతుప్రకారములచే భాసించును. భిన్నకంఠధ్వనిరూప మయిన కాకువు ప్రశ్నగర్భ కాకువు అభ్యుపగమ కాకువు ఉపహాసకాకువు ఆక్షేపకాకువు తర్కగర్భకాకువు వాక్యాన్యథాత్మకకాకువు వాక్యసమాప్తికకాకువు వాక్యసంభేదరూపకాకువు వాక్యానుచ్చారణాత్మకకాకువు నని పదివిధముల కాకువులు గ్రాహ్యములు. ఇట్లె ప్రకరణాదిగమ్యవివక్ష, అభినయాదిగమ్యవివక్ష బహుప్రకారముల నున్నది.

3. తాత్పర్యము మూడువిధములు— అభిధేయము ప్రత్యాయ్యము ధ్వనిరూపము నని. వాక్యార్థత్రైవిధ్యమున నీత్రైవిధ్యము సిద్ధమగును. ఇందు ధ్వని శబ్దమున నర్థమున నని రెండు విధములగును. శబ్దధ్వని అనునాదరూపము ప్రతిశబ్దరూపము నగును. ధ్వనితాత్పర్యములకు భేదము కలదని కొందరందురు. కొందరు భేదము నంగీకరింపరు కావ్యమున రసాలంకారాదికము ధ్వన్యాఖ్యతాత్పర్యముచే గమ్యమాన మగుట వలన వాక్యార్థమగుట నిశ్చితము. ఇట్లు త్రివిధమైన తాత్పర్యము వక్తృ ద్వారమున వాక్యధర్మమె యని తాత్పర్యవేదులందురు.

4. ప్రవిభాగము. అర్థభాగములలో శబ్దభాగవిభాగముండుట ప్రవిభాగము. మహావాక్యమున నవాంతరవాక్యము లవయవరూపముగా నుండును. ఇదియె విభాగము ప్రవిభాగము. పదార్థము లందును ప్రవిభాగ ముండును.

5. వ్యపేత. పదార్థములకు పరస్పర మాకాంక్ష యుండుట వ్యపేత యగును. క్రియాకారకభావమున అన్వయయోగ్యతను వ్యపేత యందురు.

6. సామర్థ్యము. వాక్యమున పదపదార్థసంబధము సామర్థ్యమని యందురు.

7. అన్వయము. పదములకు పరస్పరము కల గ్రథనము అన్వయ మగును. ఒకచో నీరక్షీరవిధానమున ఒకచో తిలతండులరీతిని ఒకచో పాంసూదకముగా నన్వయ మనేకవిధముల నుండును.

8. ఏకార్థీభావము. అవిభాగమున నుండుట. ఈ యేకార్థీభావమున ముక్తకము యుగళము సందానితము కలాపకము వ్యాఖ్యాతప్రాయము. ఏక ప్రఘట్టకనిబద్ధ మయిన వాక్యవిస్తరము సంఘాతమగును. కోశము ప్రకరణము ప్రబంధమనునవి యేకార్థీభావము కలవని భావింపదగును. చతుర్వర్గసాధన మయిన ప్రబంధము మహావాక్యార్థము.

వాక్యవాక్యార్థములలో నీ వ్యపేతాదిక మంతరంగభూతము. ఇది కల వాక్యము ప్రయోగార్హము. వ్యపేతాదికము నిర్గుణత్వమును సదోషత్వమును రసాలంకారశూన్యత్వమును పోగొట్టగలదు. దోషహానము గుణాదానము అలంకారయోగము రసావియోగ మనునవి ప్రయోగయోగ్యతాసంపాదకములు.

9. దోషము త్రివిధము – పదగతము వాక్యగతము వాక్యార్థగతము.

10, 11. గుణాలంకారములు.

12. రసావియోగము. రసము వాక్యతాత్పర్యగోచరము కావున వాక్యార్థత సిద్ధప్రాయము.

రసాశ్రయవిషయమున కొందరు విగాన మొనరింతురు. భరతాది మతానుసారమున సోపపత్తికముగా తన్నిరాక్రియ యుచితము. సదాశివ మతమున రసస్వరూపము ఆశ్రయమిట్లు నిర్ణీత మయినది. రస్యము రసము. రసము రసికునిది. అనుకార్యునిది కాదు. ఆతడతీతుడు. కావ్యమాతనికై కాదు.

రసమనుకార్యునిదే యగునచో లౌకికదర్శనమున వలె ద్రష్టకు ప్రీతీర్ష్యారాగ ద్వేషము లుదయించును. తత్తదాలంబనాశ్రయముగా నున్న రత్యాదికము విభావాదిసంసర్గమున రసమగును. సామాజికుడె రసాశ్రయము. సామాజికోద్దేశము నసె కార్యము ప్రవృత్తమయినది. కావున రసము తాత్పర్యగమ్యమనుట యుక్తము. సభాసదులు శబ్దోపహితులై బుద్ధికి భాసించిన రామాదులను కారణముగ భావింతురు. వారు దృఢసంస్కారము కలవారు కావున నిర్వికల్ప నిరుపమ స్వాద మనుభవింతురు.

తత్తదర్థవశమున శబ్ద మారు విధములు — వాచకము లాక్షణికము వ్యంజకము గమకము ప్రత్యాయకము ద్యోతకమునని. అర్థ మారువిధములు. తాత్పర్యార్థము వీనికన్న భిన్న మని కొందరందురు. షట్పదార్థ విచారము నకై గుణములు ధర్మములు కల్పితములు. కావ్యాదిసంపదకై కవులు వీనిని స్వీకరింతురు. దేశకాలాదిగతము అయిన గుణధర్మము లర్థాతిశయము సూచింపగలవు. వర్ణముచే పదముచే పదద్వయముచే బహుపదములచే వాక్యముచే వాక్యార్థముచే నని యర్థము లారు విధముల భాసించును. అవి యట్లు వివక్షితార్థ సంపత్తిహేతువులు. కారకాదులచే వక్తృవివక్ష భాసించును. ఒకప్పుడు వాచ్యము లక్ష్యమగును. లక్ష్యము వాచ్యమగును. వివక్షితము అభిప్రాయము ఫలము భావము ప్రయోజనము తాత్పర్య మనునవి పర్యాయశబ్దములు. ఇట్టివి వాక్యార్థగోచరములుగా నున్నవి. పదార్థముల యన్యోన్యసంసర్గము వాక్యార్థ మని భాట్టులందురు. వాక్యార్థము పదార్థరూపమె యని ప్రాభాకరు లందురు. తాత్పర్య మర్థాంతరమందురు. శబ్దార్థముల రూపనిర్ణయమున భట్టాభినవగుప్త పాదభావము పరిగ్రాహ్యముగా నున్నది. బాగుగా భావించి కవు లర్థనిబంధన మొనరింపదగును.

మమ్మటుడు కావ్యప్రకాశములో శబ్దార్థముల స్వరూపము పరిష్కరించి నిరూపించెను. ఆ యర్థము సర్వమిచట నుల్లిఖిత మయినది. వాచకము లక్షకము వ్యంజకమని శబ్దము, వాచ్యము లక్ష్యము వ్యంగ్యమని యర్థము, అభిధ లక్షణ వ్యంజన యని వ్యాపారము మూడు విధముల నున్నవి. నా రచితమయిన కావ్యప్రకాశములోని యీ ప్రఘట్టమునకు సంబంధించిన విషయము సర్వమీప్రసంగమున ప్రతిపాదితమగుచున్నది. వ్యంజన మభిధామూలము లక్షణామూలముగా నుండును. అనేకార్థశబ్దమునకు సంబంధించిన వాచకత్వము

సంయోగాదులచే నియంత్రితము కాగా నన్యార్థప్రతీతి వ్యంజనమువనె కలుగును. ఈ యర్థప్రతీతిలో నభిధ లక్షణ సమర్థముకాదు. శబ్దమర్థాంతరవ్యంజకము కాగా నచట నర్థమును సహకారిగా నుండును. అర్థ మర్థాంతరవ్యంజక మయిన స్థల మున శబ్దము సహకారిగానుండును. వక్తృబోద్ధవ్యాదివైశిష్ట్యము వలన ప్రతిభా యుతులగు వారల కన్యార్థ మవభాసింపజేయు వ్యాపారము వ్యంజనయే. ఇట్టి స్థలములం దర్థశక్తిమూలకవ్యంజన యుండుటను గ్రహింపవలెను.

ధర్మి పదార్థమును నిరూపించిన ధర్మముల హేయోపాదేయత గోచ రించును. కావున ధర్మి కావ్యప్రభేదకథన మావశ్యకము. లక్షణామూల మవి వక్షితవాచ్యధ్వని. ఇది యర్థాంతరసంక్రమిత మత్యంతతిరస్కృతమని ద్వివి ధము. అభిధామూలము వివక్షితాన్యపరవాచ్యధ్వని. ఇది యలక్ష్యక్రమ వ్యంగ్యము సంలక్ష్యక్రమవ్యంగ్యమని ద్వివిధము. రస మలక్ష్యక్రమవ్యంగ్యము. రస మలంకార్యము. రసాద్యలంకారమున కన్న భిన్నము. రసాదిక మంగముగా నుండునేని గుణీభూతవ్యంగ్య మగును. స్ఫోటవాదము ననుసరించి ధ్వనినామము నిశ్చిత మయినది. ధ్వని యుత్తమ కావ్యము. ఇట్టి ప్రబంధము దుర్లభము. వ్యంగ్యమప్రధాన మయినచో గుణీభూతవ్యంగ్యము, మధ్యమకావ్యము. వ్యంగ్యము ప్రతీతము కాదేని యధమకావ్యము. ఇందు శబ్దవైచిత్ర్య మర్థవై చిత్ర్యముండును. సంలక్ష్యక్రమధ్వని శబ్దశక్తిమూల మర్థశక్తిమూల ముభయ శక్తిమూలముగా నుండును. ఇందింకను భేదములు కలవు. గుణీభూతవ్యంగ్య మెనిమిది విధములు. ధ్వనికారు లిట్లు భేదములను ప్రతిపాదించిరి.

ఆక్షేపసమాధానముల వలన నర్థములం దతిశయము గలుగును. అది యిచట నిరూపితమగును. దోషగుణాలంకారములు శబ్దార్థోభయరూపము లనుట సంగతమగునా? స్వతఃశుద్ధమయిన వర్ణమునకు దోషమేమి? గుణ మేమి? అమూర్తము రసాదుల కాశ్రయమగుట యెట్లు? వర్ణము విభువు. అది కాదాచిత్క మెట్లగును? దోషాదులకు ఆశ్రయము వర్ణమా? పదమా? వాక్యమా? పదమెట్టిది? వర్ణము పదమా? వర్ణములు పదమా? దోషగుణా దులు శబ్దాత్మకము లయినచో పదాదు లెట్లుండును? శబ్దముల కాశ్రయాశ్రయి భావముండదు గదా! దోషాదులు శబ్దాత్మకములు కాకున్నచో భిన్నాధికరణత్వ మున సంబంధమె కుదురదు. కావున దోషాదులు శబ్దగతములని కల్పించుట వ్యర్థము. ఈ యాక్షేపములకు సమాధానములను బాగుగా గుర్తించిన అర్థముల యతిశయము గోచరించును.

వక్తృసంబంధవశమున శబ్దమునందు దోషాదికల్పనము యుక్తమె యగును. దోషాదులు వక్తృధర్మములు. దోషము వక్తృప్రయోగాధీనము. శబ్దగతము కాదు. ఇట్లె యితరములు గ్రాహ్యములు. శబ్దోచ్చారణానంతరము శ్రోతల కర్థప్రతీతి కలుగును. గుణాలంకారరసవత్కావ్య నిర్మాణము ధ్వనిరూపముగ నుండుట కవికీర్తిసంపదకు హేతువు.

## 7. నాట్యేతివృత్త శరీరలక్షణాభిధానము

నాట్యమున రసవ్యక్తి కలుగును. నాట్య మవస్థానుకృతియని సామాన్యలక్షణము. నటునందు రామాదితాదాత్మ్యాపత్తి నాట్యము. నాట్యము ప్రేక్షకదృశ్యమగును గావున రూపకము రూపము నగును. రూపకము దశవిధ మని భరతుడు నియమించెను. వాక్యార్థాభినయాత్మక మగు రసాశ్రయరూపక మిందు నిరూపితమగును. నాటికాతోటకములును రసాశ్రయము లయినను నాటకాదులలో నంతర్భావమున్నందున వేరుగా పరిగణింపలేదు. సట్టకము కూడ నాటికాప్రతిమము. డోంబీశ్రీగదితాదులు నృత్యభేదములు. రసాశ్రయము వాక్యార్థాభినయాత్మకము. భావాశ్రయము పదార్థాభినయాత్మకము. నృత్యము భావాశ్రయము. నృత్య నృత్తవిభాగము ననేకు లనేకవిధముల జెప్పిరి. ఈ రెండును నాటకాదుల కుపకారకములు. నాటకాదులలో పూర్వరంగమునందు వీని యుపయోగమున్నది. నృత్తగీతవాద్యము లుపకారకములు. "గేయం ప్రాణాః ప్రయోగస్య". పురుషార్థము లన్నియు గేయసాధ్యములు. ఇందు గేయసముత్పత్తి ప్రదర్శితమయినది.

ప్రత్యభిజ్ఞాసంప్రదాయానుసారముగా నీనాట్యమున షట్త్రింశత్తత్త్వము లున్నవి. శివ శక్తి సదాశివ ఈశ్వర శుద్ధవిద్యలను నయిదు శుద్ధములు. మాయ కాల నియతి కలా విద్యా రాగ పురుషు అను నేడు శుద్ధాశుద్ధతత్త్వములు. ప్రకృత్యాదులశుద్ధతత్త్వము లనుట సిద్ధము. విలక్షణశక్తిసంక్రమమున పురుషుడు ప్రాజ్ఞతైజస విశ్వ రూపుడయినాడు. విశ్వమను నీ పార్థివాండమునందు నశ్వరము లయిన చతుర్విధప్రాణు లావిర్భవించినవి. ఈ ప్రాణులన్నియు జీవత్వము కలవి. కాలప్రేరితు లయిన దంపతుల సంగమము వలన వాయువు శుక్లశోణిత రూపమయిన శక్తిని గర్భాశయము చేర్చును. కాలప్రేరితు డయిన జీవుడందు చేరును. ఆ జీవునందు ప్రాణాపానాత్మక మయిన నిత్య వాయు

వున్నది. పరాశక్తి యచట వ్యాపించును. జీవుడు జరాయుగ్రస్తదేహుడై కాలపాకమున ప్రాప్తాంగుడై యవాఙ్ముఖుడై జన్మించును.

శరీరుల శరీరము షణ్ణవత్యంగులాయామమున నుండును. శరీర మధ్యగత కందభాగమున కుండలినీశక్తి యున్నది ఆ శక్తి పరాప్రకృతి - అంబిక. శివాజ్ఞచే దేహమున సంచరించు వాయువు ప్రాణాదిభేదమున నయిదు విధముల నున్నది. శరీరగతనాడులలో ఇడ పింగళ సుషుమ్న అను ముఖ్యములగు మూడునాడులలో సుషుమ్న మధ్యనాడి వహ్నిశిఖనాశ్రయించి యుండును. వహ్నిశిఖ ప్రాణసంబంధమున నాదాత్మక మగుచున్నది. ఆ నాదము సుషుమ్నా మార్గమున సంచరించి శిరఃపర్యంతము వ్యాపించును. యోగులు కిది నాదరూపమున ననుభూతి నిచ్చును శరీరులలో వర్ణముల సృజించును. నాదము శ్రుతుల సృజించును. శ్రుతి స్వర ముత్పాదించును. సర్వవర్ణములకు స్థానము లేదు కలవు. ఇరువదిరెండు నాడులు సుషుమ్నలో హృదయమున నున్నవి. వాయు ప్రేరణమున నాదము ఆ నాడులలో జేరును. హృదయ గ్రంథికి పైగా కపాల ఫలకమునకు క్రిందుగా ప్రాణములు సంచరించును. అచట శ్రుతులు వ్యక్తము లగును. వ్యక్తిస్థానములలో నవి స్వరరూపము వహించును. కంఠమున షడ్జము, తాలుమూలమున ఋషభము, ఓష్ఠమున గాంధారము మూర్ధమున మధ్యమము, దంతములలో పంచమము, కంఠతాలువునందు ధైవతము, కంఠోష్ఠమున నిషాదము అనుస్వరములు కలుగును. ఇది యిట్లుండ కొందరు ధాతువుల నుండి స్వరములుత్పన్నములగు నందురు. దహరాకాశమధ్యగత మయిన సహస్రదలమున ఆత్మ యున్నది. ఆ యాత్మకు "బహుస్యాం" అను సంకల్పము కలిగినది. అప్పుడాత్మ మన మధిష్ఠించి యుండును. పంచ వాయువులు ధాతువులను వ్యాపించి ధమనీముఖమున నగ్నులను ప్రజ్వలింపజేయగా నాదము వెలువడును. ధమను లనేకములు గావున నచటి ధ్వనులు—నాదము లనేకములగును. ఆ ధ్వనులు శ్రుతు లగును. ధమనీసంఖ్యానుసారమున శ్రుతుల సంఖ్య యుండును. శుక్ల ధాత్వగ్ని జన్యమగు స్వరము షడ్జము. మజ్జాధాత్వగ్నిజము ఋషభము. అస్థి ధాత్వగ్నిజన్యము గాంధారము మేదోధాతగ్నిజము మధ్యమము. మాంస ధాత్వగ్నిజము పంచమస్వరము. రక్తధాత్వగ్నిజము ధైవతము. త్వగ్ధాతువహ్నిజము నిషాదము. ఆధారమున శుక్లధాతువు, నాభియందు మజ్జాధాతువు, హృదయమునఅస్థిధాతువు, కంఠమున మేదోధాతువు, తాలుమూలమున మాంసధాతువు, మూర్ధగతముగా రక్తధాతువు, భ్రూమధ్యమున త్వగ్ధాతువు. ఇట్లు వీని ననుసరించి

స్వరము లున్నవి. శుక్ల మజ్జా అస్థి మేదః మాంస రక్త త్వగ్ధాతుజన్యమగు నిషాదము తారస్వరముగా, శుక్లజమగు షడ్జము మందముగా నుండును. శ్రుతుల వివక్షానుసారమున గ్రామభేదప్రకల్పన మున్నది. రాగమూర్ఛనాతానము లిట్టివే. మధ్యమస్వరమున వెలువెడిన నాదము మధ్యమగ్రామము. యథాస్థితమగునది షడ్జగ్రామము. శ్రుతులు గానకాలమున సంయోగైక్యము పొందును. స్మృతి-వ్యవసిత—ఆరంభ-స్పర్శ-భిన్న-లయము అను క్రమమున నా రంగములతో శ్రుతులు సుసంపన్నము లగును. వీనిలో భిన్నన్యూనాధికవిభాగము కలదు. వీనిసంబంధమున శుద్ధరాగములు గౌడరాగములు వేసర రాగములు నున్నవి. ఇంక నిట్టి సంగీతశాస్త్రవిషయముల నిందు సాకరగ్రంథములందును భావింపవలెను. అభినవగుప్తపాదులు సంగీతతత్వము నభినవభారతిలో విశదమొనరించిరి. శారదా తనయుడును శారదీయమను తన సంగీత ప్రబంధమున విశదమొనరించెనట.

నటుడు గీత వాద్య నృత్త అభినయములచే రంగమున రామాద్యవస్థల ననుకరించి రామాదితాదాత్మ్యమున ప్రేక్షకులను రసయుతుల నొనరించును. అన్యోన్యానురంజనమున సభాపతి సభ సభ్యులు గాయకులు వాదకులు నటీనటు లన్యోన్యరంజనమున మోదము పొందుదురు. రంజనమున రంగమను వ్యవహారము కలిగినది. పూర్వప్రయోగమున పూర్వరంగమయినది. పూర్వరంగమున ప్రత్యాహారాదు లిరువదిరెండంగములు కలవు. యథావిధి పూర్వరంగప్రయోగమున అశుభము కలుగదు. స్వర్గలాభ మంతమున నుండును. కవియభీష్టార్థప్రకాశన పరములయిన విశేషముల నిందు కూర్పవలెను. నాటకమున పూర్వరంగాంగము లెన్నియో కలవు. రంగప్రసాధన మొనరించి సూత్రధారుడు నిర్గమింపవలెను.

సూత్రధారసమాకృతి యగు వేరొకనటుడు ప్రవేశించి వస్తు బీజ ముఖ పాత్రసూచన మొనరింప వలెను. వస్తువు ప్రబంధశరీరము ఇతివృత్తము. ఇందు అధికారిక ప్రాసంగికాదిభేదము లున్నవి. రామకథ సుగ్రీవకథ యీ విభాగమున భావనీయములు. పతాకాప్రకరీభేదములును వస్తువునందు భావనీయములు. వస్తువు ప్రఖ్యాతము ఉత్పాద్యము మిశ్రమని మఱల మూడువిధములు. ఇంకను దివ్యమర్త్యోభయాత్మకభేదమును గలదు భరతు డాధికారికమునకు ప్రాసంగికమునకు త్రివర్గము ఫలమని తద్భేదములను సూచించెను. బీజ బిందు పతాక ప్రకరి కార్యము లనునవి కథాభేదహేతువు లయిన అర్థప్రకృతులు. ఇవి కథాశరీరహేతువులు.

ప్రారబ్ధకార్యమునకు సంబంధించిన యవస్థ లయిదు కలవు. ఆరంభ యత్న ప్రాప్త్యాశ నియతాప్తి ఫలాగమము లవస్థలు. అర్థప్రకృత్యవస్థా సంబంధమున ముఖ ప్రతిముఖ గర్భ విమర్శ నిర్వహణము లను నయిదు సంధులు గలుగును. అన్విత కథాంశములకు పరమ ప్రయోజనమున సంబంధము సంధి యగును. సంధులకు సంబంధించి యరువది నాలు గంగములున్నవి. ఇవి లక్ష్యము లందనుగతములై యున్నవి. వీని ఘటనము వలని ప్రయోజన మారువిధముల నున్నది — ఇష్టార్థ రచన, వృత్తాంతానుపక్షయము, ప్రయోగరాగప్రాప్తి, గోప్యగోపనము, ఆశ్చర్యవదభిజ్ఞానము, ప్రకాశ్యప్రకాశనము. అంగహీనుడు కార్యసమర్థుడు కాడు. అంగహీనకావ్యము ప్రయోగక్షమము కాదు. కావ్యమనుదాత్తార్థ మయినను అంగ సమన్విత మయినచో శోభకలదగును. కావ్య ముదాత్తమయిన నంగరహిత మయి నచో తత్ప్రయోగము సహృదయుల మనమును రంజింపజేయలేదు. కావున సంధి ప్రయోగ విషయమున యథాయోగము యథారసము యత్న ముచితము. కొన్ని యంగములు లేకున్నను దోషములేదు. సంధివిశేషము లయిన సంధ్యంత రము లేకవింశతి కలవు. స్వసంపద్గుణయుక్తముగా వానిని నిబంధింపదగును.

సూచ్య మసూచ్యమని వస్తువు రెండు విధములు. నీరస మనుచిత మశాస్త్రీయ మయిన వస్తువిస్తరమును సూచింపవలెను. ప్రదర్శింపరాదు. సూచ్య సూచకములు విష్కంభాదు లయిదు ప్రసిద్ధములు. దృశ్యము నంకములచే ప్రద ర్శింపవలెను. ప్రయోగమున శ్రావ్య అశ్రావ్య నియతశ్రావ్యాది భేదము లున్నవి. వీనిని ప్రకాశము స్వగతము జనాంతికము అపవారితకము ఆకాశభాషిత మని యందురు. నేతృరసానుగుణ్యమున నీ యశేషవస్తువిశేషమును నిరూపింప వలెను.

న కేవలం రసో నైవ లక్ష్యం నైవ చ లక్షణం
న నాయకస్యైవోత్కర్షో వర్ణ్యః సుకవినా క్వచిత్.

సుకవి కేవలము రసమును లక్ష్యమును లక్షణమును నాయకోత్కర్ష మును మాత్రమె వర్ణించుట యుక్తము కాదు. వీని యన్నిటి యానుగుణ్యా మున కథాశరీరము కల్పింపవలెను. సంధిసంధ్యంగముల ఘటనము రసాదుల నన్నిటి నుద్దీపింపజేయును. కావున నందు యత్న మావశ్యకమని గ్రహింప వలెను.

## 8. దశరూపక లక్షణము

నాటకము రూపకములలో మొదటిది. రూపకములు పది కలవు. ఉపరూపకములు పదునెనిమిది యున్నవి. నాటకము సర్వప్రకృతి రసప్రధానము. లక్షణము నాటకమున పూర్ణముగా నున్నది. వికాసము విస్తరము క్షోభము విక్షేపము అని చేతోవికారములు నాలుగు నాలుగు రసములకు మూలములు. రూపకశాస్త్రనిరూపిత లక్షణము లన్నియు నిందుండును. "రసాలంకారసహితం నాటకం పూర్ణలక్షణం" నాటకమున లేనిదేదియు లేదు. జ్ఞాన శిల్ప విద్యా కలా కర్మ యోగము లన్నియు నాటకమున గలవు. నాటకవిద్య సర్వలోకము రంజింపజేయును. నానారసభావములు గల సుఖదుఃఖములు లోకచరిత మిందుండును. అయిదు మొదలుగా పదియంకములు నాటకమున నుండును. నాటకాశ్రయాలంకారము లనేకములు గలవు. నవరసాతిశయావహ నాటకాలంకారములను సంభావించుట యుక్తము. లక్షణోపేత మయిన నాటకము సుప్రయుక్త మయినచో కవి నట ప్రాశ్నిక ప్రేక్షకుల కందరకు భుక్తిముక్తి ప్రదమగును.

నాట్యమున ప్రేక్షకునకు విశిష్టలక్షణములు కలవు నటునకును గుణవైశిష్ట్య మావశ్యకము. ప్రాశ్నికులలో నటప్రేక్షక గుణములే కాక ఇంకను గుణవిశేషము లావశ్యకములు. నాట్యసంఘర్ష ముదయించినచో విశిష్టు లయిన ప్రాశ్నికు లుండవలయును. లోకప్రకృతులు నానాశీలములతో నుందురు — "శీలే నాట్యం ప్రతిష్ఠితం". కాముకులు విదగ్ధులు శ్రేష్ఠులు విరాగులు శూరులు జ్ఞానవయోవృద్ధులు రసభావవివేచకు లందరు నాట్యము సేవింపదగును నాట్యము సర్వజనులకు సంతోషప్రదము. ఆ యా కార్యములలో నభినివేశము కలవారందరు నాట్యమున ప్రయోజనమును పొందుదురు. తరుణులు విదగ్ధులు అర్థపరులు విరాగులు శూరులు వృద్ధులు బుధులు బాలురు మూర్ఖులు స్త్రీలు తమ తమ అభీష్టమును నాట్యమున గుర్తించి తుష్టిని పొందుదురు. తుష్టిలో తుష్టి శోకమున శోకము క్రోధమున క్రోధము భయమున భయమును పొందువాడు ప్రేక్షకు డగును. "త్రైలోక్యభావానుకీర్తనం నాట్యం." ఇట్టిది నాటకము. ఈ నాటకారంభప్రకార మీ యధికారమున నున్నది. సూత్రధారుడు సానుచరుడై రంగమున ప్రవేశించి రంగప్రయోగ మొనరింప దగును. తత్సమాకృతి స్థాపకుడు వచ్చి వస్తు బీజ ముఖ పాత్రములను సూచింపవలెను. ఇట్లు పూర్వతనుల నాటకము లందుగలదు. రంగప్రసాధనానంతరము సూత్రధారుడు భారతీవృత్తి నాశ్రయించి ప్రస్తుతార్థము ప్రశంసించుచు ప్రేక్షకాదుల సాన్ముఖ్యము సంపాదింప దగును. ప్రస్తావన

నా విధముగా నాతడు నిర్వహింపదగును. సూత్రధార ప్రయోగము ప్రస్తావన ఆముఖము. ఇందు నటి విదూషకుడు పారిపార్శ్వకుడు సూత్రధారు ననుసరించి చిత్రవచనములతో కార్యార్థము సూచింతురు.

పదునారు వీథ్యంగములు ప్రస్తావనలో నుండదగును. ప్రస్తావనయె ఆముఖము. ప్రవృత్తక కథోద్ఘాత ప్రయోగాతిశయము లను ప్రస్తావనాంగములు నాటకములలో రమ్యముగా నున్నవి. పదమూడు వీథ్యంగములను ప్రస్తావనలో నిరూపింతురు. ఆ యా నాటకములలో వీని గ్రథనము రమ్యత సంపాదించినవి. ప్రస్తావనాతిరిక్తనాటకభాగములలో నివి యున్నవి. సూత్రధారుడు వీథ్యంగములలో నన్యతమమున కథార్థమును పాత్రమును సూచించి ప్రస్తావనాంతమున నిర్గమింప వలెను. అనంతరము వస్తుప్రపంచన మొనరింపవలెను. ప్రఖ్యాతవస్తువు నాధికారికముగా గూర్పదగును. ఇందు నాయకు డభిగమ్యగుణయుక్తుడు ధీరోదాత్తుడు నగును. ప్రఖ్యాతవంశ్యుడగు రాజర్షి నాయకుడు. రసమునకు నాయకున కనుచితమగు వస్తువును త్యజించి అన్యథా ప్రకల్పింప దగును. హేయోపాదేయములను మొదటనే నిశ్చయించి యుపాదేయమును గూర్పవలెను. కథాశరీరమును బీజబిందు పతాకా ప్రకరీ కార్యరూపమున విభజించి ముఖ ప్రతిముఖ గర్భ విమర్శ నిర్వహణ సంధియుతముగా నిరూపింపవలెను. కార్యయుక్త్యనుసారమున విష్కంభకమునుగాని యంకమును కాని కూర్పవలెను. ఆదితః నీరస వస్తువుండునో సరసవస్తువుండునో గుర్తింపవలెను. నాటకమున ప్రసిద్ధవస్తువున్నను కల్పితకథయు నుండదగునని మాతృగుప్తు డనెను.

నాటకము నందలి యంకము నానాప్రకారార్థసంవిధానరసాశ్రయముగా నుండ దగును. నానారూప ప్రయోజకము అలంకారరసాధారము కాదగును. అంకము ప్రబంధచిహ్నము రసాశ్రయము బీజసంహారము కలది అవలగ్నబిందువుగా నుండునది యని గ్రాహ్యము. నాటకాంకములలో రసనిబంధనముననె కవి సావధానుడు కాదగును; ఇతివృత్తమాత్రనిబంధనమున ప్రయోజనము లేదు. రసపోషణవిధానమును కవి గుర్తింప వలెను. అంకాశ్రయ మయిన అంగిరసమునకు గృహీత ముక్తము లగు విభావాదులచే పరిపోషణ మొనరింప దగును. కథావస్తువు శరీరము; రస మాత్మ. వీనిని యథోచితముగా వర్ణింప వలెను. రసాభిమానమున వస్తువున కుపమర్దము కూర్పరాదు. వస్తువిస్తరమున రసము మ్లానము కారాదు. రసనిబంధనమున సావధానత యావశ్యకము. అంకాలంకారము లపేక్షితములు. వీరశృంగారములలో నొకరసము ముఖ్యము కాగా నితర

రసము లంగరూపమున నుండదగును. అంకనిషిద్ధములను పరిహరింపరాదు. వధ యుద్ధాదులను సుకథాదులను సూచింపవలయునే గాని యంకమున ప్రదర్శింప రాదు. ఇట్టి వాని ప్రదర్శన ముద్వేగజనకము జుగుప్సావహము లజ్జాకరము. అధి కారి వధము నిరూపింపరాదు. అవశ్యకము త్యజింపరాదు. వెంటనే మరల జీవించినట్లుండునేని యధికారివధ మొకచో కల్పితము కావచ్చును. ఒకనాటి నాయకుని యాచరణ మంకములో నుండదగును. విదూషకాదులతో నది ప్రయో జ్యము కావలెను. అంకాంతమున సందరు నిష్క్రమింతురు. విష్కంభప్రవేశకము లంకమున యథాసంభవముగ నుండును. నాటకమునకు సంబంధించిన సర్వ విశేషములను సంభావింపదగును. ప్రాక్తనసంస్కృతనాటకము లందివి సంగత ములుగా నుండుటను గుర్తింపవలెను. నాట్యము ధర్మాదిసాధనము సర్వ దుఃఖాపనోదనము కావున సేవింపదగునని నాట్యవేదము నిర్మించి బ్రహ్మ ఋషుల నుద్దేశించి పలికెను, గ్రామ్యధర్మప్రవృత్తమయిన లోకమును చక్కబరచుటకై ప్రీతిప్రదము వ్యుత్పత్తిప్రదము నయిన క్రీడనీయకము నింద్రుడు కోరగా బ్రహ్మ సర్వశ్రావ్యమగు నాట్యవేదము నిర్మించి ఋషులలో సంక్రమింపజేయుట నిచట భావింపవలెను. దివ్యమానుషసంయోగము కలిగిన నాటకసంభవ మయిన తోటక మిట్టిది యున్నది అని హర్షుడనెను. అదియవ్యాపకమని యన్యులనిరి.

నాటకవిషయమున సుబంధుమత మొకటి భావనీయము కలదు. పూర్ణము ప్రశాంతము భాస్వరము లలితము సమగ్రమని నాటక మయిదు విధ ముల నున్నది. వీనిలో సంధులుండును. వాని పేరులు వేరుగా నున్నవి. కృత్యా రావణము పూర్ణనాటకము, స్వప్నవాసవదత్తము ప్రశాంతనాటకము, బాల రామాయణము భాస్వరనాటకము, ఊర్వశీవిప్రలంభము లలితనాటకము, మహా నాటకము సమగ్రనాటకము వీనిలో సమన్వయము భావనీయము. ఇందలి వృత్తి సంపన్నత రససంపత్తి భావనీయముగా నున్నది.

ప్రకరణము రూపకములలో రెండవది. ఉత్పాద్యవస్తువుండుట వణి క్సచివాదులు నాయకులుగా నుండుట యనునది మాత్రము నాటకము కన్న వేరుగా నుండును. ఇక సర్వము నాటకము వలె నుండును. కులస్త్రీ గణిక నాయికగా నుందురు. ప్రకరణము మందకులస్త్రీచరిత మనిరి. ఇందుదాత్త నృపుడుండడు. దివ్యచరిత ముండదు. రాజసంభోగ ముండదు. ఇది బాహ్యాజన సంప్రయుక్తము. శకారుడు కుట్టిని చేటి విటచేటాదులు ధర్మశాస్త్ర బహిష్కృ తులగు వారిందుందురు. వీరి స్వరూపవివేక మావశ్యకము.

నాటకప్రకరముల సాంకర్యమున నాటిక యొక్కటి యావిర్భవించును. ఇది సంకీర్ణాన్యనివృత్తిసూచకము. ఇతరము లెన్నిసంకీర్ణము లయినను గలుగునది నాటిక యొక్కటియే. ధీరలలితుడు శృంగారము కైశికి యిందు ముఖ్యము. దేవీభయమున నాయకుడు సాశంకు డగుటయు నిందుండును. నాటక లక్షణములు ప్రకరణలక్షణములు నుండుటచే తదుభయతుల్యము నాటిక యనిరి. నాటిక కొన్ని మార్పులు చేర్పులు కలదయినచో సట్టక మగును. భాణ మనురూపకమున ధూర్తచరిత ముండును. నిపుణపండితుడగు విటుడొక డభినయించును. ఉక్తిప్రత్యుక్తులు తానేపలుకును. ఆకాశభాషితములు వ్యవహరించును. ఇందు లాస్యాంగప్రయోగమావశ్యకము. కల్పితకథ శృంగారరసము భాణరూపము. గేయపదాదిలాస్యాంగదశక మత్యంతము భావ్యమానసుందరము. భాణమున లాస్యాంగములన్నియు నేకపాత్రప్రయోజ్యములు. నాటకమున భిన్నపాత్ర ప్రయోజ్యము లగును. భాణప్రయోజ్యములగు నృత్తభేదము లింకనుగలవు. గుల్మ శృంఖలికా లతా భేద్యకములు నాలుగు నృత్యభేదములు విజ్ఞేయములు. ప్రహసనమను రూపకము భాణసదృశము. శుద్ధము సంకీర్ణము వైకృత మని ప్రహసనము మూడువిధములు. చేటచేటీవిటులు కాముకులు సంచరింతురు. షడ్విధ హాస్యము ప్రయుక్తమగును. డిమరూపకము షోడశనాయకముగా నుండును. బీభత్సాదినిరంతరమై యుండును. శృంగారహాస్యము లుండవు. వ్యాయోగ రూపకమున వృత్తము ప్రఖ్యాతము. రాజర్షులు నాయకులు, దివ్యయోనికథ యుండును. అల్పశృంగారము. దీప్తరసము. అస్త్రీనిమిత్తమయిన సంగ్రామ మిందుండును. డిమమునకు వ్యాయోగము శేషభూతము. సమవకారరూపకములో లోకసమ్మతము ప్రఖ్యాతము నయిన దేవాసురేతివృత్తముండును. దేవదానవులు పండ్రెండుగురుందురు. మూడు కపటములు మూడుశృంగారములు మూడువిద్రవము లిందుండును. అష్టాదశనాడికలలో దీని ప్రయోగము సువిభక్తముగా నున్నది. నాటకాదులలో వలె వీథ్యంగముల నిందు యథాలాభముగా గూర్పదగును. వీథీరూపకము నిద్దరు ప్రయోగింతురు. లాస్యాంగములు వీథ్యంగములు నిందుండును. అంక మను రూపకమును ఉత్సృష్టికాంకమనియు నందురు. వస్తువు ప్రఖ్యాత మప్రఖ్యాత ముండవచ్చును. యుద్ధనియుద్ధములు స్త్రీల పరిదేవితములు నుండును, కావ్యవేదులు దీనిని అభ్యుదయాంతముగా గూర్పదగును. దివ్యనాయకకార్యమును కావ్యబంధములలో భారతవర్షముననే కూర్పదగును. భారతము కర్మభూమి యగుటవలన విశేషము కలదు. ఈ భూమి

ఇచటిరీతి రతి సర్వము యుక్తము. ఈహామృగరూపకము దివ్యాదివ్యనాయకము. భయబీభత్సరహితము లయిన షడ్రసములిందుండును. ఇట్లు దశరూపకముల లక్షణము తెలిసి, వస్తువు భావించి ప్రబంధము నిర్మింపవలెను. స్ఫుటసుందవృత్త ములతో ఉదారమధురవాక్యములతో కావ్యము నిర్మింపవలెను.

## 9. నృత్యభేదస్వరూపనిరూపణము

దశరూపభిన్నము లయిన రూపకముల కన్న వేరుగా పదార్థాభినయాత్మకము లయిన కొన్ని యవాంతరభేదములు కలవు. అవి నృత్యభేదములు— తోటక నాటికా గోష్ఠి సల్లాపాదు లిరువది యున్నవి. కొందరు వీనిని నామాంతరములచే నిర్దేశించిరి. అయినను సంవిధానక్రమము భిన్నము కాదు. వీనిలో నాటికా తోటక సట్టకములు నాటకప్రకరణాంశరూపములు. డోంబి శ్రీగదితము భాణము భాణి ప్రస్థానము రాసకము కావ్యము అను నేడురూపకములు నృత్యభేదము లని భాణము వలె నుండున వని కొందరందురు. గోష్ఠి అను వీనిలోని యుపరూపకము శృంగారమంథరము. గోష్ఠబాలచేష్టితము యమలార్జునభంగము మొదలగునవి గోష్ఠిరూపములు. సల్లాపక మను దానిలో శృంగారహాస్యము లుండవు. కపటములు విద్రవములు వీరరౌద్రరసము లితరము లిందుండును. శిల్పకములో హాస్యముండదు. బ్రాహ్మణుడు నాయకుడు. డోంబి యనునది వీరశృంగారమేదురముగా నుండును. ఇందు లాస్యాంగములు ప్రయోగింతురు. శ్రీగదితములో కులాంగన ఆసీనయై ఉత్కంఠితయై పాఠ్యము గీతము గానము చేయును. రామానంద మనునది శ్రీగదితము. భాణము. భాణరూపకమున కన్ననిది భిన్నము. స్త్రీలిందుండిరు. ఉద్ధతకరణము లుండును. తాలవిధానము లిందధికముగా నుండును. ఇది భాషాసంకరకల్పితము. సర్వభాషావిచిత్రితము. భాణిక యనుదానిలో లలితకరణము లుండును. పీఠమర్ద విట విదూషకు లుందురు. లాస్యదశక ముండును. ప్రస్థానమను దానిలో దాసాదులు నాయకులు విటచేటాదులు నాయకులు. ఆపానకేళి లలితముగా నుండును. కావ్య మను దానిలో హాస్యశృంగారములు లాస్యములు విటచేటీ విశేషములు నుండును. ప్రేక్షణక మనునది నర్తకీ లలితాభినయముతో నుండును. నాట్యరాసకములో పదునాలుగురు నాయికలు నర్తన మొనరింతురు. పిండీబంధము లుండును. స్త్రీలు భూభర్తృచేష్టిత మభినయింతురు. పుష్పాంజలిప్రయోగ ముండును. గాయకులు శుష్కగీత మాలాపింతురు. రాసక మనునది ప్రవాసశృంగారముతో నుండును. వర్షావసంతవర్ణన పరమగును. మండలనృత్త ముండును. అనేకనర్తకీ యోజ్యము.

ఉల్లోప్యక మనుదానిలో హాస్యశృంగారములు ఉజ్జ్వల నాయికా నాయకులు నుందురు. హల్లీసకములో గేయలాస్యము నాయికలు నాయకు లధికముగా నుందురు. దుర్మల్లికయనునది ప్రౌఢనాగరనాయికగా నుండును. విటవిలాసము విదూషకవిహారము చౌర్యరతి గ్రామ్యకథాలాపము దూతి ధనమడుగుట క్షుద్రకథ యుండును. మల్లిక యనుదానిలో మొదట వస్తువు గోచరింపదు. అనంతరము గోచరించును. కల్పవల్లి యనునది హాస్యశృంగారములు కలది. వాసకసజ్జిక అభిసారిక యుందురు. పారిజాతకములో వీరశృంగారములు భోగినీవనితలు విదూషక క్రీడాపరిహాసము లుండును. ఇట్లు నృత్యభేదము లున్నవి. ఇంతకన్న భిన్నలక్షణములు నిషిద్ధములు కావు.

ప్రాచీనులు భాషానియమము సూచించిరి. ఉదాత్తమానవులకు సంస్కృతము. లింగినీ మహాదేవీ మంత్రిపుత్రీ వేశ్యలకును ఒకప్పుడు సంస్కృతము. స్త్రీలకు సామాన్యముగా ప్రాకృతము. అధములకు శౌరసేని అత్యంతనీచులకు పైశాచి మాగధి. ఉత్తములకు కార్యానుసారమున భాషావ్యతిక్రమము యుక్తమె. విప్రక్షత్రియులకు సుభటులకు అధీతవనితలకు దేవదానవాదులకు యోగినీయోగులకు సంస్కృతము ప్రయోగింపవలెను, అధములకు కువిద్యులకు అల్పచేతసులకు సంస్కృతము తగదు. నాయకాదుల భాష నాట్యమున కుపయోగించును. "భట్టిని బాఢం కాంత ప్రియ పుత్ర హలం ఆయుష్మన్" మొదలగు వానిని వ్యవహరించుటలో గల నియమము లనేకములు గలవు. ఛందఃప్రయోగమున ఉపసర్గప్రయోగమున అవ్యయవ్యవహారములలో కాలప్రయోగమున ఆ యా నామవ్యవహారమున విదూషకాదులకు పేరులు పెట్టుటలో నియమము లావశ్యకములు.

కవిసమయములు మూడు గలవు – ఉన్నవానిని జెప్పకుండుట, లేని వానిని జెప్పుట, ఉన్నవానిని జెప్పుట లేనివానిని జెప్పకుండుట యని. వీని ననుసరించి కావ్యనాట్యములను భావింపవలెను. ఈ ప్రఘట్టమున శిల్పకము డోంబి అను వాని యంగముల లక్షణములు గ్రంథమున భావనీయములు. ధీరోద్ధతాదినాయకులు వారివిదూషకులు తల్లక్షణము లిచటగ్రంథమున నున్నవి. కథ ఆఖ్యాయిక సర్గబంధము ఆశ్వాసబంధము సంధిబంధము సంహిత సంఘాతము మహాకావ్యము చంపువు లంబచ్ఛేదము పద్ధతి పటలము పరిచ్ఛేదము అధికారము విచ్ఛేదము వాదము అధ్యాయము పర్వము ఉచ్ఛ్వాసము ఆశ్వాసము అనువానివ్యవహారమున భావింప

దగినవిశేషములు కలవు. ఇట్టివాని నన్నిటిని కవి యవధరించి ప్రబంధము నిర్మింప వలెను. ఇట్టి దానిని బుధజనుడు వినదగును. విద్వజ్జనశ్రవణమార్గమున నున్న ప్రబంధము నాయకునకు కవికి భుక్తిని ముక్తిని సంపాదింపగలదు.

## 10. నాట్యప్రయోగ భేద ప్రకార విశేష నిర్ణయము

నాట్యము నృత్తము మార్గమని దేశి యని రెండు విధములు. ఆ ప్రబంధభేదముల ప్రయోగక్రమము నిరూపిత మగును. పూర్వము మను మహీపాలుడు భూభారమున శ్రాంతుడై విశ్రాంతి సుఖము సంపాదించుటకై సూర్యు నర్థించెను. సూర్యుడు విశ్రామోపాయము నిట్లు చెప్పెను. ఒకప్పుడు బ్రహ్మ లోకపాలనవ్యాపారపరిఖిన్నుడై విష్ణువునకు విజ్ఞాపనము చేసెను. విష్ణు వాలోచించి బ్రహ్మతో నిట్లనెను — "బ్రహ్మ! నీవు శివు నడుగుము. శివుడు నీకు నుపాయము చెప్పును" బ్రహ్మ ఉమాపతి శివుని జేరి తన ఖేదము నివేదించెను. శివుడు గుర్తించి నందికేశ్వరుని బిలిచి "నానుండి నీవు గ్రహించిన నాట్యవేద మును ప్రయోగసహితముగా బ్రహ్మ కుపదేశింపు" మనెను. అతడట్లుచేసి "దీని ప్రయోగమున పాలనాయాసవిశ్రాంతిసుఖముపొందుము"అనెను. భారతీసహితుడై బ్రహ్మ నాట్యవేదప్రయోక్తను స్మరింపగా నొక ముని శిష్యపంచకముతో వచ్చెను. అప్పుడు బ్రహ్మ "నాట్యవేదం భరత" అనెను. వారట్లు చేసి బ్రహ్మను సంతోష పెట్టిరి. బ్రహ్మవారలకు భరత నామ మిచ్చెను. ఇది భరతనాట్యవేదముగు ననెను. అప్పటినుండి బ్రహ్మ శ్రమము పోగొట్టుకొనెను. "మనువా! నీవు నిట్లు చేయు" మని సూర్యుడనెను. మనువు బ్రహ్మపదమ్మున కేగి విన్నవించెను. బ్రహ్మ భర తులను భారతవర్షమునకు మనువుతో పంపెను. భరతు లయోధ్యజేరి సకల ప్రయోగములనరించి మనుశ్రమమును బోగొట్టిరి. భరతశిష్యులు దేశదేశమున నరేంద్రులకు వినోదము కూర్చిరి. మనుప్రార్థనమున భరతులు నాట్యవేదసంగ్ర హము కూర్చిరి. అది షట్సహస్రశ్లోకపరిమిత మయినది. ఈ గ్రంథము రాజ వినోదమున కవతరించినది. మహీభారవిశ్రాంతులకు సుఖప్రదమయినది. ఇది యిచటి కథ.

నాట్యవేద మొక సంగీతశాస్త్రము. దీని స్వరూపకర్మలు ప్రతిపాది తము అగును. సూత్రధార నట నటీ పారిపార్శ్వక కుశీలవ విదూషకులు నాట్య కర్మలో నుపయోగింతురు. నాట్యకర్మప్రయోక్తను శైలూష భరత భావ నట పదములతో వ్యవహరింతురు సూత్రధారునకు విశిష్టస్వరూపమున్నది. తదను

యాయులందరు విశిష్టులుగా నుందురు. సుఖభోగులగు రాజులకు వీరందరు నాట్యప్రయోక్తలుగా నుందురు. రాజును పరివారమును బాగుగా తెలిసి ప్రయోగింపవలెను. మహిషి మహాదేవి భోగిని ఆశ్రిత కాముక శిల్పకారిక పరిచారిక శయ్యాపాలి ఛత్రపాలి చామరధారిణి సంవాహిక గంధయోక్త్రి మాల్యయోజిక ఆభరణయోజిక అనువారు రాజపరివారము. ఇంకను నానాకక్ష్యాంతరములలో నుండు వారిని దెలియవలయును. ఇంకను ప్రతీకావాయిని వేత్రధారిణి ఖడ్గధారిణి ఆహ్వాయిక ప్రేక్షణిక యామినిక లనువారు సంచారికలు. అనుచారికలు సర్వావస్థలలో రాజు ననుసరించి యుందురు మహత్తరి ప్రతీహారి వృద్ధ ఆయుక్తిక కంచుకి వర్షవర కిరాత కుబ్జ వామన ఔపస్థాయిక నిర్ముండ అభ్యాగార మూకజను లంతఃపురచరులు. వీరందరి స్వరూపపరిజ్ఞానము సావధానముగా సంపాదింపదగియున్నది. వీరి భావము గుర్తించి నటు డభినయింపవలెను.

రాజు సేనాపతి యువరాజు పురోహితుడు ప్రాశ్నికులు ప్రాడ్వివాకులు ఆయుక్తులు సచివులు సభాసదులుగా నుండవలయువారు. సదస్యుల స్వభావము భావనీయము. వైతాళికులు వందులు నాందీమంగలపాఠకులు సూతులు మాగధులు సదస్యులుగా నుండవలెను ఇట్లు వీరినందరి గుర్తించి ప్రయోగింప వలెను. నటుడు గాంభీర్యౌదార్యసంపన్నుడై రాజువలె నుండవలెను. రాజోపచారమును యథారసముగా ప్రయోగింపవలెను.

సపరివారముగా రాజు, కుశీలవులతో భరతులు రంగమంటపమున నుందురు. చతురశ్రము త్ర్యశ్రము వృత్తమనని రంగమంటపము త్రివిధము. వృత్తములో యోగ్యులయిన పౌరజానపదులుందురు. సంగీతము ప్రవర్తించును. చతురశ్రములో వారకన్య లమాత్యులు సుహృత్సుతులు సంగీతము విందురు. త్ర్యశ్రములో ఋత్విక్పురోహితాచార్యు లంతఃపురికాజనులు రాజమహిషి యుందురు. చతురశ్రమున మార్గదేశిసంగీతము వృత్తమున చిత్రసంగీత మాయోజ్యము. నాట్యము శుద్ధమని, నృత్యము చిత్రమని గ్రాహ్యము. ఒకటి వాక్యార్థరూపము, వేరొకటి పదార్థరూపము. నృత్యము నృత్తము మార్గదేశిభేదమున నున్నవి. ఈ రెండును మధుర ముద్ధతమగును. మధురము లాస్యము ఉద్ధతము తాండవము. ఈ సర్వము గీతవాద్యోభయాన్వయమున త్రివిధమగును. సుకుమారప్రయోగము లాస్యము. శృంఖల లత పిండి భేద్యము అను భేదములున్నవి. లతాలాస్యమునకు రాసక మని పేరు. ఇది మూడువిధములు – దండరాసకము

మండలరాసకము నాట్యరాసకము శృంఖల భేద్యకము పదివిధములు. గేయపదాదిలాస్యాంగము లిందుండును. పిండీబంధమున నానాభేదములు కలవు. భావభేదమున లాస్యభేదము కలుగును. నియమహీనము దేశరుచిప్రవర్తితము గుండలీనృత్త మందురు. ఇది దేశములలో ననేకవిధముల నుండును. శుద్ధము చిత్రము మిశ్రము నను భేదమున నిది మూడువిధములు. నాట్యనృత్యనృత్తములు బృందహీనము లయినచో శోభింపవు కావున బృందకల్పన మావశ్యకము. నటనర్తకగాయకవాదకులు కూడి యుండుట బృంద మందురు. అభ్యంతర బృందము స్త్రీబృందము. బాహ్యబృందము పురుషబృందము. ఇందు జ్యేష్ఠ మధ్య కనిష్ఠ భేదములున్నవి. తాండవము చండము ప్రచండము ఉచ్చండము నగును. ఈమూడును గీతవాద్యోభయాన్వయమున మూడువిధము లగును. దేశ్యచ్యాసారమున దేశితాండవమును గలదు. దీనిని రూపకములలో నుపయోగింపరాదు. బృంద ముత్తమోత్తమ ఉత్తమ మధ్యమోత్తమ మధ్య కనిష్ఠ భేదమున నైదు విధముల నున్నది. ఇట్టిబృందము లందుండవలయు వారి సంఖ్యా నియమము పాలనీయము. కాకున్న కోలాహల మగును.

ధ్రువాగానములను రసాభినయసిద్ధికై ప్రయోగింపవలెను. ప్రావేశికి ఆక్షేపకి ప్రాసాదికి అంతర నైష్క్రామికి యనునవి ధ్రువాభేదములు. ఇంక నిందు జాత్యాదివికల్పములు కలవు. ధ్రువాగానములలో శౌరసేనీభాష నియత మయినది. దివ్యులకు సంస్కృతధ్రువ, ద్విజమహీపులకు సంస్కృతధ్రువ యుక్తము. నాట్యకోవిదు లుపమేయగుణములను గుర్తించి ఉపమానములను ప్రయోగింపవలెను. ఇందలి విశేషములను సావధానముగా గుర్తింపవలెను. కావ్యబంధమున రసభావముల తాదాత్మ్యమును భావింపదగును. తత్తద్భావవిశేషమున భావమున వాక్యార్థమగును. కేవలము రసమె వాక్యార్థమగుట కాదు. గుణమలంకారములును వాక్యార్థ మగును. మహాకవులగ్రంథములలో నీ విశేషములు కలవు. వీని ధ్వనిరూపతయు ప్రదర్శిత మయినది.

నటుడు తత్తద్రీతివిజ్ఞానమునకై యాయా దేశములను దెలియవలసి యున్నది భారతవర్షము నవసహస్రయోజనపరిమితముగా నున్నది. కృతయుగమున మానవులు సుఖముగా నుండిరి. త్రేతాద్వాపరములలో హిమాక్రాంతి భయమున పాద పాదము విడిచి దక్షిణాపథ మాశ్రయించిరి. కలియుగము రాగా ద్విసహస్రయోజనముల మేరలో కూడియుండిరి. ఉత్తరాపథములో యత్న

విద్యాధరాదులున్నారు. భారతవర్షమున నాల్గగవభాగమయిన దక్షిణాపథములో నరువదినాలుగు విభాగము లున్నవి. వీరష్టాదశభాషాభేదములతో వ్యవహరింతురు. కొన్నిభాషలు దేశనామములతో నున్నవి. ఈ ద్రవిడ కన్నడాంధ్రాదిభాషలు మ్లేచ్ఛభాషలు. ఆ యా దేశములలో సంగీత మా భాషలతో నున్నది. వీనిలో నారేడుభాషలు నాట్యమున కుపయోగించును. ఇవి నాగరక గ్రామ్య ఉపనాగరక భేదములతో నున్నవి. ఆ యా దేశములలో జనుల యాచారాదులు వేరువేరుగా నున్నవి. ఆ యా ప్రకృతి ననుసరించి నటు డభినయింప వలెను. గీతపాఠ్యాదుల విశ్రామములో నాయా దేశభాషలతో హాసము కూర్పవలెను. శకారాభీరచండాల పులిందశబరహాలికశైరవుల యాచారములు వేరుగా నున్నవి. పరిహాసమునకై వీని ననుసరింపవలెను. అర్థుల కభీష్టమిచ్చునది గోష్ఠి. లోకవిద్విష్ట గోష్ఠిలో నుండ రాదు. త్రివర్గసాధకగోష్ఠి యుక్తము. నాట్యవిత్తముడు గోష్ఠిననుసరించి సభా సదులను సంతోషపెట్టవలెను.

స్వరసాశ్రయ మయిన నాట్య మీ విధముగా నిరూపిత మయినది. మతాంతరప్రవర్తనమున పునరుక్తి నాశ్రయింపవలసి వచ్చినది. శ్రీమదభినవ గుప్తుల మార్గము ననుసరించి శారదాప్రసాదమున నీ ప్రబంధ మిట్లు నిరూపిత మయినది.

"యః కశ్చిదవగంతా చేత్ప్రబంధస్యాస్య తత్త్వతః
స మాననీయో భవతి రాజభిర్భావకోవిదైః".

శ్రీ శారదాతనయ విరచిత

# భావప్రకాశనము

## ప్రథమాధికారము

### భావనిర్ణయము

#### మంగళాచరణము-శ్రీగణేశస్తుతి

ప్రశ్చ్యోతన్మదమంథర భ్రమరికా ఝంకారగీతం ముహుః
హేలా బృంహిత వాదన వ్యతికరం భావోల్లసత్ప్రక్రియం
నృత్యన్నస్తు సుఖాయ వః కరిముఖః పుణ్యోపహారైశ్చిరా
దానందీ నటభావితై రివ యథాభావైః స సామాజికః.

#### భావాలోకము

భావానాం భవ్యభావానాం
భావానాలోక్య భావితః
భావాలోకం విధాస్యామి
స్వస్పంద శ్రీ రసాంచితః.

శ్రీశారదా తనయుడు భావప్రకాశన మను నీ గ్రంథమున నిర్విఘ్న పరిసమాప్తికై ప్రథమముగా సముచితదేవతా సంప్రార్థన మొనరించుట ఈ యారంభ శ్లోకమున నున్నది. గ్రంథారంభమున నిది మంగలాచరణము. ఇందు శ్రీగణేశస్తుతి యున్నది. గజానను డయిన గణేశుడు సుఖసంపాదనమున కవు గావుత. సర్వవిధ విఘ్నదుఃఖ దూరీకరణానంతరమె సుఖమున కగుట యిందు సంభావ్య మగును. నతి స్తుతి యనునవి రెండు నావశ్యకములు. ఇందలి స్తుతి నుతి. ఈ నుతి యందె నతియు నున్నది. నతి నుతి రెండును సంబద్ధములు. నతి శారీరకక్రియ. నుతి వాచికక్రియ. రెండును చిత్తక్రియాసారములు. భావ

భావితము లయిన యీ విశేషము లన్నియు నిందు సంభావనీయములు. నర్తన మొనరించు కరివదనుడు వః = కవి నట సహృదయుల కందరకు సుఖసంపత్తి కగు గావుత మని యాశీఃప్రార్థనము. గజానన భావుకు లయిన వా రందరు పుణ్యక్రియోపహారము లొనర్పగా నానంది యగు గజవదనుడు సుఖ మాపాదించు గావుత. నటుని నటనక్రియాభావితము లయిన భావసంపదలచే నానంది యగు సామాజికుడు వలె గణేశుడు సుఖానందసంధాత యగు గావుత. నటుడభినయపాటవమున ప్రదర్శించిన భావవిశేషముల విభావనమున సహృదయు సామాజికుడు స్వానంద సముల్లాసము కలవాడై సంతుష్టు డగుట సర్వసమ్మోద హేతువు. పుణ్యోపహారానంది యగు గణేశుడు అవిఘ్నముగా నానంద సందోహ సంధాయకుడు నగును.

నర్తన మొనరించు గణేశ సంప్రార్థన మిందు గలదు. గీత వాద్య నృత్తము లను మూడింటి సంమేలన మిందు భావనీయము. కరివదనుని గండముల నుండి ప్రసరించు మదధారలచే మంథరము లయిన తుమ్మెదలు ఝుంకార మొనర్పగా నా ఝుంకార మిందు గీతముగ నున్నది. నర్తన మొనరించు గజాననుడు హేలా ప్రాయముగ బృంహిత మొనర్పగా నది వాదనవ్యతికరము కూర్చినది. ఇట్లా గజాననన ర్తనమున గీతవాద్యముల మేలనము సంగీత మయినది. ఝుంకార గీత యుక్తముగా బృంహిత వాదన యుక్తముగా నర్తన మొనరించుటయే కాదు. ఆ నర్తనము భావోల్లసత్ప్రక్రియా యుక్తముగ గూడ నున్నది. గీత ప్రక్రియలు గాని నర్తన ప్రక్రియలు గాని వాదనప్రక్రియలు గాని భావోల్లసనముతో నుండుట యుక్తము. ఇట్లు భావోల్లసన మున్ననే యవి రసానంద సంపాదకము లగును. భావోల్లసత్ప్రక్రియా సుందరముగా గీత వాద్య నృత్యముల మేలన మిందు గల దని భావింప వలసి యున్నది. ఈ గ్రంథమున నిర్దిశ్యమానము లగు విషయముల సంబంధము ఈ గజవదనస్తుతి రీతిలోనుండుటచే నిది యౌచిత్యశోభిత మని సంభావింప వచ్చును. నాట్యసంప్రదాయమున గజానన నర్తన విధానమును గలదు. కావున నృత్య మొనరించు గజానన స్తవ మిందు సముచితము.

వందే బృందావనచరం గోవిందం గోపికాపతిం
గాః పాలయంతం గాయంతం వేణునా షడ్జవాదినా. 2

ఇందు గోవిందవందన మున్నది. షడ్జస్వరము పలుకు వేణువుతో గాన మొనరించుచు గోవులను పాలించుచు బృందావనమున సంచరించు గోపికాపతి

గోవిందు నభివందన మొనరింతును. ఇందిట్లు గోవిందవర్ణనము రాసలీలా విలాస మును సూచించు చున్నది శ్రీకృష్ణుడు బృందావన విహారియై మధుర మంజుల ముగా మోహన మురళి ప్రయోగించు సమయమున గోవులు గోవత్సములు తమ తమ పనులు మాని కృష్ణు పరివేష్టించి యున్నవి. గో గోవత్సముల నీ విధమున గూడ కృష్ణుడు పాలించు చున్నా డని భావము. వేణునాదాకృష్ట లయిన గోపి కలు పతులను సుతులను హితులను వీడి కృష్ణు జేరి రసమత్తులై మధురభావమున నతని పతిగా భావించిరి. గోపీ గోపీ మధ్యమున కృష్ణుడు బహురూపుడై రాస క్రీడా మహోరాసము నిర్వహించెను. ఇట్లాతడు గోపికాపతియై విహరించెను. ఈ గ్రంథమున రాసనృత్తము నిరూపితము కానున్నది కావున గోవిందుడును వంద నీయుడు.

అంబికా రసికాపాంగ మావిస్మిత ముఖాంబుజం
భజే భుజంగలలితం మహో వైయాఘ్రచర్మిణం. 3

వ్యాఘ్రచర్మధారి యగు మహాశివుని భుజంగలలిత మయిన తేజోభజన మిం దున్నది. నాట్యసంప్రదాయము లనేకములు కలవు. అందు సదాశివసంప్ర దాయము ఉమామహేశసంప్రదాయము గౌరీసంప్రదాయము మొదలగునవి కలవు. వానిని స్ఫురింప జేయుటకై యిందు పరమేశ్వరీ సహిత పరమేశ్వర తేజోభజన మున్నది. ఆ మహాదేవుని మహామహస్సు అంబికాదేవి — ఉమాదేవి యొక్క రసరాగాభివ్యంజక మయిన అపాంగసంవలితమై యున్నది. దేవి యపాంగ రింగణముల జూచి శివు డావిస్మితముఖాంబుజు డయినాడు. శివదర్శన మున శివాదేవి, శివాదేవీదర్శనమున శివదేవుడు రాగరంజితు లగుట యిం దభ్యూహ్యము. అపాంగప్రసారము దేవి భావానుభావము. ముఖవికసమును దేవి రాగానుభావము, దేవానుభావమును. శివదేహమున వలయిత భుజంగము లున్నవి. ఆ భుజంగములచే నా మహస్సు లలిత మనుట. ఆ వక్రసర్పముల యవక్రభావమును నిర్విషత్వమును స్వాత్మధన్యతారీతిని సూచించును. శివుని తాండవము దేవి లాస్యము ఈ గ్రంథమున సూచిత మగును. తత్సూచకముగ నిది యున్నది.

నమామి మానసోల్లాస భావనా ఫలదాయినీం
శారదాం శారదాంభోజవిశదా మభయప్రదాం. 4

శారదాతనయు డయిన ఈ గ్రంథకర్త స్వాభీష్ట శారదాదేవీ నతి నిందు సముచితముగ నిరూపించుట భావనీయము. శ్రీ శారద శారదాంభోజ

విశద. శరత్కాలమున సంఫుల్ల మయిన పద్మము వలె విశద. స్వచ్ఛస్వభావ అభయప్రద. మానసోల్లాసమున భావనా ఫల ప్రదాయిని. గ్రంథరచనానుకూలము లయిన మనఃప్రవృత్తుల నుల్లసింప జేసి నానావిధము లగు భావనల నుత్పాదింప జేసి తత్ఫలప్రద యగు శ్రీ శారదాదేవికి నమస్కరింతును. వేద గాయత్రీ మంత్రానుగత మయిన మహార్థము నిందు భావింప వలెను. సర్వ ధీ వృత్తి ప్రచోదన మిచ్చు సవిత తేజ ముపాసించుట గాయత్రీభావము. ఇందు నది యున్నది. అదియె మానసోల్లాస భావనా ఫల దాయినీ పదమున సూచితము. ప్రకృత గ్రంథరచనమునకు వలసిన మానసోల్లాసమును భావనావివేకమును శ్రీ వాగ్దేవి ప్రసాదింపగా సర్వము సంసిద్ధ మగుటను శారదాతనయుడు భావించు చున్నాడు.

## వంశవర్ణనము

ఆర్యావర్తాహ్వయే దేశే స్థితో జనపదో మహాన్
మేరూత్తర ఇతి ఖ్యాత స్తస్య దక్షిణ భాగతః. 5

గ్రామో మాఠరపూజ్యాఖ్యో ద్విజ సాహస్ర సమ్మితః
తత్ర లక్ష్మణనామాసీద్విప్రః కాశ్యప వంశజః. 6

త్రింశతా క్రతుభిర్విష్ణుం తోషయామాస వేదవిత్
వేదానాం భాష్యమకరోన్నామ్నా యో వేదభూషణం. 7

తస్య శ్రీకృష్ణనామాసీత్పుత్రః కృష్ణ ఇవాపరః
వేదానధీత్య నిఖిలాన్ శాస్త్రాణ్యప్యఖిలాని చ. 8

స పుత్రార్థీ మహాదేవం వారాణస్యామతోషయత్
తస్యాసీద్భట్టగోపాలనామా సూనుః సులోచనః. 9

అష్టాదశసు విద్యాసు బహుశః స కృతశ్రమః
ఉపాస్య శారదాం దేవీం పుత్రం లేభే గుణోత్తరం. 10

మంగలాచరణానంతరము శ్రీ శారదాతనయుడు తన జన్మభూమిని పితృపరంపర నిందు నిర్దేశించు చున్నాడు. ఆర్యావర్తదేశమున సర్వసమృద్ధ మయిన గొప్ప జనపదము కలదు. మేరూత్తరము అను నామమున నది ప్రఖ్యాత మయినది. దానికి దక్షిణభాగముగా మాఠరపూజ్య మని ప్రఖ్యాత మయిన గ్రామము కలదు. అది ద్విజ సాహస్ర సమ్మితము. అందు వేయిమంది బ్రాహ్మణు

లున్నారు. ఆ బ్రాహ్మణులలో కాశ్యప వంశ సంజాతు డయిన లక్ష్మణాఖ్యు డొక విప్రుడు కలడు. అతడు వేదవిదుడు. ముప్పది క్రతువు లొనరించి విష్ణు దేవుని సంతుష్టు నొనరించెను. వేదభూషణ మను పేరిట వేదముల కాతడు భాష్యము రచించెను. అతనికి శ్రీకృష్ణు డను పుత్రుడు కలిగెను. ఆ శ్రీకృష్ణుడు అపరకృష్ణుడు. ఆ శ్రీకృష్ణుడు సర్వవేదముల నధ్యయన మొనరించి నిఖిలశాస్త్రములను వ్యాసంగము చేసి పుత్రార్థియై కాశీపట్టణమున మహాదేవుని సంతుష్టు జేసెను. ఆ కృష్ణునకు భట్టగోపాలుడు సూనుడై జన్మించెను. భట్టగోపాలుడు సులోచనుడు. విజ్ఞాన నేత్ర వికసనము కలవాడు. ఆత డష్టాదశ విద్యలలో బహుపర్యాయములు పరిశ్రమ మొనరించెను. శారదాదేవి నుపాసించెను. గుణోత్తరు డయిన పుత్రుని పొందెను. ఆ పుత్రుడె యీ శారదాతనయుడు. ఇట్లు గ్రంథకర్త వంశపరంపర పాండిత్యసంస్కారవిశేషమున సుప్రసిద్ధ మయినది.

## కృత్యవతరణము

తమాహ్వాయత్పితా ప్రీతః శారదాతనయాఖ్యయా
అధీతవేదవేదాంగో వర్ధమానః పితుర్గృహే. 11

కదాచిచ్ఛారదాం దేవీముపాసితుముపాయయా
ఉపాస్య స వనం తస్యాశ్చైత్రయాత్రా మహోత్సవే 12

ఆసీనాం నర్తనాగారే తాం దేవీం ప్రేక్షకైస్సహ
ప్రణమ్య తైరనుజ్ఞాతస్తస్యాః పార్శ్వ ఉపావిశత్. 13

త్రింశత్ప్రకారభిన్నాని రూపకాణి పృథక్పృథక్
నటైః ప్రయుజ్యమానాని భావాభినయ కోవిదైః. 14

దృష్ట్వా స దేవీం వరదాం నాట్యవేదమయాచత
నాట్యశాలాపతిః కశ్చిద్దివాకర ఇతి ద్విజః
తద్దైవ నాట్యవేదస్య నియుక్తోఽధ్యాపనే తదా. 15

భట్టగోపాలుడు శారదాదేవి యనుగ్రహమున జన్మించిన కుమారుని చూచి సంతుష్టుడై శారదాతనయ నామమున పిలచెను. ఆతడె శారదాతనయుడు. ఆతడు తండ్రి గృహమునందె వేద వేదాంగముల నధ్యయన మొనరించెను. ఒకప్పుడు శారదాదేవి నుపాసించుట కేగెను. చైత్రయాత్రా మహోత్స

వమున శారదాయోగ ముపాసించెను. అప్పు డచట నర్తనాగారమున ప్రేక్షకులతో ఛాటుగా నుపవిష్టు రాలయిన దేవిని చూచి నమస్కరించి యచటి వారి యనుజ్ఞానుసారమున దేవీపార్శ్వముననె యుపవిష్టు డయ్యెను. అప్పుడు ముప్పది విధముల నున్న రూపకమును వేరు వేరుగా నటులు ప్రదర్శించుటను శారదాతనయుడు చూచెను. భావాభినయకోవిదు లయిన నటులు ప్రయోగించుటను దర్శించెను. అట్లు చూచి వరదాయిని యయిన దేవిని నాట్యవేద మను గ్రహింపు మని కోరెను. అచట నాట్యశాలాపతి దివాకరు డను ద్విజుడు కలడు. శారదాదేవి యా దివాకరుని శారదాతనయునకు నాట్యవేదాధ్యాపన మున నియమించినది. అట్లు నియుక్తు డయిన దివాకరుడు శారదాతనయునకు నిఖల నాట్యవేదము నధ్యాపనము చేసెను. నాట్యవిద్య సాంప్రదాయకముగా స్వీకరింప దగిన దని యిందు స్పష్టమగును. దేవియె యిట్లు నాట్యవిద్యోపదేశ సంప్రదాయమును ప్రవర్తింప జేయుటచే శారదాతనయు డట్లు సాంప్రదాయకముగా విద్యావిశేషము గుర్తించి యీ భావప్రకాశనమున నిబంధించుటచే నిది యవశ్యోపాదేయ మని భాసించు చున్నది. నాట్యవిద్యా దేశికుడు సాంప్రదాయక విద్యాప్రఖ్యాతి కలవాడు. ఉపదేశము పొంది నిరూపించు శారదాతనయుడును విశిష్టుడు. గ్రంథము విశిష్టము.

ప్రీతస్సోపి సదాశివస్య శివయో ర్గౌర్యా మతం వాసుకే
ర్వాగ్దేవ్యా అపి నారదస్య చ మునేః కుంభోద్భవ వ్యాసయోః
శిష్యాణాం భరతస్య యాని చ మతాన్యధ్యాప్య తాన్యంజనా
సూనోరప్యథ నాట్యవేద మఖిలం సమ్యక్త మధ్యాపయత్. 16

నాట్యశాలాపతి నాట్యగురు వయిన ఆ దివాకరుడు శారదాతనయునకా నాట్యవేదము సర్వము సమ్యగధ్యాపనము చేసెను. శారదాతనయు నధ్యాపింప జేసెను. ఈ శారదాతనయుడు (శ్రీ) శారదా దేవీ దత్తుడని దివాకరుడు సంప్రీతుడై నానానాట్యమతముల నధ్యయన మొనరింప జేసి సర్వ నాట్యవేద ముపదేశించెను. వేద మభ్యసించుటను అధ్యయన మందురు. నాట్యవేదము వేద మయినందున వేదముగా నధ్యయనింప జేసెను. నాట్యవేదాధ్యయన మొనరించుట కనేకవిధము లయిన నాట్యవిద్యా సంప్రదాయములను గుర్తింప వలసి యున్నది. అవి యన్నియు దివాకర గురువునకు పరిచితములు. ఆ నాట్య సంప్రదాయముల కన్న భరత నాట్యవేద సంప్రదాయమున విశేష మున్న దని దివాకరుడు గుర్తించి వాని నన్నింటిని శారదాతనయునకు ప్రబోధించి నాట్య

వేద ముపదేశించెను. ఆ నాట్యసంప్రదాయ మతము లిందు కొన్ని నామోల్లేఖ మున నిరూపితము లయినవి. ఇందు నిరూపితములు కానివి యింకను గొన్ని కలవు. వానిని గూడ దివాకరుడు బోధించెను.

సదాశివ-పార్వతీపరమేశ్వర-గౌరీదేవి-
వాసుకి-వాగ్దేవి-నారదముని-అగస్త్య-
వ్యాస-ఆంజనేయ సంప్రదాయములు

ఇచట సూచితము లయినవి. భరతశిష్యులు వంద మంది కలరు. వారును భరతానంతరము కతిపయ నాట్య మతముల నావిష్కరించి యుందురు. ఇట్లన్నిటిని బోధించి సర్వసంపూర్ణ మయిన భరత నాట్యవేదమును శారదాతన యున కుపదేశించెను.

శారదాతనయో దేవ్యాస్తాన్యధీత్య చ సన్నిధౌ
ఆదాయ సారమేతేభ్యో హితార్థం నాట్యవేదినాం. 17
భా వ ప్ర కా శ నం నామ ప్రబంధ మకరోత్తదా

దేవీసన్నిధిలో శారదాతనయుడు దివాకరు డుపదేశించిన వాని నన్నిటి నధ్యయన మొనరించి వాని నుండి సారము సంగ్రహించి నాట్యవేద విదుల హితసంపాదనమునకై భా వ ప్ర కా శ న మను నీ ప్రబంధమును నిర్మించెను. ఆ యా మతము లం దా యా సంప్రదాయములె యున్నవి. ఒక మత సమ్మితము వేరొక మతమున లేదు. ఇం దన్నియు నున్నవి. కాని సారసంగ్రహ రూపమున నున్నవి. అవిరోధమున గ్రాహ్యము లగు విశేషము లన్నియు నిం దున్నవి. కావున నీ భావప్రకాశన గ్రంథ మవశ్యోపాదేయమని భావము.

## ప్రకృత గ్రంథ ప్రతిపాద్య ప్రతిజ్ఞా

ఏతస్మిన్ ప్రథమం భావాస్తస్య భేదాస్తతః పరం. 18
తదవాంతరభేదాశ్చ తత్తత్కార్యేషు కౌశలం
తత్సాధ్యోఽర్థస్తథా తేషాముపకార్యోపకారితా. 19
రసోపాదానతా తేషాం చరస్థిర విభాగతః
తద్దర్శనాని తద్దృష్టిః దృష్టిధర్మాః పృథగ్విధాః. 20
పరస్పరస్య సామర్థ్యం సాహచర్యాత్క్వచిత్క్వచిత్
ఇతి భాగతయా భావా ద్వాదశైతే తతో రసః. 21

తద్భేదా భేదభేదాశ్చ తేషాం జన్మ చ నామ చ
జనకత్వం చ జన్యత్వం తేషామన్యోన్యతః పృథక్. 22

ప్రధానేతరభావశ్చ తేషామన్యోన్య సంకరః
తన్మేలనం చ తత్సిద్ధిర్విశేషః సంకరోద్భవః. 23

తద్వ్యాంగ్యతా వాచ్యతా చ తన్మైత్రీ తద్విరోధతా
తత్కాలనియమ స్తత్తద్వర్ణా స్తద్దైవతాని చ. 24

స్థాయిసంచారిభేదాశ్చ తేషాం తద్దృష్టయోఽపి చ
ఇతి వింశతిరుద్దిష్టాః ప్రకారా రసగామినః. 25

తతశ్శబ్దార్థసంబంధ స్తత్ప్రకారాః పృథగ్విధాః
తద్వృత్తయో రూపకాణి తద్భేదాస్త్రింశదాత్మకాః. 26

ఏతై రర్థైః ప్రబంధోఽయం యథావత్కథ్యతేఽధునా
కథ్యంతే యేఽన్తరా భావా స్తత్తదర్థానుషంగిణః. 27
తత్ర తత్రైవ విజ్ఞేయా స్తే సూక్ష్మేక్షికయా బుధైః

భావప్రకాశన మను నీ గ్రంథమున ప్రతిపాదింప దలచిన విషయముల ప్రతిజ్ఞాన మీ ప్రఘట్టమున నున్నది. ఇది ప్రకృతగ్రంథవిషయ సూచికా ప్రాయము. ఇందు మొదటగా భావారంభము లయిన భావములు వివేచితము లగును. భావగతము లయిన భేదములు భాగరూపములుగా పండ్రెండు విధముల నిచట నిరూపితము లగును. భావము, భావభేదములు, తదవాంతరభేదములు, తత్తత్కార్యము లందలి కౌశలము, తత్సాధ్య మగు నర్థము, వాని యుపకార్యోపకారిత, చరస్థిరవిభాగానుసారమున వాని రసోపాదానత, తద్దర్శనములు, తద్దృష్టి, నానావిధము లగు దృష్టి ధర్మములు, ఒక్కొక్కచో వాని సాహచర్యము వలన పరస్పరసామర్థ్యము భాగాత్మకముగా నిచట నిరూపిత మగును. ఇట్టిది భావ ప్రతిపాదన ప్రక్రియ.

అనంతరము రసగామి విశేషము లిరువది ప్రకారము లిచట నుద్దిష్టము లగును. వాని క్రమరీతి యిట్లున్నది. రసము, తద్భేదములు, భేదభేదములు, వాని జన్మ, వాని నామసంకేతము, వాని జనకత్వము జన్యత్వము, రసముల యన్యోన్య సంబంధముగ వేరుగా నుండుట, ప్రధానేతరభావము, రసముల పరస్పర సంకర రీతి, రసముల మేలనము, రససిద్ధి, సంకరోద్భవమయిన విశేషము, రసముల

వ్యంగ్యత, వాచ్యత, రసమైత్రి, రసవిరోధము, రసముల కాలనియమము, వర్ణములు దైవతములు, వాని స్థాయి సంచారి భేదములు, రసదృష్టులు అను నీ వింశతి ప్రకారములు రసగామ లిందు పరామృష్టము లగును.

వీని యనంతరము శబ్దార్థసంబంధము, పృథగ్విధము లయిన వాని ప్రకారములు, వాని వృత్తులు, రూపకములు, ముప్పది విధములయిన తద్భేదములు నిరూపితములు కాగలవు. ఈ సూచితాంశములతో నీ ప్రబంధము ప్రస్తుతము ప్రతిపాదిత మగును. ఆ యా ప్రసక్తి ననుసరించి తత్తదర్థానుషంగము లగు నవాంతరభావములును నిరూపితము లగును. సూక్ష్మేక్షికానుసారమున విచక్షణు లగు వారు వీని విశేషముల నా యా స్థలములందు గుర్తింప వలెను.

ఉద్దిష్టానామిహార్థానాం లక్షణప్రతిపాదనమ్
యథాక్రమం భవేత్క్వాపి యథౌచిత్యం క్వచిద్భవేత్. 29

ఇం దుద్దిష్టార్థములకు సామాన్యముగా యథాక్రమము లక్షణప్రతిపాదన ముండును. ఒక్కొకస్థలముల క్రమానుసారమున లక్షణప్రతిపాదన ముండదు. ఔచిత్యానుసారమున నుండును. ఇట్టిసూచనానుసారమున నీ ప్రబంధ ముండుట నభిజ్ఞులు భావించునది.

భావసామాన్యలక్షణము భావవిభాగము ప్రస్తుతము నిరూపణార్హము.

భావః స్యాద్భావనం భూతి రథ భావయతీతి వా
పదార్థో వా క్రియా సత్తా వికారో మానసోఽథవా. 30

విభావాశ్చానుభావాశ్చ స్థాయినో వ్యభిచారిణః
సాత్త్వికాశ్చేతి కథ్యంతే భావభేదాశ్చ పంచధా. 31

"భవనం భావనం భావః, భూతిః భావః, భావయతీతి భావః" అను భావ పదవ్యుత్పత్తి యిచట నున్నది. భవనము ఉండుట, భూతి ఉనికి భావ మగును. భావింప జేయునది భావము. ఇది పదార్థము క్రియ సత్త మానసవికారము అను పదములచే వ్యవహరింప దగి యున్నది. ఇట్టి యీ భావమున నయిదు భేదము లున్నవి. విభావములు అనుభావములు స్థాయిభావములు వ్యభిచారిభావములు సాత్త్వికభావములు నని భావభేదములు వ్యపదేశింప దగి యున్నది.

ఇక వీని స్వరూపము సంకేతిత మగును.

## విభావాదిలక్షణమ్

అర్థాన్విభావయంతీతి విభావాః పరికీర్తితాః
విభావితార్థానుభూతిరనుభావ ఇతి స్మృతః. 32

అవస్థితాశ్చిరం చిత్తే సంబంధాచ్చానుబంధిభిః
వర్ధితా యే రసాత్మానస్తే స్మృతాః స్థాయినో బుధైః. 33

అనవస్థితజన్మానో భూయో భూయః స్వభావతః
స్థాయినా రసనిష్పత్తౌ చరంతో వ్యభిచారిణః. 34

సత్త్వజా యే వికారాః స్యుః స్వీయాస్వీయ విభాగతః
త ఏవ సాత్త్వికా భావా ఇతి విద్వద్భిరుచ్యతే. 35

చిత్తావస్థాపితము లయిన రత్యాదిభావార్థములను విశేషముగా భావింప జేయునవి విభావము లగు నని యనిరి. అట్లు విభావితము లయిన భావార్థముల యనుభూతి అనుభావ మని కీర్తితము. స్థాయిభావము లను నవి రసాత్మకములు. అవి చిత్తమున చిరకాలముగా నవస్థితములై అనుబంధముతో నుండు వాని సంబంధమున వృద్ధిపొంది రసాత్మకము లగును. రసాత్మతాయోగ్యత కల చిత్త భావములు స్థాయిభావము లగు నని బుధులు భావించిరి. వ్యభిచారిభావము లను నవి "యనవస్థిత జన్మానః" అస్థిరజన్మముతో నుండును. స్వభావసహజముగనె యవి మఱల మఱల పుట్టుచు గిట్టుచు నుండును. రసనిష్పత్తి సమయమున స్థాయిభావముతో సహభావమున సంచరించునవిగా నుండును. ఇట్టి వానిని వ్యభిచారిభావము లందురు. సాత్త్వికభావములు సత్త్వజన్యములు. సత్త్వజన్యము లయిన వికారములను సాత్త్వికము లందురు. ఇవి స్వీయములు పరకీయములు నను విభాగమున భాసించు చుండును. ఇట్లిది విభావాదుల సంక్షిప్తరూపము.

శృంగారాది రసములకు సంబంధించిన విభావాదుల నామ స్వరూప కథన మిక ప్రసంగప్రాప్తము.

లలితా లలితాభాసాః స్థిరాశ్చిత్రాః ఖరా ఇతి
రూక్షాశ్చ నిందితాశ్చైవ వికృతాశ్చేతి చ క్రమాత్. 36

శృంగారాది రసానాం తే విభావా నామభిః స్మృతాః
లలితా లలితాభాసా భావాః శృంగార హాస్యయోః. 37

స్థిరాః చిత్రా విభావా యే తే వీరాద్భుతయోః క్రమాత్
ఖరా రూక్షా విభావాః స్యుః రౌద్రస్య కరుణస్య చ. 38

భయానకస్య వికృతా బీభత్సస్య చ నిందితాః
ఏకేన వాథ ద్వాభ్యాం వా త్రిభిర్భావాంతరై రపి. 39

సంసృష్టాశ్చేద్రసోత్కర్షే త ఏవోద్దీపనాః స్మృతాః

ఆ యా రసోద్దేశమున విభావములకు లలితాదిసంజ్ఞలు కలవు వాని నీ తాలికానుసారమున గుర్తింప వచ్చును.

1. శృంగారవిభావములు లలితములు
2. హాస్యవిభావములు లలితాభాసములు
3. వీరవిభావములు స్థిరములు
4. అద్భుతవిభావములు చిత్రములు
5. రౌద్రవిభావములు ఖరములు
6. కరుణవిభావములు రూక్షములు
7. భయానకవిభావములు వికృతములు
8. బీభత్సవిభావములు నిందితములు

విభావములలో నుద్దీపనవిభావము లున్నవి. ఒక భావమున గాని భావద్వయమున గాని భావత్రయమున గాని యీ నిరూపితము లయిన విభావములు సంసృష్టము లగు నేని యవి రసోత్కర్షమున సంగతములై యుద్దీపనవిభావము లగునని భావవిదులు సూచించిరి.

ఇక లలితాదివిభావముల స్వరూపనిరూపణ మావశ్యకము.

యే మనోహ్లాదజననా స్తత్తదింద్రియగోచరాః. 40

లలితాస్తే విభావాః స్యుః శృంగారోత్కర్ష హేతవః
సంసూచితాః శ్రుతా దృష్టాః స్మృతా యే హాసకారిణః. 41

తే భావా లలితాభాసాః హాస్యసంపత్ప్రకాశకాః
శ్రుతా దృష్టాః స్మృతా ధ్యాతా భవంతి స్థైర్యహేతవః. 42

తే స్థిరా ఇతి విజ్ఞేయా వీరాఖ్య రస పోషకాః
సదానుభూయమానా యే హృది వై చిత్ర్యకారిణః. 43

భావాశ్చిత్రా ఇతి జ్ఞేయాస్తేఽద్భుతైశ్వర్యభావకాః
స్వగోచరైశ్చ విషయైః క్లిశ్యంతేఽక్షాణి తత్క్షణాత్. 44

తే రూక్షా ఇతి కథ్యంతే కరుణోత్పత్తికారకాః
గృహీతమాత్రా మనసః కాతరోత్పాదన క్షమాః. 45

యే భావాస్తే ఖరాః ఖ్యాతాః రౌద్రోత్కర్షా వివర్ధనాః
అక్షిణీ ద్రాఙ్నిమీలంతి యేభ్యో న స్పృహయాంతి చ. 46

తే భావా నిందితాఖ్యాః స్యుర్బీభత్సోల్లాసకారకాః
విషయాస్త్వింద్రియైః స్పృష్టాః వికృతిం జనయంతి యే. 47

తే భావా వికృతాః ఖ్యాతాః భయానక విభావకాః

1. లలితములు: ఆ యా చక్షురాదీంద్రియములకు గోచరించినవై మానసమున కాహ్లాదము కలిగించు విభావములు లలితము లగును. ఇవి శృంగారోత్కర్ష హేతువులు. ఆ యా యింద్రియగోచరము లయి నంతమాత్రమున నింద్రియద్వారమున మనసున కివి యాహ్లాదము కూర్చును. ఇట్టివి లలితవిభావము లనుట సార్థముగ నున్నది. ఇట్లే యితరనామము లందును భావ మన్వేషించునది.

2. లలితాభాసములు: ఏ విభావములు సంసూచితము లయినను శ్రుతము లయినను దృష్టము లయినను సంస్మృతము లయినను హాస మొదవించు నవి యగునో యవి లలితాభాసవిభావము లగును. ఇవి హాస్యసంపదను ప్రకాశింప జేయునవి యగును. లలితములుగా గోచరించు నవి యగుట లలితాభాసము లయినవి.

3. స్థిరములు: శ్రుతములు దృష్టములు స్మృతములు ధ్యాతములు అయినను స్థైర్య మొదవించు విభావములు స్థిరవిభావము లగును. ఇవి వీరరసపోషకము లని తెలియవలెను. స్థిరపదము సార్థకము.

4. చిత్రములు: నిత్య మనుభూయమానము లగు చున్నను హృదయమున వైచిత్ర్య మాపాదించు భావములను చిత్రవిభావము లందురు. ఇవి యద్భుతరసైశ్వర్యమును భావింప జేయునని తెలియ దగును. హృదయమున కివి చిత్రీకృతిని సంపాదించు నవి యగుటచే చిత్రములు.

5. రూక్షములు: ఆ యా యింద్రియములు స్వగోచరము లయిన విషయములచే, ఆ యా యింద్రియవిషయము లయిన పదార్థములచే తత్క్షణము

ననే క్లేశము పొందు నవిగా నుండు నేని, చక్షురాదీంద్రియములకు క్షోభము కలిగిన విధమున ననుభవ ముండునేని యవి రూక్షవిభావము లగును. ఇవి కరుణోత్పత్తి కారకము లని కథితము లయినవి.

6. ఖరములు: గ్రహించినంత మాత్రముననె భావించినంత మాత్రముననె మానసమునకు కాతరత కలిగించుటలో సమర్థములగు భావములు ఖరము లగును. ఖరము లగు విభావములు రౌద్రరసోత్కర్ష వివర్ధనము లని విఖ్యాతము లయినవి.

7. నిందితములు: వేనిని జూడగనె వెంటనే కన్నులు మూసికొనునో యవి నిందితవిభావములు. అట్టి వాని కెప్పుడు నెవ్వరు స్పృహ చూపరు. అవి నిందితములు. అవి బీభత్స రసోల్లాసకారకములు.

8. వికృతములు: ఇంద్రియసంస్పృష్టములయిన విషయములు వికృతి నాపాదించు నవి యయినచో నవి వికృతవిభావము లని విఖ్యాతము లయినవి. ఇవి భయానకరస విభావకము లని ప్రసిద్ధి.

ఇట్లే నిరూపితము లన్నియు రసోత్కర్షమున సంగతము లగు నుద్దీపన విభావముల నిరూపించుట యపేక్షితము.

**ఆలంబనవిభావాః**

అ_తై్రవాలంబనా భావాః కథ్యంతే రసభూమయః. 48

అనుదిష్టా అపి యథా రసానుభవసిద్ధయే
మధురాః సుకుమారాశ్చ రూపయౌవనశాలినః. 49

శృంగారాలంబనా భావాః తన్వంగ్య_స్తరుణాదయః
వ్యంగ్యాశ్చ వికృతాకారాః పరచేష్టానుకారిణః. 50

హాస్యస్యాలంబనా భావాః ప్రాయేణ కుహకాదయః
త్యాగినస్స_త్త్వసంపన్నాః శూరా వీరాః సవిక్రమాః. 51

వీరస్యాలంబనా భావాః శస్త్రాస్త్రక్షతిశోభినః
విచిత్రాకృతివేషాశ్చ విచిత్రాచారవిభ్రమాః. 52

అద్భుతాలంబనా భావా మాయాలీలావిలాసినః
బహుబాహో బహుముఖా భీమదంష్ట్రాః సితాంగకాః. 53

రౌద్రస్యాలంబనా భావాః క్రూరోద్వృత్తశతాదయః
కృశా విషణ్ణా మలినా రోగిణో దుఃఖిన స్తథా. 54

కరుణాలంబనా భావా దారిద్ర్యోపహతాశ్చ యే
నిందితాకృతివేషాశ్చ నింద్యాచారాంగరోగిణః. 55

బీభత్సాలంబనా భావాస్తే పిశాచాదయోపి చ
మహారణ్యప్రవిష్టాశ్చ మహాసంగ్రామచారిణః. 56

భయానకాలంబనాః స్యుః గురురాజాపరాధినః

ఈ ప్రకరణమునసె యాలంబనవిభావములను నిరూపింప వలసి యున్నది. ఆలంబనములు మొదట ననుద్దిష్టము లయినను ఇచట నిరూపింప దగియున్నవి. రసానుభవసిద్ధికై వాని నిరూపింప వలెను. ఆలంబనవిభావములు రసభూములు. రసముల కాశ్రయపీఠములు. ఆ యా రసములకు సంబంధించిన యాలంబనము లీ విధముగా నుండును.

1. శృంగారాలంబనములు: తన్వంగీతరుణాదులు శృంగారమున కాలంబనవిభావములు. అవి మధురములు, సుకుమారములు నగును. రూపమున, యౌవనమున శోభించునవిగా నుండును.

2. హాస్యాలంబనములు : కుహకము మోసము మొదలగునవి యేతదాలంబనములు. సామాన్యముగా కుహకాదులు హాసము కలిగింతురు. హాస్యాలంబనములు వ్యంగములు = వి + అంగ = అంగవిహీనములు. వికృతాకారములు. పరుల చేష్టానుకార మిం దుండును.

3. వీరాలంబనములు: త్యాగులు సత్త్వసంపన్నులు శూరులు వీరులు విక్రమోపేతులు శస్త్రాస్త్రప్రభృతిశోభు లగువారు వీరాలంబనభావముగా నెన్నదగి యుందురు.

4. అద్భుతాలంబనములు: విచిత్రాకృతి, విచిత్రవేషము కలవారు, విచిత్రాచారవిభ్రమము కలవారు, మాయాలీలావిలాసము కలవారు అద్భుతాలంబనభావరూపమున నెన్న దగుదురు.

5. రౌద్రాలంబనములు: బహుబాహువులు బహుముఖులు భీమదంష్ట్రిలు శ్వేతదేహులు క్రూరులు ఉద్వృత్తులు శతాదులు రౌద్రాలంబన భావరూపులు.

6. కరుణాలంబనములు: కృశములు విషణ్ణములు మలినములు రోగముకలవి దుఃఖముకలవి దారిద్ర్యోపహతము లగునవి కరుణాలంబనములు.

7. బీభత్సాలంబనములు: నిందితాకృతి నిందితవేషము కలవారు నింద్యాచారులు నింద్యావయవులు రోగులు పిశాచాదులు బీభత్సాలంబనముగ జెప్పదగి యుందురు.

8. భయానకాలంబనములు: మహారణ్యప్రవిష్టులు మహాసంగ్రామ సంచారులు గురురాజాపరాధమొనరించిన వారు భయానకాలంబనముగానుందురు.

విభావములలో నాలంబనవిభావము లంతరంగములు. ఆలంబనాధారముననె రసప్రసర ముండును. ఉద్దీపనవిభావములు బహిరంగములు. ఉద్బుద్ధము లయిన రత్యాదిభావముల నివి యుద్దీప్తములుగ జేయును.

లలితాద్యా విభావాస్తే భావేష్వాలంబనేష్వమీ. 57
పుష్ణంతి స్థాయినో భావాన్యథాయోగం రసాత్మనా

ఈ నిరూపితము లయిన లలితాదివిభావము లీ యాలంబనవిభావము లందు యథాయోగముగా ననుగతములై స్థాయిభావములను రసానుగతముగా పోషించునవి యగును. లలితాదు లాలంబనసంగతములు కాగా స్థాయిభావమున రసనిష్పత్తి యగు ననుట యిచట భావనీయము.

**అనుభావవిభాగః**

అనుభావశ్చతుర్థా స్యాన్మనోవాక్కాయబుద్ధిభిః. 58
మన ఆరంభానుభావా భావాద్యా దశ యోషితాం
వాగారంభానుభావాశ్చ ద్వాదశాలాపపూర్వకాః. 59
గాత్రారంభానుభావాశ్చ లీలాద్యా దశ యోషితాం
బుద్ధ్యారంభానుభావాశ్చ రీతి వృత్తి ప్రవృత్తయః. 60

అష్టౌ తు సాత్త్వికా భావాస్తేఽపి స్తంభాదయః స్మృతాః
నిర్వేదాద్యాస్త్రయస్త్రింశద్భావాస్తే వ్యభిచారిణః. 61
యౌవనే సత్త్వజాః స్త్రీణాం అలంకారాస్తు వింశతిః
తత్ర లీలాదయో భావా యద్యపి స్యుర్న సాత్త్వికాః. 62
ఛత్రిణాం గతివత్తేపి తల్లింగత్వేన సాత్త్వికాః

ఈ ప్రఘట్టమున అనుభావసాత్త్వికవ్యభిచారుల విభాగము కలదు. మనో వాక్ కాయ బుద్ధుల యనుసారమున ననుభావము నాలుగు విధములు. మానసారంభానుభావములు పది. అవి భావ హావ హేలాదులు. వాగారంభానుభావములు పండ్రెండు. అవి యాలాపాదులు. కాయా (గాత్రా) రంభానుభావములు పది. అవి లీలావిలాసాదులు. మనోవాక్కాయారంభములగు నివి వనితలకు సంబంధించిన భావములు. రీతి వృత్తి ప్రవృత్తు లనునవి బుద్ధ్యారంభానుభావములు. ఇట్లనుభావచాతుర్విధ్యము భావనీయము.

సాత్త్వికభావము లెనిమిది కలవు. అవి స్తంభ స్వేదాదులుగా ప్రసిద్ధములు. వ్యభిచారిభావములు ముప్పదిమూడు కలవు. అవి నిర్వేదము మొదలగునవి. స్త్రీలకు యౌవనమున సత్త్వజన్యము లగు నలంకారము లిరువది కలవు. అవి లీలావిలాసాదులు. ఇవి సాత్త్వికభావములు కావు. అయినను ఛత్రిన్యాయమున తద్రూపసత్త యుండుటచే సాత్త్వికము లని వ్యవహృతము లయినవి. ఒక సమూహములో ఛత్రములు కలవారును ఛత్రములు లేని వారును పోవు చున్నప్పుడు ''గొడుగుల వారు పోవుచున్నారు'' (ఛత్రిణో యాంతి) యందురు. ఆ పదము ఛత్రము లేనివారలకును సూచకము. కావుననె ప్రకృతమున గూడ సాత్త్వికసమూహగతము లయినందున వానిని గూడ సాత్త్వికము లనుట యుపపన్న మయినది.

## గుణత్రయపరిణామః

యత్సత్త్వపరిణామి స్యాద్ద్రవ్యం తన్మన ఉచ్యతే. 63
ఈశ్వరస్య చ ముక్తానాం తత్సంకల్పో భవిష్యతి
సంసారిణాం మనస్త్వేన పరిణమ్య ప్రవర్తతే. 64

తత్సత్త్వ పరిణామిత్వాత్సత్త్వమిత్యుచ్యతే బుధైః
యద్రజః పరిణామి స్యాద్ద్రవ్యం స ప్రాణ ఉచ్యతే. 65

ఈశ్వరస్య చ ముక్తానాం క్రియాహేతుస్స ఈరితః
సంసారిణాం పునరసౌ ప్రాణాకారేణ తిష్ఠతి. 66

య_త్తమఃపరిణామి స్యాద్ద్రవ్యం సా వాగుదాహృతా
ఈశ్వరస్య చ ముక్తానాం సా వాగ్భవతి శోభనా. 67

సంసారిణాం పరిణమేచ్ఛబ్దాకారేణ సా పునః
ఉక్తా క్రోధాదిభిర్భావై_స్తత్ఫలావ్యభిచారిణీ. 68

యా ము_క్తేశ్వరవాగుక్తా సా వాణీత్యుచ్యతే బుధైః

స_త్త్వరజ_స్తమోగుణముల పరిణామమున మనఃప్రాణవాక్కుల సముత్ప_త్తి యిందు నిర్దిష్ట మగును. స_త్త్వగుణపరిణామి యగు ద్రవ్యము మనస్సు. ఈశ్వరునకు ము_క్తజీవులకు నది సంకల్పరూపమున నుండును. ప్రపంచజీవుల కది మనసుగా పరిణమించి ప్రవృ_త్త మగును. ఆ మనస్సు స_త్త్వపరిణామి యగుటచే స_త్త్వ మగునని బుధులు వ్యవహరించిరి. రజఃపరిణామి ద్రవ్యమును ప్రాణ మందురు. అది యీశ్వరునకు ము_క్తజీవులకు క్రియాహేతు వగును. సంసారుల కది ప్రాణాకారమున నుండును. తమఃపరిణామి ద్రవ్యమును వాక్కు అందురు. ఈశ్వరునకు ముక్తులకు నది శోభనవాక్కుగా నుండును. సంసారుల కది శబ్దాకారమున పరిణమించును. క్రోధాదిభావములతో నది కూడినదై తత్ఫలితములతో సంగతముగా నుండును. ము_క్తేశ్వరుల వాక్కునకు వాణి యను వ్యవహారముకలదు. ?

రవిః సోమశ్చ వహ్నిశ్చ తస్య తస్య యథాక్రమం. 69

అధిష్ఠాతార ఇత్యేషా వ్యవస్థా యోగిభిః కృతా
త_త్తద్రూపమధిష్ఠాయ తిష్ఠన్నాత్మా చ తన్మయః. 70

ఏతే మనః ప్రాణ వాచో ముక్తానామీశ్వరస్య చ
కార్యోపకరణాత్మత్వాద్దేవా ఇత్యేవ కీ_ర్తితాః. 71

అంతర్యామీ స ఏవ స్యాద్యః ప్రాణమయ ఉచ్యతే
జీవః శరీరాధిష్ఠాతా తన్నియచ్ఛన్ స్వకర్మభిః. 72

కర్తా భవతి సర్వస్య శరీరేణ సహ స్వయం
కరణాని చ జీవం చ పృథివ్యాద్యాశ్చ దేవతాః. 73

నియచ్ఛన్నప్యధిష్ఠాయ కర్తా ప్రాణమయో భవేత్
అయం నాంతర్గత స్తస్య కర్తుర్జీవస్య న క్వచిత్. 74
మనోమయస్తు జీవానాం కర్మకారయితా భవేత్
బుద్ధిచిత్తాహంకృతయ స్తస్య త్రిగుణసంభవాః. 75
సర్వేషామపి జీవానాం సర్వవ్యాపారహేతవః
ఏతేభ్యః సర్వభావానాం ప్రభవః సముదాహృతః. 76
ఆదిత్యః సర్వసాక్షిత్వాన్మనో య త్తదధిష్ఠితం
యత్సంస్కారవశాద్వేత్తి సర్వం త త్తేన నిర్మలం. 77
తాదృగేవ మనః సత్త్వం గుణైరస్పృష్టముచ్యతే

సూర్యుడు చంద్రుడు అగ్ని అను మూవురు క్రమముగా వాని కధిష్ఠానదేవతలు. యోగు లీ వ్యవస్థను సిద్ధముచేసిరి. ఆత్మ త త్త్వరూపము నధిష్ఠించి తన్మయముగా నుండును. ఈశ్వరునకు ము క్తులకు సంబంధించి యుండు మనః ప్రాణ వాణులు కార్యోపకరణములుగా నుండును గావున దేవపదమున కీర్తితము లగుచున్నవి. ప్రాణమయ జీవు డంతర్యామి. శరీరము నధిష్ఠించి యుండును. తన కర్మలచే నా శరీరమును నియమించుచు సర్వమునకు కర్తయగుచున్నాడు. ఆ శరీరమున నుండి యింద్రియములను జీవుని పృథివ్యాది దేవతలను అధిష్ఠించి యుండి నియమన మొనరించుచు ప్రాణమయరూపమున కర్త యగును. ఈ ప్రాణమయుడు కర్త యగు జీవున కంతర్గతుడు కాడు. మనోమయుడు జీవుల కర్మకారయిత యగును. బుద్ధి చిత్తము అహంకారము నను నవి మనోమయుని గుణత్రయసంభవములు. ఇవి సర్వజీవులకు సర్వవ్యాపారహేతువులుగా నుండును.

వీని వలన సర్వభావములకు సముత్పత్తి కలుగు చున్నది. సూర్యుడు సర్వసాక్షి. మనస్సు తదధిష్ఠిత మగును. తత్సంస్కారవశమున నిర్మల మగు మనస్సు సర్వము తెలియ గలదు. అట్టి మనస్సునకు సత్త్వ మను సంకేత మున్నది. అది గుణములచే సంస్పృష్టము కాదు. ఈ ప్రఘట్టకసారముగా సత్త్వావష్టంభము కల మన స్తత్త్వము గుర్తింప వచ్చును.

**మన ఆరంభానుభావలక్షణమ్**

తస్మాదవికృతాదాద్యః స్పందో భావ ఉదాహృతః. 78

చిత్తస్యావికృతిః సత్త్వం వికృతేః కారణే సతి
తత్రోఽల్పా వికృతిర్భావో బీజస్యాదివికారవత్. 79

అతో మనోవికారస్య భావత్వం ప్రకటీకృతం
వాగ్భిరంగై ర్ముఖరసైః యః సత్త్వాభినయేన చ. 80

భావయన్ బహిరంతస్థాన్ అర్థాన్ భావ ఉదాహృతః

మనోవాక్కాయబుద్ధ్యారంభక మయిన అనుభావ చతుష్టయమున మనస్సమారంభము లయిన యనుభావముల నిట నిరూపించుటయుచితము. అందు మొదట భావనిరూపణము ప్రకృతము. స్త్రీలకు సంబంధించిన భావాదు లిట లక్షితము లగును. భావాదులు మన ఆరంభానుభావములు పది యున్నవి. భావము, హావము, హేల, శోభ, కాంతి, దీప్తి, మాధుర్యము, ప్రాగల్భ్యము, ధైర్యము, ఔదార్యము నని. అందు మొదటి దయిన భావము యొక్క లక్షణ మిట్లున్నది.

1. అవికృత మయిన సత్త్వము వలన గలుగు ఆద్యస్పందము భావ మన దగును. వికృతి కలుగుటకు తగిన కారణ మున్నను చిత్త మవికృతముగా నుండుట సత్త్వము. అందలి యల్ప మగు వికృతి భావ మగును. ఇది బీజ మున కాది వికారము వంటిది. అంకురము కా నున్న బీజ మవికృతముగనె యుండియు కించిదుచ్ఛూనావస్థను పొంది యున్నట్లుగా నున్న యవస్థ నిట భావింప వలెను. అట్టి బీజమునకు సంబంధించిన యాదివికార సదృశముగా నీ భావ ముండును. కావున మనోవికారమునకు భావత్వము ప్రకటీకృత మయి నది. బహిర్గతములు అంతర్గతము లగు నర్థములను భావింప జేయునది భావ మగును. భావములను నాలుగు విధముల భావింపజేయుట యున్నది. వాక్కులచే నంగాభినయములచే ముఖరసములచే సత్త్వాభినయములచే భావభావన ముండును. ''భావయతీతి భావః'' భావింప జేయునది భావము.

## హావాదిలక్షణమ్

హేలా హేతుః సశృంగారో భావాత్కించిత్ప్రకర్షవాన్. 81

సగ్రీవారేచకో హావో నాసాక్షి భ్రూ విలాసకృత్
స ఏవ హావో హేలా స్యాల్లలితాభినయాత్మికా. 82

నానాప్రకారాభివ్యక్త శృంగారాకార సూచికా
రూపోపభోగ తారుణ్యై ర్యోఽలంకారోఽఙ్గసంశ్రయః 83

సా శోభా సైవ కాంతిః స్యాన్మన్మథాప్యాయితా చ్ఛవిః
కాంతిరేవోపభోగేన దేశకాలగుణాదిభిః. 84

ఉద్దీప్యమానా విస్తారం యాతా దీప్తిరితి స్మృతా
సర్వావస్థాసు చేష్టానాం మాధుర్యం మృదుకారితా. 85

నిస్సాధ్వసత్వం ప్రాగల్భ్యం ప్రయోగేషు చ సర్వతః
మానగ్రహో దృఢో యస్తు తద్ధైర్యమితి కథ్యతే. 86

ఔదార్యం ప్రశ్రయః ప్రోక్తః సర్వావస్థానుగో బుధైః
భావో హావశ్చ హేలా చ శోభా కాంతిః సదీప్తికా. 87

ప్రాగల్భ్యం ధైర్యమౌదార్యం మాధుర్యమితి సాత్త్వికాః

భావనిరూపణానంతరము హావాదులను నిరూపింపవలసి యున్నది.

2. హావము: మూడవది యగు హేల కిది హేతువు. శృంగార సహిత మగుట వలన మొదటి భావమున కన్న నిది యొకింత ప్రకర్ష కలది యగును. గ్రీవారేచకముతో కూడియుండును. నాసాక్షిభ్రూవిలాసముల గలుగ జేయును.

3. హేల: హావమె లలితాభినయములు కలదై హేల యగును. ఈ హేల నానావిధములుగా నభివ్యక్తము లయిన శృంగారాకారములను సూచించును. భావ హావ హేలలు మూడును పూర్వపూర్వసంబంధము కలవి యనుట లక్షణమున స్పష్టము.

4, 5. శోభ; కాంతి : రూపోపభోగ తారుణ్యములచే శరీరాశ్రయముగా నుండు నలంకారము శోభాపద వాచ్య మగును. ఆ శోభయె మన్మథ భావాప్యాయిత మయిన ఛవితో నుండు నేని కాంతి యగును. భావ హావ హేలల కున్నట్లు శోభాకాంతులకును సంబంధ మూహ్యము. ఇట్లె యనంతర మున్నవానికిని సంబంధ మభ్యూహ్యము.

6. దీప్తి: కాంతియె యుపభోగముచే దేశకాలగుణాదులచే నుద్దీప్తమై విస్తారము పొందినది యగునేని దీప్తి యగును. వనితల కాంతి యుపభోగాదులచే నుద్దీప్తమగుట ప్రసిద్ధము.

7, 8. మాధుర్యము; ప్రాగల్భ్యము: సర్వావస్థలందును చేష్టలలో మృదుత్వ ముండుట మాధుర్యము. అన్ని యవస్థలందును చేష్టలు మార్దవ సము

పేతము లగుట యని భావము. ప్రయోగము లం దంతటను సాధ్వసముతో లే కుండుట ప్రాగల్భ్యము. తొందరపాటు గాభరా లేకుండగా నిబ్బరపాటుతో నుండుట యని తాత్పర్యము.

9, 10. ధైర్యము: ఔదార్యము; దృఢ మగు నభిమానగ్రహము స్వనిశ్చయమున దార్ఢ్యము ధైర్య మగును. సత్త్వావస్థానుగత మయిన ప్రశ్రయము వినయము ఔదార్యమగును. ఇట్లు భావాదుల స్వరూపమును బుధులు కీర్తించిరి.

ఇతరులు చెప్పిన భావాదుల రూపమున కన్న ఈ గ్రంథము నిరూపించిన రూపము వేరుగా నున్నట్లు గోచరించును. శారదాతనయ దర్శనమున నిట్టివిశేషములు చాల గలవు. వాని నన్నింటిని సమీకరించు కొని సమీక్షించిన భావ ప్రకాశన భావము విశదిత మగును. ఆట్లిచట భావ హావ హేలా శోభా కాంతి దీప్తి ప్రాగల్భ్య ధైర్యౌదార్య మాధుర్యము లను సాత్త్వికములు నిరూపితము లయినవి. ఇవి యన్నియు మానసారంభానుభావములు.

## గాత్రారంభానుభావాః

లీలా విలాసో విచ్ఛిత్తిర్విభ్రమః కిలికించితం. 88

మోట్టాయితం కుట్టమితం బిబ్బోకో లలితం తథా
విహృతం చేతి విజ్ఞేయాః శారీరా దశ యోషితాం. 89

గాత్రారంభానుభావములు స్త్రీలకు సంబంధించినవి పది కలవు. అవి శరీరసముద్భవములు. శారీరములు. కావుననె గాత్రారంభములు వాని నామము లీ విధమున నున్నవి. లీల, విలాసము, విచ్ఛిత్తి, విభ్రమము, కిలికించితము, మోట్టాయితము, కుట్టమితము, బిబ్బోకము, లలితము, విహృతము నను పది గాత్రారంభానుభావములు. వీని లక్షణములు నిరూపితము లగును

మనో మధుర వాగంగ చేష్టితైః ప్రీతియోజితైః
ప్రియానుకరణం లీలా సా స్యాత్పుంసః స్త్రియా అపి. 90

ప్రియసంగమకాలే తు నేత్రభ్రూవక్త్రకర్మణాం
విశేషో యస్స విజ్ఞేయో విలాసోఽంగక్రియాదిషు. 91

స్వల్పోఽప్యనాదరన్యాసో మాల్యాదీనాం స్వమండనే
యః పరాం జనయేత్ శోభాం సా విచ్ఛిత్తిరుదాహృతా. 92

వాగంగసత్త్వాభినయ భూషాస్థానవిపర్యయః
త్వరయా కల్పితోఽభీష్టదర్శనే యః స విభ్రమః. 93

క్రోధాభిలాషహర్షాదేః సంకరః కిలికించితం
ప్రియస్తుతికథాలాప లీలా హేలాది దర్శనే. 94

తద్భావభావనం మోట్టాయితమిత్యుచ్యతే బుధైః
సౌఖ్యోపచారైః సానందాధరకేశగ్రహాదిభిః. 95

దుఃఖోపచారవత్కుర్వేద్వ్యథాహిః కుట్టమితం తు తత్
ఇష్టభావోపగమనే తథాభీష్టస్య దర్శనే. 96

గర్వాదథాభిమానాద్వా బిబ్బోకోఽనాదరక్రియా
సుకుమారోఽంగవిన్యాసః సభ్రూనేత్రాధర క్రియః. 97

అనుల్బణశ్చ మసృణః స్త్రీణాం లలితమీరితం
స్వభావాద్వ్రీడయా వాఽపి ప్రాప్తకాలమనుత్తరం. 98

విహృతం తదితి ప్రాహుః మానేర్ష్యాభ్యామథాపి వా
గాత్రారంభానుభావాంస్తానిమాన్పశ్యంతి సూరయః. 99

1. లీల: మనోమధురములు ప్రీతియోజితములు నయిన వాగంగ చేష్టితములచే ప్రియానుకరణ మొనరించుట లీల యగును. ఈ లీల పురుషున కుండును. వనితకు నుండును. ప్రియ ననుకరించుట ప్రియు ననుకరించుట యథోచితముగ గ్రాహ్యము.

2. విలాసము: ప్రియసంగమ సమయమునందు నేత్ర కర్మవిశేషము భ్రూ కర్మవిశేషము వక్త్ర కర్మవిశేషము విలాస మగును. సంగమ కాలము నందలి యంగక్రియాదులతో ననుగత మగు విశేషము విలాసము.

3. విచ్ఛిత్తి: తన్ను తా నలంకరించుకొనుటలో స్వల్పముగా నయిన ననాదరమున న్యాస ముండునేని, మాల్యము గంధము ముఖరసము మొదలగు వాని యం దాదరము చక్కగా గోచరింప దేని, యదియు సమధిక శోభా సంపాదక మగునేని విచ్ఛిత్తి యగును.

4. విభ్రమము: అభీష్టదర్శన సమయమున తాను త్వరచే కల్పించుకొనిన వాగంగసత్త్వాభినయముల విపర్యయము భూషాస్థానవిపర్యయము విభ్రమ

మగును. ఒక మాటకు వేరొక మాట ఒక చేతకు వేరొక చేత ఒక యభినయమునకు వేరొక యభినయ మున్నచో ధరింపవలయు భూషణవముల నస్థానమున ధరించినచో విభ్రమ మని భావము.

5. కిలికించితము: క్రోధము ఆభిలాషము హర్షము మొదలగు వాని సంకర మున్నచో కిలికించిత మగును. ఒక సమయమునసె విరుద్ధము లగు నవియు నున్నచో వాని సాంకర్యము రమ్యముగ నుండును.

6. మోట్టాయితము: ప్రియుని స్తుతికథాలాపమునను లీలా హేలాది ధర్శనమునను తద్భావభావన మున్నచో మోట్టాయిత మగునని బుధు లనిరి. ప్రియుని కథాకథనము వినగనె తద్భావము భావన మొనరించుట ఆతని లీలా హేలాదులను చూచినను తద్భావభావనమున నుండుట మోట్టాయితము.

7. కుట్టమితము : ప్రియకృతము లయిన యధరగ్రహణ కేశగ్రహణములు సానందముగా సౌఖ్యోపచారములుగా నున్నను దుఃఖోపచారములచే వలె ప్రియురాలు బహిఃకోపము ప్రదర్శించు నది యగునేని కుట్టమిత మగును.

8. బిబ్బోకము: ఇష్టభావప్రాప్తితో నభీష్టదర్శనముతో గర్వమున గాని యభిమానమున గాని యనాదరక్రియ యున్నచో నాదరముగా పరిశీలింప కున్నచో బిబ్బోక మగును.

9. లలితము: భ్రూనేత్రాధర క్రియలతో నున్న సుకుమారాంగ విన్యాసము అనుల్బణముగా మసృణముగా నున్నచో లలిత మగును. సాతిశయముగా నుండక సుస్నిగ్ధముగా నుండుట యిం దపేక్షితము.

10. విహృతము; స్వభావమున గాని లజ్జచే గాని మానమున గాని యీర్ష్యచే గాని సముచితసమయమున సదుత్తర మీ కుండుట విహృత మగును.

ఈ నిరూపించిన వన్నియు గాత్రారంభానుభావము లని సూరివరేణ్యులు సంభావించిరి. ఈ గాత్రారంభానుభావము లన్నియు స్త్రీలకు సంబంధియుండుట సంభావనీయము. పురుషగతము లయిన గాత్రారంభానుభావములు కలవు. అవి శోభాదులు. వాని నిచట భావింప దగును.

### పౌరుష గాత్రారంభానుభావాః

శోభా విలాసో మాధుర్యం గాంభీర్యం ధైర్యమేవ చ
లలితౌదార్య తేజాంసి సత్త్వభేదాస్తు పౌరుషాః. 100
దక్షతా శౌర్యముత్సాహో నీచే కుత్సాఽధికే ముహుః
స్పర్ధాధిక్రియతే యత్ర సా శోభేతి ప్రకీర్తితా. 101
వృషయానం స్మితాలాపో విలాస ఇతి కథ్యతే
మాధుర్యం చేష్టితాలాప స్పర్శానాం స్పృహణీయతా. 102
శుభేఽశుభేఽర్థే తద్ధైర్యం వ్యవసాయాదచాలనం
అవిజ్ఞాతేంగితాకారో భావో గాంభీర్యముచ్యతే. 103
చేష్టితం యస్య శృంగారమయం తల్లలితం భవేత్
ప్రియాలాపస్మితోదారం దానమౌదార్యముచ్యతే. 104
అవమానాసహత్వం యత్తేజస్సముదాహృతం
ఏతే సాధారణాః సత్త్వగాత్రారంభానుభావయోః. 105

పురుషులకు సంబంధించిన సత్త్వభేదములు కొన్ని కలవు. శోభ విలాసము మాధుర్యము గాంభీర్యము ధైర్యము లలితము ఔదార్యము తేజస్సు అను నెనిమిది పౌరుషములు. వీని స్వరూప మీ విధము.

1. శోభ: దక్షత శౌర్యము ఉత్సాహము నీచుని విషయమున నింద అధికుని విషయమున స్పర్ధ కూడి యున్నచో శోభ యను పౌరుషభావ మగును.

2. విలాసము: వృషాదివాహనము లందు సంచార మొనరించుట నవ్వుచు మాటలాడుట విలాసము.

3. మాధుర్యము: చేష్టితము కాని ఆలాపము కాని స్పర్శనము కాని స్పృహణీయముగ నుండుచో మాధుర్య మగును.

4. ధైర్యము: శుభాశుభసమయము లందును తన నిశ్చితము నుండి మార కుండుట ధైర్యము.

5. గాంభీర్యము: ఇంగితాకార మే మాత్రము గోచరము కాకున్నచో మనసు లోని భావము గుర్తింప వలను పడకుండ నున్నచో గాంభీర్య మగును.

6. లలితము: శృంగారమయ మగు చేష్టితము లలిత మగును.

7. ఔదార్యము: ప్రియాలాపము చిరునగవు ఉదారభావము దాన మొనరించుట యున్నచో నౌదార్య మగును.

8. తేజస్సు: అవమానము సహింపకుండుట తేజస్సు.

ఈ నిరూపితములయిన శౌర్యాదులు సత్త్వగాత్రారంభానుభావములతో సాధారణములుగా నుండును. వీనిలో పరిశీలింపదగిన వేరొక విషయము కలదు.

స్థైర్యం గాంభీర్య మాచార్యైః చిత్తారంభా వుదాహృతౌ
ప్రాచుర్య మేషాం శృంగారే వీరాద్భుతసమాగమే. 106

అన్యత్ర తేషాం సంసర్గవశాత్కార్యవశాదపి
భావాస్తు వింశతిః స్త్రీణాః శృంగారే క్వచిదద్భుతే. 107

క్రీడితం కేలిరిత్యేతౌ గాత్రారంభా వుదాహృతౌ
బాల్య యౌవన కౌమార సాధారణ విహారభాక్. 108

విశేషః క్రీడితం కేలిః తదేవ దయితాశ్రయం
గాత్రారంభానుభావత్వే ద్వితయం కథ్యతే బుధైః. 109

స్థైర్యము గాంభీర్యము నను రెండును చిత్తారంభము లని కొందరాచార్యులాభాషించిరి. ఈ నిరూపితము లయిన భావము లన్నియు శృంగారమున ప్రచురముగా నుండును. వీరాద్భుతముల సమాగమము కల శృంగారమున నివి యుండుటను గుర్తింప వలెను. సంసర్గవశమున కార్యవశమున నితరములందు నుండుట గ్రాహ్యము. స్త్రీలకు సంబంధించిన యీ యిరువది భావములు శృంగారము నందుండును. ఒకప్పు డద్భుతము నందునుండును.

క్రీడితము కేలి అను రెండును గాత్రారంభానుభావము లని తదభిజ్ఞులనిరి. బాల్య యౌవన కౌమారము లం దివి సాధారణముగా విహరించు విశేషమును క్రీడిత మందురు. పురుషవిశేష మయినచో క్రీడితము. దయితాశ్రయ మయిన విశేష మయినచో కేలి యగు నని గ్రాహ్యము. ఈ రెండు గాత్రారంభానుభావత్వమున నుండుటను కొందరు బుధులు చెప్పిరి.

### వాగారంభానుభావాః

వాగారంభా ఇమే తేషామాలాపః ప్రథమో భవేత్
ప్రలాపశ్చ విలాపోఽనులాపః సంలాప ఏవ చ. 110

అపలాపశ్చ సందేశోఽతిదేశశ్చాష్టమః స్మృతః
నిర్దేశ ఉపదేశశ్చాపదేశో వ్యపదేశకః. 111

వాగారంభానుభావములు పండ్రెండు కలవు. అందు మొదటిది యాలాపము. ప్రలాపము విలాపము అనులాపము సంలాపము అపలాపము సందేశము తరువాతివి. అతిదేశ మెనిమిదవది. నిర్దేశము ఉపదేశము అపదేశము వ్యపదేశము. ఇక వీని లక్షణము.

ఇదం వో భాగ్య మిత్యాది వాక్య మాలాప ఇష్యతే
ప్రలాపః స్యాత్క్వ యా స్యామి గతిః క్వేత్యాది యద్వచః. 112

విలాపః స్యాదాత్మదుఃఖోద్భావనాతత్పరం వచః
బహుశోఽభిహితం వాక్యమనులాపో భవేదిహ. 113

ఉక్తిప్రత్యుక్తిమద్వాక్యం సల్లాప ఇతి కథ్యతే
పూర్వోక్తస్యాన్యథావాదో హ్యపలాప ఇతీరితః. 113

సందేశః స్యాత్స్వవార్తాభిప్రేషణం విషయాంతరే
అతిదేశస్తదుక్తం యత్తన్మదుక్తమితీరితం. 115

ఏతే వయం క్వ వః కార్యమితి నిర్దేశ ఇష్యతే
ఉపదేశో గృహాణ త్వం గచ్ఛేత్యాది పరం వచః. 116

అన్యార్థకథనం యత్తు సోఽపదేశ ఇతి స్మృతః
వ్యాజాదాత్మాభిలాషోక్తిర్వ్యపదేశ ఇతీరితః. 117

వాగారంభానుభావాస్తే క్రమాద్ద్వాదశ కీర్తితాః

ఇది మీ భాగ్య మను నిట్టి వాక్య మాలాపము. "ఎచటి కేగుదు? ఏమి గతి?" ఇత్యాదికము ప్రలాపము తన దుఃఖోద్భావనపర మగు వచనము విలాపము. నానావిధముల పలికిన వాక్య మనులాపము. ఉక్తి ప్రత్యుక్తి కల వాక్యము సల్లాపము. పూర్వము పలికిన దాని కన్యథా వాద మపలాపము.

స్థలాంతరమునకు తన వార్త పంపుట సందేశము. "అది నేను చెప్పినదే" యను నట్టి మాట అతిదేశము. "మే మిక్కడ నున్నారము. మీ పని

యెచట?'' అనుట నిర్దేశము. ''దీని నందుకొమ్ము. పొమ్ము'' అను రీతి వచనముపదేశము. అన్యార్థము పలుకుట అపదేశము. వ్యాజమున తన యభిలాపము చెప్పుట వ్యపదేశము. ఇట్లే పండ్రెండును వాగారంభానుభావములుగా కీర్తితము లయినవి.

### బుద్ధ్యారంభానుభావాః
### రీతిలక్షణమ్

బుద్ధ్యారంభానుభావేషు రీతిః ప్రథమ ముచ్యతే. 118

రీతిర్వచనవిన్యాసక్రమః సాపి చ తుర్విధా
తత్ర వైదర్భ పాంచాల లాట గౌడ విభాగతః. 119

సౌరాష్ట్రీ ద్రావిడీ చేతి రీతిద్వయ ముదాహృతం
తత్తద్దేశీయరచనా రీతి స్తద్దేశనామభాక్. 120

సమాస సౌకుమార్యాది తారతమ్యాత్క్వచిత్క్వచిత్
ఉపచారవిశేషాచ్చ ప్రాసానుప్రాస భేదతః. 121

తథా సౌరాష్ట్రికా భేదాద్ద్రావిడీ భేదతోఽపి చ
ప్రతివచనం ప్రతిపురుషం తదవాంతరజాతితః ప్రతిప్రీతి. 122

ఆనంత్యాత్సంక్షిప్య ప్రోక్తా కవిభిః చతుర్విధేత్యేషా
తాసు పంచోత్తరశతం విధాః ప్రోక్తా మనీషిభిః. 123

గ్రంథవిస్తరభీతేన మయా తాభ్యో విరమ్యతే
త ఏవాతురవిన్యాసాస్తా ఏవ పదపంక్తయః. 124

పుంసి పుంసి విశేషేణ కాపి కాపి సరస్వతీ
తస్మాచ్చతుర్ధా బోద్ధవ్యా రీతిభేదప్రకల్పనా. 125

బుద్ధ్యారంభానుభావములలో రీతి వృత్తి ప్రవృత్తులు కలవు. అందు మొదట రీతిలక్షణము తద్భేదములు నిచట నిర్దిష్టములు కా గలవు. బుద్ధ్యారంభానుభావములలో మొదట రీతి నిరూపితమగును. రీతి యనునది వచనవిన్యాసక్రమము. ఆ రీతి చతుర్విధము. వైదర్భదేశము పాంచాలదేశము లాటదేశము గౌడదేశ మను దేశవిభాగమున రీతి నాల్గువిధము లయినది. సౌరాష్ట్రిరీతి ద్రావిడీరీతి సౌరాష్ట్రదేశ ద్రావిడదేశ విభాగమున నిర్ణీత మగునని కొందరుదాహరించిరి. ఆ యా దేశీయ మయిన రచనారీతి యా యా దేశనామమును

పొందినది. సమాస తారతమ్యమునను సౌకుమార్యాది తారతమ్యమునను ఉపచార విశేషమునను ప్రాసానుప్రాస విభేదమునను రీతి వేరు వేరుగా నున్నది. అట్లే సౌరాష్ట్రికాభేదమునను ద్రావిడీభేదమునను రీతి భిన్నభిన్న మయినది. ఇట్లు వైవిధ్య ముదయించుట కింకను కారణములు కలవు. ప్రతివచనం ప్రతి పురుషం ప్రతిప్రీతి రీతి వేరు వేరుగా నుండును. వచన వచనమునకు రీతి వేరగును. పురుషునకు రీతి వేరగును. పురుషునకు పురుషునకు రీతి వేరగును. తత్తదవాంతర జాత్యానుసారమునను రీతి వేరగును. ప్రీతికి ప్రీతికి గల వేరుదనమునను రీతి గతి మారును. ఇట్లనంత రీతులు గలుగ వచ్చును. వాని లెక్కించుట శక్యము కాదు. కావున సంక్షేపముగా రీతి చతుర్విధ మని కవులు నిరూపించిరి. నానావిధముల నుదయించు రీతుల నన్నిటిని లెక్కింప శక్యమా? రీతులలో పంచోత్తరశతభేదములు నూటయిదు విధము లుండునని కొందరు మనీషులనిరి. గ్రంథవిస్తరభీతు డయిన శారదాతనయుడు వాని నిరూపణము విరమించెను.

అవియె యక్షరవిన్యాసములు. అవియె పదపంక్తులు. కాని పురుషు పురుషు నందు నొక విశేషమున నొకానొక సరస్వతి భాసించును గదా?

కావున రీతి భేదప్రకల్పన చతుర్విధముగా నుండునని గ్రహించుట యుక్తము. ఇటుపై వృత్తివిభాగ ముపక్రాంత మగును.

### వృత్తివిభాగః

వృత్తిశ్చతుర్విధా ఋగ్యజుస్సామాథర్వసంభవా
భారతీ సాత్వతీ చైవ కైశిక్యారభటీతి చ. 126

ఔద్భటాః పంచమీం అర్థవృత్తిం చ ప్రతిజానతే
అర్థవృత్తేరభావాత్తు విశ్రాంతాం పంచమీం పరే. 127

మధుకైటభాసురాభ్యాం నియుద్ధమార్గేణ యుధ్యతో విష్ణోః
వృత్తిత్రయం ప్రసూతం భరతప్రోక్తా చ భారతీత్యపరే. 128

అపరే తు నాట్యదర్శనసమయే కమలోద్భవస్య పదనేభ్యః
శృంగారాది చతుష్టయసహితా వృత్తీః సమాచఖ్యుః. 129

వాగారంభాత్మకానుభావములలో వృత్తియు నున్నది. ఆ వృత్తి విచార మిం దున్నది. ఋగ్యజుస్సామాథర్వ వేదముల నుండి యుత్పన్న

మయిన వృత్తి చతుర్విధము; భారతీవృత్తి సాత్వతీవృత్తి కైశికీవృత్తి ఆరభటీ వృత్తి యని. భట్టోద్భట మతానుయాయు లయిదవ వృత్తి కలదని యది యర్థ వృత్తి యని నిశ్చయింతురు. అర్థవృత్తి యనునది లేదు. కాన దాని నంగీకరింప నక్కఱ లేదు. సర్వ వృత్తిసమాహారాత్మక మయిన అయిదవవృత్తి యుండ దగును. దాని పేరు విమిశ్రవృత్తి. భోజరాజాదు లీ పంచమి నంగీకరించిరి.

ఈ వృత్తు లెట్లుదయించినవి? ఈ విషయమున కొన్ని మతము లున్నవి. వాని నిట్లు గ్రహింప వలెను. ఒకపుడు మహాజలమున మధుకైటభులను నసురులు సంచరించుచు విష్ణువుతో తలపడిరి. యుద్ధ మారంభ మయినది. అప్పు డట్లు యుద్ధ మొనరించు విష్ణువు సంచారవిధానమున వృత్తిత్రయ ముత్పన్న మయినది. అవి సాత్వతి ఆరభటి కైశికి వృత్తులు. భరతప్రోక్త మయిన వృత్తి భారతి. ఇట్లు నాలుగు వృత్తు లుదయించిన వని కొందరి భావము. మరి కొంద రిట్లందురు. భరతుడు సిద్ధపఱచిన నాట్యమును దర్శించు నపుడు బ్రహ్మ నాలుగు ముఖముల నుండి నాలుగు వృత్తులు శృంగారాదిరసములతో గూడినవై యుద యించిన వని.

## ప్రవృత్తి విభాగః

దాక్షిణాత్యా తథాఽఽవంత్యా పౌరస్త్యా చౌఢ్రమాగధీ
ప్రవృత్తయశ్చతస్రోఽపి వాగారంభాః స్యురేకదా. 130

తద్వ్యాపారాత్మికాః ప్రోక్తా వృత్తయశ్చ చతుర్విధాః.

వాగారంభానుభావములలో ప్రవృత్తి కలదు. ఇది నాలుగు విధములు. దాక్షిణాత్య ప్రవృత్తి ఆవంత్యప్రవృత్తి పౌరస్త్యప్రవృత్తి ఓఢ్రమాగధీప్రవృత్తి యని. ఈ నాలుగు ప్రవృత్తులును వాగారంభములు. తద్వ్యాపారాత్మకము లయిన వృత్తులు చతుర్విధము లగుట నిరూపిత మయినది.

## రసాభినయ వ్యవస్థా

వాచికం సాత్త్వికం నృత్తమాహార్యం చ తథాంగికం. 131

యథాక్రమం నియమితం భారత్యాద్యాసు వృత్తిషు
శృంగారే కైశికీ వీరే సాత్వత్యారభటీ పునః. 132

రసే రౌద్రే చ బీభత్సే వృత్తిః సర్వత్ర భారతీ

పొందినది. సమాస తారతమ్యమునను సౌకుమార్యాది తారతమ్యమునను ఉ చార విశేషమునను ప్రాసానుప్రాస విభేదమునను రీతి వేరు వేరుగా నున్న అట్లే సౌరాష్ట్రికాభేదమునను ద్రావిడీభేదమునను రీతి భిన్నభిన్న మయిన ఇట్లు వైవిధ్య ముదయించుట కింకను కారణములు కలవు. ప్రతివచనం ప్ర పురుషం ప్రతిప్రీతి రీతి వేరు వేరుగా నుండును. వచన వచనమునకు రీతి రగును. పురుషునకు రీతి వేరగును. పురుషునకు పురుషునకు రీతి వేరగున త త్తదవాంతర జాత్యానుసారమునను రీతి వేరగును. ప్రీతికి ప్రీతికి గల వే వనమునను రీతి గతి మారును. ఇట్లనంత రీతులు గలుగ వచ్చును. వాని లెక్కి మట శక్యము కాదు. కావున సంక్షేపముగా రీతి చతుర్విధ మని కవులు నిరు పించిరి. నానావిధముల నుదయించు రీతుల నన్నిటిని లెక్కింప శక్యమా? రీత లో పంచోత్తరశతభేదములు నూటయిదు విధము లుండుననీ కొందరు మనీష నిరి. గ్రంథవిస్తరభీతు డయిన శారదాతనయుడు వాని నిరూపణము వి యించెను.

అవియె యక్షరవిన్యాసములు. అవియె పదపంక్తులు. కాని పురుష పురుషు నందు నొక విశేషమున నొకానొక సరస్వతి భాసించును గదా?

కావున రీతి భేదప్రకల్పన చతుర్విధముగా నుండునని గ్రహించుట యుక్తము. ఇటుపై వృత్తివిభాగ ముపక్రాంత మగును.

### వృత్తివిభాగః

వృత్తిశ్చతుర్విధా ఋగ్యజుస్సామాథర్వసంభవా
భారతీ సాత్వతీ చైవ కైశిక్యారభటీతి చ. 126

ఔద్భటాః పంచమీం అర్థవృత్తిం చ ప్రతిజానతే
అర్థవృత్తేరభావాత్తు విశ్రాంతాం పంచమీం పరే. 127

మధుకైటభాసురాభ్యాం నియుద్ధమార్గేణ యుధ్యతో విష్ణోః
వృత్తిత్రయం ప్రసూతం భరతప్రోక్తా చ భారతీత్యపరే. 128

అపరే తు నాట్యదర్శనసమయే కమలోద్భవస్య వదనేభ్యః
శృంగారాది చతుష్టయసహితాః వృత్తీః సమాచఖ్యుః. 129

వాగారంభాత్మకానుభావములలో వృత్తియు నున్నది. ఆ వృత్తి విచార మిం దున్నది. ఋగ్యజుస్సామాథర్వ వేదముల నుండి యుత్పన్న

మయిన వృత్తి చతుర్విధము; భారతీవృత్తి సాత్వతీవృత్తి కైశికీవృత్తి ఆరభటీ వృత్తి యని. భట్టోద్భట మతానుయాయు లయిదవ వృత్తి కలదని యది యర్థ వృత్తి యని నిశ్చయింతురు. అర్థవృత్తి యనునది లేదు. కాన దాని నంగీకరింప నక్కర లేదు. సర్వ వృత్తిసమాహారాత్మక మయిన అయిదవవృత్తి యుండ దగును. దాని పేరు విమిశ్రవృత్తి. భోజరాజాదు లీ పంచమి నంగీకరించిరి.

ఈ వృత్తు లెట్లుదయించినవి? ఈ విషయమున కొన్ని మతము లున్నవి. వాని నిట్లు గ్రహింప వలెను. ఒకపుడు మహాజలమున మధుకైటభులను నసురులు సంచరించుచు విష్ణువుతో తలపడిరి. యుద్ధ మారంభ మయినది. అప్పు డట్లు యుద్ధ మొనరించు విష్ణువు సంచారవిధానమున వృత్తిత్రయ ముత్పన్న మయినది. అవి సాత్వతి ఆరభటి కైశికి వృత్తులు. భరతప్రోక్త మయిన వృత్తి భారతి. ఇట్లు నాలుగు వృత్తు లుదయించిన వని కొందరి భావము. మరి కొంద రిట్లందురు. భరతుడు సిద్ధపఱచిన నాట్యమును దర్శించు నపుడు బ్రహ్మ నాలుగు ముఖముల నుండి నాలుగు వృత్తులు శృంగారాదిరసములతో గూడినవై యుద యించిన వని.

## ప్రవృత్తి విభాగః

దాక్షిణాత్యా తథాఽఽవంత్యా పౌరస్త్యా చౌడ్రమాగధీ
ప్రవృత్తయశ్చతస్రోఽపి వాగారంభాః స్యురేకదా. 130
తద్వ్యాపారాత్మికాః ప్రోక్తా వృత్తయశ్చ చతుర్విధాః.

వాగారంభానుభావములలో ప్రవృత్తి కలదు. ఇది నాలుగు విధములు. దాక్షిణాత్య ప్రవృత్తి ఆవంత్యప్రవృత్తి పౌరస్త్యప్రవృత్తి ఓఢ్రమాగధీప్రవృత్తి యని. ఈ నాలుగు ప్రవృత్తులును వాగారంభములు. తద్వ్యాపారాత్మకము లయిన వృత్తులు చతుర్విధము లగుట నిరూపిత మయినది.

## రసాభినయ వ్యవస్థా

వాచికం సాత్త్వికం నృత్తమాహార్యం చ తథాంగికం. 131
యథాక్రమం నియమితం భారత్యాద్యాసు వృత్తిషు
శృంగారే కైశికీ వీరే సాత్వత్యారభటీ పునః. 132
రసే రౌద్రే చ బీభత్సే వృత్తిః సర్వత్ర భారతీ

వృత్తులు రసము లందును అభినయము లందును వ్యవస్థితములై యున్నవి. ఆ వ్యవస్థ యిచట ప్రదర్శిత మగును. నృత్తము వాచికాభినయము సాత్త్వికాభినయము ఆహార్యాభినయము ఆంగికాభినయము నని నాలుగు విధములు. ఇవి యథాక్రమముగా భారత్యాదివృత్తులలో నియమితములై యున్నవి. ఔచిత్యానుసారమున వాని నిట్లు గ్రహించునది.

1. భారతీవృత్తిలో వాచికాభినయము
2. సాత్త్వతీవృత్తిలో సాత్త్వికాభినయము
3. కైశికీవృత్తిలో ఆహార్యాభినయము
4. ఆరభటీవృత్తిలో ఆంగికాభినయము

ఇది యభినయము లందలి వ్యవస్థ. రసము లందలి వ్యవస్థ యిట్లున్నది. శృంగారమున కైశికీవృత్తి, వీరమున సాత్వతీవృత్తి, రౌద్రబీభత్సము లందు ఆరభటీవృత్తి యుండును. భారతీవృత్తి సర్వరసములకు సంబంధించి యుండును.

దేశభాషా క్రియా భేదలక్షణాః స్యుః ప్రవృత్తయః. 133
లోకాదేవావగమ్యైతా యథౌచిత్యం ప్రయోజయేత్
ఉక్తాస్తా వృత్తయస్సాంగా భోజ సోమేశ్వరాదిభిః. 134
తస్మాదాసాం స్వరూపం తు దిఙ్మాత్రం సముదాహృతం
దేశ్యాః ప్రవృత్తయస్తత్తద్దేశ్యైర్జ్ఞేయా విచక్షణైః. 135
క్రియాభేదా న శక్యంతే జ్ఞాతుం వక్తుం చ కేనచిత్
తస్మాద్యతః ప్రవృత్తిర్వా క్రియా వా యత్ర దృశ్యతే 136
తత్ర తజ్జైస్సహ జ్ఞేయాస్సర్వైః సర్వాః ప్రవృత్తయః

ప్రవృత్తిభేదము లన్నియు దేశభేదముననె తెలియదగి యున్న వని యిచట నిరూపిత మగును. దేశభేదమున భాషాభేదమున క్రియాభేదమున ప్రవృత్తు లుదయించుటను తెలియ వలెను. ఇట్టి వాని నన్నిటిని లోకవ్యవహారముననె గ్రహించి ఔచిత్యానుసారమున ప్రయోగింప దగును భోజ సోమేశ్వరాదులు వృత్తులను సాంగముగా నిరూపించిరి. అందుననే వాని స్వరూపము సంగ్రహముగనె యిచట నిరూపిత మయినది. దేశీయము లయిన ప్రవృత్తులను విచక్షణు లయిన దేశీయుల నుండియె గ్రహింప దగును. దేశీయ క్రియాభేదముల నన్నిటి

దెలియుట శక్యము కాదు. చెప్పుటయు శక్యము కాదు. కావుననే ప్రవృత్తి యెట్లుదయించినదో, ఏ క్రియ యెచట గోచరించు చున్నదో అచట నభిజ్ఞు లయిన వారి నందర గూడి ప్రవృత్తుల నన్నిటిని గ్రహించుట యుక్తము. అట్టి వాని నిట్టి స్థలమున నిరూపించుట శక్యము కాదు.

**భాషా విభాషా విభాగః**

భాషా స్యాత్సప్తధా దైశ్యా విభాషాపి చ సప్తధా. 137

మాగధ్యవంతికా ప్రాచ్యా శౌరసేన్యర్ధమాగధీ
పైశాచీ దాక్షిణాత్యా చ తత్తద్దేశేషు భాష్యతే. 138

శకారాభీర చండాల శబర ద్రమిడాంధ్రజాః
హీనా వనేచరాణాం చ తత్తజ్జాతిషు దృశ్యతే. 139

దేశభేదక్రియాభేదాంస్తత్ర తత్రోపలక్షయేత్

దైశ్యభాష సప్తవిధము. విభాషయు సప్తవిధము. మాగధి అవంతిక ప్రాచ్య శౌరసేని అర్ధమాగధి పైశాచి దాక్షిణాత్య నామములతో నున్న భాష లాయా దేశములందు వ్యవహారమున నున్నవి. శకారభాష ఆభీరభాష చండాల భాష శబరభాష ద్రమిడభాష ఆంధ్రభాష. వనేచరభాష అను నేడు భాషలు హీన భాషలు విభాషలు. ఇవి ఆ యా జాతుల వారలలో కన్పడుచున్నవి. దేశభేద క్రియాభేదముల నట నట గుర్తించుట యుక్తము. ఇట్టి విశేషములు బుద్ధ్యారంభానుభావములలో నున్నవి. రీతి వృత్తి ప్రవృత్తి విచారమున దేశీయస్వరూప పరిశీలనమున వీని యాలోచన మావశ్యక మగుటచే నివి నిరూపితములు.

ఏవం తేనుభావాః కవిభిః నిబంధే యోగ్యకల్పితాః. 140
అభినేయా నటైర్నాట్యే తత్తదర్థానుకూలతః

మనో వాక్కాయ బుద్ధి సమారంభ రూపము లయిన యనుభావము లిట్లు నిరూపితము లయినవి. ఈ యనుభావములను కవులు తమ నిబంధమున సముచితముగ నిరూపించుట యుక్తము. అట్లు యోగ్యకల్పితను లయిన వానిని సంభావించి నటులు నాట్యమున నా యా యర్థముల కనుకూలముగా వీని నభినయించుట సముచితము. విశకలితముగా కవులు విషయముల గ్రహించి నిరూపించుటయు, అట్లు నిరూపితముల గుర్తించి నటు లభినయించుటయు నావశ్యకమని భావింప వలసి యున్నది.

విభావః కారణం కార్యమనుభావః ప్రకీర్తితః. 141

హేతుకార్యాత్మనోస్సిద్ధిస్తయోః సంవ్యవహారతః
జ్ఞాయమానతయా తత్ర విభావో భావపోషకృత్. 142

భావో హృది స్థితో యేన వ్యజ్యతే చానుభావ్యతే
భ్రూవిక్షేప కటాక్షాదిర్విభావో హృదయం శ్రితః. 143

భావాన్ వ్యనక్తి సోయమనుభావ ఇతీరితః
రామాద్యాశ్రయ దుఃఖాదే రనుభూతే స్తదాత్మతా. 144

సామాజికస్య మనసో యాః స భావ ఇతి స్మృతః
ఏవం విభావానుభావభావాః ప్రోక్తాః స్వరూపతః. 145

అనుభావాస్తు దృశ్యంతే బహవోఽన్యే రసోదయే
తత్ర తత్రాభిధీయంతే తద్రసోత్కర్ష హేతవః. 146

నిరూపించిన విభావానుభావములకు కార్యకారణభావ ముండుట యిచట నిరూపిత మగును. విభావ మనునది కారణము. అనుభావము కార్యము. కారణకార్య స్వరూపము లయిన విభావానుభావములకు సంవ్యవహారమున సిద్ధి యున్నది. విభావము జ్ఞాయమాన మయినచె భావపోషణము సంపాదించును. అజ్ఞాతవిభావము విభావముగా నుండదు. విభావము స్వస్వరూపమున నవిదిత మయినచో భావమును పోషింపదు. హృదయమున నున్న భావము విభావమున వ్యజ్యమానమగును. అనుభావ్యమానము నగును. కామినీగత మయిన భ్రూవిక్షేప కటాక్షాదికము హృదయగతమై భావములను గోచరింప జేయును. అట్లభివ్యంజిత మయిన భావ మనుభూయమాన మగును గావున అనుభావ మన దగి యున్నది. రామాదులం దున్న దుఃఖాదుల యనుభూతి వలన సామాజికుని మనస్సునకు తదాత్మత కలుగుట భావ మగును. "రామాదిగత సుఖదుఃఖాది భావనయా భావితాంతః కరణత్వం" రామాదు లందలి సుఖదుఃఖాదుల భావమున సామాజికాంతఃకరణము భావితమగుట—వాసిత మగుట సత్త్వము; కాగా నట్టి సత్త్వసంభూతము భావ మని పరిష్కృతార్థము.

ఇట్టి విధముగా విభావానుభావ భావములు స్వరూపమున నిరూపితము లయినవి. రసోదయమున ననుభావము లనేకములు కలవు. అవి రసోత్కర్ష హేతువులు. వాని నట నట నిరూపింతుము. ఇక సాత్త్వికనిరూపణము ప్రసంగ ప్రాప్తము.

## సాత్త్వికభావాః

మనస్సత్త్వమధిష్ఠాయ తత్తదింద్రియగోచరాన్
బుద్ధిమాశ్లిష్య విషయానను భుంక్తే స్వభావతః. 147

త్రిధా సత్త్వం భవేత్ బుద్ధిజ్ఞానానంద విభేదతః
తద్భావభావనాత్మా స్యాత్పరదుఃఖాదిసేవయా. 148

పరస్య సుఖదుఃఖాదే రనుభావేన చేతసః
తద్భావభావనం యేన భవేత్తదనుకూలతః. 149

తత్సత్త్వం తేన నిర్వృత్తాః సాత్త్వికా ఇత్యుదీరితాః
అనుభావత్వసామాన్యే సత్యప్యేషాం పృథక్తయా. 150

లక్షణం సత్త్వజత్వాద్ధి తేఽపి స్తంభాదయః స్మృతాః
స్తంభః స్వేదోఽథ రోమాంచః స్వరభేదశ్చ వేపథుః. 151

వైవర్ణ్య మశ్రు ప్రలయ ఇత్యష్టౌ సాత్త్వికా మతాః

సత్వము ననుసరించిన మనస్సు స్వభావ సముచితముగా బుద్ధి నాశ్లేషించి యుండి యా యా యింద్రియగోచరము లగు శబ్ద స్పర్శ రూప రస గంధము లను విషయముల ననుభవించును. సత్త్వము బుద్ధి జ్ఞానము ఆనందము నను విభేదమున త్రివిధము. పరగతము లయిన సుఖదుఃఖాదుల సేవనమున తద్భావభావనాత్మత యుండుట సత్త్వ మన దగును. పరుని సుఖదుఃఖాదుల యనుభావమున చిత్తమునకు గలుగు తాద్భావభావనము తత్తదనుకూల విధానమున గలుగును. అది సత్త్వము. సత్త్వనిర్వృత్తము లగు వానిని సాత్త్వికము లందురు. ఈ సాత్త్వికములును అనుభావత్వ సామాన్యమున ననుభావ రూపములె యగును గాని వానిని పృథగ్రూపమున వేరుగా పరిగణింప వలసి యున్నది. అవి సత్త్వజన్యము లగుటయె యిందు హేతువు. స్తంభాదులకు సాత్త్వికము లని ప్రసిద్ధి యున్నది. స్తంభము స్వేదము రోమాంచము స్వర భేదము వేపథువు వైవర్ణ్యము అశ్రువు ప్రలయము నను నీ యెనిమిది సాత్త్విక భావము లనుట సమ్మతము. వీని లక్షణములు నిరూపితము లగును.

### స్తంభః

స్తంభో మద గద క్రోధ భయ విస్మయ గర్వ జః. 152

తథా హర్ష విషాదాదేర్జాయతే నీచమధ్యయోః
సచేతనోఽపి నిశ్చేష్టో నిష్ప్రకంపో జడాకృతిః. 153

స్తబ్ధగాత్రశ్చ శూన్యశ్చ స్తంభవా నితి కథ్యతే

మదము రోగము క్రోధము భయము విస్మయము గర్వముల వలన స్తంభను కలుగును. అట్లే హర్ష విషాదుల వలనను గలుగును. నీచ మధ్యమ మానవులలో నిష్క్రియతాంగరూప మయిన యీ స్తంభము గోచరించును. ఇది కలుగగా సచేతను డయినను నిశ్చేష్టుడై నిష్ప్రకంపుడై జడాకృతియై స్తబ్ధగాత్రుడై శూన్యస్వభావు డగును. ఇట్టి వానిని స్తంభవాన్ స్తంభము కల వాడని యందురు.

## స్వేదః

స్వేదః సమ్పీడన క్రోధ శ్రమ వ్యాయామ భీతిభిః. 154

ఘర్మ హర్ష జ్వర గ్లాని సుఖ లజ్జాదిభిర్భవేత్
స్వేదాపనయనేనైవ వ్యజనగ్రహణేన చ. 155

తథా వాతాభిలాషేణ హ్యనుభావః ప్రకాశ్యతే

స్వేదము సంపీడనమున గలుగును. క్రోధ శ్రమ వ్యాయామ భీతి విశేష ములచే గలుగును. వేసవిఉబ్బ పెట్టుట వలన గలుగును. హర్షము జ్వరము గ్లాని సుఖము లజ్జ మొదలగు వానిచే గలుగును. స్వేదము దేహమున చెమట. ఇది కలుగగా గొన్ని యనుభావములు నుండును. స్వేదాపనయనము చెమట తుడిచివేయుట వ్యజనగ్రహణము గాలి నభిలషంచుట అను నిట్టివిందను భావము లుగా నుండును.

## రోమాంచః-స్వరభేదః

రోమాంచః క్రోధ రుగ్భీతి హర్ష శీతాదిభి ర్భవేత్. 156

తం చోత్సుకా సకృద్గాత్ర సంస్పర్శైః పులకై ర్వదేత్
స్వరభేదో గద మద క్రోధ హర్ష భయ జ్వరైః. 157

తస్యానుభవాః కవిభిర్వర్ణ్యంతే గద్గదాదిభిః
స్థానభ్రష్టైః స్వరై ర్భూయః స్ఖలితై ర్గద్గదై రపి. 158

రోమాంచము గగుర్పాటు, క్రోధము వ్యాధి భీతి హర్షము చలి మొదలగు వానిచే గలుగును. ఈ రోమాంచము నుత్సుకభావమున ముహు

ర్ముహుర్గాత్ర సంస్పర్శనముల వలన గగుర్పాటున సూచింప వచ్చును. స్వర భేదము వేరొక సాత్త్వికము, ఇది రోగము మదము క్రోధము హర్షము భయము జ్వరములచే గలుగును. కవులు గద్గదాదులచే దీని యనుభవములను వర్ణింతురు. స్థాన భ్రష్టము లయిన స్వరములచే ముహుర్ముహుః స్ఖలితములగు గద్గదములచే సూచింతురు. ఇట్టి వీం దను భావము లని భావను.

బాష్పః

బాష్పో జృంభా భయ క్రోధ శీతై రనిమిషేక్షణైః
జాయతే రోగ శోకాభ్యాం ధూమాంజన విజృంభణైః. 159

వర్ణ్యతేఽసౌ ముహు ర్బాష్పమోక్షణై ర్నేత్రమార్జనైః

బాష్పము కన్నీరు. ఆవలింత భయము క్రోధము చలి వలన గలుగును. నిర్నిమేష నిరీక్షణమున గలుగును రోగశోకములచే గలుగును. ధూమ విజృంభ ణము, అంజన విజృంభణము వలన గలుగును, ముహుర్ముహుర్బాష్ప మోక్ష ణము నేత్రమార్జనము కన్ను నులుము కొనుటచే దీని వర్ణింతురు. అవి యిం దను భావములు.

వైవర్ణ్యం, కంపః, ప్రలయః

వైవర్ణ్య మాతప క్రోధ వ్యాధి శీత భయ క్లమైః. 160
అంగకార్శ్యాంగ సౌందర్య విప్లవాద్యైః వర్ణతే
కంపో గద భయ స్పర్శ హర్ష రోష జరాదిభిః. 161

వేపనైః స్ఫురణైః కంపైః స వర్ణ్యః కవిపుంగవైః
ప్రలయో మద నిద్రా రుక్ర్పహారై రుపజాయతే. 162

స చ దుఃఖాభిషంగాచ్చ నిశ్చేతనతయోచ్యతే
ఏతే విశేషతః కావ్యబంధాస్తు రసపోషకాః. 163

వైవర్ణ్యము రంగు మారుట. ఇది ఆతపము క్రోధము వ్యాధి శీతము భయము శ్రమములచే గలుగును. దీనిని అంగకార్శ్యముచే వర్ణింతురు. అంగ సౌందర్యమున వర్ణింతురు. నలిగిపోవుటలతో వర్ణింతురు. కంపము నొకసాత్త్వి కము. ఇది రోగము భయము స్పర్శము హర్షము రోషము నుసలితనము మొద లగు వానిచే గలుగును. వేపనములు-వణుకుట స్ఫురణములు కంపనములు మొద లగు వానిచే కవిపుంగవులు వర్ణింతురు. ప్రలయ మను సాత్త్వికము నష్టచేష్టతా

రూపము. ఇది మదము నిద్ర వ్యాధి ప్రహారము-దెబ్బ మొదలగు వానివలన గలుగును. ఇది దుఃఖసంబంధమున నిశ్చేతనత్వమున నభివర్ణిత మగును.

ఇట్లు సాత్త్వికభావముల స్వరూపము కలదు. సత్త్వానుభూతిలో దేహమున పంచభూతముల విశేషరీతుల ననుసరించి స్తంభాదులు కలుగుటను నాట్యవేదమున జూడ దగును. ఇవి సవిశేషముగా రసపోషకము లగును. సాత్త్వికముల సంబంధమున నుండు కావ్యబంధములు రసోల్లాసమున నుండును. వీనిని కవులు కావ్యములలో బాగుగా వర్ణింప వలెను.

వ్యభిచారిణః

నిర్వేదః ప్రథమం గ్లానిః శంకాఽ సూయా మదః శ్రమః
ఆలస్య దైన్య చింతాశ్చ వ్రీడా మోహః స్మృతిః ధృతిః. 164
హర్ష చపలతాఽఽవేగ జాడ్యౌత్సుక్య విషాదితాః
గర్వోఽమర్షోఽవహిత్థశ్చ మతిర్నిద్రాప్యపస్మృతిః. 165
సుప్తిః ప్రబోధశ్చోగ్రత్వం వ్యాధిర్మరణమేవ చ
త్రాసోన్మాదవితర్కాశ్చ విజ్ఞేయా వ్యభిచారిణః. 166

వ్యభిచారిభావముల నామసంకేత మిచట నున్నది. నిర్వేదము మొదటిది. ఇది ప్రథమమె యయినను ప్రథమ మని సంకేతించుట సాభిప్రాయము. ఈ విషయము సమయములో నిరూపిత మగును. నిర్వేదము గ్లాని శంక అసూయ మదము శ్రమము ఆలస్యము దైన్యము చింత వ్రీడ మోహము స్మృతి ధృతి హర్షము చపలత ఆవేగము జాడ్యము ఔత్సుక్యము విషాదము గర్వము అమర్షము అవహిత్థము మతి నిద్ర అపస్మృతి సుప్తి ప్రబోధము ఉగ్రత వ్యాధి మరణము త్రాసము ఉన్మాదము వితర్కము అను నీ ముప్పదిమూడును వ్యభిచారిభావములుగా దెలియ దగినవి. ఇక వీని లక్షణములు నిరూపితము లగును.

## 1. నిర్వేదః

దారిద్ర్య వ్యాధి దుఃఖేష్టవియోగ పరవృద్ధిభిః
ఈర్ష్యా తత్త్వావబోధాభ్యాం నిర్వేదో నామ జాయతే. 167
అన్తర్బాష్పోద్గమ ధ్యాన నిశ్వాసాశ్చ ముహుర్ముహుః
స్వాత్మావమాననం దైన్యం గద్గదత్వం వివర్ణతా. 168

అనుభావాస్తు గదితా నిర్వేదస్యైవమాదయః
స్త్రీ నీచాదిషు వర్ణ్యోఽయం రుదితశ్వసితాదిభిః. 169

తత్త్వావబోధజో యోగిష్వనుపాదేయతాం వ్రజేత్

నిర్వేద మను నీ ప్రథమ వ్యభిచారిభావము దారిద్ర్యము వ్యాధి దుఃఖము ఇష్టవియోగము పరుని వృద్ధివిశేషములచే గలుగును. ఈర్ష్య వలన గలుగును. తత్త్వావబోధమున నిర్వేదము కలుగును. ఇట్లు వివిధకారణముల వలన నిర్వేదమున నీ యనుభావము లుండును. అంతర్బాష్పోదయము ధ్యానము నిశ్వాసము మఱల మఱల గలుగును. స్వాత్మావమాననము, తన్ను తాను నిందించుకొనుట దైన్యము గాద్గద్యము వైవర్ణ్యము మొదలగు నిట్టి యనుభావములు నిర్వేదమునకు సంబంధించి యుండునని యనిరి. స్త్రీలలో నీచప్రకృతులలో రుదిత శ్వసితాదులచే నిది వర్ణ్యమగును. యోగిజనులలో నిది తత్త్వావబోధ జన్యము కావున అనుపాదేయభావము నుదయింప జేయును. తత్త్వజ్ఞానజన్యమయిన నిర్వేదము కలవారు జగత్పదార్థము లనుపాదేయము లని భావింతురు.

### 2. గ్లానిః

గ్లాని ర్విరేచక వమన జాగరాతిరతాధ్వభిః. 170

ఉపవాస మనస్తాప క్షుత్పిపాసాదిభి ర్భవేత్
కంపానుత్సాహ వైవర్ణ్య స్వేద మందపరిక్రమైః. 171

క్షామవాక్యాక్షిసంచార కార్శ్యాంగ శ్వసనాదిభిః
గ్లానిజా హ్యనుభవా స్తే కథితా హ్యేవమాదయః. 172

గ్లాని యనునది బలాపచయము. నీరసముగా నుండుట. ఈ స్థితి విరేచనము లయినందు వలన గలుగును. వమనమున జాగరణమున అధికసంభోగమున మార్గాయాసమున ఉపవాసమున మనస్తాపమున క్షుత్పిపాసాదుల వలన గలుగును. దీని వలన కంపము అనుత్సాహము వైవర్ణ్యము స్వేదము మందపరిక్రమము క్షీణస్వరము కల వాక్యము మందముగా నక్షిసంచారము **దేహము** కృశించుట నిట్టూర్పు మొదలగు ననుభావములు కలుగును. ఈ యనుభావము లింక నిట్టివి గ్లానిజన్యము లని యనిరి.

### 3. శంకా

చౌర్యాదిగ్రహా పాపాదికర్మ ణ్యాపాపరాధజా
శంకా సందేహరూపా స్యాత్ స్త్రీ నీచ ప్రకృతి శ్రితా. 173

స్వాత్మోత్థా చ పరోత్థేతి సా పునర్ద్వివిధా భవేత్
స్వరభేదోఽశ్రు వైవర్ణ్యమాస్య శోషోఽవగుంఠనమ్. 174

పార్శ్వావలోకనం జిహ్వాలేహనం చోరుకంపనం
ఆకారసంవృతిరితి భావాః శంకానుభావకాః. 175

ఆత్మోత్థా తు పరిజ్ఞేయా దీనదృష్టివిలోకనైః
పరోత్థా త్వంగచేష్టాభిర్విజ్ఞేయా భావకోవిదైః. 176

తారా పుట భ్రూదృష్టీనాం వికారానింగితం విదుః
ఆకారాః సత్త్వజా భావా ఇతి విద్వద్భిరీరితాః. 177

చేష్టాః స్యురంగప్రత్యంగ జనితా స్త్వనిమిత్తతః

శంక పేరు గల వభ్యిచారిభావము చౌర్యాదుల వలన గలుగు గ్రహణము వలన పాపాదికర్మల వలన గలుగును. రాజాపరాధమున గలుగును. శంక యనునది సందేహరూపము. స్త్రీలను నీచప్రకృతులను ఆశ్రయించి యుండును. ఈ శంక స్వజన్యము పరజన్యము నని రెండు విధములు. ఈ దిగువ నిరూపించు భావములు శంకానుభావకములు. స్వరభేదము అశ్రువు వైవర్ణ్యము ముఖశోషణము అవగుంఠనము పార్శ్వావలోకనము జిహ్వాలేహనము ఊరుకంపనము ఆకారగోపనము అనునవి శంక కలవాని చేష్టావిశేషములు. ఇవి శంకాసూచకములు. ఇవి యన్నియు ఆత్మోత్థములు-స్వజన్యములు. దీనదృష్టి విలోకనము లతో నుండును. ఇవి యాత్మోత్థములు కాగా పరోత్థము లీ విధమున నుండును. పరులకు సంబంధించిన శరీరచేష్టితములచే వీనిని భావకోవిదు లీ విధమున గ్రహింప వలెను. పరుల యింగితమును తారాకర్మలు పుటకర్మలు భ్రూకర్మలు దృష్టికర్మల వికారములు సూచించుటను భావవిదులు గుర్తింతురు. సత్త్వజన్యము లయిన భావము లాకారములచే సూచితము లగుట ప్రసిద్ధమె. అంగప్రత్యంగ జన్యము లయిన చేష్ట లనిమిత్తముగ గలుగునవి యయినను నింగితమును సూచింప గలవు.

## 4. అసూయా

పరస్య సౌభాగ్యైశ్వర్య మేధా లీలా సముచ్ఛ్రయైః. 178
అసూయా నామ సా దూరాపరాధాన్వేషణాదిభిః
దోషప్రఖ్యాపన మధోముఖతా భ్రుకుటీకృతిః. 179

అప్రదానం దృశోరీర్ష్యా పరివర్తిత వక్త్రతా
అవజ్ఞేత్యనుభావాః స్యురసూయాయా ముదాహృతాః. 180

అసూయ అనునది పరుని సముత్కర్షాసహిష్ణుత. అది యితరుని సౌభాగ్యాతిశయము ఐశ్వర్యాధిక్యము మేధా లీలాసముచ్ఛయములచే కలుగును. అసూయ కలుగగా దూరమూరముగా నున్న పూర్వపూర్వాపరాధముల నన్వేషింతురు. దోషప్రఖ్యాపనము అధోముఖత్వము బొమముడి వేయుట దృష్టిసారింపకుండుట ఈర్ష్యతో ముఖము ప్రక్కకు త్రిప్పుట తిరస్కారము మొదలగునవి యసూయలో ననుభావములుగా నుండుటను తద్విదు లుదాహరించిరి.

## 5. మదః

మద్యోపయోగా దైశ్వర్యాద్విద్యయా చాపి జన్మతః
ఉత్తమస్త్రీ పరిష్వంగాన్మదః సంపద్యతే నృణాం. 181

మద్యోపయోగజస్త్రేధా తరుణో మధ్యమ స్తథా
అపకృష్టశ్చ తస్త్యైవ కరణం పంచధా భవేత్. 182

జ్యేష్ఠా మధ్యా కనిష్ఠేతి తస్త్యైవ ప్రకృతిస్త్రిధా
అన్యదారభతే వాక్యమన్యాం వాచం బ్రవీతి చ. 183

వీక్షతే కంచిదేకం చ భుజాభ్యామవలంబతే
పురశ్చాలపతే పాదౌ తిర్యక్తౌ నిదధాతి చ. 184

ఆవిర్భూతస్వేదలేశం హర్షాదుత్ఫుల్లమాననం
అవ్యక్తవర్ణం వచనం మదే తరుణనామని. 185

స్ఖలద్విలంబిగమనం వ్యావిద్ధపద సంచరం
శ్లథమానభుజాక్షేపః శూన్యాలంబన మీక్షణం. 186

అవిభక్తపదాలాపో విస్మృతిశ్చ పదే పదే
ఆకాశలక్షం వచనం తథాకాశావలంబనం. 187

ఇత్థం మధ్యమదే ప్రోక్తమేవమాది విచేష్టితం

మదము మద్యసేవనమున గలుగును. ఐశ్వర్యమున గలుగును. విద్యచే గలుగును. జన్మవలన గలుగును. ఉత్తమస్త్రీ పరిష్వంగము వలనను సంభోగము

వలనను మానవులకు మదము కలుగును. ఇందు మద్యజమదమున తరుణాదిభేద ములు కలవు. ఇతరము లందును గొన్ని విశేషములు గలవు. అవి యన్నియు నిరూపితము లగును. మద్యోపయోగము వలన గలుగు మదము తరుణమద మని మధ్యమ మదమనిఅపకృష్టమద మని మూడు విధములు. చెప్పిన విధమున మదకరణ మయిదు విధములు, మదప్రకృతియు జ్యేష్ఠప్రకృతి మధ్యప్రకృతి కనిష్ఠప్రకృతి యని మూడు విధముల నున్నది.

తరుణమదము నం దీ విధానము లుండును. ఒక వాక్య మారంభించును. వేరొకటి పలుకును. ఒకని చూచును. మరొకని భుజములతో పట్టుకొనును. ముందు పాదము లాడించును వాని నడ్డముగా నుంచును. తరుణమదము కల వానికి చెమటచుక్కలు ప్రసరించును. హర్షమున ముఖ ముత్ఫుల్లముగా నుండును. మాట లవ్యక్తవర్ణములతో నుండును. ఇట్టివన్నియు తరుణ మదమున నుండును.

మధ్యమ మదము నందలి చేష్ట లీ విధమున నుండును. గమనము తొట్రుపడును. మందముగ నుండును. పదసంచార మావిద్ధముగ నుద్ధతముగ నుండును. భుజముల యాక్షేపము ప్రేలాడు విధమున నుండును. దృష్టి శూన్యాలంబనముతో నుండును. పదాలాప మవిభక్తముగ నుండును. క్షణ క్షణ ము మర పుండును. ఆకసము చూచి మాటలాడును. అం దాకాశమె యవలంబ నము. ఇట్టి చేష్టితములు మధ్యమదమున నుండుట గ్రాహ్యము.

న సంజ్ఞాం లభతే గంతుం న శక్నోతి పదాత్పదం. 188

వర్ధతే ఛర్దతే నిష్ఠీవతి శ్వసితి హిక్కతే
గురుకంఠధ్వని ర్నష్టస్మృతి ర్జర్ఝరభాషణమ్. 189

ఏవమాదివికారాః స్యురపకృష్టమదే ముహుః

అపకృష్ట మదమున నిట్టి వికారము లుండును. ఏ సంజ్ఞను గుర్తింపడు, అడుగు వేసి యడుగు వేయుట కేని శక్తుడు కాడు. అపానవాయువు విడుచును. కక్కును, ఉమ్మును, నిట్టూర్చును, ఎక్కిళ్లు కలవాడగును, బిగ్గరగా పలుకును. మరచి పోవును. జర్ఝరభాషణమున, గబ గబ మాటలతో నుండును. ఇట్టి వికారము లిందుండును.

కేచిత్స్వపంతి గాయంతి కేచిత్ కేపి హసంతి చ. 190

కేచిద్రుదంతి కేచిత్తు పరుషం బ్రువతే ముహుః
ఉత్తమప్రకృతిః శేతే నృత్యన్గాయతి మధ్యమః. 191
అధమో రోదితి హసత్యేవం ప్రకృతిజా గుణాః

మద్యసేవన మొనరించిన వారు తమ తమ ప్రకృత్యనుసారమున నిట్లుందురు. కొందరు నిద్రింతురు. కొందరు పాడుదురు. కొందరు నవ్వుదురు. కొందరు రోదింతురు. కొందరు సుహుర్ముహుః పరుషభాషణ మొనరింతురు. బూతులాడుదురు. ఉత్తను ప్రకృతి శయనించును. మధ్యమ ప్రకృతి నర్తన మొనరించుచు చిందులు వేయును పాటలు పాడును. అధము డేడ్చును, నవ్వును. ఇట్లివి ప్రకృతిజన్యము లయిన గుణములు.

విద్యాఽఽభిజాత్య సంపత్తి మదేఽనుత్తరభాషణం. 192
అవజ్ఞాగర్భితం వాక్యం సుహృదామప్యనాదరః
ఏవమాదివికారాః స్యుర్విద్యాదిజనితే మదే. 193

విద్యాకృతముగా నాభిజాత్యసంపత్తికృతముగా మద ముండును. విద్యామదము ఆభిజాత్యమదము సంపత్తిమదమున సమాధాన మిచ్చుట యుండదు. సరిగ సంభాషించుటయు నుండదు. ఉత్తర మీకున్న నేమియో పలుకుదురు. వారి మాట అవజ్ఞాగర్భితము. తిరస్కార మనాదార మం దుండును. సుహృదులకును వారి కడ ఆదర ముండదు. మిత్రుల గూడ నవమానింతురు. విద్యాజన్యమదమున నిట్టి వికారము లుండును.

ఉత్తమ స్త్రీ రతి మదే హర్షో రాగశ్చ చక్షుషోః
సౌరభ్య మంగలావణ్య మహంమతి రనాదరః. 194
ఏవమాదివికారాశ్చ కథితాః పూర్వసూరిభిః

ఉత్తమస్త్రీరతికృత మయిన మద మున్నపుడు హర్ష ముండును. కన్నులందు రాగ ముండును. దేహమున పరిమల ముండును. అవయవములందు లావణ్య ముండును. అహంమతి యుండును. అనాదర ముండును. ఇట్టి మదమున నిట్టి వికారము లుండునని పూర్వమాన్యులు పలికిరి.

తరుణాదిమదములతో దృష్టిభేదము లీ విధముగ నుండును. వారి దృష్టివిశేషములె వారి మదవిశేషమును గోచరింప జేయ గలవు. ఇట్టి దృష్టివిశేషములతో నిట్టిమదవిశేషముల నభినయింప వలెనని భావము.

వ్యాఘూర్ణమానతారం యత్తామ్రోపాంతవిలోచనమ్. 195

చతుర్వికసితాపాంగం తరుణే మదిరామదే
ఆకుంచితోభయపుట మనవస్థిత తారకమ్. 196

ఆకంపమానపక్ష్మాగ్రం చతుర్మధ్యమదే భవేత్
నిమేషోన్మేషవికృతమన్తర్దర్శిత తారకమ్. 197

అధోఽవలోకనం చతురధమే తు మదే భవేత్
ఏవం మదవికారాశ్చ కథితాః పూర్వసూరిభిః. 198

మదిరాకృత మయిన తరుణమదములో కనుగ్రుడ్లు తిరుగుచుండును. నేత్రముల ప్రాంతభాగములు తామ్ర తామ్రములై యుండును. నేత్రాపాంగములు వికసితములై యుండును. మధ్యమ మదమునందు కన్నుల పుటములు రెండు నాకుంచితములై యుండును. తారక లవ్యవస్థితములై యుండును. పక్ష్మాగ్ర భాగములు కంపితము లగును. ఇట్టివి నేత్రకర్మ లందలి విశేషములు. అధమ మదము నందలి రీతి యిట్లుండును. ఇందు నేత్రములు నిమేషములతో నున్మేష ములతో వికృతములుగా నుండును. కనుగ్రుడ్లు లోలోన తిరుగుళ్లు పడు చుండును. అధోవలోకన ముండును. ఇట్టి వికారము లీ విధముగా నుండునని పూర్వసూరులు నిరూపించిరి.

## 6. శ్రమః

శ్రమో వ్యాయామ నృత్తాధ్వ మైథునాది నిషేవణైః
అంగమర్దన నిశ్వాస పాదసంవాహ జృంభణైః. 199
మందయానేన సీత్కారముఖ నేత్రవికూణనైః
ఏతైః శ్రమస్యానుభావః కథ్యతే కావ్యసూరిభిః. 200

శ్రమ మిచట లక్షిత మగును. వ్యాయామము వలన నృత్తాచరణము వలన మార్గాయాసము వలన సంభోగాచరణమున ఇంక నిట్టివాని వలన శ్రమము కలుగును. శ్రమమునకు సంబంధించిన యనుభావము లీ విధమున నుండును. అంగమర్దనము నిశ్వాసము పాదసంవాహనము ఆవలింతలు మందగమనము సీత్కారము ముఖవికూణనము నేత్రవికూణనము. కావ్యవిదు లగువారు శ్రమమున కనుభావము లిట్లు నిరూపించిరి.

## 7. ఆలస్యమ్

స్వభావ ఖేద సౌహిత్య వ్యాధి గర్భాదిభిర్భవేత్
ఆలస్యం తచ్ఛిరశ్శూల జృంభణాక్షి విమర్దనైః. 201

స్తంభేన గాత్రమనసోః స్త్రీ నీచాదిషు వర్ణ్యతే
సర్వత్ర కార్యప్రద్వేషాన్నిద్రా తంద్రీ నిషేవణాత్. 202
శయనాసనరాగేణ వర్ణ్యోఽసా వితరేషు తు

ఆలస్యలక్షణము దీనిలో నున్నది. "మందోద్యమత్వం ఆలస్యం"- పనులలో మాంద్య ముండుట. ఈ ఆలస్యము స్వభావముననె కొందరికి కలుగును. ఖేదమున గలుగును. సౌహిత్యమున జనించును. వ్యాధి వలన గలుగును. గర్భాదుల వలనను గలుగును. ఇట్లాలస్యము కలుగగా తలపోటు ఆవలింత కన్నులు మూట లుండును. గాత్రమనస్సుల స్తంభమున దీనిని స్త్రీల యందును నీచాదు లందును వర్ణింప దగును. ఇతరులందు దీని కార్యప్రద్వేషమున వర్ణింప దగును. నిద్రామాంద్య నిషేవణమున నిరూపింప దగును. శయనాసక్తి కూర్చొను నభిలాషలు కూర్ప దగును.

## 8. దైన్యమ్

దైన్యమౌత్సుక్య దౌర్గత్య చింతాహృత్తాపసంభవం. 203
అనుభావశ్శిరశ్శూల శిరోవ్యావృత్తి ధూననైః
దేహోపస్కరణ త్యాగాద్గాత్రగౌరవతో భవేత్. 204

దైన్య మౌత్సుక్యము వలన గలుగును. ఇష్టము లభింప లే దను తహతహ, రణరణకత నౌత్సుక్య మందురు. దైన్యము దౌర్గత్యమునను గలుగును. చింత వలన గలుగును. హృదయతాపమున గలుగును. తలపోటు తలత్రిప్పు తలయూపు దైన్యానుభావములు. దైన్యము కలవారు దేహాలంకారము చేసికొనరు. శరీరము బరువుగా నున్నట్లు భావింతురు.

## 9. చింతా

ఐశ్వర్యభ్రంశ దారిద్ర్యాదిష్టద్రవ్యాపహారతః
వితర్కాత్మా భవేచ్చింతా స్మృతేరన్యా ప్రతీయతే. 205
నిశ్వాసైశ్చాపి సోచ్ఛ్వాసై రధోముఖ విచింతనైః
సంతాపశూన్యచిత్తత్వ కార్శ్యాకాశావలోకనైః. 206
ఏవం చింతానుభావాస్తు కథ్యంతే కావ్యకోవిదైః

చింత వితర్కాత్మకము ఇది స్మృతికన్న వేరుగా నుండును. ఐశ్వర్యము నశింపగా దారిద్ర్యము కలిగినందు వలన నిది కలుగును. ఇష్టద్రవ్యము

నితరులు హరించి నందు వలన గలుగును. చింత కలుగగా నీ యనుభావములు కలుగును. ఉచ్ఛ్వాసములు కల నిశ్వాసము లిందు బహులముగా నుండును. తల ముఖము వాల్చి కొని విచింతన మొనరించుట యిం దుండును. సంతాపము వలన చిత్తము శూన్యముగ నుండును. కార్శ్యము కలుగును. ఆకాశావలోకనము లుండును. కావ్యకోవిదులు చింతానుభావము లీ విధముగా నుండుటను నిరూపించిరి.

## 10. వ్రీడా

అకార్యకరణాజ్ఞాన గుర్వాజ్ఞాది వ్యతిక్రమాత్. 207

అనిర్వాహాత్ప్రతిజ్ఞాయాః త్యాగే భూయోఽనుతాపతః
వ్రీడా తదనుభావాః స్యురుర్వీలేఖన చింతనం. 208

ముఖావనమ్రతాఽవ్యక్తవచనం నఖకర్తనం
వస్త్రాంగులీయకస్పర్శో దూరాదేవావకుంఠనమ్. 209

అనిర్గమో బహిః క్వాపి సర్వత్రాప్యనవస్థితిః

వ్రీడ యనునది లజ్జ. సిగ్గు. అకార్య కరణమున నిది కలుగును. అజ్ఞానమున గలుగును. గుర్వాజ్ఞ మొదలగు వాని వ్యతిక్రమమున గలుగును. చేసిన ప్రతిజ్ఞ నిర్వహింపనందున నుదయించును. ప్రతిజ్ఞాపరిత్యాగమునను గలుగును. మఱల మఱల ననుతాపము పొందుట వలన నిది కలుగును. ఇట్టి వ్రీడలో నీ చెప్పునవి యనుభావములుగా నుండును. కాలితో నేల గీకుట చింతనము ముఖము వంచుట అవ్యక్తవచనము గోళ్లుగిల్లుకొనుట మాటి మాటికి కట్టువస్త్రము పైట వ్రేలియుంగురము స్పృశించుట దూరమునుండియె యవకుంఠనము వేసికొనుట పైట సర్దుకొనుట యిల్లు గడప దాటి వెలుపల కెచ్చటికి వెళ్లక పోవుట ఏ స్థలమున గాని సరిగానుండ కుండుట యనునవి యిం దనుభావములు.

## 11. మోహః

మోహశ్చిత్తస్య శూన్యత్వం పూర్వవైరస్మృతే ర్మదాత్. 210

దైవోపఘాతా న్మాత్సర్యా ద్భయా చ్చాపి ప్రహారతః
ఆవేగాత్తత్ప్రతీకారవిహతే రేవ ముద్భవేత్. 211

నిశ్చేష్టతా ప్రపతనం వైవర్ణ్యం దేహఘూర్ణనం
సర్వేంద్రియప్రమోహశ్చ నిశ్వాసో నష్టసంజ్ఞతా. 212

మోహస్య కథితా సద్భిరనుభావాః స్వరూపతః

మోహ మనునది చిత్తమునకు గలుగు శూన్యత. అది పూర్వవైర స్మరణము వలన కలుగును. మదాతిరేకమునను గలుగును. దైవోపఘాతమున గలుగును. మాత్సర్యమున గలుగును. భయమున గలుగును. ప్రహారమున గలుగును. ఆవేగమున తత్ప్రతీకారవినాశమునను గలుగును. ఇందివి యనుభావము లుగా నుండును. నిశ్చేష్టత ప్రపతనము వివర్ణత ఒడలు తిరుగుట సర్వేంద్రియ ప్రమోహము నిశ్వాసము నష్టసంజ్ఞత అనునవి మోహమున కనుభావము లని తద్విదులు స్వరూపమున నిరూపించిరి.

## 12. స్మృతిః

దేశకాలోపయుక్తానాం సుఖదుఃఖానుషంగినాం. 213

చిరవిస్మృతవస్తూనాం స్మరణం స్మృతి రుచ్యతే
దౌఃస్థ్యాన్నిద్రాతుయా ద్రాత్ర్యాః ప్రహారాత్పశ్చిమాదపి. 214

చింతాయా ముహురభ్యాసాత్సమానశ్రుతిదర్శనాత్
భవేత్తదనుభావస్తు భ్రూసమున్నమనం ముహుః. 215

ఉద్వాహనం చ శిరసః సదృశస్యావలోకనం
హర్షశ్చ శిరసః కంపః కథితో రసకోవిదైః. 216

స్మృతి యనునది యనుభూతార్థస్మరణము. సుఖదుఃఖములతో సంబంధము కలవై ఆ యా దేశములం దా యా కాలములం దుపయుక్తము లయినను చిరకాలముగా విస్మరించిన యా యా పదార్థములను స్మరించుట స్మృతి యగును. దౌఃస్థ్యమున నీ స్మృతి కలుగును. దుష్ట మగు విపరీతస్థితి కలుగగా పూర్వ మనుభవించిన సుఖమును సన్నివేశములు గుర్తుకు వచ్చును. నిద్రానాశమున నిది కలుగును. రాత్రి ప్రథమ ప్రహారములో మొదటి జాములో తుది జాములో స్మృతి కలుగును. ముహుర్ముహుః చింతాభ్యాసమునను స్మృతి కలుగును. సమానశ్రవణమున సమానదర్శన మున నిది కలుగును. ఇట్లుదయించు స్మృతిలో నివి యనుభావము లగును. మాటి మాటికి భ్రూసమున్నమనము శిరమునూపుట సమానమును చూచుటహర్షము శిరఃకంపనము-ఇట్టి వనుభావము లని రసకోవిదు లనిరి.

## 13. ధృతిః

శౌర్యాద్విజ్ఞానతః శౌచాచారాచ్చ గురుభక్తితః
శ్రుతప్రభావతో వ్రీడానానార్థాప్తే ర్భవే ద్ధృతిః. 217
ప్రియాప్రియావికారిత్వం తదాత్వోచితకారితా
అప్రాప్తాతీతనష్టానా మలాభేఽనభిశోచనం. 218

ధృతి యనునది ధీరత. అది శౌర్యమున విజ్ఞానమున శౌచాచారమున గురుభక్తివలన గలుగును. సావధానముగా వినిన దాని ప్రభావముననుగలుగును. వ్రీడావిశేషమున గలుగును. నానార్థప్రాప్తి వలనను గలుగును. ఈ ధృతియందీ యనుభావము లుండును. ప్రియప్రాప్తిలో గాని యప్రియప్రాప్తిలో గాని నిర్వికారముగా నుండుట, తత్తత్సమయమున సముచితములయిన కార్యముల నాచరించుట, అప్రాప్తములు అతీతములు నష్టములు లభింపక పోయినను చింత పడకుండుట అనునవి యిం దను భావములు.

## 14. హర్షః

హర్షో మనఃప్రసాదః స్యాదీప్సితార్థోపసంగమాత్
ఇష్టసంగమనా ద్దేవ గురు భర్తృ ప్రసాదతః. 219
అభిరూపోపభోగాచ్చ బంధుతృప్తేః సుభోజనాత్
అచింత్యేష్టార్థసంపత్తే ర్జాయతే సర్వదా నృణామ్. 220
రోమాంచాలింగన స్వేదైః లలితైః కరతాడనైః
నేత్రవక్త్రప్రసాదైశ్చ భాషితై ర్మధురై రపి. 221
త్యాగదానప్రబంధైః స్యురనుభావాస్తు హర్షజాః

హర్ష మన్నది మనఃప్రసాదము. ఇది కోరుకొనిన పదార్థముల ప్రాప్తి వలన గలుగును. ఇష్టసంగమము వలన గలుగును. దేవప్రసాదమున గురు ప్రసాదమున భర్తృప్రసాదమున కలుగును. అభిరూపము తనకు తగినది. అట్టి దాని యుపభోగముననుగలుగును. బంధువులకు గలిగిన తృప్తి వలన, బంధువుల వలన గలిగిన తృప్తి వలనను హర్షము గలుగును. ఇష్టమృష్టాన్నము భుజించి నందుననుగలుగును. అనుకొనిన యిష్టార్థముల సంప్రాప్తి వలనను గలుగును. మానవుల కెల్లప్పు డిట్టి విశేషముల వలన నీ హర్ష ముదయించును. దీని యను భావములు రోమాంచము ఆలింగనము స్వేదము లలితముగా కరతాడనములు

నేత్రప్రసాదము ముఖప్రసన్నత మధురభాషణము అధికముగా త్యాగము దానము అనునవి హర్ష జన్యము లయిన యనుభావములు.

## 15. చపలతా

చాపలం ప్రాతికూల్యేర్ష్యా మత్సరద్వేష రాగజమ్. 222

అనుభావోఽవిమృశ్యైవ తాడనం బంధనం వధః
భర్త్సనం దండ పారుష్య మవమానాది కథ్యతే. 223

చపలత యనగా చంచల స్వభావము. ప్రాతికూల్యమువలన, ఈర్ష్య వలన, మాత్సర్యమువలన, ద్వేషమువలన, రాగమువలన చాపలగము కలుగును. అవిశ్యకముగా కొట్టుట, బంధించుట, వధించుట, భేదరించుట, దండించుట పరుషముగా మాటాడుట, అవమానించుట మొదలగునవి యిందలి అనుభావములు.

## 16. ఆవేగః

ఆవేగస్తు మహోత్పాత వాత వర్షాగ్ని కుంజరాత్
ప్రియాప్రియశ్రుతేశ్చాపి వ్యసనాభిహతై రపి. 224

ఉల్కాశనిప్రపతన చంద్రసూర్యోపరాగతః
కేతుదర్శన భూకంపాదిభిరుత్పాత ఉచ్యతే. 225

స వర్ణనీయో వైవర్ణ్య భయ విస్మయ సంభ్రమైః
విషాదాద్వైమనస్యేన సర్వాంగోత్కంపనై రపి. 226

త్వరితై ర్గమనై ర్వస్త్రాచ్ఛాదనై రవగుంఠనైః
నేత్రావమర్దనై ర్వాతజనితం వర్ణయేద్బుధః. 227

ఛత్రాదిగ్రహణాచ్ఛన్నాశ్రయసర్వాంగపీడనైః
ఆపీడధావనై ర్బాహుస్వస్తికోత్కటికాసనైః. 228

శిరోఽవనమనైః శీఘ్రగతై ర్వర్ణ్యేత వర్షజమ్
అతిక్రాంతపదై రంగధూననై ర్వ్యజనగ్రహైః. 229

బాష్పజృంభణనిశ్వాసై రభినేయోఽగ్నిసంభవః
పశ్చాద్విలోకన స్తంభ భయ వేపథు విస్మయైః. 230

కుంజరభ్రమజో భావ్య స్త్వరితై రపసర్పణైః

వస్త్రాభరణదానాశ్రుపులకాలింగనాదిభిః. 231

అభ్యుత్థానేన వర్ణ్యోఽయం ప్రియశ్రవణజో బుధైః
విలాపాక్రంద భూపాత పరిదేవిత ధావితైః. 232

అప్రియశ్రుతిజో వర్ణ్యో విషమైః పరివర్తనైః
గజ వాజి రథారోహ శస్త్రాస్త్ర గ్రహధారణైః. 233

శత్రువ్యసనజో వర్ణ్యః సహసాఽపక్రమాదిభిః
ఏవమష్టవిధో జ్ఞేయ ఆవేగః సంభ్రమాత్మకః. 234

ఆవేగ మెనిమిది విధములు. ఉత్పాతజము, వాతజము, వర్షజము, అగ్నిజము, కుంజరజము, ప్రియజన్యము, అప్రియజన్యము, శత్రువ్యసనజన్యము, నని. ఈ యంశ మీ ప్రఘట్టకారంభమున లక్షిత మయినది. ఆవేగము మహోత్పాతము వలనను వాతమునను వర్షము వలనను అగ్ని వలనను కుంజరము వలనను ప్రియశ్రుతి వలనను అప్రియశ్రుతి వలనను శత్రువు వలన గలిగిన వ్యసనమున నభిఘాతము కలుగుట వలనను గలుగును. వీని స్వరూప మిట్లు గుర్తింపవలెను.

1. ఉత్పాతజన్యము: ఉల్కాపాతము అశనిపాతము పిడుగుపాటు చంద్రగ్రహణము సూర్యగ్రహణము కేతుదర్శనము భూకంపము మొదలగు వాని వలన నుత్పాత ముదయించును. ఇట్టి యుత్పాతమును వైవర్ణ్యము భయము విస్మయము సంభ్రమములచే వర్ణింప నగును.

2. వాతజనితము నీ విధముగా వర్ణింప వలెను. విషాదము వైమనస్యము సర్వాంగములందు గలుగు నుత్కంపము త్వరితగమనము వస్త్రాచ్ఛాదనము అవగుంఠనము నేత్రావమర్దనము ననువానిచే బుధులు వర్ణింప దగును.

3. వర్షజావేగము: ఈ యావేగమునందు ఛత్రాదిగ్రహణము పైకప్పుకల ప్రదేశముల నాశ్రయించుట సర్వాంగములను ముడుచుకొనుట చెదురుగా పరుగెత్తుట బాహువులను స్వస్తికాకృతిగా కూర్చుట గొంతుకూర్చొనుట తలవంచియుండుట శీఘ్రగమనము వర్ణింప దగును.

4. అగ్నిజన్య మగు నావేగమును పదము లెత్తి యెత్తి వేయుట శరీర మవయవములు విదల్చుట వ్యజనము నడ్డముగా నుంచుట బాష్పము లావలింతలు నిశ్వాసములు మొదలగు వానిచే నభినయింప వలెను,

5. గజభ్రమణజన్య మగు నావేగమును పశ్చాద్విలోకనమున నిశ్చేష్టతాత్మక మయిన స్తంభమున భయమున కంపమున విస్మయమున వేగమున నగు నపసర్పణమున నభినయింప దగును.

6. ప్రియశ్రవణజన్య మగు నావేగమును వస్త్రదాన మాభరణదాన మశ్రువు పులకము లాలింగనములు మొదలగు వానిచే నభినయింప వలెను లేచి యెదుర్కొనుటచే నభినయింప దగును.

7. అప్రియజన్య మయిన యావేగమును విలాపము ఆక్రందనము భూనిపాతము పరిదేవితము పరుగెత్తుట విషమపరివర్తనములచే నభినయింప వలెను. ఏడుపు పెద్దయేడుపు పెద్దబొబ్బల యేడుపులు విలాపాదుల యర్థములు.

8. శత్రువ్యసనజన్య మగు నావేగమును గజారోహణాశ్వారోహణ రథారోహణములచే నభినయింప వలెను. శస్త్రగ్రహణమున అస్త్రధారణమున నభినయింపవలెను, వేగముగా రంగము నుండి తొలగుట నభినయింప వలెను.

ఆవేగము సంభ్రమాత్మకము. దీని నిట్లుష్టవిధముగా గ్రహింపవలెను.

## 16. జాడ్యమ్

జాడ్యమప్రతిపత్తిః స్యాత్సర్వకార్యేషు సర్వదా
ప్రియాప్రియశ్రుతై స్తద్దర్శనై ర్వ్యాధిభి ర్భవేత్. 235

సుఖదుఃఖావివేకిత్వ మిష్టానిష్టానభిజ్ఞతా
తూష్ణీమప్రతిభా చాఙ్గో రనిమేషో ఽనవేక్షణమ్. 236

అభాషణం పారవశ్యమేతై ర్జాడ్యం నిరూప్యతే

జాడ్య మనునది జడత. దీని నప్రతిపత్తి యందురు. గుర్తింపు లేకుండుట. జ్ఞానాభావము, సర్వకార్యము లందును సర్వసమయములందు నీ యప్రతిపత్తి యుండుట జాడ్యము. ఇది ప్రియశ్రవణమున గలుగును. అప్రియ శ్రవణమున గలుగును. ప్రియాప్రియదర్శనమునను వ్యాధుల వలనను గలుగును. సుఖమని దుఃఖమని గుర్తింప లేకపోవుట, ఇష్టమని యనిష్టమని గ్రహింప కుండుట, ఊరకనుండుట, అప్రతిభత్వమున నుండుట, అనిమేషస్థితి, అదర్శనము, భాషింపకుండుట, పారవశ్యము నను వానిచే జాడ్యము నిరూపింప దగును.

## 17. ఔత్సుక్యమ్

ఔత్సుక్యమిష్టవిరహా త్తదనుస్మృతిదర్శనాత్. 237
చింతయా నిద్రయా శయ్యాభిలాషాద్గాత్రగౌరవైః
వర్ణ్యతే సమ్యగౌత్సుక్యం త్వరానిశ్వసితాదిభిః. 238

ఔత్సుక్య మొక తహతహ. అది యిష్టవిరహమువలన గలుగును. తదను స్మరణము వలన గలుగును. తద్దర్శనమున గలుగును. చింతచే నిద్రచే శయ్యాభిలాషమున గాత్రగౌరవమున నౌత్సుక్యము వర్ణిత మగును. త్వరానిశ్వసితాదులచే నీ యౌత్సుక్యము సమ్యగ్వర్ణిత మగును. ఇట్టి వానిచే వీని నభివర్ణించుట యభినయించుట యుక్తము.

## 18. విషాదః

కార్యానిస్తరణాత్ దైవా ద్వ్యాపత్తే రాజదోషతః
చౌర్యాదిగ్రహణా ద్విఘ్నా ద్విషాదో నామ జాయతే. 239
జ్యేష్ఠ మధ్య కనిష్ఠేషు స త్రిధా కథ్యతే బుధైః
సహాయాన్వేషణోపాయచింతాది జ్యేష్ఠతో భవేత్. 240
వైమనస్య మనుత్సాహో విఘ్నైః శయ్యా చ మధ్యమే
ధ్యానశ్వసితమూర్ఛాదిః కనిష్ఠానాం నిరూప్యతే. 241

విషాద మిచట లక్షిత మగును. కార్యనిర్వహణము కుదురనందున విషాదము జనించును. దైవము వలన విశిష్టమగు నాపదవలన నిది జనించును. రాజదోషమున నిది జనించును. తానొనరించిన చౌర్యము నితరులు గ్రహింపగా నిది యుదయించును. ఇట్టి యీ విషాదము జ్యేష్ఠ మధ్యమ కనిష్ఠులం దనుగతమై మూడు విధముల నుండుటను బుధులు నిర్దేశించిరి. జ్యేష్ఠవ్యక్తిగత మయిన విషాదమున సహాయాన్వేషణము ఉపాయచింతనము మొదలగు నవి యుండును. మధ్యమగత మయిన విషాదమున వైమనస్యము విఘ్నముల వలని యనుత్సాహము శయనించుట యుండును. కనిష్ఠగత మయిన విషాదమున ధ్యానము నిట్టూర్పుట మూర్ఛ మొదలగునవి యుండును.

## 19. గర్వః

గర్వో విద్యాబలైశ్వర్య వయో రూప ధనాదిభిః
తమను త్తరదానేన శూన్యాలోకై రభాషణైః. 242

ఆశ్రితేష్వస్యవజ్ఞానాద్దోర్ద్వయాంగావలోకనాత్
అసూయాఽమర్ష పారుష్యాపహాసగురులంఘనైః. 243

అకారణా దధిక్షేపాద్గాత్రాణాం విక్రుతైర్వదేత్

గర్వ మనునది విద్యాధిక్యము వలన బలమున్నందున ఐశ్వర్యము వలన వయఃప్రాభవము వలన రూపాతిశయము వలన ధనాదుల వలన గలుగును. గర్వము సూచించు ననుభావము లీ విధమున నుండును. గర్వము కలవారు సరిగా సదుత్తర మీయరు. శూన్యాలోకనము అసంభాషణము ఆశ్రితుల విషయమున గూడ తిరస్కారము తన భుజములను చూచుకొనుట తన దేహము నవయవములను పరిశీలించుకొనుట అసూయతో నుండుట అమర్షము పారుష్యము అపహాసములతో నుండుట గర్వానుభావములు. గురువుల నుల్లంఘించుటయు నిం దుండును. అకారణాధిక్షేపము లిం దుండును. గాత్రవికారము లిం దుండును. ఇట్టి వాని చి గర్వము నిశ్చయింప నగును.

## 20. అమర్షః

ప్రతిక్రియేచ్ఛాఽమర్షః స్యాద్విద్యైశ్వర్యబలాధికైః. 244

ఆక్షిప్తస్య సభామధ్యేఽవమానం గమితస్య వా
శిరః ప్రకంపన స్వేద ధ్యానోపాయ గవేషణైః. 245

ఉత్సాహవ్యవసాయాద్యై ర్వర్ణ్యోఽసౌ రసకోవిదైః

అమర్ష యనునది ప్రతిక్రియ నాచరింపవలె నన్న భావముతో నుండును. విద్యైశ్వర్యబలాధికులతో స్పర్ధ పెట్టుకొనుట. సభామధ్యమున నాక్షిప్తు డయిన వాని కమర్ష కలుగును. అవమానము పొందిన వాని కిది కలుగును. రసకోవిదు లమర్ష కలవానికి శిరఃకంపనము స్వేదము ధ్యానము ఉపాయాన్వేషణము ఉత్సాహము ప్రయత్నము మొదలగు వానిని వర్ణింప వలెను.

## 21. అవహిత్థమ్

అవహిత్థం భయవ్రీడాధార్ష్ట్యకౌటిల్య సంభవమ్. 246

శూన్యస్మితం కథాభంగో మిథ్యాధైర్యం తదీక్షణం
అంతర్వ్యథా బహిర్గర్వభావ నేత్యవహిత్థజాః. 247

అవహిత్థ మనునది యాకారగోపనము భయము వ్రీడ దార్ఢ్యము కౌటిల్యముల వలన గలుగును. ఇందనుభావములు శూన్యస్మితము ప్రకృతప్రసక్తికి

భంగము కలిగించుట మిథ్యాధైర్యము మిథ్యాసమీక్షణము అంతర్వ్యథ జయటికి గర్వభావనము అనునివి యవహిత్థజన్యము లగు ననుభావము లని గ్రహింప దగును.

## 22. మతిః

నానాశాస్త్రార్థసంపన్నా మతిః స్యాత్ శ్రుతధారిణీ
సంశయచ్ఛేదనైః శిష్యహితాధానార్థదర్శనైః. 248
వర్ణ్యతే చిత్తసంతోషాద్విదగ్ధవ్యవహారతః

మతి యనునది నానాశాస్త్రార్థభావనమున జనించును. శాస్త్రవాదము లందు గ్రహించిన విషయములను బహుశ్రుతుల నుండి వినిన విషయములను బాగుగా ధారణము చేయగల శక్తి యీ మతిలో నుండును. ఈ మతిని సంశయచ్ఛేదనవిధానముల వర్ణింతురు. శిష్యహితము సంపాదించుటకై తగిన యర్థముల ప్రదర్శనములచే వర్ణింతురు. చిత్తసంతోషమున విదగ్ధవ్యవహారమున నీ మతి సూచిత మగును.

## 23. నిద్రా

నిద్రా మద శ్రమ గ్లాని దౌర్బల్యాలస్య చింతనైః. 249
అత్యాహారాదనశనదుఃఖశోకాదిభిర్భవేత్
తాం గాత్రగౌరవైరక్ష్ణోర్నిమీలన విఘూర్ణనైః. 250
నిశ్వాస జాడ్యజృంభాఢి విమర్దైర్వర్ణయే త్కవిః

నిద్ర యనునది చిత్తనిమీలనము. ఇది మదము శ్రమము గ్లాని దౌర్బల్యము ఆలస్యము చింతనములచే గలుగును. అత్యాహారమున గలుగును. అనశనమునను ఆహారము లేనందున గలుగును. దుఃఖమునను గలుగును. శోకాదులచే గలుగును. ఈ నిద్రను గాత్రగౌరవమున శరీరభావమున వర్ణింప వచ్చును. నేత్రనిమీలనమున సూచింపవచ్చును. నేత్రముల విఘూర్ణనమునను వర్ణింప వచ్చును. విశ్వాసము జాడ్యము జడత జృంభ కన్నులు నులుము కొనుట మొదలగు వానిచే నిద్రను కవి వర్ణింప వలెను. దేహమున పురీతతనాడితో మనస్సంయోగము నిద్ర.

## 24. అపస్మారః

అపస్మారో మహాభూత పిశాచ బ్రహ్మరక్షసామ్. 251

గ్రహణానుస్మృతేః శూన్యశ్మశానాగార సేవనైః
కాలాతిక్రమణా ద్ధాతువైషమ్యా దశుచిత్వతః. 252

జాయతే స తు నిశ్వాస స్తంభ స్ఫురిత కంపితైః
ఫేనవక్త్రత్వ పతన జిహ్వాలేహన ధావనైః. 253

స్వేద కంఠోద్ధతారావ వికటాక్షైర్నిరూప్యతే

అపస్మారము భూతావేశనమున గలుగును. పిశాచావేశమున గలుగును. బ్రహ్మరక్షోగ్రహణమున గలుగును. మహాభూతాదుల గ్రహణానుస్మరణమునను గలుగును. శూన్యశ్మశానమున సంచరించినను శూన్యభవనము లందు నివసించినను అపస్మారము కలుగును. కాలాతిక్రమణమున గలుగును. ధాతువైషమ్యమున గలుగును. అశుచిగా నున్నందున గలుగును. అది నిశ్వాసము స్తంభము స్ఫురితము కంపితములచే గలుగును. దీని నీ యనుభావములచే సూచింప వచ్చును. ముఖము నందలి నురుగు పతనము జిహ్వాలేహనము ధావనములచే నిరూపిత మగును. స్వేదము కంఠము నందలి యుద్ధతధ్వని వికటమయిన దృష్టి యను నవియు నపస్మారనిరూపకము లగుటను తదభిజ్ఞులు నిరూపించిరి.

## 25. విబోధః

విబోధః శబ్ద సంస్పర్శ భీషణ స్వప్న దర్శనైః. 254

నిద్రాచ్ఛేదా త్తథాహారాపరిణామాదిభి ర్భవేత్
భుజాక్షేపాంగవిస్ఫోట జృంభణాక్ష్యవమర్శనైః. 255

శయ్యాత్యాగేన వర్ణ్యోయం గ్రీవాంగవలనాదిభిః

విబోధము చేతనావాప్తి. శబ్దము వలన సంస్పర్శనమువలన భీషణ స్వప్నదర్శనమున నిద్రానాశనము వలన ఆహారము సరిగా జీర్ణము కానందున విబోధము కలుగును. దీని యనుభావము లిట్లున్నవి. భుజాక్షేపము అంగవిస్ఫోటము, ఒడలు విఱిచి కొనుట ఆవలింత కన్నులు నులుముకొనుట శయ్యాత్యాగము మెడమలచుట అంగవలనము మొదలగు వానిచే విబోధము సూచిత మగునట్లు కవులు వర్ణింప వలెను.

## 26. సుప్తిః

సుప్తిర్నిద్రాసముత్థా స్యాత్తాం మందాక్షిమీలనైః. 256

స్వప్నరుచ్ఛ్వాసనిశ్వాసై రింద్రియాస్పందనైరపి
స్పర్శ్యానభిజ్ఞతా చేష్టావైధుర్యాద్యైశ్చ వర్ణయేత్. 257

సుప్తి స్వాపము నిద్రవలన గలుగు నవస్థ. దీనిని మందమందముగా నుండు నేత్రనిమీలనములచే నిరూపింప వలెను. స్వప్నములచే నిరూపిత మగును. ఉచ్ఛ్వాస నిశ్వాసములచే నిశ్చలేంద్రియములచే నిరూపింప దగును. సుప్తి ననుభవించు వారు స్పర్శమును గుర్తింపజాలరు. చేష్ట లొనరింప లేరు. స్పర్శానభిజ్ఞత చేష్టావైధుర్యము మొదలగు వానిచే సుప్తి నభినయింప నగును.

## 27. ఉగ్రతా

పుత్ర మిత్ర కలత్రాది ద్రోహాదేవోగ్రతా భవేత్
తత్రానుభావోఽతిక్రూరవధ బంధన తాడనైః. 258

ఉగ్రత యను భావము పుత్ర మిత్ర కలత్రాదుల కితరు లొనరించిన ద్రోహమున గలుగును. పుత్రమిత్రాదు లొనరించు ద్రోహమునను ఉగ్రత గలుగును. అతిక్రూరము లగు వధ బంధన తాడనాది విశేషము లిం దనుభావములుగా నుండును.

## 28. వ్యాధిః

వ్యాధిః స్యా ద్దేశకాలాది దోష వైషమ్య సంభవా
వ్యాధిర్జ్వరాత్మా ద్వేధా స్యాదుష్ణ శీత విభాగతః. 259
శిరః కంపాంగసంకోచ ముఖశోషాస్యకూణనైః
పరిదేవిత రోమాంచ హనుసంచలనాదిభిః. 260
వర్ణ్యతేఽత్ర సదాహస్తు భూశయ్యా పరిదేవితైః
విక్షిప్తబాహుచరణవస్త్రైః శీతాభిలాషతః. 261
శీతానులేపనోత్క్రోశ రక్తేక్షణతయోచ్యతే
వర్ణ్యతే వ్యాధి సామాన్యం గాత్రస్తంభాస్యకూణనైః. 262
శ్వాస శ్లథాంగతోత్క్రోశ స్రస్తాశ్రు స్తనితాదిభిః

వ్యాధి జ్వరరూపము. దేశకాలాదుల వైషమ్యము వలన గలుగును. జ్వరాత్మక మయిన యీ వ్యాధి రెండు విధముల నుండును ఉష్ణజ్వరాత్మక వ్యాధి, శీతజ్వరాత్మక వ్యాధి యని. శిరఃకంపము అంగసంకోచము ముఖశోషము

ముఖకూణనము పరిదేవితము రోమాంచము దవడల సంచలనము మొదలగు వానిచే శీతవ్యాధి వర్ణిత మగును. దాహజ్వరము భూశయ్యా పరిదేవితములతో వర్ణిత మగును. బాహువులను చరణములను వస్త్రములను ఇటు నటు వేయుట శీతాభిలాషమున నుండుట శీతానులేపనము కేకలు వేయుట కన్ను లెర్ర బడుట అనువానితో నుండును. గాత్రస్తంభము ముఖకూణనము శ్వాసములు శ్లథాంగత కేకలువేయుట కన్నులు జారవేయుట మూలుగుట మొదలగు వానిచే వ్యాధిసామాన్యము వర్ణిత మగును.

## 29. మరణమ్

మరణేత్వభినయో నాస్తీత్యేతత్కావ్యే న బధ్యతే. 263

మరణం తద్ద్విధా వ్యాధేరభిఘాతాచ్చ జాయతే
ఆయురామ్నాయకథితో జ్వరాదిర్వ్యాధి రిష్యతే. 264

అభిఘాతస్తు శస్త్రాస్త్రాశనిపాతాది రీరితః
వివర్ణగాత్రతా శ్వాస వేదనాక్షి నిమీలనైః. 265

అవ్యక్త వర్ణకథన వ్యాయతాంగ విచేష్టితైః
హిక్కాపరిజనోపేక్షాదిభి ర్వ్యాధిజ మున్నయేత్. 266

అనుభావాస్తు బహుధా కథ్యంతే హ్యాభిఘాతజే

మరణము నంభినయింప దగు నభినయ ముండదు కాన నది కావ్యమున నిబద్ధము కాదు. మరణము రెండువిధములు. వ్యాధి వలనగలుగు మరణము, అభిఘాతము వలన గలుగు మరణము నని. ఆయురామ్నాయమాయుర్వేదము. ఆయుర్వేదమున నిరూపిత మయిన జ్వరాదికమునకు వ్యాధి యను వ్యవహారము కలదు. శస్త్రాస్త్రములచే నశనిపాతాదులచే గలుగునది యభిఘాతము. వ్యాధి జన్యము మగు మరణము నీ విధముగా నభినర్ణింప వచ్చును. వివర్ణగాత్రత శ్వాస వేదనము నేత్రనిమీలనము వర్ణములు స్పష్టము కాకుండు నట్లు పలుకుట దేహావయవములు సాచి విచేష్టితములతో నుండుట ఎక్కిళ్లు వచ్చుట పరిజనుల యెడ నుపేక్షవహించుట మొదలగు వానిచే వ్యాధిజ మరణమును నిరూపింప దగును. అభి ఘాతజన్య మయిన మరణమున ననుభావము లనేకవిధములుగా నున్నవి. భూమియందు పొర్లుట దొర్లుట చుట్టలు చుట్టుకొని పడుట పెడబొబ్బలు పెట్టుట విలాప మొనరించుట భ్రమణముల నుండుట అను నిట్టి వభిఘాతజన్య మరణానుభావములు.

## 30. త్రాసః

త్రాసో భవేన్నిపతనాత్ శిలోల్కా-ఽశని విద్విషామ్. 267

రక్షః స్థూలపశూద్ఘాత నిర్ఘాతాంబుధర స్వనైః
రోమాంచ గద్గద స్వేద కంప మోహాదిభిర్భవేత్. 268

త్రాసము భయము. ఇది శిలాపతనమున ఉల్కాపతనమున పిడుగుపాటు వలన శత్రునిపతనమున నుదయించును. ఇంకను రక్షఃస్వనములచే స్థూలపశు ధ్వనులచే బ్రద్ధ లయిన ధ్వనులచే పిడుగుపాటు ధ్వనులచే మేఘముల యురుములచే గలుగును. ఇది గలుగగా రోమాంచము గద్గదస్వనము స్వేదము కంపము గలుగును. మోహాదులు నుదయించును. రోమాంచాదు లనుభావములుగా త్రాసము సూచిత మగునని భావము,

## 31. ఉన్మాదః

జ్యేష్ఠస్యాభీష్టవిరహా న్మధ్యస్యేష్టవిఘాతనాత్
నీచానాం ధననాశాద్యై రున్మాదో నామ జాయతే. 269

అనిమిత్తస్మితోత్క్రోశ గీత నృత్త విధావనైః
కుచేల తృణ నిర్మాల్య శరావాది విభూషణైః. 270

అనవస్థితి శయ్యాంతోపవేశోత్థిత రోదనైః
అసత్ప్రలాప స్ఖలిత వికారాద్యైస్స వర్ణ్యతే. 271

ఉన్మాదము పిచ్చి. ఈ పిచ్చి జ్యేష్ఠున కభీష్టవిరహమున గలుగును. మధ్యమున కభీష్టవిఘాతమున గలుగును, నీచులకు ధననాశాదులచే గలుగును, పిచ్చి గలుగగా, అనిమిత్తముగా నవ్వుట కేకలు వేయుట పాటలు పాడుట చిందులు వేయుట పరుగు లెత్తుట లుండును. మాసిన గుడ్డలు ధరించుట గడ్డి పట్టుట నిర్మాల్యము ధరించుట కుండబోచ్చెలు మొదలగు వాని నాభరణములుగా ధరించుట లుండును. ఒకచోనుండకుండుట ప్రక్కపై నొక ప్రక్క కూర్చొనుట లేచుట రోదించుట లిందుండును. అసత్ప్రలాప ముండును. స్ఖలితము లుండును. వికారాదు లుండును. ఇట్లున్మాదము వర్ణిత మగుచున్నది.

## వితర్కః

వితర్కః సంశయాద్దూరదృష్టార్థాపరినిశ్చయాత్
విమర్శాద్విపస్మృతార్థస్య స్మృతేరిత్యాదిభి ర్భవేత్. 272

గ్రహమోక్ష శిరఃకంప వ్యవహారాదిభి ర్భవేత్

వితర్క మనునది సంశయమున గలుగును. దూరము నుండి చూచిన వస్తువును నిశ్చయింపలేక పోయినందున గలుగును. అది యగునా? ఇదియగునా? యను విమర్శము వలన గలుగును. మరచిన వస్తువును స్మరించుటవలన గలుగును. ఇట్టి వాని వలన వితర్కము గలుగును. ఈ వితర్కమును ఈ విధముగా నిరూపింప దగును. ఒక భావమును గ్రహించుట దాని విడుచుట, ఇది యగు నన్న శిరః కంపము, ఇది కా దను శిరోధూననము మొదలగు వ్యవహారములచే వితర్కమును నిరూపింప వచ్చును. వర్ణింప వచ్చును.

ద్రష్టవ్యం తత్ర తత్రైవ సాత్త్వికవ్యభిచారిణాం. 273
పరస్పర విభావానుభావత్వే రసకోవిదైః

సాత్త్వికభావములు వ్యభిచారిభావములు పరస్పరము విభావానుభావత్వము కల వగుట కలదు. ఒకప్పుడు సాత్త్వికభావములకు వ్యభిచారిభావములు విభావము లగును. అనుభావములు నగును. అట్లే వ్యభిచారిభావములకు సాత్త్విక భావములు విభావము లగును. అనుభావములు నగును. సాత్త్వికములు విభావము లగుట అనుభావము లగుట వ్యభిచారిభావములు విభావము లగుట అనుభావము లగుట రసకోవిదు లా యా స్థలము లందు పరిశీలించి నిశ్చయించుట యుక్తము. వాని యా రీతి నిచట నిరూపింప వలసిన యావశ్యకత లేదు.

ఈ నిరూపించినవె కాక ఇంకను వ్యభిచారిభావము లుండును గదా! వానిని నిరూపింప లేదేమి?

అన్యేఽపి యది భావాః స్యుశ్చిత్తవృత్తివిశేషతః. 274
అంతర్భావస్తు సర్వేషాం ద్రష్టవ్యో వ్యభిచారిషు
యే భావాస్తేషు భావేషు ప్రత్యాసన్నాః పరస్పరం. 275
విభావతోఽనుభావాచ్చ స్ఫుటభేదా ఇహోదితాః
స్థాయిష్వపీయ మన్యోన్యం ప్రక్రియా భావ్యతాం బుధైః. 276

చిత్తవృత్తివిశేషానుసారమున మరికొన్ని భావములు నుండ వచ్చును. కొన్ని లక్ష్యము లందు కొన్ని భావములు గోచరించు చున్నవి. మాత్సర్యము ఉద్వేగము దంభము ఈర్ష్య వివేకము నిర్ణయము క్లైబ్యము క్షమ కుతుకము

ఉత్కంఠ వినయము సంశయము ధార్ష్ట్యము మొదలగునవి యుండును. కాని వానిని వేరుగా పరిగణింప నక్కర లేదు అట్టివాని కన్నింటికి నీ చెప్పిన వ్యభిచారిభావము లందే యంతర్భావమును గుర్తింప వలెను. ఆ యా భావములలో సన్నిహితము లగునవి పరస్పరము విభావానుభావరూపముగా నుండుటచే స్ఫుట భేదము లగు వానినే యిచట నిరూపించుట యయినది. కొన్ని ప్రత్యాసన్నములు కాక దూరముగా వ్యవహితములుగా నుండును. అట్టివి యీ వ్యభిచారి భావములలో విభావములుగ గాని యనుభావములుగ గాని యున్నట్లు స్ఫుటము కా నందున వాని నిచట సంకేతింప లేదు. ఇట్టి యన్యోన్యప్రక్రియను స్థాయి భావము లందును బుధులు గుర్తింప వలెను ఈ విషయ మిట విశదము కాగలదు.

> సభ్యాప్రసయితు మభినయచాతుర్యార్థం రసం చ పోషయితుం
> కవిభిర్నిబంధనీయాస్తే చ విభావాదయో నియతాః. 277
>
> స్థాయిషు భావేషు యదా యే చ విభావాదయః ప్రతినియతాః
> తై రేవ సతి నిబంధే భావవిశేషః ప్రతీయతే తత్ర. 278
>
> యద్యన్యథా నిబంధే సాధారణ్యేన సంశయోత్పత్తేః
> దోషో విభావ్యతే వా యుక్తవిభావాదివైధుర్యాత్. 279
>
> యథాఽభిధీయమానాస్తే రసమాహర్తుమీశతే
> తథైవాక్షిప్యమాణాస్తు రసంపుష్ణంతి నిత్యశః. 280

భావము లన్నియు స్థాయిభావానుసారముగ వ్యవస్థితములై యున్న వనుట యిచట ప్రతిపాద్యము. విభావానుభావ వ్యభిచారిభావములను సాత్త్విక భావములను పరిశీలించి కవులు నిరూపింప వలెను. ఆ పరిశీలనము మూడు విధముల నున్నది. సహృదయ సదస్యు లాస్వాదించు నట్లొనర్చుట మొదటి విధము. అభినయచాతుర్య సంపాదనము రెండవది. రసమునకు పోషణము సంపాదించుట మూడవది. ఈ మూడును మూడువిధము లగు వేరు వేరు ప్రయోజనములు కావు. మూడు నొకటే. ఈ త్రితయసంపత్తికై విభావాదులను కవులు నిబంధింప వలె ననుట కవుల కుపదేశాత్మకము. ఆ యా స్థాయిభావము లందు విభావాదులు ప్రతినియతములై యుండును. అట్లు ప్రతినియతము లగు విభావాదులను నిబంధించినచో నచట భావవిశేషము ప్రతీయమాన మగును విభావానుభావవ్యభిచారుల నిరూపించుటలో నొక వ్యవస్థ కలదు. విభావాదులలో నేదియేని స్థాయిభావమున నియతమై యుండును. విభావము నియమితమై యుండు

నేని అనుభావములు కాని వ్యభిచారిభావములు కాని యితరస్థాయిభావములకును సాధారణముగా నుండ వచ్చును. అట్లె యనుభావము ప్రతినియతముగా నుండగా విభావవ్యభిచారు లన్యభావములకు సాధారణముగా నుండ వచ్చును. విభావానుభావవ్యభిచారిభావములలో నన్నియు సర్వసాధారణములుగ నున్నచో ప్రతినియతమగు ప్రకృతస్థాయి ప్రతీతము కాదు. కావున నియతసంబంధము కల విభావానుభావ వ్యభిచారిభావములనె కవులు నిబంధింప వలె నని భావము. ప్రతినియతము లయిన విభావాదుల నిబంధనమువనె నియత మగు భావవిశేషము భాసించును.

ఇట్లు ప్రతినియతము లయిన విభావాదులను నిబంధించుట యుక్తము. అట్లు కా దేని సర్వసాధారణము లయిన విభావాదులను నిబంధించినచో నవి సర్వసాధారణములు కావున సంశయ ముదయించును. ఈ విభావ మే స్థాయిని నిరూపించును? ఈ స్థాయిభావమునె నిరూపించునా? ఆ స్థాయిభావమును నిరూపించునా? అని సంశయ ముదయించును. సంశయ ముదయింపగా యుక్తము లయిన విభావాదుల వైధుర్యము వలన ప్రతిపాదన దోషమున్న దనిపించును. స్థాయిభావముతో నియతసంబంధముకల విభావాదుల నిరూపణము రసముల్లసింప జేయుటకు సమర్థ మగును. అట్లె యాక్షిప్యమాణము లగు విభావాదులును నియతముగా రసపోషము సంపాదింపగలవు. ఒక స్థాయిభావమునకు ప్రతినియత మయిన విభావమును గాని యనుభావమును గాని వ్యభిచారి భావమును గాని నిబంధించినచో నదియె ప్రతినియతము లగు నితరముల నాక్షిప్తము చేయగలదు. ప్రతినియతానుభావము విభావవ్యభిచారులను, ప్రతినియతవ్యభిచారిభావము విభావానుభావములను నాక్షిప్యమాణ మొనరింప గలవు. అట్లాక్షిప్తములును రససముల్లాస మొనర్ప సమర్థములె యగును. అందువలన భావము లన్నియు స్థాయిభావానుసారముగ వ్యవస్థితము లగుటను భావింప వలెను.

రస వ్యభిచారిభావ సంబంధః

విశేషాదాభిముఖ్యేన చరంతో వ్యభిచారిణః
స్థాయిన్యున్మగ్ననిర్మగ్నాః కల్లోలా ఇవ వారిధౌ. 281

ఉన్మజ్జంతో నిమజ్జంతః కల్లోలాశ్చ యథార్ణవే
తస్యోత్కర్షం వితన్వంతి యాంతి తద్రూపతామపి. 282

స్థాయిన్యున్మగ్ననిర్మగ్నా స్తథైవ వ్యభిచారిణః
పుష్ణంతి స్థాయినం స్వాంశ్చ తత్ర యాంతి రసాత్మతామ్. 283

యద్యపి స్యాద్రసాత్మత్వం తేషాం క్వాపి కదాచన
అస్థిరత్వాదథైతే స్యుర్నాట్యాద్యనుపయోగినః. 284
తస్మాదష్టావితి మతం స్థాయినో నాట్యవేదినాం

రసములకు వ్యభిచారిభావములకు గల సంబంధ మిందు స్పష్ట మగును. వ్యభిచారిపదమున కీవిధముగా వ్యుత్పత్తి పరిగ్రాహ్యము. వి అభి చారి = వ్యభిచారి వి = విశేషముగా అభి = అభిముఖ్యమున సంచరించునవి కావున వ్యభిచారు లనుట యుక్తము. "విశేషాదాభిముఖ్యేన చరంతీతి వ్యభిచారిణః". కల్లోలములు సాగరములో నున్మగ్నములు నిర్మగ్నము లగునట్లు స్థాయిభావమున వ్యభిచారి భావములు మగ్నములు నిర్మగ్నములు నగును. సముద్రమున తరంగములు లేచుచు పడుచు నున్నను సముద్రమునకు శోభాసముత్కర్షము సంపాదించు చున్నవి. సముద్రరూపమును పొందుచున్నవి. అట్లై వ్యభిచారిభావములు స్థాయి భావము నం దున్మగ్నములు నిర్మగ్నములు నై స్థాయిభావమునకు పోషము సంపాదింప గలవు. స్వస్వరూపమును పోషించు నవి కా గలవు. అచట రసాత్మతను బొందునవియు కాగలవు. ఇది వ్యభిచారిభావములకు సంబంధించిన స్వభావస్థితి. ఇట్లున్న నివి యొకప్పు డొక స్థలమున రసాత్మతను పొందునవి యగును. అనగా వీనికి రసాత్మత కలుగుట యు నున్నది. కాని వ్యభిచారి భావము లస్థిరము లగు టచే నాట్యాదివిధానముల నుపయోగించునవి కాజాలవు. నాట్యమున కుపయో గించునవి స్థిరత్వము పొందినస్థాయిభావములె. అస్థిరములగు వ్యభిచారిభావము లుపయోగింపవు. కావుననె నాట్యవేదవిదులు "అష్ట స్థాయినః" స్థాయిభావము లెనిమిది యని యనిరి.

## శమస్యాస్థాయిత్వమ్

విలీనసర్వవ్యాపారః శమః స్థాయీ భవేద్యతః. 285
అతోఽనుభావరాహిత్యాన్న నాట్యేఽభినయో భవేత్
తస్మాద్వృద్ధప్రయోగేణ రసపోషో న జాయతే. 286
తతోఽష్టౌ స్థాయినో భావా నాట్యస్యైవోపయోగినః

శమము స్థాయిభావముగా శాంతరస మొకటి కదలనికొందరు నిరూపిం చిరి. శమమునం దే వ్యాపారమునుండదు. సర్వవ్యాపారము లందు విలీనము లగును. శమమిట్టిది కాగా నిం దనుభావము లేవియు నుండవు. అనుభావ రాహి

త్వమువలన నాట్యము నం దభినయము కుదరదు. ఆహార్యాంగిక వాచిక సాత్త్వికాభినయములలో నుపయుక్తము లగు ననుభావములు శమమున లేవు. వృద్ధులగు వారు వీతరాగులుగా నుందురు గాన వారు శమానుభవ సహితు లగుదురు. కాని వృద్ధప్రయోగమున రసపరిపోషము కలుగదు. కావున స్థాయి భావము లెనిమిది మాత్రమే నాట్యమున నుపయోగించునవి యగును. అందుననే స్థాయి భావము లెనిమి దనుట సంగతము.

యతః స్వరూపారోపేణ భావానన్యానుపస్థితాన్. 287

స్వాత్మనైక్యేన గృహ్ణాతి స స్థాయీ లవణోదవత్
భావ సాధారణత్వేఽపి నిర్వేదాద్యైర్న శక్యతే. 288

స్థాయిత్వమాత్మనో నేతుమతాద్రూప్యస్వభావతః
యత్ర క్వచిత్స్యాత్ తత్పోషో వైరస్యాయైవ కల్పతే. 289

అతో నాట్యవిదాం అష్టావేవాత్ర స్థాయినో మతాః
ప్రకృష్యమాణో యో భావో రసతాం ప్రతిపద్యతే. 290

స ఏవ భావః స్థాయీతి భరతాదిభి రుచ్యతే
కేచిదన్యేఽపి భావాశ్చేత్ పోషం యాన్తి రసాత్మనా. 291

తేషాం విశేషో విజ్ఞేయః స్థాయిష్వేవ న చాన్యథా

ఇతరములగు కొన్ని భావము లందు భావస్వరూపము నారోపించి స్థాయి ప్రవర్తించును. స్థాయి అనుకూలముగా సంప్రాప్త మయిన వ్యభిచారి భావము లన్నిటికి స్వరూపమునే యారోపించును. స్వ స్వరూపము నందు వానిన న్నిటిని కలియ కలిపి స్థాయి సమైక్యముననే గ్రహించును. స్థాయి భావమునకు స్వరూప మిట్లే యున్నది. లవణసాగర మిందు దృష్టాంతము. సాగరము నందు మధురజలము లమధుర జలము లైన నదు లెన్ని కలిసినను సాగర మన్నిటికి స్వస్వరూపమునే సంపాదించును. స్వాత్మభావమునే సంకలితము చేయును. అట్లే స్థాయిభావము గూడ అనుకూలములగు వ్యభిచారి భావములకే గాక ప్రతికూలములగు వ్యభిచారిభావములకును స్వస్వరూపమునే సంపాదించి సమైక్యము సంధానించును.

నిర్వేదాదులును భావార్థములతో సమానములే అయిన నవి తమకు స్థాయిత్వమును సంపాదించు కొన జాలవు. "అతాద్రూప్య స్వభావతః" స్థాయి

భావమునకు గల స్వరూపసంపద నిర్వేదాదు లం దుండదు. తాద్రూప్యస్వభావము అందు సిద్ధము కా జాలదు. ఎప్పటనేని నిర్వేదాదులకు పరిపోషము వర్ణితమయినను నది వైరస్యమునకే యగును కాని స్వారస్యమును సంపాదింప జాలదు. కావున నాట్యవిపుల భావమున స్థాయిభావము లెనిమిది. స్థాయి స్వరూప కథనమున భరతాదు లీ విధముగా నందురు. వ్యభిచారిభావములలో నే భావము ప్రకృష్యమాణ మగునో చక్కగా ప్రకర్ష యోగము పొందునది యగునో యా భావమే రసత్వము పొంద గలదు. ప్రకర్షము పొంద నేరని భావమునకు రసీభావము కలుగ నేరదు. ఇంక ప్రకర్షమును పొందిన భాగము మాత్రమే స్థాయి భావ మగునని వారిభావము. మరి కొన్ని భావము లేవేని పరిపోషము పొందినవై రసాత్మతను పొందునవి యగునేని అట్టి భావములకు స్థాయిభావము లందే యొక విశేషము గలదని గుర్తింప వలెను. అంతియే గాని యష్టాతిరిక్తముగా వ్యభిచారి భావములకు స్థాయిత్వ ముపపన్నముకాదు.

భావానాం కార్యనిష్పత్తి రనుభూతిఫలాత్మికా. 292
తత్కార్యకౌశలం తత్ర ప్రకర్షారోపణం విదుః
తత్సాధ్యోఽర్థోరసస్తేషాం తదాత్మ్యాపత్తిరేవ సః. 293

భావములకు కార్యనిష్పత్తి యనునది యనుభూతి ఫలమున నున్నది. అనుభవపరముముగా భావస్థితి యుండుట ముఖ్యము. ఇట్టి భావముల కార్య నిష్పత్తి వానికి గలుగు ప్రకర్ష విశేషమువలననె సిద్ధ మగును. వాని కార్యకౌశలమే యచట ప్రకర్షారోపణ మని గుర్తించునది. ఆ వ్యభిచారిభావములచే సాధ్యమగు నర్థము రసము. భావములు తదాత్మత పొందుటయె రసము. భావములకు ప్రకర్ష యోగమున స్థాయిత్వమును స్థాయి రసాత్మత పొందుటచే రసీభావమును ఈ ప్రఘట్టసారముగ భావించునది. ఇట్లు భావములు రసజననమున కౌశలము కలవగుట నిచట గుర్తించునది.

విభావోఽప్యనుభావః స్యాదనుభావో విభావవత్
తే పునశ్చారిణః స్యాతాం తే చ తాః స్యుః పరస్పరం. 294
రసభేదవశా దేవ ముపకార్యోపకారితా
చర స్థిర విభాగత్వమానుషంగిక మీరితం. 295

రసోపాదానతా తేషాం పరస్తాదేవ వక్ష్యతే
తద్దర్శనాని తద్దృష్టిః దృష్టిధర్మాః పృథగ్విధాః. 296

పరస్పరస్య సామర్థ్యం సాహచర్యాత్క్వచిత్క్వచిత్
రసోదయానుకూల్యేన తత్ర తత్రైవ వక్ష్యతే. 297

ఇతి శ్రీశారదాతనయవిరచితే భావప్రకాశనే
భావనిర్ణయో నామ ప్రథమోఽధికారః

కవి వర్ణనాచాతుర్యము ననుసరించిన తత్తదవస్థావిశేషమున విభావ మనుభావ మగును. అనుభావమును విభావముగ నగును. ఒకప్పుడు విభావానుభావములు రెండును వ్యభిచారిభావము లగును. వ్యభిచారిభావములును విభావానుభావము లగును. ఒకే విషయమున విభావ మనుభావము కాదు. అనుభావము భావమును గాదు. స్థలభేదమున విషయభేదమున పరస్పర మవి మారుట కలదు. రసభేదవశమున వానిలో నిట్టి యుపకార్యోపకారిత యుండును. ఒకే రసవిషయమున మాత్ర మవి యట్టివి కావు. చరభావము లని స్థిరభావము లని విభాగ మొనరించుట యానుషంగికము. భావములు రసములలో నుపాదానరూపములు. ఈ యంశము ముమ్ముందు విశదము కా గలదు. వానికి సంబంధించిన దర్శనములు దృష్టులు నానావిధము లయిన దృష్టిధర్మములు నిరూపితములు కా గలవు. ఒక్కొకచో వాని సాహచర్యమున రసానుకూల్యమున వాని సామర్థ్యము స్పష్టమగును. ఒక భావము వేరొక భావము యొక్క సాహచర్యమున సమర్థ మగుటయు రసానుకూలముగ నుండుటచే సమర్థ మగుటయు నా యా స్థలము లందు నిరూపితము కా గలదు.

ఇది శ్రీ శారదాతనయ విరచితమైన భావప్రకాశనమునందు
భావనిర్ణయమనెడి ప్రథమాధికారము.

# ద్వితీయాధికారము

## రసస్వరూపాశ్రయ వృత్తినిర్ణయము

ప్రథమాధికారమున భావాలోకము భావనిర్ణయము ప్రతిపాదిత మయినది. ఈ ద్వితీయాధికారమున వ్యభిచారిభావముల నిర్వాహము నిరూపిత మగును. భావముల రససంబంధము వివేచిత మగును. తత్తద్రసోచిత భావములు సంకేతితము లగును. రత్యాదుల లక్షణము విభావాదుల స్వరూపము రసనిష్పత్తి రసాశ్రయము సమాలోచిత మగును. రస మహంకార స్వరూప మగుట ప్రేక్షకచిత్తవృత్తికి రసతాపత్తిప్రకారము ప్రతిపాదితము కాగలదు. తాండవాదుల నిరూపణము శాంతరసవిచారము రసవాద మీమాంస శివాగమరీతి యిందు నిరూపితము కాగలదు. ఈ యధికారమునకు రసస్వరూపాశ్రయవృత్తినిర్ణయ మని పేరు.

### వ్యభిచారిభావానాం నిర్వాహకథనమ్

నిర్వాహః కథ్యతేఽస్మాభిః భావానాం వ్యభిచారిణాం
నిర్వేదః శూన్యచిత్తత్వం వేదోవిత్తవినిర్గమాత్. 1

వాఙ్మనఃకాయకర్మాణి గ్లానిర్గ్లపయతీతి యత్
అసుర్యాతి యయాఽసూయా యాపయే త్సూయతేఽన్యథా. 2

సాఽసూయేతి సమాఖ్యాతా సర్వత్ర రసకోవిదైః
అసూయా సా యయా యాతి ప్రాణినామసు రుత్థితః. 3

ఈ ప్రఘట్టమున నిర్వేదము గ్లాని అసూయ అను భావత్రయమునకు నిర్వాహము నిరూపిత మగును. వ్యభిచారిభావముల కిచట నిర్వాహము నిరూపిత మగును. నిర్వాహ మనుట ఆ యా పదములకు వ్యుత్పత్తిలభ్య మయిన యర్థనిర్వచనము. నిర్ + వేదః = నిర్వేదః విత్తవినిర్గమమున గలుగు శూన్యచిత్తత్వము నిర్వేదము. సర్వభావములు చిత్తము నుండి నిర్గమింపగా గలుగు శూన్యచిత్తత్వమునకు నిర్వేద మని పేరు. వాఙ్మనఃకాయకర్మలను గ్లపనము పొందించునది, గ్లపింప జేయునది, వాడునట్లు చేయునది గ్లాని. రసకోవిదు లంతట అసూయ నిట్లు నిర్వచించిరి. దేనిచే ప్రాణశక్తి పోవునో యది యసూయ.

అసువును బోగొట్టునది యసూయ. అసువును హింసించునది యసూయ. ప్రాణము కల వారి ప్రాణము కదిలి పోవును గావున అసూయ యగును.

శం సుఖం కుత్సయతి యా శంకేత్యభిధీయతే
శృణాతి హంతి యోఽంగాని స శ్రమః పరికీర్తితః. 4

మశబ్దార్థో మతిర్మానః తద్దానాత్ఖండనాన్మదః
యయా చిత్తాయతేఽర్థేషు సా చింతేత్యభిధీయతే. 5

మనసో వివిధః సాదో విషాద ఇతి కీర్తితః
వృణోతి చిత్తం లాతీతి వ్రీడేతి పరిభాష్యతే. 6

విత్తేర్విలీయ జాతత్వాల్లజ్జేతి పరిభాష్యతే
హ్రియంతే వాఙ్మనఃకాయా ఇతి హ్రీః పరిపఠ్యతే. 7

ఇందు శంక శ్రమము మదము చింత విషాదము వ్రీడ లజ్జ హ్రీ యనునవి పరిభాషితము లగును శం అనగా సుఖము. దానిని నిందితము చేయునది శంక యగును. శ్రమము. అవయవములను హింసించునది, హత మొనరించునది శ్రమ మగు నని యనిరి. మదము. మదశబ్దములోని మ శబ్దార్థము మతి. అదియే మానము. ద = ఖండనము చేయునది. మానదాన మొనరించునది, మాన ఖండన మొనరించునది మద మగును. చింత. పదార్థము లందు చిత్తాయమాన మగునది చింత యన దగును. ఆ యా పదార్థము లందు చిత్తము ప్రసక్తమై సంచరించుటచే నది చింత యగును. విషాదము. మనసునకు సంబంధించిన వివిధమగు సాదము, నానావిధ మగు హాని విషాద మని కీర్తిత మయినది. వ్రీడ. వృణోతీతి వ్రీడ. చిత్తమును కుదించునది వ్రీడ యని పరిభాషిత మయినది. లజ్జ. లయము పొంది జాత మయినందున లజ్జ. విత్తి అన దగు విజ్ఞానము నుండి విలయముపొంది సంజాత మగును కాన లజ్జ యను పరిభాష యుక్తము. హ్రీ. వాఙ్మనఃకాయములు సంహృతము లగును గావున హ్రీ యని పరిపఠిత మయినది. హ్రియతే ఇతి హ్రీ.

మందమక్షాణి వార్యంతే తాని వారయతీతి వా
మందానీతి యదక్షాని తన్మందాక్ష ముదాహృతమ్. 8

భూతం భవద్భవిష్యచ్చ త్రయం పాతీతి సా త్రపా
అపకృత్యా యయా జంతుః త్రాయతే సా హ్యపత్రపా. 9

విలక్షం చేష్టతే చిత్తం యత్తద్వైలక్ష్య ముచ్యతే
యా శోక హర్ష యోరేకరూపా సైవ ధృతిర్భవేత్. 10

స్మృతిః సంస్కారసహితా సత్త్వస్థా బుద్ధిరుచ్యతే
స్వం హ్యాపీత ఇతి స్వప్నః స్వం ప్రాప్నోతీతి వా భవేత్. 11

దీనిలో మందాక్షము త్రప అపత్రప వైలక్ష్యము ధృతి బుద్ధి స్వప్నము నిరుక్తము లగును. మందాక్షము. సర్వేంద్రియములు మందముగా నివారితము లగును. ఆ యింద్రియములను నివారింప జేయును, వానిని మందములుగా నొనర్చును, కావున నిది మందాక్ష మని ఉదాహృత మయినది. ఇంద్రియములు తమంతట తాము నివారితము లగుట ఇంద్రియములను నివారింప జేయుట వానిని మందములుగా నొనరించుట నను మూడు నిర్వచనము లిందున్నవి. త్రప భూతకాలము వర్తమానకాలము భవిషత్కాల మను కాలత్రయమును పాలించు నది గావున త్రప యగును. త్రయం పాతీతి త్రప. అపత్రప. అపకారముచే ప్రాణి రక్షిత మగును కావున నది యపత్రప యయినది. వైలక్ష్యము. చిత్తము విలక్షముగా సంచరించునది గావున వైలక్ష్య మగును. ధృతి. శోకము నందు గాని హర్షమునందు గాని యేకరూపముగా నున్నది ధృతి యగును. బుద్ధి. సంస్కార సహిత మైన స్మృతి సత్త్వస్థ మగునేని బుద్ధి యగును. స్వప్నము. స్వం హ్యాపీతః స్వం ప్రాప్నోతి యను రెండు వ్యుత్పత్తు లున్నవి. స్వీయ స్వరూపము దీనిలో విలీనము కా నందున స్వప్నము. స్వ స్వరూపము నిది పొందినది గావున స్వప్నము.

ఇంద్రియాణి నిమీలన్తి ద్రాగేవ యుగపద్యతః
తస్మాన్నిద్రేతి కవిభిః కథ్యతే భావకోవిదైః. 12

స ప్రబోధో మనో యేన సర్వానర్థాన్ ప్రబుధ్యతే
అహేతుకశ్చ దండో యః తదౌగ్ర్యం పరిచక్షతే. 13

ఉదంచతి మనో యస్మా దున్మాద శ్చిత్తవిప్లవః
కాలాతిపాతాసహత్వ మౌత్సుక్యం పరిచక్షతే. 14

హృది దోగ్ధి యదిష్టార్థం తద్ద్రోహ్యద ముదాహృతం
అభీష్టానుభూతార్థాభిలాషః కౌతుకం భవేత్. 15

కుతుకం సౌఖ్యసంభేదః స్పృహేతి పరిపఠ్యతే
ఐకాగ్ర్యం యా౽క్షునతే౽ర్థేషు సైవాశేతి విభావ్యతే. 16

ఇచట నిద్ర ప్రబోధము ఔగ్ర్యము ఉన్మాదము ఔత్సుక్యము దౌహృదము కౌతుకము కుతుకము ఆశ అనువాని నిర్వాహము సూచితమగును. నిద్ర. ఇంద్రియము లన్నియు నొక సమయముననె వేగముగ నిమీలనము పొందును గావున భావకోవిదులు నిద్ర యగునని యనిరి. ప్రబోధము. మనస్సు సర్వార్థ ములను గుర్తించును గావున నప్పటి స్థితి ప్రబోధ మగును. ఔగ్ర్యము. అహే తుక మయిన దండము ఔగ్ర్యము ఉగ్రత యగును. ఉన్మాదము. ఇది యొక చిత్తవిప్లవము. ఇది కలుగగా మనస్సు తత్తత్సన్ని వేశముల నుండి యుదంచనము పొందును. అటు నుండి కదలును. కావున ఉన్మాద మనిరి. ఔత్సుక్యము కాలాతి క్రమణమును సహింపకుండుట ఔత్సుక్య మని యాఖ్యానించినారు. దౌహృ దము. ఇష్టార్థమును హృదయము నందు దోహన మొనరించునది దౌహృద మని వివరించిరి. కౌతుకము. అభీష్టము. అననుభూత మయిన అర్థము నందలి అభిలాష మునకు కౌతుక మని పేరు. కుతుకము సౌఖ్యము నందలి సంభేదరూపము. దీనినే స్పృహ యనియు చెప్పుదురు. ఆశ. ఆ యా పదార్థము లందు నైకాగ్ర్య మును బొందునది గావున ఆశ యని విభావిత మయినది. అశ్నుతే ఇత్యాశా.

ఆత్మోపభోగ కరణం స్పృశతీంద్రియవర్త్మనా
యా జహాతీతరాన్ భోగాన్ సా స్పృహేత్యభిధీయతే. 17

సైవ కాంక్షేతి విజ్ఞేయా సోపాయార్థాగమాశ్రయా
మత్తః సరత్యయం మత్తః సరతీత్యేష మత్సరః. 18

పరాపకర్ష స్వోత్కర్ష వ్యాపారో మత్సరో ద్వయోః
పరస్పరస్య స్వోత్కర్షో ఘృష్యతే గుణగౌరవైః. 19

సమ్యక్తయా స సంఘర్ష ఇతి విద్వద్భిరుచ్యతే.
సద్రూపోద్భావనా మాయా స్వత ఏవాసతః పురా. 20

అథవాన్యపదార్థానా మన్యథాకృతి రేవ వా

ఇందు స్పృహ కాంక్ష మత్సరము సంఘర్షము మాయ అను వాని నిర్వాహము సూచిత మగును. స్పృహ. ఇంద్రియమార్గమున ఆత్మోపభోగకరణ మును స్పృశించునదియు నితరభోగములను విడనాడునదియు నగు భావము స్పృహాపదమున నభిహిత మగును. కాంక్ష. స్పృహ యనునదియె యుపాయ ములతో గూడుకొనిన యర్థముల ప్రాప్తి నాశ్రయించి యుండు నేని కాంక్ష

యని గ్రహింప దగును. మత్సరము. మత్తుడై ప్రసరించువానిరీతి మత్సరము. నా నుండి యీతడు విడిపోయినా డనునప్పుడును మత్సరపద ముపయుక్త మగును. ఇద్దరు వ్యక్తులలో తన యుత్కర్ష కథనము పరుని యపకర్ష కథన మున్నప్పుడు మత్సర వ్యవహార మున్నది. పరస్పర ముత్కర్ష మున్నప్పుడు మత్సర మని గుణగౌరవము కలవారు స్పష్ట పఱచిరి. సంఘర్షము. ఆ మత్సరమే సమధికమయినచో సంఘర్ష మగునని విద్వాంసు లనిరి. మాయ. అస లెన్నడు లేని దానికి సద్రూపోద్భావనము మాయ యగును. వేరువిధమునను మాయా నిర్వాహ మున్నది. ఒకపదార్థమును వేరొకపదార్థముగ నిరూపించుట మాయ యగును.

దేశకాలాపరోక్ష్యం యత్పరోక్షస్యైవ వస్తునః. 21

మంత్రౌషధాదిభిః సోఽయ మింద్రజాల ఇతీరితః

దిఙ్నిర్ణయానభిజ్ఞత్వం దిఙ్మోహ ఇతీరితః. 22

ఇంద్రజాలము మాయ కన్న వేరు. పరోక్షముగా నుండు వస్తువునె దేశ కాల వ్యవధానరహితముగ నపరోక్షముగ నిరూపించుట యింద్రజాలము. మంత్రములచే నౌషధాదులచే నిట్టి యపరోక్షత్వ మాపాదించుట యింద్రజాల మని విఖ్యాత మయినది. దిఙ్నిర్ణయము గుర్తింపక పోవుట దిఙ్మోహ మగును. ప్రాచీ ప్రతీచీ విభాగము తెలియ కుండుట.

దిశో యస్యాన్యథా జాతాః కాందిశీకస్స ఉచ్యతే

పరస్య వ్యసనోత్కంపాదను యా కంపతే భృశమ్. 23

సా చిత్తవృత్తిర్విద్వద్భి రనుకంపేతి కథ్యతే

ఆనృశంస్యం తదేవాహుః యదేవాశ్రితరక్షణమ్. 24

పరస్య దోషాన్నప్రేక్ష్య యచ్ఛంసతీతి నృశంసతా

వ్యసనైః క్రోశతాం పుంసాం యస్య క్రోశోఽనుజాయతే. 25

సోఽనుక్రోశ ఇతి జ్ఞేయః సుఖదుఃఖ సమత్వతా

ఇచట కాందిశీక అనుకంప ఆనృశంస్యము నృశంసత అనుక్రోశము అను వాని నిర్వాహము కలదు. ఎవనికి దిక్కు లున్న విధమున గాక అన్యథా అన్యథా యగునో యాతడు కాందిశీకుడు. అనుకంప. పరునకు సంబంధించిన వ్యసనము ఉత్కంపము ననువాని ననుసరించి చిత్తవృత్తి మిక్కిలి కంపించునది.

యగునేని యది యనుకంప యగు నని విద్వాంసులు నిరూపించిరి అను కంపతే = అనుకంపా. ఆనృశంస్యము. ఆశ్రితరక్షణ మానృశంస్య మగును. నృశంసత. పరుని దోషముల నితరులకు జెప్పుట నృశంసత. అనుక్రోశము మానవులు వ్యసనములచే క్రోశించు చుండగా నెవనికి సుఖదుఃఖసమతారూప మయిన క్రోశన మనుసంజాత మగునో యది యనుక్రోశము.

గుణః పరోపకారిత్వం హితకారిత్వమేవ వా. 26

సర్వశాస్త్రాధిగమనం శ్రుతమిత్యభిధీయతే
సమాని ఖాని యేన స్యుః సుఖదుఃఖానుభూతిషు. 27

తత్సఖ్యమితి స స్నేహః తేన యత్త్రాయతే పరం
తన్మిత్రం తత్సుహృత్త్వం చ హృదయం యత్ర శోభనమ్. 28

దూయంతే ఖాని యేనై తద్దుఃఖమిత్యభిధీయతే
శుభాని ఖాని యేనై తత్సుఖమిత్యుచ్యతే బుధైః. 29

ఇచట గుణ శ్రుత సఖ్య మిత్ర సుహృత్ దుఃఖ సుఖముల నిర్వాహము కలదు. గుణము. పరోపకారిత్వము కాని హితకారిత్వము కాని గుణ మన దగును. శ్రుతము. సర్వశాస్త్రములను తెలిసి యుండుట శ్రుత మగును. సఖ్యము. సుఖదుఃఖానుభవములలో నంతట సర్వేంద్రియములు సమముగా నుండుటను సఖ్య మందురు. అదియే స్నేహము నగును. మిత్రము. స్నేహమున పరుని రక్షణ మున్నచో దాని కూర్చు నాతడు మిత్రము. సుహృత్. హృదయము శోభనముగా నున్నచో సుహృత్ అందురు. దుఃఖము. దూయంతే ఖాని. ఇంద్రియములు వ్యథపడునవి యగునేని దుఃఖ మగును. సుఖము. శుభాని ఖాని దేనిచే నింద్రియములు శుభము లగునో యది సుఖ మన దగును.

భావేభ్యః ప్రకృతేభ్యోఽన్యే యతః కేచిన్మయేరితాః
భావ్యతాత్, అథవా లోకే గచ్ఛతః స్ఖలనం భవేత్. 30

ప్రకృతము భావములుగా నిరూపితములయిన వాని నిర్వాహ మిచట నున్నది. కాన వాని కన్న వేరుగా గొన్నిటి నిచ్చట నిరూపించితిని. అవియు భావ రూపనులే యను భావముననే నిరూపించితిని. పరిగణించిన వ్యభిచారి భావములలో నీ చెప్పిన కొన్ని లేక పో వచ్చును. అయినను భావ్యమానత వాని యందును గలదని యవియు భావత్వము గలవియే యగునని యిచట నిరూపింప

వలసి వచ్చినది. వాని యందు భావత్వము లేదని భావింతురేని చెప్పవలయు నది యే మున్నది. "గచ్ఛతః స్ఖలనం క్వాపి" తొట్రుపాటు కలుగుట నడచు వానికే కదా! ఒకచో గూర్చున్న వానికి స్ఖలన ముండదు. భావ మార్గమున సంచరించు నేను వీని యందును భావత్వముగలదని యిట్లు నిరూపించితిని. ఒకచో నున్న వారికి నా యీ రీతి స్ఖలన రూపముగా నుండ వచ్చును. అస్తు.

యదింద్రియాణి హృష్యన్తి హర్షయన్తి పరానపి
తస్మాద్ధర్ష ఇతి జ్ఞేయః ప్రసాదో మనసస్సహి. 31

దేశాంతరేఽను భూతస్య తథా కాలాంతరేఽపి చ
తద్దేశాది విశిష్టస్య పునరాలోచనం స్మృతిః. 32

స్మరతి స్మర్యతే స్మారయతీత్యస్యాస్తు నిర్వహః
వితర్క మనుభూతేఽర్థే ధీవిశేషః స్మృతిర్భవేత్. 33

సదసన్నిశ్చయకరీ మననాత్మా మతిర్భవేత్
అంగానాం యదనుల్లాసః తదాలస్య ముదాహృతమ్. 34

అదేశకాలవిహితో వేగ ఆవేగ ఉచ్యతే
వేగో విగానం జనయదుద్విగ్నం యేన మనో భవేత్. 35

ఆత్మనో యో గరీయస్త్వభావో గర్వస్స ఈరితః
మోహశ్చిత్తస్య శూన్యత్వం మనో యేనైవ ముహ్యతే. 36

అయోగ్యే చాపదార్థే చ దుఃస్పృహా చపలం భవేత్
పలాయతే చాపదార్థే మనస్తచ్చాపలం భవేత్. 37

అపస్మారోఽనుభూతేషు పదార్థేష్వన్యథాస్మృతిః
అయథాస్మృతి రేవ స్యాత్ పదార్థాస్మృతిరేవ వా. 38

ఇచట హర్ష స్మృతి వితర్క మతి ఆలస్య ఆవేగ వేగ గర్వ మోహ చపల చాపల అపస్మారముల నిర్వాహము సూచిత మగును. హర్షము. ఇది మనః ప్రసాదరూపము. ఇం దింద్రియములు హర్షము పొందును. ఇతరములను హర్ష పెట్టును. కావున హర్ష మనుట యుక్తము. స్మృతి. దేశాంతర మందును, కాలాంతర మందును అనుభూత మయిన ఆ యా దేశకాలవిశేషములతో గూడు కొనిన యనుభవమును పునరాలోచన మొనరించుట స్మృతి యగును. స్మరతి

స్మర్యతే స్మారయతీతి స్మృతిః. స్మరించునది యగుటచే స్మృతి యగును. స్మర్యమాణము స్మృతి యగును. స్మరింప జేయునదియు స్మృతి యగును. ఇట్లు స్మృతి పదమునకు మూడువిధముల వ్యుత్పత్తి భావములను గ్రహింప వచ్చును. ఇట్టి పదము యొక్క నిర్వాహమును గుర్తించునది. తర్కరహితముగా ననుభూత మయిన నర్థము నందలి ధీ విశేషమును స్మృతి యందురు. అనుభూతార్థము నందలి స్మృత్యాత్మక మయిన ధీ విశేషము వితర్క మనుటయు భావభావకుల పరిభాషలో నున్నది. మతి. మననాత్మక మగునది మతి యగును. మతి సదసన్నిశ్చయము సంపాదింప గలదు మననమున సన్నిశ్చయము గాని యసన్నిశ్చయము గాని భాసించును. అట్టి ప్రతిభాసమున హేతువు మతి. ఆలస్యము. దేహావయవము లందలి యనుల్లాసము ఆలస్య మగును. సరియగు సముల్లాసము లేకపోగా నుద్యమము నందు మందత్వ మేర్పడును. ఆవేగము. దేశవిరుద్ధముగా కాలవిరుద్ధముగా విహితమగు వేగమావేగమగును. దేశకాల సముచితమయిన విధాన ముచితము. వేగ మదేశవిహిత మకాలవిహిత మయినచో నావేగ మగును. వేగము. విగాన మొనరించునది వేగము. మన మపుడు విగ్న మగును. వేగ ముండుట నభినందింపరు. అనభినందనము విగానము. మనసున కుద్వేగము కలుగగా నది విగ్నము కాగా వేగమన దగి యున్నది. గర్వము. తనకు సంబంధించిన గరీయస్త్వ భావనము. ఆత్మగౌరవ సంభావనము గర్వ మని వ్యవహృత మయినది. మోహము. చిత్తము శూన్యముగా నుండుట మోహము. మన సాసమయమున ముగ్ధమై యుండును. మనోముగ్ధత శూన్యచిత్తత మోహమయినది. చపలము. అయోగ్యపదార్థము నందు గల దుస్పృహ యపదార్థము నందలి దుస్పృహ చపలమన దగియుండును. చాపలము. అపదార్థ విషయమై మనస్సు పలాయిత మొనర్చునేని చాపల మగును. అపస్మారము. అనుభూత పదార్థములందు అన్యథాస్మృతి యుండుట అపస్మార మగును. అయథాస్మృతియు అపస్మారమే. పదార్థాస్మరణము గూడ అపస్మారమే.

తర్క్యతే తర్కతే తర్కో విచారః స్యాత్స హేతుకః
విక్రియా త్వవహిత్థం స్యా దిజ్గితాకారగూహనమ్. 39

మరణం ప్రకృతి ప్రాణ వియోగ ఇతి కథ్యతే
ఆయుర్వేదోపదిష్టా యే వ్యాధయస్తే రుజః స్మృతాః. 40

చేష్టావిఘాతః స్తంభః స్యాద్రోమాఞ్చో రోమనిర్గమః
యః స్వరో భిద్యతే స్థానాత్స్వరభేదః స కథ్యతే. 41

వేపథుః హృత్కంపో వైవర్ణ్యం భిన్నవర్ణతా
స్రుశబ్దో మఙ్గలార్థః స్యాత్ప్రయుక్తః శీతవారిణి. 42

ఉష్ణాంభసి ప్రయుక్తశ్చే దశ్రు త స్యాదమఙ్గలమ్
వాక్కాయమనసాం ప్రాయః ప్రలయో నష్టచేష్టతా. 43

ఇచట తర్కము అవహిత్థము మరణము రుజ స్తంభము రోమాంచము స్వరభేదము వేపథువు వైవర్ణ్యము అశ్రువు ప్రలయము అను వాని స్వరూపనిర్వాహము నిరూపిత మగును. తర్కము. తర్క్యతే ఇతి తర్కః. తర్కతే ఇతి తర్కః తర్కింప బడునది తర్కము. తర్కించుట తర్కము. తర్క మనునది సహేతుక మగు విచారము. అవహిత్థము. ఇది యొక విక్రియ. ఇంగితాకారమును ఉపగూహన మొనరించుట, కప్పి పుచ్చుట అవహిత్థము. మరణము. ప్రకృతిప్రాణవియోగము మరణ మగును. రుజ ఆయుర్వేదము నం దుపదిష్టము లయిన వ్యాధులు రుజపదమున జెప్పదగి యున్నవి. ఇటుపై స్తంభరోమాంచాదుల నిర్వాహము భావనీయము. స్తంభాదులు సాత్త్వికభావములుగా నిర్ణీతము లయినవి. స్తంభము. చేష్టావిఘాతము నష్టచేష్టత స్తంభ మగును. రోమాంచము. రోమనిర్గమము, గగుర్పాటు రోమాంచపదమున వ్యవహార్యము. స్వరభేదము. ఇదియె విస్వరత వైస్వర్యము. కంఠగత మగు స్వరమునకు నియతముగా నొక స్థాన ముండును. స్వస్థానము నుండి స్వరము భిన్న మగునేని స్వరభేద మందురు. వేపథువు. ఇది యొక కంపము. ఈ కంపమును హృదయోత్కంపముగా గ్రహింప దగును. వైవర్ణ్యము. భిన్నవర్ణత. పాండిమ కలుగుట నీలిమి కలుగుట వైవర్ణ్యము. అశ్రువు. స్రుశబ్దము శీతలజలమున మంగలార్థముగా ప్రయుక్తము. అది యుష్ణజలమున ప్రయుక్త మయినచో నమంగలము కావున అశ్రు వగును. ప్రలయము. వాక్కాయమనస్సులకు గలుగు నష్టచేష్టతను సామాన్యముగా ప్రలయ మందురు.

ఏవముక్తాశ్చ నిర్వాహాః సాత్త్వికవ్యభిచారిణాం
నిరుక్తా యోగతః కేచిదుక్తాః కేచిచ్చ రూఢితః. 44

ఈ విధముగా నిచట సాత్త్వికభావములకు వ్యభిచారిభావములకు నిర్వాహములు నిరూపితము లయినవి. కొన్నిపదముల నిర్వాహము యోగార్థము ననుసరించి వ్యుత్పత్త్యర్థము ననుసరించి నిరూపితములు. కొన్ని రూఢ్యర్థము ననుసరించి ప్రసిద్ధ్యనురోధమున నిరూపితము లయినవి. వ్యుత్పత్త్యర్థము భాసింపకున్నను రూఢ్యనుసారమున నర్థనిరూపణమును సాహిత్యవిదుల కభీష్టము.

## భావ, రస సంబంధము

సాత్త్విక వ్యభిచారిభావములకు పరస్పర ముపకార్యోపకారిత్వము కలదు. సాత్త్వికభావములకు వ్యభిచారిభావములకు అనుభావములకు రససంబంధ ముండుటయు నిక నిరూపిత మగును.

ఉపకార్యోపకారిత్వ మేతేషాం కథ్యతేఽధునా
స్తంభే వేపథు రోమాంచ స్వేద గద్గద భాషణమ్. 45

బాష్పశ్చ యాంతి శోభాం తే సమమేకైకశోఽపి వా
రోమాంచః స్వరభేదశ్చ స్వేదో వేపథురేవ చ. 46

క్వచిత్కదాచిత్సంభూయ విభావోత్కర్షతో భవేత్
రోమాంచే వేపథుస్తంభౌ ప్రాయః ప్రవిశతో ముహుః. 47

స్వరభేదో భవేత్స్తంభే బాష్పోఽపి స్యాత్కదాచన
వేపథౌ స్వేదరోమాంచబాష్పాశ్చ స్యుః స్వభావతః. 48

వైవర్ణ్యేఽశ్రు భవేన్నిత్యం స్తంభకంపౌ కదాచన
ప్రలయ స్తంభ కంపాశ్రు స్వేద రోమోద్గమాదయః. 49

పుష్యంత్యనుభవోత్కర్షం విభావైరపి దీపితాః
కార్శ్యజాగరణాలస్యసంతాపాః స్యుస్తతస్తతః. 50

ఇక నిపుడు వీనికి గల పరస్పర ముపకార్యోపకారిత్వము ప్రతిపాదిత మగును. స్తంభ మను సాత్త్వికభావము నందు వేపథువు రోమాంచము స్వేదము గద్గదభాషణము బాష్పము అను సాత్త్వికభావములు అన్నియు సమముగా గాని ఒక్కటొక్కటిగా గాని సంగతములై శోభ కలవి యగును. స్తంభమునకును శోభ సంపాదింప గలవు. తామును శోభ కలవి కా గలవు. రోమాంచము స్వర భేదము స్వేదము వేపథు వనునవి విభావోత్కర్షానుసారమున నొకప్పు డొకచో సంగతములై యుండును. ఈ రీతి విభావోత్కర్షాధీన మనుట గుర్తింప దగినది. రోమాంచము నందు వేపథువు స్తంభము సామాన్యముగా ప్రవిష్టములగుట మాటిమాటికి జరుగు చుండును. స్తంభము నందు స్వరభేదము కూడుకొనును. ఒకప్పుడు బాష్పమును కలియుట కలదు. వేపథువు నందు స్వేద రోమాంచ బాష్పములు స్వభావసహజముగా సంగతము లగుచునే యుండును. వైవర్ణ్యము నందు నిత్య మశ్రువుండనే యుండును. స్తంభకంపములు ఒకప్పు డుండును. సర్వసమయముల నుండవు. ప్రలయము స్తంభము కంపము అశ్రువు స్వేదము

రోమాంచము మొదలగునవి విభావములచే గూడ దీపితములై అనుభవాతిశయ మును చక్కగా పోషించునవి యగును. ఆ యా సమయము లందు వాని వాని వలన కార్శ్యము జాగరణము ఆలస్యము నను నవియు గలుగుచునే యుండును. ఇట్లు సాత్త్వికముల స్వరూపావస్థాన మున్నది

ఇక సాత్త్వికాదులకు గల రససంబంధము మీమాంసిత మగును.

ఆవిర్భావో రసానాం స్యాత్సాత్త్వికైస్తు యథోదితైః
జ్ఞాపకా జాయమానానామేతే స్యుర్వ్యభిచారిణః. 51

లక్షయంత్యనుభావాస్తు వర్తమానం తదా రసం
ఏవమేవోహనీయాః స్యుర్విభావా వ్యభిచారిణః. 52

ఏషు కేచిత్స్వసామర్థ్యం పుష్యంత్యన్యాశ్రితా అపి
గుణీభూతాః కదాచిత్తు సామర్థ్యం ప్రాపయంత్యమీ. 53

ఏవమన్యోన్యసామర్థ్యం దర్శయంతి రసోదయే
ఏతేషాం స్థాయిభావేషు కథ్యతేఽన్యోన్యవర్తనమ్. 54

ఈ నిరూపించిన రూపము కల సాత్త్విక భావముల వలన రసముల కావిర్భావ మున్నది. అట్లావిర్భావము పొందిన రసములకు వ్యభిచారిభావములు జ్ఞాపకము లగును. అట్లులసితమై యున్న రసము ననుభావములు లక్షిత మొనర్ప గలవు. రసమును స్ఫురింప జేయ గలవు. ఇట్లే విభావము లనుభావములు తథాపుష్ట మయిన రసమునకు జ్ఞాపకము లగునని గుర్తింప వలెను. ఈ విభావానుభావ సాత్త్వికవ్యభిచారులలో గొన్ని యితరముల నాశ్రయించి యున్నవైనను స్వసా మర్థ్యమును పోషించు కొనగలవు. ఒకప్పుడు గుణీభూతములై యితరములకు సామ ర్థ్యము నందింప జేయునవి యగును. ఇవి యన్నియు రసోదయము నందు తమ యన్యోన్యసామర్థ్యమును ప్రదర్శించు నవి యగుచున్నవి. ఇట్లు సాత్త్వికాదులకు రస సంబంధము నిరూపిత మయినది. భావాంతరములకును స్థాయిభావమున సము చిత యోగవ్యవస్థ కలదు. అది యిట్లుండును.

మదః శ్రమోఽవహిత్థం చ హర్షో గర్వః స్మృతిర్ధృతిః
అసూయా గ్లాని శంకాశ్చ వితర్కోఽపత్రపాఽపి చ. 55

రోమాంచ వేపథు స్వేదాః శృంగారే భోగనామని
మోహావేగవిషాదాశ్చ జడతా వ్యాధి దీనతాః. 56

చింతా వితర్క నిద్రాశ్చ కార్శ్యశ్వాసాదయః పరే
స్తంభ కంపాశ్రు వైవర్ణ్య గద్గ దాద్యా వియోగజే. 57

ఇచట సంభోగ శృంగారోచితములు వియోగశృంగారోచితము లగు భావములు నిరూపితము లగును. మదము శ్రమము అవహిత్థము హర్షము గర్వము స్మృతి ధృతి అసూయ గ్లాని శంక వితర్కము అపత్రప రోమాంచము వేపథువు స్వేదము అనునని భోగాపరనామము కల సంభోగశృంగారమున నుపయోగించును. వియోగజన్య మయిన శృంగారమున మోహము ఆవేగము విషాదము జడత వ్యాధి దీనత చింత వితర్కము నిద్ర కార్శ్యశ్వాసాదులు స్తంభ కంపాశ్రు వైవర్ణ్య గద్గదాదు లుపయోగించునని గ్రహింప దగును. అట్లు కూర్ప దగును.

శంకా త్రపా చపలతా శ్రమో గ్లానిః అపత్రపా
హర్ష ప్రబోధావహిత్థ స్వేదాశ్రు పులకా అపి. 58

హాస్యేఽమీ వీరగా భావా ఆవేగో హర్ష ఏవ చ
గర్వాసూయోగ్రతాస్తర్క ధృతిర్బోధస్మృతిర్మతిః. 59

మదః స్వేదశ్చరోమాంచౌ దృశ్యేతే క్వచిత్ క్వచిత్
ఆవేగో జడతోన్మాదో వితర్కో మోహ ఏవ చ. 60

ఆలస్యాపస్మృతీ వ్యాధిః కార్శ్య శ్వాస వివర్ణతాః
స్తంభాదయోష్టౌ భావాస్యుః ప్రాయేణ కరుణే రసే. 61

ఈ యంశమున హాస్య వీర కరుణ రసములకు సంబంధించిన భావపరిసంఖ్యానము కలదు. శంక, త్రప, చపలత, శ్రమము, గ్లాని, అపత్రప, హర్షము, ప్రబోధము, అవహిత్థము, స్వేదము, అశ్రువుపులక మను నివి హాస్యరసము నందు సంగతముగా నుండుభావములు. వీరోచితము లయిన భావము లిట్లున్నవి. ఆవేగము, హర్షము, గర్వము, అసూయ, ఉగ్రత, తర్కము, ధృతి, బోధము, స్మృతి, మతి, మదము, స్వేదము, రోమాంచ మను నివి వీరరసము నందొక్కొకచో సంగతము లయి గోచరించుచున్నవి. ఆవేగము, జడత, ఉన్మాదము, వితర్కము, మోహము, ఆలస్యము, అపస్మృతి, వ్యాధి, కార్శ్యము, శ్వాసము, వివర్ణత అను భావములు సామాన్యముగా కరుణరసము నందు సంగతము లయి గోచరించుచున్నవి. స్తంభము మొదలగు సాత్త్విక భావము లెనిమిదియు కరుణసంగతము లగును.

హర్షావేగోగ్రతోన్మాదా మదోగర్వశ్చ చాపలం
ఈర్ష్యాసూయా శ్రమామర్షావహిత్థాపత్రపా అపి. 62

నిశ్వాస స్తంభరోమాంచ స్వేదా రౌద్రే రసే హితాః
హర్ష గర్వ స్మృతి మతి శ్రమా ధృతి మదావపి. 63

తర్క విబోధశ్చింతా చ రోమాంచః స్తంభవేపథూ
స్వేదశ్చేత్యద్భుతే భావాః కథితా నాట్యకోవిదైః. 64

ఇచట రౌద్రాద్భుత సంగతము లగు భావసంఖ్యన మున్నది. హర్షము, ఆవేగము, ఉగ్రత, ఉన్మాదము, మదము, గర్వము, చాపలము, ఈర్ష్య, అసూయ, శ్రమము, అమర్షము, అవహిత్థ, అపత్రప, నిశ్వాసము, స్తంభము, రోమాంచము, స్వేద మను భావములు రౌద్రరసమునకు హితము లని తద్విదు లనిరి. హర్షము, గర్వము, స్మృతి, మతి, శ్రమము, ధృతి, మదము, తర్కము, విబోధము, చింత, రోమాంచము, స్తంభము, వేపథువు, స్వేద మను నివి అద్భుత మున నుండు భావము లని నాట్యకోవిదులు పరిగణించిరి.

శంకా నిర్వేద చింతాశ్చ జాడ్యం గ్లానిశ్చ దీనతా
ఆవేగో మద ఉన్మాదో విషాదో వ్యాధిరేవ చ. 65

చింతా మోహోపస్మృతిశ్చ త్రాసశ్చాలస్యమేవ చ
మధ్యే మధ్యే స్తంభకంపౌ రోమాంచః స్వేదవేపథుః. 66

వైవర్ణ్య మరణ త్రాస గద్గదాద్యా భయానకే
మోహోఽపస్మృతిరున్మాదో విషాదో భయచాపలే. 67
ఆవేగో జాడ్యదైన్యే చ మతిః గ్లానిః శ్రమోఽపి చ
స్తంభాదయోఽష్టౌ భావాస్యుః బీభత్సే ప్రలయం వినా. 68

ఇచట భయానక బీభత్సముల నుండదగు భావముల సంఖ్యాన మున్నది. శంక, నిర్వేదము, చింత, జాడ్యము, గ్లాని, దీనత, ఆవేగము, మదము, ఉన్మాదము, విషాదము, వ్యాధి, చింత, మోహము, అపస్మృతి, త్రాసము, ఆలస్యము భయానకరసానుగతములుగా నుండును. మధ్య మధ్యలో స్తంభ కంపము లుండును. రోమాంచ ముండును. స్వేదవేపథువు లుండును. వైవర్ణ్యము, మరణము, త్రాసగద్గదాదులు భయానకమునం దుండును. బీభత్సము నందు ప్రలయ మగు భావ ముండదు. మిగిలిన స్తంభాదిభావము లుండును. మోహము, అప

స్మృతి, ఉన్మాదము, విషాదము, భయము, చాపలము, ఆవేగము, జాడ్యము దైన్యము, మతి, గ్లాని, శ్రమము అను నీ భావములు బీభత్సము నం దున్నవి. ఈ విధముగా శృంగారాది రసములలో భావముల సంబంధమును విశేషముగా గ్రహింప వలయును.

సాహచర్యం చ సామర్థ్యం భావానాం సమ్యగీరితం
కథ్యతే స్థాయిభావానాం రసోపాదానహేతుతా. 69

మనోఽనుకూలేష్వర్థేషు సుఖసంవేదనాత్మికా
ఇచ్ఛా రతిః సా ద్విధా స్యాద్రతి ప్రీతి విభాగతః. 70

తయోః సాధారణో భేదః సప్తధా పరికీర్తితః
నిసర్గ సంసర్గోపమాభియోగాధ్యాత్మ స్వరూపతః. 71

అభిమానాచ్చ విషయాత్సప్తధా సాంప్రయోగికీ
రతేరేవ భవేత్రీతేరేవమాభ్యాసికీ భవేత్. 72

ప్రీతిః ప్రియాత్మా ప్రాయేణ రతిరిచ్ఛాత్మికైవ హి
జ్ఞానం ద్వినిష్ఠం తద్రూపం మనోఽధిష్ఠాయ వర్తతే. 73

రతిః సత్త్వస్థితా సేయం విభావాద్యుపబృంహితా
రజసాఽనుగృహీతా తు స్వాద్వీ సర్వత్ర భాసతే. 74

భావముల సాహచర్యము సామర్థ్యము నిరూపిత మయినది. ఇక స్థాయిభావములకు కల రసోపాదానహేతుత నిరూపిత మగును. రసములకు భావము లుపాదానకారణము లగుట ప్రతిపాదిత మగును. మొదటగా రతిలక్షణము తద్భేదములు నిరూపణార్హములు. మనస్సునకనుకూలములయినయర్థములందు సుఖసంవేదనరూప మయిన యిచ్ఛ రతి యగును. రతి ప్రీతి విభాగమున నా రతి రెండు విధములు. రతికి ప్రీతికి గల సాధారణభేదము సప్తవిధముల నుండుట పరికీర్తిత మయినది. విషయగత మగు భేదమున సాంప్రయోగిక మయిన రతి యేడు విధముల నుండును. నిసర్గము సంసర్గము ఉపమ అభియోగము అధ్యాత్మము సంరూపము అభిమానము నను విధమున విషయము సప్తవిధము కాగా దాని ననుసరించు రతియు సప్తవిధము ప్రీతియు నిట్లే యగును. ప్రీతి ఆభ్యాసికముగా నుండును. సామాన్యముగా ప్రీతి యనునది ప్రియాత్మక మని, రతి యనునది యిచ్ఛాత్మక మని యందురు. జ్ఞానము ద్వినిష్ఠము. మనస్సు తద్రూ

పము నధిష్ఠించి యుండును. సత్త్వము నందు స్థితి కల రతి విభావాదులచే నుప బృంహితమై రజోఽనుగృహీతమై మనోహర మగును. అంతట భాసించును.

ప్రీతేర్విశేషశ్చిత్తస్య వికాసో హాస ఉచ్యతే
షోఢా వికల్పమాయాతి పరిణామే రసాత్మనా. 75

రజఃస్థితో విభావాద్యైః బృంహితస్తామసో భవేత్
ఉత్సాహః సర్వకృత్యేషు సత్వరా మానసీ క్రియా. 76

సహజాహార్యభేదేన స ద్విధా పరికీర్తితః
విస్మయశ్చిత్తవైచిత్ర్యం స త్రిధా త్రిగుణాత్మకః. 77

ఇచట హాసము ఉత్సాహము విస్మయము నిరూపిత మగును. చిత్త వికాసాత్మక మయిన ప్రీతి విశేషము హాస మన దగును. హాస మారు విధముల నుండును. పరిణామమున రసత్వము పొంది యారువిధముల నవభాసించును. అప్పుడు రజోగుణావస్థితమై యుండును. విభావాదులచే నుపబృంహితమై తామస మగును. ఉత్సాహము. సర్వకార్యము లందును సత్వర మయిన మానసక్రియ నుత్సాహ మందురు. ఆ యుత్సాహము సహజ మని యాహార్య మని రెండు విధముల నుండును. విస్మయము. చిత్తమునకు సంబంధించిన విచిత్రత విస్మయ మగును. విస్మయము త్రిగుణాత్మకముగా నుండును గావున త్రివిధముగా నుండుట ప్రసిద్ధము.

తేజసో జనకః క్రోధః స త్రిధా కథ్యతే బుధైః
క్రోధః కోపశ్చ రోషశ్చేత్యేష భేదస్త్రిధా మతః. 78

సర్వేంద్రియపరిక్లేశః శోక ఇత్యభిధీయతే
సత్త్వాదిపరిభేదేన స త్రిధా పరిపఠ్యతే. 79

నిందాఽఽత్మా చిత్తసంకోచో జుగుప్సేత్యభిధీయతే
ద్విధా విభజ్యతే సాఽపి పరిణామే రసాత్మనా. 80

భయం చిత్తస్య చలనం తచ్చ ప్రాహురనేకధా
స్వరూపమేవ మాచార్యైః స్థాయినాం కథితం పురా. 81

ఇచట క్రోధము శోకము జుగుప్స భయము అనునవి నిరూపితము లగును. క్రోధము తేజోజనకము. దీప్తి సంపాదకము. అది మూడు విధము లని యనిరి. క్రోధము కోపము రోష మని దీని భేదము త్రివిధముగా నున్నది.

శోకము సర్వేంద్రియములను క్లేశ పెట్టునదిగా ప్రసిద్ధము. సత్త్వ రజస్తమః పరిభేదమున నది త్రివిధ మని పరిపఠిత మయినది. జుగుప్స నిందాత్మకము. చిత్త సంకోచరూపము. అదియు రెండు విధములఁ విభక్త మగును. రసాత్మరూపమున పరిణామము పొందినపు డా ద్వివిధాభావము భాసించును. భయ మనునది చిత్తమునకు సంబంధించిన చలనాత్మకము. అది యనేకవిధము లగు ననిరి. ప్రాచీనాచార్యు లీ విధముగా స్థాయిభావముల స్వరూపము నిరూపించిరి. ఇక రత్యాది స్థాయి భావ వాచకము లయిన శబ్దముల నిర్వచనము ప్రసంగప్రాప్తము.

విగృహ్యా తే ప్రదర్శ్యంతే ప్రయోగార్థం యథోచితం
రమ్యతే రమతే వేతి రతీ రమయతీత వా. 82

హాస్యతే హాసయతి వా హాసః స్యాద్ధసతీతివా
ఉత్తంద్రతా మభిభవత్యత ఉత్సాహనిర్వహః. 83

ఉత్సాహ్యతే చోత్సహత ఉత్సాహయతి వా భవేత్
వివిధః స్యాత్స్మయో హర్ష ఇతి విస్మయతేఽథవా. 84

విస్మాప్యతే స్వయం కశ్చిద్విస్మాపయతి వా భవేత్
క్రుత్ క్రార్యం తేన సర్వత్ర ధత్యుత్యస్య నిర్వహః. 85

క్రోధ్యతే క్రోధయత్యేవ క్రోధ ఇత్యభిధీయతే.
శుక్ క్లేశః శోషణాత్మైవ శోచ్యతే శోచతీతి వా. 86

శోచయత్యపరానేవం శోకశబ్దస్య నిర్వహః
సర్వేంద్రియార్థగర్హైవ జుగుప్సేత్యభిధీయతే. 87

జుగుప్స్యతే జుగుప్స్యేత జుగుప్సాపయతీతి వా
బిభేతి భాపయత్యన్యాంస్త్రాసాదిభయముచ్యతే. 88

పూర్వనిరూపిత స్థాయి స్వరూపమున కుపష్టంభకముగా నీ యర్థమును గూడ భావించుట యుక్తము. యథోచితముగా ప్రయోగసిద్ధికై వాని స్వరూపము విగృహ్య ప్రదర్శిత మగును. వ్యుత్పత్తి నిదర్శన పురస్సరముగా నిరూపిత మగును.

రతి. "రమ్యతే రమతే రమయతీతి రతిః" రమ్య మొనరించుట రమించుట రమింపజేయుట యను నర్థత్రయము రతి పదమున గ్రాహ్యము. హాసము. "హాస్యతే హసతి హాసయతీతి హాసః" హాసము కలుగు నట్లు చేయుట

హసించుట హసింపజేయుట యను నర్థత్రయము హాస పదార్థము. ఉత్సాహము. ఉత్తంద్రత, మాంద్యాతిశయము చురుకు దనము లేకుండుటను పోగొట్టునది యగుటచే ఉత్సాహనిర్వాహ మున్నది. "ఉత్సాహ్యతే ఉత్సహతే ఉత్సాహయతీతి ఉత్సాహః" ఉత్సాహ పెట్టుట ఉత్సహించుట ఉత్సహింప చేయుట ఉత్సాహ పదార్థము. విస్మయము స్మయ మనుట హర్షము. వివిధ స్మయము విస్మయము. "విస్మాప్యతే విస్మయతే విస్మాపయతీతి విస్మయః." విస్మయము గలుగునట్లు చేయుట విస్మయపడుట ఇతరులు విస్మయపడునట్లు చేయుట విస్మయపదార్థము. క్రోధము. క్రుత్ క్రోధము. క్రోధముచే సందేహము ధర్షించును. ఇట్లు క్రోధనిర్వాహము భావనీయము. "క్రోధ్యతే క్రోధయతీతి క్రోధః" క్రోధపడుట క్రోధింపజేయుట క్రోధపదార్థము. శోకము. శుక్ క్లేశము. శోషణాత్మకము. "శోచ్యతే శోచతి శోచయతీతి శోకః" శోకపెట్టుట శోకించుట ఇతరుల శోకింపజేయుట శోకపదార్థము. జుగుప్స. సర్వేంద్రియ విషయము లగు పదార్థముల నింద జుగుప్స యన దగును. "జుగుప్స్యతే జుగుప్సతే జుగుప్సాపయతీతి జుగుప్సా" జుగుప్స గలుగు నట్లు చేయుట జుగుప్స పడుట ఇతరులు జుగుప్స పడునట్లు చేయుట జుగుప్సా పదార్థము. భయము. త్రాసాదికము భయము. "బిభేతి భాపయతీతి భయం" భయపడుట భయపడునట్లు చేయుట భయపదార్థము. ఇట్లంతట యథాసంభవముగ కర్మార్థమున కర్త్రర్థమున ప్రేరణార్థమున నా యా పదార్థములను గుర్తింప వలెను.

## రసనిష్పత్తి

విభావాదు లుపకరింపగా స్థాయిభావములకు రసాత్మతాసంపత్తి యుండుట యిక నిరూపిత మగును.

ఏతేషాం చ రసాత్మత్వం స్వరూపం చ రసస్య చ
రసాశ్రయాభివ్యక్తీనాం విశేషః కథ్యతేఽధునా. 89

విభావాద్యైర్యథాస్థానప్రవిష్టైః స్థాయినః స్మృతాః
చతుర్భిశ్చాప్యభినయైః ప్రపద్యంతే రసాత్మతామ్. 90

విభావైశ్చానుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః
ఆనీయమానః స్వాదుత్వం స్థాయీ భావో రసః స్మృతః. 91

వ్యంజనౌషధిసంయోగో యథాన్నం స్వాదుతాం నయేత్
ఏవం నయంతి రసతాం ఇతరే స్థాయినం శ్రితాః. 92

ఏవం హి నాట్యవేదేఽస్మిన్ భరతేనోచ్యతే రసః
తథా భరతవృద్ధేన కథితం గద్య మీదృశమ్. 93

ఈ భావములకు రసాత్మత కలుగుట రసము యొక్క స్వరూపము రసాశ్రయవివేకము తదభివ్యక్తివిధానము తద్విశేష మిచట నిరూపిత మగును. యథాస్థాన ప్రవిష్టము లయిన విభావాదులచే, ఆహార్యాంగిక వాచికాభినయములచే సముల్లసితము లయిన స్థాయిభావములు రసాత్మతను పొందుచున్నవి. విభావములచే ననుభావములచే సాత్త్వికములచే వ్యభిచారిభావములచే స్వాదుత్వము పొందింపబడిన స్థాయి యగు భావము రసమగునని యనిరి. వ్యంజనౌషధిసంయోగ మన్నమును స్వాదువుగా నొనర్చిన విధమున విభావాదులు స్థాయి నాశ్రయించినవై రసత్వమును పొందింప జేయును. స్థాయిస్థానీయ మన్నము. విభావాది స్థానీయములు వ్యంజనౌషధులు. కేవల మన్నము స్వాద్యముకాదు. కేవలము వ్యంజనమును స్వాదువు కాదు. తదుభయ సమ్మేలనమె స్వాదుత నాపాదింప గలదు. అట్లె ప్రకృతమున విభావాదు లున్నవి. నాట్యవేదము నందు భరతుడు ఈ విధముగనే రసస్వరూపమును నిరూపించినాడు. "విభావానుభావ వ్యభిచారిసంయోగాత్ రసనిష్పత్తిః". ఇచటి సంయోగ పదమునకు నిష్పత్తిపదమునకు ననేకులు అనేక విధముల భావార్థములను నిర్ణయించిరి. వారి వారి వాదశీలానుసరణమున రసస్వరూప మిందును నిరూపితము కా గలదు. రసస్వరూపము భరతుడు ముఖ్యముగా నిర్ణయించెను. ఆ సందర్భముననే భరతవృద్ధుడు ఈ గద్యభాగమును ప్రతిపాదించినాడు. భరతవృద్ధసమ్మతమయిన గద్యానుసారమున రసనిర్వచనము లున్నవి. అనంతరము నిరూపించు నానావిధము లయిన రసవాదములకు భరతుని యీ రచనమే మూలముగా నున్నది.

యథా నానాప్రకారైః వ్యంజనౌషధైః పాకవిశేషైశ్చ
సంస్కృతాని వ్యంజనాని మధురాదిరసానాం అన్యతమేన
ఆత్మనా పరిణమన్తి తద్భోక్తౄణాం మనోభిః
తాదృశాత్మతయా స్వాద్యంతే తథా నానాప్రకారైః
విభావాదిభావైః అభినయైః సహయథార్హం అభివర్ధితాః
స్థాయినో భావాః సామాజికానాం మనసి రసాత్మనా
పరిణమంతః తేషాం తాదాత్వికమనోవృత్తిభేద భిన్నాః
తత్తద్రూపేణ తై రస్యంతే. 94

వ్యంజనౌషధి సంయోగమున అన్నము స్వాదు వగుట భరతగ్రంథములో కారికారూపమున నిరూపిత మయినది. దాని భావమే యీ గద్యభాగములో

విస్తృతమయినది. లోకమున నానాప్రకారములగు వ్యంజనౌధములచే పాకవిశేషములచే సంస్కృతము లయిన వ్యంజనములు మధురాదిరసములలో నేదేని యొక రసరూపమున పరిణమించు చున్నవి. అప్పు డనుభవించువారి చిత్తములు ఆ యా సంస్కృతము లయిన వ్యంజనములను తత్తద్రసరూపముగా నాస్వాదించుచున్నవి. ఈ విధముగానే రసవిషయమున గూడ గుర్తింపవలెను. నానాప్రకారము లయిన విభావాదులచే నభినయములచే యథార్హముగా నభివృద్ధి పొందిన స్థాయిభావములు సామాజికులమనసులలో రసరూపమున పరిణమించునవై యా యా సామాజికులకు నా యా సమయము లందలి మనోవిశేషములతో సంగతము లయి యా యా రూపమున నా స్థాయిభావములు రస్యమానములగు చున్నవి. అన్నము వ్యంజనాదిసంయుక్తమయి రస్యమానతాయుక్త మగుట, స్థాయి విభావాదిసంవలితమై రస్యమాన మగుట, నిందు భావనీయము. ఇటుపై వాసుకి మొదలగువారి రసనిశ్చయములు నిరూపితము లగును.

నానాద్రవ్యౌషధైః పాకైర్వ్యంజనం భావ్యతే యథా
ఏవం భావా భావయంతి రసానభినయైః సహ. 95

ఇతి వాసుకినాప్యుక్తో భావేభ్యో రససంభవః
తస్మాద్రసాస్తు భావేభ్యో నిష్పద్యంతే యథార్హతః. 96

విభావైశ్చానుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః
వర్ధితాః స్థాయినో భావా నాయకాదిసమాశ్రయాః. 97

అనుకారతయా నాట్యే క్రియమాణా నటాదిభిః
సామాజికైస్తు రస్యంతే యస్మాత్తస్మాద్రసాః స్మృతాః. 98

నానాద్రవ్య వినిష్పన్నము లయిన పాకములతో గూడినదై వ్యంజన మాస్వాద్య మగునట్లు అభినయములతో గూడుకొనిన భావములు రసములను భావింప జేయ గలవు. ఇట్లు భావముల వలన రసములు సంభవించుటను వాసుకియు నిరూపించెను. కావున రసములు భావముల వలన నిష్పన్నము లగును. తత్తదర్హవిశేషమున రసములు భావనిష్పన్నము లగుటను భావింప వలెను. విభావములచే ననుభావములచే సాత్త్వికములచే వ్యభిచారిభావములచే వృద్ధిపొందిన స్థాయిభావములు నాయకాదుల ననుసరించి యున్నవై, రామాద్యనుకారమున నటాదు లభినయింపగా సామాజికులచే రసాత్మతారూపమున రస్యమానము లగు చున్నవి. అందువలన వానిని రసము లనుట యుక్తము.

ఈ వాసుకి మతసార మీ విధముగా నున్నది. భావముల నుండియే రసము లావిర్భవించును, నటాదు లనుకరించు స్థాయిభావముల వలన రసము నిష్పన్న మగును అని. భావముల వలన రసము లుదయించునా? రసముల వలన భావము లుదయించునా? అను పక్షద్వయము నాట్యవేదమున నిరూపిత మయి నది. అందు భావముల వలన రసము లుదయించు నను వాదము వాసుకివాదము.

ద్రవ్యగుణకర్మాది పదార్థములలో రసము నేపదార్థరూపముగా భావింప వలసి యుండును? ఈ యంశ పరిశీలనమునకై యీ విషయ మావశ్యకము.

న ద్రవ్యం న చ సామాన్యం న విశేషో గుణో న చ
న కర్మసమవాయో న న పదార్థాంతరం చ సః. 99
వికారో మానసో యస్తు బాహ్యార్థాలంబనాత్మకః
విభావాద్యాహితోత్కర్షో రస ఇత్యుచ్యతే బుధైః. 100
రసో మనోవికారోఽపి పదార్థాన్యతమో భవేత్
పదార్థాః షట్ప్రమీయంతే రసస్యానుభవాత్మకాః. 101
అతో రసః పదార్థేభ్యో మాత్రయా క్వాపి భిద్యతే
ద్రవ్యాదీనాం పదార్థానాం తత్తద్రూపతయా రసః. 102
క్వాపి క్వాపి ప్రకాశేన తేషామన్యతమో రసః

ద్రవ్య గుణ కర్మ సామాన్య విశేష సమవాయము లని భావపదార్థము లారు కలవు. రసము ఈ షట్పదార్థస్వరూపము కాదు. రస మనునది ద్రవము కాదు. ద్రవ్యములు పృథివీ జల తేజో వాయ్వాకాశ కాల దిగాత్మ మనస్సు లని నవవిధములు. ఇం దేదియు రసము కాదు. రసము సామాన్యరూపము కాదు. పర మపర మని సామాన్యము ద్వివిధము. రసమ దేదియుకాదు. రసము విశేషరూపము కాదు. విశేషా స్త్వనంతాః. రస మట్టిది కాదు. రసము గుణ రూపము కాదు. రూప రస గంధాదు లిరువది నాలుగు గుణములు. రసము తద్రూపము కాదు. రసము కర్మరూపమును గాదు. గమనాగమనాదిరూపమున కర్మ పంచవిధము. రసము తదాత్మకము కాదు. రసము సమవాయరూపము కాదు. ఇట్లు రసము షట్పదార్థములలో నేదియు కాదు. అయినచో రసము షట్పదార్థాతి రిక్త పదార్థాంతరమా? రసము పదార్థాంతరమును కాదు. అయిన నేమి? బాహ్యార్థాలంబనాత్మక మయిన మానసవికారము విభావాదులచే నుత్కర్షము

పొందినదై రస మను వ్యవహారము పొందు నని బుధు లనిరి. రసము మనోవికారమె యయినను షట్పదార్థములలో నన్యతమము కా వచ్చును. షట్పదార్థములును రసమున కనుభవాత్మకములుగా ప్రమాణప్రతిపన్నము లగు చున్నవి. కావున రసము పదార్థములకన్న ఈషద్భిన్న మగును. ద్రవ్యాదిపదార్థములలో తత్తద్రూపమున రస ముండును. ఒక్కొకచో ప్రకాశమానతావిశేషమున రసము షట్పదార్థములలో నన్యతమ రూపమున నుండుటయు భావనీయము.

విభావానుభావాదులు నామసంకేతమున సూచితము లయినవి. భరతాదుల మతానుసారమున నా విభావాదుల స్వరూపకథన మావశ్యకము.

విభావాశ్చానుభావశ్చ స్థాయినో రససిద్ధయే 103
కథ్యంతే భరతోక్తేన వర్త్మనా నాన్యథా క్వచిత్.
ఉక్తా అపి విభావాద్యాః పూర్వత్ర స్వ స్వ రూపతః 104
మతాంతరేణ కథ్యంతే జ్ఞానం క్వాప్యుపయుజ్యతే
విభావాశ్చానుభావాశ్చ సాత్త్వికా వ్యభిచారిణః. 105
స్థాయినోఽపి చ కథ్యంతే భావా ఇతి మనీషిభిః

స్థాయిభావమునకు రసత్వసిద్ధికై విభావము లనుభావములు భరత మార్గానుసారమున నిరూపితము లగును. భరతోక్తమార్గాతిరిక్తముగా నిరూపించుట లేదు. పూర్వము విభావాదులు స్వ స్వ రూపమున నిరూపితము లయినను అవి మతాంతరముగా నిరూపితములు. అట్లు మతాంతరముగా నిరూపితము లయిన వాని విజ్ఞాన మొక్కొకచో నుపయుక్తము కా గలదు. విభావానుభావ సాత్త్విక వ్యభిచారి స్థాయిభావములు భావము లనియె పండితులు పరిష్కరించి పలికిరి. ఈ యుపక్రాంతోద్దేశానుసారముగా భరతాదుల మతానుసారమున విభావాదుల స్వరూపము నిరూపితము కాగలదు.

## భావస్వరూపము

యద్భావయంతి కావ్యార్థాన్ సత్త్వ వాగంగ సంయుతాన్. 106
తస్మాద్భావా ఇతి ప్రాజ్ఞైరుచ్యంతే నాట్యవస్తుషు
వాగంగ ముఖరాగైశ్చ సత్త్వేనాభినయేన చ. 107
కవేరంతర్గతం భావం భావయన్ భావ ఉచ్యతే
విభావేనాహృతో యోఽర్థోస్త్వనుభావేన గమ్యతే. 108

వాగంగ సత్త్వాభినయైః స భావ ఇతి కీర్తితః

సాత్త్వికాభియ వాచికాభినయ అంగికాభినయములతో గూడుకొనిన కావ్యార్థములను భావింపజేయు నవి యగుటచే భావము లనియబడట యుక్తము. నాట్యవస్తువు లందు వీని నీ విధముగనే నిశ్చయింప వలె నని ప్రాజ్ఞుల యుక్తి. భావమున కిది యొకవిధ మగు నిర్వచనము. వాగంగ ముఖరాగములచే సత్త్వాభినయముచే కవి యంతర్గత మయిన భావమును భావింప జేయునది యగును గావున భావ మని యన దగు నని మరికొందరి భావమతము. విభావమున సమాహృత మయిన యర్థము అనుభావముచే వాగంగ సత్త్వాభినయములచే గమ్యమాన మగును; అట్లవగత మయిన యర్థము భావ మని పరికీర్తిత మయిన దనుట వేరొక మతము. ఇట్లు భావవిషయమున మతత్రయము నిరూపిత మయినది.

## విభావస్వరూపము

వాగంగసత్త్వాభినయో యేనైవ చ విభావ్యతే. 109
స భావో నాట్యతత్త్వజ్ఞైర్విభావ ఇతి దర్శితః
నిమిత్తం కారణం హేతుర్విభావశ్చ విభావనా. 110
ఇత్థం విభావపర్యాయాః కథ్యంతే భావకోవిదైః
విజ్ఞానార్థో విభావః స్యాద్విజ్ఞానం చ విభావితమ్. 111
బహవోఽర్థా విభావ్యంతే వాగంగాభినయాశ్రయాః
అనేన యస్మాత్తేనాయం విభావ ఇతి సంజ్ఞితః. 112

వాగంగసత్త్వాభినయము దేనిచే విభావిత మగునో అట్లు భావింప జేయు భావము విభావ మగునని నాట్యతత్త్వజ్ఞులు నిరూపించిరి. విభావపర్యాయములు కొన్ని కలవు. నిమిత్తము కారణము హేతువు విభావము విభావన -ఇట్లు విభావపర్యాయములు కలవని భావకోవిదులు నిరూపించిరి. విభావ మనునది విజ్ఞానార్థము. విజ్ఞానము విభావిత మగును. వాగంగాభినయాశ్రయము లయిన నానార్థములు దీనిచే విభావితము లగును గావున నిది విభావ మని సంజ్ఞ కల దగుచున్నది. ఇట్టి భావమును విభావవిషయమున గ్రాహ్యము.

వాగంగాభినయేనేహ యస్మాదర్థోఽనుభావ్యతే
సర్వాంగోపాంగసహితః సోఽనుభావస్తతః స్మృతః. 113

ఆవిర్భూయ తిరోభూయ చరద్భిశ్చాంతరాంతరా
మైరసో భిద్యతేఽనేకః తే స్మృతా వ్యభిచారిణః. 114

భావానామపి సర్వేషాం యైః స్వసత్తా విభావ్యతే
తే భావాః సత్త్వజన్మానః సాత్త్వికా ఇతి దర్శితాః. 115

స్థితాః కావ్యాదిషు నటైరభినీతా యథార్థతః
రసాత్మనాఽవతిష్ఠంతే సత్సు తే స్థాయినోఽత్రతే. 116

ఇచట అనుభావ వ్యభిచారిభావ సాత్త్విక స్థాయి భావస్వరూప మున్నది. వాచికాభినయాంగికాభినయములచే సర్వాంగోపాంగ సహిత మగు నర్థ మనుభూయమాన మయినచో ననుభావ మగు నని కీర్తిత మయినది. ఇది యనుభావస్వరూపము. వ్యభిచారిభావస్వరూప మిట్లున్నది. ఆవిర్భావ తిరోభావములు పొందుచు మధ్య మధ్యలో సంచరించుచు రసము ననేకవిధముల వేరు వేరుగా భాసింప జేయునవి వ్యభిచారిభావము లగును. వ్యభిచారిభావ ములకు సంబంధించిన యావిర్భావతిరోభావములు రసమునకు నావిర్భావ తిరోభావములు కూర్చునవి యగును. అప్పుడు రస మనేకధా భాసించును. ఇట్టి క్రియాచతురము లగునవి వ్యభిచారిభావము లని భావము. సాత్త్వికభావముల స్వరూప మిట్లుండును. సత్త్వము వలన సంభూతము లయిన సాత్త్వికభావములు సర్వభావములకు స్వసత్తయై యుండు నట్లొనరింప గలవు. అప్పు డా భావము లన్నియు సాత్త్వికసత్తావిభావితము లగును. ఇట్లొనరింప గలుగునవి సాత్త్విక ములు. స్థాయిభావముల స్వరూప మీ విధముగ నుండును. కావ్య నాట్యగత ములుగా నుండు నీ భావములు యథార్థముగా నటులచే నభినీయమానములై సహృదయు లందు రసరూపమున నవస్థానము కల వగును. సహృదయులలో రసాత్మతను బొందునవి స్థాయి భావము లగును. ఇట్లు భరతాదుల మతాను సారమున విభావాదుల స్వరూపము వివేచిత మయినది.

భావాః స్యుర్మానసాః కేచిదాంగికా అపి కేచన
వాచికా అపి కేచిత్స్యు స్సాత్త్వికా అపి కేచన. 117

ద్రవ్యేఽపి కేచిద్భావాః స్యుః కేచిత్స్యుర్గుణకర్మణోః
ఏతేషు భావశబ్దార్థః ప్రయోజన ముదాహృతమ్. 118

ప్రయోజన మభిప్రాయ స్తాత్పర్యం ఫల మిత్యపి
భావ ఇత్యేవ శబ్దాః స్యుర్భావపర్యాయవాచకాః. 119

ద్రవ్య క్రియాగుణవచో మనోఽంగేషు మనీషిభిః
భావశబ్దః ప్రయుక్తస్తు భావోఽభిప్రాయ వాచకః. 120

కొన్ని భావములు మానసములు కొన్ని యాంగికములు కొన్ని వాచికములు కొన్ని సాత్త్వికములు నగును. కొన్ని భావములు ద్రవ్యము నం దుండును. కొన్ని భావములు గుణకర్మము లం దుండును. ఇట్టి వానిలోని భావశబ్దార్థము ప్రయోజన మను నర్థమున నుండును. ప్రయోజనము అభిప్రాయము తాత్పర్యము ఫలము భావము అను శబ్దము లన్నియు భావపర్యాయ వాచకములె. మనో వాగంగ సత్త్వరూపము లయిన భావములు ద్రవ్య గుణ క్రియలలో వచోమనోఽంగములలో ప్రయుక్తము లగు చున్నవి. ఇట్లు ప్రయుక్త మయిన భావశబ్ద మభిప్రాయవాచక మని మనీషుల మనీష. ఇక భావములచే రసము నిష్పన్న మగుటయు రస మొకటియే యయినను చిత్తవృత్తిభేదమున బహువిధ మగుటయు నిరూపిత మగును.

ఏతే భావా రసోత్కర్షే తత్ర తత్రోపయోగినః
ఉద్దీపితా విభావైః స్వైరనుభావైశ్చ పోషితాః. 121

భావైశ్చ సాత్త్వికైః యోగ్యసంసర్గై ర్వ్యభిచారిభిః
చిత్రితాః స్థాయినో భావా రసోపాదానభూమయః. 122

యదా తదైషామాస్వాద్యమానరూపం యదున్మిషత్
మనోభిః ప్రేక్షకాణాం తదుదేష్యతి రసాత్మనా. 123

ఆ యా స్థలము లం దీ భావములు విభావానుభావవ్యభిచారిభావము లచే నుద్దీపితములై యనుభావితములై పరిపోషితములై రసము నుత్కర్షింప జేయుటలో నుపయోగించు నవి యగును. స్వీయవిభావములచే స్థాయి భావము లుద్దీపితము లగును. స్వీయానుభావములచే పోషితము లగును. అట్లే సాత్త్విక భావములచే గూడ పోషము కల వగును. యోగ్యసంబంధము కల వ్యభిచారి భావములచే చిత్రితములు నగును. ఇట్లే భావములు రసోపాదానభూములుగా గణనీయములు. వీని కాస్వాద్యమాన మగు రూపము కలుగగా సమున్మేష ముండును. గావున రసాత్మత యుల్లసిత మగును. ప్రేక్షకుల మనోవృత్తులు భావముల నాస్వాదించు నప్పు డవి రసరూముననె యుండును.

తత్రాంతరస్య భేదా యే వ్యాపారస్యోదితాః పృథక్
తే సర్వే నాట్యతత్త్వజ్ఞైః కథ్యంతే హి రసాహ్వయాః. 124

ఏవం రసానాముదయః సామాన్యేన సమీరితః

ఈ రసవిషయమున నాంతరవ్యాపారమునకు సంబంధించిన వేరు వేరుగా నుండు భేదము లేవేవి కలవో యవి యన్నియు రసనామముననె వ్యవహరింప దగిన వని నాట్యతత్త్వజ్ఞు లందురు. రస మొక్కటియే యయినను చిత్తవృత్తి భేదమున నానారూపమున నుండవచ్చును గాని వానికిని రసనామమె యుక్త మగును. ఇట్లు సామాన్యముగా రసోదయము నిరూపితము.

రసాశ్రయముగ నిరూపింప దగిన వా రెవరు? నాయకుడా? నటుడా? సామాజికుడా? ఈ విషయమున నావభేదములు కలవు. అవి యిచట నిరూపితము లగును.

## రసాశ్రయము

స్వభావో వాఽనుకారో వా యస్మిన్ దృశ్యతయా స్థితః. 125
రసాశ్రయః స ఏవేతి భారతాః ప్రతిజానతే
యశసేఽర్థాయ మహతే రాజ్ఞోప్యుపద్రవశాంతయే. 126
కర్మణాం విఘ్ననాశాయ మంగలానాం చ సంపదే
ఉదాత్తాదిగతా న్భావా నపరోక్షానపి తత్త్వతః. 127
కవిభిః కల్పితా న్కావ్యేష్వభినేయా న్విచక్షణైః
ప్రత్యక్షవత్సదస్యేభ్యో నటా యదనుకుర్వతే. 128
తస్మాన్న తేషు న క్వాపి రసస్యాశ్రయతా భవేత్

నటసామాజికులు రసాశ్రయములుగా జెప్పదగిన వారు. నటుడు రసాశ్రయుడు కాడు. సామాజికుడె రసాశ్రయుడు. ఈ భావము లిచట నిరూపితము లగును. సామాజికు నందు రసము స్వభావాత్మకముగా గోచరించును. నటు నందది యనుకారాత్మకముగా భాసించును. స్వభావముగ గాని యనుకారముగా గాని రసము గోచరించు నేని ఆతడె రసాశ్రయు డగునని భరతమతానుయాయులు నిశ్చయించు చున్నారు. కాని నటు నందు రసాశ్రయ యోగ్యత లేదు. నటు లనుకరింతురు. వారలకు రసాశ్రయత లేదు. విచక్షణు లయిన కవులు సదస్యులకు సాక్షాత్కరింప జేయుటకై కావ్యమున నభినేయముల నిరూపింతురు. ఉదాత్తాదిగతము లయిన భావములను పరోక్షరూపమునుగా నున్న వయినను కల్పితములనుగా నొనరింతురు. ప్రత్యక్షాయమాణము లగు నట్లు నిబంధింతురు.

అట్టి వానిని నటు లనుకరింతురు. కవులు కావ్యములను యశమునకు నిబంధింతురు. అర్థసిద్ధికై నిబంధింతురు. సమధికముగా రాజోప్యపద్రవము కలిగినచో నాయుపద్రవశాంతికై కావ్యముల రచింతురు. తగిన కర్మలలో విఘ్నములు లేకుండుటకై కావ్యాభినేయముల నిర్మింతురు. మంగలాత్మక మయిన సంపదకై కావ్యము కల్పింతురు. ఇట్టి వాని ననుకరించు నటులకు రసాశ్రయ యోగ్యత యుండదు. నటులలో నెచటను రసాశ్రయత యుండదు. ఇక పారిశేష్యమున సామాజికుడు రసాశ్రయ యోగ్యత కలవా డని నిరూపించిన ట్లయినది. ఈ యంశము విస్తృతము కాగలదు.

మనసో హ్లాదజననః స్వాదో రస ఇతి స్మృతః. 129

శృంగారస్య స యుజ్యేత తస్య హ్లాదాత్మకత్వతః
అన్యేషాం రసతా ప్రాయః సిద్ధా కేనాపి హేతునా. 130

యథా నృణాం తు సర్వేషాం సర్వేఽపి మధురాదయః
భుక్తా రసాత్మతాం యాంతి దేశ కాలాది భేదతః. 131

తథా జాతా జనిష్యంతో జాయమానాః పరస్పరం
పరస్పరస్య సర్వత్ర మిత్రోదాసీన శత్రవః. 132

తేషు కస్యాపి శృంగారో హాస్యః కస్యచిదేవ సః
అద్భుతస్స చ కస్యాపి కస్యాపి కరుణో భవేత్. 133

ఏవం సంకరతోఽన్యోన్యం దేశ కాల గుణాదిభిః
శృంగారాద్యాః సదస్యానాం భవంతి హ్లాదనా యతః. 134

తస్మాత్సామాజికైః స్వాద్యా రసవాచ్యా భవంతి తే
ప్రకృతీనాం చ భిన్నత్వా దవస్థాది విభేదతః. 135

మనసః క్షణికత్వాచ్చ తానేకః స్వదతే యతః
తతోఽపి రసవాచ్యాః స్యుః ఇత్యాచార్యా వ్యవస్థితాః. 136

శృంగారమే ప్రధానముగా నాస్వాద్యము. ఇతర రసములును ప్రకృతి భేదమున రస్యమానము లగును. ఈ యంశ మిచట ప్రతిపాదిత మగును. మనసున కాహ్లాద మొదవించు స్వాదమును రస మందురు. శృంగారమునకె యా రసవ్యవహారము యుక్తముగ నుండును. శృంగారమునకె హ్లాదజనకత యున్నది. శృంగారేతరములకు రసత్వము సామాన్యముగా సిద్ధ మగును. ఏదేని యితర కారణమున నితరములకు రసత్వము సిద్ధ మగు చున్నది. రస్యమానతాధర్మమున

రసత్వ మనునది శృంగారమునకె. ఇం దీ దృష్టాంతము భావింప దగి యున్నది. సర్వమానవులకు మధురాదిసర్వరసములు దేశకాలాదిభేదానుసారమున సంభుక్తములై రసాత్మతను పొందు చున్నవి. ఈ లోకరస దృష్టాంతముననె కావ్యరస వ్యవహారమును గుర్తింప వలెను. పరస్పరసంబంధమున జాతములు కాని జాయమానములు కాని జనిష్యమాణములు కాని యంతట మిత్రోదాసీన శత్రుభావమున నుండును. కొన్ని రసములు కొన్ని రసములకు మిత్రభావమున సంగతము లగును. మరికొన్ని యుదాసీనభావమున సంగతము లగును. మరికొన్ని శత్రుభావమున నుండును. హానిలో నొకనికి శృంగార మిష్టము. వేరొకనికి హాస్య మిష్టము. ఒకని కద్భుత మిష్టము. ఒకనికి కరుణ మభి మతము. ఇట్లు దేశకాలగుణాదుల యన్యోన్యసాంకర్యము వలన సదస్యులకు శృంగారాదిరసములు హ్లాదజనకములుగ నుండును. కావున సామాజికుల కాస్వాద్యమానము లగు నవి యన్నియు రసపదవాచ్యము లగును. అవస్థాదుల విభేదానుసారమున ప్రకృతులు భిన్నభిన్నము లయి నందు వలన నా యా ప్రకృత్యనుసారమున నా యా రసముల నాస్వాదింతురు. ఆస్వాద్యమానము లగునవి రసపదవాచ్యములు నగును. ప్రకృతిభేదము లేకున్నను సామాజికు డొక్కడె సర్వరసముల నాస్వాదించు వాడు నగును. మనస్సు క్షణికము కదా! ఒక సమయము నందలి మన సొక యాస్వాద మభిలషించును. వేరొక సమయము నందలి మనసు వేరొక స్వాద మభిలషించును. కావున నొకడె యన్నిటి నాస్వాదింప వచ్చును. కావున శృంగారేతరములును రసపదవ్యవహార్యము లగునని కొందరాచార్యులు వ్యవస్థ నాపాదించు వారుగ నున్నారు.

ఇక రసముల వ్యంగ్యతాదివిశేషములు నిరూపితము లగును.

ఏకే రసానాం వ్యంగ్యత్వం వాచ్యత్వం కేచి దూచిరే
ప్రత్యాయ్యత్వం వదంత్యన్యే గమ్యత్వమపి కేచన. 137

తథాఽవాంతర వాక్యార్థం మహావాక్యార్థతాం పరే
ఏవం న్యాయో న భిద్యేత క్వాపిక్వాపి ప్రకాశితః. 138

రామాదా వనుకార్యే తు నటైర్వ్యంగ్యో భవిష్యతి
తత్తత్కావ్యనిబద్ధస్తు వాక్యార్థః స భవిష్యతి. 139

నామాదితాదాత్మ్యాపత్తే ర్నటే ప్రత్యాయ్య ఏవ సః
ఏవమేవోహ్య ఏవ స్యాత్తత్ర తత్ర విచక్షణైః. 140

తదవాంతరవాక్యార్థో మహావాక్యార్థ ఏవ చ
ముక్తకాదౌ ప్రబంధే చ స్థాయి సంచారి భేదతః. 141

కొందరు రసములకు వ్యంగ్యత్వము కల దనిరి. కొందరు వాచ్యత్వము పలికిరి. మరికొందరు ప్రత్యాయ్యత్వ మున్న దనిరి. కొందరు గమ్యత్వమును నిరూపించిరి. అన్యులు కొందరు రసముల కవాంతర వాక్యార్థత్వము కల దని మహావాక్యార్థత యున్నదని యనిరి. ఒక్కొకచో నా యా విధముగా ప్రకాశించుటచే నీ చెప్పిన న్యాయవిధానములు భిన్నము లగుట లేదు. ఈ యంశము లిచట కొంతగా పరామృష్టము లగును. కావ్యనాట్యము లందు రామాదు లనుకార్యులు. నటు లనుకార్యుల ననుకరించు ననుకర్తలు. అనుకార్యులయిన రామాదుల ననుకరించు నటులు తమ యనుకారములచే ననుకార్యు లందు రసము వ్యంగ్య మొనరింతురు. తత్తత్కావ్య నిబద్ధ మగు రసము వాక్యార్థము నగును. పదముల సమూహము వాక్యము. పదార్థముల సమూహము వాక్యార్థము. మొత్తముపై నవభాసించు నది మహావాక్యార్థమని, మహావాక్యార్థమున నంగముగా నుండునది యవాంతరవాక్యార్థ మని యందురు. ప్రధానరసము మహావాక్యార్థరూపముగా నుండుటయు నంగరస మవాంతరవాక్యార్థరూపముగా నుండుటయు పరిగ్రాహ్యము. రసము నటు నందు ప్రత్యాయ్యము నగును. నటుడు రామాదుల నామాదుల తాదాత్మ్యాపత్తి కలవాడై నటించును కావున, రామాద్యభిన్నముగనె భాసించును గావున నటాభినయసంపద లాతని యందలి ప్రత్యాయ్య మొనరించును. ఇట్లె యితరములను గూడ ఆ యా స్థలము లందు విచక్షణు లభ్యూహింప వలెను. ముక్తకాదులు ప్రబంధములునని కావ్యములలో ప్రధానముగా రెండు భేదములు కలవు. ముక్తకాదులు నానావిధములుగా నున్నవి. వానిలో రస మవాంతర వాక్యార్థరూపమునను, ప్రబంధము లందు మహావాక్యార్థరూపమునను భాసించుటను గుర్తించునది. స్థాయి రూపముగా నుండునది మహావాక్యార్థ మని సంచారిరూపముగా నుండునది యవాంతర వాక్యార్థ మని యౌచిత్యమున గ్రహింప నగును.

ప్రమదాద్యన భావేన భావితో వాసితో రసః
తత్తద్రూపస్యాభినయైః పభ్యేషు వ్యజ్యతే స్ఫుటమ్. 142

రసమునకు సహృదయాశ్రయత్వ మిందు నిరూపిత మగును. ప్రమదాద్యనుభావములచే భావితము వాసితము నయిన రసము తత్తద్రూపమునకు

సంబంధించిన యభినయములచే సభ్యసామాజికులంలో స్ఫుటముగా వ్యాజ్యమా! మగునని సామాన్యార్థము. కావ్యనాట్యములు అందుపాత్తము లయిన ప్రమదాదుల చంద్రచందనాదులు ఆ నాయికానాయకులకు సంబంధించిన చేష్టాత్మకము లయిన యనుభావములు భావకసహృదయులు భావింపగా సహృదయ హృదయము లందు చిరకాలముగా సుప్తములు గుప్తములుగా నున్న భావములు భావితము లగును. అట్లు భావితము లయిన ఆ భావములె కావ్యనాట్యగుణ విశేషములచే వాసితము లగును. వాసితము లగుట యనగా భావ్యమాన కావ్యభావనా విశేషమున సంవాదము పొందినవై ప్రాప్తసంస్కారము లగును. ఇట్టి విధానమును వాసిత మగుట యన వచ్చును. ఇట్లు భావిత వాసిత మయిన రసము తత్తదుచితము లయిన ఆంగిక వాచికాహార్య సాత్త్వికాభినయములచే సహృదయు లందు విగలిత వేద్యాంతరముగా నభివ్యక్త మగును. ఇట్లు సామాజికు లందు రసములకు వ్యంగ్యత భావనీయము.

ఇంతవఱకు రసము రస మని, భావము భావ మని నామసంకేతముననె నిరూపిత మయినది. ఇక రసతత్త్వము మీమాంసింప వలసి యున్నది. రస మహంకార స్వరూపముగా నిందు నిశ్చితము కా నున్నది. కావున సంవిద్రూపము చెప్పి యహంకారతత్త్వము ప్రతిపాదింప వలసి యున్నది. కావున ముందుగా సంవిద్విభాగ మావశ్యకము.

## సంవిద్విభాగము

సంవిత్ప్రకాశానందాత్మా గమ్యః స్యాత్స్వానుభూతితః
అహంకారాభిమానాత్మా బాహ్యార్థేషు ప్రకాశతే 143
అహంకారాభిమానాది స్వరూపం కథ్యతేఽధునా

సంవిత్పదమున జెప్ప దగినది యొకటి కలదు. అది స్వానుభూతి వలననె తెలియ దగియున్నది. దానిని లోకశబ్దములచే జెప్పుట శక్యము కాదు. అది ప్రకాశానందాత్మకము. ప్రకాశపదమున జెప్పదగినది యాత్మ. సంవిత్ ప్రకాశానంద స్వభావము. ఆత్మానందస్వరూపము. సంవిత్ అనుభూతి గమ్య మయినను బాహ్యార్థము లందు అహంకారాత్మకముగా అభిమానాత్మకముగా ప్రకాశించును. అహంకారస్వరూప మభిమానస్వరూపము. ఇంక నిట్టి వాని స్వరూప మిక నిరూపితము కాగలదు.

పరస్మాదాత్మనో భాంతి జ్ఞానానందక్రియా ప్రభాః. 144

జ్ఞానప్రభాసా శ్చైతన్య మణే ర్జీవస్య సర్వతః
శరీరవ్యాపినీ తత్ర వ్యాపనా భవతి స్ఫుటమ్. 145

సైషా పరాత్మనః సర్వవస్తూత్థా చేతనా భవేత్
తథాఽఽనందప్రభాసాఽపి పురుషేషు సమంతతః. 146

అభివ్యక్తా సతీ తేషాం సుఖం వైషయికం భవేత్
క్రియాప్రభ భవేత్ప్రాణః స దేహేషు ప్రవర్తతే. 147

పరమాత్మా సర్వవస్తు పరిస్పంద ప్రవర్తకః
జ్ఞానప్రభా చ సానందా తస్యాః సత్త్వం ప్రజాయతే. 148

క్రియాప్రభా రజః సత్త్వాచ్ఛక్తిః స్యా దుత్తమా ప్రసూః
మనోమయాదయ స్తాసా మధిష్ఠాతార ఈరితాః. 149

పృథ క్కదాచి త్తిష్ఠంతి మిలితాని కదాచన
సత్త్వం విశాలం తస్యాన్త రుదరే రజసః స్థితిః. 150

తస్యాన్త రుదరే తస్య తమసః స్థితి రుచ్యతే
ఆత్మా తస్యాన్త రుదరే మనసః స్థితి రుచ్యతే. 151

మిలితానీతి జానంతి నైరంతర్యా త్పరే పునః
సత్త్వం మధ్యేఽభిత స్తస్య రజ స్తమ ఇతీర్యతే. 152

రసతత్త్వ స్వరూప సమీక్షా సామర్థ్యమున కీ ప్రఘట్ట నిరూపితార్థము విభావనీయము. జ్ఞానానంద క్రియా ప్రభాసములు పరమాత్మ వలన భాసించు చున్నవి. జ్ఞానప్రభాసములు ఆనందప్రభాసములు క్రియాప్రభాసములు నను మూడు ప్రభాసములు పరమాత్మ నుండియే యనుభాసించు చున్నవి. ఇందు జ్ఞానప్రభాసములు చైతన్యమణి ప్రభాసములు. అవి సర్వతః ప్రసరించును. మణి ప్రభాసములు పరిసరము లందు ప్రసరించు విధమున చైతన్యస్ఫురణము లంతట ప్రసరించు నవి యగుట నంతట నున్నవి. అట్టి చైతన్యజ్ఞాన ప్రభాసము జీవుని శరీరమున వ్యాపించును. శరీర మంతట నది వ్యాపించును. కావున శరీరమున స్ఫుటముగా వ్యాపన కలుగు చున్నది. ఇట్లు పరమాత్మ వలన చేతనావ్యాపనము సర్వవస్తుసంగతముగ నుండును. అట్లే ఆనందప్రభాసను కూడ పరమాత్మ స్ఫురణము. అది పురుషులలో నంతట నభివ్యక్తమై వైషయికసుఖ మగును. శబ్ద స్పర్శ రూప రస గంధము లను ఇంద్రియవిషయముల వలన గలుగు సుఖము

వైషయిక సుఖము. ఆనందప్రభాస మీ వైషయికసుఖముగా భాసించును. పరమాత్మ చైతన్య క్రియాప్రభాసము ప్రాణము. అది దేహము లందు ప్రవర్తించును. పరమాత్మయె సర్వవస్తువులకు పరిస్పందమును ప్రవర్తింప జేయును.

జ్ఞానప్రభాస మానందప్రభాసముతో కూడు కొనినది కాగా దాని వలన సత్త్వ ముదయించు చున్నది. క్రియాప్రభాస మానందప్రభాసముతో కూడు కొనినది కాగా దానివలన రజోగుణ ముదయించును. సత్త్వము వలన నుత్తమ మయిన శక్తి యుదయించును. ఆశక్తి యందు తమఃస్పర్శ ముండదు. మనోమయప్రాణమయాన్నమయములు వాని కధిష్ఠానములు.

ఈ సత్త్వాదిగుణము లొకప్పుడు వేరువేరుగా నుండును, ఒకప్పుడు మిళితములై యుండును. సత్త్వము విశాలము. దాని యంతరుదరమున రజోగుణమునకు స్థితి యున్నది. ఆ రజోగుణము యొక్క యంతరుదయము నందు తమో గుణమునకు స్థితి యున్నది. ఆ తమోగుణము యొక్క యంతరుదయమున మనసునకు స్థితి యున్నది. అవట ఆత్మకలదు.

కొందరు సత్త్వాది గుణములు నైరంతర్యమున నుండుటచే నివి మిళితములై యున్నట్లు గుర్తించు చున్నారు. మధ్యలో సత్త్వమున్నది. దాని చుట్టుకొని రజోగుణ మున్నది. రజమును చుట్టుకొని తమోగుణ మున్నది. అనియు కొంద రందురు.

తన్మాత్రైః స్సహాభూతాని దశజ్ఞానేంద్రియాణి చ
కర్మేంద్రియై స్సహ దశ మనస్తదుభయాత్మకమ్. 153

అహంకారేణ యుక్తానాం తన్మాత్రాణాం యథాక్రమం
దశేంద్రియాణి కథ్యంతే తేషాం వికృతయ స్త్వితి. 154

అహంకారస్య చైకస్య వికృతిస్మన ఉచ్యతే
ప్రకృతేర్వికృతిః సోఽపి మహాన్ సా చ త్రిధా భవేత్. 155

సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి సాత్త్వికీ

అహంకారాది తత్త్వముల యుత్పత్తిక్రమము ఈ ఘట్టమున నున్నది. శబ్ద స్పర్శ రూప రస గంధములు పంచతన్మాత్రలు. పృథివ్య ప్తేజో వాయ్వాకాశములు పంచభూతములు. జ్ఞానేంద్రియములయిదు. శ్రోత్ర త్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణములు జ్ఞానేంద్రియములు. వాక్పాణి పాద పాయూపస్థ లను నయిదు

కర్మేంద్రియములు. మన స్సన నది జ్ఞానేంద్రియ కర్మేంద్రియోభయాత్మకము. జ్ఞాన కర్మేంద్రియము లను దశేంద్రియములు అహంకార యుక్తము లయిన తన్మాత్రల వికృతిరూపములు. అహంకారమునకు మనస్సు వికృతి యందురు. మహాన్ అను పదమున వ్యవహరింప దగినదియు ప్రకృతికి వికృతి యగును. మహాన్ అన దగిన మహత్తత్త్వము మూడు విధములు—సాత్త్వికము రాజసము తామసము నని. వీని స్వరూపములు నివేచితము లగును.

నిశ్చిన్వంతీతి విషయాన్ బుద్ధి రిత్యుచ్యతే బుధైః. 156

స్వాంశైస్సహ యుతా సర్వజీవానా ముపకారికా
అంశాః స్యు ర్వ్యష్టయ స్తస్యా విజ్ఞానేంద్రియపంచకమ్. 157

సాహాయకం భవే త్తద్వద్విషయాలోచనాదిషు
మనశ్చోపకరోత్యస్యాః సంకల్పేన తత స్తః. 158

అపరోక్షావభాసో య స్తదాలోచన ముచ్యతే
యః పరోక్షావభాసస్తు స సంకల్ప ఇతీరితః. 159

అహంకారో௨భిమానేన బుద్ధేరుపరోకణి యః
జ్ఞాతుర్జ్ఞేయేన సంబద్ధో దేశకాల నిబంధనః. 160

యో మమేతి గ్రహః సో௨యమభిమాన ఇతీరితః
క్రియాయా హేతుభూతత్వా ద్రాజసీ ప్రాణ ఉచ్యతే. 161

స్వాంశై రుపకరోత్యేవ భూతానా మాశయస్థితః
కర్మేంద్రియాణి విషయైః స్వైః స్వై స్తస్యోపకుర్వతే. 162

మనశ్చ కుర్యామిత్యాది సంకల్పేనోపకారకం
తామసీ సృష్ట్యవస్థాయాం సతతం పరిణామతః. 163

కాలో భవతి తస్యైవ పరిణామాః క్షణాదయః
తేనైవ సర్వభూతానాం పరిణామః ప్రవర్తతే. 164

స కాలః స్పందరూపేణ పదార్థాన్పరిణామయన్
అనుగృహ్ణాతి వేత్తారం విత్తిం వైద్యం చ తత్త్వతః. 165

ఈ ప్రఘట్టములో నీ సారార్థము కలదు. ప్రకృతి వికృతి గుణసంబంధము త్రివిధము. పిమ్మట బుద్ధి మనస్సు ఆలోచనము సంకల్పము అహంకా

రము అభిమానముల స్వరూపము గ్రాహ్యము. ప్రాణవిధానము కాలస్వభావము సంగ్రాహ్యము. ఈ ప్రఘట్టానంతర మహాంకారస్వరూపము నివేదిత మగును. బుద్ధి సాత్త్వికము. "బుద్ధిర్నిశ్చయకారిణీ" అనియూ విషయములను బుద్ధినిశ్చయ మొనరించును. ఉన్నవాని నున్నట్లుగా నిశ్చయించును. బుధులు బుద్ధిని నిశ్చయ కారిణి యని యనిరి. ఈ బుద్ధి స్వాంశములతో గూడుకొనినదై సర్వజీవుల కుపకరించును. బుద్ధికి సంబంధించిన యంశము లన్నియు జ్ఞానేంద్రియపంచకానుసరణమున వ్యష్టిరూపముగా నుండును. శ్రవణేంద్రియ గ్రాహ్యవినిశ్చయము త్వగింద్రియగ్రాహ్య వినిశ్చయము చక్షురింద్రియగ్రాహ్య వినిశ్చయము రసనేంద్రియ ఘ్రాణేంద్రియ గ్రాహ్య వినిశ్చయము నను రూపమున నీ బుద్ధ్యంశములు వేరు వేరుగా నుండును. తత్తద్విషయాలోచనాదులలో మనస్సు సహాయ మొనరించునది యగును. ఈ బుద్ధికి మనస్సు యీ విధమున సంకల్పముతో నుపకరించును. అపరోక్షావభాసమున కాలోచన మని పేరు. పరోక్షావభాసరూపమగునది సంకల్ప మని యన దగి యున్నది. అభిమానరూపమున బుద్ధి కుపకరించునది యహంకారము. అభిమాన స్వరూప మీ విధమున నుండును. అభిమాన మనునది జ్ఞాత యగు వానికి జ్ఞేయముతో సంబద్ధమై యుండును. దేశ కాల నిబంధన రూపముగా నది జ్ఞేయసంబద్ధ మగును. "ఇది నాది" యను నట్టి జ్ఞాన మభిమానము. ఇంతవఱ కిది సాత్త్విక మయిన బుద్ధి స్వరూపము.

రాజస మయిన బుద్ధి క్రియకు హేతుభూతముగా నుండును గావున "ప్రాణము" అని యన దగి యున్నది. ఇది సర్వభూతములకు నాశయ గతమై స్వాంశములతో నుపకరించును. వాక్పాణిపాదాదికర్మేంద్రియము లన్నియు తమ తమ విషయములతో ప్రాణమున కుపకార మొదవింప గలవు. ఇందు మనస్సును "కుర్యాం" దీని చేయుదు నన్న సంకల్పమున నుపకారక మగును. ఇంత వర కిది రాజస బుద్ధి విశేషము.

తామస మయిన బుద్ధి సృష్ట్యవస్థలో సతతము గలుగు పరిణామము వలన కాలముగా నగును. క్షణాది కాలవిభాగము లన్నియు నా కాలమునకు సంబంధించిన పరిణామములు. ఆ కాలముననే సర్వభూతములకు పరిణామము కలుగు చుండును. ఆ కాలము స్పందరూపమున పదార్థములను పరిణమింప జేయుచు తత్త్వతః వేత్త ననుగ్రహించును. విత్తి ననుగ్రహించును. వేద్యము ననుగ్రహించును.

అహంకారస్త్రిధా సోఽయం సత్త్వాదిగుణభేదతః
సత్త్వాదిగుణభేదేన యోఽహంకారస్తు సాత్త్వికః. 166
వైకారిక శ్చేంద్రియాది రింద్రియ ప్రకృతి ర్భవేత్
భూతాది స్తామసః శబ్ద తన్మాత్ర ప్రకృతి ర్భవేత్. 167
రాజస స్తైజసః సోఽపి ద్వయోరుపకరోతి హి
అహంకారస్య వృత్తి ర్యా సోఽభిమానః ప్రకీర్తితః. 168

సత్త్వాదిగుణభేదమున నహంకారము మూడువిధముల నున్నది. సత్త్వాదిగుణభేదమున సిద్ధ మయిన సాత్త్వికాహంకారము వైకారికము- వికార సిద్ధము. ఇది యింద్రియాదిరూపమున నుండును. ఇంద్రియములకు ప్రకృతిగా నుండును. భూతాది రూపమున నుండునది తామసాహంకారము. శబ్ద తన్మాత్ర ప్రకృతిగా నుండునది రాజసాహంకారము. ఇది తైజసము. ఇది సాత్త్విక తామసములకు రెండిటికి నుపకరించును. అహంకారమునకు సంబంధించిన వృత్తి యభిమాన మని ప్రకీర్తిత మయినది. అహంకారాత్మక మభిమానాత్మకమగు రస స్వరూపము వివేచించుటకై యింతగా నహంకారతత్త్వము చెప్పుట యావశ్యక మయినది. ఇక అభిమానాత్మక మయిన వృత్తి ననుసరించిన శృంగారాది రస ముల స్వరూపము నిరూపణార్హము.

సాఽభిమానాత్మికా వృత్తి స్తత్తదింద్రియగోచరా
బాహ్యార్థాలంబనవతీ శృంగారాది రసాత్మతామ్. 169
యాతి తత్ర విభావాదిభేదా ద్భేదం ప్రయాతి చ

అభిమానాత్మక మయిన యా ప్రవృత్తి యా యా యింద్రియ గోచరమై బాహ్యార్థాలంబనము కలదై శృంగారాది రసముల స్వరూపమును పొందును. అందు విభావాదుల భేదమున భేదమును పొందును. తత్తదింద్రియ గోచర మయిన యభిమానము బాహ్యార్థాలంబనమున మొదట శృంగారరస రూపము పొందుననియు ననంతర మా యా విభావాదుల భేదమున నితర రసముల స్వరూపము పొందు ననియు గావున శృంగారమె రస మగుననియు నిచట పరిగ్రాహ్యము. ఇక ప్రేక్షక చిత్తవృత్తి కా యా రసతాపత్తి నిరూపితము కా వలెను.

### శృంగార రసతాపత్తి

విభావా లలితాః సత్త్వానుభావ వ్యభిచారిభిః. 170

యదా స్థాయిని వర్తంతే స్వీయాభినయ సంశ్రయాః
తదా మనః ప్రేక్షకాణాం రజస్సత్త్వ వ్యపాశ్రయి. 171

సుఖానుబంధీ తత్రత్యో వికారో యః ప్రవర్తతే
స శృంగార రసాభిఖ్యాం లభతే రస్యతే చ తైః. 172

విభావములలో లలితాది భేదములు ప్రథమాధికారమున నిరూపితము లయినవి. లలితవిభావములు సాత్త్వికములు అనుభావములు వ్యభిచారిభావములు స్వ స్వ నియతము లయిన యభినయములతో గూడుకొనినవై స్థాయి భావ విషయమున ప్రవర్తించు నని యయినపుడు ప్రేక్షకుల భావకుల మనస్సు వికారము కల దగును. ఆ సమయమున రజః సత్త్వ వ్యపాశ్రయి - రజోగుణమును సత్త్వగుణమును విశేషముగా నెనసాడి యుండును. రజస్సత్త్వములే లే నపుడు తమము లే దని స్పష్టము. అప్పటి మనస్సు సుఖానుబంధము కల దగును. సామాజికులచే నది రస్యమానము నగును. ఆ యా రసములకు గల గుణసంబంధము లోని వివేకము నిట్లు గుర్తింప నగును.

శృంగారము రజస్సత్త్వవ్యపాశ్రయత
హాస్యము రజస్తమోన్వయి
వీరము సత్త్వరజోన్వయి
అద్భుతము రజస్సత్త్వోజ్జ్వలము
రౌద్రము రజస్తమోఽన్వితము
కరుణము తమోరూఢము
బీభత్సము సత్త్వరహితము
భయానకము తమస్సత్త్వాన్వితము

గుణ సంబంధ కథనములో భావభేదము లుండవచ్చును. ఇందలి విధానము యోగమాలా సంహితానుగతము. అర్వాచీను డగు సాహిత్యసారకారు డన్యవిధమున జెప్పుట నా సాహిత్యసారమున జూడనగును.

## హాస్యరసతాపత్తి

యదా తు లలితాభాసా భావైః స్వోత్కర్ష హేతుభిః
సత్త్వాదిభి శ్చాభినయైః స్థాయినం వర్ధయంతి తే. 173

తదా మనః ప్రేక్షకాణాం రజస్స్పృష్టం తమోఽన్వయి
చైతన్యాశ్రయి తత్రత్యో వికారో యః ప్రవర్తతే. 174

స హాస్యరస ఇత్యాఖ్యాం లభతే రస్యతే చ తైః

లలితాభాసము లనదగిన విభావములు స్వోత్కర్షసంపాదకము లయిన అనుభావ సాత్త్వికభావ వ్యభిచారి భావములతో సాత్త్వికాంగికాద్యభినయములతో గూడు కొనినవై స్థాయిభావమును వృద్ధిపొందించి నప్పుడు సముల్లసిత మొనరించి నప్పుడు ప్రేక్షకుల మనస్సు రజోగుణస్పృష్ట మగును. తమస్సంబంధమున నుండును. చైతన్యాశ్రయి యగును. అప్పుడు ప్రవర్తించు మనోవికారము హాస్యరస సంజ్ఞ పొందును. రస్యమానము నగును.

## వీర రసతాపత్తి

స్థిరా విభావాస్తు యదా స్వయోగ్యైః సాత్త్వికాదిభిః. 175
భావైః స్థాయిని వర్తంతే స్వీయాభినయ సంశ్రయాః
తదా మనః ప్రేక్షకాణాం సత్త్వవృత్తి రజోఽన్వయి. 176
సాభిమానశ్చ తత్రత్యో వికారో యః ప్రవర్తతే
స వీరరసనామా స్యాద్రస్యతే చ స తైరపి. 177

స్థిరము లను సంజ్ఞ కల విభావములు స్వయోగ్యము లగు సాత్త్విక భావాదులు స్థాయిభావ సముల్లాసమునకై వర్తించు నపుడు స్వసముచితము లయిన యాంగికాద్యభినయములతో గూడినవై భాసించును. అప్పుడు ప్రేక్షకుల మనస్సు సత్త్వవర్తి రజోన్వయి యగును. ఆ సమయమున నచట గలుగు సాభిమాన వికారము వీరరస మన్న పేరు కల దగును. సామాజికులచే నది రస్యమానము నగును.

## అద్భుత రసతాపత్తి

యదా చిత్రా విభావాస్తు భావైః సత్త్వాదిభిస్సహ
స్వాశ్రయాభినయై ర్యుక్తా వర్తంతే స్థాయిని స్వకే. 178
తదా మనః ప్రేక్షకాణాం రజస్సత్త్వోజ్జ్వలం భవేత్
బుద్ధి యుక్తశ్చ తత్రత్యో వికారో యః ప్రవర్తతే. 179
స చాద్భుతరసాఖ్యాం తు లభతే రస్యతే చ తైః

చిత్రము లను పేరు కల విభావములు సాత్త్వికభావానుభావ వ్యభిచారి భావములతో గూడుకొనినవై స్వాశ్రయాభినయోపేతములై స్వీయస్థాయి

భావమున నున్నప్పుడు ప్రేక్షకుల మనస్సు రజః [illegible] మగును. అభిమా నాత్మక బుద్ధి యుక్తమయిన అచటి వికారము వీరరస మను నామమును పొందుచున్నది. సహృదయులచే నాస్వాద్యమాన మగుచున్నది.

## రౌద్ర రసతాపత్తి

ఖరా విభావాస్తు యదా స్వానుకూలైః స్వసేతరైః. 180
స్థాయిని స్వే ప్రవర్తంతే స్వీయాభినయ సంశ్రయాః
తదా మనః ప్రేక్షకాణాం రజసా తమసాఽన్వితమ్. 181
సాహంకారం చ తత్రోత్థో వికారో యః ప్రవర్తతే
స రౌద్రరసనామా స్యాద్రస్యతే చ స తైరపి. 182

ఖరాత్మకము లయిన విభావములు స్వానుకూలములు అయిన యనుభావ సాత్త్విక వ్యభిచారి భావములతో గూడినవై యస్త్ర యుతరము అగు వాగంగ సత్త్వాభినయములతో సంయుక్తములై తమ యభినయసంశ్రయములై తమ స్థాయిభావ విషయమున ప్రవృత్తి కలవయిన యపుడు ప్రేక్షకుల మనస్సు రజస్తమోగుణములతో సంగతమై యుండును. అప్పు డహంకారయుతముగా నొక వికార ముదయించును. ఆ వికారము రౌద్రరస నామమున వ్యవహారము పొందును. సహృదయులచే నాస్వాద్యమానము నగును.

## కరుణ రసతాపత్తి

యదా రూఢా విభావాస్తు స్వేతరైః సానుగైస్సహ
స్వీయే స్థాయిని వర్తంతే నాట్యాభినయసంశ్రయాః. 183
తదా మనస్తమోరూఢం చింతావస్థం జడాత్మకం
సదన్వయీ చ తత్రత్యో వికారో యః ప్రవర్తతే. 184
ప్రాప్నోతి సోఽపి కరుణరసతాం రస్యతే చ తైః

రూఢము లయిన విభావములు స్వేతరము లయిన సాత్త్వికభావాదులచే ననుగతములై నాట్యాభినయము నాశ్రయించినవై స్వీయస్థాయిభావమున నున్నపుడు సామాజికుల మనస్సు తమోగుణరూఢ మగును. చింతావస్థతో నుండును. జడాత్మకముగా నుండును. అప్పు డహంకార కలితముగా ప్రవర్తించును. అచట అప్పటి వికారము కరుణరసత్వమును పొందు చున్నది. సామాజికులచే నాస్వాద్యమానము నగుచున్నది.

## బీభత్స రసతాపత్తి

నిందితా యే విభావాః స్యుః స్వేతరైః సహకారిభిః. 185
యదా స్థాయిని వర్తంతే తైస్తైరభినయైస్సహ
తదా మనః ప్రేక్షకాణాం బుద్ధ్యవస్థ మసత్త్వయుక్. 186
చిదన్వయీ చ తత్రత్యో వికారో యః ప్రవర్తతే
స బీభత్సరసాఖ్యాం తు లభతే రస్యతే చ తైః. 187

నిందితము లగు విభావములు స్వేతరము లయిన యనుభావాదులు సహకరింపగా సాత్త్వికాద్యభినయ సంగతములుగా స్వీయ స్థాయిభావ విషయమున ప్రవర్తించునవి యగును. అప్పుడు ప్రేక్షకుల మనస్సు సత్త్వగుణముతో నుండదు, బుద్ధ్యవస్థముననె యుండును. అప్పుడు చిదన్వయమున నొక వికారము ప్రవర్తించును. ఆ వికారము బీభత్సరస సంజ్ఞ కల దగుచున్నది. అది సామాజికులచే రస్యమానము నగు చున్నది.

## భయానక రసతాపత్తి

యదా తు వికృతా భావాః స్వోచితైస్సహకారిభిః
స్థాయిన్యభినయోపేతా వర్తంతే నాట్యకర్మణి. 188
తదా మనః ప్రేక్షకాణాం చిత్తావస్థం తమోఽన్వయి
సత్త్వాన్వితం చ తత్రత్యో వికారో యః ప్రవర్తతే. 189
భయానకరసాఖ్యాం తు లభతే రస్యతే చ తైః.

వికృతము లగు విభావములు స్వసముచితము లయిన సహకారులచే సముల్లసితములై నాట్యకర్మలో సముచితాభినయోపేతములై ప్రవర్తించు నేని యా సమయమున సామాజికుల మనస్సు చిత్తావస్థాసముపేతమై తమోగుణాన్వయముతో నుండును. సత్త్వాన్వితము నగును. అప్పుడు ప్రవర్తించు వికారము భయానకరస మను పేరు కల దగును. సామాజికులకు రస్యము నగును.

ఇట్లుపక్రాంతార్థానుసారముగా నహంకారాత్మక చిత్తవృత్తి యభిమానాత్మక మగు వృత్తి యా యా రసతాపత్తి నొందుట నిరూపిత మయినది. దీని యనుబంధమున విషయాంతరము కా కుండునట్లు తాండవము లాస్యము నాట్య నృత్య నృత్తములు నిరూపణీయములు. నాట్యకర్మానుగతముగా

వాగంగాభినయముల ప్రయుక్తరసోత్పత్తిని సూచితమగుచుండునందున నాట్యక్రియా విశేషములను నిరూపించుచున్నది. ఇన్నిరకముల నంతయు రసోత్పత్తి ప్రకార మభివర్ణించుచున్నది. ఇట్లు [illegible] అవతరణము భావించునది.

ఈదృశీ చ రసోత్పత్తిః మనోవృత్తిశ్చ శాశ్వతీ. 190
కథితా యోగమాలాయాం సంహితాయాం నిరూప్యతే
శివేన తాండవం లాస్యం నాట్యం నృత్తం చ నర్తనమ్. 191
సర్వమేతదశేషేణ సంహితాయాం ప్రదర్శితం

రసోత్పత్తి యీ విధముగా నుండుట మనోవృత్తియు శాశ్వతముగా నుండుట యోగమాలా సంహితలో నిరూపిత మయినది. శివుడు వివస్వంతున కీ విషయము నుపదేశరూపముగా నిరూపించినాడు. శివోపదిష్టములుగా ననేకము లున్నవి. వానిని గ్రహించిన విధమున దీనిని గ్రహింప దగును. శివుడు తాండవము ప్రదర్శించెను. లాస్యము నిరూపించెను. నాట్యము నృత్తము నర్తనము సర్వ మశేషముగా సంహితలో ప్రదర్శించెను. రసప్రక్రియా విశేష ముపదేశించి తల్లక్షణము నిర్దేశించి తదనుభూతిసాధనము లయిన తాండవాదులను లక్ష్యముగా నిరూపించెను. శివోపదిష్టము లయిన తాండవాదుల లక్షణ స్వరూప మిట్లున్నది.

## తాండవ లక్షణము

ఉద్ధతైః కరణై రంగహారై ర్నిర్వర్తితం యదా. 192
వృత్తి రారభటీ గీతకాలే తత్తాండవం విదుః
చండోచ్చండ ప్రచండాది భేదా త్తత్తాండవం త్రిధా. 193
అనుద్ధతం చోద్ధతం చ తదాత్యుద్ధత మిత్యపి
త త్తత్తాండవ భేదస్తు పరస్తాదేవ లక్ష్యతే. 194

తాండవలక్షణ మిట్లుండును. ఇందు కరణము లంగహారము లుద్ధములుగా నుండును. గీతకాలమున ఆరభటీవృత్తి యుండును. ఇట్టి దిది తాండవము. ఈ తాండవము చండతాండవ మని ఉచ్చండతాండవ మని ప్రచండతాండవ మని మూడువిధముల నున్నది. అనుద్ధతము చండము. ఉద్ధత ముచ్చండము. అత్యుద్ధతము ప్రచండము. ఆ యా తాండవభేదము లుత్తరగ్రంథమున గ్రాహ్యములు. నవమాధికారమున వీని స్వరూపము కొంతగా సమీక్షిత మగును.

అయిన నీవిషయ మిచట పరిగ్రాహ్యము. బ్రహ్మోపదేశమున భరతుడు నాట్యము గుర్తించి పుత్రులచే నభ్యసింప జేసి బ్రహ్మసూచనానుసారమున శ్రీకైలాసమున నున్న శివసమక్షమున కేగి ప్రయోగము దర్శింప ప్రార్థించెను. శివుడు చూచి యిదివరలో తా నొనరించిన నృత్తమును భరతునకు నిరూపించుటకై తండువును నిర్దేశించెను. తండుప్రోక్త మయి నందున నది తాండవ మయినది. ఆంగికాభినయములో నంగప్రత్యంగోపాంగ కర్మ లనేకములు కలవు. హస్త ప్రయోగములలో సంయుతాసంయుతహస్తములు నృత్తహస్తములు కలవు. ఇట్లే కటికర్మలు పాదకర్మలు కలవు. గ్రీవాకర్మలు వక్షఃకర్మలు కలవు. కటిపయ హస్తపాదాదుల కర్మలు కూడి యున్నచో నొక కరణ మగును. కరణము లనేకములు. అయిన నష్టోత్తరశతకరణములు కల వని భరతుడు సంకేతించెను. కొన్ని కరణముల కలయిక యున్నచో నొక యంగహార మగును. అంగహారము లనేకములు. అయిన నవి ముప్పదిరెండని భరతసంకేతము. కరణములలో నంగహారములలో నుద్ధతములు లలితములు నున్నవి. ఉద్ధతములు తాండవరూప సంపాదకము అని లలితములు లాస్యరూప సంపాదకము అని వ్యవహారమున్నది. ఇచటి విస్తరమును నా నాట్యవేదమునందు జూడ దగును. నానృత్తరత్నావళిలో జూడ నగును.

ఆరభటీవృత్తి గీతకాలమున నుండుటయు దీని లక్షణము. వృత్తులు నాలుగు విధములు. కైశికి భారతి సాత్త్వతి ఆరభటి యని రూప మిందు నిరూపితము కా గలదు. వీనిలో నారభటి యౌద్ధత్యము సూచించును. తాండవమునకు సంబంధించిన చండాదిభేదములలో చండ మనుద్ధత మని యున్నది. అనుద్ధత మనుట అత్యంత ముద్ధతము కా దని భావము. ఈ పదము సుకుమారార్థ మిచ్చునది కాదు. తాండవమున నుద్ధతకరణాంగహారము లుండు ననుటయే సుకుమారవిధానము నిషేధించును.

తాండవానంతరము లాస్యము లక్షితము కా వలెను. లాస్యమునకు గుండలి యను వ్యవహారమును గలదు. అదియు నిందు లక్షిత మగును.

### లాస్యలక్షణము

లలితై రంగహారైశ్చ నిర్వర్త్యం లలితైః లయైః
వృత్తిః స్యాత్ కైశికీ గీతే యత్ర తల్లాస్య ముచ్యతే. 195

ఏతదేవ తు చారీభిః మృద్వీభిర్గీతి రీతిభిః
తత్తద్దేశగుణోత్థాభిః హేలాద్యైర్భావదృష్టిభిః. 196

తత్తత్పాత్రగుణోత్థాంగ చతుష్షష్ట్యంగ బంధురం
పుష్పాంజలిర్విహా ఘోండాది దేశీవాద్య లయాన్వితమ్. 197

శుద్ధ సాలగ సూడాది గీతాభినయ మంథరం
రుచ్యా ప్రవర్తితం దేశే రాజభిః గుండలీం విదుః. 198

గీతాదౌ కైశికీ వృత్తిబహులం భావమంథరం
సుకుమారప్రయోగం యత్తల్లాస్యం మన్మథాశ్రయమ్ 199

లాస్య పద నిర్వచనము సూచితము కావలయు. ఇందు లలితాంగ హారము లుండును. లలితము లగు లయరీతు లుండును. గీతము నందు కైశికీవృత్తి యుండును. ఇట్లు నిర్వర్త్యమగు నది లాస్యము. ఈ లాస్యమునే దేశము నందలి యభిరుచి ననుసరించి ప్రభువులు ప్రయోగమున ప్రదర్శింప జేయుదు రేని గుండలి యను నామమున వ్యవహరింతురు. గుండలీరూపమున నీ విశేషము లుండును. మృదువులుగా నుండు చారీగతివిశేషములు అట్టివే యయిన గీతి రీతు లిం దుండ దగును. ఈ గీతి విశేషము లన్నియు ఆ యా దేశీయము లయిన గుణములాధారముగా నుండును. ఇంకను హేలా లీలావిలాసాదు లిందావశ్యకము. నానావిధములగు భావదృష్టులు నిందుండును. ఆ యా పాత్రముల గుణముల వలన సముత్పన్నము లయిన విశేషము లంగములుగా నిం దుండును. అరువది నాలుగు అంగములతో గూడినదై యీ లాస్యము బంధురముగా నుండును. పుష్పాంజలి యుండును. ఘోండాది దేశివాద్యముల లయప్రక్రియలతో గూడి యుండును. శుద్ధము సాలగము సూడము అను సంజ్ఞ కల గీతముల యభినయములతో గూడి మంథరముగా నుండును. దేశ రుచ్యనుసారమున రాజులు ప్రవర్తింప జేయునది ''గుండలి'' పేరు కలది యగు నని గుర్తింప వలెను. గీతారంభమున కైశికీ వృత్తిబహులముగా నుండుటయు భావమంథరముగానుండుటయు సుకుమార ప్రయోగముగా నుండుటయు మన్మథభావాశ్రయముగా నుండుటయు లాస్య లక్షణము దీనిని సవిశేషముగా గుర్తించుట యుక్తము.

ఈ లాస్యలక్షణములో నుట్టంకితము లయిన చార్యాదిపదముల భావముల నిట్లు గుర్తించుట యుక్తము. అంఘ్రి జంఘా జాను ఊరు కటి భాగముల క్రియ యుగపద్రచిత మయినచో చారి యందురు. దీనిని వ్యాయామ రూప

మందురు. మృదువులు సుకుమారములు నగు చారీ సన్నివేశములె లాస్యమున నుండ దగును. గీతిరీతులును దేశీయ గుణవిశేషములతో నుండ వలెను. పుష్పాంజలి విధాన మొకటి యీ గ్రంథముననె సప్తమాధికారమున నిరూపితము కాగలదు. ఆశీస్సు ఆమోదము సూచించు పద్యమున పుష్పాంజలి నిచ్చుట యుక్తము. పుష్పాంజలి ప్రదాన సమయమున నర్తకి యుండవవలయు రీతి యా యా గ్రంథముల నిరూపితమయినది. పాదాగ్రము లందు నిలచి జానువులను వంచి ఊరు నితంబములను బిగియ పట్టి హస్తముల పుష్పాంజలి పట్టి వక్షో జావనమ్రమై యుండుట పుష్పాంజలి నిచ్చు నర్తకీరీతి. ఘోండాది దేశివాద్యము లుండుట యుక్తము. గీతములు శుద్ధ సాలగ సూడాది విశేషములతో నుండుట యిచటి సంకేతము.

సంగీతశాస్త్రమునకు సంబంధించిన యీ విషయ మిచట గ్రాహ్యము. రంజక మగు స్వర సందర్భమునకు గీత మని పేరు. ఇది గాంధర్వ మని గీత మని రెండువిధములు. గాంధర్వము గంధర్వులది. మానవులకు గీతము. వాగ్గేయకార రచితము లక్షణాన్వితము. దేశీరాగములలో నిది యుండును. ఇది జన రంజనము. గానము నిబద్ధ మనిబద్ధ మని రెండు విధములు. ఇందు నిబద్ధ గానము ప్రబంధము వస్తువు రూపకము. ఇందు ప్రబంధము సూడస్థము ఆలిసంశ్రయము విప్రకీర్ణ మను నని మూడు విధములు. ఇందు సూడము శుద్ధము ఛాయాలగ మని రెండు విధములు. కావున శుద్ధగీతము సాలగసూడగీతము అను వాని యభినయములతో నుండుట లాస్యరూపము. ఇట్టి వీనిని గుండలి యనిరి. గుండలి గోండలి కుండలి పదముల వ్యవహార్య మగు దీని స్వరూప వివేకము నా నృత్తరత్నావలిలో స్పష్టము

ఈ ప్రసక్తిలో లాస్య తాండవ వివేక మావశ్యక మగుట తన్నిరూపణము ప్రసంగప్రాప్తము.

లస్ సంశ్లేషణ ఇత్యస్య ధాతో ర్లాస్యస్య నిర్వహః<br>
సంశ్లేషా దంగహారాణా మంగై ర్లాస్యం ప్రచక్షతే. 200

తండూక్త ముద్ధతప్రాయ ప్రయోగం తాడవం విదుః<br>
నాటకస్థిత వాక్యార్థ పదార్థాభినయాత్మకమ్. 201

లస్ సంశ్లేషణే అను ధాతువునకు సంబంధించి లాస్యపదము వ్యుత్పన్నమయిన దని దాని నిర్వాహము గుర్తింప వచ్చును. అంగహారములకు సంబం

ధించిన యంగములతో సంబంధ ముండుట వలన లాస్య మనుట యుక్తమని యందురు. ఇది లాస్యరూపము. ఇక తాండవస్వరూప మిట్లున్నది. శివసూచన మున తండు వను ప్రమథప్రముఖుడు నిరూపించి నందున దీని ప్రయోగ మంతయు నుద్ధతప్రాయముగా నున్నందున తాండవ మని యందురు. నాటకము నందున్న పదార్థవాక్యార్థాభినయాత్మకముగా తాండవ ముండును. తాండవములో నుద్ధతము లగు నంగహారము లుండుట సూచితము. అంగహార మంగిగానుండు నఖండార్థము. అది వాక్యార్థము. అంగహారమున నుండు కరణములు నృత్తహస్తములు మొదలగు నవి యంగములుగా నుండును గావున ఖండార్థములు పదార్థాత్మకములు. పదార్థాత్మకము లయిన కరణముల సమాహారము అంగహారము లం దుండును గావున అభినయము వాక్యార్థాత్మక మయినది. తాండవ మట్లు వాక్యార్థాత్మక మని గ్రాహ్యము.

## నాట్య నృత్త నర్తన లక్షణము

నటకర్మైవ నాట్యం స్యాదితి నాట్యవిదాం మతం
కరణై రంగహారై శ్చ నిర్వృత్తం నృత్త ముచ్యతే. 202

వృత్తిభి స్సహితం గీతం తథా వాద్యాదిభిర్యుతం
నర్తనం గాత్రవిక్షేప మాత్ర మిత్యుచ్యతే బుధైః. 203

ఏతన్నాట్యే చ నృత్తే చ లాస్య తాండవయో రపి
గుండల్యాదిషు సర్వత్ర సాధారణ్యేన వర్తతే. 204

నటకర్మ నాట్యము అని నాట్యవిదుల మతము. కరణములతో నంగహారములతో నిర్వృత్త మగునది నృత్త మన దగును. వృత్తి సహిత మగు గీత ముండుట వాద్యాదులతో గూడియుండుట గాత్రవిక్షేప ముండుట నర్తన మగునని బుధు లందురు. నర్తనమె నృత్యము. నృతీ - గాత్రవిక్షేపే యని ధాతువు కలదు. తన్నిష్పన్నము నృత్యము, నర్తనమును. నృత్యా మను నర్తనము నాట్యమునను నృత్తమునను లాస్యతాండవము లందును గుండల్యాది విధానములందును సర్వసాధారణముగా నుపయోగించు నది యగును.

## రసముల యష్టవిధత్వము

యతోఽష్టధా మనోవృత్తిః సభ్యానాం నాట్యకర్మణి
అష్టావేవానుభూయంతే తాసూక్తా స్తై రసాః పృథక్. 205

కేచి న్నవాత్మికామాహు ర్మనో వృత్తిం విచక్షణాః
తతశ్శాంతో రసో నాట్యేఽప్యస్తీతి ప్రతిజానతే. 206

నాటకాదినిబంధే తు తపశ్చరణ వస్తునః
అభినేతు మశక్యత్వా త్తద్వాక్యార్థ పదార్థయోః. 207

సామాజికానాం మనసి రసశ్శాంతో న జాయతే
శమః స్థాయీ విభావా ద్వైర్యథాస్థాన నివేశితైః. 208

వర్ధితశ్చేద్రసః శాంతోఽప్యస్తీత్యుద్భావ్యతే క్వచిత్
అస్య సర్వవికారాణాం శూన్యత్వాత్తు రసాత్మనా. 209

పరిణేతుం న శక్నోతి తస్మాచ్ఛాంతస్య నోద్భవః
తస్మా న్నాట్యరసా అష్టావితి పద్మభువో మతమ్. 210

నాట్యకర్మ ప్రయోగము నందు సభ్యుల మనోవృత్తి యష్టవిధముగనే యుండును. కావుననే యా మనోవృత్తులలో నెనిమిది రసములే వేరు వేరుగా నవభాసించును. కొందరు విచక్షణులు మనోవృత్తి తొమ్మిది విధముల నుండు ననిరి. కావున శాంతరసము కూడ నాట్యమునందు నుండు నని నిశ్చయించిరి. తపశ్చరణాత్మక మయిన వస్తువు నాటకాదినిబంధములలో నభినయింప శక్యము కాదు. అవి పదార్థరూపముగ గాని వాక్యార్థరూపముగ గాని యభినయింప వలను పడదు. సామాజికుల మనస్సులో శాంతరస ముదయింపదు. శాంతరస మునకు శమము స్థాయి కదా? అట్టి శమము యథాస్థానమున సముచితముగా సన్నివేశము పొందిన విభావాదులచే సముల్లసిత మయినచో నభివృద్ధి పొందినచో శాంతరసము నుండునని యొకచో కొంద రుద్భావన మొనరింతురు. కాని శమ మనునది సర్వవికార శూన్య మగు నందు వలన రసాకృతిగా పరిణమింప లేదు. కాన శాంత ముదయింపదు. కావున నాట్యరసము లెనిమిదియె యని పద్మభూ మతము. పద్మభూ బ్రహ్మ. పద్మభూమతానుసారమున రస మష్టవిధ మనుటయె యుక్తము.

ఇక వాసుకి మతమున నారద మతము నిరూపించుట ప్రస్తుతము.

ఉత్పత్తిస్తు రసానాం యా పురా వాసుకినోదితా
నారదస్యోచ్యతే సైషా ప్రకారాంతర కల్పితా. 211

వాసుకి నిరూపించిన రసోత్పత్తి విధానము నిరూపిత మయినది. గుణసంబంధమున గలుగు మనోవృత్త్యనుసారమున రసోదయము సూచిత మయినది. అట్టి గుణసంబంధమున గలుగు మనోవృత్త్యనుసారముననె నారద మతమునను రసోత్పత్తి యున్నది. కొంత ప్రకారాంతరము గలదు. అట్లు ప్రకారాంతర కల్పిత మయిన రసోత్పత్తి నారదసమ్మితముగా నిచట నిరూపిత మగును గావున దీనిని కొంత వేరుగా భావింప వలెను.

బాహ్యార్థాలంబనవతో మనసో రజసి స్థితాత్
సాహంకారాద్వికారో యః స శృంగార ఇతీరితః. 212

తస్మాదేవ రజోహీనాత్ సత్త్వా ద్ధాస్య సంభవః
అహంకార రజస్సత్త్వయుక్తా ద్బాహ్యార్థసంగతాత్. 213

మనసో యో వికారస్తు స వీర ఇతి కథ్యతే
తస్మాదేవాద్భుతో జాతో రజోఽహంకార వర్జితాత్. 214

రజస్తమోఽహంకృతిభి ర్యుతా ద్బాహ్యార్థసంశ్రయాత్
మనసో యో వికారస్తు స రౌద్ర ఇతి కథ్యతే. 215

కరుణ స్తత ఏవ స్యా ద్రజోఽహంకార వర్జితాత్
చిత్తావస్థాత్తు మనసో బాహ్యార్థాలంబనాత్మనః. 216

తమస్సత్త్వయుతా జ్జాతో బీభత్స ఇతి కథ్యతే
సత్త్వబుద్ధివిహీనాత్తు మనస స్తమసాఽన్వితాత్. 217

బాహ్యాదేవ సముత్పన్నో భయానక ఇతీరితః
రజస్తమోవిహీనాత్తు సత్త్వావస్థాత్సచిత్తతః. 218

మనాగస్పృష్టబాహ్యార్థాత్ శాంతో రస ఇతీరితః

ఇచట నవరసముల సముత్పత్తిప్రకార మున్నది. శృంగారాదులలో బాహ్యార్థాలంబన మున్నది. శాంతమున బాహ్యార్థాలంబనము లేదు. అన్నిట గుణముల సంబంధ మటు నిటుగా నున్నది. అహంకారాభిమానాత్మక మయిన వృత్తి యంతట నుండును. అహంకారాత్మక మనోవృత్తి గుణసంబంధమున నుండగా నా యా రసము లుదయించుట యిచటి సమానధర్మము.

శృంగారము అహంకారసహితము. రజోగుణాన్వితము నయిన మనస్సునకు బాహ్యార్థ మవలంబించి యుండు దానికి గలుగు వికారము శృంగార మగును హాస్యము. సాహంకార రజోహీన బాహ్యార్థాలంబన మనోవికారము హాస్యము. అంతట శృంగార సామ్య మున్నది. రజోహీన మగుట యిందలి విశేషము. వీరము. సాహంకారము రజఃసత్త్వయుక్తము బాహ్యార్థసంశ్రయము నగు మనస్సునకు సంబంధించిన వికారము వీరరస మగును. అద్భుతము. ఇదియు వీరము వలెనె యుత్పన్న మగును. ఇందు రజోగుణ ముండదు. అహంకారము నుండదు. బాహ్యార్థసంబంధము కల మనసునకు గలుగు వికార మద్భుత మని భావము. రౌద్రము. రజస్తమోఽహంకారయుతము బాహ్యార్థసంశ్రయము నగు మనసునకు గలుగు వికారము రౌద్ర మగును. కరుణము. రజోఽహంకారవర్జితము బాహ్యార్థాలంబనాత్మక మయిన చిత్తావస్థారూపమునగు మనసున గలుగు వికారము కరుణ మగును. బీభత్సము. తమస్సత్త్వసంయుత మయిన బాహ్యార్థాలంబనాత్మక మగు మనసున గలుగు వికారము బీభత్సము. భయానకము. సత్త్వబుద్ధి విహీనము తమోఽన్వితము బాహ్యార్థాలంబనాత్మక మయిన మనసున గలుగు వికారము భయానకము. శాంతము. రజస్తమోవిహీనము సత్త్వావస్థా సమన్వితము కొంచెమేని బాహ్యార్థమును స్పృశింపని మనసున గలుగు వికారము శాంతరస మగు ననిరి. గుణసంబంధము రసోదయము సూచించిన పూర్వమతమున కీ మత మునకును గుణముల సంబంధముండుటలో కొంత భేదము కలదు. దానిని సావధానముగా గుర్తించునది.

## శృంగారోత్పత్తి

దేశ కాల వయో ద్రవ్య గుణ ప్రకృతి కర్మణాం. 219

భావానాముత్తమం యత్తు తచ్ఛృంగం శ్రేష్ఠ ముచ్యతే
ఇయర్తి శృంగం యస్మాత్తు తస్మాచ్ఛృంగార ఉచ్యతే. 220

ఇక శృంగారాదిపదముల వ్యుత్పత్తి ప్రకారము నిరూపిత మగును. ఇచటి యీ నిర్వచనము అర్థానుసారమున ధాత్వనుసారమున వచనానుసారమున యోగార్థానుసారమున అక్షరముల యనుసారమున నుండును. ఇట్లె నిరుక్తకారులు శబ్దముల యుత్పత్తులను వ్యుత్పత్తులను నిర్ణయించిరి. తద్బల మిచట బలము. శృంగారపద మిట్లు వ్యుత్పన్న మగును. శృంగము ప్రధానము శ్రేష్ఠము. అట్టి దానిని బొందినది శృంగారము. దేశము కాలము వయస్సు ద్రవ్యము గుణము

ప్రకృతి కర్మయను భావపదార్థములలో నుత్తమముగా నుండు దానిని "శృంగమ్" అందురు. అనగా శ్రేష్ఠ మని యర్థము. అట్టి ప్రాధాన్యమును శ్రేష్ఠతను పొందినది కావున శృంగార మన దగును. సర్వప్రధానతను పొందిన వానిని శృంగారి యనుట లోకరీతి.

## హాస్యోత్పత్తి

అప్రప్త్యయాంతః శబ్దోఽయం హస ఇత్యభిధీయతే
ఘఞంతో హాసశబ్దస్తు ద్వయోః ప్రత్యయయోరపి. 221

అత్ర స్వన హసో ర్వేతి వికల్పేన విధానతః
హాస్యతేఽసావితి యత స్తస్మాద్ధాస్యస్య నిర్వహః. 222

వికృతాంగ వయో ద్రవ్య భాషాలంకార కర్మభిః
జనాన్ హాసయతీత్యేవం తస్మాద్ధాస్యః ప్రకీర్తితః. 223

హస ధాతువు వలన హాస్యపద ముత్పన్నమయినది. "స్వన హసో ర్వా" అను పాణిని సూత్రప్రకారము హస ధాతువునకు వచ్చు ప్రత్యయము వికల్పముగా వచ్చును గావున ఆ ప్రత్యయము రాగా హస యని రూపము సిద్ధ మగును. ఈ ప్రత్యయము రా నపుడు ఘఞ్ ప్రత్యయము తన్నిమిత్త మయిన ఆదివృద్ధి రాగా హాస పద ముత్పన్న మగును. హస ధాతువునకు రెండు ప్రత్యయములు వచ్చుటను సూత్రకారుడు సూత్రమున సూచించెను. "హాస్యతే ఇతి హాసః. హాసయతీతి హాసః" అని రెండువిధముల వ్యుత్పత్తి చెప్ప వచ్చును. వికృతము లయిన యవయవములు వయస్సు ద్రవ్యము భాష అలంకారము కర్మలు అను వానిచే జనుడు హాస్యుడు హసింపబడువాడు అగును గావున, అట్టివానిచే జనులను హాసింపజేయును గావున హాస్యము అనుట యుపపన్న మగుననిరి.

## వీరోత్పత్తి

రా దాన ఇతి యో ధాతుర్వావాదే చ వర్తతే
లా దాన ఇత్యయం ధాతుర్జ్ఞాన ఖండన యోరపి. 224

రలయో రవిశేషోఽపి కథితః శబ్దవాదిభిః
విరుద్ధాన్రాతి హంతీతి వీరశబ్దస్య నిర్వహః. 225

వివిధం చ విచిత్రం చ లాతి జానాతి కృత్స్నతి

ఏవం వా వీరశబ్దార్థః కథితః పూర్వసూరిభిః. 226

ప్రేరయ త్యత్ర విద్విష్టా నితివీరో నిరుచ్యతే

వీరశబ్ద వ్యుత్పత్తి యీ విధముగా నున్నది. ''రాదానే, వా వాదే, లా దానే'' యను ధాతువులు కలవు. ర ల ల క భేదమును శబ్దవాదులు నిరూపించిరి. లా ధాతువు జ్ఞానఖండనార్థము లందును వర్తించును. ''విరుద్ధాన్ రాతి హంతీతి వీరః''. విరుద్ధులను నాశనము చేయుట వీరపదార్థము. ''వివిధం లాతి జానాతి కృంతతి'', ''విచిత్రం లాతిజానాతి''. వివిధమును గుర్తించును. వైవిధ్యము పోగొట్టును. విచిత్రము గుర్తించును. అను నర్థసంబంధమునను వీరశబ్దమునకు నిర్వాహము గుర్తింపవచ్చును. ఈ విధముగా పూర్వతనులు వీరశబ్దార్థము నిరూపించిరి. ''విద్విష్టాన్ ప్రేరయతి'' విద్వేషము కలవారిని ప్రేరేపించు నను నర్థము నను వీర పద నిర్వాహ మభ్యూహింప వచ్చును.

## అద్భుతోత్పత్తి

అథ వైచిత్ర్య ఇత్యస్య ధాతో రద్భుత నిర్వహః. 227

విచిత్రా యస్య భవతి చిత్తవృత్తి స్తతోఽద్భుతః

''అథ వైచిత్ర్యే?'' అను ధాతువునకు సంబంధించి యద్భుతపద నిర్వాహ మూహ్యము. చిత్తవృత్తి విచిత్రమగును గావున అద్భుత మనదగును. విస్మయావేశమున చిత్తవృత్తి విచిత్ర మగుట ప్రసిద్ధముగనున్నది.

## రౌద్రోత్పత్తి

రుద్రో హ స్తం దదాతీతి రౌద్రశబ్దో నిరుచ్యతే. 228

తత్కర్మ కర్తృతా హేతు ర్యస్య రౌద్రః ప్రకీర్తితః

యత్కర్మ రోదయత్యన్యాన్ స రౌద్ర ఇతి వా భవేత్. 229

రుద్రదేవు డిం దవలంబన మిచ్చును గావున నిది రౌద్ర మనదగి యున్నది. రౌద్రకర్మ నాచరించుటలో హేతు వగునది రౌద్రము. ఆ కర్మ యన్యులను రోదింప జేయును గావునను రౌద్ర మగును.

## కరుణోత్పత్తి

ఘృణి ధాతు ర్దయా దాన గ్రహణేషు చ వర్తతే

గృహ్ణాతి దత్తే దయతే ఇతి కర్మ ఘృణేరితమ్. 230

అస్య కర్తృతయా ధీర్యా సా ఘృణే త్యుచ్యతే బుధైః
ఘృణేః కరుణశబ్దస్తు విహితః శబ్దవాదిభిః. 231

అతో నైఘంటుకైరుక్తా ఘృణేతి కరుణేతి చ
కరుః క్లేశ ఇతి ఖ్యాతః క్లేశం న సహతే యతః. 232

యస్య ధీః కరుణా సా స్యాత్ ప్రత్యయే కరుణో భవేత్
పరాశ్రితానాం క్లేశానా మసహిష్ణుతయోచ్యతే. 233

మనసో యాదృశో భావః సై కరుణ ఉచ్యతే

కరుణపద మీ విధముగా వ్యుత్పన్న మయినది. ఘృణి ధాతువు దయ దానము గ్రహణము అను నర్థము లందు వర్తించును. దయ చూపుట దానము చేయుట గ్రహించుట యను కర్మ ఘృణ యన దగి యున్నది. అట్టి కర్మ నాచరింప వలె నను ధీవృత్తి ఘృణ యగు నని బుధు లందురు. శబ్దవాదులు ఘృణి నిరూపించుటలో కరుణ శబ్దము విధించిరి. కావున నైఘంటికులు ఘృణ కరుణ పర్యాయపదము లనిరి. కరు పదమునకు క్లేశ మని యర్థము. క్లేశము సహింప లేని వాని ధీవృత్తి కరుణాత్మకము. కరు పదమునకు ప్రత్యయము చేరగా కరుణ పద ముత్పన్న మగును. ఇతరులకు సంబంధించిన క్లేశములను సహింప లేని మనస్సునకు సంబంధించిన భావము కరుణ శబ్దవాచ్యము.

## బీభత్సోత్పత్తి

వధే ర్ధాతోః సనంతస్య బీభత్సా రూప మిష్యతే. 234

యత్పదార్థస్య బీభత్సా స బీభత్స ఇతీరితః
గర్హా నిందా చ బీభత్సా కుత్సా పర్యాయ వాచకాః. 235

గర్హణీయశ్చ నింద్యశ్చ కుత్సనీయశ్చ యో భవేత్
స భావః కథ్యతే సద్భిః బీభత్స ఇతి సంజ్ఞయా. 236

వధ ధాతువునకు సన్ ప్రత్యయాంత మయిన రూపము బీభత్స యని యగును. బీభత్స కల పదార్థము బీభత్స మగును. గర్హా నింద కుత్స బీభత్స అనునవి పర్యాయ వాచకములు. గర్హణీయము నింద్యము కుత్సనీయము నగు నది బీభత్స మను నామమున జెప్ప దగియున్నది.

## భయానకోత్పత్తి

ఞి భీ భయే ఇతి ప్రాయో ధాతుః స్యా ద్భయవాచకః
చలనం భయశబ్దార్థ ఇతి విద్వద్భి రుచ్యతే. 237

బిభేతి భాయ య త్యన్యా న్కర్మణేతి యథాక్రమం
కశ్చిచ్చలతి కస్మాచ్చిద్భావా త్తేనైవ హేతునా. 238

చాల్యతే చ యత స్తస్మా ద్భయంతు చలనాత్మకం
భయేనాక్రోశతో జంతో ర్జాయతే స భయానకః. 239

"ఞి భీ భయే" భీ ధాతువు భయార్థకము. సామాన్యముగా నీ ధాతువు భయవాచకముగా నున్నది. భయ శబ్దార్థము చలన మని విద్వాంసు లందురు. ఒకానొక కర్మచే నొకడు బిభేతి = భయపడుచున్నాడు, భాయయతి॥ భయపెట్టు చున్నాడు, అని ప్రసిద్ధముగా నున్నది. కాగా ఒక డొకభావమున చలించుచున్నాడు. ఒక డొక భావమున చాల్యతే = చలింప జేయ బడుచున్నాడు. కావున భయ మనునది చలనాత్మకము. భయమున నాక్రోశించు ప్రాణికి భయానకము కల్గును. ఇట్లు భయానక సముత్పత్తిని భావించునది.

## శాంతోత్పత్తి

అభ్యంతరాశ్చ బాహ్యాశ్చ వికారా యత్ర సంయుతాః
యస్య భావస్య శామ్యంతి స శాంత ఇతి కథ్యతే. 240

ఒక భావమునకు సంబంధించిన బాహ్యావికారము లాభ్యంతర వికారము లెచట శమించునో అది శాంత మని వ్యపదేశము కల దయినది. ఆ యా భావ ములకు సంబంధించిన వికారములు కొన్ని బాహ్యాములు కొన్ని యాభ్యంతర ములునగును. అవి యన్నియు తమ యుదయస్థానము లందే శమించు నేని శాంత ముదయించును. శాంతము సర్వభావవికార శాంతి రూపము. సర్వభావ ప్రవిలయాత్మకము.

అర్థతశ్చ నిరుచ్యంతే శబ్దాః కేచిచ్చ ధాతుతః
వచనాచ్చ నిరుచ్యంతే శబ్దాః కేచిచ్చ యోగతః. 241

అప్యతురాణాం సామాన్యా న్నిరుచ్యంతే చ కేచన
ఏవం నిరుక్తకారై స్తు స్వశాస్త్రే నిర్ణయః కృతః. 242

అత్రాప్యేతే రసా స్సర్వే శృంగారాద్యా యథార్థతః
నిరుక్తకారై ర్నిర్ణీతా మయూ సమ్యక్ప్రదర్శితాః. 243

ఇప్పటికి శృంగారాదుల నామనిర్వాహము సూచిత మయినది. ఇట్టి నిర్వాహమున కేమి మూలము? నిరుక్తకారులు శబ్దోత్పత్తిప్రకారము సూచించిరి. యాస్కుడునిరుక్తగ్రంథములో శబ్దముల యర్థముల ననుసరించి నిర్వహము సూచించెను. కొన్ని శబ్దములకు ధాత్వర్థనిర్ణయమున నిర్వహణము పలికెను. కొన్ని శబ్దములకు తద్వచనముననె నిర్వహము చూపెను. కొన్ని శబ్దములకు యౌగికార్థము ననుసరించిన నిర్వాహము చెప్పెను. కొన్ని శబ్దములలో నున్న వర్ణముల సమానత ననుసరించి నిర్వాహము ప్రదర్శించెను. శబ్దముల యుత్పత్తి నిరూపించుటలో నిరుక్తకారులు స్వశాస్త్రము నందీ రీతుల ననుసరించిరి. శృంగారాది రసము లిట్లే నిరుక్తకారులచే నిరూపితము లయినవి. శారదాతనయుడును నిరుక్తకారుల నిశ్చయముననె యనుసరించి యిచట నీ విధముగా శృంగారాది నిర్వాహము ప్రదర్శించెను. ఇట్లిచటి నిర్వచన ప్రకారము నిరుక్తకారాదుల యనుసరణమున నుండుటచే నిది ప్రామాణికముగా నుపాదేయ మని భావము.

## రసతత్త్వనిరూపణము

ఇక నిటుపై రసతత్త్వ నిరూపణ మావశ్యకము రసమీమాంసా విషయమున ననేకవాదము లున్నవి. వాని వివేచనమొనరించుటకు కొంత యుపక్రమ మిచట నిరూపిత మగును. ప్రేక్షకులకు నటునందు రామాది బుద్ధి కలుగుచున్నది. అట్టి బుద్ధి స్వరూపవివేచన మిచట ప్రసక్తము.

రామాద్యారోపణాత్మా ధీః ప్రేక్షకాణాం నటాదిషు
జాయతే యాఽత్ర విద్వద్భి ర్బహుధా సా వివిచ్యతే. 244

రామోఽయ మయమేవేతి యేయం ప్రేక్షకధీ ర్నటే
అనుకార్యేఽపి రామాదౌ సా సమ్యగితి కథ్యతే. 245

అయం న నేతి మిథ్యైవ బోధాదౌత్తరకాలికాత్
అయం రామో న వేత్యేషా మతిః స్యాత్సంశయాత్మికా. 246

అయం రామస్య సదృశ ఇతి సాదృశ్యధీ ర్భవేత్
ఏవం నటే ప్రేక్షకస్య బహుధా ధీర్వికల్ప్యతే. 247

లోకమున నాలుగు విధము లగు జ్ఞానవిశేషము లున్నవి. సమ్యక్ జ్ఞానము, మిథ్యా జ్ఞానము, సంశయ జ్ఞానము, సాదృశ్య జ్ఞానము నని. రంగమున నటించు నటుని జూచు ప్రేక్షకులకు నటు నం దెట్టి జ్ఞానము కలుగును? ఇట్టి సమీక్షకై యీ జ్ఞాన వివేక మావశ్యకము. ప్రేక్షకులకు నటాదులలో రామాదుల యారోపణాత్మక మయిన ధీవృత్తి కలుగు చున్నది. రంగమున గోచరించు నటుడు నటుడే కాని రాముడు కాడు. సామాజికులకు మొదట ఇట్టి నిశ్చయ మున్నది. నటుడు రాముడు భిన్నభిన్నవ్యక్తులె యన్న జ్ఞాన మున్నను నటుని యాహార్యాదికములను భావించిన సామాజికులకు నటు నందు నటత్వబుద్ధి విగలిత మగు చున్నది; రామబుద్ధి కలుగు చున్నది. అనగా నటునందు సహృదయసామాజికుడు రామత్వమునారోపించుకొని భావించుచున్నా డని భావము. అట్లు ప్రేక్షకులకు ఆరోపణాత్మక మయిన ధీవృత్తి కలుగు చున్నది. ఈ ధీవృత్తిని విద్వాంసులు బహువిధముల— నాలుగు విధముల వివేచన మొనరించిరి. వారి యీ వివేచనము సమ్యక్ జ్ఞానాది రూపముగా నున్నది.

౧ "రామోఽయం. అయమేవ రామః" ఈ వాక్యములను "రామ ఏవాయం. అయమేవ రామః" అని భావింప వలెను. రాముడే యీతడు. ఈతడే రాముడు. అనితద్వాక్యార్థము. ఇట్టి ధీవృత్తి సామాజికులకు నటు నందు రామాద్యనుకార్యు లందు గలుగును. దీనిని సమ్యగ్బుద్ధి యందురు. ఈ వాక్యార్థము నిట్లు భావింప వలసి యున్నది. పై వాక్యములలో "ఏవ" అను నది కలదు. అది యవధారణార్థక మయిన యవ్యయము. మొదటి వాక్యములో రామ పదముతో నన్వయించినది. రెండవవాక్యములో "అయం" అను పదముతో నన్వయించి నది. ఇట్లన్వయభేదము వలన అర్థభేదము కలుగును. రెండును సమ్యక్ జ్ఞానములె. రామపదముతో నన్వయింపగా ఇదంపదార్థము నందు రామత్వ నియమము గోచరించును. నియతముగా రామత్వ మున్న దనిపించును. రామాన్యధర్మ వ్యవచ్ఛేదము భాసించును. "అయమేవ రామః" అను నప్పుడు ఇదంపదార్థముతో నన్వయించిన ఏవ కారము అయోగవ్యవచ్ఛేదము సంపాదించును. ఇట్లే రెండును సమ్యగ్ధీవృత్తులు.

౨ "అయం రామః" అను ధీవృత్తి ఉత్తరకాలమున గలుగు "నాయం రామః" "ఈతడు రాముడు కాడు" అను బోధమున బాధిత మగునేని మిథ్యా జ్ఞాన మగును. అబాధితము సమ్యగ్జ్ఞానము. బాధితము మిథ్య.

౩ "అయం రామో న వా" ఈతడు రాము డగునా? కాడా? అను సంశయము కలిగినచో సంశయ జ్ఞానము. ఉభయకోటికజ్ఞానము సంశయము. సంశయములో నొక జ్ఞాన ముదయింపగా నితర జ్ఞానము కలుగదు. ఒక జ్ఞానమును వేరొకటి బాధించునది యగును.

౪ "రామస్య సదృశోయం" ఈతడు రామునకు సదృశుడనుట సాదృశ్యజ్ఞానము. దీనిలో రామభిన్నత్వము గోచరించును. రాము నందలి ధర్మములు కలవా డనియు భాసించును.

ఇట్లు లోకమున నాలుగు జ్ఞానములు కలవు. ప్రేక్షకులకు నటునం దీ నాలుగు జ్ఞానములలో నే జ్ఞానము కలుగును? ప్రేక్షకులకు జ్ఞానము నిట్లు వికల్పింప వలసి యున్నది.

శ్రీ శంకుకు డను నొక తార్కికుడు కలడు. ఈతడు నాట్యవేదమునకు వ్యాఖ్యానము రచించెనని ప్రసిద్ధి. రసవిషయమున శ్రీ శంకుకుడు సూచించిన భావములను అభినవగుప్తుడు తన అభినవభారతిలో నుల్లేఖించెను. అభినవుడు సూచించిన భావాధారమున శ్రీ శంకుక రసవాదమును సాహిత్యాభిమానులు గుర్తించు చున్నారు. అది యిచట ప్రస్తుత మగును.

## శ్రీ శంకుకమతమున రసోత్పత్తి

సేయం న సమ్యక్ నో మిథ్యా న సంశయమతి ర్భవేత్
న చ సాదృశ్యధీరాభ్యః ప్రతీతిభ్యో విలక్షణా. 248

చిత్రే తురగబుద్ధ్యాది న్యాయేనైవ నటాదిషు
ధియా కావ్యానుసంధానవశాత్ శిక్షాబలా దపి. 249

నిర్వర్తిత స్వకార్యాది ప్రాకట్యేన ప్రకాశ్యతే
కృత్రిమై రపి సత్యత్వాభిమానకలుషీకృతైః. 250

వ్యపదేశ్యై ర్విభావాదిశబ్దైః సంయోగరూపిణా
స గమ్యగమకత్వేన క్వచిదప్యనుమీయతే. 251

వస్తుసౌందర్యతః సోఽపి రసనీయత్వ మేష్యతి
అన్యానుమీయమానేన స్థాయిత్వేన విభావితః. 252

అత్రాసన్నపి రత్యాదిః స్వాద్యతే తై రసాత్మనా
ఏవం కేచి ద్వదంత్యేతాం నటే రామాది శేముషీం. 253

నటునందు సామాజికులకు ధీవృత్తి చిత్రతురగ న్యాయమున విలక్షణము. చిత్రము నందు తురగమును జూచు ప్రేక్షకులకు సమ్యఙ్మిథ్యా సంశయ సాదృశ్య ప్రతీతుల కన్న విలక్షణముగా వేరుగా ప్రతీతి కల్గును. నాలుగు ప్రతీతుల కన్న వేరుగా నయిదవ ప్రతీతి యున్నదా? అయిదవ ప్రతీతి లేదు. కాని చిత్రతురగమున గలుగు ప్రతీతి చతుర్విధప్రతీతుల కన్న విలక్షణము. దాని యాకార మిట్లుండు నని చెప్పుట శక్యము కాదు. అయినను గ్రహణసౌలభ్యమునకై "అయం తురగః" "ఇది తురగము" అని చెప్ప వలసి యున్నది. అట్లే నటు నందు గూడ గ్రాహ్యము. నటు నందు ప్రేక్షకులకు చిత్తవృత్తి సమ్యగ్రూపము కాదు. మిథ్యారూపము కాదు. సంశయమతియు గలుగదు. సాదృశ్య ధీవృత్తియు గలుగదు. ఈ నాలుగు ప్రతీతుల కన్న విలక్షణ ప్రతీతి కలుగును. చిత్రము నందు గలుగు తురగబుద్ధి రూపమున నటాదు లందు గలుగు వృత్తిని గ్రహింప దగును. నిరంతరము కావ్యానుసంధాన మొనరించుట వలని బలమున, నటుడు శిక్షాభ్యాసపాటవము ప్రదర్శించి నందు వలన నిట్టి విలక్షణ మగు ధీవృత్తి కలుగును. నటుడు శిక్షాభ్యాససామర్థ్యాతిశయమున తన యభినయకార్యముల నన్నిటిని సముచితముగా నిర్వర్తించుట వలన నిట్టి ధీవృత్తి కలుగును. ఇట్లు యోగ్యముగా కార్యపాటవము ప్రదర్శించి నందు వలన నాతడు ప్రదర్శించిన యభినయములు కృత్రిమములె యయినను కృత్రిమముగా సంభావితములు కావు. అవి సత్యత్వాభిమాన విమిశ్రితములై భాసించును. కారణకార్య సహకారులుగా ప్రసిద్ధము లయిన యవి యిట్టి భావనాపరిపాకమున విభావము లని యనుభావము లవి వ్యభిచారిభావములని వ్యపదేశము కలవి యగును. అట్టి విభావాదులతో స్థాయిభావమునకు సంయోగాత్మక మయిన సంబంధము స్ఫురించును. ఈ సంబంధము గమ్యగమకభావాత్మకము. విభావాదులు గమకములు. రసము గమ్యము. వీని సంబంధము గమ్యగమకభావ సంబంధము. ఇదియే యనుమాప్యానుమాపక భావ సంబంధము. ఇట్టి సంబంధమున రస మనుమీయమాన మగును. లోకమున ననుమీయమానములు రసనీయములు కావు. పర్వతమునందు ధూమహేతుకముగా నగ్ని యనుమీయ మగును. కాని యది రసనీయము కాదు. కావ్యనాట్యము లందలిది యనుమీయమాన మయినను రసనీయ మగును. ఇది యన్యానుమీయమాన విలక్షణము. ఈ వస్తుసౌందర్యబలమె యట్టిది. దీననె యిది రసనీయము కాగలదు.

సామాజికు లందు స్థాయి లేదు. రసాస్వాదమే యున్నది. నటు నందు స్థాయి లేదు. అయినను నటుడు ప్రదర్శించు విభావాదుల వలన నటు నందు స్థాయి కలదని విభావిత మగును. నటు నందు స్థాయి లేకున్నను అనుమితమగును గావున సామాజికులు అనుమిత రత్యాది స్థాయిభావమును రసముగా నాస్వాదింతురు. ఇట్టి యనుమితజ్ఞానము రసము. ఈ జ్ఞానము సామాజికు లందున్నది. కావున సామాజికులె రసాశ్రయ యోగ్యత కలవారు. నటు నందీ విధముగా రామాది బుద్ధి యుండుటను కొందరు నిరూపించిరి. కొందరనుట శ్రీ శంకుకాది తార్కికులని భావము.

ఇది శ్రీ శంకుక మతము. ఇది శారదాతనయున కభీష్టము కాదు. ఈ మత మాదరపాత్రము కాదనుట నిరూపింప వలసి యున్నది. నటు నందు కలుగు రామాది ధీవృత్తి చతుర్విధ ప్రతీతుల కన్న విలక్షణ మని శ్రీశంకుకు డనెను. శ్రీ శంకుక ధీవృత్తియు పరిశీలనార్హము. అందుకై శారదాతనయు డిట్లుపక్రమించుచున్నాడు.

నైవమిత్యేవ భరతా నాట్యవేదార్థ వేదినః
రామాదిబుద్ధిర్యా నాట్యే ప్రేక్షకాణాం నటాదిషు. 254

సేయం న సంశయమతిర్న విపర్యాసధీరపి
నైవ సాదృశ్య ధీరేషా న చిత్రతురగాత్మికా. 255

న సంశయస్య శంకా స్యా ద్దేశకాలాది భేదతః
న విపర్యాసధీః సా స్యాద్బాధాదౌ త్తరకాలికాత్. 256

కావ్యాద్యుపనిబద్ధస్య రామాదేశ్చ నటస్య చ
సాదృశ్యధీ హేత్వభావాన్న చ సాదృశ్యధీర్భవేత్. 257

చిత్రే లిఖితవస్తూనాం మన్యంతే కృత్రిమాత్మతాం
సర్వేఽపి య త్తతశ్చిత్ర తురగాత్మాన ధీర్భవేత్. 258

నటాదేశ్చేతనత్వేన చిత్రస్యాచేతనత్వతః
తస్మాత్కదాచన క్వాపి న చిత్రాదిమతిర్భవేత్. 259

యదాహ్యర్థ క్రియాకర్మసమర్థా రామధీ ర్నటే
తదానీం బాధకాభావా త్తస్య సమ్యక్త్వ ముచ్యతే. 260

ప్రేక్షకా స్తద్రసావిష్టా నటే సమ్యక్ప్రయో క్తరి
య త్తతో ఽర్థ క్రియాకర్మసమర్థా రామధీ ర్నటే. 261

ఏవం రసానాముదయః స్వరూపాశ్రయ బుద్ధితః
దర్శితో భరతప్రో క్తః తస్య వృత్తి ర్నిరూప్యతే. 262

నాట్యవేదార్థవిదు లయిన భరతభావు లీ శ్రీశంకుక భావ మంగీకరించుట లేదు. నాట్యమున నటాదులలో ప్రేక్షకులకు గలుగు ధీవృత్తి ప్రసిద్ధ ప్రతీతి విలక్షణమని యనుట వీరలకు సమ్మతము కాదు. నటాదు లందు గలుగు రామాదిబుద్ధి సమ్యగ్బుద్ధియే కాని విలక్షణము కా దని యిచట భావము. ఇది యిచట నిరూపిత మగును. ఈ రామాదిబుద్ధి సంశయమతి కాదు. విపర్యాస మతియు కాదు. సాదృశ్యబుద్ధి కాదు. ఇది చిత్రతురగన్యాయాత్మకమును గాదు. అత్యంతము దేశ కాలాదిభేద మున్నందున నిచట సంశయ శంక కవకాశము లేదు. దేశకాలభేదము లే నపుడె సంశయమతి కలుగును. రామాది దేశము వేరు. నట దేశము వేరు. రామాదికాలము వేరు. నటకాలము వేరు. ఔత్తరకాలిక మయిన బాధ నిమిత్తముగా చెప్పదగు విపర్యాసధీవృత్తియు నిచట గలుగదు. ఇచట సమ్యగ్బుద్ధియె కలుగును గావున ఔత్తరకాలిక బాధ యుండదు. కావున మిథ్యాబుద్ధి కానేరదు. కావ్యనాట్యములలో నుపనిబద్ధు లయిన రామాదులకు నటునకు సాదృశ్య ధీ హేతువు లే నందున సాదృశ్య ధీవృత్తి కలుగదు. చిత్రతురగ న్యాయ మిచట సంగతముకాదు. చిత్రలిఖితము లయిన వానిని లోకము కృత్రిమము లనియె భావించు చున్నది. చిత్ర మచేతనము. నటుడు చేతనప్రకృతి. అచేతనమున గలుగు భావమును సచేతనమున నాయోజింప రాదు. కావున నెపుడు నెచ్చటను చిత్రాదిమతి కలుగనే కలుగదు.

నటునందు గలుగు రామాదిబుద్ధి యర్థక్రియాకర్మ సమర్థ మగుచున్నది కావున నా సమయమున బాధక మేమియు లే నందున సమ్యగ్బుద్ధియె యగునని నిశ్చయింప వలెను. నటుడు సమ్యక్ప్రయోగ మొనరించు నపుడు ప్రేక్షకులు రసావిష్టు లగుదురు. అప్పుడు నటునందు రాము డన్న చిత్తవృత్తి యుదయించును. అది యర్థక్రియాకర్మ సమర్థము నగును. ఇట్లు స్వరూపా

శ్రయబుద్ధ్యనుసారమున రసముల సముదయము నిదర్శిత మయినది. ఇది యంతయు భరతప్రోక్తము. ఇక నీ విషయమున వృత్తి నిరూపితము కాగలదు.

## భట్టనాయకమతమున రసవృత్తి

న తటస్థతయా నాత్మగతత్వేన ప్రతీయతే
న చాభిధీయతే క్వాపి నోత్పద్యేత కదాచన. 263

తాదాత్త్వికేన ప్రమదాద్యనుభావేన వాసితః
స్వాదః సహృదయానాం యో హ్లాదాత్మా హృదయంగమః. 264

స భావాభినయాత్సాధారణీకరణరూపయా
భావకత్వవ్యాప్రియయా భావ్యమానః స్వభావ వత్. 265

భోగేన సంవిదానందమయేనైవోపభుజ్యతే

భట్టనాయకుడు నాట్యవిదులలో ప్రముఖుడు. నాట్యవేదమునకు వ్యాఖ్య రచించినా డట. నాయకుని కొన్ని భావము లభినవభారతిలో గన్పడును. ఈతడు సాంఖ్యమతవాది యందురు. ఈతని రసమత మీ విధముగా నున్నది. కావ్యనాట్యములలో వ్యాపారత్రయ మున్నది. అభిధ భావన భోగీకృతి యని. అభిధచే పదపదార్థపరిజ్ఞానము కలుగును. భావనావ్యాపారమె భావకత్వవ్యాపారము. దీనిచే సాధారణీకరణము సంపన్న మగును. అప్పుడు దేశకాలాదులు పరిత్యక్తములు కాగా సీతారామాదులు శకుంతలాదుష్యంతాదులు స్వవిశేషముల విడనాడి సామాన్యాకారమున గోచరింతురు. అనంతరము భోగీకృతి యను భోజకత్వవ్యాపారము ప్రసరించును. సామాజికు డపుడు రసభోగము కలవా డగును. ఇట్టి భావ మిచట విస్తృత మగును.

రసము తటస్థముగా భాసింపదు. ఆత్మగతముగను ప్రతీతముకాదు. నాట్యమున రామాది నాయకుడు అనుకర్త యగు నటుడు ఇద్దరును తటస్థపదమున వ్యవహార్యులు. రసము రామాదిగతముగా నుత్పన్న మగు ననుట యుపపన్నము కాదు. నటగతముగా రసము ప్రతీత మగుటయు నుపపన్నము కాదు. ఇట్లు తటస్థు లయిన రామనటులలో భాసించుట నిరస్తము. ఇక మూడవ వ్యక్తి సహృదయుడు. ఇం దాత్మపదమున వ్యవహార్యుడు. రసము

సహృదయాత్మగతముగా నభివ్యజ్యమానమును గాదు. ఆత్మగతముగా నభివ్యక్త మగు ననుటలో నుపపత్తి నిరూపితము కా లేదు. రస మభిధీయమానము కాదు. అది యెపుడు నెచట నుదయింపదు.

ఇక నా రస మె ట్లవభాసించును? ఇ ట్లవభాసించును. సహృదయులకు రసము హ్లాదాత్మకము హృదయంగమము నగు స్వాదము. స్వాద మను నీ యాస్వాదము నాట్యభావనాసమయమున ప్రమదాదుల యనుభావమున వాసితమై భాసించును. సముచిత భావాభినయమున భావకత్వ వ్యాపారమహిమచే సాధారణీకరణ ప్రభావమున భావ్యమాన మగును. స్వకీయభావముగా నది సంభావ్యమాన మగును. అనంతరము భోగ మను భోజకత్వవ్యాపారమున నది యాస్వాద్యమాన ముపభుజ్యమాన మగును. ఇపు డిచటి భోగము సంవిదానందమయముగా నుండును. సత్త్వగుణసముద్రేకమున రజస్తమోగుణములు నిరస్తములగును. అవి యట్లు కాగా సత్త్వ మతిశయించును. ఆ సమయమున ప్రకాశానందమయ మగు సంవిత్స్వభావ మతిశయించును. ఈ నిరంతర సంవిత్ప్రకాశమె భోగము. ఈ భోగము సహృదయగతము.

భోక్తృ భోగ్యార్థ సంబంధప్రకారశ్చాభిధీయతే. 266

రాగ విద్యా కలా సంజ్ఞైః పుంసస్తత్త్వైస్త్రిభిః స్వతః
ప్రవృత్తిర్గోచరోత్పన్నా బుద్ధ్యాదికరణై రసౌ. 267

భోగం నిష్పాద్య నిష్పాద్య వాసనాత్మైవ తిష్ఠతి
దుఃఖ మోహాది కలుషమపి భోగ్యం ప్రతీయతే. 268

యత్సుఖత్వాభిమానేన స రాగ ఇతి కథ్యతే
విద్యా నామేతి తత్త్వం యద్రాగోపాదాన ముచ్యతే. 269

తయాఽభివ్యజ్యతే జ్ఞానం పురుషస్య విపశ్చితః
చైతన్యస్య మతేనైవ సంరుద్ధస్య స్వభావతః. 270

అభిజ్వలన హేతుర్యా సా కలేత్యభిధీయతే
సుఖదుఃఖాత్మికా బుద్ధేర్వృత్తి ర్గోచర ఉచ్యతే. 271

ఏవం పరంపరాప్రాప్తైః భావై ర్విషయతాం గతైః
బుద్ధ్యాదికరణై ర్భోగా ననుభుంక్తే రసాత్మనా. 272

శివాగమజ్ఞై రర్థోఽయ మేవ ముక్తః పురాతనైః
కలోత్కలితచైతన్యో విద్యాదర్శిత గోచరః. 273
రాగేణ రంజితశ్చాయం బుద్ధ్యాదికరణై ర్వృతః
మాయాద్యవనిపర్యంతం తత్త్వభూతాత్మని స్థితమ్. 274
భుంక్తే తత్ర స్థితో భోగానోభిగైకరసికః స్వయం
ప్రేరకత్వేన బుద్ధ్యాదికరణానాం పునః పునః. 27
ఉపకుర్వంతి సత్త్వాదిగుణాస్తే తత్ర తత్ర తు

ఇతి శ్రీ శారదాతనయ విరచితే భావప్రకాశనే రసస్వరూపాశ్రయ వృత్తినిర్ణయో నామ ద్వితీయోఽధికారః.

నిరూపితమయిన భట్టనాయకమతము నందు రసభోగము సూచితమయినది. సహృదయుడు భోగ మనుభవించు భోక్త యనియు సూచిత మయినది. ఆ భోగరీతి యెట్టిదో యిచట ప్రతిపాదిత మగును.

సంవిదానందమయ భోగమున రసము భుజ్యమాన మగుట, భోక్తృ భోగ్యార్థ సంబంధ ప్రకార మిచట ప్రతిపాదిత మగును. భోక్తకు భోగ్యపదార్థమునకు గల పరస్పర సంబంధ మిచట నుపపాదితము కా గలదు. ఇచటి యుపపాదన విధానము శివాగమానుసారమున నుండును. శివాగమము నందలి రీతి యిచట సమన్విత మగును. శివాగమము నందు షట్త్రింశత్తత్త్వముల నంగీకరింతురు. శివుడు ప్రథమ తత్త్వము. భూమి తుది తత్త్వము. ఈ తత్త్వములలో రాగ విద్యా కలా తత్త్వము లున్నవి. వాని స్వరూపవివేచనము ప్రకృతోపకారి యగును. జీవునకు రాగతత్త్వము విద్యాతత్త్వము కలాతత్త్వము అను మూడు తత్త్వములు కలవు. ఈ తత్త్వత్రయముతో గూడుకొనిన బుద్ధ్యాది కరణము లొక విశిష్ట ప్రవృత్తిని గోచరము చేసికొనును. అట్లు గోచరోత్పన్న మయిన ప్రవృత్తి యనేకపర్యాయములు భోగమును సంపాదించి సంపాదించి జీవునందు వాసనాత్మకముగా సంస్కారస్వరూపముగా నుండును. భోగ్యపదార్థము దుఃఖమోహాదికలుషముగనె యుండును. ఇచట సుఖము కలదన్న అభిమాన ముండునేని "రాగము" అని యన దగును. రాగమున కుపాదానముగా విద్య యను తత్త్వ ముండును. ఆ విద్యావిశేషముచే వైదుష్యము కల జీవునకు జ్ఞాన మభివ్యక్త మగును. జీవుని చైతన్యము స్వభావసహజముగా మలముచే సంరుద్ధమై యుండును. అట్లాచ్ఛన్న మయిన చైతన్యము నభిజ్వలన

మొనరించుటలో హేతువుగా నుండునది కలాతత్త్వము. ఇట్టి కలా విద్యా రాగ తత్త్వములతో గూడిన బుద్ధ్యాది కరణములు ప్రవృత్తి సంపాదించు నని పూర్వార్థముతో సంబంధము గ్రాహ్యము. సుఖదుఃఖాత్మక మయిన బుద్ధి యొక్క వృత్తికి గోచర మని పేరు. ఇట్టి గోచరోత్పన్న మయిన ప్రవృత్తి భోగము కలిగించును.

సహృదయు డగు భోక్త యిట్లు పరంపరాప్రాప్తము లయిన భావములతో నుండును. బుద్ధ్యాదికరణము లా భావములను విషయములుగా జేసికొనును. బుద్ధ్యాదివృత్తులలో నవి విషయములుగా భాసించును. అట్లు భాసింపగా సహృదయు డా భోగములను రస రూపమున ననుభవించును. ఇదియె రసభోగము.

పురాతను లయిన శివాగమాభిజ్ఞు లీ యర్థము నీ విధముగా నిరూపించిరి. బుద్ధ్యాది కరణములతో గూడు కొనిన జీవుడు కలాతత్త్వమున చైతన్యమునకు వికసనము సంపాదించిన వాడై, విద్యాతత్త్వమున వేద్యము గోచరింప జేసికొనిన వాడై, రాగతత్త్వమున రంజితస్వరూపుడై మాయాదికముగా నవని పర్యంతము కల తత్త్వస్వరూపముల నన్నిటిని స్వాత్మయందు స్థితి కల వానినిగా భావించుచు ననుభవించును. భోగై కరసికుడై భోగముల ననుభవించును. భోగ్యభోగ సమయమున బుద్ధ్యాదికరణము లన్నియు ప్రేరకములుగా నుండును. ఆ యా సముచిత స్థలము లందు సత్త్వరజస్తమోగుణము లుపకరించు నవియు నగును. ఇట్టి శివాగమ రీతి ప్రకృతరసభోగమున గూడ సంగతముగా నున్నది కావున రసభోగసంభోగరీతి నీ విధముగనే భావించుట యుక్తము.

ఇది శ్రీ శారదాతనయ విరచితమై నభావప్రకాశనమునందు భావాలోకమున రసస్వరూపాశ్రయ వృత్తినిర్ణయము ద్వితీయాధికారము.

# తృతీయాధికారము

## రసభేదతత్ప్రకారస్వరూప నిర్ణయము

ఈ తృతీయాధికారమునకు రసభేద తత్ప్రకార స్వరూపనిర్ణయ మని పేరు. రసోత్పత్తి విధానము పూర్వాధికారమున కొంతగా సూచిత మయినది. ఇందు ప్రకారాంతరమున రసోత్పత్తి నిరూపిత మగును. రసముల ప్రాధాన్య అప్రాధాన్యములు వివేచితము లగును. రసముల కార్యకారణభావము సమీక్షిత మగును. నాట్యరసోత్పత్తి, రసములకు వాచికాదిభేదమున విభాగము దేవతా నిర్దేశము గుణానుభావము నిరూపిత మగును.

కథితాః స్థాయిన స్తేషు విభావాది సహాయతా
తేషాం రసాత్మతా తాదృక్స్వరూపం తద్రసస్య చ. 1

తద్భేదా స్తన్నిరుక్తిశ్చ తద్విభావాదిభావ్యతా
తదుత్పత్తిప్రకారాశ్చ తజ్జ్ఞానం చ తదాశ్రయః. 2

తద్భోగ్యతా తత్కరణం సంబంధో భోక్తృభోగ్యయోః
ఇదానీం కథ్యతేఽస్మాభిః ప్రకారాంతర కల్పితః. 3

పూర్వగ్రంథములో స్థాయిభావములు నిరూపితము లయినవి. వానిలో విభావాదుల సహాయకారిత సూచిత మయినది. స్థాయిభావములు రసాత్మత పొందుట స్వరూపము రసభేదములు తన్నిరుక్తి విభావాదులచే భావ్యమాన మగుట ఉత్పత్తిప్రకారము తజ్జ్ఞానము తదాశ్రయము తద్భోగ్యత తత్కరణము భోక్తృభోగ్యముల సంబంధము నిరూపిత మయినది. ఇక నిటుపై ప్రకారాంతర కల్పిత మయిన రసవిశేషము నిరూపిత మగును.

### ప్రకారాంతరమున రసోత్పత్తి

ఉత్పత్తిర్జన్యజనకభావ స్తేషాం యథాక్రమం
తతః స్థాయిషు భావేషు తదసాధారణాత్మకః. 4

నియమశ్చ విభావాదే స్తదాత్వప్రక్రియాఽపి చ
అనుభావై స్తు వాగంగ మన ఆరంభ జన్మభిః. 5

వాగారంభాదిభేదేన వికల్పా రసగామినః
త త్తదాలంబనీభూత నాయకాది గుణాదయః. 6

అన్యేఽపి భావా యే కేచి త్త త్తదర్థానుషంగిణః
ప్రవేక్ష్యంతి చ తత్రై వ విజ్ఞేయా స్తే విచక్షణైః. 7

నిరూప్యమాణ తృతీయాధికారమున వక్ష్యమాణ విషయముల సంకేత మిం దున్నది. ముందుగా విషయసంగ్రహము ప్రతిపాదించుట ప్రరోచన కలిగించును. విషయప్రవేశమున కుపకరించును. గ్రహణమునకు సహకరించును. ఇందు ప్రతిపాద్యవిషయ సంగ్రహ మీ విధమున నున్నది.

ప్రకారాంతరమున రసోత్పత్తి, రసముల జన్యజనకభావము, స్థాయి భావములలో క్రమముగా తదసాధారణాత్మక మయిన నియమము, త త్తత్సమయము నందలి ప్రక్రియ, వాచి కాంగిక మానసారంభ సంభూతము లయిన యను భావముల వలన గలుగు విశేషము, వాగారంభాది భేదమున రసగామి విశేషములు, ఆ యా రసముల కాలంబనముగా నుండు నాయకాదుల గుణాదులు ఈ తృతీయమున విచారితము లగును. త త్తదర్థానుషంగమున నుండు ఇతరభావములును సమీక్షితము లగును. ఇట్లా యా స్థలము లం దనుప్రవేశము పొందు వానిని విచక్షణు లగు వారు గుర్తింప వలెను.

## శృంగారాది సముత్పత్తి

శృంగార ఉదభూ త్సామ్నో వీరోఽభూద్విత తో ఋచః
అథర్వవేదతో రౌద్రో బీభత్సో యజుషః క్రమాత్. 8

సామాని స్మరత స్తస్య స్వరూపవ్యక్తి రాత్మనా
యాచేయమిచ్ఛా జగతాం సిసృక్షోః పరమాత్మనః. 9

విషయాక్తా రతిస్సై వ శృంగార ఇతి గీయతే
ఇచ్ఛాక్రియాత్మికా జ్ఞప్తి స్త స్యైవ స్మరతో ఋచః. 10

ఉత్సాహాత్మా విషయిణీ వీర ఇత్యుచ్యతే బుధైః
స్మరతోఽథర్వమంత్రాణాం త త్తద్ధింసాత్మికామతిః. 11

యా క్రియోఽభిహితా క్రోధాఖ్యః రౌద్ర ఇతి కథ్యతే
క్రియారూపా ప్రవృత్తిర్యా ఫలస్యైవ యజుషాం స్మృతేః. 12

ఫలావసానికీ సైవ బీభత్స ఇతి గీయతే

శృంగారాదిరసముల యుత్పత్తి ప్రకారాంతరమున నిచట నిరూపిత మగును. ఋగాది వేదసమూహము కల బ్రహ్మ నుండి శృంగారాదిరసము లుత్పన్నము లయినవి. సామవేదమున శృంగార ముదయించినది. ఋగ్వేదమున వీర ముదయించినది. అథర్వవేదమున రౌద్ర ముదయించినది. యజుర్వేదమున బీభత్స ముదయించినది. శృంగార వీర రౌద్ర బీభత్సరసములు జనకరసములు. వీనివలన నితర రసము లుదయించినవి. ''రసా నాథర్వణాత్''–అథర్వవేదము నుండి రసములను బ్రహ్మ యాహరించె నని నాట్యవేదమున నున్నది. నాలుగు వేదముల నుండియు నాలుగు రసముల నాహరించుట యుం దున్నది. ఈ యంశ మన్యత్ర విస్తృత మగును. సామములను స్మరించు బ్రహ్మకు స్వయంభు వగు స్వరూపవ్యక్తి కలిగినది. జగముల సృజింపవలె నను ఇచ్ఛ కలిగినది. ''సిసృక్షా స్రష్టుం ఇచ్ఛా''. అట్టి యాతని యిచ్ఛ విషయసంబంధము కలది యయినది. అట్లు విషయాసక్త మగుటన యా సిసృక్ష, విషయ సంవలిత మయిన ఆ యిచ్ఛయే రతి. ఆ రతియే శృంగారముగా విఖ్యాత మయినది. ఇచ్ఛాశక్తి శృంగారమూల మని భావము. ఇట్లే జ్ఞానశక్తి వీరమూలము. ఋగ్వేద ఋక్కులను స్మరించు బ్రహ్మకు జ్ఞప్తి యుదయించినది. అది యిచ్ఛాత్మిక. క్రియాత్మిక. ఆ జ్ఞప్తి విషయ సంబంధము కలదై ఉత్సాహాత్మక మయిన వీర మగు నని యనిరి. అథర్వమంత్రములను స్మరించు బ్రహ్మకు హింసాత్మక మయిన మతి యుదయించినది. అది క్రియాసంవలిత మైనది. క్రోధాత్మకమై రౌద్ర మని నిరూపిత మయినది. యజుర్వేదస్మృతి వలన క్రియారూప మయిన బ్రహ్మ ప్రవృత్తి ఫలావసానికమై బీభత్స మని సంకేతిత మయినది. ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తుల సంబంధము వలన శృంగారాదిరస చతుష్టయము నాలుగు వేదముల సంబంధమున బ్రహ్మ కుదయించిన మతివిశేషము రూపముగా నిశ్చయింప దగినది యయినది.

శృంగారాది రస చతుష్టయమున హాస్యాదిరస చతుష్టయ ముత్పన్న మగుట సూచిత మగును.

శృంగారస్యానుకరణం హాస్య ఇత్యభిధీయతే. 13

వీరస్య కర్మ యద్ధీరం సోఽద్భుతః పరికీర్తితః

క్రూరక్రియా యా రౌద్రస్య సైవ స్యాత్కరుణాహ్వయా. 14

బీభత్సస్యాపి యత్కర్మ స భయానక ఈరితః

ప్రాధాన్యం జనకత్వేన జన్యత్వేనాప్రధానతా. 15

శృంగారానుకరణము హాస్యము. ధీరమగు వీరకర్మ అద్భుత మన దగును. రౌద్రమునకు సంబంధించిన క్రూరకర్మ కరుణసంజ్ఞతో వ్యవహృత మగును. బీభత్సకర్మ భయానక మయినది. శృంగార వీర రౌద్ర బీభత్సములు క్రమముగా హాస్యాద్భుత కరుణ భయానకములకు కారణములయిన వని పరి గ్రాహ్యము. శృంగారాదులు జనకరసములు. హాస్యాదులు జన్యరసములు. జనకములగుట వలన శృంగారాదులకు ప్రాధాన్యము జన్యరసము లగుట వలన హాస్యాదుల కప్రాధాన్యమును నిశ్చయింప వలెను.

రసము ప్రధానము. అప్రధాన మయినచో రసము కాదు. ఇట్లు ప్రసి ద్ధముగా వ్యవస్థ యున్నది. కొన్నిరసము లప్రధానము లనుట సంగతమా? ఇం దుపపత్తి యేమి?

ప్రధానతాప్రధానత్వే జ్ఞాతవ్యే నాట్యహేతవే

యత్తు ప్రధానం తదనుభావా దన్య త్ప్రసిద్ధ్యతి. 16

తస్మా త్ప్రధానేతరయోర్జ్ఞానం నాట్యోపకారకం

తస్మాత్ప్రధానాః శృంగార వీర రౌద్రాః పృథక్పృథక్. 17

సబీభత్సాః స్వతంత్రత్వా దేషాం ప్రాధాన్యకల్పనా

స్వాతంత్ర్యమేషా ముత్పత్తి మితరేషాం చ సంభవమ్. 18

వ్యాసప్రోక్తేన మార్గేణ కథయామి యథార్థతః

కొన్ని రసములు ప్రధానము లనుట మరికొన్ని యప్రధానము లనుట నాట్యము కొఱకని గ్రహింప వలసి యున్నది. ప్రధానరసమునకు సంబంధిం చిన యనుభావమున నన్యరసము సిద్ధ మగును. కావుననె ప్రధానరసమని యప్రధానరసమని గ్రహింప దగును. ఇట్టి ప్రధానాప్రధానజ్ఞానము నాట్యోప కారకము. కావున శృంగార వీర రౌద్ర బీభత్సములు నాలుగు వేరు వేరుగా

ప్రధానరసములు. ఇవి స్వతంత్రము లయి నందున ప్రాధాన్యకల్పన ముచితము. ఇట్లు వీని స్వాతంత్ర్యము సముత్పత్తి యితరముల సంభవము వ్యాసనిర్ణీత మయిన మార్గము ననుసరించి తద్వస్తుస్వభావము ననుసరించి యిక నిరూపింప దగియున్నది.

కల్పస్యాంతే కదాచిత్తు దగ్ధ్వా లోకాన్మహేశ్వరః. 19
స్వే మహిమ్ని స్థితః స్వైరం నృత్యన్నానందమంథరం
మనసై వాసృజద్విష్ణుం బ్రహ్మాణం చ మహేశ్వరః. 20
వామతో వైష్ణవీ శక్తిః స్థితా మాయామయీ విభోః
అంబికారూపమాస్థాయ స్థితా సా సర్వమంగలా. 21
నియోగాద్దేవదేవస్య బ్రహ్మా లోకా నథాసృజత్
సృష్ట్వా స దేవదేవస్య పురావృత్తమథాస్మరత్. 22
దివ్యం చరిత్రమైశం మే కథ మధ్యక్షతా మియాత్
ఇతి చింతాపరే తస్మి న్నభ్యగా న్నందికేశ్వరః. 23
స నాట్యవేదమధ్యాప్య సప్రయోగం చతుర్ముఖం
ఉవాచ వాక్యం బ్రహ్మాణం నందీ తచ్చింతితార్థవిత్. 24
నాట్యవేదోపదిష్టాని రూపకాణి చ యాని తు
విధాయ తేషా మేకం తు రూపకం లక్షణాన్వితమ్. 25
భరతేషు ప్రయోజ్యం త త్త్వయా సమ్యగ్విధానతః
తస్మిన్ ప్రయుక్తే భరతై ర్భావాభినయకోవిదైః. 26
ప్రాక్తనాని చ కర్మాణి ప్రత్యక్షాణి భవంతి తే
ఏవం బ్రువ న్నంతరధా న్నందీ స భగవా న్ప్రభుః. 27
శ్రుత్వైతద్వచనం ప్రీతో బ్రహ్మా దేవైః సమన్వితః
తతస్త్రిపురదాహాఖ్యం రూపకం సమ్యగభ్యధాత్. 28
అధ్యాప్య భరతా నేత త్ప్రయుంగ్ధ్వ మితి చాబ్రవీత్
తస్మిన్ త్రిపురదాహాఖ్యే కదాచిద్బ్రహ్మసంసది. 29
ప్రయుజ్యమానే భరతై ర్భావాభినయకోవిదైః
తదేతత్ప్రేక్షమాణస్య ముఖేభ్యో బ్రహ్మణః క్రమాత్. 30

వృత్తిభిస్సహ చత్వారః శృంగారాద్యా వినిస్సృతాః

చింతావ్యాకులు డయిన బ్రహ్మకు నందికేశ్వరుడు నాట్య ముపదేశించినాడు. నందికేశ్వరాజ్ఞానుసారమున బ్రహ్మ త్రిపురదాహ మను రూపకము ప్రయోగింప జేసెను. భరతపుత్రులు ప్రయోగించు నప్పుడు చూచు బ్రహ్మ వదనముల నుండి రసచతుష్టయ మావిర్భవించినది. ఇట్టి యీ పురావస్తు విచట ప్రస్తుత మగుచున్నది.

ఒకప్పుడు కల్పాంతము నందు మహేశ్వరుడు సర్వలోకములను దహించెను. స్వమహిమ ప్రతిష్ఠితుడై యుండెను. స్వేచ్ఛగా నృత్య మొనరించెను. ఆనందమంథరముగా నృత్య మొనరించెను. అట్టి మహేశ్వరుడు విష్ణువును బ్రహ్మను మనసా సృజించెను. అప్పు డా శివుని వామభాగమున మాయామయి వైష్ణవి శక్తి యంబికారూప మవలంబించి యుండెను. ఆ దేవి సర్వమంగల. దేవదేవుని యాజ్ఞానుసారమున బ్రహ్మ లోకములను సృజించెను. పిమ్మట దేవదేవుని పురావృత్తము స్మరించెను. "దివ్య మగు పరమేశ్వర చరితము నా కెట్లు సాక్షాత్కరించునో'' యని బ్రహ్మ చింతాపరుడు కాగా నందికేశ్వరుడు విచ్చేసి చతుర్ముఖు డగు నా బ్రహ్మకు సప్రయోగముగా నాట్యవేద ముపదేశించెను. బ్రహ్మ చింతితార్థమును గుర్తించిన నందికేశ్వరుడు బ్రహ్మ నుద్దేశించి యిట్లు పలికెను.

"నాట్యవేదోపదిష్టము లగు రూపకముల నన్నిటి నొనరించి వానిలో నొక రూపమును లక్షణాన్వితముగ నిర్మింపుము. దానిని భరతులు ప్రయోగించు నట్లొనరింపుము. ఈ సర్వము చక్కగా నాచరింపుము. భావాభినయ కోవిదు లయిన భరతులు దీని ప్రయోగించినచో ప్రాక్తన కర్మ లన్నియు నీకు ప్రత్యక్షములు కా గలవు'' ఇట్లని నంది భగవాను డంతర్ధానము నొందెను.

ఈ యుపదేశమును బ్రహ్మ వినెను. సంప్రీతు డయ్యెను. దేవులతో గూడు కొనెను. పిమ్మట త్రిపురదాహము అను పేరు గల రూపకమును లెస్సగా జెప్పెను. భరతులకు నేర్పి "దీని ప్రయోగింపుడు'' అనెను. ఒకప్పుడు బ్రహ్మ సభలో త్రిపురదాహమును భావాభినయ కోవిదు లగు భరతులు ప్రయోగించుచుండిరి. అప్పు డా ప్రయోగము దర్శించు బ్రహ్మవదనముల నుండి శృంగారాది రసములు నాలుగువృత్తులతో కూడ నావిష్కృతము లయినవి.

ఇట్టిది పురావృత్త మని శారదాతనయు డుపపాదించెను. ఇతర గ్రంథములలో సూచితము లయిన వస్తువులు కొంతగా విసంవాదముతో నున్నట్లు భాసించినను, అట్టిది స్వాపేక్షితాంశముల యుపష్టంభనమున కని భావింప గలము. బ్రహ్మముఖముల నుండి రసము లావిష్కృతము లయిన వనుట ప్రకృతము వివక్షితము. ప్రయోగదర్శనము చిరానుభూతాననుభూతముల స్మృతికి ప్రేరక మగు ననుట యిందు సంభావ్యము. రససంవేదనమున కీ స్థాపన ప్రకృత మపేక్షిత మయినది.

యదాఽభినీతో భరతైః సంభోగః శివయో స్తదా. 31

కైశికీవృత్తితో జజ్ఞే శృంగారః పూర్వతో ముఖాత్
యదాఽభినీతం భరతైః సమ్యక్త్రిపురమర్దనమ్. 32

సాత్త్వతీ వృత్తితో జజ్ఞే వీరో దక్షిణతో ముఖాత్
యదా దక్షాధ్వరధ్వంసోఽభినీతో భరతై ర్ద్రుఢమ్. 33

అభూదారభటీవృత్తే రౌద్రః పశ్చిమ వక్త్రతః
యదాఽభినీతం కల్పాంతకర్మ శంభో ర్నటై స్తదా. 34

భారతీవృత్తితో జజ్ఞే బీభత్సశ్చోత్తరాననాత్
వ్యక్తా ముఖేభ్యశ్చోత్పన్నా ఇత్యూచు శ్శంకరాదయః. 35

భరతులు పార్వతీపరమేశ్వరుల సంభోగ మభినయింపగా బ్రహ్మ పూర్వముఖము నుండి కైశికీవృత్తి సహితముగా శృంగారము సముత్పన్న మయినది. భరతులు త్రిపురమర్దనము చక్కగా ప్రయోగమున నభినయించి నవుడు బ్రహ్మ దక్షిణముఖమునుండి సాత్త్వతీవృత్తితో వీరరస ముదయించినది. భరతులు దక్షాధ్వరధ్వంసము నభినయించి నప్పుడు బ్రహ్మ పశ్చిమ వక్త్రము నుండి యారభటీ వృత్తి యుతముగా రౌద్రరస ముదయించినది. శివుని కల్పాంత కర్మను నటభరతు లభినయించి నపుడు బ్రహ్మ యుత్తరాననము నుండి భారతీ వృత్తి యుతముగా బీభత్సరస ముదయించినది. ఇట్లు ఆ యా ముఖముల నుండి వ్యక్తములై యుత్పన్నము లయిన వని శంకరాదులు పలికిరి.

ఏభ్యో రసేభ్యో నిష్పత్తిరితరేషాం ప్రదర్శ్యతే
జటాజినధరో భోగిభూషణః సాగ్నిలోచనః. 36

భస్మాంగరాగశ్చ యదా దేవ్యా కామయతే రతిం
తదా సఖీనాం దేవ్యాశ్చ హాసః సముదభూ న్మహాన్. 37

తస్మాత్ హాస్యసముత్పత్తిః శృంగారాదితి కథ్యతే

జనకరసము లగు శృంగారాదుల నుండి జన్యరసము లగు హాస్యాదు లుదయించు విధాన మిట నిరూపిత మగును. శృంగారమున హాస్య ముదయించుట యిం దున్నది. జటాజినధరుడు భోగిభూషణుడు సాగ్నిలోచనుడు భస్మాంగరాగుడు నయిన మహాదేవుడు మహాదేవితో సంభోగము కాంక్షించి నపుడు దేవి చెలికత్తెలకు దేవికి గొప్పహాస నుదయించినది. కావున శృంగారము వలన హాస్య సముత్పత్తి యుండు నని యనిరి.

పురాణి త్రీణి ఘటితా న్యయో రజత కాంచనైః. 38

ఏకైకస్య తు రక్షార్థ మసురాణాం తరస్వినాం
కోట్యః శతసహస్రాణి స్థాపితాని తత స్తతః. 39

ద్విగుణోత్తరవృద్ధాని బలాన్యతిబలాని చ
అంబికా మసితాపాంగీ మపాంగేనావలోకయన్. 40

విషహ్య శరవర్షాణి స్మయమానః స్మరాంతకః
శరేణై కేన తాన్యేకో భస్మసా దకరోద్యదా. 41

తదా సమస్తభూతానా మద్భుతం యదభూ న్మహాత్
తస్మా దద్భుతనిష్పత్తి ర్వీరా దేవేతి కథ్యతే. 42

వీరము వలన నద్భుత ముదయించుట యిం దున్నది. రాక్షసులు త్రిపురముల నిర్మించిరి. ఒకటి యయోమయము. రెండవది రాజతము. మూడవది కాంచనమయము. ఒక్కొక పురము రక్షించుటకై వేగబలము కల మహారాక్షసులు శతసహస్రకోటిసంఖ్యాకులుగా నటునిటు నియుక్తు లయినారు బలము లతిబలములు ద్విగుణోత్తరముగా స్థాపితము లయినవి. అప్పుడు స్మరాంతకు డయిన మహాదేవుడు అసితాపాంగములతో నున్న అంబికాదేవిని అపాంగమున నవలోకించుచు రాక్షసుల శరవర్షములను సహించి స్మయమానముఖుడై తానొక్క డొక్కబాణముననె యా త్రిపురములను భస్మ మొనరించెను. అపుడు సర్వభూతముల కది మహాద్భుత ముగా నుండెను. కావున వీరము వలన నద్భుత నిష్పత్తి యున్న దని యభిజ్ఞు లనిరి.

రుద్రేణ వీరభద్రేణ దక్షస్య ధ్వంసితే మఖే
దండితేషు చ దేవేషు నానాప్రహరణైః పృథక్.

విలోక్య తాన్ ప్రజ్వలిత ఛిన్న కర్ణాక్షి నాసికాన్
దీనాన్ దేవ్యాః సఖీనాం చ కరుణో యదభూన్మహాన్. 4

తస్మాద్రౌద్రప్రవృత్తః కరుణో రౌద్రాదితి విభావ్యతే

కరుణము రౌద్రము వలన జన్మించినది యని యిందు సూచితము వీరభద్రుడనిన రుద్రుడు దక్షప్రజాపతి యాగము ధ్వంసము చేసెను. నానా ప్రహరణములచే దేవత లందరు వేరు వేరుగా దండితు లయినారు. వారందరి కర్ణములు నేత్రములు ముక్కులు ఛిన్నము లయినవి. వా రందరు బొబ్బలు పెట్టుచున్నారు. దీను లయినారు. వారలను జూడగా సతీదేవికి సకియలకు మహాదుఃఖము కలిగినది. కావున రౌద్రము వలన కరుణము కలుగుట విభావిత మయినది.

దగ్ధానా మాదిదేవానా మస్థీన్యాముచ్య భైరవే. 4

తత్ శ్మశానమధిష్ఠాయ తద్భస్మాలిప్య నృత్యతి
ప్రమథా భూతసంఘా స్త మవేక్ష్య భ్రాంతచేతసః. 46

తమేవ శరణం జగ్ముర్భ్యతో భయవిమోహితాః
తస్మాద్భయానకో జాతో బీభత్సాదితి గణ్యతే. 47

భయానకము బీభత్సము వలన జనించుట యిందు నిరూపిత మయినది. ఆదిదేవు లందరు మహాగ్నిలో దగ్ధు లయినారు. వారి యస్థికల నలంకరించుకొని భైరవుడా శ్మశానము నందుండి యా భస్మము పూసికొని నృత్య మొనరించుచుండగా నా భైరవుని జూచి ప్రమథులు భూతసంఘములు చిత్తభ్రాంతి పొందెను. వా రందరు భయవిమోహితు లయినారు. భైరవుని శరణు పొందిరి. కావున బీభత్సము వలన భయానక ముదయించిన దని యనిరి.

నారదేనైష కథితః ప్రకారో భరతాయ చ
తథైవ భరతేనోక్తం యాదృశం నారదాచ్ఛ్రుతమ్. 48

తదుక్తేన ప్రకారేణ రసానాం చ పృథక్పృథక్
ఉత్పాద్యోత్పాదకత్వం చ యథావదుపపాదితమ్. 49

రసమున రసాంతర ముదయించుట యను నీ ప్రకారమును నారదుడు భరతునకు జెప్పెను. నారదు నుండి వినిన విధముగనె భరతుడు నిరూపించెను. నారద భరతోక్త ప్రకారముననె రసములకు వేరు వేరుగా నుత్పాద్యోత్పాదకత్వ ముండుట నిరూపిత మయినది.

ఇక భావములచే రసము లుత్పన్నము లగుట సనిదర్శనముగా నిరూపిత మగును.

యథా హి తంతవో వేమ తుర్యాది క్రియయాన్వితాః
పటాత్మనా పరిణతాః పటవాచ్యా భవంతి తే. 50
యథా మృదో దంత చక్ర కులాలాదిభి రన్వితాః
ఘటాత్మనా పరిణతా ఘటవాచ్యా భవంతి చ. 51
తథైవ స్థాయినో భావా విభావాదిభి రన్వితాః
రసాత్మనా పరిణతా రసవాచ్యా భవంతి తే. 52
యథైవ తంతుభేదాచ్చ పటభేదః ప్రదృశ్యతే
తథైవ భావభేదాచ్చ రసభేదో విభావ్యతే. 53
యథా కారణవైకల్యాత్కార్యం నోత్పద్యతే దృఢం
తథా కారణభావాది వైకల్యాన్న రసోదయః. 54

లోకమున తంతువులు వేమ తురి మొదలగు వస్త్రనిర్మాణ సాధనముల క్రియలతో గూడినవై పటరూపమున పరిణమించు చున్నవి. అప్పుడు తంతు వ్యవహారము లేదు. తంతువులు పటవాచ్యము లగుచున్నవి. ఇది పటదృష్టాంతము. ఇక ఘటదృష్టాంతము. మన్ను దండము చక్రము కులాలుడు మొదలగు వాని క్రియాన్వితమై ఘటముగా పరిణమించుచున్నది. ఘటపద వాచ్య మగు చున్నది.

ఈ దృష్టాంతములతో ప్రకృతమును భావింప వలెను. తంతువుల వలె, మన్ను వలె స్థాయిభావములు విభావాదులతో గూడుకొనినవై రస రూపమున పరిణమించు చున్నవి. రసపద వాచ్యములు నగు చున్నవి. తంతుభేదమున పటభేదము గోచరించు చున్నట్లు, భావభేదమున రసభేదము గోచరించు చున్నది. ఇచట భావ మనుట స్థాయిభావ మనిభావము. కారణవైకల్యమున్నచో కార్య్య ముత్పన్నము కాదు. ఇది నిశ్చితము. అట్లె రసకారణము లయిన భావముల వైకల్యము వలన రస ముదయింపదు.

తస్మాద్విభావానుభావ సాత్త్విక వ్యభిచారిభిః
వర్ధితాః స్థాయినో భావా నాయకాదిసమాశ్రయాః. 55
అనుకారతయా నాట్యే క్రియమాణా నటాదిషు
రసతాం ప్రతిపద్యంతే సామాజికమనస్సు తే. 56
సంస్కారైః ప్రాక్తనైస్తైశ్చ రస్యంతే యత్తతో రసాః

రసోత్పత్తి నిరూపిత మయినది. అనుక్రియమాణ మగు నాట్యరసము నిరూపింప వలసి యున్నది. అట్టి నాట్యరసోత్పత్తి నిరూపితమగును. భావసాకల్యమున రస ముదయించును. భావవైకల్యమున రస ముదయింపదు. కావున స్థాయిభావములు విభావానుభావ సాత్త్విక వ్యభిచారిభావములచే వృద్ధి పొందినవై నాయకాదిసమాశ్రయములుగా నున్నను నటులు నాట్యమున ననుకరింతురు. అట్లు నాట్యమున ననుక్రియమాణములై సామాజికమనస్సులలో నవి రసత్వము పొందుచున్నవి. సామాజికులు ప్రాక్తన సంస్కారములతో వీని నాస్వాదింతురు. కావున నివి రసములు. రస్యమానము లగుటచే రసములు; నాట్యమున రస్యమానము లగుటచే నాట్యరసములు.

ఇక నా యా స్థాయిభావములకు సముచితము లయిన విభావాదుల సన్నివేశప్రకారము నిరూపితమగును.

స్థాయినాం రసనిష్పత్తౌ పదసాధారణాత్మకః. 57
విభావాదినివేశస్య నియమోఽత్ర ప్రదర్శ్యతే

రసనిష్పత్తిలో స్థాయిసముల్లాస మావశ్యకము. స్థాయి సముల్లసనమునకు విభావాదుల సముచిత సన్నివేశన మావశ్యకము. విభావాది సన్నివేశమున నియమ మున్నది. అది యసాధారణాత్మకము. ఆ నియమ మిచట ప్రదర్శిత మగును. కవుల కిది యుపదేశము. ప్రయోక్తల కిది ప్రతిపాదకము.

## రతియొక్క విభావాదిసన్నివేశము

కావ్యర్తు మాల్య సంగీత చందనేందూదయాదయః. 58
విభావాః స్తంభరోమాంచ స్వేద వేపథు గద్గదాః
సాత్త్వికా స్త్వౌగ్రతాలస్య జుగుప్సాభి ర్వివర్జితాః. 59
సంచారిణోఽపి రత్యాఖ్యే స్థాయిని స్థానమాశ్రితాః
ఉద్భావయంతి శృంగార మనుభావోఽస్య తు త్రిధా. 60

స్వేదాదిభిః కటాక్షాద్యైః ప్రియభాషాదిభి ర్భవేత్

కావ్యము లందు వర్ణితము లగు ఋతువు మాల్యము సంగీతము చందనము చంద్రోదయము మొదలగు నవి విభావములు. స్తంభ రోమాంచ స్వేద వేపథు గద్గదములు సాత్త్వికభావములు. ఉగ్రత ఆలస్యము జుగుప్స అను నవి యిం దుండవు. మిగులునవి వ్యభిచారిభావములు యిందుండును. రతి యను స్థాయిభావము నం దివి యిట్లు స్థానము కల వగును. శృంగార ముల్లసింప జేయు నవి యగును. శృంగారానుభావము త్రివిధముగా నున్నది. స్వేదాదులు కటాక్షాదులు ప్రియభాషాదులు నని. వీనిచే శృంగారము భాసించును.

**హాస్యోచితవిభావాదులు**

వికటాకారవేషేణ వికృతాచార కర్మభిః. 61

వికృతైరపి వాక్యైశ్చ ధార్ష్ట్యై లౌల్యానుభూతిభిః
వికృతాభినయేనైవ వికృతాంగావలోకనాత్. 62

కుహకాసత్ప్రలాపేన దోషోదాహరణాదిభిః
హాస్యః స్యాత్స తు భూయిష్ఠం స్త్రీ నీచాదిషు దృశ్యతే. 63

స్వపరాశ్రయభేదేన స ద్విధా పరికల్ప్యతే
పునః ప్రకృతిభేదేన షట్ప్రకారః ప్రదృశ్యతే. 64

నిగద్యతే వరిష్ఠానాం స్మితం హసిత మిత్యపి
మధ్యమానాం విహసితం తథోపహసితం భవేత్. 65

నీచానాం చాపహసితం తథాఽతిహసితం క్రమాత్
ఈషద్వికాసి గండం యత్కటాక్షనిరీక్షణమ్. 66

అలక్ష్యదంతజ్యోత్స్నం తదుత్తమానాం స్మితం భవేత్
ఉత్ఫుల్లమాననం యత్ర వికసద్గండమండలమ్. 67

లక్ష్యమాణద్విజం యత్స్యాత్తదేవ హసితం భవేత్
ఆకుంచితాక్షిగండం యన్ముఖరాగసమన్వితమ్. 68

సుస్వనం మధురం యత్స్యాత్తద్వై విహసితం భవేత్
జిహ్మావలోకనాద్దృష్టిః ముఖముత్ఫుల్లనాసికమ్. 69

నికుంచితం శిరో యత్ర తచ్చోపహసితం భవేత్
అస్థాన హాస రటిత మావిరాస్రవిలోచనమ్. 70

కంపితాంగ శిరో గాత్రం తచ్చాపహాసితం భవేత్
వికృష్ట స్వన సంరంభ ముద్ధతం సాస్రలోచనమ్. 71
కరోపగూఢపార్శ్వం యత్తచ్చాతిహాసితం భవేత్
సాత్త్వికా హాస్యసంపత్తౌ సర్వే ప్రలయవర్జితాః. 72

హాస్యసముచితము లయిన విభావాదుల పరిగణనమిందున్నది. వికటాకారమున వికటవేషమున వికృతాచారములచే వికృతములగు కర్మలచే, వికృతవాక్యములచే దార్ష్ట్యలౌల్యానుభవములచే వికృతాభినయములచే వికృతాంగావలోకనమున కుహాకాసత్ప్రలాపమున దోషోదాహరణాదులచే హాస్య ముదయించును. ఈ చెప్పినవి హాస్యమున విభావము లని భావము. హాస్యము బహులముగా స్త్రీల యందును నీచప్రకృతు లందును గన్పడుచున్నది. స్వాశ్రయ పరాశ్రయ భేదమున హాస్యము రెండు విధములు. ప్రకృతిభేదమున నిది యారు విధములు. ఉత్తములకు స్మితము హసితము, మధ్యములకు విహసిత ముపహసితము, అధములకు అపహసితము అతిహసితము నుండును.

వీని స్వరూప మిట్లుండును. ఉత్తములకు స్మితము. గండ మీష ద్వికసితము. కటాక్షనిరీక్షణము దంతకాంతులు కన్పడకుండుట స్మితము యొక్క రూపము. హసితము నందాననము సముత్ఫుల్లము గండమండలము వికాసమున నుండుట దంతములు కొంతగా గోచరించుట యుండును. మధ్యముల హాసము విహసిత ముపహసితముగా నుండును. విహసితములో నేత్రములు గండభాగము ఆకుంచితముగా నుండును. ఇది ముఖరాగ సమన్వితముగా నుండును. మధురమగు ధ్వనితో నుండును. ఉపహసితమున దృష్టి వక్రావలోకమున నుండును. ముఖ ముత్ఫుల్లనాసికముగా నుండును. శిరము నికుంచిత మగును. నీచులకు అపహసితము అతిహసితము నుండును. అపహసితములో అస్థానహాసము అస్థానరటితముండును. ఆవిలము లయిన అశ్రువులతో కన్ను లుండును. అంగము శిరము గాత్రము కంపముతో నుండును. అతిహసితము నందు వికృష్టస్వనసంరంభము బిగ్గరగా నవ్వు సరంభము ఉద్ధతవిధానము అశ్రువు కూడిన నేత్రము లుండును. పార్శ్వ భాగములను చేతులతో పట్టుకొనుట యుండును. ఇట్టి వన్నియు నను భావములు. హాస్య సంపత్తిలో ప్రలయ రహితముగా సాత్త్వికభావము లన్నియు నుండును.

## ఉత్సాహోచితవిభావాదులు

ఉత్తమ ప్రకృతిర్వీర ఉత్సాహాత్మా విభావ్యతే
ఉత్సాహః సత్త్వసంపత్తి శౌర్య త్యాగాది సంభవః. 73

అవిస్మయా దసమ్మోహా దవిషాదిత్వతోఽపి చ
పురుషార్థవిశేషేషు కార్యతత్త్వార్థనిశ్చయః. 74

పరాక్రమః ప్రతాపశ్చ దుర్ధర్ష ప్రౌఢ సైన్యతా
యశః కీర్తిశ్చ వినయో నయశ్చ ప్రభుశక్తతా. 75

మంత్రశక్తిశ్చ సంపన్నధనాభిజనమిత్రతా
ఇత్యాదయో విభావాః స్యుర్వీరస్య కవికల్పితాః. 76

స్థైర్య శౌర్య ప్రతాపైశ్చ ధైర్యైరాక్షేపభాషితైః
సామాదీనా ముపాయానాం యథాకాల ప్రయోగతః. 77

భాషితై ర్భావగంభీరై రనుభావా భవంతి తే
ప్రబోధామర్ష గర్వౌగ్ర్య మద హర్షాః స్మృతిర్ధృతిః. 78

ఔత్సుక్య తర్కాసూయాశ్చ భవంతి వ్యభిచారిణః
సాత్త్వికాః స్వేదరోమాంచా మద హర్షాది సంభవాః. 79

గుణాస్త్యాగాదయోఽపి స్యు రనుభావాః క్వచి త్క్వచిత్

ఉత్సాహము వీరరసమునకు స్థాయి భావము. వీర ముత్తమ ప్రకృతికముగా నుండును. ఉత్సాహాత్మకముగా నిది విభావిత మగును. ఉత్సాహ మను స్థాయి సత్త్వసంపత్తి శౌర్యము త్యాగము మొదలగు వానిచే గలుగును. కవికల్పితము లయిన వీర విభావము లీ విధముగా నుండును. పురుషార్థవిశేషము లందు కార్యతత్త్వార్థనిశ్చయము విస్మయరహితముగా సమ్మోహరహితముగా విషాద రహితముగా నుదయించును. పరాక్రమము ప్రతాపము, దుర్ధర్షము ప్రౌఢమునైన సైన్యము కలిగి యుండుట యశస్సు కీర్తి వినయము, ప్రభుశక్తి మంత్రశక్తి ధనసంపన్నులయిన యభిజనులు మిత్రులుగా నుండుట మొదలగునవి వీరమున విభావములు. స్థైర్యము శౌర్యము ధైర్యము ప్రతాపము సాక్షేపభాషితము, సామ దాన భేద దండోపాయములను సముచితకాలమున ప్రయోగించుట, భావగంభీరముగా భాషించుట, యనునవి వీరమున ననుభావములు. ప్రబోధము గర్వము అమర్షము

ఉగ్రత మదము హర్షము స్మృతి ధృతి ఔత్సుక్యము తర్కము అసూయ అనునవి వీరమున వ్యభిచారిభావములు. స్వేదము రోమాంచము సాత్త్విక భావములు. మద హర్షాది సంభవము లయిన త్యాగాదిగుణము అనుభావములుగా నుండును. ఈ చెప్పినవి యొక్కొకచో నుండుట గ్రహింప వలెను.

విస్మయోచితవిభావాదులు

విస్మయాత్మా భవత్యేవ సమప్రకృతి రద్భుతః. 80
కర్మణోఽతిశయా త్స్వర్గాణా మద్భుతార్థోపసంగమాత్
మనోరథఫలప్రాప్తే ర్దివ్యభావావలోకనైః. 81
విమానోద్యాన భవన సభారామావలోకనైః
విరుద్ధానాం పదార్థానా మవిరుద్ధ సమాగమైః. 82
అసంభావ్యస్య చార్థస్య సంభవోత్పత్తిదర్శనైః
అదేశ కాల సంపత్తే రభీష్టాదే రచింతితమ్. 83
ఇత్యాదిభి ర్విభావై స్తై రద్భుతాఖ్యో రసో భవేత్
స్తంభ వేపథు రోమాంచ స్వరసాదాశ్రునిర్గమాః. 84
సంచారిణోఽపి తస్య స్యుర్యే శృంగారోపయోగినః
అనుభావాస్తు వక్ష్యంతే పరత్రాద్భుత వర్ణనే. 85

అద్భుతము విస్మయాత్మకము. ఇది సమ ప్రకృతికము. ఇందు విభావము లీ విధముగా నుండును. మానవుల సాతిశయము లయిన కర్మవిశేషములు అద్భుతార్థప్రాప్తి మనోరథఫలము లభించుట దివ్యపదార్థ దర్శనము, విమానము ఉద్యానము భవనము మహాసభ ఆరామము మొదలగు వానిని జూచుట, విరుద్ధపదార్థముల కవిరుద్ధ సమాగమము అసంభావ్యార్థముల సంభవము సముత్పత్తి సందర్శనములు, దేశ కాలాతీతము లయిన విధానములు, అచింతితముగా నభీష్టార్థసిద్ధి మొదలగు విభావములచే నద్భుతరసము కలుగును. స్తంభము వేపథువు రోమాంచము స్వరభంగము అశ్రువు అనునవి సాత్త్వికభావములు. శృంగార రసమున నుపయోగించు వ్యభిచారిభావము లిందును సహకరించును. అద్భుతవర్ణన ప్రసంగమున విస్మయానుభావములు నిరూపితములు కాగలవు.

రౌద్రోచితవిభావాదులు

క్రోధనోద్ధత దైతేయ క్రూరాది ప్రకృతి ర్భవేత్
రౌద్ర స్తస్యానృతం వాక్య మవజ్ఞా పరుషోక్తయః. 86

వధాన్యదార లాభాది ప్రతిజ్ఞా రాష్ట్రభంజనం
హఠాద్గ్రాహో గృహ క్షేత్ర దారాదీనాం చ మత్సరః 87

దేశజాతికులాచార విద్యాశౌర్యాది నిందనం
అక్రోశ కలహాక్షేప వాక్యాజ్ఞాభంజనాదయః. 88

ఏతే విభావా భ్రుకుటీ కపోల భ్రమణం ముహుః
దంతోష్ఠపీడనం హస్తనిష్పేషో రక్తనేత్రతా. 89

శస్త్రాస్త్రగ్రహణచ్ఛేద స్తలతాడన మోటనే
పానం చ రుధిరాదీనా మాంత్రాదిభి రలంక్రియా. 90

పాతోఽవిచారతో యుద్ధే గర్జనం భర్త్సనంముహుః
ఏతేఽనుభావా రోమాంచ స్వేద కంపాదయోఽపి చ. 91

ఔగ్ర్యావేగ మదామర్ష మూర్ఛాఽసూయాఽవహిత్థకాః
స్మృతి చాపల బోధాశ్చ ధైర్యోత్సాహాదయో గుణాః. 92

క్రోధము రౌద్రరసమునకు స్థాయిభావము. రాక్షసులు ఉద్ధతులు. దైతేయులకు సంబంధించిన క్రూరప్రకృతి యిం దుండును. అసత్యవచనము అవజ్ఞావచనము పరుషవచనము లిం దుండును. వధ ప్రతిజ్ఞ పరుల భార్యల పట్టుదు నను ప్రతిజ్ఞ రాష్ట్రభంజనము గృహములను పొలములను పరభార్యలను హఠాత్తుగా నాక్రమించుట పట్టుట మత్సరము దీనిలో నుండును. దేశము జాతి కులము ఆచారము విద్య శౌర్యాదుల నిందించుట యిందుండును. ఆక్రోశము కలహము ఆక్షేపవచనము ఆజ్ఞాభంజనము మొదలగు నవియు నుండును. ఇట్టి వన్నియు నిందు విభావములు. ముహుర్ముహుః భ్రుకుటీస్ఫురణము కపోలముల కదలిక దంతపీడనము పెద కొఱకుట చేతులు నలుపుకొనుట రక్తనేత్రత శస్త్రాస్త్రగ్రహణములు రక్తము త్రావుట ప్రేవులు చుట్టుకొని యలంకరించు కొనుట అనాలోచనముగా పడుట పడవేయుట యుద్ధమున మఱల మఱల గర్జనము భర్త్సనము నను నిట్టివి యనుభావములుగా నుండును. రోమాంచము స్వేదము కంపము మొదలగు నవి సాత్త్వికభావములుగా నుండును. ఉగ్రత ఆవేగము మదము అమర్షము మూర్ఛ అసూయ అవహిత్థము స్మృతి చాపలము బోధము ధైర్యము ఉత్సాహము మొదలగునవి యిందు వ్యభిచారిభావములుగా నుండును.

## శోకస్థాయి విభావాదులు

శోకాత్మా కరుణో యోషిన్నీచాదిప్రకృతిః స్వతః
అభీష్ట విరహాత్ శాపాత్ క్లేశాచ్చ వినిపాతనాత్. 93

వధా దిష్టస్య పుత్రాదినిధనా దర్థహానితః
రాజ్య దేశ పరిభ్రంశా దన్యాన్య వ్యసనోదయాత్. 94

దై వోపఘాతా ద్దారిద్ర్యాత్ వ్యాధిభ్యః ప్రజాయతే
శ్రుతేభ్యో వాఽనుభూతేభ్యో దృష్టేభ్యో వా నృణాం భవేత్. 95

అశ్రుపాతో ముఖే శోషః స్వరభేదో వివర్ణతా
నిశ్వాసః స్మృతిలోపశ్చ విలాపః స్రస్తగాత్రతా. 96

మోహాగమోఽభిఘాతశ్చ భూపాతః పరిదేవితం
విచేష్టనం మహీపృష్ఠే భుజయోశ్చ వివర్తనమ్. 97

శ్వాసోచ్ఛ్వాసౌ దేహఘాతపాతోరస్తాడనాని చ
మోహో విషాదనిర్వేదా చింతౌత్సుక్యేచ దీనతా. 98

జడతావ్యాధిరున్మాదాపస్మారాలస్య మృత్యవః
స్తంభ కంపాశ్రు వైవర్ణ్య స్వరభంగాదయ స్తథా. 99

ఏతేఽనుభావాః కథితాః దీప్యమానాస్తు దీపనాః
స్త్రీనీచాదిషు శోకోఽయం మరణవ్యవసాయదః. 100

మధ్యమానాం భవేచ్ఛోకేముమూర్షా మృతిరేవ వా
ఉత్తమానామతిప్రౌఢో వివేకేనైవ శామ్యతి. 101

పరాశ్రయస్తూత్తమానామాత్మనో వ్యసనప్రదః

కరుణము శోకాత్మకము. కావుననె స్త్రీలలో నీచాదిప్రకృతులలో నుండును. అభీష్టవిరహము, శాపము, క్లేశము, వినిపాతము, ఇష్టవధము, పుత్రాది మరణము, అర్థహాని, రాజ్యభ్రంశము, దేశపరిభ్రంశము, నానావిధము లయిన వ్యసనముల యుత్పత్తి, దైవోపఘాతము దారిద్ర్యము వ్యాధి మొదలగు వాని వలన గలుగును. మానవులకు శ్రుతదృష్టానుభూతార్థముల వలన గలుగును. అశ్రుపాతము ముఖశోషము స్వరభేదము వివర్ణత నిశ్వాసము స్మృతిలోపము విలాపము స్రస్తగాత్రత మోహప్రాప్తి అభిఘాతము భూపాతము పరిదేవితము భూమిపై పొర్లాడుట భుజముల వివర్తనము శ్వాసోచ్ఛ్వాసములు దేహము

బాదుకొనుట పడుట వక్షస్తాడనము అనుభావములుగా నుండును. మోహము విషాదము నిర్వేదము చింత ఔత్సుక్యము దీనత జడత వ్యాధి ఉన్మాదము అపస్మారము ఆలస్యము మరణము వ్యభిచారిభావములుగా నుండును. స్తంభము కంపము అశ్రువు వైవర్ణ్యము స్వరభంగము మొదలగునవి సాత్త్వికము లనుభావములు. అనుభావములు దీప్యమానను లగుచో మాటి మాటికి ప్రవర్తమానము లగుచో దీపనము లగును. స్త్రీ నీచాదులలో నీ శోకము మరణ ప్రయత్నము కూర్చును. మధ్యములకు శోకము గలుగు నేని ముమూర్ష చనిపోవలె ననెడి కోరిక కలుగును. మరణ మేని కలుగును. ఉత్తముల శోక మతి ప్రౌఢముగా నుండును. వారి దది వివేకమున శమించును. శోకము కలయుత్తములకు పరుల నాశ్రయించుట వ్యసనప్రదము.

## జుగుప్సోచితవిభావాదులు

బీభత్సః స్యాజ్జుగుప్సాత్మా క్షోభోద్వేగ విభాగభాక్. 102

క్షోభాత్మా రుధిరాంత్రాది దర్శన స్పర్శనాదిజః
ఉద్వేగాత్మా కృమి చ్ఛర్ది పూతి విష్ఠాదిజో భవేత్. 103

ద్వేషో గ్లానిర్భయం మోహః క్రోధో నిద్రా భ్రమో మతిః
వక్ష్యంతే హ్యనుభావాశ్చ నాసాప్రచ్ఛాదనాదయః. 104

పురైవ కథితా హ్యస్య సంభావ్యా వ్యభిచారిణః

జుగుప్స బీభత్సరసమునకు స్థాయిభావము. ఇది క్షోభాత్మకము ఉద్వేగాత్మకము నని రెండువిధముల నున్నది. రక్తము ప్రేవులు మొదలగు వాని దర్శన స్పర్శనాదుల వలన క్షోభాత్మక మగు బీభత్సము కలుగును. ఉద్వేగాత్మక మగు బీభత్సము పురుగులు కక్కు దుర్గంధము పెంట మొదలగు వాని వలన గలుగును. ద్వేషము గ్లాని భయము మోహము క్రోధము నిద్ర భ్రమము మతి యనునవి వ్యభిచారి భావములు. ముక్కు మూసికొనుట మొదలగునవి యనుభావములు. ఇవి మఱల నిరూపితములు కా గలవు. ఇందు సంభవించు వ్యభిచారిభావములు పూర్వము నిరూపితము లయినవి.

## భయోచిత విభావాదులు

భయానకో భయస్థాయీ స్వభావకృతకాత్మకః 105

వికృతైశ్చ రవైః సత్త్వై ర్వికృతాకార దర్శనైః
శూన్యారణ్యాదిగమనైః సంగ్రామాది ప్రవేశనైః. 106

గురురాజాపరాధైశ్చవిభావై రేవ మాదిభిః
అనుభావాస్తు వక్ష్యంతే వాఙ్మనఃకాయ భేదతః. 107

ఉక్తానుక్తానభిజ్ఞత్వ దిఙ్మోహాద్యా యథార్థతః
ఏవం రసాః సానుభావవిభావాః సమ్యగీరితాః. 108

భయము భయానకమున స్థాయి. ఇది స్వభావాత్మకము కృతకము నని రెండు విధములు. వికృతము అగు ధ్వనులు వికృతాకారము కల క్రూర మృగములు శూన్యారణ్యాదిగమనము సంగ్రామాదిప్రవేశనము గురురాజాపరాధములు ఇట్టివి యిందు విభావములు. అనుభావములు వాఙ్మనఃకాయ భేదమున నుండు నని నిరూపితము కా గలదు. ఉక్తానుక్తానభిజ్ఞత దిఙ్మోహము మొద లగు నవి యిందు తగిన యనుభావములు. ఇప్పటి కీ విధముగా విభావానుభావ సహితము లయిన రసములు నిరూపితము లయినవి.

ఇక వాచికాదిభేదమున నా యా రసములు వేరు వేరుగా నుండుట నిరూపితము కా గలదు.

శృంగారో వాచికః కశ్చినైపథ్యాత్మా చ కశ్చన
క్రియాత్మా కశ్చిదిత్యేవం శృంగారస్త్రివిధః స్మృతః. 109

హాస్యోఽపి త్రిప్రకారః స్యాత్ వాఙ్నైపథ్యాంగభేదతః
వీరో యుద్ధ దయా దాన భేదేన త్రివిధో మతః. 110

అద్భుతం త్రిప్రకారం స్యా న్మానసాంగిక వాచికైః
అంగనైపథ్య వాగ్భేదా త్త్రివిధో రౌద్ర ఉచ్యతే. 111

కరుణోఽపి త్రిధా భిన్నో మనోవాగంగకర్మభిః
రుధిరాదిక్షోభజన్మా విష్ఠాద్యుద్వేగజోఽపరః. 112

ఇతి ద్వేధా సమాఖ్యాతో బీభత్సో రసకోవిదైః
మానసో వాచికశ్చేతి ద్విధా భిన్నో భయానకః. 113

భయానకః సబీభత్సస్త్రిధా వాక్కాయమానసైః
స్వాభావికో మానసః స్యా దాంగికః కృతకో భవేత్. 114

వాచికశృంగారము నైపథ్యశృంగారము క్రియాశృంగారము నని శృంగారము మూడువిధములు. వాచికహాస్యము నైపథ్యహాస్యము ఆంగిక హాస్యము నని హాస్యము త్రిప్రకారము. యుద్ధవీరము దయావీరము దానవీరము నని వీరము త్రివిధము. మానసాద్భుతము ఆంగికాద్భుతము వాచికాద్భుతము నని అద్భుతము త్రిప్రకారము. రౌద్రము అంగ నైపథ్య వాగ్భేదమున త్రివిధము. కరుణముకూడ మనోవాగంగ కర్మలని త్రివిధము. బీభత్సము ద్వివిధ మని రసకోవిదు లనిరి – రుధిరాది క్షోభ జన్మ, విష్ఠాద్యుద్వేగజన్మ. మానసభయానకము వాచికభయానకమని భయానకము రెండు విధములు. వాక్కాయ మానస భేదముల బీభత్సము మూడు విధములు. మానసికము స్వాభావిక మని ఆంగికము కృతక మని గ్రాహ్యము.

### రసవిభాగహేతువులు

దేశ కాల గుణ ద్రవ్య క్రియా జాత్యాత్మకేషు తు
అనుభూతేషు భావేషు యథావత్త్రితరూపతః. 115
యేన యేన చ భావేన యాదృశో జాయతే రసః
తత్తద్భావాఖ్యయా సద్భిరోబ్ధ్యతే తాదృశో రసః. 116

లోకము నందలి యా యా పదార్థముల యనుభవము పదార్థభేదమున భిన్నభిన్నముగా నుండును. ఆ యా దేశము లందలి కాలములందలి జాతి గుణ క్రియా ద్రవ్య రూపమున నా యా భావపదార్థము లుండును గావున భావకులు వానిని తత్తద్భేదముననె యనుభవింతురు. భావపదార్థము ల ట్లనుభూతములు కాగా తత్తద్రూపముననె యవి భావ్యమానము లగును. ఏ యే భావమున నెట్టి యెట్టి యాస్వాదము కలుగునో ఆ యా భావముననె యా రసము వ్యపదేశము పొందును.

### శృంగారభేదలక్షణము

భావగర్భం రహః సంవిన్మధురం నర్మపేశలం
సువృత్తం శ్రవణానంది శృంగారో శృంగారో వాచికో మతః. 117
వాసోఽంగరాగ భూషాభి ర్మాల్యై ర్వ్యక్తం ప్రసాధితం
ప్రాప్తయౌవనమంగం యచ్ఛృంగారః స్యాత్స ఆంగికః. 118

దంతచ్ఛేద్యం నఖచ్ఛేద్యం మణితం చ ససీత్కృతం
చుంబనం చూషణం భావో హేలాదిః కేలియోఽపి చ. 119

శయనాద్యుపచారశ్చ తథా సంగీతక్రియా
ఇత్యాదిభావైః కథితః శృంగారః స్యాత్క్రియాత్మకః. 120

శృంగారము నందలి వాచికాదిభేదముల లక్షణ మిం దున్నది. వాచిక శృంగారము భావగర్భము రహస్యసంవిన్మధురము = ప్రేయసీ ప్రియులు రహస్యముగా హృదయమున దాచి యుంచిన భావసంవేదనముల నీ సమయమున స్పష్టము చేయుదురు గావున నట్టి సంవేదన మింపు మధురముగా నుండును. ఇది నర్మపేశలము. నర్మ శృంగారాత్మక మగున కర్మ. దానిచే నిది మనోహరము. మంచివృత్తములతో నుండును. కావ్యము నందలి శృంగారసూచకము లయిన శ్లోకములు-పద్యములు శృంగారోచితము లయిన వృత్తములతో నుండును. ఇంకను వినుట కింపు గూర్చును. ఇట్టిది వాచిక శృంగారము. ఆంగిక శృంగార మీ విధముగా నుండును. మంచివస్త్రము అంగరాగము ఆభరణములు పుష్పమాలలు మొదలగు వానితో నలంకృతమై యౌవన సంపదతో నుండు దేహ మాంగిక శృంగారయుత మని భావింప వలెను. క్రియాశృంగార మీ విధముగ నుండు నని యనిరి. దంతచ్ఛేద్యములు నఖక్షతములు మణిత ధ్వనులు సీత్కారములు చుంబనములు చూషణములు = ఆస్వాదము-పీల్చుట భావ హావ హేలాదులు కేలీ విలాసములు శయనాద్యుపచారములు సంగీతక్రియలు మొదలగు వానితో నుండుట క్రియాశృంగారము.

## హాస్యభేదలక్షణము

యద్యత్ప్రహసనం వాక్యం స హాస్యో వాచికః స్మృతః
విపర్యయేణ నిక్షేపో మాల్యాభరణవాససామ్. 121

యః సనై పథ్యజో హాస్య ఇతి నిర్ణీయతే బుధైః
వికటాభినయత్వం యదంగానా మవలోక్యతే. 122

స్వభావాద్వాఽథ కపటాత్స హాస్యస్త్వాంగికో భవేత్

హాసముదయింప జేయు వాక్యము వాచికహాస్యము. మాల్యా మాభరణము వస్త్రము మొదలగు వానిని విపర్యయముగా వ్యత్యస్తముగా ధరించుట నైపథ్యజన్య మయిన హాస్యము. స్వభావమున గాని కపటమున గాని యంగములకు వికటాభినయ ముండుట యాంగికహాస్య మని బుధులు నిర్ణయించిరి.

## వీరభేదలక్షణము

నిరాయుధస్యాప్యేకస్య హీనస్యాపి పరిచ్ఛదైః. 123

అభీతిర్బహుభిర్యోద్ధుం వ్యవసాయో రణే మదః
హర్షః శస్త్రాస్త్రఘాతేషు సమరాదపలాయనమ్. 124

భీతాభయప్రదానం చ ప్రపన్నస్యార్తిభంజనం
ఏవం యుద్ధాత్మకో వీరః తత్‌జ్ఞైః కవిభిరీరితః. 125

అర్థినామీప్సితాదర్థాత్ప్రదానాయైభ్యోఽధికం బహు
అర్థినః పునరాయాతాన్ స్వజనానితరానపి. 126

యన్మానయతి దానేన వాక్యేన్మధురేణ చ
ఏతద్దానాత్మకో వీరః కథ్యతే దానశీలిభిః. 127

వ్యాధిదారిద్ర్యశస్త్రాస్త్ర క్షుత్పిపాసాది పీడితాన్
అనుగృహ్ణాతి యః ప్రీత్యా స వీరః స్యాద్దయాత్మకః. 128

యుద్ధము నందు తా నొక్క డయినను నిరాయుధు డయినను యుద్ధోచిత పరికరములు సరిగా లేని వా డయినను అనేకులతో యుద్ధ మొనరించుటకు భయము లేని వా డగుట, యుద్ధనిశ్చయమున నహంభావముతో నుండుట, శస్త్రాస్త్రఘాతములు కలిగినను హర్షముతో నుండుట, యుద్ధము నుండి పలాయన మొనర్పకుండుట, భీతుల కభయ మిచ్చు వా డగుట, శరణు పొందిన వారి యార్తి పోగొట్టు వా డగుట యుద్ధాత్మక మగు వీర మగు నని తద్విదు లయిన కవు లందురు. దానవీర మీ విధమున నుండును. యాచకుల కభీప్సితార్థమున కన్న నధికముగా నిచ్చియు మఱలవచ్చిన యాచకులను స్వజనుల నితరులను గౌరవించుట దానవీర లక్షణము. గౌరవించుట యనునది దానమున మధురవచనమున నుండును. స్వజనుల నితరాభిజ్ఞులను మధురవచనమున గౌరవించు నట్లు యాచకులను దానమిచ్చియు నట్లె గౌరవించును. ఇది దానవీర మని దానశీలుర భావము. దయావీర మి ట్లుండును. వ్యాధి దారిద్ర్యము శస్త్రమస్త్రము ఆకలిదప్పిక మొదలగువానిచే పీడితు లయిన వారిని ప్రీతితో ననుగ్రహించుట దయాత్మకమయిన వీరము. వీని యన్నిట నుత్సాహమనుగతము.

### అద్భుతభేదలక్షణము

ధ్యానం నయనవిస్తారః ప్రసాదో వదనే దృశోః
ఆనందాశ్రు సరోమాంచ మనిమేషావలోకనమ్. 129

అనిశ్చలత్వం మనసో యస్మిన్ స్థిత్యా స్థితోఽద్భుతః
చేలాంగులీనాం భ్రమణ ముత్థానోత్థాయ కల్పనా. 130

దానప్రబంధో నటన మాశ్లేషస్స పరస్పరం
పరస్పరస్య భుజయోః పరస్పర కరాహతిః 131

ఏవమాదివికారో యః స భవేదాంగికోఽద్భుతః
హాహాకారః సాధువాదః కపోలాస్ఫాలన ధ్వనిః. 132

ఉచ్చైర్హాసో హర్షఘోషా గీతముచ్చావచం వచః
ఏవమాదివికారో యః స భవేద్వాచికోఽద్భుతః. 133

మానసాద్భుత మీ విధముగా నుండును. ధ్యానము నేత్రములు విప్పారుట వదనమున దృక్కు లందును ప్రసన్నత ఆనందబాష్పము రోమాంచ ముండుట నిర్నిమేషావలోకనము మన స్సనిశ్చలముగా నుండుట మానసాద్భుత విశేషములు. అంగికాద్భుతములో పైట కొంగు త్రిప్పుట, వ్రేళులు త్రిప్పుట, లేచి లేచి యెగురుట, దానము చేయుట, నటనము పరస్పర మాశ్లేషము భుజ ముల యాస్ఫాలనము, పరస్పరము కరతలాహతి మొదలగు వికారము లాంగిక మయిన యద్భుతమునకు సంబంధించిన కార్యములు. వాచికాద్భుతమున హా హా కారము సాధువాదము కపోలాస్ఫాలన ధ్వని పెద్దగా నవ్వుట హర్షఘోష ములు గీతము ఉచ్చావచ వచనము మొదలగు నవి యుండును. ఇట్టి వికారము లుండుట వాచికాద్భుతము.

### రౌద్రభేదలక్షణము

శిరోభిర్బహుభిః స్థూలైః కేశైరుద్ధూత పింగలైః
బాహుభిః హ్రస్వదీర్ఘైశ్చ బహుశస్త్రాస్త్రధారిభిః. 134

ఉద్వృత్త రక్తనయనై ర్మహాకాయై స్సితేతరైః
ఏవంప్రకారో రౌద్రోఽయ మాంగికః కథ్యతే బుధైః. 135

కృష్ణరక్తాని వాసాంసి కృష్ణరక్తానులేపనం
కృష్ణరక్తాని మాల్యాని కృష్ణం రక్తం చ భూషణమ్. 136

ఏవం నైపథ్యజో రౌద్ర ఇతి విద్వద్భిరుచ్యతే
ఛింధి భింధి బధానైనం ఖాద మారయ తాడయ. 137
పిబామి రుధిరం తేఽద్య పినష్మి త్వాది యద్వచః
ఏతత్తు వాచికో రౌద్ర ఇతి నాట్యవిదీరితః. 138

ఆంగికరౌద్రము బహుసంఖ్యాకము లయిన శిరములు, ఉద్ధూతములు (రేగినవి) పింగలము లయిన స్థూలకేశములు, హ్రస్వములు దీర్ఘములు నయిన బాహువులు, నానాశస్త్రాస్త్రములను ధరించిన వ్యక్తులు, ఉద్వృత్తములు నెఱ్ఱగా నున్న నేత్రములు నల్లగా నున్న మహాదేహములు నుండుట ఆంగిక రౌద్ర మని బుధు లనిరి. నైపథ్యజన్య మయిన రౌద్ర మిట్లుండును. కృష్ణ రక్తము లయిన వస్త్రములు కృష్ణరక్తవర్ణముతో నున్న యనులేపనములు, కృష్ణ రక్తము లగు మాల్యములు, కృష్ణరక్తము లగు భూషణములు నుండుట నైపథ్యజ మయిన రౌద్ర మని బుధు లనిరి. వాచికరౌద్రములో 'భింధి ఛింధి బధాన ఖాద మారయ తాడయ పిబామి' భేదింపుము ఛేదింపుము కట్టుము తినుము చంపుము కొట్టుము ఖండింపుము దండింపుము వీని రక్తము త్రావెదను నూరెదను అరుగదీయుదును మొదలగు వాక్యములు వాచిక రౌద్ర మని నాట్యవిదు లనిరి.

## కరుణభేద లక్షణము

వాక్యార్థా ననుసంధానం నిశ్వాసోచ్ఛ్వాసదీర్ఘతా
ఉపేక్షా కేశవాసోఽంగసంస్కారాదిషు దీనతా. 139

అనుభూతానభిజ్ఞత్వ మనవస్థిత చిత్తతా
విరక్తిః సర్వవిషయా స్నిగ్ధే ష్వనభిషంగతా. 140

ఆకాశవీక్షణం చేతి మానసః కరుణః స్మృతః
హాకారో రోదనం క్రోశః ప్రలాపో దీర్ఘభాషణమ్. 141

దూరాహ్వాన మథాక్రందో వాచికః కరుణః స్మృతః

కరుణము మానసికము వాచికము అని రెండువిధములు. మానసికము కేశసంస్కారమున గాని వస్త్రధారణమున గాని అంగసంస్కారమున గాని ఈ మొదలగు వానిలో ఉపేక్ష యుండును. నిత్యము దైన్య ముండును. అనుభవించిన వాని గూడ తెలియమి యుండును. చిత్త మనవస్థితముగా నుండును. సర్వవిషయము లందును విరక్తి యుండును. స్నిగ్ధు లందును సంబంధము లే నట్లుం

డును. ఆకాశవీక్షణ మొండును. ఇవి యన్నియు మానసికము లగును. వాచికకరుణములో హా హా కారము రోదనము ఆక్రోశనము ప్రలాపము దీర్ఘభాషణము దూరాహ్వానము ఆక్రందనము నుండును.

## బీభత్సభేదలక్షణము

రుధిరాదిషు దృష్టేషు మనః క్షుభ్యతి చంచలమ్. 142

అతో హి మానసః సద్భిః బీభత్సః క్షోభణః స్మృతః
బిభేతి గ్లాయతి ద్వేష్టి ముహుర్ముహ్యతి బుధ్యతి. 143

క్రందత్యపక్రామతి చ విషీదతి చ నిందతి
దయతే భ్రామ్యతి త్రస్యత్యాస్తే తూష్ణీం చ గూహతే. 144

యత్తతో మానసః క్షోభజన్మా బీభత్స ఉచ్యతే
ఉద్వేగజో యో బీభత్సః స త్వాంగిక ఉదాహృతః. 145

వస్త్రావకుంఠనం నాసాచ్ఛాదనం నేత్రకూణనం
అస్పృష్టపాదపతన మపవర్తిత వక్రతా. 146

ద్రుతపాదాగ్రగమనం ష్ఠీవనం చ ముహుర్ముహుః
ఏవ మాంగిక ఉద్వేగజన్మా బీభత్స ఉచ్యతే. 147

మానసబీభత్సము క్షోభణాత్మక మని ప్రసిద్ధి యున్నది. రక్తమాంసాదులను జూడగా మనస్సు చంచలమై క్షోభయుక్త మగును. కావున బీభత్సము క్షోభణము. క్షోభజన్య మయిన మానసబీభత్స మి ట్లుండును. భయపడుట గ్లాని పొందుట ద్వేషపడుట ముహుర్ముహుః మోహపడుట తెలివి పొందుట ఆక్రందన మొనరించుట తొలగి పోవుట విషాద పడుట నిందించుట దయ పడుట భ్రమించుట త్రాస పడుట ఊర కుండుట దాగుట ఇత్యాదు లిం దుండును. ఉద్వేగజన్య మయిన బీభత్స మాంగికముగా నుండును. వస్త్రావగుంఠనము నాసాచ్ఛాదనము నేత్రకూణనము అస్పృష్టముగా పాదములపై పడుట అపవర్తనమున వక్రముగా నుండుట ద్రుతపాదాగ్రగమనము ముహుర్ముహుః ఉమ్మివేయుట ఇది యాంగిక మయిన ఉద్వేగజ బీభత్సము.

## భయానక భేదలక్షణము

దిఙ్మోహః కాందిశీకత్వం సహాయాన్వేషణం ముహుః

పార్శ్వయోర్వీక్షణం పాణిపాదయోరపి కంపనం. 148

దంశోఽంగులీనా మభయయాచనం దంతదర్శనం

ఏతైర్భయానక స్తజ్జ్ఞైః కథితస్త్వాంగికాత్మనా. 149

ఊరుస్తంభశ్చ హృత్కంపః స్వేదో దృక్చలతారకా

శుష్కోష్ఠతాఽఽస్యశోషశ్చ గద్గదత్వం వివర్ణతా. 150

విషయస్యాపరిచ్ఛిత్తి రుక్తానుక్తానభిజ్ఞతా

ఏతైర్భయానకః స్వాభావికో మానస ఉచ్యతే. 151

భయానక మాంగికము మానసము. ఇచట తదుభయ లక్షణ మున్నది. ఆంగికాత్మక మయిన భయానక మీ విధముగా నుండు నని తద్విదు లనిరి. దిఙ్మోహము కాందిశీకత మఱల మఱల సహాయాన్వేషణము పార్శ్వభాగముల జూచుట కరపాదముల కంపనము వ్రేళులు కొఱికి కొనుట అభయయాచనము దంతదర్శనము నను నవి యాంగికములు. ఉరుస్తంభము హృదయకంపనము స్వేదము గ్రుడ్లు తిరుగుదృష్టి పెదవి యారుట ముఖ మెండుట గాద్గద్యము వైవర్ణ్యము విషయము గుర్తింపక పోవుట ఉక్తానుక్తానభిజ్ఞత అనువానిచే మానస మయిన స్వాభావిక భయానకము గుర్తింప వచ్చును. ఇట్లు రసముల విశేషములు లక్షణములు నిర్ణీతము లయినవి.

## అధిదేవతలు

ఏవం రసవికల్పాశ్చ కథితాః స్వ స్వరూపతః

అధిదైవత మేతేషాం భరతాదిభి రుచ్యతే. 152

రసములకు సంబంధించిన వికల్పములు స్వ స్వరూపానుసారమున నిరూపితము లయినవి. భరతాదులు రసములకు అధిష్ఠాన దేవతాదులను నిర్ణయించిరి. ప్రస్తుతము రసముల యధిదైవతరీతి నిరూపిత మగును. ఆ యా యధిదైవతముల యుపాసనమున నా యా రస వర్ణనమున తత్తదాస్వాదమున కవులకు సహృదయులకు సామర్థ్యవిశేష ముదయించును. కావున తన్నిరూపణము ప్రకృతము.

శృంగారో విష్ణుదైవత్యో హాస్యః ప్రమథదైవతః

మహేంద్రదైవతో వీర స్త్వద్భుతో బ్రహ్మదైవతః. 153

మహేంద్రాధి దైవతో [illegible]
బీభత్స [illegible] 154

భయానకో [illegible]

శృంగారాదిరసము [illegible] అధిదైవతముల
గుర్తింప వలెను.

1 శృంగారము — [illegible];
3 వీరము — మహేంద్రుడు; [illegible];
5 రౌద్రము — రుద్రుడు; [illegible];
7 బీభత్సము — మహాకాలుడు; [illegible] డు.

ఇట్లా యా [illegible] ఇం దుప
పత్తి నిరూపితము కా వలెను.

అభిరూప్యమధిష్ఠానం శృంగారస్య [illegible] భవేత్. 155

అభిరూపోత్తమో విష్ణుః [illegible]
నికటాభినయత్వం యద్ధాస్యాధిష్ఠాన [illegible]. 156

తదస్తి ప్రమదే యస్మాత్ సోఽయ మస్యాధిదైవం
వీరస్య యదధిష్ఠానం తద్ధైర్యమితి కథ్యతే. 157

ధీరో మహేంద్రో యస్మాత్తు సోఽయ మస్యాధిదైవతం
అద్భుతస్యా ప్యధిష్ఠానం [illegible]. 158

బ్రహ్మణః సేయ మస్తీతి సోఽయ మస్యాధిదైవతం
రౌద్రస్య యదధిష్ఠానం కర్మ రోగ రుజాత్మకమ్. 159

రుద్రస్య చ తదస్తీతి సోఽయ మస్యాధిదైవతం
కరుణస్యా ప్యధిష్ఠానం దయేతి పరిభాష్యతే. 160

పాపం తయా యమయతి యమః సోఽస్యాధిదైవతం
బీభత్సస్యా ప్యధిష్ఠానం మహాకాలోఽసృగాత్మకః. 161

ప్రలయేఽస్య తదస్తీతి సోఽయ మస్యాధిదేవతా
భయానకస్యా ప్యధిష్ఠానం వికృతాకారరూపతా. 162

కాలదేవస్య సంహారకాలేఽస్తీతి స దేవతా

శృంగారమున కాభిరూప్య మధిష్ఠానము. విష్ణు వభిరూపోత్తముడు. కావున విష్ణువు శృంగారమున కధిదేవత. అభినవగుప్తుడు "విష్ణురత్ర కామదేవః" అనెను. వికటాభినయ ముండుట హాస్యమున కధిష్ఠానము. ప్రమథు నం దది యున్నది. కావున హాస్యమునకు ప్రమథు డధి దైవము. వీరమునకు దయ యధిష్ఠానము, మహేంద్రుడు ధీరుడు. కావున వీరాధిదైవము. అద్భుతమునకు నానాశిల్పాత్మక మయిన బుద్ధి. బ్రహ్మ కది కలదు. బ్రహ్మ అద్భుతదైవతము. రౌద్రమునకు రోగరుజాత్మకకర్మ యధిష్ఠానము. రుద్రున కది కలదు. రుద్రుడు రౌద్రాధిదైవము. కరుణాధిష్ఠానము దయ. యముడు దయచే పాపమును నియమింప జేయును. యముడు కరుణాధిదైవము. బీభత్సమున కసృగాత్మకు డయిన మహాకాలు డధిష్ఠానము. ప్రళయసమయమున మహాకాలు డట్టివాడు. కావున నతడధిదైవము. భయానకమునకు వికృతాకారరూపత యధిష్ఠానము. సంహార కాలమున కాలదేవున కది యున్నది. కావున భయానకమునకు కాలదేవు డధిదైవతము.

## వర్ణములు

శ్యామః శ్వేతశ్చ గౌరశ్చ పీతో రక్తశ్చ పంచమః. 163
కపోతశ్చైవ నీలశ్చ కృష్ణశ్చేతి యథాక్రమం
యథాఽధిదైవతం వర్ణః కథితః పూర్వసూరిభిః. 164

శృంగారాదిరసములకు యథాక్రమముగా నీ శ్యామాది వర్ణము లున్న వని పూర్వపండితులు పలికిరి. దైవత మున్నట్లు వర్ణము కల దనిరి. ఆ యా వర్ణముల సమ్మేళనమున వర్ణాంతర ముదయించును. అదియు విశిష్టముగా సహృదయ మనోహరి. అట్లు రససమ్మేళనమున గూడ సచేతశ్చేతోహారిత్వ మున్నది. ఇచట నీ విశేషము ప్రతిపాదితము కా గలదు.

"శ్యామః శ్వేతశ్చ గౌరశ్చ పీతో రక్తశ్చ పంచమః
కపోతశ్చైవనీలశ్చ కృష్ణశ్చేతి యథాక్రమం"

శృంగారాది రసములకు యథాక్రమముగా శ్యామాదివర్ణము లున్నవి. ఆ యా రసముల యధిదైవతములకు తత్తద్వర్ణము లుండుట ఉపాసనావిశేషము నందలి ప్రతిభాసము. ఆ యా రసముల యభినయములో నటులు నియతవర్ణరంజితులై యుండ వలయుటయు భావనీయము. గ్రహణ సౌకర్యమునకై రస దేవతా వర్ణముల నిట్లు భావింప దగును.

1 శృంగారము—విష్ణువు—శ్యామవర్ణము
2 హాస్యము—ప్రమథ—శ్వేత
3 వీరము—మహేంద్ర—గౌర
4 అద్భుతము—బ్రహ్మ—పీత
5 రౌద్రము—రుద్ర—రక్త
6 కరుణము—యమ—కపోత
7 బీభత్సము—మహాకాల—నీల
8 భయానకము—కాల—కృష్ణ

ప్రధానవర్ణము లేదు. వాని పరస్పరసంబంధమున నెన్నియో వర్ణము లుదయించును. వర్ణముల సమ్మేళనములో నానుకుల్య ప్రాతికూల్యము లున్నవి. రసముల విరుద్ధావిరుద్ధరీతులకు వీనికి గల సంబంధమును రసహృదయులు నిశ్చయించి గ్రహింప దగును. హృదయాష్టదలపద్మ వర్ణరసములకు దేహము నందలి షట్చక్ర వర్ణరీతులకు తన్నిశ్చయము రసోపాసకుల భావనావిశేష నిశ్చయము.

శృంగారాదిరసానాం తు స్వరూపం జన్మనామనీ
తద్వికల్పాశ్చ తద్రూపం తద్దైవం వర్ణకల్పనా. 165

భావానామపి కృత్యం చ తత్స్వరూపం చ నామ చ
సంహితోక్తేన మార్గేణ తథా వాసుకివర్త్మనా. 166

వ్యాసోక్తేనాధ్వనా చైవ నారదాభిహితేన చ
నిర్ణీతాని యథాశాస్త్రం దర్శితాని యథార్థతః. 167

ఈ ప్రఘట్టము నందీ యంశములు శివాగమసంహితా మార్గమున వాసుకినిరూపిత మార్గమున వ్యాసమార్గమున నారదకథితమార్గమున నిర్ణీతము లయినవి. యథాశాస్త్రముగానిర్ణీతము లయినవి. తత్తదర్థానుసారమున నిదర్శితము లయినవి.

శృంగారాదిరసముల స్వరూపము జన్మనామార్థము తద్వికల్పములు రూపము దైవతము వర్ణరచన భావకార్యము భావస్వరూపము భావనామార్థము సర్వమిచట నిదర్శిత మయినది. ఇట్లు భావస్వరూపనిర్ణయము పరిగ్రాహ్యము. ఇప్పటికీ యంశ మీవిధముగా నుపసంహృత మయినది.

## విభావముల గుణానుభావత్వాదులు

రసములకు సంబంధించిన విభావములు ఒక్కొకచో గుణానుభావము లగుటయు కలదు. చతుర్థాధికారమున నిరూపింప దలచిన నాయికా నాయక స్వరూప నిర్ణయమునకు పూర్వాంగములుగా పరిగ్రాహ్యము లగు విషయము లిచట ప్రతిపాదితము లగును.

రసానాం యే విభావాద్యాః తే గుణాః స్యుః కదాచన
అనుభావా అపి క్వాపి సాత్త్వికాశ్చ కదాచన. 168

నాయికా నాయకాదీనాం వ్యాపారా ద్యనురూపతః
గుణా భవంతి కుత్రాపి స్థాయినోఽపి కదాచన. 169

విశేషాస్తేషు యేఽనుక్తా స్తేషాం రూపం ప్రదర్శ్యతే

రసములకు సంబంధించిన విభావాదులు ఒకప్పుడు గుణములు నగును. అట్లే యనుభావములు సాత్త్వికములు నొకప్పు డొకచో నట్లె గుణము లగును. ఒకప్పుడు స్థాయిభావములు కూడ నాయికానాయకాదుల వ్యాపారాద్యాను రూప్యమున నొకప్పుడు గుణము లగును. ఇట్టి విశేషముల నిదివరలో నిరూపింప లేదు. ఇతరులును నిరూపింప లేదు. కావున వాని స్వరూప మిచట ప్రదర్శిత మగును. ఇట్లనుట నీ విశేషములను సహృదయులు సావధానముగా సంభావింప వలెనని భావము.

లఘు విక్రమ కారిత్వం శౌర్య మి త్యభిధీయతే. 170

బుద్ధే ర్వీరూపావసాయో వ్యవసాయ ఇతి స్మృతః
సహసా యత్కృతం కర్మ త త్సాహస ముదీరితమ్. 171

శస్త్రాస్త్రాదిహతస్యాపి పరమాక్రమితుం మనః
ప్రవర్తతే ఫలప్రాప్తేః స పరాక్రమ ఈరితః. 172

ప్రతపంతి యతో ద్వేష్యాః స ప్రతాప ఇహోచ్యతే
ప్రౌఢిః ప్రవృత్తిః సోత్సాహా ప్రారబ్ధస్యాఫలోదయాత్. 173

కృతిర్యా రమయత్యేవ విశ్వం సా కీర్తి రుచ్యతే
కులక్రమాగతా సా చేత్కీర్తినామ్నా ప్రకాశ్యతే. 174

స్వాపదానప్రసృతా చే ద్యశ ఇత్యభిధీయతే

యతో విశ్వస్య శమితి తస్మా ద్యశ ఇతీరితమ్. 175

వినయో లోకమర్యాదా శాస్త్రార్థానతిలంఘనం
దండనీతే రనుష్ఠానం నయ ఇత్యభిధీయతే. 176

అనియుక్తా అపి స్వే స్వే కృత్యే యత్సన్నిధౌ ప్రజాః
ప్రభుత్వం తదితి ప్రోక్తమాజ్ఞా సైవ భయాత్మికా 177

వీర్యం విచిత్రమవ్యగ్రా ప్రవృత్తి ర్యుద్ధకర్మణి
శుండారవద్బలం యస్య దోష్ణోః శౌండః స కథ్యతే. 178

శౌండాన్యతః ప్రేరయతి తచ్ఛౌండీర్య ముదాహృతం
ప్రకర్ష భావగా జంతోః ప్రభావోఽభీష్టదానతః. 179

భావాః పరోపకారార్థా లక్ష్యంతే యత్ర సర్వథా
స చానుభావ ఇత్యుక్తో యేభ్యః స్పృహయతే జనః. 180

సత్త్వం జవ బల ప్రాణ కాయ బుద్ధిషు వర్తతే
స మహాసత్త్వ ఇత్యుక్తో ధీరపర్యాయనామకః. 181

ఇత్యాకృత్యా నియమితాః స్థైర్యం సర్వే రఘేద్యతా
ఏతే గుణాశ్చ వీరస్య విభావా ఏత ఏవహి. 182

రసవిభావములకు గుణాత్మక మయిన సంబంధ ముండుట యిచట నిరూపితము. ఈ ప్రఘట్టమున శౌర్య - వ్యవసాయ — సాహస — పరాక్రమ — ప్రతాప— ప్రౌఢి—కీర్తి — యశో — వినయ — నయ —ప్రభుత్వ —ఆజ్ఞా— శౌండ—శౌండీర్య—ప్రభావ—అనుభావ—మహాసత్త్వ—స్థైర్యము లను వీరరస విభావరూపము లగు పదునెనిమిది భావములకు గుణరూపత యున్నది.

వేగముగా విక్రమించుట శౌర్యము. బుద్ధికి విరూపావసాయమును వ్యవసాయ మందురు. సహసా—వెంటనే చేయు కర్మ సాహసము. శస్త్రాస్త్రహతు డయినను ఫలప్రాప్తికై పరుని ఆక్రమించుటకు మనసు ప్రవర్తించు నేని పరాక్రమ మగును. శత్రువులు ప్రతపనము పొందిన ప్రతాప మగును. ఫలము కలుగు వఱకు సోత్సాహముగా ప్రారంభించిన కార్యమున ప్రవృత్తి ప్రౌఢి. విశ్వమును రమింప జేయు కృతికి కీర్తి యని పేరు. తన విశిష్ట కర్మలచే గలుగునది యశము. "యతో విశ్వస్య శం ఇతి యశః" దేని వలన విశ్వమునకు శం—

సుఖము కలుగునో యది యశము. లోకమర్యాదను శాస్త్రార్థమును లంఘింపక పోవుట వినయము. దండనీతి ననుష్ఠించుట నయము. నియుక్తులు కాకున్నను ఎవని సన్నిధిలో ప్రజలు తమ తమ కర్మ యందు ప్రవర్తింతురో యది ప్రభుత్వము. భయాత్మక మయిన యట్టి ప్రవృత్తి యాజ్ఞ యగును. యుద్ధకర్మలో నవ్యగ్ర మగు విచిత్రప్రవృత్తి వీర్యము. భుజములకు శుండములకు వలె బల మున్నచో శౌండము. శౌండులను ప్రేరణమొనరించుట శౌండీర్యము. అభీష్టప్రదానమున ప్రాణికి కలుగు ప్రకర్ష భావనము ప్రభావము. భావము లన్నియు పరోపకారార్థ ముగా నున్నట్లు లక్షిత మగునేని యనుభావ మగును. ఇట్టివిధానమును జనులు కాంక్షింతురు. సత్త్వము జవ-బల-ప్రాణ-కాయ-బుద్ధులలో నుండునేని మహా సత్త్వ మందురు. ధీరమహాసత్త్వపదములు పర్యాయపములు. ఇట్లే నిర్వచనము లన్నియు నా యా పదముల యాకృతిచే నియమితము లయినవి. ఎవరును భేదింప జాలక పోవుట స్థైర్యము. ఇవి యన్నియు గుణములు. ఇవియే వీరవిభావములుగా నున్నవి.

రౌద్రస్య కరుణస్యాపి యే విభావాదయోఽభవన్
తదాలంబనభూతానాం కథ్యంతే తే గుణాత్మకాః. 183

రౌద్రమునకు కరుణమునకు సంబంధించిన విభావాదులు వాని కాలం బన మయిన వానికి గుణాత్మకములుగా నుండును. రౌద్రమునకు సంబంధించిన యవజ్ఞానృతాదులు కరుణమునకు సంబంధించిన విలాప పరిదేవితాదులు తదాలంబన భూతములకు గుణము లగుట నిరూపిత మగును.

యస్మిన్నర్థే చ యద్వాక్య మర్థానంస్పర్శి తత్త్వతః
అనృతత్వం తత్ అథవా తదర్థస్య విపర్యయః. 184

అవజ్ఞా సా ప్రకృష్టస్య యత్తథాఽజ్ఞాయమానతా
అవజ్ఞా మానసీ జ్యేష్ఠే న్యక్కారో వాక్తిరస్కృతిః. 185

వాచికీ గుణనిందా స్యాత్ శారీరీ తాడనాత్మికా
ప్రకృష్టయో ర్ద్వయో రేకమానేనైవావమానితా. 186

మృషైవ దోషమారోప్య క్రోశ ఆక్రోశ ఉచ్యతే
అసూయాదిభి రన్యోన్యం క్షేప ఆక్షేప ఉచ్యతే. 187

రౌద్రరసమున విభావానుభావములు అయిన అనృత-అవజ్ఞ— అవమానిత - ఆక్రోశ—ఆక్షేపములు గుణభావములు అగుచు యిచట నున్నది. ఒక యర్థమున నొకవాక్యము ప్రసిద్ధముగా నుండగా నా వాక్య మర్థాసంస్పర్శిగా నున్నచో నర్థానుబంధము లేక పోయినచో ననృతత్వ మగును. ప్రసిద్ధ మగు నర్థమునకు విపర్యయ మున్నను అనృతత్వమె యగును. గొప్పవాని నట్లు గుర్తింపక పోవుట అజ్ఞాయమానత అవజ్ఞ యగును. ఉత్తముని యందీ యవజ్ఞ మానసికముగ నుండును. అది న్యక్కారము-అవమానముగ నుండును. తిరస్కారముగ నుండును. వాచిక మయిన యవజ్ఞ యయినచో గుణసంహారాత్మకముగ నుండును. శారీరక మయినచో తాడనాత్మకముగ నుండును. ఇట్లవజ్ఞ మూడు విధములు అని నట్లయినది. ప్రముఖులగు నిద్దరకు సమాన మగు నొకే విధ మగు సమ్మాన మొనరించుట యవమానిత యగును. అసత్యరూపముగ దోష మారోపించి యెలుగెత్తుట యాక్రోశ మగును. ఒకరి నొకరు అసూయాదులచే క్షేప మొనరించుట యాక్షేప మగును.

క్రోధ స్త్రిధా భవేత్తోత్కృధ కోప రోష విభాగతః
శత్రు మిత్ర ప్రియా భృత్య పూజ్యాదిష్వేవ పంచధా. 188

కుటిలాం భ్రుకుటిం ధత్తే జిహ్వయా లేఢి సృక్విణీ
ముహు ర్ముహు ర్దశత్యోష్ఠం దంతా న్కటకటాపయన్. 189

శస్త్రాణ్యుద్వీక్షతే రూక్షం దృష్టశ్చోద్వీక్షతే భుజౌ
న తిష్ఠతి న చైవాస్తే విధత్తే కంఠగర్జితమ్. 190

ఏవం హి వర్తతే ప్రాయో జాతక్రోధస్తు శత్రుషు
వ్రీడాఽవనమ్రవదనః సజలబాష్పః శ్వస న్ముహుః. 191

తూష్ణీం ధ్యాయతి నిశ్చేష్టః శేతే మిత్రక్రుధా రహః
రోషరజ్యత్కటాక్షశ్చ స్ఫురితాధరపల్లవః. 192

స్ఫురద్భ్రుకుటి రల్పాంగవికృతిః స్యాత్ప్రియాక్రుధి
శిరఃకంపాక్షివిక్షేప భర్త్సనాంగులితర్జనైః. 193

క్రోధోఽభినేయో భృత్యేషు వీక్షణైశ్చ ముహు ర్ముహుః
వినమ్రవదనః స్వేదస్నపితో గద్గదస్వనః. 194

అనుత్తరోఽవదన్కించి త్పూజ్యే క్రుద్ధో విభావ్యతే

ఇచట క్రోధము త్రివిధముగా నిరూపిత మగును. అది మఱల నయిదు విధము లగుటయు ప్రతిపాదిత మగును. క్రోధము కోపము రోషము నని క్రోధము మూడు విధములు. ఇదియె శత్రు - మిత్ర - ప్రియా - భృత్య - పూజ్యాదుల విషయమున నున్నదై యయిదు విధము లగును. శత్రువు లందు క్రోధము కలిగినచో సామాన్యముగా నిట్లుండుట కలదు. కుటిల భ్రుకుటి ధరించును. భ్రుకుటి కుటిల మొనరించు నని భావము. సృక్వభాగములను నాలుకతో నాకును. మాటి మాటికి పెదవిని దంతములతో పట్టును. దంతములను కట కట పట పట మని పించును. తీక్ష్ణముగా నాయుధములను జూచును. గర్వించి భుజ ములను జూచు కొనును. ఒకచో నిలకడగా నుండడు. నిలబడియుండడు. కంఠగర్జిత మొనరించును. సింహనాద మొనరించును. మిత్రు లందు క్రోధము కలిగినచో నీ విధముగా నుండును. వ్రీడాభరమున వినమ్రవదను డగును. కన్నీరు పెట్టును. నిశ్వసించును. ఊరకనే ధ్యానించును. ధ్యానమున లక్ష్య ముండదు. నిశ్చేష్టుడుగా నుండును. శయనించును. ప్రియపై క్రోధము గలినచో నిట్లుండును. రోషమున కన్నుల నెఱ్ఱగా జేయును. అధరము స్ఫురిత మొనరించును. భ్రుకుటి స్ఫురణము కల వా డగును. అల్పముగా నంగవికారము పొందును. భృత్యక్రోధము కలిగినచో నిట్లుండును. శిరఃకంపము అక్షివిక్షేపము భర్త్సనము వ్రేలితో బెదిరిం చుటలు కూడి యుండును. ముహుర్ముహు రీక్షణము లుండును. ఇట్టి విధాన ములతో భృత్యకోప మభినయింప వలెను. పూజ్యు నందు క్రోధము నీ విధముగా భావింప వలెను. వినమ్రవదను డగుట స్వేదమున స్నపితు డగుట గద్గదస్వరము కలవా డగుట అనుత్తరుడై యేమియు పలుక కుండుట మొదలగునవి పూజ్య క్రోధ సూచకములు.

అష్టావవస్థాః క్రుద్ధానాం కథ్యంతేఽత్ర మనీషిభిః. 195

ప్రథమా నిందతి గుణాన్ ద్వితీయా పరుషం వదేత్
తన్నాశోప యచింతైవ తృతీయా యా నుదాహృతా. 196

చతుర్థ్యాం హననేచ్ఛా స్యా త్పంచమ్యా మాయుధగ్రహః
షష్ఠ్యాం నిహంతి వేగేన విఘ్నైరపి చ వారితః. 197

సప్తమ్యాం నిహతస్యాస్యస్కాన మాంత్రాపకర్షణం
యావత్ఫలావధిః క్రోధః కైశ్చిద్విఘ్నై రసాధితః. 198

క్రుద్ధః క్రోధస్య కౌటిల్యా త్ప్రాణాం స్త్యజతి కామతః

క్రుద్ధు లయిన వారల కెనిమిది యవస్థ లుండు నని మనీషు లనిరి. గుణములను నిందించుట ప్రథమావస్థ. పరుషవచనభాషణము ద్వితీయావస్థ. శత్రువును నశింపజేయుట కుపాయచింతనము తృతీయావస్థ. హాననేచ్ఛ చతుర్థావస్థ. ఆయుధగ్రహణ మయిదవ యవస్థ. విఘ్నములచే వారణము కలిగినను వేగమున హనన మొనరించుట నారవ యవస్థ. హతుని అసృక్పానము ఆంత్రాకర్షణము సప్తమావస్థ. విఘ్నవిఘాతము లేని ఫలావధికమయిన క్రోధము అష్టమావస్థ. క్రుద్ధుడగు నాతడు క్రోధకాలుష్యము వలన యథేష్టముగా ప్రాణముల నేని పరిత్యజించును.

క్రోధో రౌద్రేషు భూయిష్ఠః కోపో ధీరేషు శస్యతే. 199

స్త్రీపుంసయోర్మిథో రోషః ప్రణయాద్విహి కథ్యతే
క్రోధస్తిష్ఠతి సర్వత్ర క్రుద్ధానా మాఫలోదయాత్. 200

కోపోఽనునాధితస్సద్యో నివర్తేత ఫలోదయాత్
ఉద్దీప్తశ్చేత్ప్రవర్ధేత తత్తదుద్దీపనై ర్ముహుః. 201

రోషః ప్రాయేణ సర్వత్ర శామ్యత్యేవానునాధితః

క్రోధము కోపము రోషము అను వాని రూపము లిచట నున్నవి. రౌద్రము కల వారిలో క్రోధ మధికము ధీరులలో కోపముండుట ప్రసిద్ధము స్త్రీ పురుషులకు ప్రణయారంభముగా రోషము కలుగును. క్రుద్ధులలో క్రోధము ఫల ముదయించు పర్యంత ముండును. బ్రతిమ లాడినచో ప్రార్థించినచో ఫల ముదయింపగనె కోపము నివృత్త మగును. ఆ యా యుద్దీపనములచే నుద్దీప్తమై రోషము మఱల మఱల వృద్ధి పొందును. కాని యంతట అనునాధన మున్నచో ప్రార్థన మున్నచో సామాన్యముగా రోష మంతట శమించును.

ఇక కరుణమునకు సంబంధించిన భావములు గుణము లగుట యిట్లు భావనీయము.

విలాపః స్యాద్గుణాఖ్యానమిళితం రోదనం భవేత్. 202

పరిదేవిత మేతత్స్యాత్ రుదితం యత్సగద్గదం
ఉచ్చైర్రోదనమాక్రందః శోకోత్కర్షే స కథ్యతే. 203

నికృష్టే చ విలాపః స్యాన్మధ్యమే పరిదేవితం

గుణకథనముతో గూడుకొనిన రోదనము విలాపము. గద్గదకంఠమున గుణాఖ్యానముతో రోదన మున్నచో పరిదేవిత మగును. బిగ్గరగా నేడ్చుట యాక్రందనము. ఇది శోకాతిశయమున నుండు నందురు. నికృష్టు నందు విలాప ముండును. మధ్యము నందు పరిదేవిత ముండును.

రుదితం త్రివిధం విద్యా దీర్ష్యానందార్తి భేదతః. 204

స్ఫురదోష్ఠా సనిశ్వాసా సశిరఃకంప వేపథుః
భ్రుకుటీ కుటిలాలోకా భవేదీర్ష్యోత్థరోదనే. 205

ఫుల్లత్కపోలా శిశిరబాష్పరోమాంచనిర్భరా
సగద్గదస్వనా యేన తత్స్యాదానందరోదనమ్. 206

ప్రలాపో భూమిపతనం బాష్పధారావివేష్టనం
హా హే తి భాషణం మందమూర్తిజే రుదితే భవేత్. 207

ప్రాయేణ రుదితం స్త్రీణాం నీచాదౌ క్వాపి వా భవేత్

రుదితము మూడు విధములు. ఈర్ష్యాజన్యము ఆనందజన్యము ఆర్తి జన్యము నని. ఈర్ష్యాజన్య మయిన రోదనమున నీ విశేషము లుండును. ఓష్ఠము చలించును. నిశ్వాసము లుండును. శిరఃకంపము వేపథువు నుండును. భ్రుకుటీకుటిల మయిన విలోకన ముండును. ఆనందరోదన మీ విధమున నుండును. కపోలములు వికసితము లగుట చల్లని బాష్పములు రోమాంచ నిర్భరత గద్గదస్వనము నుండును. ఆర్తిజన్య మయిన రుదితము నందు ప్రలాపము భూమి పతనము బాష్పధారలు దొరలుట మందముగా హా!హా!బాషణము నుండును. సామాన్యముగా స్త్రీలకురోదన మధికము. ఒకచో నీచులకును రోదన ముండును.

రసాలంబనభూతానాం పదార్థానాం తత స్తతః. 208

సాధారణాః స్యుర్యే భావా స్తే కథ్యంతే యథార్థతః

ఆ యా విధముగా రసముల కాలంబనభూతము లయిన పదార్థములకు సాధారణములుగా నుండు భావముల నర్థానుసారమున నిరూపింతుము. ఆ యా రసముల కాలంబనవిభావముగా నుండు వానికి రూప లావణ్యసౌందర్య సౌకుమార్యాదులు సాధారణములుగా నుండును. వాని నామార్థానుసారమున వాని స్వరూప నిర్వచన మొనరించుట ప్రకృతము సముచిత మని భావింప నగును.

రూపరూపము

ఆవేధ్యారోప్య నిక్షేప్య బంధనీయై రభూషితమ్.
యద్భూషితమివాభాతి తద్రూపమితి కథ్యతే 209

ఇందు రూప స్వరూప నిరూపణ మున్నది. భూషణములు నాలుగు విధముల నున్నవి. ఆవేధ్యములు ఆరోప్యములు నిక్షేప్యములు బంధనీయములు నని. ఇట్టిచతుర్విధాభరణములచే భూషితము కాకున్నను భూషితముగా గన్పించుటను రూపము అందురు. "అభూషణేపి రమ్యత్వం" భూషణములు లేకున్నను రమ్యముగా నుండుట రూపము. ఆవేధ్యాదుల స్వరూపము నిరూపితము కాగలదు.

యద్భూషణం రత్నమయం కేవలం హైమమేవ వా. 210
కర్ణస్య కర్ణపాశస్య తదావేధ్య ముదాహృతం
ఇంద్రచ్ఛందాదయో హారా హేమసూత్రాదయోఽపి చ. 211
ఏతే భూషణమారోప్యమితి విద్వద్భిరీరితం
ముక్తామయాః స్వర్ణమయాః శ్రోణీసూత్రాంగదాదయః. 212
గ్రైవేయకాశ్చ కవిభిర్బంధనీయ ముదాహృతం
నిక్షేప్యం నూపురం హస్తాభరణాది నిగద్యతే. 213

ఇందావేధ్యాది భూషణచతుష్టయ లక్షణ మున్నది. ఆభరణములలో రత్నాలంకారములు సువర్ణాలంకారములు కలవు. రత్నములను సువర్ణము అందు కూర్చినచో సువర్ణప్రత్యుప్త రత్నాలంకారము లని మిశ్రాలంకారములు కలవు. కేవలము రత్నమయభూషణము కాని కేవలము హైమభూషణము కాని కర్ణమునకు కర్ణపాశమునకు ఆవేధ్యభూషణ మగును. చెవులు ముక్కులు కుట్టి కూర్చు నాభరణము లావేధ్యములు. ఇంద్రచ్ఛంద మను పేరు గలహారములు హేమసూత్రాదులు ఆరోప్యభూషణములు. దేహమున నివి యారోపింప దగినవి. ముక్తామయములు స్వర్ణమయములు కటిసూత్రము లంగదాదులు కంఠహారములు (సూత్రములు) గ్రైవేయకములు మొదలగు నవి బంధనీయము లగు భూషణములు. దేహమున నా యా స్థలము లందు బంధింప దగినవి. నూపురము హస్తాభరణము మొదలగునవి నిక్షేప్యము లగు భూషణము లని యందురు. దేహమున నుంచ దగినవి.

## లావణ్యాదులు

ప్లవమానమివాభాతి యదంగం కాంతివారిణి
లావణ్యమితి తత్ప్రాహుః పులకం ప్రతిమాదిషు. 214

యాద్రూపం స్వగుణోత్కర్షైః పదార్థమభితః స్థితం
స్వాత్మవత్కురుతే యత్తదాభిరూప్య ముదాహృతమ్. 215

అన్యూనానతిరిక్తం యదంగ ప్రత్యంగ సౌష్ఠవం
సుశ్లిష్ట సంధిబంధం యత్తత్సౌందర్య మితిస్మృతమ్. 216

లావణ్య మాభిరూప్యము సౌందర్య మనువాని స్వరూపలక్షణ మిందున్నది. ఏ యంగము కాంతి జలమునందు ప్లవమానముగ భాసించునో, తరల తరలముగ స్పంద ప్రస్పందములతో నుండునో ప్రతిమాదుల లోని పులకముగా—ఛాయావిశేషముగా స్ఫురించునో యది లావణ్య మన దగును. లావణ్య మిట్టిది. ఆభిరూప్య మీ విధముగ నుండును. ఏ రూపము స్వగుణాతిశయములచే పరిసరముల నున్న పదార్థమును తన వలె ప్రకాశమాన మొనరించునో యది యాభిరూప్య మన దగును. స్వకాంతి ప్రసరమున పరిసరవస్తువులను ప్రకాశింప జేయునది యాభిరూప్య మని భావము. అంగ ప్రత్యంగ సౌష్ఠవ మన్యూనానతిరిక్తముగా సుశ్లిష్టసంధిబంధముగా నున్నచో నది సౌందర్య మగును. దేహము నందలి యవయవముల కూర్పు అధిక మల్పము కాక ఎగుడు దిగుడుగా నుండక సుశ్లిష్టముగా నున్నచో సౌందర్యము. ఈ లక్షణములో అంగ ప్రత్యంగ పదములు కలవు, వాని నిరూపణ మావశ్యకము.

## అంగ ప్రత్యంగ స్వరూపము

అంగం శిరః కటీ వక్షః కుక్షిః పాదావితీరితం
జంఘోరు బాహు గ్రీవాదిః ప్రత్యంగ మితి కథ్యతే. 217

ఉపాంగం నాసికా నేత్ర భ్రూ కపోలాధరాదికం

అంగప్రత్యంగ సాహచర్యమున ఉపాంగస్వరూపము నిందున్నది. శిరస్సు కటి వక్షస్సు కుక్షి పాదములు అంగపదమునను, జంఘ ఊరువు బాహువు గ్రీవ మొదలగునవి ప్రత్యంగ పదమునను, నాసిక నేత్రము భ్రూ కపోలము అధరము మొదలగునవి ఉపాంగపదమునను వ్యవహార్యములు.

నాట్యప్రధానగ్రంథములలోని అంగప్రత్యంగోపాంగముల పరిగణనము విశిష్ట మని యిది సామాన్యాత్మక మని గ్రహింప వలెను.

## సౌకుమార్యము

సౌకుమార్యం త్రిధా భిన్నం జ్యేష్ఠమధ్యాధమక్రమాత్. 218

ప్రసూన పల్లవ స్పర్శాసహం యత్స్యాత్తదుత్తమం
పాణిస్పర్శాద్యసహనం సౌకుమార్యం తు మధ్యమం. 219

శీతాతపాద్యసహనం సౌకుమార్యాధమం భవేత్

సౌకుమార్యము జ్యేష్ఠమధ్యమాధమ భేదమున మూడు విధములు. ప్రసూనస్పర్శను గాని పల్లవస్పర్శమును గాని సహింప జాలనిది యుత్తమ సౌకుమార్యము. హస్తస్పర్శాదులను సహింప లేనిది మధ్యమ సౌకుమార్యము. శీతాతపాదులను సహింప లేనిది అధమ సౌకుమార్యము. సౌకుమార్యప్రసక్తిలో మృదుత్వము నిరూపణార్హము.

## మృదుత్వము

సుఖస్పర్శత్వ మేవాహుః మృదుత్వమితి తద్విదః 220

అన్యేతు స్పృష్టమపి యదస్పృష్టమివ భావ్యతే
తదేవ మార్దవ మితి కథయంతి మనీషిణః. 221

"సుఖస్పర్శ ముండుట మృదుత్వము. కొందరు స్పృష్ట మయిన నస్పృష్టముగ నున్నచో మార్దవ మని యనిరి. మృదోర్భావః మార్దవం"

## ప్రసాదము

త్రిధా ప్రసాదో వదనే దృశోశ్చిత్తే చకథ్యతే
లావణ్యరసనిష్యంది స్మయమాన మివాసకృత్. 222

పులకోల్లాసిగండం యత్ప్రసన్నం వదనం భవేత్
సభ్రూవిలాసలలితం సకటాక్షనిరీక్షణమ్. 223

స్మేరతారం స్వతఃస్నిగ్ధం ప్రసన్నం నయనం భవేత్
కృతజ్ఞతోపకర్తృత్వం భూయో దోషానభిజ్ఞతా. 224

ఏతత్ప్రసన్నచిత్తానాం లక్షణం సముదాహృతం

ప్రసాదము మూడు విధములు - వచనప్రసాదము దృక్ప్రసాదము చిత్తప్రసాదము నని. ప్రసన్నవదనము - వదనప్రసాద మిట్లుండును. లావణ్యారసము ప్రసరించునట్లు నిత్యము స్మయమానముగ నున్నట్లుగా వదన ముండునేని కపోలములు పులకోల్లసితము లగునేని వదనప్రసాదము నిశ్చయింప దగును. భ్రూవిలాసలలితమై కటాక్షనిరీక్షణయుతమై స్మేరతారమై స్వతఃస్నిగ్ధముగా నున్న నయనము ప్రసన్ననయనము. ప్రసన్నచిత్తుల చిత్తము కృతజ్ఞతతో నుండును. ఉపకర్తృభావమున నుండును. దోషానభిజ్ఞముగా నుండును. ఇది ప్రసన్న చిత్తుల లక్షణము.

ఇక ముఖ్య మయిన ముఖరాగము తద్భేదములు రసవినియోగము సూచిత మగును.

## ముఖరాగము

శ్యామో రక్తః ప్రసన్నశ్చ ముఖరాగోఽపి చ త్రిధా. 225

శుష్యత్కాంతి పరిమ్లాన మసృణాధర పల్లవం
మందనిశ్వాస మామీలద్రూక్షతారావలోకితమ్. 226

యేన స్యాద్వదనం శ్యామో ముఖరాగోఽయమీరితః
ప్రస్ఫురత్స్వేదకణికం రోషారుణ విలోచనమ్. 227

రజ్యత్కపోలయుగలం స్ఫూర్జన్నిశ్వసితోష్మలం
ముఖం యత్తత్ర రక్తాఖ్యో ముఖరాగః ప్రకీర్తితః. 228

ఆవిస్మితం స్ఫురత్కాంతి భాషమాణమివాసకృత్
ప్రరూఢరాగం నయనం స్నిగ్ధతారావలోకితమ్. 229

యత్ర తత్ర ప్రసన్నాఖ్యో ముఖరాగ ఉదాహృతః

ముఖరాగము మూడు విధములు. శ్యామము రక్తము ప్రసన్నము నని. శ్యామముఖరాగమున వదన మీవిధముగ నుండును. కాంతి శోషము పొందును. నున్న నయిన యధరపల్లవము పరిమ్లాన మగును. నిశ్వాసము మంద మగును. అవలోకన మామీలనమున నుండును. రూక్షము లయిన తారలతో నుండును. ఇట్లు వదన మున్నచో శ్యామముఖరాగ మందురు. రక్తముఖరాగ

మీ విధమున నుండును. స్వేదకణములు స్ఫురించుట లోచనము రోషారుణ మగుట కపోలయుగలము రాగయుక్త మగుట వేడి నిట్టూర్పులు స్ఫురించుట రక్తముఖరాగ రూపము. ప్రసన్నముఖరాగము నందు నేత్ర మావిస్మితమై కాంతిస్ఫురణము కలదై అసకృత్ మాటలాడు చున్న ట్లుండును. రాగరూఢ మగును. స్నిగ్ధతారావలోకన ముండును. ఇట్లున్నచో నది ప్రసన్నముఖరాగ లక్షణ మగును.

భయానకే సబీభత్సే కరుణే శ్యామ ఇష్యతే. 230

రక్తో రౌద్రే క్వచిద్వీరే వివాదే కైశ్చిదిష్యతే
భవేత్ప్రసన్నః శృంగారే స్వతః సంభోగనామని. 231

అద్భుతే దానవీరే చ ప్రణయానునయాంతరే

శ్యామాదిముఖరాగములకు రసము లందు యుక్త మయిన వినియోగ మిచట నున్నది. భయానక బీభత్స కరుణము లందు శ్యామము రౌద్రమున రక్తము సముచితము. ఒకచో వీరము నందును రక్తవర్ణ మభిమతము. వివాద మున గూడ రక్తరాగమును కొందరనిరి. సంభోగశృంగారము నందు ప్రసన్న ముఖరాగ మభీష్టము. అద్భుతమునందు దానవీరమునందును ప్రసన్న రాగమే. ప్రణయము వలని యనునయాభ్యంతర సమయమునను ప్రసన్నముఖరాగ ముచి తము.

## మానసాదులు

ఈ ప్రసంగముననె కొన్నిటి నిరూపణము సముచితము. అందు ముందు మాననా రూప ముచితము.

ద్రవ్యైః స్వపోష్యపభోగార్హైః సత్క్రియా మాననా మతా. 232

సానురాగం సహర్షం చ సస్మితం చైవ సాదరం
ఉచ్యతే వచనం యత్తద్భాషామాధుర్య ముచ్యతే. 233

దేయస్య చాపరిచ్ఛిత్తిః దత్తస్యైవానభిజ్ఞతా
దదతో హర్షవృత్తిర్యత్స త్యాగ ఇతి కీర్తితః. 234

క్షిణోతి దుఃఖం యేనైవ స క్షణః పరికీర్తితః
ఉద్ధునోతీతి యద్దుఃఖముద్ధవః పరికీర్తితః. 235

ఉత్సూతే హర్ష మిత్యేవ ఉత్సవః పరికీర్తితః
దభ్నోతి భేదయత్యన్యాన్స దంభః పరిపఠ్యతే. 236

సుఖప్రయోగచాతుర్యం కృత్యేష్వాహుస్తు కౌశలం
ద్రవ్య క్రియా గుణాదీనాం హానోపాదాన కర్మసు. 237

సూక్ష్మార్థావాప్తినిరతో ధీవ్యాపారస్తు నైపుణం

ఈ ప్రఘట్టమున మానన భాషామాధుర్యము త్యాగలక్షణములు ఉద్ధవోత్సవములు దంభ కౌశల నైపుణములు లక్షితము లగును. తన కుపభోగార్హము లయిన ద్రవ్యములతో సత్కార మొనరించుట సమ్మాననము మాననము నగును. అనురాగముతో హర్షముతో స్మితముతో సమాదరముతో పలుకుట భాషామాధుర్యము. ఇచ్చు దానికి పరిచ్ఛేదము లేకుండుట ఇచ్చిన దానిని తెలియకుండుట ఇచ్చు వానికి సంతోష సమృద్ధి యున్నచో త్యాగ మందురు. దేనిచే దుఃఖమును బోగొట్టుదురో యది క్షణ మనదగును. దుఃఖమును విదలింప జేయునది ఉద్ధవము. హర్ష ముదయింప జేయునది యుత్సవము. "దభ్నోతీతి దంభః" "దభ్నోతి భేదయతి" ఇతరులను భేద పెట్టునది దంభము. తగిన పనులలో సుఖముగా నాచరించు చాతుర్య ముండుట కౌశల మగును. ద్రవ్యగుణ క్రియాదులకు సంబంధించిన హానోపాదాన కర్మలలో గూఢ మయిన ప్రయోజనప్రాప్తి కగు ధీవ్యాపారమును నైపుణ మందురు.

అర్థః ప్రయోజనం యస్య వ్యాపారోఽర్థావినాకృతః. 238

స సమర్థోఽస్య తాచ్ఛీల్యాత్సామర్థ్యం తస్య కథ్యతే
విలోభనమసద్రూపే సద్రూపోత్కర్షణం విదుః. 239

ఉల్కాఽశని నృప వ్యాఘ్రాదిభిర్యశ్చిత్తవిప్లవః
ఆతంకః స భవేత్సోఽపి ప్రాయః కరుణతామియాత్. 240

ఏకస్యైవ పదార్థస్య నానారూపప్రకల్పనం
వాఙ్మనః కర్మభి ర్యత్తచ్ఛిల్ప మిత్యభిధీయతే. 241

లౌకికే వైదికే చార్థే తథా సామయికేఽపి చ
సమ్యక్పరిచయప్రౌఢి ర్వైదగ్ధ్యమితి గీయతే. 242

దుస్తరస్య స్వభావేన యేన కేనాపి కర్మణా
మిథ్యాతరణయోగ్యార్థకథనం స్యాత్ప్రతారణమ్. 243

ఏవం ప్రకారాః కవిభి రూహ్యా భావా యథాయథమ్. 244

ఇతి శ్రీ శారదాతనయవిరచితే భావప్రకాశనే రసభేదతత్ప్రకార స్వరూపనిర్ణయో నామ తృతీయోఽధికారః.

ఇచట సామర్థ్యము విలోభనము ఆతంకము శిల్పము వైదగ్ధ్యము ప్రతారణము అను వాని స్వరూపపర్యాలోచన మున్నది. ఇందు సామర్థ్యము నీ విధముగా గుర్తింప వలెను. అర్థ మనునది ప్రయోజనము. ఎవని వ్యాపారము ప్రయోజన సహితముగా నుండునో యాతడు సమర్థుడు. సమర్థపదము తాచ్ఛీల్యార్థమున సమర్థ మగును. ప్రయోజనసహితవ్యాపారమున నుండుట యని సామర్థ్య పదార్థము. అసద్రూపము నందు సద్రూపోత్కర్షణము కూర్చుట విలోభన మగును. ఆతంక మిట్లుండును. ఉల్కాపాత మశనిపాతము రాజు వ్యాఘ్రము మొదలగు వాని వలన గలుగు చిత్తవిప్లవమున కాతంక మని పేరు. ఆతంకము సామాన్యముగా కరుణరూపము పొందును. శిల్ప మిట్లుండును. వాఙ్మనఃకర్మవిశేషములచే నొకే పదార్థమునకు నానారూప కల్పన మొనరించినచో శిల్ప మని యందురు. వైదగ్ధ్యము. లౌకికార్థము నందును వైదికార్థము నందును సామయికార్థము లందును సుపృక్పరిచయప్రౌఢి యున్నచో వైదగ్ధ్య మని ప్రఖ్యాత మయినది. ప్రతారణము. ప్రకృతిసహజముగా దుస్తర మగు దానికై యేది యేని కర్మవిశేషమున మిథ్యాతరణయోగ్యార్థము నిరూపించుట దుస్తర మగు, దానిని వంచనమున సుతర మని నిరూపించుట ప్రతారణ మగును.

ఇట్లే గుణము లీ విధమున నిరూపితము లయినవి. ఏవం ప్రకారము లయిన భావములను కవులు రసోచితముగా నభ్యూహించుట యుక్తముగా నుండును. అన్నిటిని నిరూపించుట శక్యము కాదు. నిరూపితముల పరిశీలనమున సంప్రాప్త వివేకప్రాభవము కల వా రన్యములను గూడ రసోచితముగా నభ్యూహించి నిరూపించుట యుక్త మని కవ్యుపదేశపర మయిన యీ వచన మిచట యుక్తముగా నిరూపిత మయినది.

ఇది శ్రీ శారదాతనయవిరచితమైన భావప్రకాశమునందు
భావాలోకమున రసభేదతత్ప్రకారనిర్ణయము నెడి
తృతీయాధికారము

# చతుర్థాధికారము

## శృంగారాలంబన నాయక నాయికాది స్వరూప నిర్ణయము

శృంగారాలంబన నాయకనాయికాది స్వరూపనిర్ణయ మను సంకేతము కల ఈ యధికారమున భావనీయము లగు విశేషములు బహులముగా గలవు. చతుర్థ పంచమాధికారములలో నిరూపింప దలచిన విషయము లం దవగాహనసిద్ధికై యింత వఱకు నిరూపిత ముపకరించును. శారదాతనయు డిందు శృంగారమునె ప్రధానముగా ప్రతిపాదింప దలచినాడు. అం దుపపత్తి నఖిలమించువారల కిం దది లభించును. ప్రేమ భేదప్రభేదములు శృంగారోచిత దేశ కాల వేషాదులు వసంతాది ఋతువిలాసములు వియోగ సంయోగ విశేషములు నాయక రీతులు నాయికా రీతులు ఈ చతుర్థములో సవిస్తరముగా ప్రతిపాదితము లగును. వీని భావనా వివేక ముత్తరగ్రంథమున కుపకారి. పూర్వపూర్వము లుత్తరోత్తరముల కుపకరించు నట్లు నిబంధించిన దివాకరశిష్యుని శారదాతనయుని రచనావైదగ్ధ్య మిందును భాసించును.

### భోగాదినిర్వచనము

రసాలంబన భావానా ముక్తాః సాధారణా గుణాః
సుఖేష్వవస్తే సర్వేఽపి భోగ స్తత్సుఖసాధనమ్. 1

భోగ స్స ఏవ శృంగారవిశేష ఇతి గీయతే
భోగోపభోగ సంభోగ శబ్దాః పర్యాయవాచకాః. 2

సంభోగే చాపి సర్వత్ర జంతూనాం మానసీ రతిః
వర్తతే ముఖ్యయా వృత్త్యా యూనోరేవ సరాగయోః. 3

తథాప్యర్థవిశేషోఽయ మేతేషాం కథ్యతే పృథక్
భోగ్యద్రవ్యోపభోగో యః స భోగ ఇతి గణ్యతే. 4

ఉపభోగః స ఏవ స్యా ద్దేశ కాల సమేధితః
కామోపచారః సంభోగః కామః స్త్రీపుంసయో స్సుఖమ్. 5

సుఖ మానందసంభేదః పరస్పరవిమర్దజః
ఉపచార స్తదానందకారకం కర్మ కథ్యతే. 6

పూర్వాధికారమున రసాలంబనముగా నుండు భావములకు సంబంధించిన సాధారణాత్మకము లగు గుణములు నిరూపితము లయినవి. అవి యన్నియు "సుఖేప్సవః" సుఖము పొందవలె నన్న కాంక్షతో నుండును. భోగ మనునది సుఖసాధనము. ఆ యీ భోగమె శృంగారవిశేష మని ప్రఖ్యాత మయినది. భోగము ఉపభోగము సంభోగము అను శబ్దములు పర్యాయ వాచకములు. లోకమున సర్వప్రాణులకును సంభోగమున మానసిక మయిన రతి యుండును. కాని రాగసహితు లయిన యువతీ యువకు లందే ప్రధానముగా నుండును. ప్రేయసీ ప్రియులకు సంభోగము నందు రతి యుండును. కాని తత్సంబద్ధ మయిన యర్థవిశేష మిందు వేరుగా నిరూపిత మగును.

భోగ్యద్రవ్యోపభోగ మునకు భోగ మని పేరు. దేశ కాల సమేధిత మయిన భోగమె యుపభోగ మగును. కామోపచారమునకు సంభోగ మని పేరు. స్త్రీ పురుషుల సుఖము కామము. స్త్రీ పురుషుల పరస్పర సమ్మర్ద జన్య మయిన యానందసంభేదమును సుఖ మందురు. సంభోగానందకారక మయిన కర్మ విశేషమును ఉపచారము అందురు. ఇట్లు భోగోపభోగ సంభోగ పదముల యర్థభావము విశదీకృత మయినది.

శృంగారమునే ప్రధానముగా జెప్పుటలో హేతువేమి? రస్యమానత సర్వరసములలో సమానము కదా!

సుఖాశ్రయాస్తు ప్రమదా స్తా సా మామోదకారకః
యతః శృంగార ఏవైక స్తస్మాదేష సువిస్తరమ్. 7

కథ్యతే శాస్త్రదృష్టేన వర్త్మనా చానుభూతితః
స్థాయీ రత్యాహ్వయో భావః స్వ విభావాదివర్ధితః. 8

శృంగారరసనామా స్యాత్తత్తదాలంబనాశ్రయీ
నాయకప్రమదాభేదాః సంభోగస్య భిదా అపి. 9

వక్ష్యంతే తత్స్వరూపం చ తచ్చేష్టా అపి తత్త్వతః

స్త్రీలు సుఖమున కాశ్రయము. ఆ స్త్రీల కామోదహేతు వగునది శృంగార మొక్కటియె. ఇతరములలో వారల కా మోదము లేదు. ఇంతె యున్నది. కావున శృంగారమె సువిస్తరముగా నిరూపణీయము. ఈ శృంగార విస్తరము శాస్త్రమున గోచరించు మార్గమున నిరూపింతుము. స్వానుభవమున గోచరించిన విధానమునను శృంగారమును విస్తరింతు నని గ్రంథకారు డను చున్నాడు. అనుభవసాక్షికము లెన్ని యున్ననవి శాస్త్రమార్గామోదమున నున్నట్టివె యని శారదాతనయుని భావము.

రత్యాది స్థాయిభావము స్వ సముచితము లయిన విభావాదులచే నభి వృద్ధి పొందినదై శృంగారరస మను నామము కల దగును. తత్తదాలంబనాశ్ర యముగా నుండును. నాయికలు నాయకులు సంభోగమునకు సంబంధించిన భేద ములు జెప్పదగి యున్నవి. వారి స్వరూపములు చేష్టలు ఇంక నపేక్షితము లయిన విషయములు తత్తత్త్వానుసారమున నిరూపితము లగును.

రతేః స్వరూపమాచార్యై రుక్త మత్రాభిధీయతే. 10

పరస్పర స్వసంవేద్య సుఖసంవేదనాత్మికా
యాఽనుభూతిర్మిథ స్సైవ రతిర్యూనో స్సరాగయోః. 11

సంపన్నైశ్వర్యసుఖయోరశేషగుణయుక్తయోః
నవయౌవనయోః శ్లాఘ్యప్రకృత్యోః శ్రేష్ఠరూపయోః. 12

నారీపురుషయోస్తుల్యా పరస్పరవిభావికా
స్పృహోహ్వాయా చిత్తవృత్తిః రతి రిత్యభిధీయతే. 13

రతి రిచ్ఛా భవే ద్యూనో రుభయప్రార్థనాత్మికా
యూనోః పరస్పరాహ్లాద రహో విస్రంభకారితా. 14

సుఖాత్మికా మనోవృత్తిః రతి రిత్యభిధీయతే
ఆలాప లీలోపచార చేష్టా దృష్టి విలోకనైః. 15

అన్యోన్యభోగ్య ధీరేవ రహః స్త్రీపుంసయో రతిః

రస దర్శనము పరిశీలించిన ప్రాచీనాచార్యులు రతిస్వరూపమును పరిష్కరించి నిరూపించిరి. వారి భావ మిచట విశద మగును. రాగసహితు

లయిన స్త్రీపురుషులకు పరస్పరము సుఖసంవేదనాత్మక మయిన యొక యను భూతి యుండును. ఆ యనుభూతియె రతి. వారి యా సుఖసంవేదనము వార లకు మాత్రమె గోచరించును. అది స్వసంవేద్యము. రాగయుక్తు లయిన యా నాయికానాయకులు ఐశ్వర్య సుఖ సంపన్నులు నానావిధవిశేషగుణయుక్తులు నవయౌవనము కలవారు శ్లాఘ్యప్రకృతి కలవారు శ్రేష్ఠరూపము కలవారుగా నుందురు. వారిలో వారు పరస్పరము విభావములుగా నుందురు. నారికి నరుడు విభావము. నరునకు నారి విభావము. అట్టి వారలకు స్పృహారూప మగు చిత్తవృత్తి యుండును. అదియె రతి. వారలకా రతి యిచ్ఛారూపమై యుభయ ప్రార్థనాత్మకముగా నుండును. పరస్పర మాహ్లాద మిచ్చునది రహో విస్రంభ మిచ్చునది సుఖాత్మక మగు మనోవృత్తి యుండును. అదియె రతి. స్త్రీపురుషులకు ఆలాపములచే లీలోపచారములచే చేష్టలచే దృష్టివిలోకనములచే నన్యోన్య భోగ్యబుద్ధి యుదయించును. నా కామె భోగ్య నా కీతడు భోగ్యుడు అని పరస్పర భోగ్యభావ ముదయించును. స్త్రీ పురుషుల కట్టి రహోభోగ్య బుద్ధియె రతి.

ఇయ మంకురితా ప్రేమ్ణా మానా త్పల్లవితా పునః. 16

సకోరకా ప్రణయతః స్నేహాత్కుసుమితా భవేత్
రాగాత్ఫలవతీ చేయ మనురాగేణ భుజ్యతే. 17

ఈ రతి ప్రేమ మొదలగు నారు గుణములచే నభివృద్ధిపొందుట యిం దున్నది. రతి ప్రేమచే నంకురిత మగును. మానమున పల్లవిత మగును. ప్రణయమున మొగ్గతొడుగును. స్నేహమున కుసుమిత మగును. రాగమున ఫలయుక్త మగును. అనురాగమున ననుభూత మగును. కొందరు అంకురిత పల్లవిత కుసుమిత ఫలితత్వావస్థలనే క్రమముగా నిర్దేశించిరి. ఇందు కోరకిత భోగావస్థలు రెం డధికముగా నిరూపితము లయినవి. తుదకు భోగావస్థ చెప్పుట మధ్యలో కోరకావస్థ చెప్పుట యుచితముగా నున్నది. వృక్ష మంకురిత మయి నది మొదలుగా ఫలభోగావస్థాపర్యంత మారు విధముల క్రమవికాసము కల దనుట లోకప్రసిద్ధము. ప్రేమ మాన ప్రణయ స్నేహ రాగ అనురాగములు పర్యాయములుగా భాసించినను వాని స్వరూపగత మయిన విశేష మిం దున్నట్లు గ్రాహ్యము.

ఇక ప్రేమాదుల స్వరూపగత మయిన విశేషము విస్తరముగా నిచట నిరూపిత మగును.

## ప్రేమలక్షణము

'ఇ' శబ్దవాచ్యో మదనో మాతి యత్ర ప్రకర్షతః
తత్ప్రేమ తదధిష్ఠానం రతి ర్యూనోః పరస్పరమ్. 18

పరస్పరాశ్రయఘనం నిరూఢం భావబంధనం
యదేకాపాయతోఽపాయి తత్ప్రేమేతి నిగద్యతే. 19

ఇదం త దితి సంకల్పో యయోర్నక్వాపి దృశ్యతే
తద్భావబంధన మితి కథయంతి మనీషిణః. 20

ఏతత్ప్రేమ రతిం పుష్యేత్తైర్విభావాదిభిఃపునః
యదశ్లిష్టం విగాహేత కౌటిల్యం ప్రీతికారకమ్. 21

తదేవ ప్రేమకౌటిల్యం యత్స్వాతంత్ర్యం మిథః ప్రియం
స్వాతంత్ర్యం తద్యదన్యస్య మనోరథ నిరోధమ్. 22

ప్రేమ శబ్దనిర్వచన మిచట నున్నది. ప్రేమ పదమున ప్ర ఇ మ అను మూడు వర్ణము లున్నవి. ఇ వర్ణమునకు మదను డని యర్థము. ప్రకర్షముగా మదను డిమిడి యుండుట ప్రేమపదార్థము. యువకులకు పరస్పరము కల రతి ప్రేమాధిష్ఠానము. పరస్పరాశ్రయఘనముగా యువకులకు భావబంధనము నిరూఢముగా నుండగా వారిలో నొకరు గతించినచో గతించునది యగు నేని దాని ప్రేమ యని యందురు. ప్రేమ కల యువకులకు "ఇది యది" యను సంకల్ప మెచటను నుండదు. అట్టి రీతిని భావబంధన మని మనీషు లందురు. ఈ ప్రేమ విభావాదులచే రతని పోషించును. అవ్వు డట్టి ప్రేమ ప్రీతికారక మగు కౌటిల్యము నశ్లిష్టముగా నవగాహించును. ప్రేమ కౌటిల్యము రమ్యము. ఒకరి స్వాతంత్ర్యము వేరొకరి కభీష్టముగా నుండును. స్వాతంత్ర్య మనునది యితరుని మనోరథ నిరోధనరూపము. నాయిక తన మనోరథము నిరోధించినను నాయకు డిష్టపడును. నాయకుడు తన మనోరథము నిరోధించినను నాయిక యిష్టపడును. ఇట్లీ ప్రేమ భావబంధనమును ప్రేమ కౌటిల్యము కూర్చినదై రాణించును.

## మానలక్షణము

స ఏవమాన ఇత్యుక్తో మనోరథనిరోధనం
మా నేతి వీప్సయా రోధో మాన ఇత్యుచ్యతే బుధైః. 23

ఈర్ష్యా ప్రణయరోధేన మానః స్త్రీపుంసయోర్ద్వివిధా
సపత్నీదర్శన స్పర్శశ్రవణాసహతా స్థిరా. 24

ఈర్ష్యా స్త్రీణాం తయా రోధ ఈర్ష్యామాన ఉదాహృతః
మాన్యతే ప్రేయసా యేన యత్ప్రియత్వేన మన్యతే. 25

మనుతే యో మిమీతే యస్స హి మానః ప్రకీర్తితః

మనోరథ నిరోధనమునకు మానమని వ్యవహార మున్నది. మా = వలదు. న = వద్దు అని రెండు పర్యాయములు మనోరథమునకు రోధము = అడ్డు కలుగజేయుట యుండును గావున 'మాన'మని వ్యవహరించుటను బుధు లంగీకరించిరి. స్త్రీపురుషులకు మానము రెండు విధములు. ఈర్ష్యవలన గలుగు మానము ఈర్ష్యామానము. ప్రణయ నిరోధనమున గలుగు మానము ప్రణయ మానము. ఈర్ష్యవలనను మనోరథనిరోధనము గలుగుట ప్రసిద్ధమె. స్త్రీలు సపత్నీ దర్శనమును స్పర్శనమును శ్రవణమును సహింప నందున ఈర్ష్య స్థిర మగును. ఆ యీర్ష్యచే మనోరథనిరోధ మేర్పడును. అప్పు డది యీర్ష్యామాన మగును. ప్రియునిచే మానిత మగుటచే, ప్రియముగా నిష్టముగా సంభావిత మగుటచే, నిత్యము తలచుటచే, ఉచ్చావచముల విలుచుటచే మాన మన్న వ్యపదేశము వ్యవహారము యుక్త మని ప్రకీర్తిత మయినది. మాన్యతే మన్యతే మనుతే మిమీతే అను మానపద వ్యుత్పత్తులను భావించునది.

## ప్రణయలక్షణము

ఉపచారై ర్మిథో యూనో ర్యద్బాహ్యాభ్యంతరాభిధైః. 26

మానప్రకర్ష ప్రభవ రోషాస్వాద కషాయితం
ప్రేమ నీతం ప్రకర్షం చేత్స ఏవ ప్రణయః స్మృతః. 27

యే న్వీర్ష్యాసు ప్రసాదః స్యాత్స్వాభీష్టార్థానుకూలతః
ప్రియేణ స విధీయేత స మాన ప్రణయాత్మకే. 28

అయం ప్రణయమానస్తు వర్ణనీయో ద్వయోరపి
ఈర్ష్యామానస్తు కవిభి ర్యోషితా మేవ వర్ణ్యతే. 29

స పుంసాం యది వర్ణ్యేత వైరస్యాయైవ కల్పతే
స్వతోఽపి కుటిలం ప్రేమ కిము మానాన్వయే సతి. 30

ప్రేయసీప్రియులకు బాహ్యోపచారములచే నాభ్యాంతరోపచార విశేషములచే ప్రేమ ప్రకర్ష కలది యగును. అది మానప్రకర్షము వలన గలిగిన రోషమున తదాస్వాదమున కషాయిత మగును. ఇట్లు ప్రాప్తప్రకర్ష మయిన ప్రేమ ప్రణయపదమున వ్యవహృత మగును. ప్రణయ మున్నచో నీర్ష్యాసమయము లందు ప్రసాదము సులభ మగును. అభీష్టార్థానుకూల్యము వలన ప్రియుడు ప్రియాప్రసాదన మాచరించును. ప్రేయసీప్రియులు సమానప్రణయము కలవారు కావున సర్వము సంగత మగును. అభీష్టసంగము లాభమునకై ప్రియ యీర్ష్య విడనాడి ప్రసన్న యగును. ప్రియుడును సంగమార్థి కావున వెంటనే ప్రియాప్రసాదన మొనరించును. ఇట్టి యీ ప్రణయమానమును ప్రేయసీప్రియుల కిద్దరకును వర్ణనీయమె. ఈర్ష్యామానమును కవులు స్త్రీలకే వర్ణించుచున్నారు. అది యుక్తముగానే యున్నది. ఈర్ష్యామానము పురుషులకు వర్ణించుట యుచితము కాదు. అది వైరస్య మాపాదించును. అసలే ప్రేమ కుటిలము. ఇక మానసంబంధ మున్నచో నేమి చెప్పదగును ? కావున ఈర్ష్యామానము స్త్రీలకే వర్ణింప వలెను.

## స్నేహలక్షణము

మనసో యద్ద్రవార్ద్రత్వం విషయేషు మమత్వతా
భయ శంకావసానాత్మా స ఏవ స్నేహ ఉచ్యతే. 31

ద్విధా ద్రవః స్యాన్మనసో దర్శనాత్స్పర్శనాదపి
జతువ ద్వహ్నిసంస్పర్శా ద్దర్శనా చ్చంద్రకాంతవత్. 32

ఆర్ద్రతా శిశిరత్వం యత్సర్వావస్థాసు మానసం
ద్విధా భవేత్స చ స్నేహః కృత్రిమాకృత్రిమాత్మకః. 33

సోపాధిః కృత్రిమః స్నేహో నిరుపాధి రకృత్రిమః
ఉపాధౌ వినివృత్తే తు తజ్జన్యో వినివర్తతే. 34

స్నేహః స్వభావజో యావద్ద్రవ్యభావీ భవిష్యతి
శంకా స్యా త్కృతకే తత్ర ద్వక్రియాన్వేషణాత్మికా. 35

స్వాభావికే భయం తత్తద్విషయాదేః ప్రమాదతః
ఏకాశ్రయః స చ క్వాపి క్వాపి స్యా దుభయాశ్రయః. 36

ఏకాశ్రయ స్తిర్యగాదౌ మర్త్యాదావుభయాశ్రయః
ఆశ్రయా ద్వాసనాతశ్చ జాయంతే తత్ర తత్ర తు. 37

ఏకాశ్రయో వాసనాతో ద్వ్యాశ్రయో హేతుభిర్భవేత్

మనస్సునకుగలుగు ద్రవీభావము ఆర్ద్రిత యనునది విషయము లందలి మమతాభిమానము. "ఇది నాది. ఇది నాకు" అను మమత్వమె యా యార్ద్రిత. ఇది భయావసానాత్మకము శంకావసానాత్మకము. శంకా భయము లున్నచో మమత్వ ముదయింపదు. ఇట్టి యీ మమత్వమునకు స్నేహ మని వ్యవహారము. మనస్సునకు గలుగు ద్రవను రెండు విధముల నుండును. దర్శనమున గలుగు ద్రవము, స్పర్శన మునగలుగు ద్రవము అని. వహ్నిసంస్పర్శమున లక్క వలె ద్రవించుట, చంద్ర దర్శనమున చంద్రకాంతమాణిక్యమువలె ద్రవించుట ఇందు నిదర్శనముగ సంగ్రా హ్యము. సర్వావస్థలలో మానస మయిన యీ యార్ద్రిత శిశిరత్వము పై విధమున గ్రాహ్యము.

ఆ స్నేహము రెండు విధములు. కృత్రిమస్నేహము అకృత్రిమ స్నేహము నని. కృత్రిమస్నేహము సోపాధికము. అకృత్రిమస్నేహము నిరుపా ధికము. ఉపాధి నశించినచో తజ్జన్య మగు నదియు నశించును. అకృత్రిమ మయిన స్వభావజన్య మగు స్నేహము యావద్ద్రవ్యభావిగా నుండును. ఆ ద్రవ్యమెంతవఱ కుండునో యది యంత వఱ కుండును. కృతకస్నేహము నందు ఆ యా విక్రి యాన్వేషణరూప మయిన శంక యుదయించును. అకృత్రిమ మయిన స్నేహమున ఆ యా విషయముల ప్రమాదమున భయము కలుగు చుండును.

ఆ స్నేహ మొకచో నేకాశ్రయముగా నుండును. వేరొకచో నుభ యాశ్రయముగా నుండును. తిర్యగాదులలో నది యేకాశ్రయము. మర్త్యాదు లలో నది యుభయాశ్రయము. ఆయా స్థలములందు స్నేహరీతులు ఆశ్రయమున గలుగుటయు సంస్కారవిశేషమున గలుగుటయు నున్నది. ఏకాశ్రయస్నేహము సంస్కార విశేషమున గలుగుటయు ఉభయాశ్రయస్నేహము హేతువిశేషమున గలుగుటయు గ్రాహ్యము. ఇట్లు కృత్రిమాకృత్రిమ స్నేహస్వరూపము తదా శ్రయము నిరూపిత మయినది.

స్నేహమున ప్రౌఢ మధ్య మంద భేదములు, స్థిర గత్వర నశ్వర భేదములు కలవు. వాని స్వరూప మిట్లుండును.

## ప్రౌఢాది భేదములు

స తు స్నేహస్త్రిధా ప్రౌఢ మధ్య మంద విభాగతః. 38

విదేశస్థే మృతేవాపి దుర్బలే ప్రతివేగిని
ధర్మిణః క్లేశకారీ యః స ప్రౌఢః స్నేహ ఉచ్యతే. 39

తత్తద్వియోగజం దుఃఖం తాదృశం ప్రతియోగినా
అనుభూయాతివృత్తశ్చేత్స్నేహో మధ్యః ప్రకీర్తితః. 40

తదాత్వవ్యసనాపత్తి మాత్రకో మంద ఉచ్యతే

ఆ స్నేహము ప్రౌఢము మధ్యము మందము నని మూడు విధములు. ప్రియుడు విదేశగతు డయినను గతించినను దుర్బలు డయినను ప్రతివేగియయి నను స్నేహము కలవానికి క్లేశకారియగు స్నేహము ప్రౌఢస్నేహము. ఆ యా వియోగజన్య మయిన దుఃఖమును ప్రతియోగి విధానమున ననుభవించిన పిమ్మట నాస్నేహము తగ్గిపోవునేని యది మధ్యమస్నేహము. తత్సమయమున వ్యసనాపత్తి మాత్రముగ నుండుస్నేహము మందస్నేహమగును.

## స్థిరాదివిశేషములు

స్థిరశ్చ గత్వరశ్చేతి నశ్వరశ్చేతి స త్రిధా. 41

ఉత్తమే మధ్యమే నీచే తత్తత్కార్యవశా ద్భవేత్
ఉత్తమే వృద్ధిమభ్యేతి నోపకారా నపేక్షతే. 42

ఉపకారం న జానాతి స స్నేహః స్థిర ఉచ్యతే
బహూపకారప్రభవ ఉపకారా నపేక్షతే. 43

మధ్యమే వర్ధితః కించి త్స స్నేహో గత్వరో భవేత్
దోషశ్రవణమాత్రేణ సౌమనస్యం విహాయ యః. 44

ప్రాతికూల్యే ప్రవర్తేత స స్నేహో నశ్వరో భవేత్
నీచాదా వస్థిరః ప్రాయః స్నేహో జ్యాయసి తు స్థిరః. 45

ఏవం పుత్రకలత్రాదౌ పిత్రాదావపి దృశ్యతాం

స్నేహము మూడు విధములు - స్థిరము గత్వరము నశ్వరము నని. ఉత్తము నందు స్థిరము; స్నేహము స్థిరముగా నుండును. మధ్యము నందు గత్వరము; గతిస్వభావమున నుండును. నీచు నందు నశ్వరము; నాశస్వభావమున నుండును. స్థిరాది స్నేహములు ఉత్తమాదు లందు తత్తత్కార్యవశమున నుండును.

ఉత్తము నందు స్నేహము వృద్ధి పొందును. ఉపకారముల నపేక్షింపదు. ఉత్తముడు తా నొనరించిన యుపకారము ను గుర్తింపడు. ఇట్టిది స్థిరస్నేహము. మధ్యము నందలి గత్వరస్నేహము బహూపకార ప్రభవము. ఇతరులు నానావిధము లగు నుపకారముల నొసర్పగా మధ్యము డిట్టి స్నేహము కలవా డగును. ఇది గత్వరము, కొంతగా నుపకారముల వలన వృద్ధి పొందును గాన గత్వరము. నీచు నందలి నశ్వరస్నేహము దోషశ్రవణ మాత్రమున సౌమనస్యము విడనాడి ప్రాతికూల్యమునందు ప్రవర్తించును అది నశ్వరస్నేహము. నీచాదులలో నిది సామాన్యగా నస్థిరము, ఉత్తముని యందు స్థిరము. ఈ విధముగనె పుత్రీకలత్రాదులలో పిత్రాదులలో పరిశీలించునది.

ఇక స్నేహమె రాగముగా నగుట నిరూపిత మగును. రాగము నందలి భేదములు అనురాగస్వరూపము ప్రసంగప్రాప్తము.

స ఏవ చే ద్గుణ ద్రవ్య దేశ కాలాదిభి ర్హృది. 46

రజ్యతే దీప్యతే చిత్తే స రాగ ఇతి కథ్యతే
సుఖదుఃఖాత్మకం భోగ్యం సుఖత్వేనాభిమన్యతే. 47

యేన రాగః స ఇత్యుక్తో రంజనా ద్విషయాత్మనోః

ఇట్లు నిరూపిత మయిన స్నేహమె గుణ ద్రవ్య దేశ కాలాదుల గూడినదై హృదయమున రాజిత మగు నేని చిత్తమున దీపిత మగు నేని రాగము అను పేరు కల దగును. స్నేహము రాగసంపత్తి కల దగును. సుఖదుఃఖాత్మకముగా నున్న భోగ్యమును సుఖముగనె యభిమానించినచో రాగ మని వ్యవహృత మగును. రాగమున విషయరూపముగా నాయికా నాయకుల నిది రంజింప జేయును గావున రాగ మగును.

నీలీ కుసుంభ మంజిష్ఠా రాగోపమ్యేన స త్రిధా. 48

జాలితో యస్తు నాపైతి యశ్చ నాతీవ శోభతే
నీలీరాగ స్స ఏవేతి కథితో రాగవేదిభిః. 49

యోఽపైతి క్షాలితః క్షిప్రమధ్యక్షం యోఽపి శోభతే
కుసుంభరాగ ఏవైష ఇతి విద్వద్భి రీరితః. 50

అతీవ శోభతే యస్తు నాపైతి క్షాలితోఽపి సన్
స ఏవ కవిభిః సర్వై ర్మంజిష్ఠారాగ ఉచ్యతే. 51

జ్యేష్ఠో మంజిష్ఠారాగః స్యా న్నీలీరాగ స్తు మధ్యమః
కుసుంభరాగః కవిభిః అధమః పరికీర్తితః. 52

రాగౌపమ్యమున రాగము మూడు విధములు—నీలీరాగము కుసుంభ రాగము మంజిష్ఠారాగము నని. నీలీరాగము—క్షాలిత మయినను పోదు. అయినను శోభింపదు. అట్టిది నీలీరాగ మని రాగవేదు లందురు. కుసుంభరాగము—క్షాలిత మయినచో పోవును. త్వరగా పోవును. కంటి కది శోభగా కన్పించును. అది కుసుంభరాగ మని విద్వాంసు లనిరి. మంజిష్ఠారాగము—అత్యంతము శోభాయ మానముగా నుండును. క్షాలిత మయినను పోదు. అది మంజిష్ఠారాగమని సర్వ కవు లనిరి. వీనిలో మంజిష్ఠారాగము జ్యేష్ఠము, నీలీరాగము మధ్యమము, కుసుంభ రాగ మధమము. ఇట్లు కవులు కీర్తించిరి. ఈ నీల్యాదిరాగముల సామ్యమున రతిరాగ స్వరూపములను గుర్తింప వచ్చును.

రాగోఽనువృత్తోఽవిచ్ఛిన్న మనురాగ ఉదాహృతః
అనురూపోఽథవా రాగ ఇతి వా నిర్ణయో భవేత్. 53

స తు ప్రాయ స్స్వ సంవేద్యో యూనో రన్యోన్యరక్తిమా
అన్యత్రైష ప్రయుజ్యేత గౌణవృత్తి వ్యపాశ్రయాత్. 54

రాగ మవిచ్ఛిన్నముగా ననువృత్త మయినచో ననురాగ మందురు. అనురూప మగు రాగము గావున అనురాగ మను నిర్ణయమును యుక్తము. అనురాగము యువభావుల యన్యోన్యరక్తిమ. సామాన్యముగా నిది స్వసంవే ద్యము. అనుభవైకగమ్యము. గౌణవృత్తి నాశ్రయించి యీ యనురాగ పదము నన్యము లందు నుపయోగింతురు. ముఖ్యవృత్తి ననుసరించి తరుణీ తరుణుల యన్యోన్యరక్తిమనె యీ పదమున జెప్పనగును.

ఏతే ప్రేమాదయో భావాః శృంగారలంబనాశ్రయాః
భట్టాభినవగుప్తార్య పాదై రేవప్రకాశితాః. 55

అథాయఽం వర్త్మనా తేషాం శృంగారోఽపి ప్రదర్శ్యతే
రమ్య దేశ కలా కాల వేష భోగాది సేవనైః. 56

ప్రమోదాత్మా రతిస్సైవ యూనోరన్యోన్యరక్తయోః
ప్రకృష్యమాణః శృంగారో మధురాంగవిచేష్టితైః. 57

శృంగారాలంబనాశ్రయముగా నున్న ప్రేమాదిభావము లన్నియు నీ భావముననె శ్రీమదభినవగుప్తపాదులచే ప్రదర్శితము లయినవి. భట్టాభినవ గుప్తులు నిర్ణయించినవనె ప్రామాణికముగా స్వీకరింప దగును. ఇట్లే యభినవ పాదులు నిశ్చయించి నందున నిచటి యీ భావము ప్రమాణముగ స్వీకార్య మని భావము. శ్రీమదభినవుల మార్గమునె యనుసరించి యీ శృంగారమును ప్రదర్శిత మగును. రమ్యము లగు దేశ కాల కలా వేష భోగాదుల సేవనమున, అన్యోన్యాను రక్తులగు యువకులకు ప్రమోదాత్మక మయిన రతి యుదయించును. అదియె మధురాంగవిచేష్టితములచే ప్రకృష్యమాణమై శృంగార మగును. ఇట్టి యీ శృంగారభావనిర్ణయమున శ్రీమదభినవగుప్తభావమును స్పష్టముగా గుర్తించు టకు అభినవభాష్యముతో నున్న నా నాట్యవేదము నందలి రసభారతి నాటకమీ మాంస యను భాగము చూడ దగును.

ఇటుపై శృంగారోచితము లయిన దేశ కలా కాల వేషములను తత్త త్సమయ చేష్టావిశేషములను నిరూపింపవలసి యున్నది.

శృంగారోచితదేశాదులు

వేలారామ సరిచ్ఛైల పురరాష్ట్రాంబురాశయః
కాంతారాశ్రమ హర్మ్యాది ద్దేశాః కవిభి రీరితాః. 58

కలా సంగీతవిద్యాదిః పరస్తాత్సాపి వక్ష్యతే
కాలోప్యృతు దివా రాత్రి చంద్రార్కాస్తమయాదయః. 59

వేషోఽలంకారయుక్తిః స్యాద్ద్వయోర్జాతికులాశ్రయా
ఉద్యానయాత్రా మదిరా వారికేలి రతోత్సవాః. 60

విప్రలంభో వివాహశ్చ చేష్టా బాహ్యాః ప్రకీర్తితాః
అభ్యంతరాశ్చ వక్ష్యంతే రక్తా రక్తా సముత్థితాః. 61

సరితః పులినం వేలా కాంతారారామ భూధరాః
లతా గృహాణి చిత్రాణి శయ్యాః కిసలయాచితాః. 62

దివావిహార దేశాః స్యుః హర్మ్యప్రాసాద భూమయః
మంటపో భవనం గర్భగృహం వాసగృహాణి చ. 63

సంగీతశాలా వారాంతఃపురికా భవనాని చ
నిశా విహారదేశాః స్యుః సంభోగగ్రామమాశ్రితాః. 64

ఉద్యానయాత్రా సలిలక్రీడా పుష్పాపచాయికా
ద్యూతాదయో దివాచేష్టా నిశాసు మదిరాదయః. 65

కావ్యమున శృంగారమును సముచితముగా నిబంధింప దలచు కవు లీ యుపదేశమును సావధానముగా స్వీకరింప వలెను. శృంగారోచితము లయిన దేశములను కవు లీ విధముగా సంకేతించిరి. సముద్రతీరము—ఉద్యానము—నదీ భాగము—శైలపరిసరము — పురప్రదేశము—రాష్ట్రభవనము— అంబురాశి—కాంతారము—ఆశ్రమము—హర్మ్యాదులు అను దశకము శృంగారోచితదేశను. సంగీతవిద్యాదికము కలా పదమున జెప్పదగినది యుత్తరగ్రంథమున నిరూపితము కా గలదు. శృంగారోచితకాల మీ విధమున నున్నది. వసంతాదిఋతువు-పగటి సమయము— రాత్రిసమయము—చంద్రాస్తమయము— సూర్యాస్తమయాదులు. ఇది యుపలక్షణముగా చంద్రోదయము—సూర్యోదయమును గ్రాహ్యము. ఇచట కాల మేడు విధములుగా సంకేతిత మగుట పరిగ్రాహ్యము. శృంగారోచిత వేష మీ విధమున నుండును. నాయికా నాయకుల జాతి కులాశ్రయ మయిన అలంకార యోగము వేషము. శృంగారోచిత బాహ్యాచేష్టా ప్రకార మి ట్లుండును. ఉద్యాన యాత్ర—మదిరాపానము-జలకేళి- రతోత్సవము - విప్రలంభము - వివాహము అనునవి బాహ్యాచేష్ట లనిరి. రక్తా రక్తసముత్థితము లయిన ఆభ్యంతర చేష్టా విశేష ములు నిరూపితములు కాగలవు.

ప్రేయసీప్రియుల దివావిహారదేశము లీ విధముగా నుండును. నదీ పరిసరములు —పులినప్రదేశములు— సాగరతీరము — కాంతారారామభూధరములు— చిత్రములయిన లతాగృహములు-కిసలయాంచితములయినశయ్యలు— ఇట్టివి దివా విహారదేశములు—హర్మ్యప్రాసాదభూములు_మంటపము — భవనము—గర్భగృహము— వాసగృహములు — సంగీతశాల — వేశ్యాంతఃపురము— భవనములు నిశావిహారదేశ ములు. ఇవి సంభోగప్రక్రియావిశేషములకాశ్రయములు. ఉద్యానయాత్ర- సలిల క్రీడ —పుష్పాపచయము —ద్యూతాదులు దివాచేష్ట లని, మదిరాదులు నిశాచేష్ట లని గ్రహింప దగును.

చేష్టాః స్యుర్నాయకాదీనాం అభిసారాః పృథక్పృథక్
యదా విశేష్యతే దేశః కాలతస్తద్గుణాదిభిః. 66

రసోఽభిధీయతే తత్ర తన్నామ్నా రసకోవిదైః
గుణ ద్రవ్య క్రియా భేదాత్స విశేషస్త్రిధా భవేత్. 67

నాయికా నాయకులకు వేఱువేరుగా చేష్ట లభిసారములు నుండును. అవి యన్నియు కాలముచే గుణాదులచే దేశముచే విశేషిత మగునపుడు కలుగును. అట్టి స్థలము లందు శృంగారరసము తన్నామసంకేతమునసె వ్యవహృత మగు నని రసకోవిదు లనిరి. దేశము విశేషిత మగుట గుణ ద్రవ్య క్రియా భేదమున త్రివిధముగా నుండును. అట్లు కాలమునకు సంబంధించిన గుణద్రవ్య క్రియా విశేషము లిచట ప్రతిపాదితము లగును.

చంద్రికా కోకిలాలాపో హంస సారస నిస్వనః
భ్రమద్భ్రమరికా గీతం గంధాః సర్వసుఖావహాః. 68

కేకారావాదయః కాలగుణాః కవిభి రీరితాః
చందనాని సుగంధీని మృదులా చ శిలాతలీ. 69

చంపకాశోక పున్నాగ చూతాః కురవకాదయః
ప్రవాలపుష్పభరితా లతికా మల్లికాదయః. 70

భవనాదీని రమ్యాణి శయనాని మృదూని చ
హేమరత్నమయీ భూషా పుష్పాణి సురభీణి చ. 71

మృదూని చ దుకూలాని స్వాదూని సలిలాని చ
ఇత్యాదయో విభావ్యంతే ద్రవ్యాణీతి మనీషిభిః. 72

ఉద్యానయాత్రా శక్రార్చా మదిరాపాన కేలయః
రతోత్సవోపహారాశ్చ వ్యాపారాశ్చాలంకృతా. 73

చేష్టితాన్యేవమాదీని క్రియేతి పరిభాష్యతే

దేశవిశేష హేతువు లగు కాల గుణ ద్రవ్య క్రియల స్వరూప సంకేత మిం దున్నది. కాలగుణము లీ విధముగా నుండు నని కవులు నిరూపించిరి. చంద్రిక కోకిలాలాపము హంసధ్వని సారసధ్వని భ్రమించు తుమ్మెదల గీతము సర్వసుఖావహము లయిన గంధములు మయూరముల కేకారావములు. ద్రవ్యము

లీ విధముగా నుండు ననిరి. పరిమళ యుక్తము లయిన చందనములు మృదుల మయిన శిలాతలము చంపకాశోక పున్నాగ చూతములు కురవకాదులు ప్రవాలములతో పుష్పములతో గూడు కొనిన మల్లికాది లతలు రమ్యము లయిన భవనాదులు మృదువుగా నుండు శయనములు హేమమయ రత్నమయ భూషలు సురభిపుష్పములు మృదుదుకూలములు మధురజలములు మొదలగునవి. క్రియా విశేషము లీ విధముగ నుండును. ఉద్యానయాత్ర దేవేంద్రపూజ మదిరాపాన కేలీవిశేషములు రతోత్సవోపహారములు అలంకారవ్యాపారములు ఈ మొదలగు చేష్టితములు క్రియ లగు నని పరిభాషించిరి

కాలనియమానుసారముగా నా యా ఋతువులలో రాగదీపనము లగు విశేషములను రసోత్కర్ష కారణములుగా గుర్తించుట యుక్తము. వసంతాది ఋతువులలో రాగదీపనము లీ విధమున నున్నవి.

గంధాః సురభయో వాతా స్తరవః కుసుమాచితాః. 74

భ్రమరాః కోకిలా హర్మ్యం మృద్వీ శయ్యా సురాసవః
ఇత్యాదయో విభావాః స్యుర్వసంతే రాగదీపనాః. 75

వసంతర్తువు నందు పరిమలములు సురభివాతములు కుసుమాంచితము లయిన తరువులు తుమ్మెదలు కోకిలములు మంచి భవనము మృదుల శయ్య సురాసవము మొదలగు విభావములు వసంతమున రాగదీపనములు.

ఉద్యాన సలిలక్రీడా ఛాయాః కిసలయా స్తరాః
ఏలా లవంగ కర్పూర హిమాంభశ్చందనాదయః. 76

లతాగృహాణి చిత్రాణి పురాణాశ్చైవ శీధవః
ధారాగృహం హిమగృహం మృణాల మణికుట్టిమే. 77

ఫుల్ల కేసర కల్హార పాటలేందీవరాదయః
ముక్తాగుణవతీ భూషా వాసో గైరికరూపితమ్. 78

ఇత్యాదయః స్యుః సంసృష్టా గ్రీష్మే రాగప్రదీపనాః

గ్రీష్మఋతువు నందీ విశేషములు రాగప్రదీపనములుగా ప్రసిద్ధములు. ఉద్యానవన విహారము జలక్రీడ కిసాలయములచే నాస్తృతము లయిన ఛాయా

ప్రదేశములు ఏలా లవంగ కర్పూరములు హిమజలములు చందనాదులు చిత్రము లయిన లతాగృహములు ప్రాచీనము లయిన సురాసవములు ధారాగృహము హిమగృహము తామరతూడులు కూర్చిన కుట్టిమము మణికుట్టిమము వికసించిన కేసరములు కల కల్హార పాటలేందీవరాదులు ముక్తాసూత్రము కల భూష గైరిక వర్ణరూషిత మయిన వస్త్రము మొదలగునవి సంసృష్టములై గ్రీష్మమున రాగప్రదీపనములుగా నుండును.

కదంబ కేతకీ లోధ్ర కదలీ కుటజాదయః. 79

శిఖినః శాద్వలం శక్రగోపాశ్చ గిరినిర్ఝరాః
తటాకాని చ పూర్ణాని వహంత్య స్సరిత స్తథా. 80

వారిదా వారిధారాశ్చ తటితో మేఘగర్జితం
మాద్యన్మతంగజక్రీడా నదద్గోవృషభ ధ్వనిః 81

పోప్లూయమాన హరిణాః శ్యామలాని వనాని చ
శాల్మలీ తూలశయనం ధూపాః కాలాగరూత్థితాః. 82

ప్రచ్ఛదాచ్ఛాదనపటో మంజిష్ఠా రాగ రూషితః
పద్మరాగమయీ భూషా క్వచిచ్చ విరలైవ సా. 83

ఇత్యాదయః ప్రావృషి స్యుర్విభావా రాగదీపనాః

ప్రావృట్కాలమున నీ విభావములు రాగ దీపనములుగా నుండును. కదంబము కేతకి లోధ్రము కదలి కుటజాది వృక్షములు నెమళ్ళు శాద్వలము ఇంద్రగోపములు గిరినిర్ఝరములు పూర్ణము లయిన తటాకములు ప్రవహించు నదులు వారిదములు వారిధారలు మెరుపులు మేఘగర్జితములు మదించిన మతంగజముల క్రీడలు గోవృషభముల అంకెలు చంగు చంగున నెగురు హరిణములు శ్యామలము లయిన వనములు బూరుగుదూది పఱుపు ప్రక్క కాలాగరుసముత్పన్నము లయిన ధూపములు కప్పికొనుటకు తగిన మంజిష్ఠారాగరూషిత మయిన దుప్పటి పద్మరాగమయమయిన భూష ఒకచో విరలాభరణము ఇత్యాదులు వర్షాకాలమున రాగదీపనములు.

చంద్రికా మృదులా వాతాః పద్మిన్యః సమరాలికాః. 84

ప్రసన్నం వారి పులినం నలినీతలిమాని చ
వేలా సరి త్తటారామా భువశ్చాశ్యానకర్దమాః. 85

స్ఫూర్జన్మృగమదామోదో హంస సారస నిస్వనః
పుండ్రేక్షవః స్ఫురన్ముక్తామణయః పాకపాండరాః. 86

నిష్పన్నాని చ సస్యాని పంథాన శ్చ వికర్దమాః
లలితా నాతిశీతోష్ణా శయ్యా కేలివసుంధరా. 87

భూషా మరకతాశ్లిష్ట వైడూర్య మణి మాలినీ
విమలాని దుకూలాని గంధా మృగమదాదయః. 88

విభావాః శరది ప్రాయః సంసృష్టా రాగదీపనాః

శరత్కాలము నం దీ విశేషములు రాగదీపనములుగా నుండును. చంద్రిక మృదులము లయిన వాయువులు హంసలతో గూడుకొనిన పద్మాకరములు ప్రసన్నమగు జలము పులినము నలినీదలశయ్య వేల సరిత్తటము ఆరామములు బురదలేని భూములు కస్తూరీ పరిమళ ప్రసారము హంససారసముల ధ్వనులు పాకమున పాండరములై మంచిముత్తెముల జిమ్ము చెఱకులు పండిన పైరు పంటలు బురదలేని దారులు లలితము నాతిశీతోష్ణ మయిన శయ్య క్రీడాస్థలి, మరకతములు వైడూర్యములు కూర్పు పొందిన భూషలు, విమలము లయిన వస్త్రములు, గంధములు, కస్తూరీప్రభృతులు అను నీవిభావములు శరత్కాలమున సంసృష్టములై రాగదీపనము లగుట పరిగ్రాహ్యము.

గంధపుష్పాణి వాసాంసి భూషణం శయనాని చ 89

సంకీర్ణాన్యనుభూయంతే హేమంతే శిశిరేఽపి చ

హేమంత శిశిరఋతువులలో గంధపుష్పములు వస్త్రములు భూషణములు శయనములు నియతములుగా నుండక సంకీర్ణములుగా ననుభూయమానము లగును. ఇట్లున్న నివియె యీ ఋతువు లందు రాగదీపనములుగా నుండు నని గ్రహింప వచ్చును.

## రసోత్కర్షకారణము

రసోత్కర్షో విభావస్య ప్రాధాన్యాద్వారతో భవేత్. 90

ఏకస్య వా ద్వయోర్వాపి బహూనాం వా స దృశ్యతే
సదృశై శ్చ విభావాద్యైః రసోత్కర్షః కదాచన 91

ఇతరేషాంచ భావానా మేవం భావీ రసోదయః

విభావ ప్రాధాన్యము ననుసరించి రసమున కుత్కర్షము కలుగును. ఒక విభావమునకు ప్రాధాన్య మున్నను రెండు విభావములకు ప్రాధాన్య మున్నను బహువిభావములకు ప్రాధాన్య మున్నను తద్ద్వారముననె రసోత్కర్ష కలుగును. సదృశము లగు విభావాదులచే నొకపుడు రసోత్కర్ష ముదయించును. కేవల విభావప్రాధాన్య ద్వారముననె రసోత్కర్ష కలుగుట కాక ఇతరభావముల ప్రాధాన్యముననను రసోదయము కలుగును.

ఇంతవరకు రసస్వరూపమునకు సంబంధించిన పూర్వాంశము నిరూపిత మయినది. భేద ప్రపంచనముతో గూడుకొనిన శృంగారస్వరూప మావిష్కరింప వలెను. వియోగాయోగ సంయోగ భేదమున శృంగారము త్రివిధ మగుట స్వరూపలక్షణ వివేచనపురస్సరముగా నిక ప్రతిపాదిత మగును.

## శృంగారభేదములు

వియోగాయోగ సంభోగైః శృంగారో భిద్యతే త్రిధా. 92

పరస్పరం విభావాద్యైర్వ్యానోరుద్బూఢరాగయోః
అసంగతి రయోగేఽస్మిన్దశావస్థా ద్వయోరపి. 93

సాక్షాత్ప్రతికృతి స్వప్న చ్ఛాయా మాయాగుణాదిభిః
నాయికాయా నాయకస్య దర్శనం స్యాత్పరస్పరమ్. 94

దశావస్థత్వమాచార్యైః ప్రాయోవృత్త్యా తు దర్శితం
మహాకవి ప్రబంధేషు దృశ్యంతే తాస్త్వనేకధా. 95

శృంగారము మూడు విధములు. వియోగము అయోగము సంభోగము నని. ఆ యా విభావాదులచే రాగ ముదయించిన ప్రేయసీప్రియులకు సంబంధము కలుగ కుండుట అయోగశృంగారము. ఈ యయోగశృంగారము నందు నాయికానాయకుల కిద్దరకును పది యవస్థ లుండు ననిరి. నాయికకు నాయకునకు పరస్పర దర్శన మనునది సాక్షాద్దర్శనము ప్రతికృతి దర్శనము స్వప్న దర్శనము ఛాయాదర్శనము మాయాగుణ దర్శనము మొదలగు విభావముల వలన గలుగును. ఇట్టి వీరి విషయమున దశావస్థత్వము చెప్పుట ప్రాయోవాదము. మహాకవి ప్రబంధములలో నీ యవస్థ లనేకవిధములుగా నున్నవి. కావున నింక నవస్థల జెప్పుట యుక్తమే యగును.

## వియోగస్వరూపము

వియోగో విప్రకర్షః స్యాద్యూనోః సంభోగమగ్నయోః
వియోగోఽపి ద్విధా మానప్రవాసకృత భేదతః. 96

తత్ర ప్రణయమానః స్యాత్కోపోపహతయోర్ద్వయోః
స్త్రీణామీర్ష్యాకృతో మానః కార్యోఽన్యాసంగిని ప్రియే. 97

సోఽపి త్రిధాఽనుమాధ్యక్షశ్రవణా దవగమ్యతే
గోత్రస్ఖలన భోగాంకోత్స్వప్నాయితవిభావితః. 98

త్రిధాఽనుమానికోఽధ్యక్షః సాక్షాదింద్రియగోచరః
దాసీసఖ్యాదిముఖతః శ్రుతిః శ్రవణముచ్యతే. 99

యథోత్తరో గురుః షడ్భిరుపాయై స్తదుపాచరేత్
సామ్నా దానేన భేదేన నత్యుపేక్షా రసాంతరైః. 100

తత్ర ప్రియవచస్సామ భేదఃస్యాత్సఖ్యుపగ్రహః
దానం వ్యాజేన భూషాదేః పాదయోః పతనం నతిః. 101

సామాదౌ తు పరిక్షీణే స్యాదుపేక్షాఽవధీరణం
రభస త్రాస హర్షాద్యైః కోపభ్రంశో రసాంతరమ్. 102

ఇందు వియోగలక్షణ మున్నది. వియోగము మానవియోగము ప్రవాసవియోగము నని ద్వివిధము. క్రమముగా నివి నిరూపితము లగును. మానోత్పత్తికారణములు తన్నివారణోపాయములు నిచట విచారితము లగును.

సంభోగ మగ్ను లయిన స్త్రీ పురుషులకు విప్రకర్షము కలుగుట వియోగము. మాన ప్రవాసకృత భేదమున వియోగము రెండు విధములు. ఇద్దరు కోపోపహతు లగుదు రేని ప్రణయమానము కలుగును. ప్రియు డన్యాసంగము కల వా డగునేని స్త్రీలకు ఈర్ష్యాకృత మగు మానము వర్ణింప దగును. ప్రియ యన్యసంగము కల దయినచో ప్రియునకు ఈర్ష్యామానము వర్ణించుట యుచితము కా దని, యది వైరస్యమునకె యగు నని పూర్వమె నిరూపిత మయినది. స్త్రీలకు వర్ణితము కావలయు నీర్ష్యాకృత మానము మూడు విధములు. అనుమానము వలన, ప్రత్యక్షపరిజ్ఞానమున, విని నందు వలన స్త్రీల కది యుదయించిన దని గోచరించును. అనుమానికము కూడ మూడు విధము

లగును. గోత్రస్ఖలనము వలన వారి యీర్ష్యామాన మూహింప వచ్చును గోత్రస్ఖలన మన్యాంగనానామోచ్చారణము. ప్రియుడు తన సన్నిధిలో నుండియు నితరస్త్రీ నామ ముచ్చరించి నప్పు డాతని యన్యాసంగమూహ్యాహిత మగును. రెండవ హేతువు భోగాంకము అన్య స్త్రీ భోగచిహ్నములు దేహమున గోచరించిన స్త్రీ లనుమానింతురు. మూడవ హేతువు స్వప్నాయితము. కలవరించుట. అత డామెను గురించియే కలవరించినచో నింటియామె యనుమానించును. ఇట్లు మూడు విధముల నానుమానిక మున్నది.

సాక్షా దింద్రియగోచర మగునది ప్రత్యక్షము. దాసీసఖ్యాదిముఖతః వినుట శ్రవణము. వీనిలో యథోత్తరము ప్రబలము. కావున నాయకుడు ఆరు విధము లగు నుపాయములచే నుపచరింపవలసి యున్నది. సామము దానము భేదము నతి ఉపేక్ష రసాంతరము నను నవి యాష డుపాయములు. ఇందు ప్రియవచనము పలుకుట సామము. ఏదో మిషగా నాభరణాదు లిచ్చుట దానము. ఆమె సఖిని తన మాట వినువానిగా జేసికొని యామె నుండి విడదీయుట భేదము. పాదపతనము నతి. సామాదులు పరిక్షీణములు కాగా నవధీరణ మొనరించుట యుపేక్ష. రభసముగా త్రాస పెట్టుట, హఠాత్తుగా హర్షము కలిగించుట మొదలగు వానిచే కోపమును పోగొట్టుట రసాంతరము. ఇట్లే యుపాయ షట్కముచే స్త్రీలకు గలిగిన యీర్ష్యామానము పోగొట్టవచ్చును.

ప్రవాసమును మూడు విధములు. ప్రవాస విప్రలంభనమున స్త్రీల యనుభావములు భావనీయములు.

ప్రవాసో భిన్నదేశత్వం తచ్చాపాద్బుద్ధిపూర్వతః
సంభ్రమాదపి తత్రైవ బుద్ధిపూర్వస్త్రిధా మతః. 103

భావీ భవన్ భూత ఇతి కాల త్రితయ సంగతేః
స్వరూపాద్యన్యథాభావకరణం శాప ఈరితః. 104

సంభ్రమః సహసోత్పన్నో దివ్యమానుష విప్లవః
వియోగభేదో మరణమితి కేచిన్న తద్భవేత్. 105

మృతే త్వన్యత్ర యత్రాన్యః ప్రలపేచ్ఛోక ఏవ సః
సాధారణోఽయముభయోః ప్రవాసః శాపసంభవః. 106

సంభ్రమే బుద్ధిపూర్వే చ కార్శ్యశ్వాసాశ్రునిర్గమాః
లంబాలకాదికాః స్త్రీణాం వర్ణ్యంతే కవిపుంగవైః. 107

ప్రేయసీప్రియులు భిన్నదేశము నం దుండుట ప్రవాసము. ఇది మూడు విధముల గలుగును. శాపము బుద్ధిపూర్వకము సంభ్రమము అనునవి ప్రవాసము గలుగ జేయును. ఇందు బుద్ధిపూర్వము మూడు విధములు. భావి వర్తమానము భూతము. కాలత్రయ సంబంధమున నివి యి ట్లగును. శాప మనునది స్వరూపాదుల కన్యథా భావ సంపాదకము. సహసా సముత్పన్న మగు దివ్యమానుషవిప్లవము సంభ్రమము ఇట్టి విధముగా ప్రవాస ముదయించును.

మరణము వియోగభేద మని కొంద రనిరి. అది యుక్తము కాదు. ఒకరు గతింపగా మరొకరు విలపింతురు. అప్పుడు శోకమె కలుగును. రతి యుండదు. ఆశ్రయవిచ్ఛేదమున రతి నశించును. వియోగకాలమున రతి యుండును. మరణమున రతి యుండదు, శోకమె యుండును.

శాపసంభవ మగు ప్రవాసము ప్రేయసీ ప్రియుల కిద్దరకు సాధారణము, సంభ్రమ మందును బుద్ధిపూర్వము నందును కార్శ్యము శ్వాసములు అశ్రునిర్గమము నుండును. స్త్రీలకు లంబాలకాదులను కవులు వర్ణించుచున్నారు.

సాధారణ్యా ద్విభావాదే రత్రాయోగ వియోగయోః
కరుణస్యానురూప్యేఽపి రతిస్థాయ్యనువృత్తితః. 108

ఏతౌ శృంగారభేదౌ స్త ఇతి సత్కవినిర్ణయః
అతః శృంగారసంజ్ఞాఽత్ర గ్రామాంతే గ్రామశబ్దవత్. 109

మరణం యది సాపేక్షం ప్రత్యుజ్జీవనకాంక్షయా
తద్వర్ణ్యతే వియోగోత్థదుఃఖసాధారణాత్మకమ్. 110

అయోగవియోగములలో విభావాదులు సాధారణముగ నుండుట వలన కరుణమున కానురూప్యమున్న దనిపించును. కరుణవిభావాదులు అయోగవియోగవిభావాదులు సమానముగనె యుండును. అందుననె కరుణానురూప్యమున్న దనిపించును. కాని యయోగవియోగములు కరుణాత్మకములు కావు. ఇందు శోకము లేదు. రతిరూప మగు స్థాయి యనువృత్తమై యుం దుండును. కావున నీ రెండును శృంగారభేదములె యని సత్కవుల నిర్ణయము. కనుక వీని

యందు శృంగారసంజ్ఞయే యుచితము. గ్రామాంతమున గ్రామశబ్దవ్యవహారము వలె నిదియు సంగతము. ప్రత్యుజ్జీవనకాంతుతో మరణము సాపేక్షముగనె వర్ణిత మగు నేని వియోగమున జనించిన దుఃఖసాధారణముగ నదియు వర్ణిత మగును. కావున మరణము కూడ నొకప్పుడు వియోగరూపమె యగునని భావింప వచ్చును.

## సంభోగశృంగార స్వరూపము

కామః స ఏష సంభోగ స్స చతుర్ధా విభజ్యతే
యూనోః పరస్పరస్పర్శ విశేష విషయీకృతః. 111

సౌఖ్యాభిమానసంకల్పఫలవాన్కామ ఇష్యతే
సమితః సంకరశ్చేతి సంపన్నశ్చ సమృద్ధిమాన్. 112

పరస్పరస్యోపచారైః యూనోర్వ్యత్సాధ్వసాదిభిః
మితం ప్రయుజ్యతే భోగే ప్రథమే స మితో భవేత్. 113

ప్రసాదేఽపి వ్యలీకాదిస్మృతేః కోపానువర్తనాత్
సంకీర్యతే యస్సంభోగ స్తస్మాత్సంకర ఈరితః. 114

సంపన్నకామై రాయాతైః ప్రోషితై రుపభుజ్యతే
సంపన్న మేవ య త్తస్మా త్సంపన్న ఇతి కథ్యతే. 115

ప్రత్యుజ్జీవన హర్షాదేః ప్రవృద్ధో మృతజీవతోః
దీపనాతిశయైర్దీప్తః సంభోగః స్యాత్సమృద్ధిమాన్. 116

సంభోగమె కామము. సంభోగము నాలుగు విధముల విభక్త మయినది. ప్రేయసీ ప్రియుల పరస్పర స్పర్శ విశేషమున విషయముగా నున్న సంభోగము సౌఖ్యము కలుగు నన్న యభిమానాత్మక మయిన సంకల్పము యొక్క ఫలము కలదై కామ మను వ్యవహారమున గూడి యున్నది. ఈ సంభోగము మితమని సంకరమని సంపన్నమని సమృద్ధికలది యని నాలుగు విధముల నున్నది.

మితసంభోగ మిట్లుండును, ప్రథమసమాగమమున ప్రేయసీప్రియుల పరస్పరోపచారవిశేషములు సాధ్వసాదులతో గూడి యుండును గావున సంభోగ ప్రక్రియావిశేషము లన్నియు మితముగనె ప్రయుక్తము లగును. ప్రథమభోగమున మితప్రయోగ ముండుటచే నిది మిత మను సంజ్ఞ కల సంభోగము.

సంకరసంభోగ మిట్లుండును. ప్రియుడొనరించిన ప్రసాదన విధాన మున ప్రసాద ముదయించినను పూర్వాపరాధముల స్మరణమున కోప మను వర్తించుచుండును గావున నప్పటి సంభోగము కోపసంకీర్ణమై యుండును. కావున నిదిసంకీర్ణ సంభోగము.

సంపన్న సంభోగము. కామసంపన్నులు ప్రోషితులై వచ్చి యుపభోగ రతులయినప్పుడు వారి సమ్యక్సంభోగము సంపన్నముగనె యుండును. కావున నిట్టిది సంపన్న సంభోగము.

సమృద్ధసంభోగము. మృతులై జీవించిన వారిసంభోగము సమృద్ధము. ప్రత్యుజ్జీవనము వలని హర్షాదుల వలన ప్రవృద్ధమై దీపనాతిశయవిశేషములచే దీప్తమై యుండును గావున నప్పటి సంభోగము సమృద్ధిమాన్.

ఈ ప్రసంగమున సంభోగవియోగ చేష్టా నిరూపణ మావశ్యకము.

చేష్టావిశేషాః సంభోగే చుంబనాలింగనాదయః
వికారాః స్తంభరోమాంచస్వేదాః స్యుః సాధ్వసాదయః. 117

వియోగే శిశిరాచారచింతా నిశ్వసితాదయః
తైస్తైరుపక్రమైర్యూనోరక్తయో శ్చేదసంగమే. 118

దశధా మన్మథావస్థా భవేద్ద్వాదశధాఽథవా
ఇచ్ఛోత్కంఠాభిలాషాశ్చ చింతా స్మృతిగుణస్తుతీ. 119

ఉద్వేగోఽథ ప్రలాపః స్యాదున్మాదో వ్యాధిరేవ చ
జాడ్యం మరణమిత్యాది ద్వే కైశ్చి ద్వర్జితే బుధైః. 120

సంభోగమున చుంబనాలింగనాదులు చేష్టా విశేషములు. చుంబన భేదము లాలింగనభేదము లనేక ప్రకారములు కామప్రధానశాస్త్రముల నుండి గ్రాహ్యములు. ఆదిపదమున సంగ్రాహ్యములును గలవు. స్తంభ రోమాంచ స్వేద ములు సాధ్వసాదులును సంభోగ సమయమున గలుగు వికారములు.

వియోగమున శిశిరాచారములు చింతానిశ్వసితాదులు నుండును. నాయికానాయకు లా యా యుపక్రమములతో గూడి పరస్పర మనురక్తులై యుండియు సంగమఫలము పొందని వా రగుదు రేని పది విధముల మన్మథా వస్థలు కలుగును. పండ్రెండు విధముల నేని కలుగును. ఇచ్ఛ ఉత్కంఠ అభిలాష

చింత స్మృతి గుణస్తుతి ఉద్వేగము ప్రలాపము ఉన్మాదము వ్యాధి అను దశావస్థలు ఉదయించు ననుట కొందరి సమ్మతము. జాడ్యము మరణము అను రెండింటిని వీరు వర్జింతురు. ఇచ్ఛాది దశకమునే యంగీకరింతురు.

### మన్మథావస్థాలక్షణము

యదక్షం యత్ర సంసృష్టం తత్రత్య గుణసంపదా
మనసః స్పందనైకాగ్ర్యం ఇచ్ఛేతి పరిభాష్యతే. 121

సర్వేంద్రియసుఖాస్వాదో యత్రాస్తీత్యభిమన్యతే
తత్ప్రాప్తీచ్ఛాం ససంకల్పాం ఉత్కంఠాం కవయో విదుః. 122

అన్తస్సంభోగసంకల్పః తత్కథాశాలిలోకనం
అంగగ్లానిర్మనోరక్తిః మనోరథవిచింతనమ్. 123

అధిజాను కరాలంబికపోలతల మాననం
ప్రసన్నముఖరాగశ్చ స్వేదోష్మా గద్గదా చ వాక్. 124

ఉత్కంఠానుభవా భావాః కథ్యంతే భావకోవిదైః
సంకల్పేచ్ఛాసముద్భూత వ్యవసాయ పురస్సరః. 125

యస్తత్సమాగమోపాయః సోఽభిలాషః ప్రకీర్తితః
ముహురంతః ప్రవిశతి నిర్గచ్ఛతి ముహుః పథి. 126

కరోతి మాన్మథీం చేష్టాం తద్దృష్టిపథవర్తినీ
అలంకరోతి చాత్మానమాస్తే చైకాకినీ క్వచిత్. 127

అభిలాషభవాభావాః కథ్యంతే మాన్మథా బుధైః

ఇచ్చట ఇచ్ఛా-ఉత్కంఠా-అభిలాష అను మన్మథావస్థల స్వరూపాను భావముల ప్రతిపాదక మున్నది. ఏ యింద్రియ మెచట సంసక్త మయినచో నచటి గుణసంపదచే మనసునకు గలుగు స్పందనైకాగ్రత ఇచ్ఛ యను కామావస్థ యగును. ఎచట సర్వేంద్రియ సుఖాస్వాదము కలదను నభిమాన ముదయించునో సంకల్పసహిత మయిన తత్ప్రాప్తీచ్ఛను ఉత్కంఠ యని కవులు వ్యవహరించిరి. ఉత్కంఠ యుదయింపగా గొన్ని యనుభావములును గలుగును. అంతస్సంభోగసంకల్ప మధికముగా నుండును. తత్సంభోగ కథావిషయమున ఆశావిలోకన ముండును. అంగగ్లాని మనోరక్తి యుండును. మనోరథవిచింతన

ముండును. మోకాళులను చేతితో పట్టుకొని కపోలతల మానించి యుండుట యుండును. ప్రసన్న ముఖరాగము స్వేదోష్మ గద్గదవాక్కు అను నిట్టివి యుత్కంఠానుభవభావము లని భావకోవిదులు భావించిరి.

ప్రియసమాగమోపాయ మభిలాషము. దీనిలో సంకల్పము వలన ఇచ్ఛవలన గలిగిన యత్నము ముందుగ నుండును. ఈ యభిలాష ముదయింపగా ముహుర్ముహుః అంతఃప్రవేశము బహిర్నిర్గమనము మార్గసంచారము నుండును. మాన్మథచేష్ట నాచరించును. తద్దృష్టి పథమున వర్తించును. కామ వికారములు ప్రదర్శించుచు తా నలంకరించుకొనును. ఒకచో నేకాకినియై యుండును. ఇట్టి వన్నియు నభిలాషప్రభవము లయిన మాన్మథ భావము లని బుధుల కథనము. బుధులనుట తత్స్వరూపవిదు లగు కామపండితులని భావము.

కేనోపాయేన తత్ప్రాప్తిర్మమైవ స భవేత్కథమ్. 128

కిం స వక్ష్యతి కిం వక్ష్యే దూతాది ప్రేషయామి కిం
కిం తేనేతి వితర్కోఽయం హృది చింతేతి కథ్యతే. 129

బధ్నాతి మేఖలాదీని పరామృశతి పాణినా
స్పృశత్యూరుం చ నాభిం చ నీవీం విస్రస్య నహ్యతి. 130

అంతర్బాష్పోద్గమం చక్షు రాకేకర కనీనికం
అంతర్బహిః పురః పశ్చా దనాలంబన వీక్షణమ్. 131

చింతాసముత్థితా హ్యేతే భావాః స్యుర్మన్మథాశ్రయాః

ఇందు చింతాలక్షణానుభావము లున్నవి. ఏ యుపాయమున వాని ప్రాప్తి కలుగునో ? అతడు నాకు మాత్రమె సంబంధించిన వాడుగా నెట్లగునో? ఆత డే మనునో ? నే నేమందును ? ఏమేని యందునా ? దౌత్య మేమేని పంపుదునా ? ఆతని వలన నేమి ప్రయోజనములె ! అను నిట్టి వితర్కము హృదయమున నున్నచో నది చింతావస్థ యగును. ఇట్టి యీ చింత కలుగగా మేఖలాదులను బంధించును. ఆ స్థానములను చేతితో తడుమును. ఊరువు తన్మూలము స్పృశించును. నాభిని నిమురును. నీవి ముడి జార్చి కూర్చును. నేత్ర మంతర్బాష్పములతో నుండును. ఆకేకర కనీనికలతో నుండును. అంతః బహిః పురః పశ్చాత్ అలంబన రహితముగా జూచును. మన్మథాశ్రయము లయిన యీ భావము లన్నియు చింత వలన గలుగును.

సుఖదుఃఖాదిభావానాం దేశకాలానుషంగిణామ్. 132

అనుభూయాతివృత్తానాం విమర్శో మనసా స్మృతిః
ధ్యాయతి శ్వసితి ద్వేష్టి కార్యమన్యచ్చ నిందతి. 133

న భుంక్తే నాపి నిద్రాతి న ప్రీతిం లభతే క్వచిత్
ఏతేహ్యనుస్మృతిభవాభావాః మన్మథకల్పితాః. 134

ఇచటస్మృతి స్వరూపానుభావము లున్నవి. దేశకాలసంబంధము కలిగిన సుఖదుఃఖాదిభావములు అనుభవానంతరము పోగా వానిని మనసుచే విమర్శించుట స్మృతి రూపావస్థ. ఈ స్మృతిలో ధ్యానించును శ్వసించును ద్వేషించును. కార్యమాదరింపదు. నిందించును. భుజింపదు. నిద్రింపదు. ఎందును ప్రీతిని పొందదు. ఇట్టి వన్నియు మన్మథకల్పితము లయిన స్మృతిభవానుభావము లని గుర్తించునది.

రూపౌదార్యగుణైర్లీలా చేష్టా హసితవిభ్రమైః
సౌందర్యాలాపమాధుర్యైః నాస్త్యన్యస్తత్సమః పుమాన్. 135

ఇతి యత్రేదృశీ వాణీ భవేత్సైవ గుణస్తుతిః
గుణాన్గణయతి స్వైరం వీక్షతే భావమంథరమ్. 136

రోమాంచో గద్గదపదా వాక్ స్వేదశ్చ కపోలయోః
విస్రంభకథనం దూత్యా తత్సమాగమచింతనమ్. 137

ఏవం గుణస్తుతిభవా భావా మదనసూచనాః

ఇందు గుణస్తుతి యున్నది. "రూపౌదార్యగుణములచే గాని లీలా చేష్టాహసిత విభ్రమములచే గాని సౌందర్యాలాపమాధుర్యములచే గాని నా ప్రియునితో సమాను డయిన యన్యపురుషుడు లేడు." అను వచన మామె నుండి వెలువడునేని యది గుణస్తుతి యగును. ఈ యవస్థ కల ప్రియ గుణముల గణన మొనరించును. స్వేచ్ఛగా చూచును. భావమంథరముగా వీక్షించును. రోమాంచము కల దగును. గద్గద వాక్కు కల దగును. ఆమె కపోలముల స్వేద ముండును. దూతితో రహస్యము భాషించును. ప్రియసమాగమచింతనము చేయును. ఇట్టివి గుణస్తుతి భవ భావములు. ఇవి మదనసూచనములు.

ఉద్వేగో మనసః కంపః క్రోధశోకభయాదిజః. 138

నిశ్వాసోన్నిద్రతాచింతాః స్తంభో వైవర్ణ్యమశ్రు చ
న శయ్యాసనయోః ప్రీతిః హృల్లేఖో దీనతాపి చ. 139

ఏవ ముద్వేగజా భావాః కందర్ప పరికల్పితాః

ఉద్వేగ మనునది మనసునకు కంపము. క్రోధశోకభయాదుల వలన గలుగును. ఇందు నిశ్వాసము ఉన్నిద్రత చింత కలుగును. స్తంభము వైవర్ణ్యము అశ్రువు ఉదయించును. శయ్యాసనము లందు ప్రీతి యుండదు. హృదయవేదన దీనత కలుగును. ఇట్టి యుద్వేగజన్యము లయిన భావములు కందర్ప పరికల్పితములు.

ఇహ దృష్టమిహాశ్లిష్ట మిహాగత మిహ స్థితమ్. 140

ఇహ నిర్వృత్త మత్రైవ శయితం చాప్యలంకృతం
ఏవమాదీని వాక్యాని ప్రలాప ఇతి కథ్యతే. 141

అంతర్బహిః పురః పశ్చా ద్దూరాదారాత్ సమీపతః
క్వచి త్పశ్యతి యాత్యేవ క్వచి త్క్వాప్యవతిష్ఠతే. 142

ఆస్తే క్వచి త్క్వచి చ్ఛేతే క్వచి న్నిందతి నందతి
ఇతశ్చేతశ్చ రథ్యాయాం రౌతి భ్రామ్యతి ధావతి. 143

ఏవం విలాపజా భావా మనోభవవశానుగాః

ప్రలాప స్వరూపానుభావము లిం దున్నవి. ఈ యవస్థ కల వనిత యీ విధముగా ప్రలపించును. నా ప్రియు డిచట చూచినాడు. ఇచట కౌగిలించు కొనినాడు. ఇట వచ్చినాడు. ఇట నిలబడినాడు. ఇచట సంభోగ మొనరించినాడు. పిమ్మట నిట శయనించినాడు. ఇట నలంకరించు కొనినాడు. ఇట్టి వాక్యములు పలుకుట ప్రలాప మందురు. అంతః బహిః పురః పశ్చాత్ ఆరాత్ సమీపతః-ఒకచో చూచును. ఒకచో వెడలి పోవును. ఒకచో నిలబడును. ఒకచో నట్లె నిలబడును. ఒకచో శయనించును. ఒకచో నిందించును. ఒకచో నందించును. ఇటు నటు వీధిలో నేడ్చును భ్రమించును పరుగెత్తును. ఇట్లు విలాపజన్యము లయిన భావములు మనోభవవశానుగములై యుండును.

ఉన్మాదో విరహోత్థో యః సోఽతస్మిం స్తద్గ్రహో గ్రహః. 144

సర్వావస్థాసు సర్వత్ర సర్వథా సర్వదా మనః
తద్గతం తత్కథాహ్లాది ప్రద్వేష్టిష్టానపీతరాన్. 145

దీర్ఘం ముహుర్నిశ్వసితి తిష్ఠత్యనిమిషేక్షణం
విహారకాలే రుదతి క్రందతి ధ్యాయతి క్షణమ్. 146

గాయతి స్వదతే తస్మిన్ హసతి స్తౌతి ముహ్యతి
ఇత్థ మున్మాదజా భావాః కథితా నాట్యకోవిదైః. 147

ఉన్మాదము విరహము వలన గలుగును. ఉన్మాద మనగా "అతస్మిన్ తద్గ్రహః" అది కానిదానియందు తద్బుద్ధి. తద్గ్రహ గ్రహము. అట్టిజ్ఞానాగ్రహము. సర్వావస్థలలో సర్వస్థలము లందు సర్వవిధముల సర్వసమయములందు మన స్సా విధముగనె యుండుట యున్మాదము. ఉన్మాదము కలవారి మనస్సు తద్గతముగనె యుండును. తత్కథలతో నాహ్లాదించును. ఇష్టు లయిన నితరులను ద్వేషించును. దీర్ఘం ముహుః శ్వసించును. కనుమూత లేక యట్టె చూచును. విహారకాలమున నేడ్చును. కేకలు పెట్టును. క్షణము ధ్యానించును. గాన మొనరించును. స్వదించును. హసించును. స్తోత్రము చేయును. మోహము పొందును. ఇట్టి వన్నియు నున్మాదజన్యము లగు భావము లని నాట్యకోవిదులు నిరూపించిరి.

కామైర్విలోభనం ద్రవ్యైః సామదానోపబృంహితైః
ప్రేషితైరపి కేనాపి హేతునా చ నిరాకృతైః. 148

అభీష్టసంగమాభావా ద్వ్యాధిః సముపజాయతే
మోహోఽంగదాహః సంతాపః శిరశ్శూలశ్చ వేదనా. 149

ముమూర్షా జీవితోపేక్షా పతనం యత్ర కుత్ర చిత్
ప్రస్తాక్షతా నిశ్వసితం స్తంభశ్చ పరిదేవితమ్ 150

ఏతే వ్యాధిభవా భావాః ప్రాయః శృంగారయోనిజాః

వ్యాధి యను మన్మథావస్థాలక్షణ మిం దున్నది. అభీష్టసంగమము లే నందున వ్యాధి కలుగును. సామ దానోపబృంహితము లయిన నానాకామద్రవ్యములు పంపినను అవి విలోభన మని యేదో హేతువున నిరాకరింపగా నభీష్టునితో సంగమము లేకపోగా నీకామవ్యాధి కలుగును. ఈ సమయమున మోహము

అంగదాహము సంతాపము శిరశ్శూలము వేదన కలుగును. చనిపోవలె నన్న కోరిక కలుగును. జీవితమున నుపేక్ష కలుగును. ఎక్కడెక్కడనో పడిపోవును. ఇంద్రియశక్తులు దిగజారును. నిశ్వసితము లుండును. నిశ్చేష్టతారూప మయిన స్తంభము పరిదేవితము కలుగును. ఇట్టి వన్నియు వ్యాధిభవభావములు. శృంగార యోనిజన్యములు.

జాడ్యమప్రతిపత్తిః స్యాత్సర్వకార్యేషు సర్వదా. 151

ఇష్టానిష్టా న్న జానాతి సుఖదుఃఖే న వేత్తి చ
ప్రశ్నే న కించి త్ప్రబ్రూతే న శృణోతి న పశ్యతి. 152

హా హే తి భాషణాకాండహుంకారః శిథిలాంగతా
కార్శ్యవైవర్ణ్య నిశ్వాసాః స్తంభః స్పర్శానభిజ్ఞతా. 153

ఏతే జాడ్యభవా భావా మీనకేతన మాశ్రితాః

జాడ్యస్వరూప మిం దున్నది. సర్వదా సర్వకార్యము లందు నప్రతిపత్తి జాడ్య మందురు. అప్రతిపత్తి సరియగు పరిజ్ఞానము లేమి. ఇది యున్నప్పుడిష్టానిష్టములను గుర్తింపరు. సుఖదుఃఖములను దెలియరు. ప్రశ్నించిన నేమియు నుత్తర మీయరు. వినరు. చూడరు. హా!హా! అనుచు నకాండ హుంకారము చేయుదురు. ఇందు శిథిలాంగత యుండును. కార్శ్యము వైవర్ణ్యము నిశ్వాసము లుండును. స్తంభ ముండును. స్పర్శ తెలియదు. ఇవి జాడ్యభవ భావములు. మీనకేతను నాశ్రయించి యుండును.

ఆస్వవస్థాసు విహితైః ప్రతీకారైః సమాగమః. 154

న భవేద్యది కామాగ్నిదగ్ధయోర్మరణం భవేత్
అమంగలం స్యాన్మరణమితి యూనోర్న కల్ప్యతే. 155

ఈ యవస్థలలో విహితము లయిన ప్రతీకారముతో సంబంధము కలుగదేని, ప్రియసమాగమమున కేయుపాయము నుపయోగించునది కాదేని, కామాగ్నిదగ్ధులకు మరణమె వాటిల్లును. మరణ మమంగల మగుటచే నాయికానాయకులకు వర్ణితము కాదు.

శృంగారమున కుత్కర్షము కలిగించు కారణములు కొన్ని యున్నవి. వాని నిట్లు గ్రహింప వలెను.

సమగ్ర వర్ణనాధారః శృంగారో వృద్ధి మశ్నుతే
ఉత్కర్షః పుష్టిసంపచ్చే త్తేషాం క్వాపి సంభవః. 156

పాత్రాదీనాం గుణైః పూర్ణైః రసవృద్ధి ర్విభావ్యతే
రసోత్కర్షో భవే ద్దైశ్యైర్గుణైః స్సర్వత్ర పుష్కలైః. 157

పరిపూర్ణగుణా త్కాలా ద్రససంపద్విభావ్యతే
దేశకాలానుకూలాభి శ్చేష్టాభిః పుష్టి మశ్నుతే. 158

దేశకాలగుణా శ్చోక్తాః శ్చేష్టాః కాశ్చిచ్చ దర్శితాః

శృంగారము సమగ్రగుణవర్ణనాధారమున వృద్ధి పొందును. ఉత్కర్షము పొందును. పుష్టి సంపత్తి పొందును. ఒక్కొకచో పాత్రాదుల పూర్ణగుణముల కూడు కొనినదై రసము వృద్ధి పొందుటయు నొక్కొకచో గోచరించుటయు నున్నది. సర్వత్ర పుష్కలముగానున్న దేశీయగుణసంపదచే రసోత్కర్ష కలుగుటయు నున్నది. పరిపూర్ణగుణవిశిష్ట మగు కాలమున గూడ రససంపత్తి విభావిత మగును. దేశకాలానుకూలము లయిన చేష్టలచే గూడ రసము పుష్టి పొందుట యున్నది. కావున దేశకాలానుగుణములు చేష్టలు నిరూపితము లయినవి. ఈ ప్రతిపాదనమున రసోత్కర్ష హేతువు లిట్లు గ్రాహ్యములు.

1. సమగ్రవర్ణనాసంపద
2. పాత్రాదుల పూర్ణగుణసంపత్తి
3. పుష్కలము లగు దేశగుణములసంపద
4. పూర్ణగుణక మయిన కాలవిశేషము
5. దేశకాలానుకూల చేష్టా సమృద్ధి.

కావున నింత వఱకు దేశకాలగుణచేష్టలు, వివాహాదివర్ణనాసంపత్తియు ప్రతిపాదితము. పాత్రగుణకథన మపేక్షితము. కావున శృంగారోచితపాత్రములను తద్గుణములను వివేచింపవలసి యున్నది.

## నాయకాదిభేదములు

పాత్రాణి చ తద్గుణా న్సర్వా న్కథయామి యథార్థతః. 159

నాయకో నాయికా సఖ్యో విటాది సచివా అపి
దూత్యశ్చ దూతా శ్చేత్యేతత్పాత్రం నాట్యస్య కథ్యతే. 160

జ్యేష్ఠో మధ్యః కనిష్ఠశ్చ త్రిధా నాయక ఉచ్యతే
ఉక్తసర్వగుణోపేతో జ్యేష్ఠ ఇత్యభిధీయతే. 161

ద్విత్రై ర్వాపంచషైర్వాపి గుణై ర్హీనోఽథ మధ్యమః
హీనో గుణైశ్చ బహుభి రధమః పరికీర్తితః. 162

పాత్రలను తద్గుణములను అన్నిటిని అర్థానుసారమున నిరూపింతుము. నాయకుడు నాయిక సఖులు విటాదులు సచివులు దూతికలు దూతలు వీ రందరు నాట్యమునకు సంబంధించిన పాత్రమని యన దగిన వారు. నాయకుడు జ్యేష్ఠ మధ్యమ కనిష్ఠ భేదమున మూడు విధములు. నాయకలక్షణములుగా నిరూపితము లయిన సర్వగుణములు కలవా డయినచో జ్యేష్ఠనాయకుడగును. రెండు మూడు గాని యయి దారు గాని గుణములు తగ్గినచో మధ్యమ నాయకు డగును. బహుగుణహీను డయినచో నధమనాయకు డగును.

చతుర్ధా ధీర లలిత శాంతోదాత్తోద్ధతాః క్రమాత్
చతుర్ధా భేదభిన్నస్య తస్య సాధారణా గుణాః. 163

సర్వోఽపి వస్తులలితస్తస్యైతే హ్యాభిగామికాః
సాంగ్రామికాః గుణాః సర్వే తస్యైతేభ్యోఽభిగామికాః. 164

సాంగ్రామికాః స్యురుభయో రుద్ధతోదాత్తయోః స్వతః
శాంతస్య లలితస్యాపి ద్వయోస్తే హ్యాభిగామికాః. 165

ఇతి కేచిద్వదంత్యన్యే సర్వే సాధారణా ఇతి

నాయకునకు పునర్విభాగమున ధీరలలిత ధీరశాంత ధీరరోదాత్త ధీరోద్ధత భేదము లున్నవి. చతుర్ధా భేద భిన్ను డయిన నాయకునకు సాధారణ గుణము లుండును. నాయకుడు వస్తుతః లలితుడు. శాంతాదివిశేషములు నాయకున కాభిగామికములు, సాంగ్రామికములు నయిన గుణము లని భావించునది. వీరిలో ధీరోదాత్తునకు ధీరోద్ధతునకును అభిగామికములు సాంగ్రామికములు నయిన గుణములు స్వతస్సహజములు. ధీరశాంతునకు ధీరలలితునకు అభిగామికగుణములు స్వతస్సిద్ధము లని కొంద రందురు. సర్వవిశేషము లందర కుండు నని కొంద రందురు.

గుణాన్ సాంగ్రామికాన్వక్ష్యే పరస్తా దాభిగామికాన్. 166

రాజభోగేష్వనిశ్చింతో యౌవనాభోగభూషితః
విలాసీ భోగరసికో లలితః స్యా ద్రతిప్రియః. 167

కలాసక్తః క్షమాయుక్తో గంభీరశ్చ క్వచిత్క్వచిత్
ధీరశ్శాంతో భవే త్క్వాపి లలితాదిగుణైర్యుతః. 168

మహాసత్త్వోఽతిగంభీరః క్షమావా నవికత్థనః
స్థిరో నిగూఢాహంకారో ధీరోదాత్తో దృఢవ్రతః. 169

వికత్థన శ్చల శ్చండో మాయా ఛద్మ పరాయణః
సమత్సరశ్చాహంకారీ ధీరోద్ధత ఇతీరితః. 170

ధీరలలితాది నాయకులలో నాభిగామికగుణములు సాంగ్రామిక గుణములు నిరూపితము లయినవి. వీనిలో ముందుగా సాంగ్రామికగుణములను జెప్పుటయు ననంతర మాభిమానిక గుణములను జెప్పుటయు నిం దుండు నని పరిగ్రాహ్యము.

ఇచట ధీరలలితాదినాయకుల లక్షణముల నిట్లు గుర్తింప వచ్చును. ధీరలలితుడు రాజభోగముల విషయమున నిశ్చింతుడై యుండును. సర్వభోగరీతులను పరివారము కూర్చి యుంచుదురు గావున నాతని కెట్టి చింతయు నుండదు. చక్కని యౌవనాభోగమున భూషితుడై యుండును. విలాసియై భోగరసికుడై రతిప్రియుడై ధీరలలితనాయకు డుండును. ధీరశాంతు డీ విధమున నుండును. కళల యం దాసక్తుడు. క్షమాయుక్తుడు. ఒక్కొక్కచో గంభీరుడుగ నుండును. ఒకప్పుడు లలితాదిగుణములతో గూడిన వాడై యుండును. ధీరోదాత్తుడు మహాసత్త్వుడు అతిగంభీరుడు క్షమాయుక్తుడు ఆత్మశ్లాఘానాసక్తుడు స్థిరభావుడు నిగూఢాహంకారుడు దృఢవ్రతుడు నగును. ధీరోద్ధతుడు ఆత్మశ్లాఘాసక్తుడు చలస్వభావుడు చండప్రకృతి మాయాచ్ఛద్మపరాయణుడు మాత్సర్యము కలవాడు అహంకారిగా నుండును.

విశేషలక్షణేష్వేషు యే సామాన్యగుణాః స్మృతాః
తే తన్నాయకభేదేషు కల్పనీయాః క్వచి త్క్వచిత్. 171

సమానానాం గుణానాం యే మాయాచ్ఛద్మాదయో గుణాః
విరోధిన స్తేఽసామాన్యా గుణాః స్యుర్నాయకేషు తు. 172

నాయకుల గుణములలో విరోధ పరిహారరీతి యిందు గోచరించును. ఈ లలితాదులకు నిరూపించిన విశేషలక్షణములలో కొన్ని సామాన్యగుణములు నున్నవి. ఇట్టి సామాన్యగుణములను ఆ యా నాయక భేదములలో నొక్కొకచో నభ్యూహించి భావించునది. సమానము లయిన గుణములలో మాయాచ్ఛద్మాది గుణములు విరోధిగుణములుగా గోచరించును. అట్టి వానిని అసామాన్యగుణము లని విశేషగుణము లని భావింప వలెను. మాయాచ్ఛద్మాదు లుద్ధతనాయకుని విశేషగుణములు.

లలితాదినాయకులు అమాత్యాదు లం దాయత్తసిద్ధులై యుందురు.

సంగీతాంతఃపురాసక్తో యుద్ధాదిష్వతి నాదృతః
అమాత్యాయత్తసిద్ధిః స్యాత్ శృంగారీ లలితః స్మృతః. 173

శమప్రధానః క్లేశాదిసహిష్ణుశ్చ వివేచకః
ధీరశాంతో భవేదేషాం ధైర్యం సాధారణో గుణః. 194

ఉదాత్తో విజగీషుః స్యాదుభయాయత్తసిద్ధికః
అకృత్యకారీ స్వాయత్తసిద్ధి ర్ధీరోద్ధతో భవేత్. 175

ధీరలలితాదులు పాలకు లగు ప్రభువులు కాగా వారు సచివాయత్త సిద్ధి యుభయాయత్తసిద్ధి స్వాయత్తసిద్ధి స్వభావమున నుందురు. ఎవరెవ రెట్లుందురో యిందున్నది. ధీరలలితుడు శృంగారి. సంగీతాసక్తుడు. అంతఃపురాసక్తుడు. యుద్ధాదులలో మిగులనాదరతో నుండడు. ఈతడమాత్యాయత్తసిద్ధి. సర్వ కార్యము లమాత్యాధీన మొనర్చి సంగీతాంతఃపురాసక్తుడై యుండును. ధీర శాంతుడు శమప్రధానుడు. క్లేశాదులను సహింప గలడు. వివేచకుడుగా నుండును. అందుననె యుభయాయత్తసిద్ధి యగును. ధైర్య మీ నాయకుల కందరకు సాధారణ మయిన గుణము. ధీరోదాత్తుడు విజిగీషువు. ధీరుడు. ఉభయాయత్త సిద్ధి యగును. ధీరోద్ధతు డకృత్యకారి. ఎవరి నాలోచింపడు. స్వాయత్తసిద్ధి యగును.

ధీరలలితాది భేదభిన్ను డయిన నాయకునకు రూపాంతరమున గొన్ని భేదములు కలవు. ఇచట నవి నిర్దిష్టము లగును.

శృంగారాపేక్షయా తేషాం నాయికాసు చ వృత్తిభిః
అనుకూలాదిభేదేన చాతుర్విధ్యం ప్రసిద్ధ్యతి. 176

అనుకూలో దక్షిణశ్చ శఠో ధృష్ట ఉదీర్యతే

ధీరలలితాది నాయకులు శృంగార ధర్మానుసారమున తమ తమ నాయికల విషయమై వారి వృత్తివిశేషమునను అనుకూలాదిభేదమున చాతుర్విధ్యము సిద్ధమగును. అనుకూలుడు దక్షిణుడు శఠుడు ధృష్టుడు నని తద్విశేషములు.

ఏవం షోడశధా భిన్నా జ్యేష్ఠాదిత్రయసంయుతాః. 177

ఏతేఽష్టచత్వారింశత్స్యు ర్నాయకాః కవికల్పితాః
స్వరూపమనుకూలాదేః పరస్తా దభిధాస్యతే. 178

ధీరలలితాదిభేదమున నాలుగు విధములుగా నయిన నాయకు లనుకూలాదిభేదభిన్నులు కాగా పదునారు విధముల పరిగణింపదగుదురు. ఈ షోడశ నాయకులకు జ్యేష్ఠమధ్యమ కనిష్ఠ భేదత్రయ యోజనమున అష్టచత్వారింశత్ = నలుబది యెనిమిది భేదములు గలుగును. ఇట్టి భేదము లన్నియు కవికల్పితములు. అనుకూలనాయకుల స్వరూప మనంతరము నిరూపితము కాగలదు.

ఈ ప్రసక్తిలో పతాకానాయక వ్యవహారము కల యుపనాయక స్వరూపము నిరూపణీయము.

పతాకానాయక స్త్వేషా ముపనాయక ఉచ్యతే
తస్యైవానుచరో భక్తః కించిన్న్యూనశ్చ తద్గుణైః. 179

శృంగారాపేక్షయా తేఽపి కథ్యంతే బహుధా పునః
యత్రైవ వినియుజ్యంతే వక్ష్యంతే తత్ర తత్ర తే. 180

ధీరలలితాది నాయకుల కుపనాయకు లుందురు. వీరు పతాకానాయకులు. పతాకానాయకుడు నాయకున కనుచరుడుగా నుండి భక్తుడుగా నుండును. ఈతడు నాయకున కన్నకొంత న్యూనముగా నుండును. నాయకు నందున్న గుణము లన్నియు నీతనిలో నుండవు. కొన్ని తక్కువగా నుండును. శృంగారానుసారమున నా గుణము లనేకవిధములుగా నుండును. అవియు నిరూపితము లగును. ఎచ టెచట నా గుణములు వినియుక్తము లగునో అచట నివి నిరూపితము లగును.

## నాయక సహాయులు

ఈ నాయకులకు నర్మసచివు లుందురు వారు ధర్మార్థకామము లందు వినియుక్తు లగుదురు.

ఏతేషాం నర్మసచివాః ఋత్విజః సపురోహితాః
తపస్వినో వేదవిదో బ్రాహ్మణా వ్రతినోపి చ. 181

అన్యే చాశ్రమిణః సర్వే ధర్మస్య సచివాః స్మృతాః
మంత్రిణః సైన్యపాలాశ్చ కుమారాః సుహృదోఽపి చ 182

అర్థస్య సచివాః ప్రోక్తాః తత్తదర్థానుషంగిణః
ఏతే స్యుః కామసచివాః పీఠమర్దో విట స్తథా. 183

విదూషకశ్చ సఖ్యాదిపరివారేణ సంయుతః

లలితాదులకు నర్మసచివులు కొందరు కలరు. వీరిలో ధర్మసచివులు అర్థసచివులు కామసచివులు నున్నారు. ఋత్విజులు పురోహితులు తాపసులు వేదవిదులు బ్రాహ్మణులు వ్రతధారులు ఆశ్రమగతులు నను వీరు ధర్మసచివులు; ధర్మానుసరణమున వీరు సహాయక మొనరింతురు. లోకజనులు వేరు వేరు ధర్మముల ననుసరింతురు గావున ఋత్విజాదుల యావశ్యకత యున్నది. మంత్రులు సైన్యపాలకులు కుమారులు సుహృదులు ననువారు అర్థసచివులు. అర్థచింతనమున వీరు సహాయకర్తలు. అర్థనీతి ననుసరించిన తత్తద్విభాగమున తత్తదర్థానుషంగమున నుందురు. కామసచివు లి ట్లుందురు. పీఠమర్దుడు విటుడు విదూషకుడు నను వారు సఖ్యాదిపరివారమున గూడుకొనిన వారై కామతంత్రమున సహాయకారులుగా నుందురు. ఇట్లు ధర్మార్థకామసచివు లున్నారు. మోక్షసచివుల నిందు నిర్దేశింప లేదు. మోక్షము స్వానుసంధానగమ్యము.

ప్రకృతాధికారమున శృంగారప్రతిపాదనమె ప్రధానము కావున కామసచివుల స్వరూపకథనమావశ్యకము.

శృంగారాపేక్షయా తేషాం స్వరూపం కథ్యతేఽధునా. 184

ఏకవిద్యో విట స్తస్య కామతంత్రేషు కౌశలం
వికృతాంగవచోవేషైః హాస్యకృత్ స్యా ద్విదూషకః. 185

పీఠమర్ద్యాస్య పురతః ప్రయోక్తా నాయకాదిషు
స పీఠమర్దో విశ్వాస్యః కుపిత స్త్రీ ప్రసాదకః. 186

విటాదుల స్వరూపము శృంగారానుసారమున నిరూపిత మగును. విటుడు ఒక విద్య కల వాడు. గీతనృత్తాదులలో నొక విద్యయందు కుశలుడు. విటునకు కామతంత్రము లందు కౌశలము కలదు. విదూషకుడు వికృతము లయిన ఆంగికములచే వచనములచే వేషవిశేషములచే హాస్యకారి యగును. పీఠ మర్దు డీ విధముగ నుండును. ఎదుటగా పీఠ మధిష్ఠించి యుండి నాయకాదుల విషయమున ప్రయోక్త యగును. ఇట్టి పీఠమర్దుడు విశ్వసనీయుడు. కుపిత స్త్రీ ప్రసాధకుడై యుండును.

## దూతదూతీస్వరూపము

కథినీ లింగినీ దాసీ కుమారీ కారుశిల్పినీ
పాషండినీ ప్రాతివేశ్యా సఖీ రంగోపజీవినీ. 187

ధాత్రేయికా ప్రేక్షణికా దూత్యః స్త్రీపుంసయోర్మిథః
న దీనం నార్థవంతం చ న చాతిచతురం జడమ్. 188

దూతం వాపి హి దూతీం వా కదాచన చ సందిశేత్

నాయికానాయకులకు దౌత్యము నిర్వహించుటలో స్త్రీలు పురుషులు నుందురు. వారు దూతీదూత పద వాచ్యులు. స్త్రీపురుషులకు పరస్పరము దౌత్యము నిర్వహించుటకు కథిని—కథలు చెప్పునట్టి స్త్రీ, లింగిని— పాశుపతాది చిహ్నములను ధరించిన స్త్రీ, దాసి,కుమారి,కమ్మరవాని వనిత. శిల్ప మొనరించు స్త్రీ,పాషండిని—పాషండమతావలంబిని, ప్రాతివేశ్య—ప్రక్కనున్న యింటియందలి స్త్రీ, సఖి,రంగోపజీవిని—రంగమున వేషధారణ మొనరించు నర్తకి, ధాత్రేయిక—చిన్ననాటినుంచి పెంచిన యామె కూతురు, ప్రేక్షణిక యనువారు దూతీక్రియ నాచరింతురు. దూతను గాని దూతిని గాని సందేశమునకు నియమించుటలో నొక నియమానుసరణము యుక్తము. ఒకప్పుడయినను దీనుని ద్రవ్యము కల వానిని అతిచతురుడయినవానిని అత్యంతము జడుడయినవానిని దౌత్యమున నియమింప రాదు. అట్టివారి నియమన మనర్థకారి. మధ్యలో వారె యభీష్టము సాధించు కొందురు. జడుని వలన కార్యభంగము కలుగును. దూత కాదగని వారి విశేషము లి ట్లుండగా దూత కా దగిన వారి విశేషము లిట్లుండును.

దేశకాలజ్ఞతా భాషామధురత్వం విదగ్ధతా. 189

ప్రోత్సాహనేషు ప్రౌఢత్వం తథా సంవృతమంత్రతా
యథోక్తకథనం చేతి గుణా దౌత్యం ప్రపత్స్యతామ్. 190

దౌత్యము స్వీకరించు వారి గుణవిశేషము లీ విధముగా నుండును. దేశము కాలము గుర్తించి ప్రవర్తించుట, భాషామధురత, వైదగ్ధ్యము, ఆయా కర్మలలో ప్రోత్సాహము కలుగ జేయుటలో ప్రౌఢత, రహస్యాలోచనము దాచి యుంచుట, యథోక్తకథనము అను నివి దౌత్యము కలవారి గుణములు.

ప్రేయసీ ప్రియులు నవానురాగము కలవారు కాగా దూతి యాచరింప వలసిన సమాగమోపాయములు నిరూపితములు కా దగును.

నవానురాగే మానాదివిరహే వా సమాగమః
నానోపాయైర్విధేయః స్యాద్దూతీభిః పురుషాశ్రయః. 191

ఉత్సవే రాత్రిసంచారే ఉద్యానే జ్ఞాతివేశ్మని
ధాత్రీగృహే చ సఖ్యాశ్చ తథా చైవ నిమంత్రణే. 192

వ్యాధ్యాది వ్యపదేశేన శూన్యాగారా నివేశనే
నవానురాగే కర్తవ్యో నృణాం ప్రథమసంగమః. 193

దూతికలు పురుషవిషయమున నవానురాగము నందును మానాదికృతమయిన విరహము నందును నానోపాయవిశేషములతో సమాగమమును సంపాదింప వలసి యున్నది. ఏ యే స్థలము లం దట్టి సమావేశము సంపాద్యము కావలెనో వాని సంకేత మిచట నున్నది. ఉత్సవసమయమున నాయికానాయకుల నొకచో గూర్చవచ్చును. రాత్రిసంచారమున నొకరినొకరు తెలియ కుండు నట్లు కలుప వచ్చును. ఉద్యానవనమునందు జ్ఞాతిభవనమున గలుప వచ్చును. ఇట్లు ధాత్రీగృహమున సఖీభవనమున వారలను పిలువ నంపి కలుప వచ్చును. వ్యాధి కలిగిన దన్న వ్యాజమున కూర్చ వచ్చును. శూన్యాగారమున నిద్దరను ప్రవేశపెట్టి సంగతపఱుప వచ్చును. ఇట్లె నవానురాగమున ప్రథమసంగమము సంపాద్యము.

## నాయికాభేదములు

నాయక విభాగానంతరము నాయికా విభాగము ప్రసక్తము.

స్వాఽన్యా సాధారణా చేతి త్రివిధా నాయికా మతా
ముగ్ధా మధ్యా ప్రగల్భేతి త్రేధా స్వీయా విభజ్యతే. 194

మధ్యా త్వధీరా ధీరా చ ధీరాధీరేతి భిద్యతే
భిన్నే జ్యేష్ఠాకనిష్ఠేతి ప్రగల్భామధ్యమాపి చ. 195

తయోరుదాత్త లలిత శాంతి భేదైస్త్రిధా భిదా
ఊఢాచ కన్యకా చేతి ద్విధైవాన్యాంగనా భవేత్. 196

సాధారణస్త్రీ గణికా సావ్యేకైవ న భిద్యతే
త్రయోదశ విధా స్వీయా ద్వివిధాన్యాంగనా మతా 197

ఏకా వేశ్యా పునశ్చాష్టావవస్థాభేదతో౽పి తాః
పునశ్చ తాస్త్రిధా సర్వా ఉత్తమాధమ మధ్యమాః. 198

ఇత్థం శతత్రయం తాసా మశీతి శ్చతురుత్తరా
సంఖ్యేయం రుద్రటాచార్యై రుపభోగాయ దర్శితా. 199

నాయికా భేదగణన మిందు కలదు. రుద్రటు డుపభోగమునకై నాయికలు మొత్తము 384 మూడు వందల యెనభై నాలుగు భేదములు కల వారగుదురనెను. ఈయంశము నిట్లుగుర్తింప వచ్చును. నాయిక స్వీయ యని పరకీయ యని సాధారణస్త్రీ యని మూడు విధముల నుండును. ఇందు స్వీయ నాయిక త్రయోదశ భేదములు కల దగును. వాని నిట్లు గుర్తించునది, స్వీయ నాయిక ముగ్ధ మధ్య ( ప్రౌఢ ) ప్రగల్భ యని త్రివిధ. ఇందు మధ్య ధీర అధీర ధీరాధీర యని మూడువిధముల నగును. వీరలకు జ్యేష్ఠా కనిష్ఠా భేదము కూర్పగా నారు భేదములు కలుగును. ప్రగల్భవనితకు జ్యేష్ఠా కనిష్ఠా భేదమున ద్వైవిధ్యము కలుగగా వారలకు ఉదాత్త లలిత శాంత భేదములను కూర్చినచో నారు భేదములు కలుగును. పరకీయ వనిత ఊఢ యని కన్యక యని ద్వివిధ మగును. సాధారణస్త్రీ గణిక. ఆమె యేకవిధ; అందిక భేదములు లేవు. కాగా స్వీయ త్రయోదశవిధ. అన్యాంగన ద్వివిధ. వేశ్య యొకతె. మొత్తము వీ రందరు పదునారు నాయిక లనినారు.

వీరలకు ఎనిమిది యవస్థల సంబంధము కూర్చినచో నూట యిరువది యెనిమిది భేదములు కలుగును. వీరలకును ఉత్తమ మధ్యమాధమ భేద సంకలనమున మూడు వందల యెనుబది నాలుగు భేదము లగుచున్నవి. ఈ సంఖ్యను రుద్రటాచార్యు లుపభోగమునకై నిరూపించెను.

స్వీయకు వలెపరకీయకు సాధారణ వనితకు నెనిమిది యవస్థల సంబంధము కూర్పగా నిన్ని భేదములు కలిగినవి. కొందర రందర కన్ని యవస్థలుండుట నంగీకరింపరు. వారి భావమున నిన్ని భేదములు లేవు. అట్టి యితరుల భావనిరూపణ మిచట నున్నది.

అన్యా స్త్ర్యవస్థైవే త్యేకే కథయంతి మనీషిణః
ప్రథమాయా మవస్థాయా మన్యా స్యా ద్విరహోన్మనాః. 200
తతోఽభిసారికా భూత్వా సంకేతే పశ్యతి ప్రియం
సంకేతాచ్చేత్పరిభ్రష్టా విప్రలబ్ధా భవే త్పునః. 201
పరాధీనతయా తస్యా నాన్యాఽవస్థా విలోక్యతే

అన్యనాయిక కష్టావస్థలు సంభవింపవు. ఆమెకు మూ డవస్థలే కలుగునని కొందరు మనీషు లనిరి. పరకీయకు విరహోత్కంఠిత అభిసారిక విప్రలబ్ధ యవస్థలు మూడుమాత్రమె సంభవించు ననుట సోపపత్తికముగా నిం దున్నది. అన్యవనిత మొదటి యవస్థలో విరహమున నున్మనస్కయై యుండును. కావున విరహోత్కంఠిత. ఆ పిమ్మట నభిసారికయై సంకేతమున ప్రియుని దర్శించును. కావున అభిసారిక యగును. సంకేతమున పరిభ్రష్ట యయినచో విప్రలబ్ధ యగును. పరకీయ పరాధీనురాలు. కావున నితరము లగు నవస్థ లామెకు సంబంధింపవు.

పరకీయ వేశ్యయను వారి విషయమున నొక విశేష మున్నది. అది యి ట్లున్నది.

స్వీయం సువృత్తముల్లంఘ్య యద్యేకేన చిరం వసేత్. 202
సాఽన్యా స్యాత్ గణికాఽప్యేవం భవేత్ సాఽన్యా భవిష్యతి

సభర్తృక యయిన పరవనిత సాంప్రదాయిక మయిన కులక్రమాగత మయిన సువృత్తము నుల్లంఘించి తన భర్తను విడనాడి వేరొకని వలచి వానితో చిరకాల ముండునేని యట్టి యామె యీ చెప్పిన వారికన్న వేరొకతె యగును. ఇట్టి విశేషమునే గణికావిషయమున గూడ భావింప వలసి యున్నది. సామాన్య వనితయు తన వంశక్రమాగత మయిన సుఖంకర శోభన వృత్తమును విడనాడి తాను వలచినవాని తోడనే చిరకాలముండునేని యామెయు వేరొక వనితగా భావింపదగి యున్నది.

దీని కనుబంధముగా నీ విషయము కూడ భావనీయము. వేశ్య తన సర్వవల్లభావ్రతము విడనాడి యొకని యందే రక్తయై చిర ముండునా ?

సాధారణస్త్రీ గణికా సా విత్తం పర మిచ్ఛతి. 203

నిర్గుణేఽపి న విద్వేషో న రాగోఽస్యా గుణిన్యపి
శృంగారాభాస ఏవ స్యాన్న శృంగారః కదాచన. 204

ఇతి ద్విషంత ముద్దిశ్య ప్రాహ శ్రీరుద్రటః కవిః
రాగశృంగారనిర్ముక్తా యది స్యు ర్గణికాః స్వతః. 205

యోషిత్సామాన్యతో జాతః స్మరః కిం భక్షితః శ్వభిః ?

గణిక వేశ్య. ఆమె సాధారణస్త్రీ. సర్వజనులకు నామె స్త్రీ. ఆమె ద్రవ్యమునె ముఖ్యముగా నభిలషించును. ఆమె రాగరంజిత కాదు. నిర్గుణు నందును వేశ్యకు విద్వేష ముండదు. గుణవంతు నందు నామెకు రాగ ముండదు. విత్తమునకై యందర నాదరించును. వేశ్యకు రాగము లేదు. రాగము లేని వనితతో భోగము శృంగారము కాదు. ఎన్నడు నది శృంగారరసము కాదు. అది శృంగారాభాసమె. ఇట్టి భావమును శ్రీరుద్రటకవి నిరూపించెను. వేశ్యావిలాసము ద్వేషించు వాని నుద్దేశించి రుద్రటు డట్లనెను.

వేశ్యలకు రాగమె యుండదా? వారు స్త్రీలు కారా? వేశ్య యయినంత మాత్రమున రాగము నశించునా? ఈ యంశము భావనీయము. గణికలు ప్రకృతి సహజముగ రాగశృంగారనిర్ముక్త లగుదు రేని స్త్రీసామాన్యముగా గలుగు కామము శునకభక్షిత మయినదా ?

కింతు తాసాం కలాకేలికుశలానాం మనోరమమ్. 206

విస్మారితాపరస్త్రీకం సురతం జాయతే నృణాం
కుప్యత్పినాకి నేత్రాగ్ని జ్వాలా భస్మీకృతః పురా. 207

ఉజ్జీవితః పునః కామో మన్యే వేశ్యావిలోకితైః
కలావిలాస వైదగ్ధ్య వసతిర్గణికాజనః. 208

పుంసాం సౌభాగ్య వైదగ్ధ్య నికషః కేన నిర్మితః ? 209

ఈర్ష్యా కులస్త్రీషు న నాయకస్య
నిశ్శంక కేలి ర్న పరాంగనాసు
వేశ్యాసు చైతద్ద్వితయం ప్రరూఢం
సర్వస్వ మేతా స్తదహో స్మరస్య. 210

వేశ్యలు కలాకేళీ కుశలత కలవారు. పురుషులకు వారితో సురతము మనోరమము. ఆ సమయమున సన్యస్త్రీస్మృతి యుండనే యుండదు. కోపించిన శివుని నేత్రాగ్నిజ్వాలా భస్మీకృతు డయిన కాముడు పూర్వము వేశ్యల విలోకనముల వలననె మరల నుజ్జీవితు డయినాడు. వేశ్యలు కలావిలాస వైదగ్ధ్య ములకు వసతి. వారె పురుషుల సౌభాగ్యమునకు వైదగ్ధ్యమునకు నికషము వంటి వారు. వారి నెవరు నిర్మించిరో ! వారు వారుగనె విలసిల్లిరి.

కులవనితలలో నీర్ష్య యుండును. వారి సంభోగము కషాయితము నాయకునకు పరాంగనలలో నిశ్శంకసురత కేళి యుండదు. వేశ్యలలో నీ వెలితి లేదు. వేశ్య స్మరసర్వస్వము. వేశ్యలలో నీర్ష్యారహిత మయిన సురతకేళి శంకారహిత మయిన సంభోగవిలాసము లభించును. ఇట్టిది రసాభాసమా?

ఈ ప్రఘట్టమున స్వాన్యా వేశ్యా స్వరూప స్వభావములను వివేచిం చుట యుక్తము. అందరిలో భోగ మున్నది. ఇంక నున్నది. వాని నిట్లు గ్రహించునది.

సమాన కుల శీలేన యోనోఢా వహ్నిసాక్షికం
సా స్వీయా తస్య సైవాన్యా భవే ద్భర్తృ వ్యతిక్రమే. 211
వ్యతిక్రమే తు కన్యాయాః సాప్యన్యా న కులాంగనా
భోగేప్సవః స్యుః స్వీయాశ్చేదన్యా భోగధనేప్సవః. 212
అర్థేప్సవః స్యుర్గణికా స్తా స్తథావర్ణ యేత్కవిః

స్వీయాస్వరూప మీ విధముగ నుండును. సమానకులము సమాన శీలము కల వరుడు వహ్నిసాక్షికముగా వివాహము చేసికొనినచో స్వీయ యగును. వహ్నిసాక్షికముగా వివాహిత యయిన వనిత భర్తృవ్యతిక్రమము కల దయినచో అన్య యగును. పెండ్లి కాని కన్య వృత్తివ్యతిక్రమము కల దయినచో అన్యయే యగును; కులాంగన కాదు. స్వీయవనితలు భోగేచ్ఛ కలవారు. అన్యవనితలు భోగధనేచ్ఛ కలవారు. గణికలు ధనేచ్ఛ కలవారు. వీరి నీ విధముగనే కవులు వర్ణింప వలెను. వనితాసహజముగా కామభోగాభి

లాప యున్నను స్వభావగత మయిన ఈ యభిప్రాయభేదమున వీరి స్వరూప మును నిర్ణయించునది. స్వీయయం ధనేచ్ఛ యుండదు. అన్యావేశ్యల కది యున్నది.

న ముంచతి ప్రియంస్వీయా సంపత్స్వపి విపత్స్వపి. 213

శీలసత్యార్జవోపేతా రహః సంభోగ లాలసా
ముగ్ధా నవవయఃకామా రతౌ వామా మృదుః క్రుధి. 214

యతతే రతిచేష్టాసు పత్యుర్వీళ్రీలామనోహరం
అపరాధే రుదత్యేవ న వదత్యప్రియం ప్రియే. 215

ప్రియం ప్రార్థయతే మధ్యా రతివ్యాయామకేలిషు
స్వయం పునః ప్రవర్తేత సహతే సురతశ్రమమ్. 216

సోపాలంభం వచో వక్తి సాపరాధే ప్రియే రుషా
ప్రగల్భాఽఽరభతే స్వైరం బాహ్యేచాభ్యంతరే రతే. 217

అపరాధే ప్రియం రోషాత్ భాషతే పరుషం ముహుః
ధీరా రతిపరిశ్రాంతా మూర్ఛితాఽపి పునః పునః. 218

ప్రోత్సాహయతి వా స్వైరం యతతే పురుషాయితే
ఉపచారైః సవినయైః అథవాఽ క్రమభాషితైః. 219

ఖేదయత్యేవ నేక్షేత సాపరాధం ప్రియం రుషా
అధీరా దయితాశ్లిష్టా రతచేష్టా న బుద్ధ్యతి. 220

మోదతే ముహ్యతి ముహుః స్వేదరోమాంచమంథరం
అపరాధే సతి ముహుః హుం హుం ఇత్యేవ భాషతే. 221

సఖీసమక్షం కురుతే కేశాకర్షణతాడనం
ధీరాధీరా తదుభయం వ్యనక్తి రతిచేష్టితమ్. 222

స్వీయ సంపదలలో గాని విపదలలో గాని ప్రియుని విడనాడదు. శీలము సత్యము ఋజుత్వములతో గూడి యుండును. రహః సంభోగ లాలసగా నుండును. స్వీయలో ముగ్ధా మధ్యా ప్రగల్భా భేదములు కలవు కదా! ఇది యంతయు ముగ్ధాస్వభావము. ముగ్ధ నవవయసుచే శోభించును. నవకామముచే భాసించును. రతిసమయమున వామ. వలదు వల దనును. కోపము కలిగినను ఋళి

బులి కోపమునసె యుండును. పతి యొనరించు రతిచేష్టలలో క్రీడామనోహార ముగ యత్నించును. అపరాధము కలిగెనా ఏడ్చును. ప్రియు డప్రియము పలికి నను ఏమియు ననదు. ఇది యంతయు ముగ్ధాభోగరీతి.

మధ్యావనిత ప్రియుని రతివ్యాయామక్రీడలలో నట్టివాని నట్టివానిని స్వయముగ ప్రార్థించును. తానే స్వయముగ భోగసంభోగముల ప్రవర్తించును. సురతశ్రమ మెంత యున్నను సహించును. ప్రియుడు కామాపరాధ మొనరించి నచో కోపమున సుపాలంభ సహితముగా మాటలు పలుకును.

ప్రగల్భయగు వనిత బాహ్యసంభోగమున గాని యాంతరసంభోగ మున గాని తానే స్వయముగ నా యా చేష్టల నారంభించును. ప్రియు డపరాధ మొనరించినచో రోషమున పరుషము భాషించును. ఇట్లు ముగ్ధా మధ్యా ప్రగల్భా రతిరీతు లున్నవి.

ఇక ధీరాధీరాధీరాధీరా రతిగతు లీ విధమున నుండుట సంధార్యము. ధీరవనిత రతిపరిశ్రాంత యయినను రతిమూర్ఛిత యయినను మఱల మఱల రతివిధానమునకు ప్రియుని ప్రోత్సాహ పెట్టును. పురుషాయిత మొనరించుటకు-తానే ప్రియునిపై సంభోగ మాచరించుటకు యత్నించును. ప్రియుడు భోగాప రాధ మొనరించు నేని సవినయోపచారవిశేషములచే నుత్సాహము కలవా నిగా జేయును. అథవా అక్రమభాషితములతో ఖేదపెట్టును. సాపరాధ ప్రియుని రోషమున జూడనే చూడదు.

అధీరవనిత యయినచో ప్రియు డాలింగనను చేసికొనగానే సంభోగ చేష్టలను గుర్తింప నేరదు. పరవశురాలగును. సంతోష పడును. సంభోగముగ్ధ యగును. స్వేదరోమాంచమంథరముగా రతిమూర్ఛిత యగును. ప్రియుడు భోగాపరాధము కలవాడు కాగా హుం, హుం, అని ముహుర్ముహుః హుంకార మొనరించును. చెలికత్తెల సమక్షమునసె కేశాకర్షణ మొనరించును. తాడన మాచరించును.

ధీరాధీర యయినచో నన్నియు నాచరించును. రతిచేష్టితముగా నన్ని టిని వ్యక్తము చేయును. ఇట్లు ధీరాదివిశేషములు శృంగారసంగతములుగా నున్నవి. వీనిని కవు లీ విధముగా వర్ణింపదగును.

ఉదాత్తాదిభిదాః కేచిత్సర్వాసామితి జానతే
తేఽపి ప్రాయేణ దృశ్యంతే సర్వాసామపి కార్యతః. 223

ఉదాత్త శాంత లలిత భేదములు మధ్యమాప్రగల్భలకు మాత్రమె నిరూపితము లయినవి. కాని యా భేదము లందరకు గలవని కొంద రనిరి. ఆ భేదములు సామాన్యముగా నందరకు గల వని వారి వారి కార్యవిశేషముల వలన గోచరమగుచునె యున్నది. ఆ యా వనితల వచన పరిపాటిలో చేష్టావిశేషము లలో భావరీతులలో నా భేదములు భాషించుచునె యున్నవి.

కన్యోఢాచేష్టితం ముగ్ధాచేష్టితేషు ప్రవక్ష్యతే
వేశ్యాఽన్యదీయా చేష్టాశ్చ రక్తారక్తాది లక్షణే. 224

వక్ష్యామ స్తత్ర తత్రైవ విద్వద్భి రవలోక్యతాం
అల్పాంతరత్వా దన్యాసామవస్థానాం స్వభావతః. 225

అల్పవైషమ్యతోఽవస్థాభిదాః న పృథగీరితాః

పరకీయ కన్య యని ఊఢ యని ద్వివిధ యగుట సూచితము. ఈ కన్యోఢా చేష్టితమును ముగ్ధాచేష్టితములలో నిరూపింతుము. వేశ్యాచేష్టలు పర కీయాచేష్టలు రక్తవనితా లక్షణము అరక్తవనితా స్వరూపము ఆ యా స్థలముల నిరూపితము కా గలదు. విద్వాంసు లా యా స్థలముల జూడ దగును. స్వాధీనపతి కాది వనితల విశేషము లన్నియు నా యా యవస్థాస్వభావములు. వాని కంతర మంతగా లేదు. అవి యల్పాంతరములు. స్వభావతః వాని వైషమ్య మల్పము. కావున నా భేదములు వేరుగా నిరూపితము లగుట లేదు.

ఉదాత్తాదిస్వరూప శోభ కల వనితల చేష్టావిశేషముల నిరూపణము భావింపదగును.

ఉదాత్తా కేశ వాసోఽంగ మాల్య భూషాసు సాదరా. 226

శయ్యాభరణ సంస్కార పరిబర్హసమేధినీ
స్థిరస్నేహా కృతజ్ఞా చ దదాత్యాశ్రితవత్సలా. 227

మానయంతీ చ మానార్హా న్నిత్యోత్సవరతాఽపి చ
బంధుసంబాధముదితా కృతజ్ఞా ప్రియవాదినీ, 228

ఏవమాదిగుణై ర్యుక్తా ముదాత్తాం పరిచక్షతే

ఉదాత్తవనితా స్వరూపచేష్ట లిం దున్నవి. కేశసంస్కారము వస్త్రాలంకారము అంగరాగము మాల్యధారణము భూషావిన్యాసము లందు సాదరముగా నుండునది, శయ్యాసంస్కారములచే నాభరణాలంకరణములచే శోభకలది, స్థిర మగు స్నేహము కలది, కృతజ్ఞ దానప్రియ సమాశ్రితవత్సలగా నుండునది యగునామె యుదాత్త. ఉదాత్త మాననార్హులను బహుమానించును. నిత్యముత్సవాసక్తితో నుండును. బంధువు లధికముగా వచ్చిన నధికముగా సంతసించును. కృతజ్ఞగా నుండును. ప్రియవాదినిగా నుండును. ఇట్టి గుణములతో నున్న వనిత ఉదాత్తవనిత.

సౌందర్యైశ్వర్య సౌభాగ్య విద్యా భోగై రహంకృతా. 229

విద్యాభిజనసంపన్నా న్బంధూ నప్యవమన్యతే

గర్వాభిమానభరితా మాయాచ్ఛద్మపరాయణా. 230

ఆత్మకుటుంభరా ఘోరా సోద్ధతా పరికీర్తితా

ఉద్ధతవనితా స్వభావ మిం దున్నది. ఉద్ధత సౌందర్యము ఐశ్వర్యము సౌభాగ్యము విద్య భోగములచే నహంకృత యగును. వీని వలన సాహంకార యగును. విద్యకలవారిని ఆభిజాత్యము కలవారిని బంధువు లయిన నవమానించును. గర్వాభిమానభరితయై మాయాఛద్మపరాయణయై యుండును. ఈమె తన యుదరపోషణరత. కుటుంభరఘోరప్రకృతి. ఇట్లున్న యాడుది యుద్ధత యగును. మధ్యాప్రగల్భల భేదకథనమున ఉదాత్త శాంత లలిత స్వభావభేదములనె చెప్పెను. ఉద్ధతభావము చెప్పలేదు. అయిన నుదాత్తాది విభేదముల నన్నిటిని కొందరంగీకరింతు రని సూచించి నందున నిది మతాంతర మని భావనీయము. భేదత్రయ ముండు ననుటయు మతాంతరము. అన్నిటిని సూచించుట యిందలి రీతి.

సుఖినీ నిత్యసంతుష్టా సత్సమ్మానావమానయోః. 231

అనసూయు రహంమానహీనా విగతమత్సరా

ఉపకారపరా నిత్య మపకారపరేష్వపి. 232

ఉపాచరతి బంధూన్యా సా శాంతేతి చ కథ్యతే

శాంతస్వభావ మిం దున్నది. ఈమె సుఖినీ, నిత్యసంతుష్ట. మానావమానములలో నేకవిధముగనే యుండి యసూయారహిత యగును. అహంమాన మీమెలో నుండదు. మాత్సర్య ముండదు. అపకార మొనరించిన వారి విషయమున గూడ నుపకారపరురాలుగా నుండును. బంధువుల కుచితము లగు నుపచారము లొనరించును. ఇట్లున్నచో శాంత యగును. ఉద్ధత కన్న నీమె యత్యంతము భిన్నప్రకృతి. శాంతారూపవివేచనమునకె యుద్ధతారూప మట్లు నిరూపిత మని భావింప వచ్చును.

రూప యౌవన సంపన్నా సఖీ కేలి కృతోద్యమా. 233

వాసోఽంగరాగ మాల్యర్తు వేలా శైల సరిత్ప్రియా
సంభోగరసికా హేలా భావ హావ సమేధితా. 234

కలాశిల్ప విశాలాఢ్యా లలితా పరికీర్తితా

లలితవనితా స్వరూప వివేచన మిం దున్నది. ఈ లలిత రూప యౌవన సంపన్న. చెలియలతో నాటలాడుటలో నాసక్త. అందు కృతోద్యమ. వస్త్రము లంగరాగములు మాల్యము లం దాసక్త. వసంతాది ఋతువులలో విహారాసక్త. సాగరతీరము లందు శైలపరిసరము లందు సరిత్తటము లందు సమాసక్త. సంభోగ రసిక. హేలా హావ భావములచే సమేధితస్వభావ. కలా వైభవము శిల్పవైభవము లచే పరిపూర్ణ. ఇట్టి యీమె లలిత.

## అష్టవిధ నాయికలు

ఖండితా విప్రలబ్ధా చ తథా వాసకసజ్జికా. 235

స్వాధీనభర్తృకా చైవ కలహాంతరితాపి చ
విరహోత్కంఠితా చైవ తథా ప్రోషితభర్తృకా. 236

తథాఽభిసారికేత్యష్టా వవస్థా నాయికాశ్రితాః

నాయికలకు భేదసంపాదకము లయిన యవస్థ లష్టవిధముల నున్నట్లు సూచితము. నాయికాశ్రితము లయిన ఎనిమిది యవస్థల పేరు లిచట కలవు. ఈ నామములు సార్థకములు. తదవస్థారూపమును కొంత సూచింప గలవు. ఖండిత-విప్రలబ్ధ-వాసకసజ్జిక – స్వాధీనభర్తృక-కలహాంతరిత – విరహోత్కంఠిత –

ప్రోషితభర్తృక- అభిసారిక యను నామము లీ యవస్థ కలవారిని జెప్పును. వీరి స్వరూప మిట్లుపైని నిరూపిత మగుచున్నది.

### ఖండిత

అతీత్య సమయం యస్యా వ్యాసంగా దన్యతః పతిః. 237

భోగాంకలక్షితః ప్రాత రేతి చేత్సా హి ఖండితా
బిభేతి చింతయతి చ తూష్ణీం ధ్యాయతి తామ్యతి. 238

ఖిద్యతి భ్రామ్యతి ముహుర్దీర్ఘం శ్వసితి రోదితి
ముహుర్విలపతీత్యేతే వికారాః ఖండితాగతాః. 239

ప్రాగుక్తా ఏవ భావాః స్యుః సాపరాధప్రియాగమే

ఇందు ఖండితాస్వరూపము చేష్టలు నున్నవి. నాయికకు నియత మొనరించిన సమయసంకేతమును ఇతరవ్యాసంగమున ప్రియు డతిక్రమించి సమయమునకు రాక ప్రాతఃకాలమున నితరవనితాభోగసంభోగముల చిన్నెలతో కూడి వచ్చునేని వాని జూచి కుపిత యయిన వనిత ఖండితవనిత యగును. సమయమున రా నందున భోగాంకములతో వచ్చినందున ప్రియ నానావ్యథల పొందును. అవి యిచట నిరూపితము లగుచున్నవి ఖండిత భయపడును. చింతించును. ఊరకనె యుండి ధ్యానించును. వ్యథ నొందును. ఖేద పడును భ్రమించును. ముహుఃదీర్ఘముగా నిట్టూర్చును. రోదించును. ముహుః విలపించును. ఇట్టి వికారము లన్నియు ఖండితానాయికాగతముగా వర్ణితము లగుచో కావ్యమున నవి శోభ కలిగించును. కామాపరాధ మొనరించిన ప్రియుడు వచ్చి నప్పుడు స్త్రీలకు గలుగు భావవికారము లిది వరలో సూచితము లయినవి.

### విప్రలబ్ధ

సమయం చాపి సంకేతం దత్వా ప్రేష్య చ దూతికాం. 240

అనాగతశ్చేద్వ్యాసంగా ద్విప్రలబ్ధా తు సా స్మృతా
చింతా నిశ్వాస ఖేదాశ్చ హృత్తాపో మూర్ఛనం ముహుః. 241

ప్రలాపో జాగరః కార్శ్యం విప్రలబ్ధాసు విక్రియాః

విప్రలబ్ధా స్వరూపచేష్టా విశేషము లిచట గలవు. ప్రియుడు సమయ మిచ్చి సంకేతము సూచించి దూతికను పంపించియు నితరవ్యాసంగమున రాక

పోయినచో వంచిత యయిన నాయిక విప్రలబ్ధ నాయిక యగును. విప్రలబ్ధ లయిన వనితలలో నీ వికారము లుండును. చింత నిశ్వాసము ఖేదము కలుగును. హృత్తాప ముదయించును. ముహుః మూర్ఛన ముదయించును. ప్రలాపము జాగరము కృశత్వములు కలుగును. ఇట్టి వన్నియు విప్రలబ్ధావనితా విక్రియా విశేషములు.

## వాసకసజ్జిక

భోగోపకరణైః సర్వైః సజ్జితే వాస వేశ్మని. 242

ఆస్తీర్య భోగశయనం శయనం కేలినిద్రయోః
ప్రతీక్షతే యా పర్యంకే ప్రియాగమ మలంకృతా. 243

సేయం వాసకసజ్జేతి కథితా కవిపుంగవైః
సఖివినోదః సంభోగ మనోరథ విచింతనమ్. 244

హృల్లేఖః శ్వసితం దూతీ ప్రత్యాగమన చింతనం
ఇతి వాసకసజ్జాయాః విక్రియాః కథితా బుధైః. 245

వాసకసజ్జా స్వరూప విక్రియ లిచట నున్నవి. సర్వవిధ భోగోపకరణ ములతో సజ్జితమై యున్న వాసభవనమున భోగశయనమును కేలిశయనమును నిద్రాశయనమును ఆస్తృత మొనరించి తానలంకరించుకొని పర్యంకమున ప్రియా గమనమును ప్రతీక్షించు వనిత వాసకసజ్జిక యగును. ఇట్లీమె స్వరూపమును కవి పుంగవులు నిరూపించిరి ఈ నాయిక సఖివినోదములతో గడపును. సంభోగాను కూల మయిన మనోరథములను చింతనము చేయుచు నుండును. హృదయమునవె లేఖ మొనరించును. హృదయము సద్దిగొనును. శ్వసిత మొనరించును. దూతి తిరుగ వచ్చునో యని యాలోచించును. వాసకసజ్జిక కిట్టి విక్రియ లుండు నని బుధకథనము.

## స్వాధీనభర్తృక

యస్యా రతిరసాస్వాదముదితో దయితః సదా
సదైవాస్తే తయా సాక మేషా స్వాధీనభర్తృకా. 246

ఉద్యాన సలిలక్రీడా కుసుమాపచయ క్రియా
ఆపానకేలిః శక్రార్చా వసంత మదనోత్సవాః. 247

స్వాధీనభర్తృకాయాః స్యుర్విలాసా శ్చైవమాదయః

స్వాధీనభర్తృకా స్వరూప మిట్లున్నది. ఈమె దయితుడు నిత్యము ఈమెతోటి రతిరసాస్వాదమున ముదితుడై యుండును. ఎల్లప్పుడామెతో సంచరించును. అట్లొనరింపగల సుభగ స్వాధీనభర్తృక. ఈమె యుద్యానవన విహారము సలిలక్రీడ కుసుమాపచయము మొదలగు క్రియలలో నాసక్తురా లగును. పానగోష్ఠి యందాదరము చూపును. శక్రార్చ ఇంద్రపూజ యొనరించును. వసంతోత్సవ మదనోత్సవముల నొనరించును. ఈ మొదలయిన విలాసములు స్వాధీనపతికకు సంబంధించి యుండును.

### కలహాంతరిత

కృతాపరాధం ప్రేయాంసం ప్రసాధనపరం ముహుః. 248

సఖీసమక్షం ప్రణతమీర్ష్యాక్రోధా దపాస్య యా
పశ్చాత్తాపేన తపతి కలహాంతరితా తు సా. 249

హృద్దాహః సంభ్రమో మోహః సంజ్ఞా నిశ్వసితం జ్వరః
ముహుర్ముహుర్విలాపోఽపి ద్వేషః సర్వత్ర వస్తుషు. 250

కలహాంతరితాయా స్స్యు రేవమాద్యాశ్చ విక్రియాః

కలహాంతరితారూప మిందున్నది. ప్రణయాపరాధ మొనరించిన ప్రియుడు ప్రియురాలిని ప్రసన్నురాలిం జేయుటకు సముచితముగా నలంకరించుటకు సకియల సమక్షముననె ప్రణతుడు కాగా నాయిక యీర్ష్యాక్రోధమున నాతని త్రోసిపుచ్చి విడనాడి యనంతరము పశ్చాత్తాపమున తప్తురాలయినచో నామె కలహాంతరిత యగును. ఇక నప్పు డామెకు హృద్దాహ మతిశయించును. సంభ్రమము గలుగును. మోహ ముదయించును. సంజ్ఞ లొనరించును. నిశ్వసిత మొనరించును. జ్వరపడును. ముహుర్ముహుః విలపించును. సర్వవస్తువు లందును ద్వేషము పూనును. ఇట్టి వికారములు కలహాంతరితకు కలుగు ననిరి.

ఉచితే వా స్వయం దత్తే సమయే ప్రోషితః పతిః. 251

నైతి వ్యాసంగతో యస్యాః సా తు ప్రోషితభర్తృకా
మాలిన్యం జాగరః కార్శ్యం నిమిత్తాది పరీక్షణం. 252

అంగసాదశ్చ చింతా చ జాడ్యం శయ్యారతి స్తదా

ఏవం ప్రోషితనాథాయా విక్రియాః కథితా బుధైః. 253

ప్రోషితభర్తృకా లక్షణ మిం దున్నది. సముచిత సమయమున గాని స్వాయందత్త మయిన సమయమున గాని పతి ప్రోషితుడై దేశాంతరగతుడై యితర వ్యాసంగవశమున సమయమున రాక పోయినచో రా జాలకపోయినచో ఆ వనిత ప్రోషితభర్తృక యగును. అట్టిదై మాలిన్యమున నుండును. జాగరమున నుండును. కృశించి పోవును. ప్రియుని యాగమనవిషయముగా నిమిత్తాదులను పరీక్షించును. నిరీక్షించును. వాడిపోయిన యంగములతో నుండును. చింతపడును. జాడ్యము కలదగును. ఎల్లప్పుడు శయ్యపై పరుండును. ఇట్టి వన్నియు ప్రోషిత నాథా వికారము లని బుధులు నిరూపించిరి. ప్రోషితుడయిన భర్త కల వనిత యగుట నామము సార్థకము. ఇట్లే యుంతట గ్రాహ్యము.

విరహోత్కంఠిత

ఉచితేఽహాని సంప్రాప్తే నైతి కేనాపి హేతునా
యస్యాః పతిః సా విదగ్ధైర్విరహోత్కంఠితా స్మృతా. 254

విషయస్యాపరిచ్ఛిత్తిరంగసాదశ్చ వేపథుః
అనుభూతస్మృతిద్వేషో హృత్తాపో బాష్పనిర్గమః. 255

దూతీసఖ్యాదివిస్రంభః స్వీయావస్థాప్రదర్శనం
విరహోత్కంఠితాయాః స్యురేవంభావా వికారజాః. 256

విరహోత్కంఠితా రూప మిచట నున్నది. సముచిత మయిన దినము సంప్రాప్త మయినను ఏదేని కారణమున ప్రియుడు రాకున్నచో విరహవ్యథ ననుభవించు వనిత విరహోత్కంఠిత యగు నని విదగ్ధులు వ్యపదేశించిరి. ఈమె చేష్టావిశేషము లీ విధముగా నుండును. విషయనిర్ధారణ మొనరింప లేదు ఒడలు విరిచి కొనును. వేదన పడును. కంపించును. అనుభూతముల స్మరణమున ద్వేషము చూపును. హృదయతాపము పొందును. కన్నీరు పెట్టు కొనును. దూతిపై చెలియలపై విస్రంభ ముంచును. తన యవస్థ ప్రదర్శించును. వారితో వేదన చెప్పి కొనును. ఇట్లు విరహోత్కంఠితకు వికారజన్యము లయిన భావము లుండు ననిరి.

అభిసారిక

రూపయౌవనసంపన్నా కుల భోగ ధనాధికా

వాసోఽంగరాగమాల్యర్తు చందనేందూదయాదిభిః. 257

ఉద్దీప్యమాన పంచేషు పంచబాణ వ్రణార్దితా
యాఽభిసారయతే కాంతం సా భవేదభిసారికా. 258

అభిసారికాలక్షణ మిందున్నది. అభిసరింప జేయునది యభిసారిక. అభిసరించు నది యభిసారిక. ఇందు మొదటి రూప మిచట నున్నది. ఈమె రూపయౌవన సంపన్న. కులాధిక. ధనాధిక. వాసోంగరాగ మాల్యర్తు చందనేందూదయాద్యుద్దీపనవిభావములచే కామోద్దీపనము కల దగును. పంచబాణుని పంచబాణములచే వ్రణితయై వ్యథిత యగును. ఇంతగా నిట్లయి తన కాంతుని అభిసరింపజేయును. తా నున్న స్థలమున కాతడు వచ్చునట్లు చేయును. ఇట్టి ఈమె యభిసారిక యగును, ఇదిస్వీయాంగనాభిసారణ రీతి.

పరాంగనాభిసరణప్రకార మీ విధమున నుండును. ఈమె పరాంగన గావున తన వాసభవనము విడనాడి ప్రియుని నివాసభవనమున కభిసరించును.

విలీనా స్వేషుగాత్రేషు నిశ్శబ్ద పదసంచరా
పశ్చాన్నివర్తితపదా శంకమానా పదేపదే. 259
ప్రభూతవేపథుమతీ స్వేదోద స్నపితాంగకా
శార్దూల దర్శన త్రస్త హరిణీ శాబ వీక్షణా. 260

జ్యోత్స్నీ తమస్వినీ యానయోగ్యవేషవిభూషితా
నీలీ కుసుంభ మంజిష్ఠారాగైః పట్టోత్తరీయకైః. 261

అవకుంఠితసర్వాంగీ శనైర్యాతి పరాంగనా

పరాంగనాభిసరణ మీ విధముగా నుండును. తన దేహావయవములలో తాను ముడుచుకొని విలీన యగును. నిశ్శబ్దముగా పదసంచార మొనర్చును. పాదములను వెనుకకు వేయును. నడచును. పదపదమున సందేహించుచు నడచును. అధికముగా కంపము కలదై స్వేదోదయమున నంగములు తడువగా, పులిని జూచిన లేడిపిల్ల వలె బెదురు చూపులు కలదై భీతభీతగా సంచరించును. వెన్నెల కల రాత్రులలో ప్రయాణయోగ్యము లగు వేషముల ధరించియు, చీకటి కల రాత్రులలో యానయోగ్యము లయిన వేషముల ధరించియు, నీలీరాగము, కుసుంభరాగము, మంజిష్ఠారాగము కల పట్టుత్తరీయములచే నవగుంఠితసర్వాంగి

నైయె పరాంగన మెల్లగా నభిసరణ మొనరించును. జ్యోత్స్నరాత్రులలో తెల్లనివి, తమస్వినీరాత్రులలో నల్లనివి యగు నాహార్యముల ధారణ ముచితము. కావున జ్యోత్స్నాభిసారిక, తమిస్రాభిసారిక వ్యవహారము లున్నవి.

## వేశ్యాభిసరణము

ఆవిఃస్మరస్మితముఖీ మదారుణవిలోచనా. 262

స్నాతానులిప్తసర్వాంగీ నానాభరణభూషితా
హర్షోదంచిత రోమాంచ వ్యాజాంకురితమన్మథా. 263

వృతా పరిజనైః స్ఫీతభోగోపకరణోజ్జ్వలైః
నితంబాలంబి రశనా స్వనోద్భూత మనోభవా. 264

చరణాంభోరుహ రణన్మణిమంజీర మంథరా
ఏవం ప్రీతాఽభిసరతి వేశ్యా వైశికనాయకమ్. 265

వేశ్యాభిసరణవిధాన మిం దున్నది. కామభావసూచక మగు మంద స్మితము ముఖమున నావిర్భవింపగా మాన్మథమదమున విలోచనము లరుణముగా నుండగా స్నాతానులిప్త సర్వావయవయై నానాభరణభూషితయై, హర్షమున నుత్ఫుల్లము లయిన రోమాంచము లను వ్యాజమున మన్మథాంకురములు కలదై పరిజనపరివృతయై ప్రయాణించును. పరిజనులు నానావిధములు సమధికములు నయిన భోగోపకరణములచే సముజ్జ్వలముగా నుందురు. ఇంక నా యభిసారిణి వేశ్య రశనాలంబి నితంబబింబ యగును. రశనామణుల స్వనములచే నామె మనోభవభావము లుద్భూతము లగును. ఆమె చరణాంభోరుహము లందు మణిమంజీరములు మంథరముగా రణన మొనరించును. ఇట్లు సంప్రీతురాలై వేశ్య వైశిక నాయకు నభిసరించును.

## ప్రేష్యాభిసరణము

విస్రస్త బాహువిక్షేప స్రంసద్ధమ్మిల్ల మాలికా
వ్యావిద్ధగతిసంచార శ్లథమానాంశుకాంచలా. 266

ప్రస్ఫురద్భ్రూవిలాసశ్రీః విభ్రమోత్ఫుల్లలోచనా
అవిరామాదరాఖ్యాన మదస్ఖలిత జల్పితా. 267

ప్రేష్యాభియాతి చేటీభిః ప్రియ మత్యంతగర్వితా

ప్రేష్యాభిసారరీతి యిం దున్నది. ప్రేష్య భృత్యురాలు. భృత్యభార్య సేవకుని స్త్రీ. దిగజారిన బాహువుల విక్షేపముచే ధమ్మిల్లము నందలి పూలమాల జారిపోవునట్లుగా, తొట్రుపడు గతిసంచారమున నంశుకాంచలము ప్రిదిలిపోవు నట్లుగా, భ్రూవిలాసశోభ స్ఫురించు నట్లుగా, విభ్రమములచే లోచనము లుత్ఫుల్లము లగు నట్లుగా, అవిరామముగా నాదరాభ్యాసములతో పలుకుపలుకులు మదస్ఖలితము లగు నట్లుగా ప్రేష్యాభిసారిక చేటులతో గూడినదై యతిగర్వితయై ప్రియు నభిసరించును. అభిసారవిధి యిట్లు సవిశేషముగా నిరూపిత మయినది.

నాయకుడు నిద్రించు నప్పుడా యా వనిత లే యే విధమున నుందురో యిందు సంగ్రాహ్యము.

సుప్తే పరాంగనా తస్మిన్ పార్శ్వే తిష్ఠతి నిశ్చలా. 268

అలంకరోతి నిభృతం శీతైర్మాల్యానులేపనైః
ప్రబోధయతి భావజ్ఞా భావాంస్తస్య ప్రతీక్షతే. 269

వేశ్యాఽతిమృదుభిః స్పర్శైః తత్కేశోల్లేఖనాదిభిః
ప్రబోధయతి తద్బోధే ప్రణయాత్కుప్యతి క్షణమ్. 270

ప్రేష్యాత్వున్మీలనైర్వస్త్రవ్యజనైః పాదమర్దనైః
ప్రబోధ్య నిర్భర్త్సయతి నాసాభంగపురస్సరమ్. 271

చేష్టితాన్యేవమాదీని భవంత్యాసాం పృథక్పృథక్

పరాంగన నాయకుడు నిద్రించు చున్నచో నాతని పార్శ్వమున నిశ్చలముగా నిలబడియుండును. శీతలము లయిన మాల్యములతో ననులేపనములతో నిభృతముగా నలంకరించును. భావజ్ఞురాలై ప్రబోధము కలుగ జేయును. ఆతని జుట్టు నుల్లేఖించును. వ్రేళులతో సర్దును. అట్లు నెమ్మదిగా నాతని లేపును. ఆతడు మేల్కొనగా ప్రణయమున క్షణము కోపించును. ప్రేష్యావనిత యయినచో కను రెప్పల నెత్తి చూచును. పైట చెరగుతో వీచును. పాదమర్దన మొనరించును. అట్లాతని మేల్కొలిపి బెదిరించును. ముక్కు పట్టి నులిమి మెదుపును. ఇట్టి విధముగా వీరలకు వేరు వేరుగా చేష్టితము లుండును.

### ఉత్తమాది భేదములు

స్నేహపరోత్సిక్తైః కులీనైశ్చ గుణిభిః కామ్యతే చ యా. 272
గృహ్ణాతి కారణాద్దోషమనునీతా ప్రసీదతి

కుర్వతోఽప్యప్రియం భర్తుః ప్రియమేవ కరోతి చ. 273
ఈర్ష్యావత్యపరాధేఽపి తూష్ణీం వా సోత్తమా భవేత్

నాయికలలో నుత్తమాదిభేదము లున్నవి. ఉత్తమనాయికాగుణము లీ విధముగా నుండును. స్నేహార్ద్రులు కులీనులు నగు గుణవంతులకు కమనీయ గుణము లుండుటచే కామ్య యగు వనిత యుత్తమ. ఏదేని కారణమున రోషము వహించును గాని యనునయమున ప్రసన్నురా లగును. ప్రియు డప్రియ మాచరించినను ఉత్తమవనిత ప్రియమె యాచరించును. ప్రియుడు ప్రణయాప రాధ మొనరించినచో నీర్ష్యకలది కా వచ్చును. తూష్ణీంభావమున నుండ వచ్చును. ఇట్లుండునది యుత్తమవనిత యని గ్రాహ్యము.

స్వయం కామయతే పుంసః పురుషైర్యా చ కామ్యతే. 274
అపరాద్ధాఽపరాధే స్యా దనృతేఽనృతభాషిణీ
స్నిహ్యంతీ స్నిహ్యతి పరముపకర్త్ర్యుపకర్తరి. 275
ఏవమాదిగుణైర్యుక్తా మధ్యమా సా స్మృతా బుధైః

మధ్యమనాయిక యీ విధమున నుండును. పురుషులను స్వయముగ తానే కామించును. పురుషు లామెను కామింతురు. పురుషు డపరాధ మొనరించినచో తాను నపరాధ మాచరించును. పురుషు డసత్యము భాషించిన తాను నసత్యము పలుకును. పురుషుడు స్నేహయుక్తు డయిన తానును సస్నేహ యగును. వా డుపకరించిన నీమెయు నుపకర్త్రి యగును. ఇట్టి గుణములతో నున్నచో మధ్యమనాయికయగు ననిరి.

కుప్యత్యకారణే కోపం న నియచ్ఛతి యాచితా. 276
అరూపం రూపవంతం వా సగుణం నిర్గుణం చ వా
జీర్ణం వాపి యువానం వా యా వా కామయతే ముహుః. 277
రోషేర్ష్యా కలహాక్రాంతా సాధమా కథ్యతే బుధైః

అధమనాయిక యిట్లుండును. కారణము లేకున్నను కోపము కల దగును. బతిమలాడినను కోపమును నియమిత మొనరింపదు. రూపరహితుని రూపసహితుని సగుణుని నిర్గుణుని ముసలివానిని యువకుని ఎట్టి వాని నయిన నధమ కామించును. ఇట్లు కామించును కావుననె యీమె యధమ. రోషవ్యాప్త యీర్ష్యాకషాయిత కలహాక్రాంతయై యుండును. ఇట్టి దధమ.

సర్వాసామేవ నారీణామేతే సాధారణా గుణాః. 278

స్వీయాస్తు నిభృతాస్తే స్యుః పరన్యదీయాసు మధ్యమాః
సాధారణాస్తు ప్రథితా బుద్ధై రూహ్యా యథారసమ్. 279

ఇతి శ్రీ శారదాతనయ విరచితే భావప్రకాశనే
శృంగారాలంబన నాయకా నాయికాది స్వరూపనిర్ణయో నామ
చతుర్థోఽధికారః.

స్వాన్యాగణికలలో నుండు గుణము లందును కొంత విశేష మున్నది. సామాన్యముగా సర్వవనితలకు గుణములు సాధారణరూపముననె యుండును. స్వీయవనితలలో నవి నిభృతములు. పరకీయలలో మధ్యమములు. వేశ్యలలో గుణములు ప్రఖ్యాతముగా నుండును. ఇవి యథారసముగా నుండుటను బుధు లభ్యూహించుట యుక్తము.

ఇది శ్రీ శారదాతనయ విరచితమైన భావప్రకాశమునందు భావాలోకమున
శృంగారాలంబన నాయక నాయికాదిస్వరూప నిర్ణయ మనెడి
చతుర్థాధికారము.

# పంచమాధికారము

## నాయక నాయికా భేద తదవస్థాది నిరూపణము

ఈ యధికారములో మొదట చెప్పిన, చెప్పనున్న విషయముల కథన మున్నది.

ఉక్తాశ్చ నాయకాస్సర్వే నాయికాశ్చ పృథక్పృథక్
అవస్థా నాయికాదీనాం సహాయాశ్చ తతస్తతః. 1

ఇదానీం కథ్యతేఽస్మాభిః సర్వాసామేవ యోషితాం
యౌవనం తస్యభేదాశ్చ తదవస్థా విచేష్టితమ్. 2

నాయకావాంతరభిదాః శృంగారైకరసాశ్రయాః
నాయికావాంతరభిదా స్తత్తత్సత్త్వగుణైర్యుతాః. 3

తాసాం విరక్తిం రక్తిం చ గమ్యాగమ్యేషు భావతః
అన్యేఽపి యే ప్రవర్త్యంతే తత్తత్కార్యోపయోగినః. 4

తత్ర తత్రైవ విజ్ఞేయాః తత్తదర్థానుషంగిణః

ఇప్పటికీ నిరూపిత చతుర్థాధికారమున నాయక నాయికా రూపములు వేరు వేరుగా నిరూపితము లయినవి. నాయికాదుల యవస్థలు సహాయలు తత్స్వభావములు నిరూపితములు. ఇక నీ పంచమాధికారమున సర్వయువతుల యౌవనము నిరూపింతుము. తద్భేదములు తదవస్థలు తచ్చేష్టిత ములు ప్రతిపాదితములు కాగలవు. శృంగారైకరససమాశ్రయములయిన నాయకా వాంతరభేదములు నాయికల యవాంతరభేదములు నాయా సత్త్వగుణములతో కూడుకొనిన విధమున నిరూపితము లగును. గమ్యాగమ్య లయిన వనితల విరక్తి రక్తి తత్తద్భావానుసారమున నుల్లిఖిత మగును. ఇంకను తత్తత్కార్యోప యోగి విషయములును వివేచితము లగును. తత్తదర్థానుషంగమున నున్న వీని నన్నిటిని ఆ యా స్థలము లందు గుర్తింప వచ్చును.

## యౌవనభేదములు

ఈ యుపక్రమ వచనానుసారమున స్త్రీల యౌవనము నాలుగు విధముల నుండుట తచ్చేష్టల వైవిధ్య మిందు గుర్తింప నగును.

స్త్రీణాం ప్రాయేణ సర్వాసాం యౌవనం చ చతుర్విధమ్. 5
ప్రతియౌవన మేతాసాం భవేద్భిన్నం విచేష్టితం
ఆరూఢరాగం నయన మసమగ్రారుణోఽధరః. 6

స్మరస్మేరం చ వదనం గండయోర్గర్వజం రజః
అంగముద్భిన్నలావణ్య మావిర్వదనసౌరభమ్. 7

ఉద్భేదః స్తనయోః కించిదవిభక్తాంగసంధితా
అభిరూప్యమకాఠిన్య మంగానా మతిమార్దవమ్. 8
ఏవమాదిగుణావస్థా ప్రథమే యౌవనే భవేత్

సామాన్యముగా స్త్రీల కిందరకు యౌవనము నాలుగు విధములుగా నుండును. ఆ యా యౌవనము లందు స్త్రీల విచేష్టితము వివిధముగా నుండును. ప్రథమయౌవనమున స్త్రీస్వరూప మి ట్లుండును. నయనమున రాగ మారూఢమై యుండును. రాగము రక్తిను రాగ మనురాగము. అధరమున నారుణ్యము సమగ్రముగా నుండదు. ముఖము స్మరస్మేరముగ నుండును. గండస్థలము లందు గర్వజన్య మయిన రాజస ముండును. అవయవము లందు లావణ్య ముద్భిన్నమగును. వదనమున సౌరభ మావిర్భవించును. స్తనములు కొంచె ముగా పొటమరించును. అంగముల సంధిసంబంధము లంతగా విభక్తములై యుండవు. అంగము లభిరూపములై యకఠినములై మార్దవాతిశయమున నుండును. ప్రథమయౌవనము నం దేవంప్రాయ మయిన గుణావస్థ యుండును.

రతిక్లేశం న సహతే మృదుస్పర్శాభిలాషిణీ. 9

కృతాదరాఽంగసంస్కారే సఖీకేలిషు లాలసా
న హర్షశ్చ న శోకశ్చ సపత్నీదర్శనాదిషు. 10

సంగమే వల్లభస్యాపి న విరజ్యతి రజ్యతి
యౌవనే ప్రథమే స్త్రీణామేవమాదివిచేష్టితమ్. 11

ప్రథమయౌవనము నందు స్త్రీలకు ఏవమాదివిచేష్టితము లుండును. రతిక్లేశమును సహింప జాలదు. మృదుస్పర్శము నభిలషించును. అంగసంస్కారమున నాదరము వహించును. చెలియలతో నాటలందు లాలసగా నుండును. సపత్నీదర్శనాదులలో హర్షము పొందదు. శోకము పొందదు. వల్లభసంగమున విరక్త కాదు; రక్తయు కాదు.

పీనౌ పయోధరౌ గాత్రం పూర్ణావయవమంథరం
ఆయతం జఘనం మధ్యం మధ్యం కృశం శ్రోణీ సమున్నతా. 12

రోమరాజిః స్ఫుటా నిమ్నా నాభిర్వ్యక్తం వళిత్రయం
ఊరూ కరికరాకారౌ రక్తిమా పాణిపాదయోః. 13

స్నిగ్ధత్వమంగకేశేషు నయనే దంతపంక్తిషు
ఏవమాదిగుణావస్థా ద్వితీయే యౌవనే భవేత్. 14

ద్వితీయ యౌవనమున పయోధరములు పీనము లగును. శరీర మవయవపూర్ణతచే మంథర మగును. జఘనము విశాల మగును. మధ్యము కృశించును. పిఱుదు లెత్తుగ నుండును. రోమరాజి స్ఫుట మగును. నాభి నిమ్న మగును. వళిత్రయము వ్యక్త మగును. ఊరువులు కరికరాకారము కల వగును. పాణిపాదము లందు రక్తిమ యేర్పడును. అవయవము లందు కేశము లందు నయనము లందు దంతపంక్తు లందు స్నిగ్ధత యేర్పడును. ఏవమాదిగుణావస్థ ద్వితీయయౌవనగతము.

అపరాధం న సహతే నానునీతా ప్రసీదతి
ఈర్ష్యతి ప్రణయక్రుద్ధా ప్రతిపక్షాభ్యసూయినీ. 15

సాభిప్రాయాః సఖీః స్నిహ్యత్యాప్తాన్ క్రుధ్యతి బాంధవాన్
గృహ్ణాతి మానం సుదృఢ మిచ్ఛత్యనునయానపి. 16

రతికేలిష్వనిభృతా గర్వితా చేష్టతే రహః
ద్వితీయే యౌవనే ప్రాయః స్త్రీణా మేతద్విచేష్టితమ్. 17

ద్వితీయయౌవనము నందు సామాన్యముగా స్త్రీలకీ చేష్టితము లుండును. ద్వితీయయౌవన అపరాధము సహింపదు. అనునయమున ప్రసన్న కాదు. ఈర్ష్య పడును. ప్రణయకోపము వహించును. ప్రతిపక్షము వారి నసూ

యించుసు. సాభిప్రాయ లయిన సఖియ లందు స్నేహయుక్త యగును. ఆప్తబంధువుల నయిన కోపమున జూచును. సుదృఢముగా కోపము వహించును. అనునయములు నిచ్చగించుసు. సురతక్రీడలలో నిభృతముగా నుండదు. సరిగా సురతము సాగనీయదు. ఏకాంతమున ప్రియసన్నిధిలో గర్విత యగును.

అధరే రాగమాసృణ్య మస్నిగ్ధత్వం చ చక్షుషి
ఛాయా వైగుణ్య మంగానాం ఖరస్పర్శిత్వ మేవ చ. 18

శ్లథావయవతా చాపి కాంతిమ్లానిః కపోలయోః
ఏవమాదిగుణావస్థా తృతీయే యౌవనే భవేత్. 19

తృతీయయౌవనము నం దధరమున రాగమసృణత యేర్పడును. నేత్రమున స్నిగ్ధత తగ్గును. అవయవములకు ఛాయావైగుణ్య మేర్పడును. కఠిన స్పర్శయు కలుగును. అవయవములు శ్లథము లగును. కపోలము లందు కాంతి మ్లానమగును. తృతీయయౌవనమున నిట్టి గుణావస్థ యుండును.

కామతంత్రేషు వైదగ్ధ్యం కాంతాభీష్టానుకూలతా
అనాదరోఽపరాధేషు ప్రతిపక్షేష్వమత్సరః. 20

కాంతస్య చాపరిత్యాగ స్తదాకర్షణ కౌశలం
తృతీయే యౌవనే స్త్రీణామేవమాది విచేష్టితమ్. 21

తృతీయయౌవనమున నిట్టి చేష్టితము లుండును. కామతంత్రము లందు వైదగ్ధ్యము, కాంతుని యభీష్టమున కనుకూలత, అపరాధము లం దనాదరము, ప్రతిపక్షమున మత్సరము లేమి, ప్రియుని పరిత్యజింప కుండుట, తదాకర్షణకౌశల మను నిట్టివి తృతీయయౌవనచేష్టలు.

శ్రోణ్యోశ్చ స్తనయోరూర్వో ర్జఘనేఽధరగండయోః
నిర్మాంసతా జర్జరతా విలంబిత కపోలతా. 22

ఏవమాదిగుణావస్థా చతుర్థే యౌవనే భవేత్

చతుర్థయౌవనములో నిట్టి విశేషము లుండును. పిఱుదులు కండలు తగ్గును. స్తనములు జారి జర్జరము లగును. జఘనము సడలి పోవును. అధరము వాడి పోవును. గండ మెండి పోవును. బుగ్గలు వ్రేళాడును. ఇట్టి గుణములు కల యవస్థ నాల్గవయౌవనమున నుండును.

అశక్తతా చానుత్సాహో రతివ్యాయామ కేలిషు. 23

ప్రతిపక్షానుకూల్యం చ కాంతై రపి సహాసనం
చతుర్థే యౌవనే స్త్రీణా మేవమాది విచేష్టితమ్. 24

ఈ యౌవనము నందు స్త్రీ లిట్టి విచేష్టితములతో నుందురు. సురత క్రీడలలో నశక్తత యేర్పడును. సంభోగమునం దుత్సాహము నుండదు. ప్రతి పక్షమున కానుకూల్యము చూపును. ప్రియునితో సహాసనమున నుండును.

ఆరభ్య షోడశా ద్వర్షా ద్ద్వాత్రింశ ద్వత్సరావధి
యౌవనం పురుషాణాం తు తథా యౌవనచేష్టితమ్. 25

సాధారణ్యేన సర్వేషా మేకరూపమితి స్మృతం
తదేవ సంపత్ప్రకృతిగుణాదిపరివర్ధితమ్. 26

తత్తద్విశేషత స్తేషు విశిష్టమివ దృశ్యతే

పురుషులకు పదునారవ సంవత్సరము మొదలుగా యౌవన మారంభ మగును. ముప్పదిరెండవ వత్సరము వఱకు యౌవనము యౌవనవిచేష్టితము నుండును. సాధారణముగా సర్వజనులకు యౌవన మి ట్లేకరూపముగనె యుండును. ఇది జనుస్సహజ మయిన యౌవనము. ఈ యౌవనమె సంపదలచే, వారి వారి ప్రకృతులచే, గుణాదులచే పరివర్ధిత మగును. ఆ యా విశేషముల వలన వారలలో నది విశిష్టముగ గోచరించును. ఇది పురుషుల యౌవన మయినను స్త్రీల యౌవన మిట్లే యుండునని యభ్యూహించునది. వారలకును సంపదాదు లచే యౌవన పరివృద్ధి యౌవనవిచేష్టితవిలాసము భావనీయము.

ఇటుపై స్త్రీల కభిగమ్యుడగు నాయకుని స్వరూపము వివేచింప వలసి యున్నది.

మహోదయో మహాభాగః కృతజ్ఞో రూపవాన్ యువా. 27

మానీ సుశీలః సుభగో విదగ్ధో వంశవాన్ అభీః
అల్పనిద్రో మధురవాగభిగమ్యో భవే త్స్త్రియా. 28

ఇట్టి నాయకుడు వనిత కభిగమ్యుడు. మహోదయుడు మహా భాగుడు కృతజ్ఞుడు రూపము కలవాడు యువకుడు మాని సుశీలుడు సుభగుడు

విదగ్ధుడు మంచివంశము కలవాడు భయము లేనివాడు అల్పనిద్రుడు మధుర వాక్కులు కలవాడు స్త్రీల కభిగమ్యు డగును. మహోదయాదుల స్వరూప ములు వివేచితములు కాగలవు. ఈ నిరూపితము లన్నియు జన్మసహజము లయిన విశేషములు. ఇంక నితరములు సంపదాదికృతము లగుట సంభావ్యము.

ఇట్టి పురుషుడు వనితాభిగమ్యుడు కాగా పురుషాభిగమ్యయగు **వనితా** స్వరూప మీ విధమున నుండును.

విజ్ఞానరూపసంపన్నా రూపయౌవనశాలినీ
దేశ కాల విభాగజ్ఞా కలా శిల్ప విచక్షణా. 29

కార్యాకార్యవిశేషజ్ఞా భావజ్ఞా వినయాన్వితా
వ్రీడావతీ క్షమాయుక్తా లోకయాత్రానువర్తినీ. 30

ఏవమాదిగుణై ర్యుక్తా పుంసాం గమ్యైవ నాయికా

పురుషుల కభిగమ్య యగు నాయిక విజ్ఞానసంపన్న రూపసంపన్న రూపశాలిని యౌవనశాలిని దేశకాలవిభాగముల గుర్తించునది కలాశిల్పము లందు విచక్షణ కార్యాకార్యవిశేషముల గుర్తించునది భావజ్ఞ వినయాన్విత వ్రీడావతి క్షమాయుక్త లోకయాత్ర ననువర్తించునది కా దగును. ఇట్లున్నచో నభిగమ్య యగును.

## వైశిక లక్షణము

ఈ ప్రసక్తిలో వైశికనాయకుని స్వరూప మున్నది. వైశిక పదార్థ మున్నది. వైశిక భేదము లున్నవి. ఉత్తరగ్రంథార్థధారణమునకై యన్నియు సంధార్యములు.

శాస్త్రవిచ్ఛీలసంపన్నో రూపవాన్ప్రియదర్శనః. 31

విక్రాంతో ధృతిమాంశ్చైవ వయోవేష కులాన్వితః
సురభిర్మధురస్త్యాగీ సహిష్ణురవికత్థనః. 32

అశంకితః ప్రియాభాషీ చతురస్సుభగః శుచిః
కామోపచారకుశలో దక్షిణో దేశకాలవిత్. 33

అదీనవాక్యః ప్రియవాగ్వాగ్మీ దక్షః ప్రియంవదః
అలుబ్ధః సుఖభోగీ చ శ్రద్ధధానో దృఢవ్రతః. 34

వైశికలక్షణ మనంతరము నిరూపిత మగును. శాస్త్రవిదుడు నానా శాస్త్రవిదు డయినను విశిష్టముగా కలాశాస్త్రము కామశాస్త్రము తెలిసినవాడు శీలసంపన్నుడు రూపసంపన్నుడు చూడదగినవాడు విక్రమము ధృతి కలవాడు వయసు తదుచితవేషము కలవాడు కులముకలవాడు సురభి మధురస్వభావుడు త్యాగి సహిష్ణువు అవికత్థనుడు శంకారహితుడు ప్రియము భాషించువాడు చతురుడు సుభగుడు శుచి కామోపచారకుశలుడు దక్షిణుడు దేశకాలవిదుడు దీనవచనములు లేనివాడు ప్రియవచనుడు వాగ్మి దక్షుడు ప్రియమె పలుకువాడు అలుబ్ధుడు సుఖభోగి శ్రద్ధాళువు దృఢవ్రతుడు గమ్యవనితలందును విస్రంభరహితుడు మాని యగు నాతడు వైశికుడు. వీరశృంగారములకు కలావైదగ్ధ్యమునకు సంబంధించిన విశేషము లిందుండుట సంభావనీయము.

గమ్యాసు చాప్యవిస్రంభీ మానీ చేతి హి వైశికః
విశేషయేత్కలాః సర్వాః యస్మాత్తస్మాత్తు వైశికః. 35

వేశ్యోపచారతో వాపి వైశికః పరికీర్తితః
ఉత్తమో మధ్యమశ్చేతి కనిష్ఠశ్చేతి స త్రిధా. 36

ఇచట వైశికలక్షణ మున్నది., సర్వకలా విశేషములను విశిష్టములుగా నొనరింప గలవాడు కావున వైశికు డగును. వేశ్యల నుపచరించువాడు నగును గావున వైశికు డన దగును. ఈ వైశికు డుత్తము డని మధ్యము డని యధము డని మూడు విధముల నున్నాడు. వీరి లక్షణము లీ విధమున నుండును.

అవశోఽపి హి కామస్య వశం యాతీవ దృశ్యతే
అసంగోఽపి స్వభావేన సక్తవచ్చేష్టతే ముహుః. 37

త్యాగీ స్వభావమధురః సమదుఃఖసుఖః శుచిః
కామతంత్రేషు నిపుణః క్రుద్ధానునయకోవిదః. 38

స్ఫురితేఽనాదరే కించిద్దయితాయా విరజ్యతి
ఉపచారపరోఽప్యేష ఉత్తమః కథ్యతే బుధైః. 39

ఉత్తమవైశిక లక్షణ మిందున్నది. ఉత్తము డవశు డయ్యు కామునకు వశుడయినట్లు కన్పడును. స్వభావమున సంగరహితు డయినను సక్తునివలె ముహుః చేష్టాయుక్తు డగును. త్యాగి. స్వభావ మధురుడు. సుఖదుఃఖము

లందు సమానుడు. శుచి. కామతంత్రము లందు నిపుణుడు. కోపించిన వనితల ననునయించుటలో కోవిదుడు. ప్రియురాలి దగ్గర కొంచెముగా నయిన ననాదరము స్ఫురించినచో విరక్తు డగును. కామోపచారపరు డయిన ననాదరము సహింపడు. ఇట్టి వా డుత్తమ వైశికు డని బుధు లనిరి.

వ్యలీకమాత్రే దృష్టేఽస్యా న కుప్యతి న రజ్యతి
దదాతి కాలే కాలే చ వసనాదీని భావతః. 40

సర్వాస్థైరపి మధ్యస్థతయైవోపచరన్స్త్రియః
దృష్టే దోషే విరజ్యేత భవేన్మధ్యమః పుమాన్. 41

మధ్యమవైశికుని లక్షణ మిం దున్నది. వనితాపచారము గోచరించినచో కోపింపడు. రక్తుడునుకాడు. ఆ యా సమయము లందు భావపూర్వకముగ వసనాదుల నిచ్చును. సర్వవిధముల మధ్యస్థుడుగనె వనితల నుపచరించును. కాని దోషము గోచరించినచో విరక్తు డగును. ఇట్టి యీతడు మధ్యముడు.

కామతంత్రేషు నిర్లజ్జః కర్కశో రతికేలిషు
అవిజ్ఞాతభయామర్షః కృత్యాకృత్య విమూఢధీః. 42

మూర్ఖః ప్రసక్తభావశ్చ విరక్తాయామపి స్త్రియాం
మిత్త్రైర్నివార్యమాణోఽపి పారుష్యం ప్రాపితోఽపి చ. 43

అన్యస్నేహపరావృత్తాం సంయుక్తరమణామపి
స్త్రియం కామయతే యస్తు సోఽధమః పరికీర్తితః. 44

అధమ వైశికు డిందున్నాడు. ఈతడు కామతంత్రము లందు లజ్జారహితుడు. అచుంబనీయ స్థాన చుంబనాసక్తుడు. సురతక్రీడలలో కర్కశుడు. భయామర్షములు తెలియని వాడు. కృత్యాకృత్య విమూఢబుద్ధి, మూర్ఖుడు, విరక్తవనిత యందును భావప్రసంగము కలవాడు. మిత్త్రులు నివారించినను పరుష మాభాషించినను తనయందు స్నేహము విడనాడి యన్యపురుషు నందు స్నేహము కలదానిని, భర్తతో కూడియున్న దానిని గూడ కామించు వా డగును. ఇట్టి వాడధమవైశికుడు.

## నాయకసంజ్ఞలు

ఇటుపై స్త్రీసంభాష పరిభాష పర్యాలోచన మొనరింపవలెను. వారు ప్రీతితో ప్రియనాయకు ననేకవిధముల నాహ్వానింతురు. ప్రేమసూచక పదములతో వ్యవహరింతురు తన్మూలము వారిప్రేమ. అట్టిప్రేమకు నాయకుడు మూలము.

ప్రణయీ దయితః కాంతో నాథః స్వామీ ప్రియః సుహృత్
నందనో జీవితేశశ్చ సుభగో రుచిరస్తథా. 45

ఇత్థం నాయకసంజ్ఞాః స్యుః స్త్రీభిః ప్రీతిప్రయోజితాః

ఇందు నాయికలు ప్రీతిచే ప్రయోగించు నాయక సంజ్ఞలు పదునొకండు కలవు. ప్రణయి మొదలగు నవి యన్నియు ప్రణయినీ ప్రణయ విశేషమును ప్రఖ్యాపన మొనరింప గలవు. ఆ యా పరిభాషార్థములు నిరూపితములు కాగలవు.

ప్రసాదయన్సఖీమధ్యే శైలోద్యాన వనాదిషు. 46

మిథ్యారుషా కలుషితాం ప్రణయీ స నిగద్యతే
వాసోఽంగరాగమాల్యాద్యైః హృద్యైర్యః ప్రేయసీం రహః. 47

ప్రసాదయన్ప్రీణయతి దయితః సోఽభిధీయతే
కథాభిః కమనీయాభిః కామ్యైర్భోగైశ్చ సర్వదా. 48

ఉపచారైశ్చ రమయన్ యః స కాంత ఇతీరితః
సామదానార్థసంభోగైః లాలయన్ప్రీణయన్సదా. 49

భజతే రహసి ప్రీతః స నాథ ఇతి కథ్యతే
నివారయన్నకృత్యేభ్యః కర్తవ్యేభ్యః ప్రరోచయన్. 50

స్వభావే స్థాపయతి యః స స్వామీతి నిగద్యతే

ఈ ప్రఘట్టములో ప్రణయి దయిత కాంత నాథ స్వామి పదముల యర్థ సామంజస్య నిరూపణ మున్నది. ప్రణయి పద వ్యవహార్యు డగు ప్రియుడు సఖీమధ్యముననె ప్రసాదనము ప్రారంభించును. మిథ్యారుషా కలుషిత యయిన ప్రయురాలిని శైలపరిసరము లందు ఉద్యానవనాదు లందు

విహారింప జేయుచు సఖులున్నారన్న సందియము లేక బతిమలాడుకొనును. అట్లు మంచివాడు ప్రణయి యని వ్యవహరింపబడు. దయితు డన దగిన వాడు ప్రేయసిని రహః ప్రదేశమున హృద్యములగు వాసోంగరాగమాల్యాదు లిచ్చి ప్రసాదన మొనరించుచు నాయికను సంతుష్టగా జేయును. కాంతు డనదగిన కాంతుడు కమనీయ కథలు చెప్పి కామ్యము లగు భోగము లిచ్చి సర్వదా కామోపచారములచే కాంతనురమింపజేయును. నాథుడన దగువాడు సామ దానార్థము లయిన సంభోగము లిచ్చి లాలన మొనరించును. ప్రీణన మొనరించును. నిత్య మట్లు చేయును. ప్రీతుడై రహస్యముగ నేకాంతముగ భామినిని భజించును. స్వామి యనదగు నాతడు అకృత్యముల నుండి నాయికను నివారించును. కర్తవ్యములకై ప్రరోచన ముత్పాదించును. తన నాయికను స్వస్వభావమున నుంచును. వాడు స్వామి.

ఇటు పై ప్రియ సుహృత్ నందన జీవితేశ సుభగ రుచిర పదముల యర్థభావ మిట్లుండును.

సత్యవా గార్జవరతి రుపకుర్వన్ప్రియం వదన్. 51

భజతే యః స్వయం ప్రీతః ప్రియః స భవతి స్త్రియాః
దుఃఖే విపది సమ్మోహే కార్యకాలాత్యయేఽపి చ. 52

హితాన్వేషీ చ హితకృద్యః సుహృత్ సోఽభిధీయతే
శ్లాఘనీయః సఖీమధ్యే గుణైః సౌజన్యజన్మభిః. 53

శ్లాఘయన్నందయతి యః ప్రియాం నందన ఈరితః
భజతే యః ప్రియామిష్టైః శయనాసనభోజనైః. 54

అభీష్టాభిశ్చ లీలాభిః జీవితేశ ఇతీరితః
సపత్నీ నఖదంతాది చిహ్నం యస్య న దృశ్యతే. 55

విస్మర్యమాణమానేర్ష్యః సుభగః సోఽభిధీయతే
భోగ్యేషు యత్రాభిరుచిః తద్దానై రభిరోచయన్. 56

రుచ్యాం ప్రియాం రమయతి రుచిరః సోభిధీయతే

ప్రియు డనదగు నాయకుడు సత్యవచనుడు ఆర్జవమున నాసక్తుడు ఉపకారశీలి ప్రియవదనుడు. స్వయంసంతుష్టుడై ప్రియురాలిని సేవించును.

సుహృ్దాఖ్యుఁ డిట్లుండును. దుఃఖము విపత్తు సమ్మోహము కలిగినను హితాన్వేషి యగును. చేయవలసిన పని చేయవలసిన సమయ మతిక్రమించినను హితాన్వేషియై హితకారి యగును. అట్టివాఁడు సుహృత్పదాభిధేయుఁడు. నందనుఁ డనువాఁడు ఆనందము కలుగఁజేయు గల నాయకుఁడు. "నందయతీతి నందనః". సౌజన్యసంజాతము లయిన గుణము లుండుటచే సఖీమధ్యముననుశ్లాఘనీయుఁడగును. ప్రియను శ్లాఘించును. ఆనంద పెట్టును. జీవితేశుఁడు ఇష్టము లయిన శయనాసన భోజన విధానములతో ప్రియను సేవించును. అభీష్టము లయిన కామలీలా విశేషములతో భజించును. ఇట్టివాఁడు జీవితేశుఁ డనదగును. సుభగుఁ డిట్లుండును. ఈతని దేహమున సపత్నీకృతములయిన నఖక్షతముల చిన్నెలు కాని దంతక్షతముల చిన్నెలు గాని కన్పింపవు. ప్రియురాలి ప్రణయమానమును గాని ఈర్ష్యావిధానమును గాని విస్మరించును. వాని నే మాత్రము పట్టించుకొనఁడు. ప్రణయమె పట్టించుకొని సేవించును. "స ఖలు సుభగః యమంగనాః కామయంతే" అంగనలకు కామ్యుఁడగు నాతఁడు సుభగుఁ డని యందురు. రుచిరుఁడు వేరొకఁడు. తన కెట్టి భోగ్యము లం దభిరుచి యుండునో యట్టి భోగ్యవస్తు ప్రదానములచే నాయిక కభిరుచి కలుగఁజేయుచు రుచ్య యగు ప్రియురాలి నభిరమించు వాఁడు రుచిరుఁ డనదగును.

ప్రేమసంభవము లయిన స్త్రీల వ్యాహారములు నిరూపితము లయినవి. కోపము కలిగి నప్పుడు స్త్రీలు నాయకుల నెట్లు పలుకుదురో అట్టి వ్యాహారము లిచట నిరూపితము లగును.

వామో విరూపో దుఃశీలో నిర్లజ్జో నిష్ఠురః శఠః. 57

ధృష్టో దురాచార ఇతి వ్యాహారాః కోపసంభావాః

వామవిరూపాదివ్యాహారము లెనిమిది. ఇవి యన్నియు కోపసంభవము లయిన వచనవ్యవహారములు. కోపము లే నప్పుడు వారు ప్రియ సుభగాది పదవ్యవహార్యులె. ఇప్పుడు వామాదు లయినారు. వీరి స్వరూప లక్షణము లిటుపై నున్నవి. ఇందు వీరి స్వభావ కామ వామతయు నుండును. ఇట్టి వానిని సహింప జాలక వామాది వ్యవహార మవలంబింతురు. నాయకులం దట్టి విశేషములె వ్యక్తము లగును.

వార్యతే యత్ర విషయే యత్ర చైవ నియుజ్యతే. 58

తత్ర తత్ర విపర్యేతి స వామః పరికీర్తితః

నఖదంతవ్రణై రంగైః సరసైః శిథిలీకృతః. 59

విపరీతకథోఽమానీ విరూప ఇతి సంజ్ఞితః
అసహిష్ణుతయా క్రుద్ధో వాచ్యావాచ్యం న వేత్తి యః. 60

న వేత్తి దేశకాలౌ చ స దుఃశీల ఇతి స్మృతః
పరుషైరవమానైశ్చ వార్యమాణో ముహుర్ముహుః. 61

సాపరాధోఽపి యో గచ్ఛేత్స నిర్లజ్జ ఇతీరితః
కృతాపరాధోఽపి ముహుః ప్రసాదనపరాఙ్ముఖః. 62

రిరంసతి బలాత్కారైః స నిష్ఠుర ఇతీరితః
పురః ప్రియం వదన్ సమ్యగపరత్రాప్రియం వదన్. 63

అర్థాన్వినాశయన్గూఢం స శఠః పరిపఠ్యతే
దృష్టేఽపరాధే శపథై ర్నాస్తీతి బహుశో వదన్. 64

సచిహ్నైః సన్నిధత్తే యః స ధృష్ట ఇతి కథ్యతే
దోషే త్వవిద్యమానేఽపి యోఽవిమృశ్య సమాచరన్. 65

తాడనం బంధనం వాపి దురాచార ఇతీరితః
ఇత్థం నాయకభేదాస్తు భరతేన ప్రదర్శితాః. 66

వాముడు. ఒకవిషయమున వారించినను విపరీతముగ నుండును. ఒక విషయమున నియమించినను విపరీతముగ నుండును. అంతట వ్యత్యస్తముగనె ప్రవర్తించును. అట్టివాడు వామనాయకుడు.

విరూపుడు. సరసము లయిన పచ్చి పచ్చిగ నున్న నఖవ్రణములు దంతవ్రణములు కల యంగములతో శిథిలీకృతుడుగ నుండును. విపరీతప్రవృత్తి కలవాడుగ నుండును. అమాని—యభిమానరహితుడుగ నుండును. దేహగతము లయిన చిహ్నముల జూచి యెవరేని యేమేని యందు రన్న జంకులు కొంకు లాతని కుండవు. ఇట్టి వాడు విరూపుడు.

దుశ్శీలుడు. అసహిష్ణు వగుటచే క్రుద్ధు డగును. వాచ్య మవాచ్యము గుర్తింపడు. పలుక దగినది పలుకరాని దన్న విభాగము లే కుండగనే పలుకును. దేశకాలములను గుర్తింపడు. తోచినప్పుడు తోచినవిధమున నెచట నేని యెప్పుడేని భాషణ చేష్టితములు కలవాడగును. వీడు దుశ్శీలుడు.

నిర్లజ్జుడు. పరుషవచనములు పలికినను అవమానము లొనరించినను ముహుర్ముహుః రావలదని నివారితు డయినను సాపరాధు డయినను, నాయికాభవనమున కేగుచునే యుండును. ఇట్టి వానిని నిర్లజ్జు డనవలెను. ఇంత జేసిన నాతడు లజ్జపడడు. లజ్జాభిమానములను విడినాడిన వా డిట్టిడె.

నిష్ఠురుడు. మాటి మాటి కపరాధ మొనరించును. కుపితనాయిక నేమియు బతిమిలాడడు. ప్రసాదన పరాఙ్ముఖుడు. అయినను బలాత్కారము లతో రమింపజూచును. నాయిక కుపిత యయినను బలాత్కరించి సంభోగించు టకు యత్నించును. ఈతడు నిష్ఠురుడు.

శఠుడు. ఎదుట బాగుగా ప్రియము పలుకును. వేరొకచోట బాగుగనె యప్రియము పలుకును. ముఖప్రీతివచను డిట్లే. సర్వప్రయోజనము లను గూఢ ముగా వినాశనము చేయును. పాడుచేయును. వీడు శఠుడు.

ధృష్టుడు. అపరాధము స్పష్టముగా గోచరించినను ఒట్లు వేసి కొని లేదు లే దని యనేకపర్యాయములు పలుకును. దేహమున నన్నియు నన్యకాంతాచిహ్నము లుండును. ఉన్నను కాంతాసన్నిధికి జేరును. కూటమికి తలపడును. వీడు ధృష్టుడు.

దురాచారుడు. తన కాంత యం దే దోషము లే కున్నను అనాలోచి తముగ తాడనము బంధనము నాచరించుచు ప్రవర్తించు నాయకుడు దురా చారుడు. ఇట్లు నాయకభేదములను శరతుడు ప్రదర్శించినాడు.

## స్త్రీలసత్త్వ (శీల) భేదములు

కామోపచారనిపుణు డగు కాముకుడు కామినీసత్త్వభేదములను గుర్తించి సంభోగమున యత్నింపవలెను. సత్త్వోచిత మయిన సంభోగమె సుఖ ప్రదము. సంభోగార్థము సత్త్వపరీక్ష యావశ్యకమని నిరూపిత మగును. సత్త్వభేదము లనేకములు కలవు. వానిని సావధానముగ సంభావించుట సముచి తము.

నాయికానాం చ సర్వాసాం సత్త్వ మత్రాభిధీయతే
ధర్మా దర్థోఽర్థతః కామః కామా త్సుఖఫలోదయః. 67

సుఖస్య మూలం ప్రమదా స్తాసు సంభోగ ఇష్యతే
నానాశీలాశ్చ తాః సర్వాః స్వం స్వం సత్త్వం సమాశ్రితాః. 68

ఉపసృప్తా యథా శీలం తృప్తా విదధతే రతిం

సర్వనాయికల సత్త్వ మిచట నిరూపిత మగును. సత్త్వానుకూలముగ స్త్రీలను సేవించుట సముచితము. ధర్మాచరణము వలన నర్థసిద్ధి యున్నది. అర్థము వలన కామసేవనము లభించును. కామము వలన సుఖాత్మకఫల ముదయించును. సుఖమునకు ప్రమదలు మూలము. అట్టి ప్రమద లందు సంభోగ మభీష్టము. ఆ ప్రమద లందరు నానాశీలముల నుందురు. వా రందరు తమ తమ సత్త్వము నాశ్రయించి యుందురు. వారి వారి శీలానుసారమున వనితల సన్నిధికి సంభోగార్థము చేరినచో వారు తృప్త లగుదురు. సముచిత మయిన సురత మిత్తురు. కావున శీలనిరూపణ మావశ్యకము.

దేవ దానవ గంధర్వ యక్ష రక్షః పతత్త్రిణామ్. 69

పిశాచ నాగ వ్యాలానాం నర వానర హస్తినాం

మృగ మీనోష్ట్ర మకర ఖర సూకర వాజినామ్. 70

మహిషాజాగవాదీనాం తుల్యశీలాః స్త్రియః స్మృతాః

ఇందు దేవశీలాదు లిరువది రెండు కలవు. స్త్రీలు దేవాదుల శీలముతో సమాన మయిన శీలము కలిగి యుందు రని భరతాదులు నిరూపించిరి. ఆ శీలములు యథానుగతముగా నిరూపితము లగును.

ప్రత్యంగోపాంగయోరంగే స్నైగ్ధ్యమారోగ్య మార్జవమ్. 71

చిరాన్నిమేషో దానేచ్ఛా సంగీతాభిరతి ర్ముహుః

స్వేదాల్పత్వం రతేస్సామ్యం భావజ్ఞానం కృతజ్ఞతా. 72

యస్యాః స్థిరాణి సా యోషిద్దేవశీలేతి కథ్యతే

1. దేవశీలా లక్షణ మిచట సంభావ్యము. ఈ దేవశీలకు అంగము లందు ప్రత్యంగములందు ఉపాంగములందు సముచిత మయిన స్నిగ్ధత యుండును. చక్కని యారోగ్య ముండును. యుక్త మయిన యార్జవ ముండును. ఆలస్యముగా కనురెప్పలు మూతవేయును. దానము నం దభిలాషము, ముహుః సంగీతాభిరతి యుండును. దేహమున స్వేద మల్పముగా నుండును. "రతేస్సామ్యం" సమరతి యుండును. భావజ్ఞాన ముండును. పురుషునకు సంబంధించిన

సురతసమయమునందలి యొక విశిష్టనిధానమునకు భావ మని సంకేతము. ఆ భావానుసారమున తన భావమును సంగత పఱచును. అందుననె సమరతి కల దనుట. దేవశీలలో కృతజ్ఞత యున్నది. ఇట్టి యీ విశేషము లన్నియు నీమెలో స్థిరములుగా నుండును. ఇట్టి వనిత దేవశీల యన దగినది.

స్థిరక్రోధా శఠాఽధర్మరతా నిష్ఠురభాషిణీ. 73

మద్య మాంసప్రియా లుబ్ధా చపలా కలహప్రియా
ఈర్ష్యావతీ చలస్నేహా దైత్యశీలేతి కథ్యతే. 74

2. దైత్యశీల. ఈమె క్రోధము స్థిరము. శఠురాలు. అధర్మరత. నిష్ఠురభాషిణి. మద్యప్రియ. లుబ్ధ. చపల. కలహప్రియ. ఈర్ష్యావతి- ఈమెతో స్నేహము స్థిరము గాదు, చలము. ఇట్టి యీమె దైత్యశీల యగును.

స్నిగ్ధ త్వక్కేశనయనా నఖ దంతక్షతిప్రియా
ఆరామభోగ్యా మృద్వీ చ స్మితపూర్వాభిభాషిణీ. 75

తన్వీ సంగీతసంస్పృష్టా మందాపత్యా రతిప్రియా
గంధర్వశీలా విజ్ఞేయా పుష్పశయ్యాభిలాషిణీ. 76

3. గంధర్వశీల. చర్మము కేశములు నయనములు స్నిగ్ధములుగా నుండును. నఖక్షతములు దంతక్షతములు నభిలషించును. ఈమె యారామమున భోగయోగ్య. మృదుస్వభావ. స్మితపూర్వముగా సంభాషించును. తన్వి. సంగీతముతో సంస్పృష్ట యగును. ఈమెకు సంతానము తక్కువ. కాని రతిప్రియ. పుష్పశయ్యాభిలాషిణి. ఇట్టిది గంధర్వశీల.

స్వల్ప విస్వేద కణికా మద్యగంధామిషప్రియా
చిరవిస్మృత దృష్టేషు కృతజ్ఞత్వాత్ప్రియంవదా. 77

అదీర్ఘశాయినీ మేధావినీ యక్షాంగనా మతా

4. యక్షశీల. స్వేదకణికలు స్వల్పముగా ధరించును. మద్యప్రియ గంధప్రియ మాంసప్రియ. విస్మృతు లయిన వారు చిరకాలమునకు కన్పింపగా కృతజ్ఞురాలు కావున ప్రియంవద యగును. ప్రియవచనములు మాటలాడును. దీర్ఘకాలము శయనింపదు. ఈమె మేధావిని. ఈమె యక్షశీల యగును.

బృహదాయతసర్వాంగీ రూక్షవిస్తీర్ణలోచనా. 78

ఖరరోమా దివాస్వప్న నియతాఽ త్యుచ్చభాషిణీ
నఖదంతక్షతకరీ క్రోధేర్ష్యాకలహప్రియా. 79
నిశావిహారశీలా చ యా సా రాక్షసశీలినీ

5. రాక్షసశీల. ఈమె సర్వావయవములు పెద్దవిగా నుండును. పొడవుగా నుండును. లోచనములు రూక్షనులు విస్తీర్ణములు. రోమములు తీక్ష్ణములు. పగటిపూట శయనించి నిద్రించుటలో నీమె కాసక్తి యధికము. బిగ్గరగా మాట లాడును. నఖక్షతము లొనరించును. దంతక్షతము లొనరించును. గిచ్చును కొఱుకును. క్రోధేర్ష్యా కలహ ప్రియ. రాత్రులందు విహరించుట యీమె శీలము. ఈమె రాక్షసశీలిని.

వ్యావృత్తాస్యా శీఘ్రగతిః క్షీరోద్యానఫలప్రియా. 80
నైకత్ర నియతా తీక్ష్ణా చపలా బహుభాషిణీ
పతత్రిశీలా విజ్ఞేయా ప్రతిప్రత్తి పరాఙ్ముఖీ. 81

6. పక్షిశీల. ముఖను త్రిప్పి యుండును. ఎడమొగము పెడమొగము నను నట్లుండును. శీఘ్రగతి గలదై చటచట నడచును. క్షీరప్రియ, ఉద్యానప్రియ, ఫలప్రియ. ఒకచో నియతముగా నుండదు. తీక్ష్ణప్రకృతి, చపలస్వభావ, బహుభాషిణి. తెలివితేటలకు విముఖురాలు. ప్రతిపత్తిపరాఙ్ముఖి. ఇట్టి వనిత పతత్రి శీల పక్షిశీల యగును.

న్యూనాధికాక్షి దంతోష్ఠ కర్ణ స్తన నఖాంగులిః
రోమశాంగీ మహారావా సురతే కుత్సితక్రియా. 82
బాలోద్వేగకరీ రాత్రిచారిణ్యనృతభాషిణీ
పిశాచశీలా విజ్ఞేయా మద్యమాంస బలిప్రియా. 83

7. పిశాచశీల. కన్నులు దంతములు పెదవులు చెవులు స్తనములు నఖములు వ్రేళులు తక్కువగా నుండును. అధికముగ నయిన నుండును. ఒకటి చిన్నది మరి యొకటి పెద్దదిగ నుండును. ఈ యవయవములలో నేదియో వికృతి గోచరించును. ఈమె దేహము నం దంతట రోమములు మెండు. కంఠ ధ్వని పెద్దది. మహారావ. సురతసమయమున కుత్సితములగు నింద్యములగు పాడు పనుల జేయును. బాలుర కుద్వేగము కలిగించును. రాత్రులందు సంచరించును. అసత్యము భాషించును. మద్యమాంసప్రియ బలిప్రియ. ఇది పిశాచశీల.

మానావమానరహితా రూక్షత్వక్ కటుకస్వరా
విశాలాక్షీ శఠా ధృష్టా వ్యాలశీలేతి కథ్యతే. 84

8. వ్యాలశీల. వ్యాలపదమున కిచట పులి పులి యర్థము. సర్పశీలము గజశీలము వేరుగా నున్నది. వ్యాలశీల యగు వనిత మానావమానరహిత. శరీర చర్మము రూక్షము కర్కశము. కంఠస్వరము కటువు. నేత్రములు విశాలములు, శఠ. ధృష్ట. ఇట్టిది వ్యాలశీల.

నిద్రాలుః కోపనా తిర్యగ్గతిస్తామ్రవిలోచనా
గంధాభిలాషిణీ తీక్ష్ణనాసోగ్రదశనా చలా 85

నాగశీలేతి విజ్ఞేయా సదా శ్వసనశాలినీ

9. నాగశీల. ఈమె సర్పశీల. నిద్రాస్వభావ. కోపన. తిర్యగ్గమనము కలది. అడ్డముగా నడచును. వంకరగా నడచును. కన్నులు తామ్రవర్ణములు. గంధ మభిలషించును. తీక్ష్ణనాస. ఈమె దంతములు దంతురము లుగ్రములు. ఎల్లప్పుడు బుసపెట్టు విధమున శ్వసించును. ఇట్టి యాడుదానిని త్రాచుపాము నాగశీల యనవలెను.

ఋజ్వీ సుహృత్ప్రియా దేవగురుభక్తా క్షమాన్వితా. 86

ఉపచారపరా నిత్యమహంకారవివర్జితా
సుశీలా మర్త్యశీలా స్యాద్గంధమాల్యరతిప్రియా. 87

10. మర్త్యశీల. ఆర్జవము కలది. సఖులపై నాదరము కలది. దేవ భక్త, గురుభక్త. క్షమాన్విత. నిత్య ముపచారపరాయణ. అహంకారావివర్జిత. గంధమాల్యప్రియ. రతిప్రియ. యోగ్యశీల. ఇది మానవశీల.

అల్పగాత్రా ఫలారామప్రియా పింగలరోమదృక్
ప్రసహ్య ఫలశీలా చ తీక్ష్ణా చ చపలా తథా. 88

శీఘ్రకోపప్రసాదా చ కపిశీలేతి కథ్యతే

11. కపిశీల. దేహ మల్పము. ఫలము లం దారామము లందు ప్రీతి బహుళము. రోమములు దృష్టులు పింగలవర్ణములు. బలాత్కరించిననె సంభోగఫల మిచ్చు శీలము. తీక్ష్ణప్రకృతి. చపలస్వభావ. కోపము కాని ప్రసాదము కాని శీఘ్రమె కలుగును. ఇట్టి నారి వానరనారి. కపిశీల.

మందాయతగతి ర్మందచేష్టాఽత్యశనలాలసా. 89
దీర్ఘరోషప్రసాదా చ హస్తిశీలేతి కథ్యతే

12. హస్తిశీల. మందగతి. ఆయతగతి. పాదపాదములకు వ్యవధాన మధికము. చేష్టలు మందములు. సర్వము ఆలస్యముగా నొనరించును. అధికముగా దినుటలో నత్యంతము లాలస. ఈమె రోషము కాని ప్రసాదముకాని దీర్ఘకాలము పట్టును. ఈమె హస్తిశీల.

శీఘ్రగా చపలా భీరుర్గీతవాద్య రతిప్రియా. 90
చలవిస్తీర్ణనయనా కోపనా విరహాసహా
మృగశీలేతి విజ్ఞేయా వనశయ్యాసనప్రియా. 91

13. మృగశీల. శీఘ్రగమనము కలది, చపలప్రకృతి కలది, భయము గలది. గీతప్రియ. వాద్యప్రియ. పిమ్మట రతిప్రియ. ఆమె నయనములు చలములు విస్తీర్ణములు. కోపము కలది. విరహము సహింపలేదు. వనమున శయ్యాసనము లందీమె కాసక్తి యధికము. కావున నిట్టియామె మృగశీల యని గ్రహింపవలెను.

బహుభృత్యవతీ దూరగామినీ సలిలప్రియా
దీర్ఘగాత్రీ దురాచారా మత్స్యశీలాఽనిమేషిణీ. 92

14. మత్స్యశీల. ఈమెకు భృత్యులధికముగా నుందురు. పరివారము మెండు. దూరగమన మొనరించును. సలిలసంచారమున ప్రీతిబహులము. దీర్ఘగాత్రి. దురాచార. అనిమేషిణి.ఈమె రెప్పపాటు లేక అట్లేచూచును. ఇట్టియామె మత్స్యశీల.

దీర్ఘోన్నతతరగ్రీవా లంబోష్ఠీ నిష్ఠురస్వనా
కట్వమ్లలవణప్రీతా భవేదుష్ట్రీ వనప్రియా. 93

15. ఉష్ట్రశీల. ఈమె మెడ దీర్ఘము. ఉన్నతతరము. ఓష్ఠము లంబమానము, స్వనము నిష్ఠురము. ఈమెకు కారము పులుపు లవణ మధిక మగుట యభీష్టము. ఈమె వనప్రియ. ఈమె ఉష్ట్రశీల.

స్థూలశీర్షాంచితగ్రీవా దారితాస్యా మహాస్వనా
జ్ఞేయా మకరసత్త్వేతి సర్వైర్మత్స్యగుణై ర్యుతా. 94

16. మకరశీలయే మకరసత్త్వ. పెద్దతలతో గూడిన లావు మెడ తెరచిన ముఖము బిగ్గరగా పలుకుట యీ మకరమానిని విశేషములు. ఇంకను మత్స్యశీలాగుణము లన్నియు నీమెలో నుండును. ఇట్టి వనిత నందరు మకర శీల యని తెలియ దగును.

స్థూలజిహ్వోష్ఠదశనా రూక్షత్వక్కటుభాషిణీ
రతిప్రియా సదా హ్యృష్టా ఖరశీలేతి కథ్యతే. 95

17. ఖరశీల. ఖరము గాడిద. ఈమెకు నాలుక పెద్దది. పెదవి పెద్దది. పన్నులు పెద్దవి. చర్మము రూక్షము కర్కశము. భాషణము కటువు. సర్వదా సంభోగప్రియ. తగిన రతివిధానమున హృష్ట. ఇట్లుండగా నీమెను ఖరశీలి యన వలెను.

సపత్నీద్వేషిణీ రుష్టా బహ్వపత్యా దరీరతా
దీర్ఘాస్యా పింగదృగ్రోమా సౌకరంశీలమాశ్రితా. 96

18. సూకరశీల. సవతులను ద్వేషించును. రోషపడును. బహుసంతానము కనును. బొరియలలో నుండునట్లు మూల గదులలో నుండును. ఈమె మూతి పెద్దది. పందిమూతివలె పెద్దది. ఈమె దృక్కులు రోమములు పింగల వర్ణములు. ఇట్టి యీమె సూకరశీల.

విభక్తపార్శ్వోరు కటీస్తన శ్రోణి శిరోధరా
దానశీలా ఋజుస్థూలకేశా మధురభాషిణీ. 97

కోపనా రతిలోలా చ హయశీలేతి కథ్యతే

19. హయశీల. పార్శ్వములు ఊరువులు కటి స్తనములు శ్రోణి మెడ విభక్తములై మంచి కూర్పుతో నుండును. ఈమె దానశీల. ఈమె కేశములు ఋజువులు స్థూలములు. మధురభాషిణి. కోపన. రతిలోల. ఈమె హయశీల యన దగినది.

స్థూలదంతా పృథుశ్రోణిః ఖరరోమారుణేక్షణా. 98

అభీరురున్నతాస్యా చ లోకద్విష్టా రతిప్రియా
సలిలారణ్యరసికా మాహిషం శీలమాశ్రితా. 99

20. మహిషశీల. ఈమె పన్నులు పెద్దవి. పిఱుదులు గొప్పవి. రోమములు ఖరములు. దృష్టి లరుణములు. ఈమెకు భయ ముండదు. ముఖ మున్నతము. లోక మీమెను ద్వేషించును. రతిప్రియ. సలిల రసిక. అరణ్య రసిక. ఈమె మహిషశీల.

కృశా తరలదృక్ సూక్ష్మరోమా తనుభుజాంతరా
శీతభీరు ర్జలోద్విగ్నా బహ్వపత్యా వనప్రియా. 100
ఊష్మలాంగీ సంచరిష్ణుః అజశీలేతి కథ్యతే

21. అజశీల. కృశించి యుండును. సన్నగా నుండును. చంచల దృష్టి. సూక్ష్మరోమ. భుజాంతర మల్పము. శీత మన్న భయపడును. జల మన్న నుద్వేగ పడును. బహు సంతాన. వన ప్రియ. ఈమె దేహము వేడిగా నుండును. నిత్యము సంచరించు స్వభావమున నుండును. ఈమె అజశీల. అజము మేక.

పృథుపీనోన్నతశ్రోణి స్తనుజంఘా సుహృత్ప్రియా. 101
పితృదేవార్చనరతా దృఢారంభా ప్రజాహితా
స్థిరా పరిక్లేశసహా గవాం సత్త్వం సమాశ్రితా. 102

22. గోశీల. ఈమె పిఱుదల భాగములు పృథు పీన ఉన్నత స్వభావములతో నుండును. పిక్కలు చిన్నవి సన్నవి. సుహృత్ప్రియ. చెలియ లన్న ప్రేమ. పితృదేవార్చన రత. తలిదండ్రులను అత్తమామలను సేవించును. దేవపూజ లొనరించును. దృఢారంభ. ప్రజాహిత. కన్న సంతానముపై ఆదరము కలది. సంతానమును తల్లియని హితము చూపుదురు. స్థిరభావ. క్లేశము సహింపగలదు. ఈమె "గవాంసత్త్వం సమాశ్రితా". గోసత్త్వము నాశ్రయించి యుండును. ఈమె గోశీల.

ఏవం ప్రదర్శితం స్త్రీణాం భరత వర్త్మనా
విజ్ఞాయ చ యథా సత్త్వముపసర్పే త్తతో బుధః. 103
ఉపచారో యథా సత్త్వం స్త్రీణా మల్పోఽపి హార్దదః
మహానప్య తథాయుక్తో నైవ తుష్టికరో భవేత్. 104

స్త్రీలకు సంబంధించిన ఇరువది రెండు శీలములు నిరూపితము లయినవి. ఈ స్త్రీ శీల ప్రదర్శనమంతయు భరతుని మార్గానుసారమున నిరూపిత

మయినది. వీని నన్నిటిని దెలిసిన శృంగార పండితుడు సత్త్వానుసారమున శీలానుసారమున నా యా స్త్రీల నుపసర్పించునది. శీలభేదము ననుసరించి వారి నానాదరముల జూడ నక్కఱలేదు. ఆ యా శీలానుసారముగా పురుషుడు వారి దరి జేరినచో వారు సంతుష్టల గుదురు. శీలానుసారముగ స్త్రీల నుపచరించుటకు పురుషు డలవడవలసి యున్నది. సత్త్వానుసారముగానున్న ఉపచారము అల్పమయినను స్త్రీలకు హర్షప్రదము. సత్త్వానుసారముగా నుండనిచో ఉపచార మధికముగా నున్నను స్త్రీల కది తుష్టికరము కాదు. ఉపచార పరిజ్ఞానము కలవాడు. సత్త్వ పరిజ్ఞానమున స్త్రీల సేవించుట యుక్తము. ఉపచార విశేష విధానమున స్త్రీలు తమ యనుచితస్వభావములను మార్చుకొనగలరు. ఈ శీలములలో సముచితముగా సంభావితము లయిన శీలముల నలవఱచు కొనుటలో వారుల్లాసము కల వారును కాగలరు.

## కామోపచారము

ఈ ప్రసక్తిలో ఉపచారమును నిరూపింప వలసి యున్నది. ఏయే యుపచారము నెవరెవరి విషయమున నెట్లెట్లు ప్రయోగింప వలెనో కామ పండితుడు గుర్తింప గలడు.

వాసోఽంగరాగాభరణ మాలా శయ్యాసనాదిషు
యత్ర యత్ర స్పృహా తత్ర ద్దేశ కాలానుకూలతః 105
అత్యాదరేణ సత్కార ఉపచార ఇతీరితః
అతో రతి వివృద్ధ్యర్థం స్త్రీషు శీలానుకూలతః 106
యథానుకూలం పురుషై రుపచారో విధీయతాం

నానా శీల విశేషిత లయిన స్త్రీల ననుకూలముగా సేవించుటకై పురుషు లనుసరింప దగిన యుపచార విశేషముల స్వరూప మిచట నున్నది. ఆ యా దేశకాలానుసారముగా నే యే వనిత కే యే పదార్థమున స్పృహ యుండునో కలుగునో పురుషు డా స్పృహా విశేషము గుర్తించి తగిన విధముగా వస్త్రములను అంగరాగములను ఆభరణములను మాలలను శయ్యలను ఆసనములను ఆ వనితకు సిద్ధ పఱుప వలెను. అత్యాదరముగా వానిని సత్కారముగా సమర్పింప వలెను. ఇట్టి సత్కారమున కుపచార మని పేరు. కావున ననురాగాభివృద్ధి కొఱకై స్త్రీల శీలానుకూలముగా యథానుకూలముగా స్త్రీల విషయమున పురుషు లుపచారమును అనుసరింప వలసి యున్నది. ఉపచారముల ప్రయోగము నందును వైవిధ్య మున్నది. శీల మొకటియె యయిన నందరి విష

యమున నుపచార మేక విధముగ నుండదు. అందరి భేదములను గుర్తించి ప్రయోగింప వలెను.

ఉపచారస్త్రిధా వేశ్యా కులజాఽన్యా విభాగతః. 107

నానాబీజోద్భవః కామో యూనోస్సర్వత్ర దృశ్యతే
తత్తదాలంబనగుణై రుత్తమో మధ్యమోఽ ధమః. 108

వాసోఽంగరాగాభరణ మాలా శయ్యాసనాదయః
సాధారణాః కులీనానాం వేశ్యాదీనాం చ యోషితామ్. 109

కులాంగనోపచారస్తు సత్యార్జవ పురస్సరః
అవస్థా దేశకాలాది ప్రధానోఽన్యాసు దృశ్యతే. 110

అర్థితానపరాధాదిప్రధానో గణికాశ్రయః

నాయిక వేశ్య యని పరాంగన యని కులజ యని భేదమున నుండును గావున ఉపచారమును మూడు విధముల నుండును — కులాంగనోపచారము పరాంగనోపచారము వేశ్యాంగనోపచారము నని. స్వీయాద్యుచితముగా నుపచారము ననుసరింప వలెను. ప్రేయసీ ప్రియులకు కామము నానాబీజోద్భవము. అనేకహేతువుల వలన సంస్కారము వలన కామము కలుగును. ఇట్లు కాము ముదయించుట లోకమున నంతట ప్రసిద్ధముగనే యున్నది. కావున తత్తదాలంబన గుణానుసారమున కామ ముత్తమము మధ్యమము నధమమునని త్రివిధముగ నుండుట సంధార్యము. వాసోంగరాగాభరణ మాలా శయ్యాసనాదు లన్నియు కులస్త్రీలకు గాని వేశ్యలకు గాని పరాంగనలకు గాని ఇంకనెవరికేని స్త్రీల కందరకు సాధారణముగా నుండును. వీని నంద రభిలషింతురు. కాని కులాంగనోపచారము సత్యార్జవపురస్సరముగా నుండును. పరాంగనల యందలి యుపచారము తత్తదవస్థా దేశ కాలాది ప్రధానముగ నుండును. గణికాశ్రయ మయిన ఉపచారము అర్థితప్రధానముగ నుండును. వేశ్య యర్థింపగనె సమర్పించుట, అర్థించిన పదార్థమునె యిచ్చుట ముఖ్యము. అపరాధరహితముగానిచ్చుట, అపరాధసముల్లేఖము లేకుండునట్లుగానిచ్చుట ముఖ్యము ఆ యా నాయికల ప్రకృతి ననుసరించిన యుపచారవిధి ఫలప్రద మగును.

వారి వారి రాగాపరాగవిశేషములచే సంభోగము త్రివిధ మగుట రాగోత్పత్తి చిహ్నము లిటుమీదట గుర్తింప దగియున్నవి.

యత్ర కామసముత్పత్తిః తత్ర రక్తిం విరక్తతామ్. 111

లక్షయేల్లక్షణై స్తైస్తైరన్యోన్యం స్త్రీపుమానపి
రక్తా చేత్ప్రథమం యోషిదనురక్తో భవేత్పుమాన్. 112

ఏషస్వభావసుభగః సంభోగః స్యాత్స ఉత్తమః
అథ చేదేకకాలీనా యూనో రన్యోన్య రక్తిమా. 113

ఏష సంభోగ లీలా స్యాత్స కామో మధ్యమః స్మృతః
ఏకత్రై వానురక్తిశ్చే ద్యూనో ర్హాస్యః స చాధమః. 114

రాగాపరాగచిహ్నాని యోషితాం లక్షయే దతః

స్త్రీ కాని పురుషుడు కాని కామ ముదయించిన వారి యందు రక్తి కలదో విరక్తి కలదో ఆ యా లక్షణములచే గుర్తింప వలెను. తన కెవని యందు కామము కలిగినదో వానికి తన యందు రక్తి యున్నదో విరక్తియున్నదో స్త్రీ గుర్తించి ప్రవర్తింప వలెను. ఇట్లె పురుషుడును. స్త్రీపురుషు లన్యోన్యము రక్తి విరక్తిభావములను గుర్తించుట యావశ్యకము. రాగాపరాగములచేసంభోగము మూడు విధములు.

ప్రథమముగా స్త్రీ రాగము కలది కాగా పురుషుడు అనురాగము కలవాడు కా దగును. ఇట్లున్నచో నది స్వభావసుభగ మయిన సంభోగము. ఇది ఉత్తమ సంభోగము. "ఆదౌ వాచ్యః స్త్రియా రాగః". మొదటగా స్త్రీరాగము నిరూపితము కావలెను. స్త్రీరక్త యయిననె పురుషు డనురక్తుడు కా వలెను. అప్పుడే సమ్మోద మిచ్చు సంభోగ ముత్తమ సంభోగము. ప్రేయసీప్రియులకు అన్యోన్యరక్తిమ యేకకాలీన మయినచో సంభోగలీలా పర్యవసానము కలుగును. ఇది మధ్యమ కామము. స్త్రీపురుషులలో నేకత్రానురాగమె యుండునేని యది పరిహాస్య మగు అధమసంభోగము. స్త్రీకి అనురాగము లేదు. పురుషున కున్నది. వారి సంభోగమున సంతుష్టి లేదు. స్త్రీకి రాగము కలదు. పురుషునకు లేదు. వారి సంభోగ మధమము. కావున స్త్రీల రాగాపరాగ చిహ్నములను సావధానముగా గుర్తింప వలసి యున్నది.

ఇందు ముందుగా కులాంగనారాగోత్పత్తి చిహ్నముల నిట్లు గుర్తింప

## కులాంగనారాగచేష్టలు

స్త్రియో జాతానురాగాయా నాయకే లక్షణాన్వితే. 115

కులీనాయాః ప్రథమతః దూరే రోమోద్గమో భవేత్
స్నిగ్ధశ్చ మసృణం చక్షు రధరః స్పందతే స్ఫుటమ్. 116

స్మితోత్తరం చ వచనం స్వేదోదశ్చ కపోలయోః
ఊర్వోః సంపీడనం చాంగే బాహుస్వస్తికబంధనమ్. 117

ఆలింగనం ముహుః సఖ్యాస్తదంగేఽంగ సమర్పణం
నీవీం విస్రంస్య నహనం వేపథుస్త త్ప్రథస్థితిః. 118

వచనే వచనం తూష్ణీం వీక్షణేష్వనవేక్షణం
ఇత్యాదిభావై ర్భావజ్ఞో రక్తాం విద్యా త్కులాంగనామ్. 119

కులాంగనా రాగరీతు లీ విధముగా నుండును. లక్షణసహితునం దను రాగము కలిగిన కులీన వనితకు మొదటగా నిట్టి రాగచేష్ట లుదయించును. ప్రియుడు దూరమున నుండగనె రోమాంచము కలుగును. నేత్రము స్నిగ్ధము మసృణము నగును. అధరము స్ఫుటముగా స్పందించును. వచనము స్మితోత్తర ముగా నుండును. స్మితపూర్వకవచన మని భావము. ముందుగా స్మితము. అనంతరము వచనము. కపోలములందు స్వేద ముదయించును. ఊరువులకు సంపీడన ముండును. తొడపై తొడవేసి యొత్తుట సంపీడనము. దేహమున బాహువులచే స్వస్తికబంధన ముండును. చేతుల నటు నిటు పెట్టి పట్టి కుచ ముల నొత్తుకొనుటకు స్వస్తికము కూర్తురు. ముహుః సఖి నాలింగనము చేసి కొనును. చెలి యంగమున నంగమున కూర్చును. కోకముడి విడదీసి జార్చి ముడి వేయును. కంపము పొందును. ఆతని పథమున నిలబడును. వచనమున వచనము కూర్చును. మాటలో మాట కలుపును. "వచనేఽవచనం" మాటలాడు నపుడు మాటలాడదు. ఆతడు చూచునప్పు డూరకనే యుండును. అటు చూడమి నటించును. ఇత్యాది భావములతో నుండు కులాంగనా విశేషములను భావజ్ఞు డగు నాతడు భావించి "ఆ కులీన రాగరక్త యయినది" అని భావింప వలెను.

## వేశ్యారాగచేష్టలు

కర్ణకండూయనం నాభే రూర్వోః కించిత్ప్రకాశనం
విమర్దనం చ స్తనయోః నీవీవిస్రంసనం ముహుః. 120

అన్యాపదేశకథన మన్యైః సస్మితభాషణం
విలోకనం చ సవ్రీడ మంగుష్ఠాగ్ర విలేఖనమ్. 121

నఖనిస్తోదనం కేలిః సఖీనిర్భర్త్సనం మృషా
పదాంతరే స్థితిర్వ్యాజా దంజలి ర్దేవతాచ్ఛలాత్. 122

భావై రిత్యాదిభి ర్వేశ్యామనురక్తాం విభావయేత్

వేశ్యారాగచేష్టావిశేషము లివట నున్నవి. కర్ణకండూయన మొనరించును. నాభి ప్రదేశముకొంతగా ప్రకాశితము చేయును. ఊరువులను కొంతగా జాపును. కుచములను తన యంతట తానె నులుము కొనును. ముహుః చీర ముడిని సడలించి జార్చును. అన్యాపదేశముగా బలుకును. ఇతరులతో సస్మితముగా బలుకును. సిగ్గు పడుచు చూచును. అంగుష్ఠాగ్రమున విలేఖించును. గోరులు గిల్లు కొనును. ఆట లాడును. వ్యర్థముగా సఖుల బెదిరించును. ఒక యడుగు వేసి యడుగులోనిలబడును. వ్యాజమున నాగి చూచును. దేవతా వ్యాజమున నంజలి పట్టును. ఏవం ప్రాయము లయిన భావములను ప్రదర్శింపగా వేశ్య యనురక్త యని భావింప వచ్చును.

## అన్యారాగచేష్టలు

దృష్టే దృశోర్వికాసశ్చ మాధుర్యం భాషణేఽన్యతః 123

ప్రసాదో వదనే హర్షః సంభ్రమ స్తస్య దర్శనే
అదర్శనే చ మూర్ఛా చ తత్సత్కారేషు కౌతుకమ్. 124

స్వభర్తుః ప్రముఖే తస్య స్మరణం సురతాదిషు
ప్రేషణం భోగ్యవస్తూనాం సమాజే తస్య గర్హణమ్. 125

సర్వత్ర తస్య వాక్యస్య ప్రీతిపూర్వం పరిగ్రహః
మదంబ నాథ మన్నాథేత్యేవం బాలోపలాలనమ్. 126

భావై రేవం విధై రన్యాం లక్షయేన్మదనాతురామ్

అన్యారాగచేష్టావిలాసము లిచట నున్నవి. నాయకుడు కన్పడగనే దృష్టులలో వికాసము తెచ్చి కొనును. ఇతరులతో భాషించుట యందును మాధుర్యము కూర్చును. వదనమున ప్రసాదము ధరించును. ఆతని జూడగనె హర్షము

సంభ్రమము గల దగును. అదర్శనమున కలవరపడును. మూర్ఛ పొందును. ఆతనిసత్కారములందు కౌతుకము చూపును. తన భర్త సన్నిధిలో నాతని స్మరించును. తన భర్తతో సురతసమయమున నితర సమయమున నాతనినే స్మరించును. భోగ్యవస్తువులను పంపును. నలుగురు కలిసిన సమాజమున నాతని మెచ్చదు. అంతట నాతని వాక్యమును ప్రీతిపూర్వముగా పరిగ్రహించును. అమ్మగదే! తల్లిగదే! యని పిల్లలను లాలనము చేయు నప్పుడు నాథ! మన్నాథ! నాప్రియుడు! పూ ఆయన! అని యుపలాలన మొనరించును. ఏవం విధము లయిన భావములచే నన్యవనితను మదనాతుర యయినదని భావింప జనును.

ఏతే భావా రాగచిహ్నాని స్త్రీణాముక్తాః పృథక్పృథక్. 127

సాధారణాస్తే సర్వాసాం స్త్రీణామిత్యాహ మారుతిః

కులాంగనా పరాంగనా వేశ్యాంగనా రాగచేష్టాలుగా నిరూపితము లయిన వీనివిషయమున మారుతి మతభేదము కలదు. స్త్రీలకు సంబంధించినవిగా నిరూపితము లయిన భావములు రాగచిహ్నములు కులాంగనాదులకుగా వేరు వేరుగా నున్నను ఇవి యన్నియు సర్వస్త్రీలకు సాధారణ రూపములె. వీనిలో కొన్ని కులాంగనలకు మరికొన్ని యకులాంగనల కన్న విభాగము లేదు. వారి వారి స్వభావవిశేషమున నివి యన్నియు నవిశేషముగ నందర కుండ వచ్చును. ఇవి రాగచిహ్నములు మాత్రము కా గలవని మారుతి మతము.

ఏవం భావాన్పరీక్ష్యైవ రక్తాశ్చే దనురంజయేత్. 128

నాయకేష్వనురక్తేషు రతిం పుష్యంతి యోషితః

పైన నిరూపించిన విధముగా నా యౌవనితల భావములను పరీక్షించి వారు రాగము కలవారుగా భాసించినచో పురుషు డనురక్తుడై యనురంజన మొనరించుట యుక్తము. నాయకు లనురక్తులు కాగా వనితలు రతిపోషము కూర్ప గలరు. స్త్రీ మొదట రాగవతిగా నుండుట గుర్తించి పురుషు డనురక్తు డయినప్పుడు స్వభావసుభగ మయిన సంభోగము సంప్రాప్త మగును. అట్టి సంభోగ ముత్తమ కామసుఖము.

ప్రియుని విషయమున రాగము కలది యయిన వనితకు సంబంధించిన ఆభ్యంతరోపచారవిధానముల నిరూపించుట ప్రకృత మావశ్యకము.

## ఆంభ్యంతరోపచారము

ఆభ్యంతరోపచారస్తు రక్తాయాః క్యథతేఽధునా. 129

రక్తా వివిక్తవసతిం ప్రియేణ సహ వాంఛతి
గుణాన్ సఖీనామాఖ్యాతి స్వధనం ప్రదదాతి చ. 130

సంపూజయతి మిత్రాణి ద్వేష్టి శత్రుజనం తథా
సమాగమం ప్రార్థయతే దృష్ట్వా హృష్యతి చాధికమ్. 131

తుష్యత్యస్య వచోభంగ్యా సస్నేహం చ నిరీక్షతే
సుప్తే చ పశ్చాత్స్వపితి చుంబత్యనభిచుంబితా. 132

ప్రియేణాలింగయత్యంగం గాఢమాలింగతి ప్రియం
స్వయమారభతే స్వైరం స్నానాదిషు చ కర్మసు. 133

ప్రథమం చేష్టతే స్వైరం బాహ్యే చాభ్యంతరే రతే
న విశ్లేషయతే గాత్రమాశ్లిష్టా చ కదాచన. 134

తేనైవ భోగ్యవస్తూని భుంక్తేఽన్యత్రాహృతాన్యపి
రతికేలిష్వనిభృతా స్వదతే స్విద్యతి క్షణమ్. 135

న దృష్టిమన్యతో ధత్తే న శృణోతి బహిః క్వచిత్
న చింతయత్యాత్మనీనం కించిదన్యత్ప్రియం వినా. 136

రోమాంచతి ప్రియం స్పృశ్య ముహ్యతి స్విద్యతి శ్వసేత్
ఏవం రక్తాసముత్థాః స్యురుపచారాః ప్రియంప్రతి. 137

ప్రస్తుతము రాగవతీ వనితకు సంబంధించిన ఆభ్యంతరోపచారము నిరూపిత మగును. రక్తవనిత ప్రియునితో వివిక్తవసతి నాకాంక్షించును. కుటుంబములో నందరితో కలిసి యుండుట నభిలషింపదు. ఇతరజనులు గోష్ఠిగా నుండుట నభిలషింపదు. నిత్యము ప్రియునితో నేకాంతమునే వాంఛించును. సఖీజనులకు నాయకుని గుణగణముల నాఖ్యానించును. స్వీయధనము నిచ్చును. నాయకుని మిత్రులను పూజించును. శత్రుజనులను ద్వేషించును. నాయకుని సమాగమమును ప్రార్థించును. నాయకుని జూచి యధికముగా హర్షించును. అతని వచోభంగిచే సంతోషము పొందును. స్నేహయుక్తముగా నిరీక్షించును. ముందుగా నాతడు నిద్రింపగా ననంతరమె నిద్రించును. అతడు చుంబనమున కుపక్రమింపక పోయినను తానె చుంబించును. ప్రియుడు తన దేహ మాలింగన

మొనరించునట్లు యత్నించును. ఆతనిచే నాలింగింప జేసికొనును ప్రియుని గాఢముగా నాలింగనము చేసికొనును. స్నానాదికర్మలయందు స్వేచ్ఛగా తానే యారంభము కావించును. ఆతని స్నానాదికర్మలకై తానే ప్రేరణము కావించును. బాహ్యరతము నందును అభ్యంతర గతము నందును ముందుగా స్వేచ్ఛగా చేష్టాయుక్త యగును. ఒకప్పు డాతని డాలింగన మొనరించిన తన శరీరమును విశ్లేషింప జేయదు. ప్రియుని యాశ్లేషములో విలీన యగును. ఇతరస్థలమున సంపాదితము లయినను భోగ్యవస్తువుల నాతని తోడనే యనుభ వించును. సురతక్రీడలలో తాను అనిభృతయై-ఏమాత్రము తగ్గనిదై సురతసుఖ మాస్వాదించును. క్షణము స్విన్న యగును. స్వేద యుక్త యగును. ప్రియుడు వినా తన దృష్టి నన్యవిధముగ గూర్పదు. ఎప్పట నేని బహిః శబ్దము వినసే వినదు. వేరుగా తనకు హితము సంపాదించు విశేషమును చింతిం పదు. ప్రియుడు స్పృశింపగా రోమాంచము కలదగును. ముహ్యతి. ఇంద్రియ వ్యాపారముల విడనాడి పరవశ యగును. స్వేదయుక్త యగును. శ్వసించును. ప్రియు నుద్దేశించిన రక్తవనితా సముత్పన్నము లయిన యుపచారము లిట్లుండును.

రక్తవనితా చేష్టాభావ నిరూపణానంతము విరక్తభావచేష్టలు నిరూ పించుట యుక్తము.

విరక్తానాం తు లింగాని కథ్యంతే యాని కానిచిత్
నిష్ఠీవనం దృష్టమాత్రే సద్యో వక్త్రావకుంఠనమ్. 138

గూఢావస్థాన మన్యార్థ పారవశ్య మనాదరః
అదేశకాలగమన మాహ్వానే కాలయాపనమ్. 139

ప్రేషితస్యాప్యనాదరం గంధమాల్యాదివస్తునః
ఆర్తస్యానాదరః క్షేపో భూమే వా దానమన్యతః. 140

అంగసాద ప్రకథనం దూతాదీనా మనుత్తరం
ఏవమాదీని చిహ్నాని దూరస్థానాం తు యోషితామ్. 141

విరక్తవనితలు దూరమున నుండి విరక్తి చూపుదురు. సమీపమున నుండియు విరక్తిని జూపుదురు. ముందుగా దూరస్థల విరక్త చిహ్నాల నిట్లు గుర్తించునది. విరక్తల చిహ్నా లెన్నియో యుండును. వానిలో నేవియో కొన్ని యిచట ప్రతిపాదితము లగును. విరక్త నాయకుని జూడగనె నిష్ఠీవన

మొనరించును. ఉమ్మి వేయును. క్రాచి యుమ్మును. చూచిన వెంటనే ముఖము వస్త్రముచే కప్పికొనును. గూఢముగా నొక మూల దాగియుండును. ఏలనో వివశు రాలయి నట్లుండును. అనాదరము చూపును. నాయకుని సమీపమున కేగవలసి యున్నచో నదేశమున నకాలమున దగ్గరకు చేరును. ఆతడు పిలిచినచో రమ్మనినచో వెంటనే రాదు. కాలయాపన మొనరించును. నాయకుడు గంధమాల్యాదివస్తువుల పంపినను స్వీకరింపదు. ఉపయోగింపదు. ఆతడు తద్భృతువునకు సంబంధించిన వస్తువుల బంపిన నాదరింపదు. విసరి వేయును. భూమిపై వేయును. ఎచటనో వేయును. ఆతడు రాగా తన శరీరమునకు బాధగా నున్నదని సాకు చెప్పును. దూతాదుల కేమియు సమాధాన మీయదు. దూరస్థ లయిన వనితల కిట్టి చిహ్నా లుండును.

ఆసన్నా దూరమధ్యాస్తే కథామన్యాం బ్రవీతి చ
పృష్టా యథాయథం బ్రూతే చుంబితాస్యం ప్రమార్జాతి. 142

అనిష్టాం చ కథాం బ్రూతే ప్రియముక్తాపి కుప్యతి
న చ చతుర్దదాత్యస్య న చైనమభినందతి. 143

శేతే పురః శాయయతి పునర్నిద్రాతి తత్క్షణం
ప్రబోధితా యాపయతి కాలం రంతుం న వాంఛతి. 144

స్పృష్టా సంకోచయత్యంగం నిమీలయతి లోచనే
న స్నాతి నాలంకురుతే న భోగే కురుతే స్పృహామ్. 145

విమర్దయతి హస్తాభ్యాం నేత్రే వ్యాజృంభతే ముహుః
విజృంభతే పరావృత్య నిష్ఠీవతి ముహుస్సదా. 146

విద్వేష్టి తస్య మిత్రాణి బ్రవీతి కృతశాసనా
రుష్టా పరివదత్యేనం స్వాత్మన్యంగాని గూహతే. 147

కథాప్రసంగేనాన్యేన సురతే భావవిస్మృతిః
గృహకృత్యాపదేశేన కురుతే చ గతాగతమ్. 148

నీవీస్పర్శే సహ్యాల్లేఖ మపతిపతి తత్కరం
పరాఙ్ముఖీ వా శయితా వ్యాధ్యాదివ్యపదేశతః. 149

ఏవం విరక్తాచిహ్నాని దృష్ట్వా తాం తత్క్షణా త్త్యజేత్

సమీపస్థ వనితా విరాగ చిహ్నము లీ విధముగ నుండును. నాయకుడు సమీపమున నున్నచో దూరము చేరును. ఏదో యితర విషయము చెప్పును. ఆత డేమేని యడిగిన యథాపక్షముగ సంక్షేపముగ జెప్పును. ఆత డధరచుంబన మొనరింపగా ముఖమును తుడిచి కొనును. ఇష్టము కాని విషయమును జెప్పును. ఆతడు ప్రియము పలికినను కోపించును. ఆతని వైపు చూడదు. ఆటు కన్ను పెట్టదు. వాని నభినందింపదు. ముందుగా తానె పడుకొనును. ఆతడు అంతదూరముగా వేరు శయ్యపై శయనించు నట్లు చేయును. తాను శయనించిన క్షణముననే నిద్రించును. ఆత డందుకై మేల్కొల్పినా! కాలయాపనము చేయును. సంభోగించుట కిష్ట పడదు. ఆతడు శయ్యా జేరి తాకినచో దేహము ముడుచు కొనును. కన్నులను మూత మూయును. స్నాన మొనరింపదు. అలంకరించుకొనదు. వస్త్రాభోగములను స్పృహ చూపదు. కన్నులను చేతులతో నులుముకొనును. ముహుః ఆవలించును. ఒడలు విఱిచికొనును. ప్రక్కకు దిరిగి యుమ్మివేయును. మఱల మఱల నుమ్మును. ఆతని మిత్రులను ద్వేషించును. ఒట్టు పెట్టుచు మాటలాడును. రోషము కలదై వానిని తిట్టును. తన యంగమును దాచును. చేతుల నురమునబెట్టి కుచములను దాచును. ఊరువులను బిగపట్టి స్వాంగము దాచును. అన్యకథాప్రసంగమున సురతమునందు భావవిస్మృతి కలిగించును. ఎట్లో భావచ్యుతి కలిగించును. ఇంటి పనులున్న వన్న వ్యాజమున గతాగత మొనరించును. ఆతడు ముడి సవరించె నేని ఒట్టు పెట్టి యాతని చేతిని విసరి కొట్టును వ్యాధ్యాదుల వ్యపదేశమున అటు దిరిగి పడుకొనును. ముడుచుకొని పడుకొనును. ఇట్టి వన్నియు విరక్తాచిహ్నములు వీనిని గుర్తించి యా క్షణముననె యామెను త్యజింపవలెను.

విరక్తిచిహ్నై కేన విరజ్యేతోత్తమః పుమాన్. 150

రాగాపరాగ చిహ్నానాం సంకరే తాముపాచరేత్

ఉత్తమపురుషుడు విరక్తిచిహ్న మొకటి గోచరించినను విరక్తు డగును. విరక్తిచిహ్నము లనేకములు గోచరింప నక్కఱలేదు. రాగచిహ్నము లేకపోవుటయె విరక్తి హేతువు. రాగముదయించుట కనేకరాగచిహ్నము లుండవలెను గాని రాగ ముదయించుటకు విరాగచిహ్న మొకటి చాలును. ఉత్తముడు వెంటనే విరక్తు డగును. పురుషుల కీ విషయమున నొక యుపదేశ మావశ్యకము. విరక్తి చిహ్నము లున్నను రక్తి చిహ్నములు కూడ నుండునేమో? మొదట రాగ మున్నందుననె యామె వలచిన కదా! అట్టి రాగచేష్టలు

కూడ నుండునేని విరక్తి చేష్టలు కొన్ని యున్నను రాగాపరాగ చిహ్న సాంకర్య మున నా వనిత నుపచరింప వలెను. భావసహిత మయిన యుపచారవిధాన మావశ్యకము. ఆ యుపచారము భావరహితముగ నుండరాదు. భావసహిత మయిన యుపచారవిశేషమున వనితలు విరక్తిచేష్టావిశేషము లను విడనాడుదురు. వనితలు కూడ నీ విషయమున సావధానముగ నుండవలెను. తన నాయకు డుత్త ముడు. ఒక్క విరాగచేష్ట యేని ఆతని విరక్తు జేయునేమో! కావున చిత్తము నకు చెదురుతనము కలిగినను నిగ్రహించు కొని విరక్తిచేష్టలు లేకుండ ప్రవర్తింప వలెను.

కొందరు పూర్వనాయకునె యనుసరించి యుండవలె నని తలచరు. ఆతని విడనాడ వలె నని యనుకొందురు. వేరొకని పరిగ్రహింప వలె నని యుల్లసం పడుదురు. ప్రకృతనాయకుని విడిచి పో జూతురు. వారు గంతుకామలు. వారిచేష్ట లీ విధముగ నుండును.

చిహ్నాని గంతుకామానాం కథ్యంతే హ్యానుషంగికమ్. 151

అనాసనం చ ప్రథమం చాలనం చాసనస్య చ
అర్ధాసనేనావస్థానం పార్శ్వాత్పార్శ్వేఽంగచాలనమ్. 152

విజృంభణంచ బహుశోముహుర్ద్వారనిరీక్షణం
ప్రసార్యాకుంచనం పాదబాహ్వోరుత్కటికాసనమ్. 153

గాత్రభంగోఽంగులిస్ఫోటో బహిర్వార్తావకర్ణనం
ఏతాని గంతుకామానాం చిహ్నానీత్యుపలక్షయేత్. 154

గంతుకామాచేష్ట లానుషంగికముగా నిచట నిరూపితము లగును మొదట నాయకుని సమీపమున నీమె కూర్చొనదు. కూర్చొనిన నాసనము నటునిటు కదలించును. కూర్చొనుటలో నర్ధాసనముననె యుండును. అర్ధాస నమున నుండదుకూడ. పార్శ్వము నుండి పార్శ్వమునకు తన దేహమును కదలిం చును. చలింప జేయును. తాకి యుండదు. అంటి యుండుట కిష్టపడదు. మాటి మాటి కావలించును. ముహుఃద్వారము నిరీక్షించును. పాదములు చేతులు చాచి ముడుచు కొనును. ఉత్కటికాసనం–గొంతుకూర్చొనును. ఒడలు విరచికొనును. చిటికలు వేయును. బయటి వార్తల నాలించును. ఈ చేష్టలు గంతుకామాచేష్ట లని భావింప వలెను.

యువతికి గాని యువకునకు గాని విరక్తి కలుగుటలో కొన్ని కారణము లున్నవి. ఆ విరక్తి హేతువు లివి.

విరక్తిహేతవో యూనోస్సహావః స్యుః పరస్పరం
కార్శ్యం వ్యాధిశ్చ శోకశ్చ పారుష్యం రూపసంక్షయః. 155

దోషాపవాద శ్రవణా న్మతిలోపో వ్యతిక్రమః
అదేశకాలాగమన మపకారో బహిస్స్పృహః. 156

ఇత్యాదిభి ర్విరక్తానాం న కదాచన సంగతిః

నాయికానాయకులకు విరక్తి హేతువు లనేకము లుండును. కార్శ్యము వ్యాధి శోకము పారుష్యము రూపనాశము దోషశ్రవణము వలన అపవాదశ్రవణము వలన మతిలోపము ఒకరివలన నొకరతిక్రమించుట, దేశము కాని దేశమున, కాలము కాని కాలమున వచ్చుట, మఱల మఱల నందఱి యెదుట నపకార మొనర్చుట అనునవి విరక్తిహేతువులు. ఇట్టి కారణములచే విరక్తు లయిన వార లకు మఱల నెప్పుడు సంగతి కలుగనే కలుగదు.

మానాదిజా విరక్తిర్యా హృద్యానునయ సంశ్రయా. 157

అన్యోన్యరక్తానాం భూయః పుష్యత్యేవ రతిం శుభామ్

మానాదుల వలనను విరక్తి కలుగును. కాని యిది విలక్షణము. హృద్యము. అనునయము నాశ్రయించి యుండును. ఒకరి నొక రనునయించు కొనగనె యీ తాత్కాలిక విరక్తి పోవును. అంతట వారు ప్రేయసీప్రియులై యన్యోన్య మనురక్తు లగుదురు. ఈకలిగిన విరక్తి విరక్తి కాదు. ఇది యొక విరహము. విరహానంతరసంభోగము సమధికసంతుష్టి సంపాదించును. మరల మరల నది శుభంకర మయిన రతిపరిపోషము సంపాదించును.

రాగచిహ్నములుగా కర్ణకండూయనాదులు నిరూపితము లయినవి. కర్ణకండూయనాదులు రాగసూచకము లగుట యెట్లు? చేష్టలు వ్యంగ్యవ్యంజకము లగుట ప్రసిద్ధ మయినను దేనిచే నేది వ్యంగ్య మగునో సూచించుట యావశ్యకము. రాగ చిహ్నములచే వ్యంగ్యము లగు నర్థము లిచట ప్రతిపాదితము లగును.

ఉక్తానాం రాగచిహ్నానాం కథ్యంతేఽత్ర విభావనాః. 158

కర్ణకండూయనవ్యాజాత్ రుణద్ధ్యస్య శుభాం గిరమ్
కేశసంయమనాద్భర్తుః శిరోలాలనసూచనమ్. 159

నాభిప్రదర్శనాదాత్మసౌభాగ్య ప్రకటీక్రియా
స్తనసమ్మర్దనేనైవ గాఢాలింగన సూచనమ్. 160

అధరస్పర్శనేనైవ చుంబనాద్యభిలాషితమ్
కటాక్షైర్హాసగర్భైశ్చ సంభోగౌత్సుక్యభావనమ్. 161

నూపురధ్వననైః స్వస్య పురుషాయిత సూచనమ్
విజృంభితేన సర్వాంగే స్వసర్వాంగసమర్పణమ్. 162

అన్యాపదేశకథనైస్తస్య భావపరీక్షణమ్
అన్యైః సస్మితజల్పేన తద్భాషామేలనాదరః. 163

సవ్రీలం లోకనేనైవ స్వానుకూల్యప్రకాశనమ్
అనుత్తరప్రదానేన స్వస్వాతంత్ర్యప్రకాశనమ్. 164

సఖీనిర్భర్త్సనేనైవ శీఘ్రసంగమనాదరః
ఊరుసంపీడనాదేవ హృద్యాంగస్పందసూచనమ్. 165

పదాంతరే స్థితేర్వ్యాజాన్మనోవినిమయార్థితా
సాచీకృతేనేక్షణేన సంకేతగమనార్థితా. 166

తద్గాఢాలింగనాశైవ బాహుస్వస్తికబంధనాత్
విస్రస్య నీవీనహనా ద్వాసః శ్లథనసూచనమ్. 167

ఏవమాద్యాసు చేష్టాసు భావా గ్రాహ్యా మనీషిభిః

నిరూపితము లయిన రాగచిహ్నముల విభావనము లిచట నిరూపితము లగును. కర్ణకండూయనాదిరాగచేష్టలచే విభావితము లగు విశేషము లున్నవి. అవి యిం దున్నవి.

1. కర్ణకండూయనము – శుభవచనధారణము
2. కేశసంయమనము – శిరోలాలనము
3. నాభిప్రదర్శనము – సౌభాగ్యప్రకటనము

4. స్తనసమ్మర్దనము - గాఢాలింగనము
5. అధరస్పర్శనము - చుంబనాభిలాష
6. హాసగర్భకటాక్షము - సంభోగౌత్సుక్యము
7. నూపురధ్వననము - పురుషాయితము
8. విజృంభితము - సర్వాంగసమర్పణము
9. అన్యాపదేశము - భావపరీక్షణము
10. అన్యులతో సంభాష - భాషాసమాదరము
11. లజ్జావలోకనము - అనుకూల్యప్రకాశనము
12. అనుత్తరప్రదానము - స్వస్వాతంత్ర్యప్రకాశము
13. సఖినిర్భర్త్సనము - శీఘ్రసంగమనము
14. ఊరుసంపీడనము - అంగస్పందసూచనము
15. పదాంతరస్థితి - మనఃపరితాపమూర్తిత
16. తిర్యగ్వీక్షణము - సంకేతగమనార్థిత
17. బాహుస్వస్తికము - గాఢాలింగనాశ
18. నీవీనహనము - వస్త్రశ్లథనసూచనము

ఇట్లు పదునెనిమిది రాగచేష్టలకు పదునెనిమిది వ్యంగ్యార్థములు సూచితము లయినవి. ఆ వ్యంజకముల కివియె వ్యంగ్యము లన్న నియమము లేదు. ఔచిత్యానుసారమున నితరములును వ్యంగ్యములు కా వచ్చును. భాసించు వ్యంగ్యార్థముల కివి దిశామాత్రము. ఏవమాదివ్యంగ్యార్థములను ప్రయోగాభినయమున ప్రదర్శింపవలసి యున్నప్పుడు కర్ణకండూయనాద్యభినయముల ననుసరింప వలె ననియు నిందు గ్రాహ్యము.

కర్ణకండూయనము చెవి గోకి కొనుట, చెవిలో వ్రేలును దూర్చి త్రిప్పుట. ఈ కండూయనము కండూతి పోవుటకు కాదు. అచట కండూతి లేదు. అది యొకవ్యాజము. ''నాయకుని శుభవచనమును చెవిలోన నుంచితిని. దానిని వెలికి పోనీను. ఇచటనె నిరోధించెదను.'' అని తచ్చేష్టావ్యంగ్యము. కేశసంయమనము జుట్టుముడివేయుట. శిరమున ప్రియుని లాలన మొనరింతు నని సూచన మున్నది. నాభిప్రదర్శనమున తన సౌభాగ్యము ప్రకటీకరించుట. నాభి నిష్టులె చూడవలయును. అన్యులు దర్శింపరాదు. చూపరానిది చూపుట ఈ సౌభాగ్యమనుభవింపు మనుట యగును. స్తనసమ్మర్దనము. తన స్తనముల తానే పట్టు

విడుపుల నుంచుట. గాఢాలింగనము కావలె నని స్తనములు నొక్కు కొనునట్లు కౌగలింపు మని సూచనము. అధరస్పర్శనమున నీ విది యామూలము చుంబింపు మను నభిలాషవ్యక్త మగును. హాసగర్భము లయిన కటాక్షములు సంభోగము నందలి యౌత్సుక్యవ్యంజకములు. నవ్వులలో గలిపిన కన్నుగొట్టుటలు కన్నుగీటుటలు భోగింపు మని సూచించుట యగును. కాలి నూపురములు ఘలుఘల్లు మనిపించుట సంభోగప్రక్రియలో పురుషాయిత విధానములో నే నిట్లనిపింతు నని భావము. సర్వదేహవిజృంభణ మను చేష్ట "నా సర్వాంగములను నీ కర్పించితిని. నీ వనుభవింపుము. నీ వనుభూతికి పట్టుట నాకు మహానుభూతి" అనెడు భావము సూచించును. ప్రియునకు దెలియవలయు నని యొకటి చెప్ప దలచి మరియొకటి చెప్పును. ఇది యన్యాపదేశము. ఇట్టి యన్యాపదేశకథనములు భావపరీక్షణార్థము లగును. నవ్వుచు నితరులతో మాటలాడుట ఆతనితో సంభాషణసమాదరము సూచించుట యగును. సిగ్గుతో జూచినచో "నే కాను కూల్యము కలదు" అని వ్యక్త మగును. సమాధాన మేమియు జెప్పక పోయినచో "నీకువలె నాకును స్వాతంత్ర్యము కలదు" అని వ్యక్త మగును. సన్నిధిలో నున్న సఖియల బెదిరించుట "శీఘ్రముగా సంగమనమునకు రమ్ము" అని సూచించును. ఊరుసంపీడన మొక విశిష్టప్రక్రియ. తొడపై తొడ వేసి మూలసంపీడనము కావించుట. దీనిచే "హృద్య మగు నా యంగమున స్పంద ముదయించినది" అని వ్యక్త మగును. పద మటు నిటు పెట్టి యున్నచో నది వ్యాజమున నీ మనోవినిమయము కలుగుగావుత యని చెప్పుట యగును. ప్రక్కగా నోరగా జూచిన "సంకేతమునకు పోదము" అని స్పష్ట మగును. స్వస్తికబాహువు పట్టుట తద్గాఢాలింగనాశా సూచకము. నీవి ముడి జార్చి ముడిచినచో "నా చీర సడలింపుమోయీ!" అని ప్రార్థించుటను వ్యక్తము చేయును. ఇట్టి విధము లయిన చేష్టలలో గూఢము లయిన భావము లుండుటను మనీషులు గుర్తింప వలెను.

ఇప్పటి కీ విధముగా విప్రకీర్ణము లయిన విషయములు ప్రతిపాదితము లయినవి. ఈ ప్రసక్తిలో శృంగారరసమునకు సంబంధించిన దృష్టివిశేషములను జెప్పుట యావశ్యకము. ఇవి యరువది నాలుగు గలవు.

### శృంగారదృష్టులు

దృశోర్వికారా బహవః శృంగారస్యోపయోగినః. 168
భావాశ్రయాః కదాచిత్స్యుః కదాచిద్రససంశ్రయాః

వికూణితం విహసితం కుంచితం న్యంచితాంచితే. 169

స్నిగ్ధం ముగ్ధం చ నిష్పందం విస్తారి చ వికాసి చ
స్తిమితం మసృణం వక్రం మధురం చాభిలాషి చ. 170

స్థిరం ప్రసన్నమలసం వలితం మదమంథరమ్
స్మేరమానంది సాకూతం విదగ్ధం విహ్వాలం తథా. 171

నిహంచితం చ నిభృతముత్కంఠితముదంచితం
సోత్సుకం సోత్కముత్కంపముల్లాసి చ సమన్మథమ్. 172

మహి వ్యాక్షేపి విక్షేపి త్రిభంగి త్ర్యశ్రమేవ చ
నికృష్టం వినతం స్ఫీతం వ్యాసంగి చ విసంస్థులమ్. 173

విస్ఫారితం విలులితం లలితం చ తరంగితం
కఠోరం కలుషం రూక్షం కాతరం చకితం చలమ్. 174

కోమలం తరలం తాని ప్రణయిప్రేమగర్భి చ
సోత్ప్రాసం సస్పృహం హ్లాది ప్రేంఖోలం లోలమేవ చ. 175

ఏవముక్తా శ్చతుష్షష్టి ర్వికారా దృష్టిసంశ్రయాః

శృంగారమున కుపయోగించు దృగ్వికారములు బహుసంఖ్యాకములు కలవు. ఒకప్పు డివి భావాశ్రయములు ఒకప్పు డివి రససంశ్రయములు. దృష్టి సంశ్రయము లయిన చతుష్షష్టివికారముల నామము లిచట నిరూపితము లయినవి. ఇంకను రౌద్రాదులకు సంబంధించిన దృష్టివిశేషములు సంఖ్యాతములు కానున్నవి. ఇట్లు దృష్టివిశేషములు శతాధికముగా నున్నవి.

ఇచట వికూణితాదులు స్తిమితాదులు స్మేరాదులు సోత్కాదులు వినతాదులు రూక్షాదు లరువది నాలుగు దృష్టినామములు కలవు. వీని స్వరూప మనంతరము కలదు. వికూణితాదు లనుట దళకమునకు సంకేతము.

ఉద్వర్తితమథోద్వృత్తం వివృత్తం చ వివర్తితమ్. 176

స్తబ్ధముత్ఫుల్లముల్లోలముద్ధురం విధురం తథా
విశ్లిష్టం నిష్ఠురం శుష్కం కుటిలం చటులం తథా. 177

ఏతే ప్రాయేణ కథితా రౌద్రస్యైవోపయోగినః

ఇచట నిరూపితము లయిన ఉద్వృత్తితాదిదృష్టులు పండ్రెండు సామాన్యముగా రౌద్రరసమునకె యుపయోగించునవిగా ప్రసిద్ధము లయినవి. ఇందు వివృత్తము విధురము లక్షణములు లేనందున దృష్టినామములు కావు. సామాన్యముగా ననుటచే నొకప్పుడు వీరమునకు నుపయోగించు నని భావింపవచ్చును.

ససంభ్రమం జడం చైవ సవ్యగ్రం సవ్యథం తథా. 178

క్లాంతమార్తం పరిమ్లానం తప్తం మలినమేవ చ
ఏతే ప్రాయేణ శోకస్య వికారా దృష్టిసంశ్రయాః. 179

ఇచట నిరూపితము లయిన సంభ్రమాది దృష్టులు తొమ్మిది సామాన్యముగా శోకమున కుపయోగించునవిగా ప్రసిద్ధములు. ఇవి యన్నియు దృష్టిసంశ్రయము లయిన శోకవికారములు.

మంథరం బంధురం ధీరమవిక్రియమకృతిమం
అనుల్బణమసంభ్రాంతమవ్యాజమనుపస్కృతి. 180

సహర్షం చ సగర్వం చ వీరస్యైతే ప్రకీర్తితాః

ఇందున్న మంథరబంధురాది దృష్టులు పదునొకండును వీరరసమునకు సంబంధించిన దృష్టులుగా ప్రసిద్ధము లయినవి.

అరోచకమనుత్సేకమావిద్ధం విద్ధమేవ చ. 181

వికృష్టం చ వినిష్క్రాంతం వినిగీర్ణం విలోహితం
ఏతే ప్రాయేణ కథితా బీభత్సే చ భయానకే. 182

కేచిత్సాధారణాస్తేషు భవంత్యద్భుతహాస్యయోః
ఏతే శతం సమాఖ్యాతాశ్చత్వారశ్చ తతోఽధికమ్. 183

ఇచటి అరోచకాది విలోహితాంత దృష్టు లెనిమిది సామాన్యముగా బీభత్సరసమున భయానకరసమున వినియోగము పొందును. ఈ చెప్పిన దృష్టు లన్నిటిలో సాధారణము లయిన కొన్ని దృష్టులు అద్భుతము నందును హాస్యము నందును ప్రవర్తించును. ఇట్లు నాలు గధికముగా శతదృష్టులు విఖ్యాతము లయినవి. మొత్తము చతురుత్తరం శతమ్.

ఇక నిటుపై సర్వదృష్టుల స్వరూపము నిరూపిత మగును. దృష్టి వివేకము విశిష్టముగా సంభావనీయము.

భాగత్రయస్య సంకోచో వికాసశ్చరమస్య చ
యస్యా దృష్టేర్విలక్షేణ తద్వికూణిత ముచ్యతే. 184

అనిమేషస్ఫురత్తారం సమం విహసితం విదుః
పురస్త్రిభాగసంకోచే ప్రేమ్ణా తత్కుంచితం భవేత్. 185

పర్యాయేణ చలత్తారం మందం మందమథాంచితం
స్నిగ్ధం తద్యస్య విషయ స్తత్ప్రభామిలితో భవేత్. 186

స్వభావాలోకితం ముగ్ధం భావగర్భమపి చ్ఛలాత్
నిష్పందం తద్యదన్యత్ర దృష్టిర్న స్పందతే క్వచిత్. 187

అశ్లిష్టో యేన విషయ స్తద్విస్తారీతి కథ్యతే
వికాసి తద్యద్విషయ విశేష మవగాహతే. 188

ఈ ప్రఘట్టమున వికూణితాది దృష్టివిశేషముల లక్షణము లున్నవి. ఇచటి వికూణితాది దృష్టులలో నాల్గవది యయిన న్యంచితదృష్టి లక్షణవచనము లేదు. లుప్త మయినది. మొదటి దశకముతో తొమ్మిది దృష్టు లిచట లక్షితము లయినవి. 1. వికూణితము. ఏ దృష్టికి విలక్షణముగా భాగత్రయమునకు సంకోచము నాల్గవభాగమునకు వికాసము నుండునో యా దృష్టి వికూణితమగును. 2. విహసితము. ఱెప్పపాటు లేకుండగా కనుపాపలు సమముగా స్ఫురించునవి యయినచో విహసితము. 3. కుంచితము. ప్రేమచే నెదుట నేత్రమునకు త్రిభాగ సంకోచ మున్నచో కుంచితదృష్టి యగును. 3. ఇచట నాల్గవదృష్టిగా న్యంచితదృష్టి లక్షణ ముండ వలెను. లేదు. 5. అంచితము పర్యాయమున మందమందముగా తారలు చలించునేని అంచిత మగును. 6. స్నిగ్ధము. స్వవిషయముగా నుండు దాని ప్రభ దృష్టియందు మిలిత మయినచో స్నిగ్ధదృష్టి యగును. 7. ముగ్ధము. భావగర్భితముగా నున్నను ఛలమున స్వభావాలోకితముగా నున్నచో ముగ్ధదృష్టి యగును. 8. నిష్పందము. అన్యస్థలమున దృష్టి ప్రసరింపకున్నచో నిష్పంద దృష్టి యగును. 9. విస్తారి. చక్షుర్విషయ మేమియు శ్లిష్టముగా లేకున్నచో విస్తారి దృష్టి. 10. వికాసి. తత్తద్విషయ విశేషము నవగాహము చేసికొను దృష్టి వికాసిదృష్టి.

స్వగోచరాన్నచాత్యేతి య త్తత్ స్తిమిత ముచ్యతే
మసృణం తదితిఖ్యాతం అనురాగకషాయితమ్. 189

ఊర్ధ్వాధోఽపాంగసంచారో యత్ర తద్వక్ర ముచ్యతే
శీతలీక్రియతే యేన తాప స్తన్మధురం స్మృతమ్. 190

అభిలాషి తదేవ స్యాద్యాచమానమివేక్షతే
తత్థ్సిరం యత్తు విషయే దూరేఽప్యంతర్హితే స్థిరమ్. 191

తత్ప్రసన్నం భవేత్సభ్రూవిలాసం సస్మితం చ యత్
అలసం తదభీష్టార్థాత్ ప్రీలాదేర్యన్నివర్తనమ్. 192

వలితం తన్నివృత్తస్య భూయస్త్ర్యశ్రావలోకనం
వ్యాఘూర్ణమానమరుణం ముహురామీలదంతరా. 193

అపరిచ్ఛిన్నవిషయం మదమంథర మీరితం

ఇందు స్తిమితాది మదమంథరాంత దశక మున్నది. 11. స్తిమితము. స్వగోచరము నుండి యతిక్రమింప కున్నచో స్తిమిత మని, 12. మసృణము. అనురాగకషాయితము మసృణ మని, 13. వక్రము. ఊర్ధ్వాధః ప్రదేశముల కపాంగసంచారము వక్ర మని, 14. మధురము. తాపము శీతలీకరించు నది మధుర మని, 15. అభిలాషి. యాచించు నట్లుండు దృష్టి యభిలాషి యని, 16. స్థిరము. దూరమున నున్న విషయమున గాని యంతర్హిత మయిన విషయమున గాని స్థిరముగా నుండు దృష్టి స్థిర మని, 17. ప్రసన్నము. భ్రూవిలాసముతో స్మితముతో నుండు దృష్టి ప్రసన్న మని, 18. అలసము. అభీష్టార్థము నుండి ప్రీలాదుల వలన నివర్తనము పొందు దృష్టి అలస మని, 19. వలితము. నివృత్త మగు దృష్టి మరల త్ర్యశ్రావలోకనమున నున్నచో వలిత మని, 20. మదమంథరము. ముహుః వ్యాఘూర్ణమానమై యరుణమై మధ్యలో నామీలనము పొందునదై యపరిచ్ఛిన్నవిషయముగా నుండు దృష్టి మదమంథర మని యందురు.

స్ఫురద్భ్రూపక్ష్మతారం య త్తత్ స్మేరమితి కథ్యతే 194

తదానంది సుఖోన్మీలదామీలత్తారముచ్యతే
సాకూతం తద్యత్ర భావః కోఽప్యభీష్టో విభావ్యతే. 195

విదగ్ధం తద్యదాలోకే వివశాః సర్వజంతవః
అనవస్థితతారం య తద్విహ్వాల ముదాహృతమ్. 196

నాసాపుటస్ఫురత్తారం నిహంచిత ముదాహృతం
నిభృతం తద్యదాశ్లిష్యత్పుటమంతరధోముఖమ్. 197

రాగారుణం స్ఫురద్బాష్పాపాంగముత్కంఠితం విదుః
అపాంగయోరూర్ధ్వభావాదాలోకన ముదంచితమ్. 198

సోత్సుకం తద్యదాలోక్య భూయో భూయోఽవలోకయేత్

ఇచట స్మేరాది సోత్సుకాంతము లయిన తృతీయదశకము లోని పది దృష్టు లున్నవి. 21. కనుబొమలు పక్ష్మములు తారలు స్ఫురణము కల వగునేని స్మేరదృష్టి. 22. తారలు సుఖముగా నున్మీలన మామీలనము పొందునేని ఆనంద దృష్టి. 23. భావ మభీష్టముగా విభావిత మగు నేని సాకూతదృష్టి. 24. చూడగనే సర్వప్రాణులు వివశు లగుదురేని విదగ్ధదృష్టి. 25. తార లనవస్థితముగా నున్నచో విహ్వాలదృష్టి. 26. నాసాపుటముల కదలికలచే తారలు స్ఫురణము కల వయినచో నిహంచితదృష్టి. 27. అధోముఖమున నుండగా నంతరమున పుటాశ్లేషమున నున్నచో నిభృతదృష్టి. 28. రాగారుణమై స్ఫురించు బాష్పములతో నపాంగ మున్నచో ఉత్కంఠితదృష్టి. 29. అపాంగముల కూర్ధ్వస్థితి ననుసరించిన యవలోకన ముండుట ఉదంచితదృష్టి. 30 ఒకసారి చూచియు మఱల మఱల చూచునేని సోత్సుకదృష్టి యగునని నిపుణముగా నిపుణులు నిభాలన మొనరింప వలెను.

దూరం ధావతి యత్రేప్మా తత్సోత్కమితి కథ్యతే. 199

ఉత్కంపం తద్యదుల్లోలం తారాభ్రూపక్ష్మ సర్వతః
యత్రోల్లసత్యభిప్రాయ స్తదుల్లాసీతి కథ్యతే. 200

యద్దర్శనే విరక్తోఽపి క్షుభ్యతే తత్సమన్మథం
యద్దర్శనాన్మహో జంతోః సర్వస్య మహితద్భవేత్. 201

పశ్చాదాక్షిప్యతే దూరం యదపాంగస్య సంచరః
తదావ్యాక్షేపి స పార్శ్వే స్యాద్విక్షేపీతి విభావ్యతే. 202

మూలమధ్యాగ్రభాగేషు భంగ్యా యద్విషయగ్రహః
తత్త్రిభంగీతి కథితం త్ర్యశ్రం తిర్యగుదంచితమ్. 203

వికృష్టం తదధో వక్త్రాపాంగభాగాపసర్పణం

ఇచట సోత్కాది వికృష్టాంత దృష్టిదశక స్వరూప మున్నది. 31. సోత్కదృష్టి. ప్రేమచే దూరధావన మొనరించును. 32. ఉత్కంప దృష్టి. అంతట తారాభ్రూపక్ష్మము లుల్లోలముగా నుండును. 33. ఉల్లాసిదృష్టి. ఇం దభిప్రాయ ముల్లసించును. 34. సమన్మథదృష్టి. దీని దర్శనమున విరక్తు డయినను క్షోభము పొందును. 35. మహిదృష్టి. దీని దర్శనమున సర్వప్రాణులకు ఉత్సవము కలుగును. 36. వ్యాక్షేపిదృష్టి. అపాంగ సంచారము వెనుకగా దూర సూక్షిప్త మగును. 37. విక్షేపిదృష్టి. అపాంగ సంచారము పార్శ్వమున దూరముగా నాక్షిప్త మగును. 38. త్రిభంగిదృష్టి. మూలమధ్యాగ్రభాగములో భంగీవిధానమున విషయగ్రహణ ముండును. 39. త్ర్యశ్రదృష్టి. తిర్యగుదంచిత మగుట. 40. వికృష్టదృష్టి. వక్ర మయిన యపాంగభాగమును క్రింది భాగముగా నపసర్పింప జేయుట. ఇట్టి దృష్టు లీషద్భేధమున భావసూచకము లని గ్రాహ్యము.

వినతం తదితి ఖ్యాతం ఋజ్వాయతమధోగతమ్. 204

ఉల్లసత్పక్ష్మతారాభ్రు స్ఫీతమిత్యభిధీయతే
అన్యత్ర సోత్కమన్యత్ర స్థితం వ్యాసంగి కథ్యతే. 205

విక్షేపణం యద్భ్రూతారా పక్ష్మణాం తద్విసంస్థులం
ఆయతం విస్ఫురత్తారం విస్ఫారిత ముదాహృతమ్. 206

పరిక్లిష్టపుటం మ్లాయత్తారం విలులితం భవేత్
ప్రేమార్ద్రం మందవికసత్తారం లలితమీరితమ్. 207

కల్లోల ఇవ యత్కాంతివిచ్ఛేద స్తత్తరంగితం
కఠోరం తద్యదుద్బాష్పమపి నిర్బాష్పవద్రుధమ్. 208

వర్ణావిభాగో నిద్రాదేర్యస్య తత్కలుషం విదుః

ఇచట వినతాది దృష్టి దశక స్వరూపము కలదు. 41. వినతము. ఋజువు, ఆయతము అధోగత మని ఖ్యాతము. 42. స్ఫీతము: భ్రూ పక్ష్మ

తార ల్లుల్లసితము లయినచో నీ పేరు. 43. వ్యాసంగి. ఒకచో నుత్కటము వేరొకచో సుస్థితము. 44. విసంస్థులము. భ్రూ తారా పక్ష్మములకు విక్షేపము. 45. విస్ఫారితము. ఆయతమై తారలు విశేషముగా స్ఫురించు నట్లుండునది. 46. విలులితము. కనుపుటములు పరిక్లిష్టములు తారలు మ్లానములు నగుట. 47. లలితము. ప్రేమార్ద్రము, మందముగా వికసించు తారలు కలది. 48. తరంగితము. తరంగము వలె కొంతవిచ్ఛేదమున నుండుట. 49. కఠోరము. ఉద్వ్యాప్తమయినను నిర్వ్యాప్తముగా నుండుట. 50. కలుషము. నిద్రాదుల వలన వర్ణప్రవిభాగము గోచరింపకుండుట. ఇట్టిదృష్టు లుండుటను తద్విదులు పరిశీలించి నిరూపించిరి.

తత్తద్వర్ణప్రభాహీనం యత్తద్రూక్ష మితి స్మృతమ్. 209

సహాయాన్వేషణపరం యత్తత్కాతరముచ్యతే
మీలనోన్మీలనావృత్తిర్యత్ర తచ్చకితం భవేత్. 210

వీక్షితం సర్వతోదిక్కం ద్రుతం యత్తచ్చలం భవేత్
కోమలం తు యదవ్యాజస్నిగ్ధముగ్ధావలోకితమ్. 211

తరలం తదితి ప్రాహుః లోలత్తారాకనీనికం
యద్విశేషానభిజ్ఞత్వం దృష్టే వస్తుని తాని తత్. 212

యత్ర్పీణయతి దృష్టస్య మనస్తత్ప్రణయి స్మృతం
ద్రవీభూతం మనో యస్య దర్శనే ప్రేమగర్భి తత్. 213

పరౌత్సుక్యం విభావ్యేత యత్ర సోత్ప్రాసమేవ తత్
భూయో భూయః స్పృహా యత్ర దృష్టే తత్సస్పృహం భవేత్. 214

హ్లాది తద్దృష్టమాత్రే యత్ శోకాదివ్యపనోదనం
గత ప్రత్యాగతం యత్ర ప్రేంఖోలం తత్ర్పచక్షతే. 215

ధారావాహికసంచారో యస్య తల్లోలముచ్యతే

ఇందు మిగిలిన పదునాలుగు దృష్టులు రూక్షాదిలోలాంతములు కలవు. 51. రూక్షము. ఆయా వర్ణప్రభాహీన మగు దృష్టి. 52. కాతరము. సహాయాన్వేషణపర మగు దృష్టి. 53. చకితము. మీలన మున్మీలనము రూపమయిన వృత్తి కల దృష్టి. 54. చలము. సర్వతోదిక్కముగా ద్రుతముగా

వీక్షితము కల దృష్టి. 55. కోమలము. అవ్యాజముగా స్నిగ్ధముగా నున్న ముగ్ధావలోకిత మగు దృష్టి. 56. తరలము. తారాకనీనికలు కదలునట్టి దృష్టి. 57. తాని. చూచిన వస్తువున విశేష మేమియు గుర్తింపని దృష్టి. 58 ప్రణయి. చూచినవాని మనస్సును సంతస పెట్టుదృష్టి. 59. ప్రేమగర్భి. దర్శనమున మనసునకు ద్రవీభూతత కలుగజేయు దృష్టి. 60. సోత్ప్రాసము. సమధిక మయిన యౌత్సుక్యము గలుగ జేయు దృష్టి. 61. సస్పృహము. చూడగనే భూయో భూయః స్పృహ కలిగించు దృష్టి. 62. హ్లాది. చూడగనే శోకాదులను బోగొట్టు దృష్టి. 63. ప్రేంఖోలము. గతప్రత్యాగతములు కల దృష్టి. 64. లోలము. ధారావాహిక మయిన సంచారము కల దృష్టి లోల దృష్టి యగును. ఇట్లు దృష్టులను భావించునది.

ఏతే వికారాః శృంగారరసస్యైవోపయోగినః. 216
ఏతేషు కేచిద్దృశ్యంతే ప్రాయేణాద్భుత హాస్యయోః

ఇట్టి చతుష్షష్టి దృష్టివికారములు శృంగారరసమునకు మాత్రమె యుపయోగించును. ఇతరరసోపయోగ మంతగా ప్రసిద్ధము కాదు. కాని యీ నిరూపితములలో కొన్ని దృష్టులు సామాన్యముగా నద్భుత హాస్యరసముల కుపయోగించుట గోచరించుచున్నది. ఏ యే రసము లీ రసముల కుపయోగించునో దృష్టిరసవివేకానుభవము కలవారు గుర్తింప వచ్చును.

## రౌద్ర దృష్టులు

ఉద్వర్తితాది చటులాంత దృష్టులు పదునాలుగు రౌద్రమునకె యుపయోగించు నని సూచిత మయినది. ఆ యుద్వర్తితాదుల స్వరూపమిచట నిరూపితమగుట భావించునది.

ఉద్వర్తితం తద్విజ్ఞేయం భ్రువోరూర్ధ్వం ప్రకల్పనమ్. 217
వివృతోర్ధ్వపుటాంతస్థ తార ముద్వృత్త ముచ్యతే
ఉద్వృత్తాంతఃపుటాక్షి ప్తతారం యత్తద్వివర్తితమ్. 218
నిష్పందమానపక్ష్మాగ్ర తారాభ్రు స్తబ్ధముచ్యతే
స్ఫురద్విశ్లిష్టపక్ష్మాగ్రతార ముత్ఫుల్ల ముచ్యతే. 219
ఊర్ధ్వీకృతోల్లసత్తార ముల్లోలమితి కథ్యతే
ఉద్ధురం విషయగ్రాసబద్ధస్పృహ ముదాహృతమ్. 220

విశ్లిష్టం శూన్యవిషయప్రవృత్తం క్రోధవేగతః
నిష్ఠురం పుటయోరంతస్తారయోర్లుఠనం ముహుః. 221

అంతఃప్రౌఢాగ్నిసంశుష్యత్ప్రభం శుష్కముదాహృతం
ప్రకటభ్రుకుటీదృష్టి ర్యత్ర తత్కుటిలం భవేత్. 222

చటులం తద్యదన్యత్ర దుష్ప్రేక్షం రూక్షభావతః

1. ఉద్వర్తితము. కనుబొమల కూర్ధ్వప్రకల్పన మున్నచో నుద్వర్తిత మగును. 2. ఉద్వృత్తము. వివృతములయిన పై కనుపుటముల యంతర్భాగమున తారలున్నచో నుద్వృత్త మగును. 3. వివర్తితము. ఉద్వృత్తము లయిన లో కనుపుటములలో తార లాక్షిప్తములుగా నున్నచో వివర్తిత మగును. 4. స్తబ్ధము. పక్ష్మాగ్రములు తారలు భ్రూభాగములు నిష్పందములుగా నున్నచో స్తబ్ధ మగును. 5. ఉత్ఫుల్లము. విడిపడి యున్న పక్ష్మాగ్రములలో తారలు స్ఫురించునవి యగునేని యుత్ఫుల్లము. 6. ఉల్లోలము. ఊర్ధ్వీకృతములై తారలుల్లసించునవి యగునేని యుల్లోలము. 7. ఉద్ధురము. ఆ యా విషయములను గ్రహింప వలెనను స్పృహ కల దృష్టి యుద్ధురము. 8. విశ్లిష్టము. క్రోధము. వలని వేగమున శూన్య మగు విషయమున ప్రవర్తించిన దృష్టి విశ్లిష్టము. 9. నిష్ఠురము. లోని కనుపాపలతో నున్న కనుపుటముల లుఠన ముండుట నిష్ఠురము 10. శుష్కము. లోని ప్రౌఢాగ్నిచే కాంతి వాడిపోయినచో శుష్కదృష్టి. 11. కుటిలము. భ్రుకుటీదృష్టి ప్రకట మయినచో కుటిలదృష్టి. 12. చటులము. రూక్షభావము వలన దుష్ప్రేక్షముగా నుండునది చటులదృష్టి.

మొదట ఉద్వర్తితాది నామనిర్దేశ మొనరించుటలో వివృత్త విధుర పదములును గలవు వానిని విశేషణములుగ భావించిన దృష్టిసంకేతము కలుగదు. వానికిచట లక్షణము లేదు కదా! అవియు దృష్టులయినచో "చతురుత్తరం శతం" కుదురదు. "షడుత్తరం శతం" అనవలెను. ఈ రెండు, లక్షణము లేనందున సంఖ్యోపపత్తి లేనందున దృష్టినామములు కావు.

## శోకదృష్టులు

ససంభ్రమాది నవకము శోకవికారములని యిదివరలో నిరూపితము. వాని స్వరూప మిచట ప్రతిపాదిత మగును.

అనవస్థితిరేకత్ర యత్ర తత్స్యాత్ససంభ్రమమ్. 223

సంచారశూన్యం దౌర్బల్యాద్య త్తజ్జడమితీరితం
విషయాలోకన వ్యగ్రం సవ్యగ్రమితి కీర్తితమ్. 224

వ్యథతే విషయం ద్రష్టుం యత్తత్సవ్యథముచ్యతే
శుష్యద్భ్రూపుట పక్ష్మాగ్రం యత్తాంతం తత్సమీరితమ్. 225

శూన్యాలోకనమార్తం స్యాన్మ్లానం మ్లాయత్కనీనికం
నిపతద్భ్రూపుటం శుష్యత్ప్రభం తప్తముదాహృతమ్. 226

యదశ్రులులితాలోకం మలినం తదుదాహృతం

1. ససంభ్రమము. ఒకచో స్థితి లేకున్నచో ససంభ్రమము. 2. జడము. దౌర్బల్యము వలన సంచారశూన్య మగు దృష్టి జడము. 3. సవ్యగ్రము. విష యాలోకనవ్యగ్ర మగుదృష్టి సవ్యగ్రము. 4. సవ్యథము. ఆ యా విషయము దర్శించుటకు వ్యథపడుదృష్టి సవ్యథము. 5. తాంతము. భ్రూపుటములు పక్ష్మా గ్రములు నెండిపోయియుండు నేని తాంతదృష్టి. 6. మ్లానము. కనీనికలు వాడి యున్నచో మ్లానము. 7. ఆర్తము. శూన్యాలోకన ముండుట ఆర్తము. 8. తప్తము. భ్రూపుటములు వాలి యుండుట, కాంతి శోషము పొందుట తప్త దృష్టి. 9. మలినము. అశ్రువులతో దృష్టి లులిత మయినచో మలిన దృష్టి యని నిర్ణయించిరి.

## వీరదృష్టులు

మంథరం తత్సమాఖ్యాతం యావచ్ఛ్రుతి వికస్వరమ్. 227

తదేవ బంధురం ఖ్యాతం కించిదుత్ఫుల్లతారకం
స్ఫురత్ప్రభావం గంభీరం ధీరమిత్యుచ్యతే బుధైః. 228

అనిశ్చలం యచ్ఛస్త్రౌఘప్రఘాతేఽపి తదవిక్రియం
స్వభావాలోకితం యత్ర తదకృత్రిమ ముచ్యతే. 229

అవికారి వికారస్య హేతౌ యత్తదనుల్బణం
గృహ్యంతే యేన సూక్ష్మార్థ స్తదసంభ్రాంత ముచ్యతే. 230

అవ్యాజం తదితి ప్రాహు ర్యదచ్ఛల విలోకనం
ప్రౌఢరాగారుణాపాంగం యత్స్యాత్తదనుపస్కృతి. 231

భాషమాణమివాభాతి యత్సహర్షం తదుచ్యతే
సగర్వం తద్యదుత్ఫుల్లతారం స్థిరకనీనికమ్. 232

ఈ నిరూపితము లయిన పదునొకండు దృష్టులు వీరరసమున కుపయోగించు నవి యని పూర్వము నామోద్దేశకథనములో సూచిత మయినది. ఆ దృష్టుల స్వరూప మిట్లు గ్రాహ్యము.

1. మంథరము. శ్రుతి పర్యంతము వికస్వరముగా నుండు దృష్టి. 2. బంధురము. మంథరదృష్టియే కించిదుత్ఫుల్లతారక మగుచో బంధురదృష్టి యగును. 3. ధీరము. ప్రభావమును స్ఫురింప జేయు గంభీరదృష్టి. 4. అవిక్రియము. శస్త్రాస్త్రఘాత మున్న ననిశ్చలముగా నుండు దృష్టి. 5. అకృత్రిమము. స్వభావాలోకితముగా నుండునది. 6. అనుల్బణము. వికారహేతువున్న నవికారిగా నుండునది. 7. అసంభ్రాంతము. సూక్ష్మార్థగ్రహణ సమర్థ మగునది. 8. అవ్యాజము. అచ్ఛలముగా నవలోకించుట. 9. అనుపస్కృతి. అపాంగము ప్రౌఢరాగమున నరుణముగా నుండుట. 10. సహర్షము. భాషించునట్లుగా భాసించు నది. 11. సగర్వము. తార లుత్ఫుల్లములు కనీనికలు స్థిరములుగా నుండుట సగర్వదృష్టి. ఇవి వీరమున కుపకారకములు.

### బీభత్స, భయానక దృష్టులు

అపాంగకూణనం యత్ర తదరోచక ముచ్యతే
యద్వినమ్రపుటాపాంగం తదనుత్సేక ముచ్యతే. 233

ఉర్ధ్వాధఃక్షిప్తసంచారో వ్యావిద్ధమితి కథ్యతే
అపాంగయోరధస్తారావిక్షేపో విద్ధ ముచ్యతే. 234

వికృష్టం తచ్ఛూన్య మేవ యదాకాశావలోకనం
అంతర్బాష్పస్ఫురత్తారం వినిగీర్ణ ముదాహృతమ్. 235

బహిస్తారావినిష్క్రాంతై ర్వినిష్క్రాంత ముదాహృతం
అతస్మి న్తద్గ్రహో యస్య లోహితం తద్విలోహితమ్. 236

అరోచకాదిదృష్టులు సామాన్యముగా బీభత్సమున భయానకమున ప్రవృత్తి కల వనుట సూచితము. అరోచకాది విలోహితాంతము లయిన యష్ట దృష్టులిచట నున్నవి. 1. అరోచకము. అపాంగకూణన ముండుట. 2. అనుత్సేకము. అపాంగములు వినమ్రపుటములతో నుండుట. 3. వ్యావిద్ధము. క్రిందికి మీదికి క్షిప్త మగు సంచార ముండుట. 4. విద్ధము. అపాంగములకు క్రిందుగా తారావిక్షేప ముండుట. 5. వికృష్టము. శూన్యముగా నాకాశావలోకన ముండుట. 6. వినిగీర్ణము. అంతర్బాష్పములచే తారలు స్ఫురించుట. 7. విని

ప్రాక్కాంతము. వెలికి తార లుబ్బివచ్చుట. ౭. విలోహితము. లోహితముగా నుండి యొక దానివేరొకటిగా గుర్తించుట విలోహితమను దృష్టి యగును. ఇట్టి దృష్టి విశేషములను సావధానముగా సమీక్షించునది.

ఏతే దృష్టివికారాస్తు సమ్యగ్లక్షణలక్షితాః
మహాకవిప్రబంధేషు దృశ్యంతే తద్విలోక్యతామ్. 237

ఇట్లు శృంగారాదిరసములకు సంబంధించిన యీ దృష్టివికారము లన్నియు లక్షణలక్షితములై నిరూపితము లయినవి. మహాకవుల ప్రబంధములలో నివి గోచరించు చున్నవి. వారు సావధానముగ వీనివిశేషములను తమ ప్రబంధ ములలో నిరూపించిరి. తత్తద్రసౌచిత్యమున నివి యన్నియు ప్రకాశమానము లుగ నున్నవి. ఇచటి లక్షణముల ననుసరించి ప్రబంధము లందు లక్ష్యమును సమన్వయించుకొనునది. ఈ చతురుత్తరశతదృష్టులు కేవలము పరిగణన సిద్ధములు కావు. మహాకవి ప్రబంధ బహిర్భూతములు కావు. మహాకవుల ప్రబంధములలో నివి యున్నవి. తమ ప్రబంధములలో వీనిని నిరూపించినచో "మహాకవిత్వలాభో మహాకవీనామ్".

## భరతుడుచెప్పిన స్థాయిభావ, రసదృష్టులు

నాట్యవేదమున భరతుడు కొన్ని దృష్టులను నిరూపించెను. తన్మ తానుసారమున దృష్టిభేదకథన మావశ్యకము.

భావజా రసజాశ్చాపి తథా సంచారిభావజాః
షట్త్రింశద్భరతేనోక్తాః తాః కథ్యంతేఽత్ర దృష్టయః. 238

స్నిగ్ధా హృష్టా చ దృప్తా చ విస్మితా క్రోధితాఽపి చ
దీనా జుగుప్సితా చైవ సభయా భావదృష్టయః. 239

భరతుడు ముప్పదియారు దృష్టిభేదములను నిరూపించినాడు. వానిలో గొన్ని భావజన్యములు. కొన్ని రసజన్యములు. కొన్ని సంచారిభావజన్యములు. ఆ దృష్టులను గూడ నిచట నిరూపింతుము. స్నిగ్ధాది సభయాంతదృష్టు లెనిమిది భావదృష్టులు. ఇవి భావజములు. వీని లక్షణము రసజన్యదృష్టిలక్షణ కథనానంత రము నిరూపిత మగును.

కాంతా సహాస్యా వీరా చ సాద్భుతా రౌద్రికా పునః
కరుణా సహితా దృష్టిర్బీభత్సా సభయానకా. 240

దృష్టయో రసజా హ్యేతాః కథితా భరతాదిభిః

కాంతాదిభయానకాంతము లయిన దృష్టు లెనిమిది రసజదృష్టులు. వీనిని భరతాదులు నిరూపించిరి. వీని లక్షణము నిరూపితము కాగలదు.

శూన్యా చ మలినా చైవ శ్రాంతా లజ్జాన్వితా తథా. 241

గ్లానా చ శంకితా చైవ విషణ్ణా ముకులా తథా
కుంచితా చాభితప్తా చ జిహ్మా చ లలితాఽపి చ. 242

వితర్కితాఽర్ధముకులా విభ్రాంతా విప్లుతాఽపి చ
ఆకేకరా విశోకా చ త్రస్తాచ మదిరా తథా. 243

ఇతి వింశతి రుద్దిష్టా దృశః సంచారిభావజాః

దీనాది మదిరాంత దృష్టులు వింశతి. ఇరువది సంచారిభావజము లయిన దృష్టు లిచట ఉద్దిష్టము లయినవి. వీని స్వరూపమును నిరూపిత మగును.

సంచారి దృష్టులు కాని భావదృష్టులు కాని రసమూలకములు కావున ముందుగా రసజదృష్టి ప్రతిపాదన మావశ్యకము.

హర్ష ప్రసాదలలితా కాంతా మన్మథశాలినీ. 244

విలసద్భ్రూకటాక్షా చ శృంగారే దృష్టిరుచ్యతే
ఆకుంచితపుటాపాంగా విభ్రాంత స్వల్పతారకా. 245

అవ్యక్తసంచారవతీ దృష్టిర్హాస్యే ప్రకీర్తితా

శృంగారదృష్టి హాస్యదృష్టి యిచట కలవు. 1. కాంతదృష్టి. శృంగారమున నుండును. హర్షముచే ప్రసాదముచే నిది లలితము. మన్మథభావమున శోభ కలది. భ్రూవిలాసము కటాక్షవిలాస మిం దుండును. 2. సహాస్య. ఈ దృష్టి హాస్యమున నుండును. పుటము లపాంగము లిం దాకుంచిము లగును. తారకలు స్వల్పముగా నిందు విభ్రాంతము లగును. ఇం దవ్యక్త మయిన సంచారము కలదు.

తప్తా వికాసితా క్షుబ్ధా గంభీరా సమతారకా. 246

ఉత్ఫుల్లమధ్యా దృష్టిస్తు ధీరా వీరరసాశ్రయా
రోషరక్తాంతనయనా స్ఫురత్తారా వికస్వరా. 247

అక్షుబ్ధా స్యా దచకితా వీరా యుద్ధప్రహర్షిణీ

ఇచట వీరరసమునకు సంబంధించిన దృష్టి. 3. వీర. ఇదియె ధీర. ఇది తప్తము వికసితము క్షుబ్ధము గంభీరము. ఇందు తారకలు సమముగా నుండును. మధ్యభాగ ముత్ఫుల్లముగా నుండును. వీరాశ్రయముగా నుండు నిది ధీరదృష్టి. నయనాంతములు రోషరక్తములై తారలు స్ఫురించునవై యుండును. ఇది వికస్వరము, అక్షుబ్ధము, అచకితము. యుద్ధమున నీ దృష్టికి ప్రహర్ష ముండును. ఇది వీరరసదృష్టి.

కుంచితాంచితపక్ష్మాగ్రా కించిదుద్వృత్తతారకా. 248
సద్యో వికస్వరాంతా చ సాఽద్భుతా దృష్టిరుచ్యతే
క్రూరా రూక్షారుణోద్వృత్తా నిష్టబ్ధస్ఫుటతారకా. 249

భ్రుకుటీకుటిలా దృష్టీ రౌద్రా రౌద్రరసే స్మృతా
పతితోర్ధ్వపుటా సాస్రా మన్యుమంథరతారకా. 250

నాసాగ్రానుగతా దృష్టిః కరుణా కరుణే రసే
నికుంచితపుటాపాంగా ఘృణోపప్లుతతారకా. 251

సంశ్లిష్టస్థిరపక్ష్మా చ బీభత్సా దృష్టిరుచ్యతే
ప్రోద్వృత్తనిష్టబ్ధపుటా స్ఫురదుద్వృత్తతారకా. 252

దృష్టిర్భయానకాఽత్యంతభీతా జ్ఞేయా భయానకే

ఇచట సాద్భుత రౌద్రిక కరుణ బీభత్స భయానకము లను దృష్టిపంచక స్వరూపమున్నది. 4. సాద్భుత. ఇందు పక్ష్మాగ్రములు కుంచితము లాకుంచితము లగుట, తారకలు కించిదుద్వృత్తము లగుట, అప్పటికప్పుడె యంతభాగములు వికస్వరము లగుట యుండును. 5. రౌద్రిక. ఈ దృష్టి క్రూరము రూక్షము అరుణము ఉద్వృత్తము నగును. పుటములు తారలు నిష్టబ్ధములు— బాగుగా వ్యథ పడి నలిగినవి యగును. ఇది భ్రుకుటి కుటిల మయిన దృష్టి. రౌద్రరసమున నుండు దృష్టి రౌద్రి. రౌద్రిక. 6. కరుణ. కరుణరసమున నుండు దృష్టి. దీని యూర్ధ్వపుటములు పతితము లగుట ఇవి బాష్పములతో నుండుట తారకలు దుఃఖమంథరము లగుట యుండును. దృష్టి నాసాగ్రానుగతముగా నుండును. ఇది కరుణదృష్టి. 7. బీభత్స. బీభత్సరసమున నుండు దృష్టి. ఈ దృష్టియందలి పుటము లపాంగములు నికుంచితము లగును. తారకలు జుగుప్సచే నుపప్లుతము లగును. పక్ష్మములు స్థిరముగా సంశ్లిష్టము లగును. ఇది బీభత్స

దృష్టి. 8. భయానక. ఇందు కనుపుటములు ప్రోద్వృత్తము లగును. నిష్టబ్ధములు నగును. తారకలు స్ఫురించునవై యుద్వృత్తము లగును. ఇది యత్యంతము భీత మగు భయానకదృష్టి. భయానకరసమున నుండును.

శృంగారాదిరసము లందు దృష్టిస్వరూపము నిరూపిత మయినది. ఇక దృష్టి విశేషణముల నిర్వచనము సూచిత మగును.

విశేషణాశ్రయా వ్యాఖ్యా దృష్టీనాం కథ్యతే పురః. 253

హర్షే నిశ్చలతారత్వం ప్రసాదే స్నిగ్ధతారకా
వ్యక్తప్రసక్తిః కాంతా స్యాల్లలితా సా చ మంథరా. 254

సన్నతాపాంగసంచారవతీ దృష్టిః సమన్మథా
అపాంగే తారవిక్షేపః కటాక్ష ఇతి కథ్యతే. 255

అవ్యక్తవికృతిర్దృష్టిర్గంభీరేతి ప్రకీర్తితా
పక్ష్మణోరన్యసంశ్లేషః కుంచితం వినతేఽంచితమ్. 256

ఊర్ధ్వప్రవృత్తతారం యత్సామ్యం సమవిలోకనే
దురాలోకా భవేత్క్రూరా రూక్షా స్నేహవివర్జితా. 257

నిశ్చలాయతనిష్టబ్ధా కుటిలా సోగ్రతారకా
మంథరా మందసంచారా కుంచితా త్ర్యశ్రవీక్షణా. 258

బలాత్కారేణ విషయాన్ గృహ్ణతీ స్యాదుపప్లుతా
వ్యాకోశమధ్యా మధురా స్థిరతారాభిలాషిణీ. 259

దృష్టిభేదముల నామనిరూపణములో కొన్ని సాంకేతికము లయిన పదములు విశేషణ రూపముగ నున్నవి. వాని యర్థనిరూపణము నిర్వాహ మిచట స్పష్ట మగును. దృష్టులకు సంబంధించిన విశేషణాశ్రయవ్యాఖ్య యిచట నున్నది. హర్షమున తారలు నిశ్చలముగా నుండుట ప్రసాదమున తారలు స్నిగ్ధములుగా నుండుట కాంత లలిత మధుర యను దృష్టివిశేషణములు వ్యక్త మగు ప్రసక్తి సూచించును. సమన్మథదృష్టి వంగిన యపాంగములందు సంచారము కలది యని పరిగ్రాహ్యాము. కటాక్ష మనగా నపాంగము నందు తారావిక్షేపము. అవ్యక్తవికృతి-వికృతి వ్యక్తము కాని దృష్టి గంభీరదృష్టి. కనురెప్పల కన్యసంశ్లేషముండుటను కుంచిత మందురు. రెప్పలు వినతము లయినచో నంచిత మని వ్యప

హారము. సమవిలోకనమున తార యూర్ధ్వప్రవృత్తము అయినచో సౌమ్యదృష్టి యగును. చూడశక్యము కాని దృష్టి క్రూరదృష్టి. స్నేహవివర్జిత మయిన దృష్టి రూక్షము. నిశ్చల మాయతముగ నున్నచో నిష్టబ్ధదృష్టి యగును. దృష్టి-యగ్ర తారకముగా నవగ్ర కుటిలము, మందసంచారము, శలిది ముంఠరదృష్టి. త్ర్యశ్రభాగ మున చూచుట కుంచితదృష్టి. బలాత్కారమున విషయములు గ్రహించు దృష్టి ఉపప్లుతదృష్టి యగును. మధురదృష్టి యనగా మధ్యలో వికాసము కల దృష్టి. స్థిరతారలతో నుండు దృష్టి అభిలాషిణీ దృష్టి యందురు. ఇట్లా యా దృష్టినామ ముల నిర్వాహము నీ విధముగ భావించునది.

ఇటుపై స్నిగ్ధాది సభయాంత భావదృష్టుల స్వరూపము పర్యాలోచ నీయము.

సానందాశ్రుకృతా దృష్టిః స్నిగ్ధేయం రసభావజా
చలా హసితగర్భా చ విశత్తారాఽనిమేషిణీ. 260

కించిదాకుంచితా హృష్టా దృష్టిర్హాసే ప్రకీర్తితా
అపాంగే శౌక్ల్యభూయిష్ఠా హాసగర్భేతి కథ్యతే. 261

సస్మితే తారకే యస్యాః స్మితా వికసితాంతరా
సత్త్వముద్గిరతీ దృప్తా దృష్టిరుత్సాహసంభవా. 262

అవజ్ఞాగర్భిణీ దృష్టిః దృప్తేతి పరిభావ్యతే
అనభివ్యక్తవికృతిః విషయే సత్త్వభూయసీ. 263

యన్నాపహ్రియతే దృష్టిర్విషయైరపహారిభిః
తదేవ స్థైర్యమిత్యుక్తం దృప్తేస్సర్వత్ర కోవిదైః. 264

ఇచట భావదృష్టులలో స్నిగ్ధ హృష్ట దృప్త అను దృష్టిత్రయములకు సంబంధించిన లక్షణవివేచన మున్నది. 1. స్నిగ్ధ. ఆనందాశ్రువులతో గూడినదిగా నుండును. ఇది శృంగారరసమునకు సంబంధించిన రతిభావజన్యము. దీనిని స్నిగ్ధ దృష్టి యందురు. 2. హృష్ట. ఇది హాసమున నుండునది. చలముగా నుండును. హసితగర్భముగా నుండును. ఇందు తారల కదలిక లుండును. నిర్నిమేషముగా నుండును. కించిదాకుంచితముగా నుండును. ఇది హృష్టదృష్టి. దీని యపాంగము లలో నధికముగా శౌక్ల్యము-తెలుపుదనము ండును. ఇది హాసగర్భమని పెద్దల కథనము. 3. దృప్త. ఉత్సాహసంభవము. ఇందుతారకలు సస్మితముగా నుండును.

అంతరమున స్మితము వికాసము నుండును. సత్త్వమును స్పష్ట మొనరించును. ఇట్టిది దృప్తదృష్టి. అవజ్ఞాగర్భ మయిన దృష్టియు దృప్తదృష్టి. ఇందలి వికృతి వ్యక్తము కాదు. విషయమున సత్త్వభూయిష్ఠముగా నుండును. అపహారకము లగు విషయములచే నీ దృష్టి యపహృతము కాకుండుట స్థైర్యమని దృష్టికోవిదు లందరు. అట్టి స్థైర్య మీ దృప్తలోనుండుట గ్రాహ్యము.

విస్మయోత్ఫుల్లతారా చ హృష్టోభయపుటాంచితా
సమా వికసితా దృష్టిః విస్మితా విస్మయే స్మృతా. 265

రూఢా స్థిరోద్వృత్తపుటా విష్టబ్ధోద్వృత్తతారకా
కుటిలా భ్రుకుటీ దృష్టిః క్రుద్ధా క్రోధేఽభిధీయతే. 266

ఉత్తబ్ధపక్ష్మరుద్ధా యా స్రస్తారా చ జలావిలా
మందసంచారిణీ దీనా సా శోకే దృష్టిరిష్యతే. 267

రుచ్యేఽపి విషయే దృష్టేరౌదాసీన్యం హ్యదీనతా
సంకోచితపుటా శ్యామా దృష్టిర్మీలితతారకా. 268

పక్ష్మోన్మేషాత్సముద్విగ్నా జుగుప్సాయాం జుగుప్సితా
విస్తారః స్యాత్తతో హ్రాసః సంకోచ ఇతి కథ్యతే. 269

ఛాయావైగుణ్యమేవ స్యాద్దృష్టేః శ్యామత్వముచ్యతే
తారాపుటభ్రువాం కంపాదుద్విగ్నేతి విభావ్యతే. 270

జుగుప్సితా చ విజ్ఞేయా విషయాదపరాగిణీ
విస్ఫారితోభయపుటా భయకంపితతారకా. 271

నిష్క్రాంతమధ్యా దృష్టిస్తు భయభావే భయాన్వితా
ఇతి స్వరూపతః ప్రోక్తా దృష్టయో రసభావజాః. 272

ఇచట విస్మిత క్రుద్ధ దీన జుగుప్సిత భయాన్విత యను భావజదృష్టుల స్వరూప మున్నది. 4. విస్మిత. ఇది విస్మయ మను నద్భుతరస స్థాయి భావమున సంగత మగును. ఇందు తారలు విస్మయమున నుత్ఫుల్లము లగుట, ఉభయ పుటములు హృష్టములై యంచితము లగుట, సమముగా వికసితముగానుండుట కలదు. 5. క్రుద్ధ. ఈ దృష్టి క్రోధమున నుండును. ఇది రూఢము. ఇది స్థిరము. దీని పుట లుద్వృత్తములు. తారకలు విష్టబ్ధము లుద్వృత్తములగును. కుటిల

ముగ నుండును. భ్రుకుటీదృష్టి యుండును. 6. దీన. ఇది శోకము నందలి దృష్టి. బరు వెక్కిన కనురెప్పలచే నిది రుద్ధ మగును. కోణములు జారును. జలము నిండియుండును. మందసరంచారము కల దగును. 7. జుగుప్సిత. ఈ దృష్టి బీభత్సస్థాయి జుగుప్సలో నుండును. రుచ్యవిషయమున గూడ దృష్టికి ఔదాసీన్య ముండును. దృష్టి యదీనముగనె యుండును. పుటములు సంకోచము పొందును. శ్యామముగ నుండును. తారకలు మీలితము లగును. పక్ష్మముల యున్మేషముననిది సముద్విగ్న మగును. విస్తారము ప్రసారము సంకోచము ఇందను గతము లగును. దృష్టి శ్యామ మగుట యనగా ఛాయావైగుణ్య ముండుట యని గ్రాహ్యము. ఈ దృష్టియే తారాభ్రూపుటములకంపముతో నుండునేని యుద్విగ్న మగును. 8. భయాన్విత. ఇది భయ భావమున సంగతము. జుగుప్సిత దృష్టియె విషయాపరాగము కలది కాగా, ఉభయపుటములు విస్ఫారితములు కాగా, తారకలు భయకంపితములు కాగా భయాన్విత యగును. మధ్యభాగము నుండి యిది వెలువడును. ఇట్టి దృష్టి భయాన్వితదృష్టి. భయభావసంగత దృష్టి.

## భరతుడుచెప్పిన సంచారి దృష్టులు

ఇప్పటి కిట్లు రసభావజన్యము లగు దృష్టులు స్వరూపానుసారమున నిరుక్తము లయినవి. లక్షణలక్షితము లయినవి. ఇటుపై సంచారిభావజన్యము లగు నిరువది దృష్టులను నిరూపింపవలసి యున్నది. శూన్యాది దృష్టి వింశక మిదివరలో సంకేతిత మయినది. వాని లక్షణ మిట్లుండును.

> తారా సమపుటా స్నిగ్ధా నిష్కంపా శూన్యదర్శనా
> బాహ్యార్థాగ్రాహిణీ శ్యామా శూన్య దృష్టిః ప్రకీర్తితా. 273
>
> ప్రస్పందమానపక్ష్మాగ్రా నాత్యంతముకులైః పుటైః
> మలినాంతా చ మలినా దృష్టిః పిహితతారకా. 274
>
> మలినా కథ్యతే దృష్టిః క్షురదుష్టాశ్రుదూషితా
> శ్రమప్రమ్లాపితపుటా క్షామాంతాంచితలోచనా. 275
>
> సన్నా పతితతారా చ దృష్టిః శ్రాంతేతి కథ్యతే

ఇందు శూన్య మలిన శ్రాంత అను దృష్టిత్రయలక్షణ మున్నది. 1. శూన్య. పొడవుగా నుండును. సమపుటములతో నుండును. స్నిగ్ధమై నిష్కంపమై యుండును. శూన్యదర్శనమున నుండును. బాహ్యార్థములను గ్రహింపదు. శ్యామముగా కాంతిరహితముగా నుండును. ఇట్టిది శూన్యదృష్టి. 2. మలిన.

పక్ష్మాగ్రములు స్పందించుట, పుటము లత్యంతము ముకులములు కాకుండుట, అంతభాగము మలినముగా నుండుట తారకలు పిహితము లగుట. మలినదృష్టి రూపము. 3. శ్రాంత. ఇందు పుటములు శ్రమచే వాడి యుండును. లోచనాంత భాగములు క్షామము లంచితములునగును. నిశ్చేష్టముగ నుండును. తారలు జారియుండును. ఇట్టి దృష్టి శ్రాంతదృష్టి.

ఈ నిరూపణములో విశేషణరూపములుగా నున్న కతిపయపదముల నిర్వాహ మిట్లు గ్రాహ్యము. ప్రమ్లాపన మనుట శోషము. ఎండి యుండుట. క్షామత్వ మననుది వికాసము లేకుండుట. సాదము సన్నత యనునది తారాభ్రూ పుటముల నిశ్చేష్టత. ఈ భావ మీశ్లోకమున సంగృహీత మయినది.

ప్రమ్లాపనం భవేచ్ఛోషః క్షామత్వమవికాసితా. 276
నిశ్చేష్టతా తారకాభ్రూపుటానాం సాద ఉచ్యతే

ఇక నిటుపై లజ్జాన్వితాదిదృష్టుల లక్షణములు పరిగ్రాహ్యములు.

కించిదంచిత పక్ష్మా యా పతితోర్ధ్వపుటా హ్రియా. 277
త్రపాఽధోగతతారా చ దృష్టిర్లజ్జావతీ భవేత్
మ్లానభ్రూపుటపక్ష్మా చ శిథిలా మందచారిణీ. 278
క్లమప్రవిష్టతారా చ గ్లానా దృష్టిరుదాహృతా
అస్పష్టతారా సంచారో దృష్టేః శైథిల్యముచ్యతే. 279
కించిచ్చలా స్థిరా కించిదున్నతా తిర్యగాయతా
గూఢా చకితతారా చ శంకితా దృష్టి రుచ్యతే. 280
విషాదవిస్తీర్ణపుటా పర్యస్తాన్తాఽనిమేషిణీ
కించిన్నిష్టబ్ధతారా చ కార్యా దృష్టిర్విషాదినీ. 281
స్ఫురితాశ్లిష్టపక్ష్మాగ్రా ముకులోర్ధ్వపుటాన్వితా
సుఖోన్మీలితతారా చ ముకులా దృష్టిరిష్యతే. 282
అనికుంచితపక్ష్మాగ్రా పుటైరాకుంచితైస్తథా
సన్నా పతితతారా చ కుంచితాదృష్టిరిష్యతే. 283

ఇచట నీ దృష్టుల వివేచన మున్నది – లజ్జావతి, గ్లాన, శంకిత, విషణ్ణ, ముకుల, కుంచిత. 4. లజ్జావతి. పక్ష్మములు కించిదంచితములు, ఊర్ధ్వపుటములు

లజ్జచే పతితములు - వాలి యుండునవి. తారలు త్రపచే నధోగతములు. అట్టి దృష్టి లజ్జాన్విత లజ్జాయుత. 5. గ్లాన. భ్రూపుటపక్ష్మములు మ్లానములు. ఇది శిథిల. ఇది మందసంచారిణి. తారలు శ్రమచే సంతఃప్రవిష్టములు. ఇట్టిది గ్లానదృష్టి యగును. 6. శంకిత. తారాసంచార మస్పష్టము. దృష్టికి శిథిలత. కించిచ్చల. కించిత్ స్థిర, కించిదున్నత. ఇది తిర్యగాయతమై గూఢమై చకితతారమై యుండగా శంకితదృష్టి యయినది. 7. విషణ్ణ. ఇందలి పుటములు విషాదముచే విస్తీర్ణములు అంతభాగము పర్యస్తమునగును. నిమేషము లుండవు. తారలు కొంతగా నిష్టబ్ధము లగును. ఇట్లు విషాదినీదృష్టిని కూర్పవలెను. 8. ముకుల. పక్ష్మాగ్రములు స్ఫురితము లాశ్లిష్టములు నగును. ఊర్ధ్వపుటములు ముకులములుగా నుండును. తారలు సుఖముగా నున్మీలితము లగును. ఇట్టిది ముకులదృష్టి. 9. కుంచిత. కనుపుటము లాకుంచితము లగుటచే పక్ష్మాగ్రము లనికుంచితములు గనె యుండును. ఈ దృష్టి సన్నమై పతితతారమై యుండును. ఇది కుంచితము.

మందాయమానతారా యా పుటైః ప్రశిథిలైస్తథా
సంతాపోపప్లుతా దృష్టిరభితప్తా తు సర్వథా. 284

లంబితాకుంచితపుటా శనైస్తిర్యఙ్నిరీక్షిణీ
గూఢోద్వర్తితతారా చ జిహ్మాదృష్టిరుదాహృతా. 285

మధురా కుంచితాంతా చ సభ్రూక్షేపా సహాసినీ
సమన్మథవికారా చ దృష్టిస్సా లలితా భవేత్. 286

వితర్కోద్వర్తితపుటా తథైవోత్ఫుల్లతారకా
అధోగతవికారా చ దృష్టిరిష్టా వితర్కితా. 287

అర్ధవ్యాకోశతారా చ హ్లాదార్ధముకులైః పుటైః
స్మృతాఽర్ధముకులా దృష్టిః కించిల్లలితతారకా. 288

అనవస్థితతారా చ విస్తీర్ణోత్ఫుల్లమధ్యమా
విభ్రాంతతారకా దృష్టిర్విభ్రాంతేతి హి కథ్యతే. 289

పుటౌ ప్రస్ఫురితౌ యస్యాః నిష్టబ్ధౌ పతితౌ పునః
విప్లుతోద్వృత్తతారా చ దృష్టిరిష్టా తు విప్లుతా. 290

ఆకుంచితపుటాపాంగా సంగతార్ధనిమేషిణీ
ముహుర్వ్యావృత్తతారా చ దృష్టిరాకేకరా స్మృతా. 291

వికోశితోభయపుటా ప్రోత్ఫుల్లా చానిమేషిణీ
అనవస్థితతారా చ వికోశా దృష్టిరిష్యతే. 292

త్రాసాదుద్వర్తితపుటా ముహుః కంపితతారకా
త్రాసాదుత్ఫుల్లమధ్యా చ త్రస్తా దృష్టిరుదాహృతా. 293

ఇచట అభితప్త జిహ్మ లలిత వితర్కిత అర్ధముకుల విభ్రాంత విప్లుత ఆకేకర వికోశ త్రస్త మదిర యను పదునొకండు దృష్టుల స్వరూపవివేచన మావశ్యకము. కాని చివరిది యగు మదిరాదృష్టి లక్షణము లేదు. "మదిరేషు మదిరా భవేత్" అను వినియోగము సూచిత మయినది. అభితప్తాది త్రస్తాంతముల స్వరూప మిట్లు గ్రాహ్యము.

10. అభితప్త. తారలు మందము లగుట, పుటములు ప్రశిథిలము లగుట, సంతాపమున నుపప్లుత మగుట, వ్యథతో నుండుట యీ యభితప్తా లక్షణము. 11. జిహ్మ. పుటము లంచితము లాకుంచితము లగుట, నెమ్మదిగా తిర్యఙ్నిరీక్షణ ముండుట, తారలు గూఢముగా నుద్వర్తితము లగుట జిహ్మదృష్టి లక్షణము. 12. లలిత. మధురము కుంచితాంతము సస్మితము అంతర్వికసితము సమన్మథవికారము నగునది లలితదృష్టి. 13. వితర్కిత. వితర్కముచే పుటము లుద్వర్తితము లగుట, తారక లట్లే యుత్ఫుల్లము లగుట, వికార మధోగతముగా నుండుట వితర్కదృష్టి లక్షణము. 14. అర్ధముకులము ఇందు తార లర్ధవ్యాకోశముతో నుండును. హ్లాదమున పుటము లర్ధముకులము లుగా నుండును. తారకలు కించల్లలితము లగును. ఇట్టి దర్ధముకులదృష్టి 15. విభ్రాంత. తార లనవస్థితము లగుట, మధ్యమభాగము విస్తీర్ణ ముత్ఫుల్ల మగుట, తారకలు విభ్రాంతము లగుట విభ్రాంతదృష్టి స్వరూపము. 16. విప్లుత ఈ దృష్టికి పుటములు ప్రస్ఫురితములు నిష్టబ్ధములు పతితములు నగును తారలు విప్లుతము లుద్వర్తితము లగును. ఇట్టిది విప్లుతదృష్టి యనుట యిష్టము. 17. ఆకేకర. ఆకుంచితపుటాపాంగము సంగతార్ధనిమేషము ముహుఃవ్యావృత్తతారము నగుట యాకేకరము. 18. వికోశ. ఉభయపుటములు వికోశితములు. కోశము నుండి నిర్గతములు. ఇది ప్రోత్ఫుల్లము అనిమేషము. ఇందు తార లనవస్థితములు. ఇట్టిది వికోశదృష్టి. 19. త్రస్త. ఇందు త్రాసము వలన పుటము లుద్వర్తితము లగును. తారకలు ముహుః కంపితము లగును. త్రాసమున మధ్యభాగ ముత్ఫుల్ల మగును. ఇట్టిది త్రస్తదృష్టి. మదిరాదృష్టి కిందు

లక్షణము లుప్తమయినది. దీనిని నాట్యవేదమున జూడ దగును. ఇట్లు సంచారి భావదృష్టులు నిరూపితములయినవి.

## కొన్ని దృష్టుల వినియోగ విశేషము

కొన్ని దృష్టుల వినియోగవిశేషము లిట్లు వర్ణితము లగును.

భయచింతాసు శూన్యా స్యాద్వైవర్ణ్యే మలినా భవేత్
నిర్వేదే చ శ్రమే శ్రాంతా స్వేదే లజ్జాసు లజ్జితా. 294

గ్లానా దృష్టిరపస్మారవ్యాధిగ్లానిషు వర్తతే
శంకావిషాదయోర్జ్ఞేయా శంకితా చ విషాదినీ. 295

దృష్టిర్ముకులితా స్వప్నసుఖనిద్రాసు వర్తతే
కుంచితా సూచితానిష్టా దుష్ప్రేక్ష్యేఽక్షివ్యథాసు చ. 296

అభితప్తా తు నిర్వేదే త్వభిఘాతాభితాపయోః
జిహ్మదృష్టిరసూయాయాం జడతాలస్యయోర్భవేత్. 297

లలితా హర్షధృత్యోః స్యాత్సంవృతా తర్కే వితర్కితా
ఆహ్లాదేష్వర్ధముకులా గంధస్పర్శసుఖాదిషు. 298

విభ్రాంతదృష్టిరావేగే సంభ్రమే విభ్రమేఽపి చ
విప్లుతా చాపలోన్మాదదుఃఖార్తిమరణాదిషు. 299

ఆకేకరా దురాలోకే విచ్ఛేదప్రేక్షితేషు చ
విబోధామర్షగర్వోగ్ర్యమతిషు స్యాద్వికాసితా. 300

త్రస్తా త్రాసే భవేద్దృష్టిర్మదేషు మదిరా భవేత్

శూన్యదృష్టి భయచింతలలో నుండును. మలినాదృష్టి వైవర్ణ్యమున నుండును. శ్రాంత నిర్వేదమున శ్రమమున నుండును. లజ్జిత స్వేదమున లజ్జ కలిగినప్పు డుండును. గ్లాన అపస్మారము వ్యాధి గ్లానులలో నుండును. విషాదముతో నుండు శంకితదృష్టి శంకావిషాదములలో వినియుక్త మగును. స్వప్నసుఖనిద్రలలో ముకులితదృష్టి. చూచుటకు వీలుగాని నేత్రవ్యథలలో కుంచిత దృష్టి, నిర్వేదములో నభిఘాతములో నభితాపములో నభితప్తదృష్టి, అసూయా జడతాలస్యములలో జిహ్మదృష్టి, హర్షములో ధృతిలో లలిత, తర్కమున వితర్కిత, గంధస్పర్శసుఖాదులలో నాహ్లాదములలో నర్ధముకుల, ఆవేగ సంభ్రమ విభ్రమ ములలో విభ్రాంతదృష్టి వినియుక్త మగును. చాపల మున్మాదము దుఃఖమార్తి

మరణము మొదలగు వానిలో విప్లుతదృష్టికి వినియోగ మున్నది. దురాలోక మున నాకేకర ముండును. విచ్ఛేదప్రేక్షితములలో విబోధామర్షములలో గర్వ ములో ఉగ్రతలో మతిలో వికోశిత దృష్టి వినియోగము కలదు. త్రాసదృష్టి త్రాసమున, మదమున, మదిరాదృష్టి వినియుక్త మగును.

ఇప్పటి కీ విధముగా చత్వారింశదుత్తరశతదృష్టులు లక్షితము లయి నవి. ఆ యా భావాదు లున్నప్పు డా యా దృష్టు లుండు ననుటయు, నాయా దృష్టు లా యా భావములను సూచించు ననుటయు, నా యా భావ ములను అభినయమున ప్రయోగింపవలసి యున్నప్పు డా యా దృష్టుల నవలం బింపవలయు ననుటయు నిచటి పరమతాత్పర్యముగా భావింప వలెను.

యథా నేత్రం ప్రసర్పేత ముఖభ్రూదృష్టిసంయుతమ్. 301

తథా భావరసోపేతం ముఖరాగం ప్రయోజయేత్

స్వరూపం వినియోగశ్చ దృష్టీనాం ప్రతిపాదితః. 302

ఇతి శ్రీ శారదాతనయ విరచితే భావప్రకాశనే
నాయక నాయికా భేద తత్తదవస్థా తదాశ్రయ
రసభావదృష్టివికారాదివర్ణనం నామ పంచమోఽధికారః.

ముఖ భ్రూ దృష్టి సంయుతముగా నేత్ర మెటుగా ప్రసరించునో యటుగా భావరసోపేతమయిన ముఖరాగమును ప్రయోగింప వలెను. నేత్రాది కర్మ లెంతసౌష్ఠవముగ నున్నను ముఖరాగము లేకున్నచో శోభింపవు. ముఖ రాగము భావరసోపేతముగ నున్నచో నేత్రాదికర్మల వైగుణ్య మంతగా గోచ రింపదు.

ఇట్లు దృష్టుల స్వరూపము వినియోగము ప్రదర్శిత మయినది. దృష్టి భేదముల స్వరూపవివేకము కష్టసాధ్యము. కాని దుస్సాధ్య మసాధ్యము కారణ అభినయకాముల నిరంతరానుసంధానమున వీనిని సాధింపవచ్చును. అసాధాదు. మయిన యీ వివేకము భావప్రకాశనార్థము.

ఇది శ్రీ శారదాతనయ విరచితమైన భావప్రకాశము నందు
భావాలోకమున నాయక నాయికాభేద తత్తదవస్థా
తదాశ్రయ రసభావదృష్టివికారాది వర్ణన మనెడి
పంచమాధికారము.

# షష్ఠాధికారము

## శబ్దార్థసంబంధ తద్భేద ప్రకారనిర్ణయము

శబ్దార్థసంబంధ తద్భేదప్రకార నిర్ణయ మను నామసంకేతము కల యీ షష్ఠాధికారమున పూర్వాధికారానుబంధము లగు విషయముల ప్రతిపాదన మున్నది. రసానుభూతి ప్రకారములు రసగతులు రసాభాసవిశేషములు రసముల మేలనరీతులు నిరూపితము లగును. శాంతరసవిశేషము ప్రతిపాదిత మగును. దేశకాలముల రసోపయోగిత నిర్దిష్ట మగును. సంభోగచాతుర్విధ్యము ప్రభేదసహితముగా ప్రతిపాదితము కాగలదు. రసము వాక్యార్థ మగుటయు నిందు ప్రతిపాద్యము.

రసకావ్యములు సంబద్ధములు కాపున శబ్దార్థముల ద్వాదశవిధ సంబంధము ఇందు విచారిత మగును. కావ్యమున ముఖ్య మయిన వాక్యార్థభావనము విస్తృత మగును. ప్రసంగమున రసాశ్రయవిచారము నిందు గలదు. షడ్విధ మయిన శబ్దార్థసంబంధము అభిధాలక్షణా వ్యంజనలు శాస్త్రీయముగా నిరూపితము లగును. కావ్యభేదనిరూపణము ధ్వనికావ్యప్రశంస ధ్వని స్ఫోట సంబంధము అనునవి యీ షష్ఠాధికారమున ప్రధానముగా సంభావనీయములు. ఉపక్రమములో సంగ్రహార్థసూచన మిట్లున్నది.

అనుభూతి ప్రకారాశ్చ రసానాం గతయోఽపి చ
ఆభాసాశ్చ రసానాంచ తేషామన్యోన్యమేలనమ్. 1

తద్వికల్పాదయోఽన్యేఽపి భావా వాక్యార్థతాఽపి చ
అత్రాభిధీయతేఽస్మాభిః కల్పవల్ల్యనుసారతః. 2

రసానుభూతిప్రకారములు రసగతులు రసముల యాభాసములు రసముల పరస్పరమేలనము తద్వికల్పాదులు తదనుషంగము కల భావములు రసముల వాక్యార్థత సర్వ మీ యధికారమున కల్పవల్లీ గ్రంథానుసారమున నిరూపిత మగును. ప్రతిపాదింప దలచిన విషయముల నిట్లు సంగ్రహాత్మకముగ నుల్లే

ఖించుట పాఠకులకు ప్రతిపత్తిసౌకర్యము సంపాదించును. గ్రంథకారుని రచనా విధానమున నిది యొక యుపాదేయ మగు రమ్యఫక్కిక. ఇట్లే భావిగ్రంథమున గూడ భావించుట యుక్తము.

### రసానుభూతి

ఉపక్రమానుసారమున రసానుభూతి ప్రకార మిం దభివర్ణిత మగును.

ఉత్పన్నా రతిరేకత్ర ప్రథమం దర్శనాదిభిః
దీప్యమానా విభావైః స్వైః తత్సాన్నిధ్యాదికల్పితైః. 3

కటాక్షవీక్షణోద్యానగమనాద్యనుబంధినీ
తద్దర్శనోపజనితైః స్మృతిహర్షమదాదిభిః. 4

వాగారంభానుభావేన దీప్యమానాఽనువర్ధతే
తద్దర్శనాద్దీప్యమాన కంప రోమోద్గమాదిభిః. 5

హృదారంభానుభావేన శృంగారం విశినష్టి సా
త్రిధాఽనుభావానుబంధా రసోత్కర్షం యథారతి. 6

పుష్యంత్యన్యత్ర విద్వద్భిరేవమేవ విలోక్యతాం

మొదట దర్శనాదులచే నొకచో నుత్పన్న మయిన రతి నాయికా నాయకుల సాన్నిధ్యాదులచే సిద్ధము లయిన విభావాదులచే దీప్యమాన మగును. కటాక్షవీక్షణములు ఉద్యానగమనములు మొదలగు వాని యనుబంధమున నున్నదై శోభించును. తద్దర్శనసంజాతము లయిన స్మృతిహర్షమదాదులచే దీపితమై వృద్ధిపొందును. వాగారంభానుభావములచే దీప్త మగును. ప్రియ దర్శనమున దీప్తము లయిన కంపరోమాంచాదులచే వృద్ధిపొందును. హృదా రంభానుభావములు మానసారంభము లయిన అనుభావములచే సముల్లాసము పొందును. గాత్రారంభములు వాగారంభములు మానసారంభములు నయిన యనుభావముల యనుబంధముతో గూడుకొనిన యా రతి శృంగారరసమును విశేషయుక్తముగ జేయును. ఇట్లే రసోత్కర్షము సంపాదించుటను ఆ యా రత్యాదిస్థాయిభావానుసారముగా నుండునని రసవిదు లాలోచింప వలసి యున్నది.

### రసగతులు

అష్టధా గతిరేతేషాం రసానాం కథ్యతే బుధైః 7

ఆశ్లేష లీన విచ్ఛేద సూక్ష్మ వ్యతికర స్థిరాః
శోభనశ్చ సమశ్చేతి సర్వత్రాభినయాశ్రయాః. 8

రసములకు సంబంధించిన గతు లెనిమిది విధములు గున్నవని బుధుల కథనము. ఆశ్లేషము- లీనము-విచ్ఛేదము-సూక్ష్మము-వ్యతికరము-స్థిరము-శోభనము-సమము నని రసగతు లెనిమిది. ఇవి యన్నియు నంతట నభినయాశ్రయములుగా నుండును. వీని స్వరూప మిట స్పష్ట[illegible].

రసస్య వర్తమానస్య స్వసామగ్రీవశేన చ
అన్యేన సంగతిః స్యాచ్చేదయమాశ్లేష ఉచ్యతే. 9

రసోఽనుభూయమానశ్చేద్రసాంతర తిరస్కృతః
అన్యరాగాన్నివృత్తో వా స లీన ఇతి సంజ్ఞితః 10

విచ్ఛిన్నమధ్యః ప్రబలైః విరుద్ధైః హేతుభిః క్వచిత్
పునశ్చేన్నానువృత్తః స్యాత్స విచ్ఛేద ఇతీరితః. 11

ఆలంబనగుణస్థైర్యాత్సంస్కారస్యానువర్తనాత్
యోఽనుయాతి విలీనో యః స సూక్ష్మ ఇతి కథ్యతే. 12

సమకాలసముత్పన్నైః త్రిభిర్ద్వాభ్యామథాపి వా
రసశ్చేద్వ్యతికీర్యేత స తు వ్యతికరః స్మృతః. 13

ఆవిర్భూయ తిరోభూయ రసమన్యే క్వచిద్రసాః
ఆపాదయంతి ప్రథమే స్థైర్యం చేత్స స్థిరః స్మృతః 14

సమకాలసముత్పత్తేః సమకాలానుభూతిభిః
స్థాయినోః సాత్త్వికాదీనాం సామ్యాచ్చ సమ ఈరితః. 15

విరోధి మిత్ర శత్రూణాం రసానాం సంకరేఽపి చ
మహిమ్నా శోభతే స్వేన యః స శోభన ఈరితః. 16

ఆశ్లేషాది రసగతుల స్వరూప మిందు గలదు. 1. ఆశ్లేషము. వర్తమానరసమునకు స్వసామగ్రీవశమున సమానముగా సముచిత పరిపోషము పొందిన యన్యరసముతో సంగతి యుండునేని యది యాశ్లేష మని యనదగును. ప్రకృతరసమున కన్యరసముతో సంబంధ మాశ్లేషము. 2. లీనము. అనుభూయ

మాన మగు రసము రసాంతరమున తిరస్కృత మగునేని, అథవా అన్యరాగమున నివృత్త మగునేని లీన మను రసగతి యగును. ఇందు రెండు గతులున్నవి. రెండును లీనసంజ్ఞ కలవి. ఒకటి విజాతీయతిరస్కారము; రెండు సజాతీయ తిరస్కారము. తిరస్కృతి యెట్లు కలిగినను లీనగతియె యగును. 3. విచ్ఛేదము. ప్రస్తుతమగు రసము ప్రబంధములు విరుద్ధములు నగు హేతువులచే నెచటనేని మధ్యలో విచ్ఛిన్నమై మరల ననువృత్తము కాకున్నచో నది విచ్ఛేద మను రసగతి యగును. 4. సూక్ష్మము. ప్రస్తుతరసము విలీనకల్పమయినను ఆలంబనగుణస్థైర్యమున గాని సంస్కారానువర్తనమున గాని యనుగతమై యుండునేని యది సూక్ష్మ మను రసగతి యగును. 5. వ్యతికరము. సమకాలసముత్పన్నము లగు రెండు మూడు భావాంతరములతో ప్రస్తుతరసము సంబద్ధ మయినచో వ్యతికరమను రసగతి యగును. 6. స్థిరము. ప్రస్తుతరస మధ్యము నందొక్కొకచో నితరరసము లావిర్భావము పొంది తిరోభావము పొంది ప్రస్తుతరసమున స్థైర్యమును సంపాదించినచో స్థిర మను రసగతి యగును. 7. సమము. రెండు స్థాయి భావములు సమకాలమున సముత్పన్నము లగుటచే, సమకాలమున ననుభూతి సంపాదించుటచే సాత్త్వికాదిభావములును సామ్యమున నుండుట వలన సమము అను రసగతి యగును. 8. శోభనము. విరోధిరసములతో మిత్రరసములతో శత్రురసములతో సాంకర్య మున్నను స్వమహిమాతిశయమున ప్రస్తుతరసము శోభించునేని శోభనమను రసగతి యగును.

## రసాభాసము

ఉపక్రమానుసారమున రసగతి నిరూపణానంతరము రసాభాస నిరూపణ మావశ్యకము.

హాస్యాభిభూతః శృంగారః తదాభాసో భవిష్యతి
హాస్యా బీభత్సమిలితో హాస్యాభాస ఉదాహృతః. 17

వీరో భయానకావిష్టో వీరాభాస ఇతీరితః
బీభత్సకరుణాశ్లేషాదద్భుతాభాస ఉచ్యతే. 18

రౌద్రః శోకభయావిష్టో రౌద్రాభాస ఇతీరితః
హాస్యశృంగారఖచితః కరుణాభాస ఉచ్యతే. 19

బీభత్సోఽద్భుతశృంగారీ బీభత్సాభాస ఉచ్యతే
రౌద్రవీరానుషక్తశ్చేదాభాసః స్యాద్భయానకే. 20

రసము స్వచ్ఛము; ఆభాస మస్వచ్ఛము; రసస్వచ్ఛతా భంజకము లనేకములు కలవు. ఏ యే రస మెట్లు కలుష మగునో ఆభాసవివేకమున గుర్తింప వచ్చును. శృంగారరసము హాస్యరసముచే నభిభూత మగునేని శృంగారాభాస మగును. హాస్యసంబంధమున శృంగారము దూషితము కాదు. అనుచితహాస్యమున శృంగారముతిరస్కృతమై యాభాస మగును. బీభత్స మిళిత మయినచో హాస్యము హాస్యాభాస మగును. భయానకావిష్ట మయినచో వీరము వీరాభాసము. బీభత్సకరుణముల సంబంధము వలన అద్భుత మాభాస మగును. శోకభయావిష్ట మయిన రౌద్రము రౌద్రాభాసము. హాస్యశృంగారములతో గూడుకొనునేని కరుణము కరుణాభాస మగును. అద్భుతశృంగారములతో గూడుకొనునేని బీభత్సము బీభత్సాభాస మగును. రౌద్రవీరరసములతో గూడుకొనినచో భయానకము భయానకాభాస మగును.

రక్తాపరక్తయోశ్చేష్టా యతో హాసకరీ నృణాం
దృష్టా శ్రుతా సూచితాఽపి శృంగారాభాసకారికా. 21

పూయశోణితమాంసాది విష్ఠాలేపాదయోఽపి చ
హాస్యం భిందంతి యత్రైతే స హాస్యాభాస ఈరితః. 22

సభాసు యోషితాం మధ్యే శూరమానస్య కస్యచిత్
భయాత్పలాయనం యుద్ధాద్వీరాభాస ఉదీరితః. 23

దివ్యాదిదర్శనేఽస్త్రాదిలేపోరస్తాడనాదయః
అద్భుతం ఘ్నంతి యత్తస్మాదద్భుతాభాస ఇష్యతే. 24

అవజ్ఞాక్షేపవాక్యాదిరౌద్రకర్మకృతోద్యమః
బిభేతి శోచతి యది స రౌద్రాభాస ఉచ్యతే. 25

శోచతో హాస్యశృంగారభూయిష్ఠం చేష్టితం యది
స ఏవ కరుణాభాసస్తద్భావశ్చేత్స్వభావజః. 26

యత్తు బీభత్సరూపస్య సంభోగో వనితాజనైః
రూపయౌవనసంపన్నైర్బీభత్సాభాస ఉచ్యతే. 27

బిభ్యతో యత్ర దృశ్యేత వీరరౌద్రాదిభాషితం
భయానకాభాస ఇతి కవిభిః ప్రవివిచ్యతే. 28

రసాభాసము నిరూపిత మయినది. అందు హేతు విందు నిరూపిత మగును. సామాన్యముగా మానవులకు రక్తాపరక్తచేష్ట హాస్యము కలిగించును. అట్టి చేష్ట చూచినను వినినను సూచిత మయినను శృంగారాభాసము కలుగ జేయును. చీము నెత్తురు మాంసము మొదలగునవి పురీష (పెంట) లేపము మొదలగునవి హాస్యమును చెదరగొట్టును. కావున నట్టి స్థలమున హాస్యాభాస మనిరి. సభలలో వనితల మధ్యలో శూరాభిమానిగా నుండువాడు యుద్ధము నుండి భయమున పలాయన మొనరించినచో వీరాభాసమును జెప్పిరి. దివ్యాదులను దర్శించినపుడు రక్తలేపనాదులు వక్షస్తాడనాదులు అద్భుతమునకు నాశకములు. కావున నట్టి స్థలమున అద్భుతాభాస మనుట సమ్మతము. అవజ్ఞా వచనములచే నాక్షేపవాక్యములచే రౌద్రకర్మలలో నుద్యమము కలిగి భయపడినచో దుఃఖపడినచో రౌద్రాభాస మనదగును. శోకపడు వాని చేష్టితము హాస్యశృంగార భూయిష్ఠముగా నున్నచో నది వాని స్వభావజన్య మగు విశేష మయినచో కరుణాభాస మగును. బీభత్సరూపు డగు వానికి రూప యౌవన సంపన్న లయిన వనితలతో సంభోగము నిరూపించినచో బీభత్సాభాస మన దగును. భయపడువానికి వీర రౌద్రాదిభాషిత మున్నచో భయానకాభాస మని కవులు విశదముగా వివేచించిరి.

భాగద్వయం ప్రవిష్టస్య ప్రధానస్యైకభాగతా
రసానాం దృశ్యతే యత్ర తత్స్యాదాభాసలక్షణమ్. 29

రసాభాసమున కిది లక్షణము. రసములలో భాగద్వయము చేరి యున్న ఒక ప్రధానరసమున కేకభాగత యున్నచో, అనగా నన్యభాగమున నితర రస మనుప్రవేశము పొందియున్నచో దానివలన ప్రకృతప్రధానరసగతి పూర్ణ సముల్లసనమునకు దగినది కానపుడు ఆభాసలక్షణ మన దగును.

ప్రథమం దృశ్యతే యత్తు శ్రూయతే సూచ్యతేఽపి వా
తత్ప్రధానమితి ప్రాహుః రసప్రాధాన్యవేదినః. 30

సమమంతరితో భావైరపి వాద్యంతగైర్యది
ఏకరూపప్రవృత్తో యః స ప్రధానో భవిష్యతి. 31

ప్రబంధమున రసము ప్రధాన మగుట యెట్లిదో యిందు నిరూపిత మగును. రసప్రాధాన్యవేదులు ఈవిధముగా ప్రాధాన్యము ప్రతిపాదింతురు. ప్రబంధము నందు ప్రథమమున నే రసము ప్రతిపాదింపబడి వాసించునో, అట్లు ప్రతిపాదితమై దృశ్యమానము కాకున్నను ఆ యా వాక్యములచే శ్రూయమాణమేని యగునో, స్పష్టశబ్దమున శ్రూయమాణము కాకున్నను సూచ్యసూచకవిశేషములచే సూచ్యమానమేని యగునో ఆ రసము ప్రధాన రస మగును. ప్రబంధప్రారంభమున నెట్లేని యుపాత్త మగునది ప్రధానరస మగునని భావము. ప్రబంధప్రారంభప్రవృత్త మగు నా రసము ఇతరభావములతో గూడుకొని యంతరిత మయినను, భావాంతరముల సంబంధమున వ్యవహిత మయినను ఏకరూపప్రవృత్తముగనె యుండునేని ప్రధాన మగును. ప్రకృత రసము కన్న నితరము లగు భావములు అభ్యుదితములై యున్నను ప్రబంధ ప్రవృత్త మగునది ఏకరూపముగనె ప్రవర్తమాన మయినచో ప్రధానరస మగును.

ఆద్యంతయోర్ద్విగుణితః స్వేతరైః స్వీయమాదిషుః
మధ్యగో వా భవేత్సమ్యక్స రసాభాసతామియాత్. 32

ప్రధాన మగు రసమునకు ప్రధానతాభంజకము లగు సన్నివేశముల వలన ఆభాసగతి కలుగును. అది యెట్లు కలుగునో యిందు నిరూపిత మగుచున్నది. ప్రబంధమున ప్రారంభములో నుపాత్తమయిన రసము, తనకన్న నితరము లగు భావములచే నాద్యంతములందు ద్విగుణితమై యున్నప్పుడు మధ్యగత మగును. స్వేతరభావములలో నొకటి యాదిలో గుణభావమున నుపాత్త మగుటయు, స్వేతరభావములలో వేరొకటి యంతములో గుణభావమున నుపాత్త మగుటయు కాగా నటు నిటు నవి యున్నందున ప్రకృతము మధ్యగత మగును. అప్పుడది రసాభాసత్వము పొందును. ప్రధాన మాద్యంతములలో స్వీయభావములతో ద్విగుణిత మయిననే శోభించును. స్వేతరగుణిత మయినచో నాభాస భాజన మగునని తాత్పర్యము.

## రసమేలనము

పౌర్వాపర్యేణ భావాః స్యుః సమా యది మిథో ద్వయోః
తదేవ రసవిద్వద్భిః రసమేలనముచ్యతే. 33

శృంగారవీరయోః సమ్యాగ్భవే దన్యోన్యమేలనం
రౌద్రబీభత్సయోః తద్వత్తథై వాద్భుతహాస్యయోః. 24

భయానకస్య కరుణస్య స్యాదన్యోన్యమేలనం
రసాః కార్యవశాత్సర్వే మిలంత్యేవ పరస్పరమ్. 25

ప్రథమం యో రసః ఖ్యాతః స ప్రధానోభివిష్యతి
ద్వయోః ప్రవేశే సంసర్గో భావో యది సమో భవేత్. 26

రసముల మేలనరీతి యిందున్నది. పరస్పర మవిరుద్ధము లయిన రసములకు, మైత్రి కల రసములకు ఒకచో సమావేశము మేలనాత్మకము. రసపండితులు మేలన మిట్లు నిర్వచించిరి. రెండు రసములకు పరస్పరము పౌర్వాపర్యమున భావములు సమానములుగా నున్నచో నది రస మేలన మగును. కొన్నిరసముల కిట్టె మేలనము సంగతముగా నుండును. శృంగారవీరముల కన్యోన్యమేలనము సముచితముగా నుండును అట్లే రౌద్రబీభత్సములకు, అట్లే యద్భుతహాస్యములకు, అట్లే కరుణభయానకములకు అన్యోన్యమేలనము యుక్తము. మిలితములై నిరూపితములగు నా యా రసములకు సంబంధించిన భావములు పరస్పర బాధ్యబాధకభావాపన్నములు కావు. రసము లన్నియు తత్తత్సమయసముచిత కార్యవశమున పరస్పరము మిలితము లగును.

రసము లిట్లు మిలితము లయినచో నొక రసము ప్రధాన మగుట యె ట్లుపపన్న మగును? ఇ ట్లుపపన్న మగును. ప్రబంధమున ప్రథమ ప్రవృత్త మయిన రసము ప్రఖ్యాత మగును గావున నది ప్రధానము కా గలదు. ఒకటి ప్రధానము కాగా నితరము తదంగ మగును కావున ప్రకృతరసమునకు ప్రాధాన్యహాని లేదు. రెండు రసములకు ప్రవేశ మున్నప్పుడు వాని భావములకు సమత్వ ముండునేని సంసర్గ మున్నదన్న వ్యవహారము కలుగును. ఇట్లన్యోన్య మేలన మవిరుద్ధము. రెండురసములకు గల సమావేశము సంసర్గము. మాలా గ్రథనమున పుష్పమునకు పుష్పసంసర్గము వలె, ఏకాసనసహోపవేశమున సహృదయునకు సహృదయసంసర్గము వలె ప్రబంధనిర్మాణమున రసమునకు రసాంతర సంసర్గ మవిరుద్ధముగ నుండుట సంభావ్యము.

ద్విత్రాణామపి సంసర్గసామ్యే సంకర ఉచ్యతే
తేషామేకత్ర బాహుల్యం ప్రధానే యత్ర దృశ్యతే. 27

రెండు రసములకు ప్రవేశ మున్నప్పుడు సంసర్గమని నిరూపితమయినది. రెండురసములకన్న నధికముగా మూడు రసములకు సంసర్గముసమానముగా నున్నచో సంకర మను వ్యవహారము కలుగును. వర్తమానరసము ప్రధానముగా నుండగా నితరరసములకు బాహుల్యము సంకరరూపమున సంగతమె యగును. రసముల సాంకర్యము ప్రకృతరసప్రాధాన్యమును హరింపదు.

ఆద్యంతయోః ప్రగుణితః స ప్రధానో భవిష్యతి
ఇత్థం స్వతంత్రైరాభాసై ర్మిలితైః సంకరై రసైః. 38

తారతమ్యం విజానీయాత్సమ్యగ్రాగాపరాగయోః
ఏవం విభావ్యకవిభిః కావ్యబంధో విరచ్యతామ్. 39

విలోకితాః కావ్యబంధాః రసభావవివేచకైః
కవేః ప్రయత్నసాఫల్యం కీర్తిం పుష్ణంతి శాశ్వతీమ్. 40

ఏవం రూపం ప్రకారం చ దేశం కాలం ఋతుం వయః
ప్రకృతిం భావలింగే చ జ్ఞాత్వా విద్యాద్రసస్థితిమ్. 41

ఆద్యంతములలో ప్రగుణిత మగునది ప్రధానము కాగలదు. ఉపక్రమమున నిరూపిత మగునది యుపసంహారమున గూడ నిర్వ్యూఢ మయినచో ప్రగుణిత మగును. ఉపక్రమోప సంహారములలో ననుగత మగునది ప్రధానము. ప్రధాన మగునది స్వతంత్రములతో సంగత మగుట ఆభాసములతో గూడుకొనుట మిలితములలో నుండుట సంకరములతో సంకీర్ణ మగుట గుర్తింపవలెను. ఇట్లితరరసములతో సంబంధము ఉండగా రాగాపరాగముల తారతమ్యము తెలియ దగును. ఇట్లు చక్కగా విభావన మొనర్చి కవులు కావ్యబంధములు రచింపవలెను. ఇట్టిది భావికవుల కుపదేశరూపము. ఇది పరంపరానురోధమున వెలసిన కావ్యసంప్రదాయధర్మము. రసభావవివేచకు లగు మహాకవులు రచించిన యట్టి కావ్యబంధము లనేకములు కలవు. వాని సమవలోకనమున సంజాత మయిన సంప్రదాయధర్మమె యిట్లు నిరూపిత మయినది. ఇది మహాకవి సంప్రదాయబాహ్యము కాదు. కావుననె కవులు కావ్యబంధముల నిట్లు కమనీయముగ విరచన మొనరింప దగును.

ఇట్టి కావ్యబంధనిర్మాణముననె కవికి ప్రయత్నసాఫల్యము లభించును. అట్టివారె శాశ్వతకీర్తిని పోషింపగలరు. రసస్థిరసస్థితిని గుర్తించుట కుపాయములు

కలవు. ఇట్టి ప్రకారమును సర్వమును సావధానముగ గుర్తింప వలెను. ఇంకను దేశమును కాలమును ఋతువులను వయసును ప్రకృతిని భావమును లింగమును బాగుగా గుర్తించి రసస్థితిని దెలియ వలయును.

ఏవం ప్రకారా నాలోచ్య సమాకర్ణ్యానుభూయ చ
పరేభ్యో దర్శయన్నేవం శ్రావయన్ననుభావయన్. 42

సర్వప్రకారైః సంపూర్ణకామః సంతుష్టమానసః
ప్రాప్నోతి ముక్తిం చరమే శాంతేనైవ రసేన సః. 43

మే మిందు నిరూపించిన యిట్టి ప్రకారములను సముచితముగా సమాలోచన మొనరింపవలెను. అట్లొనరించి సంవాదసంపాదనమునకై మేధావుల నుండియు వినవలెను. విని సంపన్నవివేకు డగు సహృదయుడు స్వానుభవమున గుర్తింపవలెను. గుర్తించి స్వసంగతము లగు వీని నితరులకు చూపవలెను. విన్పింప జేయవలెను. అనుభవింప జేయవలెను. ఇట్లన్నివిధముల సంపూర్ణకాము డయిన సహృదయుడు సంతుష్టమానసుడై తుదకు శాంతరసము ననె ముక్తిని బొందును.

## శాంతరసము

శాంతో విషయహేయత్వదర్శనశ్రవణాదిభిః
ధర్మాఖ్యానపురాణైశ్చ పుణ్యతీర్థావగాహనైః. 44

పుణ్యాశ్రమనివాసైశ్చ యోగిభిర్నిత్యసంగమైః
జడాంధబధిరాదీనాం తారతమ్యావలోకనైః. 45

వ్యాధి దారిద్ర్య మరణైః నారక్యాయాతనాశ్రుతైః
పుణ్యక్షయప్రపతన కుయోని శ్రయణాదిభిః. 46

క్లేశప్రయత్నవైఫల్యాద్దుఃఖత్రితయఘాతనైః
ఇత్యాదిభిర్విభావైః స్యాచ్ఛమాత్మా కస్యచిద్రసః. 47

రసజ్ఞు డయిన కవికి శాంతరసమున ముక్తి కలుగుట సూచిత మయినది. శాంతరసమునకు కాదాచిత్క మయిన ప్రకర్ష కలదు. అట్టి యుత్కర్ష కల శాంతమునకు సంబంధించిన విభావ మిచట నిరూపితము కాగలదు. శమాత్మక మగునిది యందరకు సంబంధించి యుండునది కాదు. ఒకానొక విశిష్టవ్యక్తికి

మాత్రమే యిది యుండును. దీని విభావము లీ విధముగ నున్నవి. విషయ హేయతా దర్శనము శ్రవణము మొదలగునవి యిందు విభావములు. ధర్మాఖ్యానములతో నున్న పురాణములు, పుణ్యతీర్థావగాహనములు, పుణ్యాశ్రమనివాసములు, యోగిజనులతో నిత్యసంబంధములు, జడాంధబధిరాదుల తారతమ్యావలోకనములు, వ్యాధిదారిద్ర్య మరణములు, నానానరకములకు సంబధించిన యాతనావిశేషముల శ్రవణములు, పుణ్యము నశించి పోగా పుణ్యలోకముల నుండి ప్రపతనములు, నీచయోనిశ్రయణాదులు, క్లేశమువలన ప్రయత్నవైఫల్యము వలనను గలుగు దుఃఖత్రయోపఘాతములు (భౌతిక దైవికాధ్యాత్మికదుఃఖములు దుఃఖత్రయము) మొదలగునవి విభావములు. వీనిచే శమాత్మక మగు శాంతమేవానికో రసముగా ననుభూత మగును.

శాంతమున గొన్ని విశేషములు గలవు. వాని నీవిధముగా గ్రహింపదగును.

యథాశక్తి పరిత్రాణం దుఃఖినామవిశేషతః
వినా రాగేణ సర్వత్ర సుఖినామనుమోదనమ్. 48

శాకమూలఫలై రన్యైః శరీరస్థితిసాధనం
వ్రతోపవాసనియమో వల్కలాజినధారణమ్. 49

అహింసా సర్వభూతానాం అవిశేషాదనుగ్రహః
అంగేషు కార్శ్యం కార్కశ్యం స్నానం త్రిషవణోచితమ్. 50

ఋజ్వాయతాసనం ధ్యానం నాసాగ్రాహితలోచనం
విషయేభ్యో నియమనం ఇంద్రియాణాం నివృత్తియే. 51

ఇత్యాదయో విశేషాః స్యుః ప్రాయః శాంతేషు యోగిషు

శాంతులగు యోగులలో నీ విశేషము లుండును. సామాన్యముగా నివి యుండును. ఇవియే యుండుననికాదు. ఇవియే యుండుననియుగాదు. ఇంకను గొన్ని యుండును. వారు వీరను విశేష ముపలక్షింపక దుఃఖము కలవారలను యథాశక్తి రక్షించుట శాంతయోగుల విశేషము. రాగరహితముగా నంతట సుఖము కలవారి ననుమోదించుటయు విశేషము. శాకమూలఫలములచేగాని యిట్టి యితరములచే గాని శరీరస్థితి సాధించుట, వ్రతోపవాసనియమము, వల్కలాజినధార

ణము, అహింస సర్వభూతముల నవిశేషముగా ననుగ్రహించుట, అవయవముల కార్శ్యము కార్కశ్యము కాలత్రయ సముచిత మయిన స్నానము ఋజు వాయత మయిన యాసనము ధ్యానము నాసాగ్రన్యస్త నయనత్వము ఇంద్రియముల నివృత్తికై విషయముల నుండి నియమమున మను నీ మొదలగు నవి శాంతులగు యోగులలో నుండు విశేషములు.

మానాపమానయోః శోకహర్షయోః సుఖదుఃఖయోః 52
సమవృత్తితయా ప్రాయో నానుభావా భవంతి హి
ఆనందబాష్ప రోమాంచ స్వేదస్తంభాః స్యురేకదా. 53
శాంతానుభావో రోమాంచ ఏక ఏవేతి కేచన
నోపకుర్వంతి శాంతస్య భావాః సంచారిణో యతః. 54
తస్మాచ్ఛాంతరసస్యైవం వికలాంగత్వముచ్యతే
నివృత్తే విషయాసంగే స్వాంతే శాంతిముపేయుషి. 55
నిర్వేదాదేరనుదయాదనుభావో న దృశ్యతే
అతో హర్షాద్యనుభవరాహిత్యాద్వికలాంగతా. 56
అస్తీతి సత్తామాత్రేణ ప్రాయః శాంతో విభావ్యతే
యతో న భావోఽభినయో న శక్యో నాట్యకర్మణి. 58
శమే స్థాయిని తత్ర స్యుర్భావా హర్షాదయః కథం
అతోఽయం వికలప్రాయ స్తథాపి శ్రేష్ఠ ఉచ్యతే. 58

శాంతరసమున కనుభావములు లేవు. అది నాట్యమున నుపయోగింపదు. అయినను శాంతరసము శ్రేష్ఠ మనుట యిందుపపాదిత మగును. మానావమానములలో శోకహర్షములలో సుఖదుఃఖములలో సమముగా నుండుట శమ ప్రకృతి స్వభావము. ఇట్టి సమవృత్తిత్వమున నా మానావమానాదు లనుభావములు కాజాలవు. ఆనందబాష్పము రోమాంచము స్వేదము స్తంభము నను నవి యొకప్పుడిందు గలుగ వచ్చును. రోమాంచము ఒక్కటి మాత్రమె శాంతానుభావ మగు నని కొందరనిరి. శాంతమున కనుభావములు లేవు. శాంతమునకు సంచారిభావములు నుపకరించునవిగా లేవు. కావున శాంతము వికలాంగ మని యనవలసి యున్నది. విషయాసంగము నివృత్తము కాగా, స్వాంతము శాంతిని పొంది

యుండగా నిర్వేదాదు లుదయింపవు. కావున అనుభావ మిందు గోచరించుట లేదు. కావుననే హర్షాదుల యనుభవము శూన్యము. అందువలన శాంతము వికలాంగము. అయినను సత్తామాత్రమున శాంత మున్నదని సంభావిత మగును. అయిననేమి ? నాట్యకర్మలో శాంతమున కభినయ ముపపన్నము కాదు. అభినయము శక్యము కాదు. కాగా, శాంతరసస్థాయి భావమయిన శమమునందు హర్షాదిభావము లెట్లుదయింప గలవు. కావున శాంతరసము వికలప్రాయము. అయినను శాంతరసము శ్రేష్ఠరసము. దేహధారులకు సంబంధించిన పురుషార్థము లనదగు ధర్మార్థకామమోక్షములలో ప్రకృష్టపురుషార్థమయిన మోక్షపురుషార్థమున కుపయోగించునది యగుటచే శాంతము శ్రేష్ఠరసము. ఇది సిద్ధరస మనియు ననిరి. పురుషార్థములలో మోక్షము ప్రధాన మయినట్లు రసములలో శాంతము ప్రధానము.

## దేశకాలాదులు

యథావిభవమాఖ్యాతా రసా భావా స్తదుద్భవాః
అ థైషాం దేశకాలాదిదర్శనశ్రవణాదిభిః. 59

అనుభావాః స్వసంవేద్యాస్తాన్సమ్యగభిజానతే
దేశాదయో విభావా స్తు హర్షాదీన్వ్యభిచారిణః. 60

ఆలంబనవిభావేషు జనయంతి యథాబలం
జనయంతి హి తే త త్తచ్చేష్టాం తేషు పరస్పరమ్. 61

చేష్టాభిరనుమీయంతే హ్యనుభావా విశారదైః
భావా వినైవ చేష్టాభిర్న దృశ్యంతే కదాచన. 62

తస్మాచ్చేష్టావశేషాభిజ్ఞో భావుకో రసికో భవేత్

రసములు తదుద్భవము లయిన భావములును త త్తద్విభవానుసారముగా సమాఖ్యాతము లయినవి. ఇక వీనికి సంబంధించిన దేశకాలాదులను నిరూపింపవలెను. దేశకాలాదుల దర్శన శ్రవణాదులచే స్వసంవేద్యములగు ననుభావము లనేకములు కలవు. వానిని దర్శనశ్రవణాదులచే చక్కగా దెలియ వచ్చును. దేశాదు లయిన విభావములు ఆలంబన విభావము లందు హర్షాదివ్యభిచారిభావములను తమ తమ బలానుసారముగా గలుగ జేయ గలవు. అట్లుత్పన్నము లయిన హర్షాదివ్యభిచారిభావములు త త్తచ్చేష్టల నుత్పాదింప గలవు. ఆ చేష్ట

లును హర్షాదులం దనుభావములను గోచరింప జేయుగలవు. చేష్టలచే ననుభావము లనుమీయమానము లగును. ఇట్లు పరస్పరము వీని సంబంధము నభ్యూహింప వలెను. భావములు చేష్టారహితములుగా నుండవు. చేష్టలచే భావములు భావములచే చేష్టలు నభ్యూహ్యము లగుటను గుర్తింపవలెను. కావున చేష్టావిశేష జ్ఞుడయిన భావుకుడె రసికుడు కాగలడు.

కృత్రిమోఽకృత్రిమశ్చేతి ద్విధా దేశో విభావ్యతే. 63

కృతిమా నగర గ్రామ పల్లీ జనపదాదయః
అకృత్రిమాః సరిచ్ఛైల వేలాఽరణ్యాదయస్తథా. 64

అకృత్రిమాస్తు శిల్పజ్ఞైః క్రియంతే కృత్రిమాః క్వచిత్
కృత్రిమా అపి తద్వత్తైర్విరచ్యంతేఽప్యకృత్రిమాః. 65

దేశము రెండు విధములు. కృత్రిమదేశము, అకృత్రిమదేశము నని. నగరము గ్రామము పల్లి జనపదాదులు కృత్రిమదేశములు. నది పర్వతము సముద్ర వేల అరణ్యము మొదలగునవి అకృత్రిమ దేశములు. శిల్పజ్ఞు లకృత్రిమములను గూడ కృత్రిమములనుగా జేయుదురు. కృత్రిమములు నదే విధముగ నకృత్రిమము లగును. శిల్పవిచక్షణు లటునిటు చేయగలరు. ఇట్టి రచనావిధానము రసోచిత ముగ నుండుటకై శిల్పవిదులు యత్నింతురు.

కాలో వసంతవర్షాదిర్బహుభేదః ప్రకల్ప్యతే
లవాదిభేదా దేతేషు వినోదాః స్యుర్మహోదయాః. 66

వినోదాః బహవస్సంతి శృంగారే హాస్యవీరయోః
రౌద్రేఽపి క్రమశోఽన్యూనా భవంతి సుఖినాం నృణామ్. 67

బీభత్సే నాయకాభాసవినోదః శస్యతే క్వచిత్
భయానకే చ శాంతే చ వినోదో నైవ జాయతే. 68

ఏతా వినోదనీయాస్తః సుహృదాదిభిరేకదా

దేశనిరూపణానంతరము కాలనిరూపణ మావశ్యకము. కాలము వసంత కాల మని వర్షాకాల మని బహుభేదముల నున్నది. కాలము నందు లవము మొదలగు భేదము లున్నవి. ఆ భేదానుసారమున వసంతాదిసమయములలో

మహోదయనులగు వినోదము లెన్నియో కలవు. శృంగారమునందు హాస్య బీభత్సము లందును వినోదములు నానారూపములు కలవు. సుఖభోగు లయిన మానవులకు రౌద్రమునందు నన్యూనముగ వినోదము లుండును. ఒక్కొకచో బీభత్సమున నాయకాభాసవినోద ముండును. భయానకము నందును శాంతము నందును వినోద మేమియు గోచరింపదు. దేశకాలములు ఈ భయానకశాంత ములు రెండును ఒకప్పుడు సుహృదాదులకును వినోదస్థానములు వినోదనీయ ములు నగును.

అష్టమీచంద్ర శక్రార్చా వసంతమదనోత్సవాః. 69

వకులాశోకవిహృతిః శాల్మలీమూల ఖేలనం
ఏతే వాసంతికాః ప్రాయో వినోదా రసికోచితాః. 70

1. వసంతసమయమున వినోదప్రాయములుగా నుండునవి యిందున్నవి. వసంతకాలమున అష్టమీచంద్రపూజ దేవేంద్రపూజ వసంతోత్సవము మదనోత్సవము వకులవిహారము అశోకవనీవిహారము శాల్మలివృక్షమూలమున ఖేలనము అను నివి సామాన్యముగా వసంతకాలమునకు సంబంధించిన రసికోచితము లయిన వినోద విధానములు. ప్రాయఃపదమునకు సామాన్యముగా ననుట యిట్టివి యింకను గలవని భావము.

ఉద్యానయాత్రా సలిలక్రీడా పుష్పాపచాయికా
నవామ్రఖాదికా చూతమాధవీనవసంగమః. 71

ఏతే ప్రాయో వినోదాః స్యుర్నిదాఘే సుఖభోగినాం
క్రీడాశిఖండిలాస్యం చ కాదమ్బకలహో మిథః. 72

నవామ్బుదాభ్యుద్గమనం నవోద్గాభ్యుద్గమోత్సవః
కాలాగురు ద్రుమోల్లాసి నవపల్లవ భంజనమ్. 73

ఏతే వినోదాః కథితాః ప్రావృషి ప్రీతిమేయుషాం
చతుర్థీకందుకక్రీడా చంద్రికా లాలనోద్యమః. 74

మృణాలవారికం కేలిః హంసలీలావలోకనం
యక్షరాత్రి బలిక్రీడా సరిత్పులిన కేలయః. 75

ఏతే వినోదాః కవిభిః ప్రాయః శరది కల్పితాః
ప్రాబోధికా దేవతానాం దోలాలీలావలోకనమ్. 76

మాతులుంగఫలైః తత్తత్పానకాసవకౌశలం
క్రీడాశకుంతసంఘాత బాలాతపవినోదనమ్. 77

ఏతే వినోదాః కథితాః హేమంతే కావ్యవేదిభిః
ఆలాపాభ్యసనక్రీడా శుకశారికయోర్మిథః. 78

బాలకుక్కుట మేషాది యుద్ధనైపుణదర్శనం
పురాణసీధుపానాది నవాన్నోత్సవ కల్పనా. 79

ఇత్యాదయో వినోదాః స్యుః శిశిరే రాగదీపనాః

ఇచట గ్రీష్మాదిఋతుపంచక వినోదములు కీర్తితము లయినవి. 2. గ్రీష్మములో ఉద్యానయాత్ర, సలిలక్రీడ, పుష్పాపచయము, నవరసాలాస్వాదము, చూతమునకు మాధవీలతకు నవసంగమము సామాన్యముగా సుఖభోగులకు వినోదములు. 3. వర్షాసమయములో క్రీడామయూరలాస్యము, పరస్పరము కాదంబకలహము-మద్యనిమిత్తక మయిన కలహము, నవమేఘము లావరించుట, క్రొత్త నీరు వచ్చుట వలని వేడుక, కాలాగురువృక్షము లందలి నవపల్లవముల భంజనము అనునవి ప్రీతిభాజనుల వినోదములు. 4. శరత్కాలమున చతుర్థికందుక క్రీడ, చంద్రికాలాలనోద్యమము, మృణాలలీలలను, వారివిలాసములను, కంకేళి విలాసములను, హంసలీలలను దర్శించుట, యక్షరాత్రిక్రీడ, బలిక్రీడ, సరిత్కేళి, పులినకేళివిశేషములు మొదలగునవి సామాన్యముగా సంపాదితము లయిన వినోదములని కవులు నిరూపింతురు. 5. హేమంతఋతువులో దేవతా ప్రాబోధికము లయిన సుప్రభాతగీతములు, ఊయెలల లీలావలోకనము, తత్తత్పానకములను ఆసవములను మాతులుంగఫలములతో సేవించు కౌశలము, క్రీడాశకుంతములతో బాలాతపసమయములలో వినోదనము, ఈ మొదలగునవి వినోదములని కావ్యవేదులగు కవులు నిరూపించిరి. 6. శిశిరఋతుసమయములో లావకము కుక్కుటము మేషము మొదలగు వాని యుద్ధముల నైపుణము దర్శించుట, ప్రాచీనములగు మద్యముల పానాదులు, నవాన్నోత్సవముల కల్పనము మొదలగు నవి రాగదీపనము లయిన వినోదములుగా నిర్ణీతము లయినవి.

ఇట్టి వినోదముల నింకను తత్తద్దేశనియతి ననుసరించి సమాయోజన మొనరింప వచ్చును. ఆ యా ఋతువులలో నా యా దేశముల గలుగు విశేషము లన్నియు రాగదీపనము లగు వినోదములు కాజాలవు. సామయికము

లన్నియు నిట్లు వినోదములు కావు. రాగదీపనవినోదములను కాళిదాసాదులు దండి ప్రభృతులు బాణప్రముఖులు నిరూపించిరి. కామసూత్రమున నిట్టివి గలవు. కావ్యశాస్త్రవిదులును కవిసమయ సంకేతమున నిట్టివాని సమాకలన మొనరించిరి.

సంభోగ స్వరూపము

స్థిరానురాగయోర్యూనోర్వినోదై రేవమాదిభిః. 80

పరస్పరోపచారైశ్చ సంభోగః పుష్టిమశ్నుతే.

స్థిరమగు ననురాగము కల ప్రేయసీ ప్రియులకు ఏవంప్రాయము లయిన వినోదములచే తదనుసరణమున వారు కూర్చుకొను పరస్పరోపచారములచే సంభోగము పరిపోషము పొందును. స్థిరానురాగముండుట యువావస్థలో నుండుట పరస్పరోపచారములతో నుండుట తత్తదృతుస్వభావసముచితము లయిన వినోదము లుండుట వారి భోగసంభోగములకు పుష్టి తుష్టి సంపాదించును.

స సంభోగశ్చతుర్ధా స్యాద్భుజిధాత్వర్థయోగతః. 81

భుజిః పాలనకౌటిల్యాభ్యవహారానుభూతిషు
నవరాగానంతరజః పాల్యోఽభీష్టోపచారతః. 82

మానానంతరసంభోగః కౌటిల్యం న త్యజేత్క్వచిత్
హృద్యః ప్రవాసానంతరోఽప్యహృద్యాన్నాభ్యవహారవత్. 83

కరుణానంతరభవః సవిస్రంభానుభూతికృత్

పుష్టము పరిపుష్టము నయిన సంభోగము భుజధాత్వర్థసంబంధమున నాలుగు విధములు. "భుజిర్భోగే" భోగార్థక మయిన భుజిధాతువు వలన భోగ పదము సిద్ధమయినది. సమ్ పూర్వకమైన "సంభోగ"మయినది. పాలనము-కౌటిల్యము-అభ్యవహారము-అనుభూతియను నర్థములందు భుజి ధాతువు వర్తించును. నవీనమగు ననురాగమున సముత్పన్న మయిన సంభోగమున అభీష్టములగు నుపచారము లుండుట వలన సంభోగము పాల్యమగును. పాల్యము పాలింప దగినది. సంప్రాప్తమయిన సంభోగమును చక్కగా నుపచార కౌశలమున పాలించుట నిరంతర ముపచారసంపన్న సముచిత సముల్లాసమున ననువర్తించుట యుక్తము. నవానురాగము మానము ప్రవాసము కరుణము నను విధమున విప్రలంభము

నాలుగు విధములు కావున నందు నవానురాగోద్దేశమున సంభోగము పాల్యమగుట నిర్దిష్ట మయినది. విప్రలంభానంతర సంభోగమున రమణీయతాతిశయ మున్నది. కావున నాలుగు విధము లయిన విప్రలంభములు యనంతరకాలీన మయిన సంభోగము చతుర్విధ మగుట యుక్తము. కావున నవరాగానంతరసంభోగము మానానంతరసంభోగము ప్రవాసానంతరసంభోగము కరుణానంతరసంభోగ మని సంభోగము చతుర్విధము కాగా పాల్యాదివిశేషములు తత్సంబద్ధములై విశిష్టస్వరూపమును సంపాదించుట యున్నది. నవరాగానంతర సంభోగము పాల్యము. మానానంతరసంభోగమున కౌటిల్య ముండుట, ప్రవాసానంతరసంభోగమున నభ్యవహారప్రాయత యుండుట, కరుణానంతరసంభోగ మనుభూతికారి యగుట యుక్తము. దాని నిట్లు పరిగ్రహించునది.

మానాంతరసంభోగము కుటిలము. ఎప్పుడు నది కౌటిల్యము త్యజింపదు. ఇందలి ప్రేమ కుటిలము. మానమున కౌటిల్యమున కలవడిన ప్రేయసీప్రియులు అనంతరసంభోగమున గూడ నంతర్నిహితకౌటిల్యభావ సమువేతులై యుందురు. ఆమె మానవతి యగునని యాతడు, ఆతడు మఱల మానకలుషితు డగునేమో యని యామె కించిత్కలుషభావమున నుండియు సంప్రాప్త మయిన సంభోగానందసంభావను లగుదురు.

ప్రవాసానంతరసంభోగ మత్యంతము హృద్యము. సర్వవిస్మృతి సంపాదకము. ఆకలిగొన్నవానికి హృద్యమగు నభ్యవహారము వలె ప్రవాసానంతర భోగు లన్యమేమియు మనసున నుంచుకొనరు. ఏకాగ్రచిత్తులై సంభోగరస మాస్వాదింతురు. ప్రవాససమయమున భావించి భావించి పేర్చుకొనిన కూర్చుకొనిన చేర్చుకొనిన ఇష్టభోగముల నన్నిటిని శతగుణితముగా ననుభవింపదలంతురు. "అట్లొనరింతును. ఇట్లొనరింతును. అట్లొనరించిన నిట్లొనరింతును" అని భావించుచు హృద్యముగ సంభోగ మనుభవింతురు. పురుషకృతసంభోగము స్త్రీకృత సంభోగ ముభయకృతసంభోగ మిచట సంభోగసామ్రాజ్యము నెలకొల్పును. కావుననె యిది హృద్యము. అభ్యవహారము కణకణమున పుష్టినితుష్టిని కూర్చునట్లు ఈ హృద్యసంభోగమును క్షణక్షణమున పుష్టిని తుష్టిని సంతుష్టిని కూర్చునని భావనీయము.

కరుణానంతరభవసంభోగము విస్రంభముతో కూడుకొనిన యనుభూతిని సంపాదించును. ఈ సమయమున కాలుష్య మేమియు నుండదు. ఆశా

రాహిత్యమున వ్యథితులై నిరపేక్షస్వభావు లయిన వారు ప్రత్యుజ్జీవితప్రియ సంబంధమున ఆశాసహితులై సాపేక్షభావులై యిష్టాభీష్టభోగము లనుభవింతురు. పూర్వాచరితసంభోగ ప్రక్రియల నన్నిటిని సానుసంధానమున స్వానుసంధానమున ననుభవమున నందుకొందురు. అనుభూతిసర్వస్వము వీరి యధీనము. కావున నీ సంభోగ మనుభూతికృత్.

స మిత్రః సంకరశ్చైవ సంపన్నశ్చ సమృద్ధిమాన్. 84

ఇత్యాద్యాః కవయః ప్రాయః చతుర్ణాం చ ప్రయుంజతే
నవానురాగే యువభిరుపచారః ససాధ్వసైః. 85

మితం ప్రయుజ్యతే యస్మాత్తతః స మిత ఉచ్యతే
మానానంతరసంభోగో వ్యలీకాదిస్మృతేః పునః. 86

సంకీర్యతే యతస్తస్మాత్ససంకర ఇతీరితః
సంపన్నకామైరాయాతైః ప్రోషితై రుపభుజ్యతే. 87

సంపన్న ఏవ తత్తస్మాత్సంపన్న ఇతి కథ్యతే
ప్రత్యుజ్జీవనహర్షాదేః ప్రవృత్తే మృతజీవయోః. 88
దీపనాతిశయైర్దీప్తః సంభోగః స్యాత్సమృద్ధిమాన్

అయోగ వియోగానంతర సంయోగముల లోని విశేషములు కొన్ని సూచితము లయినవి. వానిని స్వరూప పరిష్కార పురస్సరముగా నిరూపించుట యుచితము. అట్టి సంయోగము నాలుగు విధములు. మితము సంకరము సంపన్నము సమృద్ధిమాన్ అని. ఇత్యాదివిశేషము లింక నుండును. వీనినన్నిటిని కవులు నవానురాగ మాన ప్రవాస కరుణముల యనంతరభావి సంభోగవిధానములకు సంబంధింప జేసి చూపుచున్నారు. సామాన్యముగా నిట్టి ప్రయోగరీతి కవుల కావ్యములందు గోచరించుచున్నది.

నవానురాగమున స్త్రీపురుషులు సాధ్వసయుతముగా నుపచారముల ననుసరింతురు. ఆ యుపచారములను మితముగ ప్రయోగింతురు. కావున వారి సంభోగ మది మితము. బాహ్యోపచారము లంతగ నుండవు. అంతరసంభోగమునె యనుసరింతురు. అదియు పరిమితము. మానానంతరసంభోగము నందు ఒకరి యొకరి వ్యలీకాదులను నాయికానాయకులు మఱల మఱల స్మరించుచునే యుందురు. వారి సంభోగము వ్యలీకాదిమిశ్రముగ నుండును. అసంకోచముగ

నుండదు. ఆమె మానకృతము లయిన విశేషముల నాతడు మనసున భావించు చునే భోగవ్యాపృతు డగును. ఆమెయు నాతని వ్యలీకములను భావించుచునే భోగానుభూతి ననుభవించును. భోగసమయమున గూడ వ్యలీకాదుల స్మరణ మున్నందున నిది సంకీర్ణము. ప్రవాసానంతరము సందలి సంభోగమును సంపన్న మందురు. నాయికానాయకులు సంపన్నకాములు. ఇదివరలో ననేకవిధముల కామఫలమును సంభోగసుఖమును పూర్ణముగ ననుభవించిన వారు. ఏదేని కార ణమున ప్రోషితులై పునస్సంగతు లయినపుడు పూర్వానుభూత కామసంపదల నన్నిటిని శతగుణితముల నొనరించుకొని సంభోగ మనుభవింతురు. కావున వారి సంభోగము సంపన్నభోగము. కరుణానంతర సంభోగము సమృద్ధము. నాయిక మరణించి ప్రత్యుజ్జీవిత యయినప్పుడు, నాయకుడు మరణించి ప్రత్యుజ్జీవితు డయినప్పుడు నిది సంభవించును. మరణించిన పిమ్మట జీవించిన నాయికానాయ కులకు ప్రత్యుజ్జీవనమున హర్షాదు లుదయించును. ఇట్టి హర్షాదుల వలన వారి సంభోగము ప్రవృద్ధ మగును. దీపనాతిశయములచే దీపిత మగును. కావున నిది సమృద్ధ మయిన సంభోగము.

## వైమనస్యాదులు

స్నేహో యత్ర భయం తత్ర యత్రేర్ష్యా మదన స్తతః. 89
వైమనస్యం వ్యలీకం చ స్నేహతో భయతో భవేత్
ఈర్ష్యాయా మదనాచ్చాపి విప్రియం మన్యురుద్భవేత్. 89

యన్మ్లాయతి మనస్తాపాదాతపమ్లాన సస్యవత్
తద్వైమనస్యం స్నేహేఽపి స్నేహాలంబనదోషతః. 90

సరసవ్రణసంభిన్నం రాత్రిజాగరణాలసం
ప్రియం ప్రభాతే పశ్యంత్యా వైమనస్యం ప్రజాయతే. 91

రోషః స్వేదశ్చ కంపశ్చ ముఖే వైవర్ణ్యమేవ చ
మాత్స్వాప్సీః శోభనం సాధు గచ్ఛేతి వచనం భవేత్. 92

శృంగారోపయుక్తము లగు వైమనస్యాదిభావములు కొన్ని కలవు. వాని ప్రతిపాదన మిచట నున్నది. స్నేహమున్న స్థలమున భయముండును. ఈర్ష్య యున్నచో మదనభావ ముండును. స్నేహమువలన భయమువలన వైమనస్యము వ్యలీకము జనించును. ఈర్ష్యవలన మదనభావమువలన విప్రియము మన్యువు జనించును. ఇందిచట వైమనస్యరూప మున్నది. తాపమువలన మనస్సు

మ్లాన మగును. వాడినట్లగును. లేత సస్యము కోమలసస్య మాతపమువలన మ్లాన మయిన విధమున పరితాపమున మనస్సు మ్లాన మగును. ఇట్లు మ్లానమగుట యె వైమనస్యము. స్నేహ మున్నను స్నేహాలంబము నందలి దోషముల వలన నిట్టి మ్లానత కలుగును. ఇట్టి వైమనస్య ముదయించును. ప్రియుడు పరస్త్రీసరస ప్రణసంభిన్నుడై అన్యవనితా నఖక్షత దంతక్షత సహితుడై రాత్రిజాగరణము వలన నలసుడై ప్రభాతసమయమున రాగా నాతని జూచుచున్న వనితకు చూచు కొలది వైమనస్య ముదయించును. రోషము స్వేదము కంపము ముఖమున వైవర్ణ్యము నుదయించును. "నన్ను తాకకుము. బాగుగా జేసితివి లే! పొమ్ము" అను మాటలు నామె నుండి వెలువడును. ఇట్టి విధానము వైమనస్య నామమున వ్యవహరింపదగి యుండును.

అభీప్సితార్థానుత్పత్తిః వ్యలీకమితి కథ్యతే
నివార్యమాణోఽపి పునః పునరాయాతి యో బలాత్. 93

సంఘర్షాన్మత్సరాత్తస్యా వ్యలీకముపజాయతే
నిధాయ వామం హృదయే కరమన్యం విధూన్వతీ. 94

త్వమిహాస్స్వ! వయం యామ ఇతి రోషాద్బ్రవీతి చ

ఇచట వ్యలీకస్వరూప మున్నది. అత్యంత మిష్టమయిన యర్థ ముద యింపక పోవుట వ్యలీకము అని వ్యవహరింప వలసి యున్నది. నాయిక నాయ కుని "రావలదు! రావలదు" అని మఱల మఱల నివారణ మొనరించినను నాయకుడు బలాత్-బలిమిని పట్టుదలగా వచ్చినచో సంఘర్షపడుట వలన వ్యలీ కము కలుగును. మత్సరము వలనను నామెకు వ్యలీక ముదయించును. వ్యలీ కాత్మక చిత్తతత్త్వముతో నున్న యామె యిట్లనును- "నీ విచట నేయుండుము. మేమే పోయెదము. ఈ యిల్లు విడిచి నేనే దూరముగా నుందును. నీ విచట నీ సుఖానుసారమున నుండుము". అని రోషమున బలుకును. ఇది రోషమున పలుకుట. తనకు గలిగిన రోషమును సూచించుటకు బలుకుట. ఇది వ్యలీకము.

ప్రతిశ్రుతార్థానిర్వహణం యత్తద్విప్రియముచ్యతే. 95
యావజ్జీవమహం దాసః త్వమేవ చ మమ ప్రియా
ఇత్యుక్త్వా యోఽన్యథా కుర్యాద్విప్రియం తత్ర జాయతే. 96

రుదితం క్రోధహసితం దూతాది ప్రేషణం ముహుః
సబాష్పం సశిరఃకంపం కృతం సాధ్వితి వక్తి చ 97

ఇచట విప్రియరూప మున్నది. ప్రియుడు తానాచరించెదనని ప్రియు రాలితో సాదరముగా పలికి యంగీకరించినవానిని నిర్వహింప నందు వలన విప్రియ ముదయించును. ప్రతిశ్రుతార్థానిర్వహణమె విప్రియము. ప్రియుడు నాయికాసమీపమున "యావజ్జీవము నేను నీకు దాసుడను. జీవించి యున్నంత కాలము నీవు చేయు మనిన కార్యములు సర్వమును జేయుదును. నీ వెప్పుడు భోగారంభ మొనరింపు మనిన అప్పుడె సంభోగ మొనరింతును. నీవు రతాసక్త వయినచో నేనుసురతాసక్తుడ నగుదును. ఇట్లునేను నీకు దాసుడను. నీవు మాత్రమే నాకు ప్రియురాలవు. నే నన్యుల పై సమాసక్తుడను గాను నీవు నాకు జీవితము. నీవు నా కన్ను. నీవు నా హృదయము. నీవు నా కన్నుల వెన్నెల. నీవు నా దేహామృతము" ఇత్యాది ప్రియశతములు పలికి ప్రియానురోధమున నుండి పలికిన విధమున నుండక అన్యథా యాచరించినచో నచట విప్రియ ముద యించును. ఈ విప్రియసమయమున నాయికకు రుదితము వెలువడును. క్రోధ ముతో గూడుకొనిన వెలుపలినవ్వు కలుగును. మాటి మాటికి దూతాదులను పంపును. "బాగుగా చేసితివి. బాగుగా జేసితివి. పలికిన పన్నియు జేసితివి" అని యామె సబాష్పముగా సశిరఃకంపముగా పలుకును. ఇట్టిది విప్రియము.

మాన్యావమానితా మన్యురవబోధనిరోధకృత్
సపత్నీరతిసంభోగే సౌభాగ్యం బహుశో వదన్. 98

దృశ్యతే చ పతిర్యస్యాః తత్ర మన్యుః ప్రజాయతే
శంకతే బాష్పపూర్ణాక్షీ రశనాది క్షిపత్యధః. 99

వలయాది ముహుర్బాహ్వోః పరివర్తయతి ద్రుతం
అభాషమాణా శయనే తూష్ణీం శేతేఽవకుంఠితా. 100

ఏవం ప్రవృద్ధమన్యూనాం స్త్రీణాం భవతి విక్రియా

ఇందు మన్యురూప మున్నది. మన్యువు కోపము. మాన్యావమాన మొనరించుకోపము. ఇది యవబోధమును నిరోధించును. విజ్ఞానము కలుగ నీయదు. "నీ సవతులపై ననురాగముతో నున్నప్పుడు వారల సంభోగించు నపుడు చక్కగా నుండును. బాగుగా నుండును. ఆనందముగా నుండును.

సౌభాగ్యము బాగుండును" అని పలుకు పతిని చూడగా నాతని మాటలు వినగా నా వనితకు మన్యువు జనించును. ఆతని సందేహించును. శంకించును. "నా రతి యితని కిష్టము కాదా ? బాగుండదా? నా సంభోగ మిష్టముకాదా ? ఆనంద మీయదా ?" అని మనసున శంకించి బాధపడి బాష్పపూర్ణాక్షియై రశనాదికమును క్రిందపడ విసరి నేల గొట్టును. చేతులందు బాహువు లందున్న వలయాదులను వేగవేగముగా మఱల మఱల ఎడ పెడ త్రిప్పును. పలుకనే పలుకదు. శయనమున శయనించియు నూరకనె శయనించును. ముసుగు వేసికొని శయనించును. సంభోగమున కవకాశ మీయదు. ఇట్లు కోపమభివృద్ధి పొందిన వనితలకు విక్రియలు విరుద్ధక్రియ లుదయించును.

సాపరాధే ప్రియే దృష్టే సలజ్జే చ సశంకితే. 101
సోపాలంభవచోభి స్తం ఈర్ష్యార్థైః ఖేదయేన్మృదు
న నిష్ఠురం వచో బ్రూయాన్నాతిక్రుద్ధ్యేత్కదాచన. 102
న చాతిపరిహాసః స్యాత్సఖీభి స్తేన వా క్వచిత్
బాష్పోన్మిశ్రైః వచోభి స్తమాత్మ నిక్షేప మంథరైః. 103
ప్రతిబ్రూయాదురస్థేన పాణినా స్నిగ్ధవీక్షితైః
నిఃశ్వాసైః సశిరఃకంపైః కటీహస్తతయాఽపి చ. 104
అపరాధై ర్మహీలేఖాగణితై స్తర్జనై రపి

కామాపరాధ మొనరించిన ప్రియుడు కంటికి కన్పడగా చూచి చూచి లజ్జాన్వితుడుగ కన్పించినచో శంకావ్యాకులుడుగ భాసించినచో సోపాలంభవచనములతో నాతనిని మృదువుగా ఖేద పెట్టవలెను. ఈర్ష్యార్థవచనములతో బాధింపవలెను. దెప్పిపొడువు మాటలతో వేదన పెట్టవలెను. అంతియె కాని నిష్ఠుర వచనములు పలుకరాదు, ఎప్పుడు నధికముగా గోపము కలుగునట్లు పలుకరాదు. సఖియలతో గాని యాతనితో గాని యత్యంతము పరిహాసము పనికిరాదు. బాష్పములతో గూడిన మాటలతో నాత్మనిక్షేపము గల మంథరవచనములతో నాతనితో మాటలాడవలయును. అన్ని మాటలందును తన సౌభాగ్యము తనతో రతి తనతో సంభోగముల వలని విశేషములు కల మాటలు పలుక వలెను. చేతిని వక్షఃస్థలమున నుంచి పలుక దగును. ఈ పలుకులలో స్నిగ్ధవీక్షితము లుండుట యావశ్యకము. శిరఃకంపములతో నుండు నిశ్వాసము లపేక్షితములు. కటిభాగము

నందు హస్తము నుంచి యయిన నిట్లొనరింప దగును. ఆతని యపరాధములను భూమియందు లేఖాగణితములచే నిరూపింపదగును. తర్జన మొనరింప వలెను. "నీతో మాటలాడను. నిన్ను తాకను నన్ను తాకవలదు. నీ దగ్గరకు రాను". అనునట్టి వచనములతో బెదిరింప వలెను. కాని "బావిలో పడెదను. నదిలో పడుదును. అగ్నిలో దూకుదును. నా ప్రాణముల విడిచెదను." అను నమంగలవచనముల బలుకరాదు. కోపాతిశయము కలిగినప్పుడు కలుగు మాట లీ విధముగ నిరూపితము లయినవి.

ఏభిరేవ రతిర్యూనోః భూయః స్యాద్భూయసీ మిథః. 105

ఏవం ప్రణయరోషైశ్చ భూయో భూయః సమాగమైః
ప్రవృద్ధో దీపనైర్దీప్తః శృంగారః పుష్టిమశ్నుతే. 106

వైమనస్యాదయో భావాః శృంగారస్యోపయోగినః
ప్రయుంజతే చేదన్యత్ర గౌణ్యా లక్షణయాఽథవా. 107

ఈ విధానములచే యువావస్థలో నున్న ప్రేయసీప్రియులకు మఱల రతి యభివృద్ధి పొందును. పరస్పరము నానావిధముల వారి రతి వృద్ధి పొందును. భూయో భూయః ప్రణయరోషములచే భూయోభూయః సమాగమములచే రతి యభివృద్ధి పొందును. ప్రవృద్ధ మయిన శృంగారము దీపనములచే దీప్తమై పుష్టి పొందును. వైమనస్యాదిభావములును శృంగారమునకు ఉపయోగించునవి యగును. వైమనస్యము వ్యలీకము విప్రియము మన్యువు అను నాలుగును శృంగారవృద్ధి సంపాదకములు. అవి కలిగిన సమయమున విప్రయోగమున్నను దీపనములచే దీపనము పొంది విప్రయోగానంతరము శృంగారము పరిపుష్ట మగును. గౌణీవృత్త్యనుసారమున లక్షణామర్యాదానుసారమున నీవైమనస్యాది సమయసూక్తులు ప్రయుక్తములు కావలెను. ఇట్టివి వాచ్యవృత్త్యవలంబనమున స్పష్టముగా నుండక గౌణీలక్షణానుసారమున నుండుట యుక్తము

ఇంద్రియార్థవిషయముల సుఖరూపము

యద్యైకత్రానుభూయంతే యుగపత్తత్తదింద్రియైః
విషయాః సుఖరూపేణ పుష్యంతి హి తదా రతిమ్. 108

శిరః పార్శ్వోన్నతం దృష్టిః కించిత్సాచీకృతా భవేత్
తర్జనీ కర్ణదేశస్థా శబ్దస్య శ్రవణే నృణామ్. 109

హస్తౌ గండాశ్రితౌ నేత్రే కించిదాకుంచితాంచితే
ఉత్క్షేపశ్చ భ్రువోః కంపః స్పర్శే రోమాంచవిక్రియా. 110

త్రిపతాకః కరో మూర్ధ్ని చలనం కిం విధాననే
ఆకేకరా భవేద్దృష్టిః రూపాలోకనకర్మణి. 111

ఉత్ఫుల్లా నాసికా కించిత్ నేత్రే కిమపి కుంచితే
ఏకోచ్ఛ్వాసశ్చ భవతి రసగంధసమాగమే. 112

ఇంద్రియార్థశ్చ మనసా భావ్యతే త్వనుభావితః

ఇంద్రియార్థవిషయములు సుఖరూపము లగుట యీ ప్రఘట్టమున నిరూపిత మగును. శ్రోత్రేంద్రియము శబ్దమును, త్వగింద్రియము స్పర్శమును, చక్షురింద్రియము రూపమును, రసనేంద్రియము రసమును, ఘ్రాణేంద్రియము గంధమును గ్రహించును. శ్రోత్రాదీంద్రియములకు శబ్దాదులు విషయములు. ఆ యా యింద్రియములకు విషయములుగా నుండునవి ఒకే స్థలమున నొకే సమయమున ననుభూతము లగునేని యప్పుడవి సుఖరూపమున రతిపోషము సంపాదింప గలవు. ఇంద్రియార్థ మనుభావితమైన మనసుచే భావితము నగును. అట్టిమనస్సంబంధి భావము ఇష్టానిష్ట మధ్యాత్మకముగా నుండుట నిర్ణీతము కానున్నది. అట్టి నిర్ణయమునకు పూర్వరంగముగా విషయానుభవము తదభినయాత్మకము అయిన కతిపయాభినయము లిచట నిరూపితము లగుచున్నవని ప్రకృతవిషయ ప్రవేశమునకై గ్రహింప వలసి యున్నది.

పార్శ్వమున కున్నతముగా నున్న శిరస్సు, కొంచెము సాచీకృతమయిన అడ్డముగా కూర్చిన దృష్టి, మానవుల శబ్దము వినుటకై కర్ణదేశగతమయిన తర్జని, కపోలాశ్రయమున హస్తము, కించిదాకుంచితములు అంచితములయిన నేత్రములు, కనుబొమ్మల సముత్క్షేపము, కంపము, స్పర్శ కలుగగా కలిగిన రోమాంచవికారము, శిరమున త్రిపతాకహస్తము, ఆననమున కించిచ్చలనము, రూపాలోకమునకై యాకేకరదృష్టి, ఉత్ఫుల్లమగు నాసిక, కొంచెముగా కుంచితము లయిన నేత్రములు, రసగంధసమాగమమున నొక యుచ్ఛ్వాసము అను పదునాలు గభినయవిశేషము లిచట నిర్దిష్టము లయినవి. ఇవి తత్తద్విషయానుభవమున గలుగు నభినయములు. విషయానుభవమున గలిగిన యభినయముల భావింపగా నప్పటివారి మనఃస్థితి స్వరూపము గోచరించును.

ఈ ప్రసంగముననె మనసునకు సంబంధించిన భావభేదముల నిరూపణము ప్రసక్తము.

## మనోభావములు

మనసస్త్రివిధో భావః కథ్యతే పూర్వసూరిభిః. 113

ఇష్టోఽనిష్టశ్చ మధ్యశ్చేత్యేవం త్రేధా విభిద్యతే
ఇష్టే తు విషయే గాత్రాహ్లాదనైః పులకోద్గమైః. 114

మనోహరాభిశ్చేష్టాభిరిష్టం భావం వినిర్దిశేత్
అనిష్టే విషయే తత్ర నాసాగ్రాంచితకూణనమ్. 115

శిరసశ్చ పరావృత్తిరప్రదానం చ చక్షుషః
గాత్రస్తంభో జుగుప్సా చ భావేఽనిష్టే భవంతి హి. 116

న సౌముఖ్యం న వైముఖ్యం నాతిహర్షో న కుత్సనం
మాధ్యస్థ్యం మనసో హ్యేవం మధ్యస్థే విషయే భవేత్. 117

మనసునకు మూడు విధములగు స్వభావము లిట్టి పట్టుల నుండునని పూర్వసూరు లంగీకరించిరి. ఇష్టము, అనిష్టము, మధ్యము అని త్రిధావిభాగము కలదు. ఇష్టవిషయము నందు దేహము నాహ్లాదపెట్టు పులకోద్గమములతో, మనోహరములగు చేష్టావిశేషములతో నిష్టభావమును నిర్దేశింప వలెను. అనిష్ట విషయమునందు నాసాగ్రాంచితకూణనము ముక్కుచివరముడి వేయుట, శిరమునకు పరావృత్తి దృష్టిప్రసారము లేకుండుట, గాత్రస్తంభము, జుగుప్స యనునవి యనిష్టభావ మున నుండును. మధ్యస్థమయిన విషయమున మనసునకుగల మాధ్యస్థ్య మీ విధముగ నుండును-సౌముఖ్య ముండదు. వైముఖ్యము నుండదు. అతిహర్ష ముండదు. కుత్సనము నుండదు. ఇది మనోమాధ్యస్థ్యము.

కథితా యే త్వభినయా విషయానుభవాత్మకాః
తేఽపి దూర సమీపస్థ సూక్ష్మవ్యవహితాత్మనా. 118

పృథక్స్థితాస్త్వేకదా స్యుః కదాచిత్స్యుః సముచ్చితాః

ఇట్లు నిరూపితము లయిన విషయానుభవాత్మకము లగు నభినయము లన్నియు నొకప్పుడే కలుగుట యున్నది. ఇందు కొంత వివేకము కలదు. దూర గతములుగా సమీపగతములుగా సూక్ష్మవ్యవహితములుగా నుండుట యున్నది. ఇట్టివిధమున నుండు నివి పృథక్స్థితము లయినచో వేరువేరుగా నుండుచో నుండు రీతి యొకటి యున్నది. అన్నియు నొకే సమయమున సముచ్చితము లగుట

యను స్థితియు నున్నది. వేరు వేరుగా నొకప్పుడును సముచ్చితముగా నొకప్పుడు నుండు నని భావము గ్రహింప దగును.

## మానచేష్టలు

ప్రియాపరాధే యాః కాశ్చిదవస్థాః కథితా అపి. 119

విశేషః కథ్యతే తాసాం కల్పవల్ల్యనుసారతః
యూనోస్తు రక్తయోర్మానవిరహే గోత్రవైకృతే. 120

వివేష్టనం ప్రియస్పర్శే నిర్భర్త్సన మభాషణమ్
శయ్యాంతే చ పరాక్శయ్యా స్వేదో గద్గదభాషణమ్. 121

ఏతే ప్రాయేణ భావాః స్యుర్భోగాంకే శ్రేష్ఠయోషితాం

ప్రియాపరాధవిషయమున గొన్ని యువతులయవస్థలు నిరూపితము లయినవి. అయినను వాని విషయమున గొంత విశేష మున్నది. ఆ విశేషము నిచట కల్పవల్లీగ్రంథానుసారమున నిరూపింతుము.

రాగరక్తు లయిన ప్రేయసీప్రియులకు మానాత్మక విరహమున గోత్రస్ఖలనరూప మగు విక్రియ యుదయింపగా వివేష్టనము-ప్రక్కపై పొరలుట దొరలుట యుండును. అప్పుడు దగ్గరనున్న ప్రియుడు స్పృశించినచో నిర్భర్త్సన ముండును. సంభాషింపక పోవుటయు నుండును. శయ్యాంతమున పరాక్శయ్య-వెనుదిరిగి పరుండుటయు నుండును. స్వేద ముదయించును. గద్గదభాషణ ముండును. శ్రేష్ఠవనితలకు భోగశయ్యపై నిట్టి భావములు సామాన్యముగా గలుగు చుండును. ఇట్టి వన్నియు మానవిరహమున గలుగు విక్రియలని గుర్తింపవలెను.

అవాఙ్ముఖమవస్థానం నిశ్వాసో బాష్పమోచనమ్. 122

విలోకనం చ సఖ్యాదేః సాధు సాధ్వితి భాషణం
ఏవం భావాః స్యుః స్వప్నాపరాధే గోత్రవైకృతే. 123

ఇవియు మానవిరహసమయము నందలి శ్రేష్ఠవనితా విక్రియలు. ఇందలి ప్రియాపరాధము గోత్రవైకృతముతో నున్న ఉత్స్వప్నాపరాధము. అతడు ప్రక్కనే పరవశుడై పరుండియు కలవరింతలో నన్యవనితా నామోచ్చారణ మొనరింపగా భోగానంతరము సుఖస్మృతి భావనానంద మనుభవించు వనిత ఉత్స్వప్నా

యుతము విని అవాఙ్ముఖముగా నుండును. నిశ్వసించును. బాష్పములు విడుచును. సఖ్యాదులను విలోకించును. సాధు ! సాధు ! బాగు ! బాగు ! అని పలుకును. అట్టి భావము లీ యపరాధమున నుండును.

మానవియోగము నందలి స్వప్నాపరాధసమయమున నింకను మనోహారము లగు భావవిక్రియలు కలవు. వాని నిట్లు గుర్తించునది.

ఉత్థానం శయనాద్దూరశయనం చ వివేష్టనం
అపాంగవిగలద్బాష్పమస్తః స్తంభితరోదనమ్. 124

ఏతే విశేషతః స్వప్నాపరాధే స్యుర్మనోహరాః
ఏవం మానవియోగే స్యుః. - - - - - 125

శయ్యనుంచి లేచుట దూరముగా శయనించుట వివేష్టనము అపాంగముల నుండి బాష్పములను జార్చుట లోలోపలనే రోదనము స్తంభింపజేయుట అను నిట్టివి విశేషముగ మనోహరవికారములు

- - - ప్రవాసవిరహే పునః
ఆకస్మికే తు హృత్కంపో మూర్ఛా సంజ్ఞా భ్రమః స్మృతిః. 126

తదన్వేషణచింతా చ తత్పథాశావిలోకనం
విరహే సంభ్రమోత్థే తు విషయాపరినిశ్చయః. 127

దైవికే కార్శ్యసంతాప దేవతార్చన జాగరాః
వైవర్ణ్యమంగదాహశ్చ ప్రలాపోఽశ్రువినిర్గమః. 128

ఆకస్మికవియోగే స్యుర్వికారాశ్చైవమాదయః
విరహే బుద్ధిపూర్వే తు జాడ్యనిర్వేదదీనతాః. 129

వైవర్ణ్య కార్శ్య మాలిన్య సంతాప జ్వర మూర్ఛనాః
వ్యాధ్యున్మాదవిషాదాశ్చ శాపేఽప్యేతే చ కీర్తితాః. 130

విరహము మానకృతము ప్రవాసకృతము. ఆకస్మికవిరహము సంభ్రమోత్థవిరహము దైవికవిరహము బుద్ధిపూర్వకవిరహము శాపకృతవిరహము నని యిచట విరహభేదము లున్నవి. ప్రవాసవిరహ మాకస్మికవిరహము లందు హృత్కంపము మూర్ఛ సంజ్ఞ మఱల భ్రమ స్మృతి కలుగును. ప్రియు నన్వేషింపవలె నను చింత యుదయించును. ఆతని మార్గదిశావిలోకన ముండును. సంభ్రమ

జన్య మయిన విరహమున విషయనిశ్చయము లేకపోవుట యుండును. దైవిక విరహము నందు కార్శ్యము సంతాపము దేవతార్చనము జాగరము వైవర్ణ్యము అంగదాహము ప్రలాపము బాష్పోదయము మొదలగునవి కలుగును. ఆకస్మిక వియోగము నందును నిట్టివికారము లుండును. బుద్ధిపూర్వకవిరహములో జాడ్యము నిర్వేదము దీనత కలుగును. వైవర్ణ్యము కార్శ్యము మాలిన్యము సంతాపము జ్వరము మూర్ఛ కలుగును. వ్యాధ్యున్మాదవిషాదములు కలుగును. శాపకృత మయిన విరహము నందు నివి యుదయించును. ఆ యా విరహము లలో శ్రేష్ఠవనితలకు గలుగు వికారము లీ విధముగా నుండును. మధ్యమవనితల కీ చెప్పబోవు విధమున నుండును.

మధ్యమానాం తు నారీణామీర్ష్యారోషోత్తరం వచః
సోపాలంభం చ పరుషం మానాదిషు విభావ్యతే. 131

అధమానాం తు నారీణాం కేశాకర్షణతాడనం
బంధనం పరుషం వాక్యం ప్రాయః సర్వత్ర దృశ్యతే. 132

ఆస్వవస్థాసు కథితా యే యే భావాః పృథక్పృథక్
అయోగవిరహస్యైతే కథ్యతే భావకోవిదైః. 133

మధ్యమవనితలు ప్రియు డొనరించిన యిట్టి కామాపరాధసమయము లలో నీర్ష్యాబహులముగా రోషోత్తరముగా మాటలు పలుకుదురు. దెప్పిపొడుపు మాటలు పలుకుదురు. పరుషముగా పలుకుదురు. మానాది సర్వవిరహము లందును వారిట్టి రీతినె యవలంబింతురు. అధమవనితలకు వేరొక విక్రియ యున్నది. జుట్టు పీకికొందురు. వానిజుట్టు లాగుదురు. బాదు కొందురు. వానిని కొట్టుదురు. సామాన్యముగా నిట్టి రీతు లంతట కన్పించు చున్నవి. ఇట్టి విక్రియావిశేషము లను గుర్తించి యుత్తమామధ్యమాధమా స్వరూపము నిశ్చయించునది. ఈ యవస్థలలో వేరువేరుగా నిరూపితము లయిన భావములు అయోగవిరహమునకును సంబంధించి యుండునని భావకోవిదు లందురు.

ఏవం విభావ్య బధ్నంతు ప్రబంధాన్ కవిపుంగవాః
అన్యథా యది వైరస్యం జనయంతి మనీషిణామ్. 134

ఇంతగా నీ భావశృంగారము నిరూపించుట యంతయు కవుల కుప దేశాత్మకము. శృంగారభావనిరూపణమున కవు లత్యంతము సావధానులుగా నుండ

వలెను. ఇందు స్వేచ్ఛాయ యానుపూర్వకము. ఎట్టివారి కెట్టి విక్రియలుకూర్పదగునో చక్కగా సమీక్షింపవలెను. ప్రాచీనము లయిన మహాకవుల గ్రంథములను పరిశీలించి యీ విక్రియాప్రక్రియ నిరూపిత మయినది. వీనినన్నిటిని సవిశేషముగా భావించి కవిపుంగవులు ప్రబంధములను బంధింపవలసియున్నది. ఈ నిరూపితముల యాధారమున వారును స్వయముగా సమీక్షించి కావ్యబంధములను కూర్పవలెను. శృంగారభావనిరూపణము నందలి యస్వచ్ఛత యల్పమయినను సహృదయుల కుద్వేగ ముత్పాదించును. ఈ యంశ మిందు ముఖ్యముగ నిట్లు సూచిత మయినది.

అన్యథా యది వైరస్యం జనయంతి మనీషిణామ్

ఈ నిరూపించిన విషయముల నన్నిటినిసావధానముగ సంభావించి కవిపుంగవులు కావ్యబంధముల కూర్పక పోయినచో కవులు తమ కావ్యము లందు రసోత్తరము లయిన భావశృంగారరీతులను నింబంధింపక పోయినచో కావ్యాభాసము లనదగిన యట్టి కావ్యములు మనీషామహనీయులకు వైరస్య ముత్పాదింప గలవు. కొన్ని కావ్యములలో విక్రియావిక్రియ లున్నవని తన్నిదర్శనమున నీ ప్రక్రియను విడనాడరాదు.

## రసము - వాక్యార్థము

ఇంతగా నిట్లు నిరూపితము లయిన రసములకు వాక్యార్థత్వాదిక మున్న దనుట ప్రతిపాద్యము. కావ్యరసములకు గల పరస్పరసంబంధము వివేచనీయము.

ఏవముక్తస్వరూపాణాం రసానామర్థతత్త్వతః
వాక్యార్థతా వ్యంగ్యతా కథ్యతే శాస్త్రవర్త్మనా. 136

రసవంతి హి కావ్యాని సాలంకారాణి కానిచిత్
ఏకేనైవ ప్రయోగేణ నిర్వర్త్యంతే మహాకవేః. 137

యథా గంగాదిసలిలం నానారూపరసాత్మకం
ఆత్మభావం నయేదంతఃప్రవిష్టం లవణాకరః. 138

భావో భావాంతరాణ్యాత్మభావం స్థాయీ తథా నయేత్
వేధకైః స్వైతరేషాం చ భావైః స్వైరతిరస్కృతః. 139

యావత్ప్రబంధానువృత్తిః స్థాయీ రత్యాదిరుచ్యతే

ఇట్టి స్వరూపసంపత్తి కల రసములకు కావ్యమున వాక్యార్థత యున్నది. వ్యంగ్యత యున్నది. ఇట్టి యీ విషయమును శాస్త్రానుసారముగా శాస్త్ర మార్గమున నిరూపింతుము. ఈ నిరూప్యమాణ మంతయు శాస్త్రతత్త్వానుసారి. ఇంతవఱకు చెప్పిన దంతయు లోకధర్మానుసారి. కేవల లోకధర్మానుసరణమున నిబంధనము కావ్యములకు సౌష్ఠవము నీయ జాలదు. రసములకు కావ్యమున వాక్యార్థత యున్నది. పదముల సమూహము వాక్యము. పదార్థముల సముదాయము వాక్యార్థము. విభావాదు లన్నియు పదార్థాత్మకములు. రసము వాక్యార్థాత్మకము. రసములు కావ్యమున వ్యంగ్యములు. లక్ష్యములు కావు వాచ్యములు కావు. రసములకు వాక్యార్థత యున్నదని నిరూపితము కాగలదు.

రసవత్కావ్యములు కలవు. సాలంకార సరసకావ్యములు కలవు. ఇట్టి వన్నియు మహాకవి యొక్క యేకప్రయోగముననె నిర్వర్త్యమానములు కాగలవు. రసనిబంధనైకహృదయుడగు కవి యేకప్రయత్నముననె సకలము నిర్వహింపగలడు. రసనిబంధనమునకగు యత్నముననె సర్వనిబంధనము సుసాధమగును. ఇందీనిదర్శనము భావనీయము. లవణాకరమగు మహాసముద్రము, నానారూప రసాత్మక మయినగంగాదిసలిల మంతఃప్రవిష్టము కాగా నాత్మభావమునె యా గంగాసలిలమున కాపాదించును. అప్పు డంతఃప్రవిష్టజలము స్వీయమాధుర్యము రూపరసములనువిడనాడి సముద్రరూపరసములనే పొందును. అట్లే స్థాయిభావ విషయమున పర్యాలోచన మొనరించునది. కావ్యము నందలి స్థాయిభావము సముద్రము. ఇతరభావములు గంగాదిసలిలములు. స్థాయిభావము భావాంతరములకు ఆత్మభావమునే కలుగజేయును. స్థాయి సజాతీయ భావములచే నతిరస్కృత మగును. వేధకములగు నితరభావములచేగాని స్వీయభావములచేగాని స్థాయి యతిరస్కృతమె యగును. రత్యాదికము ప్రబంధపర్యవసానపర్యంత మనువృత్తమై స్థాయి యగును. అది యితరభావముల కన్నిటి కాత్మభావము సంపాదించును. ఇట్టి స్థాయి నిబంధన ప్రవృత్తు డగు మహాకవి స్థాయినిబంధనమున కగు నేకప్రయోగముననె సర్వము నిర్వహించును. సర్వము స్థాయిపర్యవసానము పొందును. కావున రసము వాక్యార్థము.

## రసద్వయసమావేశము

ఏకస్మిన్రసయోర్వాక్యే ముక్తకే కులకాదిషు. 140
ద్వయోరుపనిపాతేఽన్యః ప్రధానమితరో గుణః
ద్వయోస్తుల్యవదుత్పత్తౌ సంసర్గాలంకృతిస్తు సా. 141

కాక్వా విశేషణేనాథ విభావాదిబలేన వా
ప్రాబల్యం యస్య దృశ్యేత తస్య ప్రాధాన్యమిష్యతే 142

యత్రకాకువిశేషోఽపి న స్యాత్తద్దుష్టమేవ హి
తుల్యవద్భావయుగలప్రతీతిర్యత్ర దృశ్యతే. 143

శ్లేషరూపేణ తద్వాక్యే వాక్యద్వితయస్య దర్శనాత్
రసభేదప్రతీతిస్తు యది స్యాద్గుణ ఏవ సః. 144

ఒకస్థలమున రసద్వయ సమావేశ మున్నప్పుడు భావింపవలసిన విధాన మిచట నిర్దిష్ట మగును. ఏకవాక్యమున నొక ముక్తమున కులకాదులలో రెండు రసముల సమావేశ సనిపాత మున్నప్పుడు ఏ రసమును వాక్యార్థముగా భావింప వలెను ? రెండు రసములను వాక్యార్థములుగా భావించుట యుపపన్నము కాదు కదా ! ఒకవాక్యమున వాక్యార్థ మొకటియే యుండును. అట్లు కానిచో నైకార్థ్యభంగము వాటిల్లును. అది దోషము కావున రసద్వయసమావేశమున నెటు భావింపవలసి యుండునో యిం దున్నది. రసద్వయ సమావేశ మున్నపు డొకరసము ప్రధాన మగును. అన్యరస మప్రధాన మగును. ప్రబంధప్రక్రాంత మగునది యుపసంహారపర్యవసాన మగునది ప్రముఖాస్వాద్యమాన మగునది చమత్కారక మగునది ప్రధానరస మగునని, యితరము గుణభావము బొందునని పూర్వము సూచిత మందునది. ఆ రీతి నిచట స్మరింప వలెను. నిరూపితము లయిన రెండు రసములను తుల్యరూపముగా నవభాసించునేని గుణప్రధానభావము అంగాంగిభావము ప్రతిభాసింపదు గావున సంసర్గాలంకార మగును. రసములకు ప్రధానత భాసింపదు గావున రసవ్యవహారము కలుగదు. ఆ రెండు రసములు సంసర్గము కలవయినందున సంసర్గాలంకార మగుటయే యుక్తము. ఇట్టి స్థలమున రసేతరము వాక్యార్థీభావము పొంది యుండునని గ్రాహ్యము.

ఒక రసము ప్రధాన్యము కాగా దాని ప్రాధాన్య నిమిత్తము నిట్లు భావింపజనును. కాకువుచే గాని, విశేషణమున గాని, విభావాదులబలమున గాని యే రసమునకు ప్రాధాన్యము గోచరించునో యచట నా రసమునకు ప్రాధాన్య మున్నదనుట యభీష్టము. కాకువిశేషమేని లేకున్నచో నా వాక్యము దుష్టమె యగును. తుల్యవద్భావము కలరెండు రసముల ప్రతీతి యున్నస్థలమున శ్లేషరూపమున వాక్యద్వయము భాసించును. రసభేద ప్రతీతి కలుగును. వాక్యద్వయ భావమున రసభేదప్రతీతి యచట గుణమె యగును.

ఈ విషయస్వరూప విస్తరమును ధ్వన్యాలోకమున ద్వితీయోద్యోతమున "క్షిప్తో హస్తావలగ్నః" యను శ్లోకసమీక్షాప్రసంగమున జూడదగును. ఆనందవర్ధనుని ధ్వన్యాలోకానుసారముననె శారదాతనయు డిట్లు ప్రతిపాదించెను. ఈ యధికారముననె స్థలాంతరమున నీ విషయము విశద మగును.

రసములకు వాక్యార్థత సూచిత మయినది. నిర్వేదస్థాయిక మయిన శాంతరసమునకును వాక్యార్థత కలదా? ఈ యంశమున నీ విషయవివేక మావశ్యకము.

### శాంతము - వాక్యార్థము

నిర్వేదాదేరతాద్రూప్యాదస్థాయీ స్వదతే కథం
వైరస్యాయైవ తత్పోషః తేనాష్టౌ స్థాయినో మతాః. 145

ప్రకాశానందచిద్రూపాం రసతాం ప్రతిపద్యతే
ప్రకృష్యమాణో యో భావః స స్థాయీతి నిగద్యతే. 146

నిర్వేదాదులకు స్థాయితా సంపాదకమగు ధర్మము లేదు. అందువలన నిర్వేదాదులు స్థాయిభావములుకావు. ఇక నిర్వేదాదిక మెట్లాస్వాద్యమగును? కావున నిర్వేదాదికమునకు విభావాదులచే పోషను సంపాదించుట వైరస్యమునకె యగును. తత్పోషము వ్యర్థము. కావున స్థాయిభావము లెనిమిది మాత్రమె యనుట స్వారసికము. విభావాదులచే ప్రకర్షాతిశయము పొందిన భావము ప్రకాశానంద చిద్రూప మగు రసత్వమును పొందునేని స్థాయిభావ మగునని నిగదిత మయినది అని యిచటి భావార్థము. ఇందలి పై కారిక దశరూపకమున నున్నది. ధనికు డవలోకవ్యాఖ్యానమున దీని భావము విశదీకరించెను. విరుద్ధావిరుద్ధభావములచే విచ్ఛిన్నము కాకుండుట స్థాయిభావరూపము. ఇట్టి తాద్రూప్యము స్థాయితాపాదక సంపత్తి నిర్వేదమునకు లేదు. విరుద్ధావిరుద్ధావిచ్ఛేదిత్వము నిర్వేదమునకు లేదు. నిర్వేదము స్థాయి కాదు. కావుననే చింతాదిస్వస్వవ్యభిచారి భావములచే సంఘటిత మయినను వైరస్యమునే యాపాదించును. నిర్వేదము స్థాయి కానందున రసము కాదు. ప్రకాశానందమయ రసరూపత్వమును నిర్వేదమునకు సంభవింపదు. కావుననె వాక్యార్థత శాంతరసమునకు సిద్ధింపదు.

కావ్యోపాత్తైర్విభావాదిభావైః సముపబృంహితః
స్థాయీ రసాత్మతాం యాతస్తత్ర వాక్యార్థతామియాత్ 147

వాచ్యా ప్రకరణాదిభ్యో బుద్ధిస్థా వా క్రియా యథా
వాక్యార్థః కారకైర్యుక్తా స్థాయీ భావస్తథేతరైః. 148

శబ్దోపాత్తక్రియా జ్ఞాతాఽథవా ప్రకరణాదిభిః
కారకాది విశిష్టైవ యథా వాక్యార్థతామియాత్. 149

తథా విభావానుభావసాత్త్వికవ్యభిచారిభిః
స్థాయీ విశిష్టః కావ్యాదివాక్యార్థో భవతి స్ఫుటమ్. 150

తేన రత్యాదిశబ్దానామప్రయోగేఽపి కుత్రచిత్
రసభావప్రతీతిస్తు తత్తద్వాక్యేషు సేత్స్యతి. 151

సంబంధో రసకావ్యాదేస్తద్వాక్యార్థతయా భవేత్
కావ్యం సామాజికోద్దేశప్రవృత్తమితి యత్తతః. 152

తత్రత్యరసమేవాస్య వాక్యార్థమివ మన్యతే
కావ్యాదిబంధబద్ధస్య రసస్య స్థాయినోఽపి చ. 153

వాక్యార్థత్వం చ శబ్దార్థసంబంధాదవగమ్యతే

రసము వాక్యార్థ మగుట సోపపత్తికముగా నిచట నిరూపిత మగును. కావ్యమున నుపాత్తము అయిన విభావాదులచే సముపబృంహితమగు స్థాయి భావము రసాత్మతను పొందినదై కావ్యమున వాక్యార్థతను పొందును. వాచ్యమగు క్రియ కాని ప్రకరణాదుల వలన బుద్ధిస్థమగు క్రియకాని కారకము లతో గూడినదై వాక్యార్థ మగుచున్నది. కొన్ని లౌకికవాక్యములలో క్రియను బోధించు శబ్దము స్పష్టముగా నుండును. "గోవును తెమ్ము"- ఇందు తెమ్ము క్రియ స్పష్టముగా నున్నది. కొన్ని వాక్యములలో క్రియ శబ్దోపాత్తముగా నుండదు. "ద్వారము ద్వారము" అను స్థలమున క్రియాశబ్దము లేదు; ప్రకరణా దుల వలన క్రియ "మూయుము" బుద్ధిస్థ మగును. ఇట్లు క్రియ కారకాన్వితమై వాక్యార్థ మగుచున్నది. అట్లే స్థాయిభావము విభావాదులతో గూడుకొని వాక్యార్థ మగును. ఇట్టి భావముకల "వాచ్యా ప్రకరణాదిభ్య" అను కారిక దశరూపకమున నున్నది. తద్భావము "శబ్దోపాత్తక్రియా" కారికలో నిరూ పితము. శబ్దోపాత్త మయిన క్రియకారకాదివిశిష్టమై వాక్యార్థత్వము పొందు నట్లు ప్రకరణాదుల వలన పరిజ్ఞాత మయిన క్రియ కారకాదివిశిష్టమై వాక్యార్థత్వము పొందునట్లు స్థాయిభావ ముపాత్త మయిన ననుపాత్తమయినను విభావానుభావ సాత్త్విక వ్యభిచారిభావములతో గూడుకొనినదై కావ్యాదులలో వాక్యార్థ

త్వము పొందుచున్నది. కావున రత్యాదిశబ్దములకు కొన్నిస్థలములందు ప్రయోగము లేకున్నను ఆ యా వాక్యములలో రసభావప్రతీతి సిద్ధము కాగలదు.

కావ్యవాక్యార్థరూపముగా కావ్యరససంబంధమును నిశ్చయింప వలెను. కావ్యము సామాజికుల నుద్దేశించియె ప్రవృత్త మగునది కదా! సామాజికు లందుపభాసించు రసమే కావ్యవాక్యార్థ మని యభిజ్ఞులు తలచు చున్నారు. కావ్యాదిబంధములలో నిబద్ధ మయిన రసమునకు స్థాయిభావమునకు కల వాక్యార్థత్వము శబ్దార్థసంబంధము వలన గోచరించును. కావ్యరసములకు సంబంధించిన విధమున వాక్య తదర్థసంబంధాదులు కలవు. వాని నిరూపణమున రసవాక్యార్థత కావ్యరససంబంధము విశదము కా గలదు.

సంబంధో ద్వాదశవిధః స్మృతః శబ్దార్థయోర్బుధైః. 154

ద్వాదశధా సంబంధః శబ్దస్యార్థస్య యః స సాహిత్యం
త్రిస్కంధః స చతుర్భిస్తనుభిః స్యాచ్చతుశ్చతుర్భిశ్చ. 155

వృత్తిర్వివక్షా తాత్పర్యప్రవిభాగావివక్షోదితా
తతో వ్యపేక్షా సామర్థ్యాన్వయావైకార్థభావనా. 156

దోషహానం గుణాదానం తథాలంకారయోగితా
రసావియోగ ఇత్యేతే సంబంధాః కథితా బుధైః. 157

కావ్యము నందలి శబ్దార్థముల సంబంధము పండ్రెండు విధముల నుండునని బుధులు స్మరించిరి. శబ్దమున కర్థమునకు గల ద్వాదశవిధ సంబంధము సాహిత్యమున బరగును. ఈ శబ్దార్థముల సంబంధము నాలుగు నాలుగుగా నున్న నాలుగు తనువులతో త్రిస్కంధముగా నుండును. ఆ ద్వాదశసంబంధముల నామము లీ విధముగా నున్నవి—

1. ప్రథమస్కంధము:- వృత్తి, వివక్ష, తాత్పర్యము, ప్రవిభాగము— అనునాలుగు.

2. ద్వితీయస్కంధము:- వ్యపేక్ష, సామర్థ్యము, అన్వయము, ఏకార్థభావన—అనునవి నాలుగు.

3. తృతీయస్కంధము:- దోషహానము, గుణాదానము, అలంకారయోగిత, రసావియోగము—అను నాలుగు గలవు.

ఇట్లే సంబంధము లున్నవని బుధుల కథనము. ఇటుపై వీని స్వరూప వివేచనము స్పష్ట మగును.

వృత్తిస్త్రిధా పదార్థేషు పదానాముచ్యతే బుధైః
అభిధా లక్షణా గౌణీత్యేతాసాం రూపముచ్యతే. 158

శబ్దశక్తిపరామర్శా త్తద్వ్యాపారాత్మికా బుధైః
అభిధేయే ప్రవృత్తిర్యా సా వృత్తిరభిధోచ్యతే. 159

అభిధేయావినాభూతప్రతీతిర్లక్షణోచ్యతే
సైషా విదగ్ధవక్రోక్తిజీవితం వృత్తిరిష్యతే. 160

క్రోశంతి మంచా ఇత్యాదౌ సా వృత్తిరవగమ్యతే
లక్ష్యమాణగుణైర్యోగాద్వృత్తేరిష్టా తు గౌణతా. 161

స సింహో దేవదత్తో௨యమిత్యాదావవగమ్యతే
రూఢ్యా యత్రాసదర్థో௨పి లోకే శబ్దో నివేశితః. 162

స ముఖ్యస్తత్ర తత్సామ్యాద్గౌణో௨న్యత్ర స్ఖలద్గతిః
ఆసాం స్వరూపం వక్ష్యామః పరస్తాచ్చ సవిస్తరమ్ 163

పదములకు పదార్థము లందలి వృత్తిమూడు విధములు. అభిధ లక్షణ గౌణి యని. వీని స్వరూపము చెప్పుదుము. అభిధేయము నందు ప్రవర్తించు నభిధానము వృత్తిత్రయమున ప్రవర్తించును. అవియె వృత్తు లభిధాదులు. సాక్షాదవ్యవహితార్థమును బోధించునది ముఖ్యవృత్తి. ఇదియే అభిధావృత్తి. శబ్దశక్తిపరామర్శమున అభిధేయము నందు శబ్దమునకుగల వ్యాపారాత్మక మయిన ప్రవృత్తి యభిధ యగును.

స్వార్థావినాభూతమగు నర్థాంతరము నుపలక్షింప జేయునది లక్షణ. దీనినే యభిధేయావినాభూత ప్రతీతి యందురు. అవినాభూత మనుట సంబంధ మాత్రమె. కాని నాంతరీయక మనుట కాదు. నాంతరీయక మగుచో లక్షణ యక్కర లేదు. స్వార్థముతో సంబంధించి యుండు నర్థాంతరమును దెలియ జేయునది లక్షణ యగునని భావము. ఈ లక్షణ విదగ్ధవక్రోక్తి జీవితరూప మగు వృత్తి యని యందురు. ''మంచాః క్రోశంతి'' అనునది లక్షణోదాహ రణము. ఇత్యాద్యుదాహరణములలో లక్షణావృత్తి గోచరించును. మంచాః =

గడమంచెలు, క్రోశంతి = కేకలు వేయుచున్నవి. ఇచట నచేతనములగు మంచెలకు చేతనధర్మ మగు క్రోశన ముపపన్నము కాదు. కావున మంచగతులగు మానవు లుపలక్షితు లగుచున్నారు. కావున లక్షణ సంగత మగును.

లక్ష్యమాణ గుణములతో సంబంధ మున్నందున వృత్తికి గౌణత కలుగును. గౌణీవృత్తి యగును. "సింహో దేవదత్తః" మొదలగు వానిలో గౌణీవృత్తిగోచరించును. దేవదత్తుడు సింహము కాదు. అయినను సింహశబ్ద ప్రయోగము సింహగత పరాక్రమాది సదృశపరాక్రమాదిగుణములు కలవాడనునర్థము లభించును. ఇందు గుణములసంబంధ మున్నందున గౌణవృత్తి యయినది. అర్థము గల శబ్దము కూడ శబ్దమును లోకప్రసిద్ధిచే నొక యర్థమున నివేశిత మగును. అది ముఖ్యార్థము. తత్సామ్యమున నితరస్థలమున ప్రయుక్తము కాగా గౌణ మయినది. గుణసంబంధమున గౌణము. గౌణ మగునది స్ఖలద్గతి యందురు. స్ఖలత్—ప్రచ్యుతమగు గతికలది స్ఖలద్గతి. సింహశబ్దము సింహార్థమున స్ఖలద్గతియై దేవదత్తార్థము బోధించినది.

ఈ యభిధాదుల స్వరూపమును ఈ యధికారము నందే యనంతర భాగమున నిరూపింతుము. ఉపక్రమములో రూపసముల్లేఖనమె యావశ్యక మయినందున నింత మాత్రమె యిచట నిరూపితము.

శబ్దార్థయో స్సమన్యూనాధికతాభేదతస్త్రిధా
వివక్షా సా తు సందర్భే కవిభిస్తు నియమ్యతే. 164

క్వచిదర్థస్య విస్తారః క్వచిచ్ఛబ్దస్య విస్తరః
తులాధృతమివైకత్ర సామ్యం శబ్దార్థయోః క్వచిత్. 165

శబ్దార్థములకు సంబంధించిన పంన్రెండు విధములగు సంబంధములలో రెండవది యగు వివక్ష యిచట నిరూపిత మగును. ప్రకృతమీవిషయమును ధారణమొనరింపవలెను. భోజదేవుని శృంగారప్రకాశములోని సప్తమప్రకాశమునకు కేవలశబ్దసంబంధశక్తిప్రకాశ మని పేరు. అందు అభిధా వివక్షా తాత్పర్య ప్రవిభాగములు కేవలశబ్దసంబంధ శక్తులుగా నిరూపితము లయినవి. శారదాతనయ భావప్రకాశనము శృంగారప్రకాశము నాధారముచేసుకొనియు నుప్రకాశ మగుట సహృదయ భావక సంభావ్యము. శృంగారప్రకాశములో వివక్ష యిట్లు వివేచిత మయినది.

శబ్దములలో నర్థవిషయమున నభిధానదానాభిప్రాయ ముండుట వివక్ష యగును. "వక్తుర్వివక్షితపూర్వికా శబ్దప్రవృత్తిః" వక్తయొక్క శబ్దప్రవృత్తి వివక్షితపూర్వకము. వాఙ్మయము మూడువిధములు — అపౌరుషేయము ఆర్షము పౌరుషేయము అని. అపౌరుషేయము శబ్దప్రధానము. మంత్రము బ్రాహ్మణ మపౌరుషేయము. అపౌరుషేయమున వక్త లేనందున వివక్ష యుప పన్నము కాదు. ఆర్ష మర్థప్రధానము. స్మృతి యితిహాస మార్షము. అచట వివక్షామాత్ర ముండును. వారి యర్థము వాక్కు ననుసరించును. "వాచం అర్థః అనుధావతి." పౌరుషేయములలో "వాక్ అర్థం అనువర్తతే." పౌరుషేయము విశిష్టవివక్షానుసారమున నుదయించును. "వివక్షాతః కారకాణి భవంతి" "అక్షాన్దీవ్యతి అక్షైర్దీవ్యతి అక్షేషు దీవ్యతి" క్రియాసమన్వయము పొందు కారకములు వివక్షానుసారమున నుండును. వివక్ష యనేకవిధముల నుండును.

1. కారకములందు అకారకవివక్ష
2. అకారకములందు కారకవివక్ష
3. క్రియయందును కారకవివక్ష
4. అక్రియలో క్రియావివక్ష
5. క్రియలో క్రియాంతరవివక్ష
6. కారకమునందును క్రియావివక్ష
7. అసంబంధమున సంబంధవివక్ష
8. అచేతనములందు చేతన వివక్ష
9. ప్రధానమున గుణవివక్ష
10. గుణమున ప్రధాన వివక్ష
11. అవయవమున సముదాయవివక్ష
12. సముదాయమున అవయవవివక్ష
13. అభేదమున భేదవివక్ష
14. భేదమున అభేదవివక్ష
15. అసతో వివక్ష
16. సతోప్యవివక్ష
17. సదసతోః వివక్ష
18. సదసతోః అవివక్ష
19. స్తుతిచే నిందావివక్ష

20. నిందచే స్తుతివివక్ష
21. విధిచే నిషేధవివక్ష
22. నిషేధమున విధివివక్ష

ఇట్లనేకవిధముల వివక్షారూప మున్నది. అపార కావ్యసంసారమున కవియే ప్రజాపతి. అతని యభిరుచ్యనుసారమున నీ విశ్వము పరివర్తనము పొందును. ఇట్టి వివక్షారూపములను శారదాతనయు డీ గ్రంథమున గూర్చ దలచ లేదు. ఈ నిరూపితములుకానున్న వివక్షారూపములను తనయు డుప పాదించెను.

ఒకచో నర్థమునకు విస్తరము, ఒకచో శబ్దమునకు విస్తరము, ఒకచో తులాధృత మయినట్లు శబ్దార్థముల సామ్యము నుండును. ఇట్లు శబ్దార్థములకు సమన్వ్యాన అధికతా భేదమున వివక్ష మూడు విధముల నున్నది. కవులు సందర్భ ములందు వీనిని నియతముగా ప్రయోగింతురు. ఈ యంశమె యిట్లు ప్రతిపాదిత మయినది.

క్వచిత్స్వల్పేఽప్యర్థే ప్రచురవచనై రేవ రచనా
క్వచిద్వస్తుస్ఫారం కతిపయపదై రర్పితమిమ్. 166

యథా వాచ్యం శబ్దాః క్వచిదపి తులాయామివ ధృతాః
త్రిభిః కల్పై రేవం కవివృషభసందర్భనియమః. 167

ఒకచో స్వల్పమగు నర్థము నందును ప్రచురవచనములతో రచన యుండును. ఒకచో వస్తువు విస్తరముగా నున్నను పరిమితములగు పదములతో రస మర్పితమగును. ఒకచో తులాధృతము లయిన విధముగా నర్థమునకు తగి నంతగా శబ్దము లుండును. ఇట్లు మూడు ప్రకల్పములతో కవిపుంగవుల సందర్భనియమము కలదు.

అసావున్నీయతే సద్భిః త్రిప్రకారై శ్చ హేతుభిః
ఏకః స్యాత్కాకువిచ్ఛేదాదినా ప్రకరణాదినా. 168

కశ్చి త్తత్థై వాభినయాదినా కోఽపి యథాక్రమం

పై నిరూపిత మయిన వివక్ష లోకవ్యవహారమునందును కావ్యవ్యవ హారమునందును సుమతులచే సమున్నీతమై త్రివిధముగా నుండునని విఖ్యాత

మయినది- కాక్వాది వ్యంగ్యమగు వివక్ష, ప్రకరణాదివ్యంగ్యమగు వివక్ష, అభినయాదివ్యంగ్యమగు వివక్షయని. ఇట్లు భోజసూచితము నిట్లు శారదాతనయుడు సూచించెను. ఈ వివక్ష త్రిప్రకారకము లయిన హేతువులచే త్రిప్రకారముగా నుండునని సద్భావులు నిర్ణయించిరి. కాకువిచ్ఛేదాదులచే గలుగు వివక్ష యొకటి, ప్రకరణాదులచే గలుగునది రెండవది, అభినయాదులచే గలుగునది మూడవది. యథాక్రమముగా స్వరూపము విశద మగును.

భిన్నకంఠధ్వనిర్ధీరైః కాకురిత్యభిధీయతే. 169

ప్రశ్నగర్భాభ్యుపగమోపహాసాక్షేపకాదికాః
బహవః కాకవః ప్రోక్తాస్తత్తదర్థానుసారతః. 170

కాకువిచ్ఛేదాదులచే వివక్ష యుండుట సూచితము. కాకువు స్వరము విచ్ఛేదమనునవి కాక్వాదులు. కాకు భేదము లనేకములు కలవు. ఈ గ్రంథమున ఈ స్థలమున, ప్రశ్నగర్భ- అభ్యుపగమ-ఉపహాస-ఆక్షేప కాకువుల పేర్లు కలవు. తత్తదర్థానుసారముగా కాకువు లనేకములు కలవని శారదాతనయుని భావము.

శృంగారప్రకాశములో కాకువిభాగ మీ విధముగ నున్నది. కాకువు త్రివిధము— నియతప్రతిబంధము, అనియతప్రతిబంధము, అప్రతిబంధము నని. అందు నియతప్రతిబంధము ద్వివిధము— సాకాంక్షము నిరాకాంక్షము నని. సాకాంక్షకాకువు వాక్యాంతర మపేక్షించును. అది మూడు విధములు. ఆక్షేపగర్భము, ప్రసన్నగర్భము, వితర్కగర్భము నని. వాక్యాంతరభావిని నిరాకాంక్ష. అదియు మూడు విధములు— విధిరూపము, ఉత్తరరూపము, నిర్ణయరూపము నని. ఈ నియతప్రతిబంధ—అనియతప్రతిబంధ-అప్రతిబంధములు మూడును అనంతభేదముల నున్నవి—

అభ్యుపగమానునయ కాకువు,
అభ్యనుజ్ఞోపహాస కాకువు,
ఆక్షేపకాకువు-

అనువిధమున కాకుభేదము లున్నవి. అప్రతిబంధకాకువు ఏకగుణ ద్విగుణ త్రిగుణ చతుర్గుణ యని చతుర్విధము. ఇట్లితర భేదములు గ్రాహ్యములు.

స్వరములు మూడు విధములు— ప్లుతాదులు ఉదాత్తాదులు ప్రగృహ్యాదులు నని. ప్లుతాదులనుటచే ప్లుతస్వరకరణము-హ్రస్వస్వరకరణము-దీర్ఘ

స్వరకరణము-అనునాసికస్వరకరణముసంగృహీత మగును. ఉదాత్తాదులు ఉదాత్త మనుదాత్తము స్వరితము. ఇట్లు ప్రగృహ్యాదు లనుటచే గూడ సంగ్రాహ్యములు కలవు. భోజుడుచెప్పిన వానిని తనయుడు చెప్పదలచ లేదు. భోజుడన్నిటి నుదాహరించెను. తన పరిగణనమునకు తగిన యుదాహరణములను భోజునినుండి గ్రహించెను. వానిని సూచనముగ శ్లోకములలో కూర్చెను.

గతః స కాల ఇత్యాదౌ ప్రశ్నగర్భోఽభిధీయతే
యుష్మచ్ఛాసనలంఘనాదౌ జ్ఞేయోఽభ్యుపగమాత్మికా. 176
మథ్నామి కౌరవేత్యాదావుపహాసాత్మికా భవేత్
లాక్షాగృహానలేత్యాదౌ వివాదాక్షేపకాత్మికా. 173
వితర్కగర్భా కాకుః స్యాద్యథోన్మత్తపురూరవాః

తా నంగీకరించిన నాలుగు కాకువుల కుదాహరణము లిచట సూచితము లయినవి. "గతః స కాలః" అను శ్లోకమున ప్రశ్నగర్భకాకువు కలదు. "యుష్మచ్ఛాసనలంఘనాంభసి" అను శ్లోకమున అభ్యుపగమ కాకువు కలదని గ్రహింపదగును. "మథ్నామి కౌరవశతం" అను దానిలో నుపహాసాత్మకకాకువున్నది. "లాక్షాగృహానల" పద్యములో వివాదాక్షేపక కాకువున్నది. భోజసముదాహృత శ్లోకానుసారము వీనిస్వరూపమిట్లు గ్రాహ్యము—

గతః స కాలో యత్రాసీన్ముక్తానాం జన్మవల్లిషు
వర్తంతే సాంప్రతం తాసాం హేతవః శుక్తిసంపుటాః.

దీనిలో ప్రశ్నగర్భ కాకు వున్నది. ఏ కాలమున ముక్తామణులకు వల్లీభాగములలో జన్మ యుండెనో ఆ కాలము గతించినది. ప్రస్తుత మా ముక్తామణులకు హేతువులుగా నున్న శక్తిసంపుటములె యున్నవి. ముత్యము లిప్పుడు లేవు. చిప్పలు మాత్రమె యున్నవి. అని యుపదేశించు వాని యుత్తరరూప మయిన ప్రశ్నగర్భ కాకు వఖ్యూహ్యము.

యుష్మచ్ఛాసనలంఘనాంభసి మయా మగ్నేన నామ స్థితా 174
ప్రాప్తానామవిగర్హణా స్థితిమతాం మధ్యేనుజానామపి.
క్రోధోల్లాసితశోణితారుణగదస్యోచ్ఛిందతః కౌరవాన్
అద్యైకం దివసం మమాసి న గురుః నాహం విధేయస్తవ. 175

ఇది వేణీసంహారములోని పద్యము. యుద్ధాసక్తు డయిన భీముడు సంధియత్న మొనరించు ధర్మజు నంగీకరింపక యిట్లనుట - "మీ శాసన మతిక్రమింపక నే నణగి యుంటిని. సంపన్నులయిన సోదరుల మధ్య నింద పొందితిని. గద త్రిప్పి కౌరవులను నాశన మొనరించు నీనాడు మాత్రము నీవు గురువు కావు. నేను విధేయుడను కాను." పూర్వశ్లోకము నియతప్రతిబంధ కాకువర్గము లోనిది. ఇది యనియతప్రతిబంధ కాకువర్గములోనిది. ఇం దభ్యుపగమ కాకువు-అభ్యుపగమానునయ కాకు వభ్యూహ్యము.

మథ్నామి కౌరవశతం సమరే న కోపాత్
దుశ్శాసనస్య రుధిరం న పిబా మ్యురస్తః
సంచూర్ణయామి గదయా న సుయోధనోరూ
సంధిం కరోతు భవతాం నృపతిః పణేన.

ఇది క్రుద్ధుడయిన భీముని వాక్యము. సమరములో కోపమున కౌరవులను మథింపనా? దుశ్శాసనుని గుండెనుండి రక్తము త్రావనా? సుయోధనుని తొడలను గదతో చూర్ణము చేయనా? మీ రాజు పణమున సంధి యొనరించునో? దీనిలో నుపహాసాత్మక మయిన కాకువు స్పష్టము. ఇందు అభ్యనుజ్ఞోపహాస కాకువు సంగతము.

లాక్షాగృహానల విషాన్న సభాప్రవేశైః
ప్రాణేషు విత్తనిచయేషు చ నః ప్రహృత్య
ఆకృష్య పాండవవధూ పరిధాన కేశాన్
స్వస్థా భవంతు మయి జీవతి ధార్తరాష్ట్రాః.

ఇది యాక్షేప కాకువున కుదాహార్యము. ఇదియు భీమసేనవచనము. ఇల్లు తగలబెట్టి విషాన్నము పెట్టి సభలో నవమాన మొనరించి ద్రౌపదికేశవస్త్రముల లాగి నేను జీవించి యుండగా ధార్తరాష్ట్రులు స్వస్థు లగుదురా! దీనిలో వివాదాక్షేపరూప మయిన కాకు వభ్యూహ్యము.

వితర్కగర్భ మయిన కాకువు విక్రమోర్వశీయములోని ఉన్మత్త పురూరవుని వచనముల నున్నది.

నవజలధరః సన్నద్ధోఽయం న దృప్తనిశాచరః
సురధనురిదం దూరాకృష్టం న తస్య శరాసనమ్

అయమపి పటుర్ధారాసారో న బాణపరంపరా
కనకనికషస్నిగ్ధా విద్యుత్ప్రియా న మమోర్వశీ.

వీడు రాక్షసుడు కాడు. మేఘము. ఇది వాని ధనువు కాదు. ఇంద్ర ధనుస్సు. ఇది బాణపరంపర కాదు. ధారావర్షము. ఇది నా ప్రియ యూర్వశి కాదు. బంగారు గీటువలె నున్న మెఱుపు. ఇందలి కాకువు పలుకు వాని నిర్ణయరూపముగా నున్నది.

వాక్యాన్యథాత్వాదేకః స్యాదేకో వాక్యసమాప్తికః. 173

వాక్యసంభేదరూపోఽన్యో వాక్యానుచ్చారణాదపి
ఇత్యాదిభేదా బహుధా విచ్ఛేదస్యేరితా బుధైః. 174

కాకువు స్వరము విచ్ఛేదము నని కాక్వాదివిశేషము నిర్దిష్ట మయినది. ఇందు మూడవది యయిన విచ్ఛేద మిందు నిరూపిత మగుచున్నది. విచ్ఛేదమున బహుధాభేదములు కలవు. నాలుగు మాత్ర మిచట నిర్దిష్టము లయినవి. వాక్యాన్యథాత్వము వలన నొకవిచ్ఛేదము, వాక్యసమాప్తిక విచ్ఛేదము, వాక్యసంభేదరూప విచ్ఛేదము, వాక్యానుచ్చారణ వలని విచ్ఛేదము.

శృంగారప్రకాశ మింకను భేదములను పరిగణించినది. అవి యిట్లున్నవి. విచ్ఛేదము మూడు విధములు - పదవిచ్ఛేదము వాక్యవిచ్ఛేదము యతివిచ్ఛేదము నని. పదవిచ్ఛేదము నాలుగు విధములు. శృంఖలారూపము, భంగరూపము, పరివర్తకము, చూర్ణకము నని- వాక్యవిచ్ఛేదము నాలుగు విధములు- వాక్యసంభేదము, వాక్యాన్యథాత్వము, వాక్యాసమాప్తి, వాక్యానుచ్చారణము నని. యతి విచ్ఛేదము, విరామము యతి. ఇది నాలుగు విధములు - పదమున పాదమున అర్ధమున స్థానమున నుండును. తదన్యథాకరణము యతివిచ్ఛేదము. ఇట్లు బహురూప మయిన విచ్ఛేదమున వాక్యవిచ్ఛేదము మాత్రమె యిందున్నది. ఈ నాల్గింటి కిందు నిదర్శనములు కలవు.

సహభృత్యగణేత్యాదౌ జ్ఞేయో వాక్యాన్యథాత్మకః
వత్సే ''త్వం జీవితే''త్యాదౌ జ్ఞేయో వాక్యసమాప్తికః. 175

దిఙ్మాతంగఘటేత్యాదౌ వాక్యసంభేదరూపకః
అత్రవదంత ఏవేత్యాది వాక్యసంభేదోఽరోమాంచేన వక్తుర్గుణవిశేషజ్ఞానం ప్రకాశయతి.
ప్రత్యగ్రారికృతేత్యాదౌ వాక్యానుచ్చారణాత్మకః. 176

తత్రహోవత్సేతి వాక్యానుచ్చారణం కృతప్రక్రియస్యానుచితం పరిదేవిత మితి సూచయతి.

"సహభృత్యగణం" అను దానిలో వాక్యాన్యధాత్మకవిచ్ఛేదము, "త్వం జీవితం త్వమసి" అను దానిలో వాక్యాసమాప్తికవిచ్ఛేదము, "దిఙ్మాతంగఘట" అను దానిలో వాక్యసంభేదరూపము, "ప్రత్యగ్రారికృత" అను దానిలో వాక్యానుచ్చారణాత్మకవిచ్ఛేము కలదు.

వీని సమన్వయసరణిని భోజసముదాహృతశ్లోకానుసారమున నిట్లు గుర్తించునది.

సహభృత్యగణం సబాంధవం సహమిత్రం సబలం సహానుగం,
స్వబలేన నిహంతి సంయుగే న చిరాత్పాండుసుతః సుయోధనమ్.

వేణీసంహారనాటకములో నిది దుర్యోధనవాక్యము. యుద్ధము నందు తన బలముచే నచిరకాలమున, భృత్యగణములతో బాంధవులతో మిత్రులతో బలముతో ననుజులతో నున్న "పాండుసుతః సుయోధనం నిహంతి" సుయోధనుని పాండుసుతుడు చంపును. దీనిలో "పాండుసుతం సుయోధనః" అని పలుక వలసి యుండగా "పాండుసుతః సుయోధనం" అని పలుకుట, భానుమతీ విరహ వైమనస్యముతో నున్న సుయోధనుని వాక్యమున కన్యధాత్వము కలిగినది. ఇది యనరానిది ఆతడనెను. భావ్యర్థమట్లగునని సూచించును.

"త్వం జీవితం త్వమసి మే హృదయం ద్వితీయం
త్వం కౌముదీ నయనయోరమృతం త్వమంగే."

ఇత్యాదిభిః ప్రియశతైరనురుధ్య ముగ్ధాం
తామేవ, శాంతమథవా కిమిహోత్తరేణ."

ఉత్తరరామచరితములో వాసంతీవచనము – నీవు నా జీవితము, నీవు నా రెండవగుండె. నీవు నా కన్నులవెన్నెల. నీవు నా దేహమున అమృతము. ఇత్యాది శతప్రియములతో ప్రియ ననుబంధించి యుండి ఆసీతనే... శాంతం, చాలు, ఇటుపైనెందుకులే! అను భావము కల దీనిలో వాసంతీవాక్యమున సమాప్తి లేదు. "సుహృద్విషయే న అమంగలం వక్తవ్యం" అని యిచట ప్రతిపాదిత మగును.

ది జ్ఞాతంగ ఘటావిభక్తచతురాఘాటా మహీ సాధ్యతే
సిద్ధా సా పి వదంత ఏవ హి వయం రోమాంచితాః పశ్యత

విప్రాయ ప్రతిపాద్యతే కి మపరం రామాయ తస్మై నమో
యస్మా దావిరభూత్కథాద్భుత మిదం యత్రైవచాస్తంగతమ్.

దిగ్గజవిభక్త మయిన భూమి సాధ్యము కావలెను. అదియు సిద్ధ మయిన దని మేము పలుకు చుండగనె రోమాంచితుల మయినాము. చూడుడు. విప్రు డయిన పరశురామున కింకనేమియిత్తుము. ఎవని నుండి యీ యద్భుత మావిర్భవించెనో ఎవని యందస్తంగత మయినదో ఆతనికి నమస్కారము. ఇందు వాక్యసంభేదరూప మయిన విచ్ఛేద మున్నది. మేము పలుకుచునే రోమాంచి తుల మయినా మనుట వాక్యసంభేదము. వక్త భావకుడగుటచే నిది గుణవిశేష విజ్ఞానాతిశయ ప్రకాశనమును ప్రతిపాదించు చున్నది.

ప్రత్యగ్రారి కృతాభిమన్యు నిధన ప్రోద్భూత తీవ్రక్రుధః
కీర్ణాబాష్పకణైః పతంతి ధనుషి వ్రీడా జడా దృష్టయః

పార్థస్యాకృత శాత్రవ ప్రతికృతే రంతశ్శుచాముహ్యతో
హా వత్సేతి గిరః స్ఫురంతి న పున ర్నిర్యాంతి కంఠాద్బహిః.

పుత్రు డయిన అభిమన్యువును శత్రువులు చంపుటచే తీవ్రకోపము కలిగిన అర్జునుని బాష్పవ్యాప్తము లయిన వ్రీడా జడ దృష్టులు ధనువునందు ప్రసరించినవి. శత్రువులకు ప్రతికృతి యొనరింపలేదని యంతశ్శోకమున వ్యథ పడుచున్నాడు. హా వత్స యనుమాటలు స్ఫురించునే గాని కంఠమునుండి వెలికి రాకున్నవి. ఇచట "హావత్స" యని వాక్యానుచ్చారణము ప్రతిక్రియ నాచరింపని మహాత్ములకు పరిదేవన మనుచిత మని సూచించును. ఇది వాక్యాను చ్చారణాత్మకవిచ్ఛేదము.

సమన్యూనాధికతా భేద భిన్న మయిన వివక్ష మూడు విధముల నున్నీత మగుటయు నందు కాకువిచ్ఛేదాది ప్రథమప్రకారము ఇట్లు నిరూపిత మగుటయు స్పష్ట మయినది. ప్రకారణాదిక మభినయాదికము నిరూపితము కావలసి యున్నది. నిరూపిత మగును.

వివక్షా సా బహువిధా వ్యంగ్యా ప్రకరణాదినా
తథా బహుప్రకారైవ వ్యంగ్యాత్వభినయాదినా. 177

హఠా చ్చుంబతి మానిన్యా యన్నిషేధపరం వచః
తదేవ మానశ్లథనా చ్చుంబనాది విధాయకమ్. 178

ఏవం విలోక్య తాం వ్యంగ్యో బుధైః ప్రకరణాదినా
ఏవం మద్దేహ మేతే తి వాక్యా దావభినీయతే. 179

బహువిధమయిన వివక్ష ప్రకరణాదికమయిన వ్యంగ్య మగును. అభినయాదికముచే నభివ్యంగ్య మగునదియు బహుప్రకారముగ నున్నది. ప్రియుడు హఠాచ్చుంబన మొనరించి నపుడు మానిని యొక్క నిషేధపరమగు వచనము కోపము శిథిలమయినందున చుంబనాదివిధాయక మని గుర్తింప వచ్చును. ఇది యా ప్రకరణమున నవభాసించు నర్థము. ఇట్లే ప్రకరణాది వ్యంగార్థములను బుధులు భావించునది.

ఇట్లే "పద్దహమేత్త" ఇత్యాది వాక్యమున అభినయవిశేషమున వివక్ష వ్యంగ్య మగుట నూహించునది. ఇందలి సమన్వయము ప్రదర్శిత మగును.

ప్రకరణాభినయముల విషయమున నిచట సూచిత మయిన సంగ్రహార్థము భోజభావము నపేక్షించును. భోజదేవు డిట్లు నిరూపించెను. అర్థము లింగము ఔచిత్యము దేశము కాలము అనునవి ప్రకరణాదులు.

భవతు విదితం శబ్దా వక్తు ర్వివక్షితసూచకాః
స్మరతి చ యతః కాంతే కాంతాం హఠా త్పరిచుంబతి.
ననమమమా మాం మాస్ప్రాక్షీ ర్నిషేధపరం వచో
భవతి శిథిలే మానగ్రంథౌ తదేవ విధాయకమ్.

శబ్దములు వక్తృవివక్షాసూచకము లని తెలిసినది. భవతు. కాంతుడు కాంతను హఠాచ్చుంబన మొనరింపగా వద్దు వద్దు వద్దు నన న నన్నుస్పృశింపకుము అను నిషేధపరమగు వచనము మానగ్రంథి శిథిలము కాగా నదియె విధాయక వచన మగును.

అభినయము అపదేశము నిర్దేశము సంజ్ఞ ఇంగితము ఆకార మనునవి యభినయాదులు. ఇట్లు భోజుడు చెప్పి యన్నిటి నుదాహరించినాడు. వీని పరిజ్ఞానమున నీ గ్రంథకృత్సారము సుగ్రహమగును.

ఏతావన్మాత్ర స్తనీ
ఏతావన్మాత్రాభ్యా మక్షి పత్రాభ్యాం
ఏతావన్మాత్రావస్థా
ఏతావన్మాత్రై ర్దివసైః.

ఇం దభినయాభివ్యంగ్యమయిన వివక్షయున్నది. ఇతింత స్తనములు కలది. ఇతింతలయిన నేత్రపద్మములు కలది. ఇంతటి యవస్థతో నున్నది. ఇన్ని దినముల కిట్లయినది. ఇందు ఇంతలింతలు అభినయరూపములు వక్తృ వివక్షను సూచించునవిగా నున్నవి.

వాక్యార్థం ప్రతి శేషత్వం యత్స్యా దుచ్చారణస్య తు
త త్తాత్పర్యం త్రిధా తత్స్యాద్వాక్యార్థ త్రివిధత్వతః. 180
స చాభిధేయః ప్రత్యాయ్యో ధ్వని రూప ఇతి త్రిధా

ఇక నిచట మూడవ సంబంధ మయిన తాత్పర్యము వివేచిత మగును. వాక్యార్థవిషయమున నుచ్చారణము శేషరూపము. అంగము వాక్యార్థము త్రివిధముగా నుండుటచే తాత్పర్యము త్రివిధ మగును. అభిధేయము ప్రత్యా య్యము ధ్వని రూపము నని.

ఇచట భోజుని యుపక్రమము కొంత పరిగ్రాహ్యము. "యత్పరః శబ్దః స శబ్దార్థః ఇతి తాత్పర్యం". శబ్దము యదర్థపరమో ఆ యర్థమె శబ్దార్థము అది తాత్పర్యము. తాత్పర్యము వాక్యము నందే యుపపన్నమగును. పద మాత్రమున నభిప్రాయము బోధింప శక్యము కాదు. వాక్యప్రతిపాద్య మగు వస్తువు త్రిరూపముగా నుండును - అభిధీయమానము ప్రతీయమానము ధ్వని రూపము నని. ఉపాత్తములగు శబ్దములలో ముఖ్యా గౌణీ లక్షణ లని మూడు శబ్దశక్తులు కలవు. ఆశక్తులుతమ యర్థము ప్రతిపాదించి యుపరతములుకాగా ఆకాంక్షా యోగ్యతా సన్నిధి విశేషములచే వాక్యార్థము మాత్రము గోచరించును. అది యభిధీయమానార్థము. వాక్యార్థము గోచరించిన పిమ్మట వాక్యార్థ ముపపన్నమయిన ననుపపన్న మయినను అర్థ ప్రకరణౌచిత్యాది సహాయమున

ప్రతీత మగునర్థము ప్రతీయమానము. వాక్యార్థము గోచరించినపిమ్మట, శబ్ద ముపసర్జనీకృతార్థమై అర్థ ముపసర్జనీకృతరూపమై అనునాదరూప మప్రతిశబ్ద రూపము నగు నర్థము నభివ్యంజన మొనరించునచో నది ధ్వనిరూపము. ఇది యంతట నుండదు. తథాహి. కాంస్యపాత్రమై యభిఘాత మొనర్పగా, అభి ఘాతము నివృత్తము కాగా నొకానొక పాత్ర మనునాద ముదయించును. ఒకా నొక కందరాదికమునకు ప్రతిశబ్ద ముదయించును. అట్లే యొకానొక వాక్య మున కభిధీయమాన ప్రతియమాన వాక్యార్థ ప్రతీత్యనంతరము ధ్వనికలుగును. ఇది భోజగ్రంథము. ఇక నీ గ్రంథమును భావింపవచ్చును.

కారకాది విశిష్టో యః సో ఽభిధేయః క్రియాదికః. 181

యథాఽభిధీయమానార్థా దన్యథాఽనుపపత్తితః
ప్రతీయమానో వాక్యార్థో యః స ప్రత్యాయ్య ఈరితః. 182

విషం భుంక్ష్వేతి వాక్యాదావేష తాదృక్ప్రతీయతే
ధ్వని ర్ద్వివిధా స చైకః స్యాదర్థతః శబ్దతో ఽపరః. 183

యత్రార్థః శబ్దో వా తమర్థ ముపసర్జనీకృతస్వార్థా
వ్యంక్తః కావ్యవిశేషః స ధ్వని రితి సూరిభిః కథితః. 184

శబ్దో ద్వివిధో ధ్వని రయ మనునాదరూప ఏకః స్యాత్
ప్రతిశబ్దరూప ఏకః తయో ర్విశేషో వివిచ్యతే ఽస్మాభిః. 185

తత్ర కోణాహతిస్ఫూర్జత్కాంస్యక్రేంకారనాదవత్
అర్థాంతరం ప్రతీతానుస్యూత మేవ వ్యనక్తి యత్. 186

సో ఽనునాదధ్వని రితి కథ్యతే ధ్వనికోవిదైః
ప్రతీతార్థంత్యజన్యత్రగుహాది ప్రతిశబ్దవత్. 187

పృథగేవోపలభతే స ఏవ స్యాత్ప్రతిధ్వనిః
ప్రత్యాయయ_స్తం_త్తదర్థం తత్ర తత్ర ధ్వనిం ధ్వనిః. 188

కారకాది విశిష్ట మయిన క్రియాదికము అభిధేయమని వేరొకవిధముగా నుపపన్నము కానందువలన నభిధీయమానార్థము వలననె ప్రతీయమాన మగు నర్థము అనగా వాక్యార్థము ప్రత్యాయ్య మని బుధులు భావించిరి. "విషం

భుంక్ష్వ! మా చాస్య గృహే భుంక్థాః” ఇత్యాది వాక్యములలో ప్రత్యాయ్యము భాసించును. విషము భుజింపుము. వీని యింటిలో భుజింపకుము. అను స్థలమున—“వరం విషం భక్షితం. న పునరస్య గృహే భుక్తం” “విషభక్షణమె మంచిది. వాని యింట భోజనము మంచిది కాదు. విషభక్షణము కన్నను వాని యింట భోజనము దుష్టము.” అని ప్రతీత మగును.

ధ్వని రెండు విధములు. ఒకటి యర్థమున గలుగును. వేరొకటి శబ్దమున గలుగును. ధ్వని లక్షణ మిట్లు ధ్వన్యాలోకమున నిర్ణీత మయినది. “యత్రార్థః శబ్దో వా” యనునది యానందవర్ధనుని లక్షణకారిక. తదర్థ మిట్లు గ్రాహ్యము. ఎచట నర్థ ముపసర్జనీకృతరూపము శబ్ద ముపసర్జనీకృతార్థమునై సర్వప్రధానమగు నా రసాద్యర్థము నభివ్యంజన మొనరించునో ఆ కావ్యవిశేషము ధ్వని యని బుధులు చెప్పిరి. శబ్దమునందు ధ్వని ద్వివిధముగా నుండును. ఒకటి యనునాదరూపము. వేరొకటి ప్రతిశబ్దరూపము. వీని విశేషమును భేదమును మేము వివేచింతుము.

అనునాదరూపధ్వని యిట్లుండును. కాంస్యపాత్ర కోణముపై దెబ్బ వేయగా నది ధ్వనించును. క్రేంకారనాదము వెలువరించును. అట్టి నాదము వలె ప్రతీత మనుస్యూత మయిన యర్థాంతరమును మొదటి యర్థ మభివ్యంజన మొనరించినచో నది యనునాదధ్వని యగునని ధ్వనికోవిదులు నిర్ణయించిరి.

ప్రతిశబ్దరూప ధ్వని యిట్లుండును. గుహాదులలోని ప్రతిధ్వనివలె ప్రతీతార్థమును విడనాడి వేరుగా నవభాసించినచో నది ప్రతిధ్వనిరూపధ్వని యగును. కావున నట నట నా యా యర్థముల ధ్వనిరూపముల నవభాసింప జేయునది ధ్వని యగును.

ఇక నిటు పై వీని లక్ష్యముల నిట్లు భావించుటకు పూర్వము భోజ కృతవిభాగముల నిట్లు భావింపవలెను.

అభిధీయమానము నాలుగు విధములు: విధిరూపము-నిషేధరూపము - విధినిషేధరూపము-అవిధినిషేధరూపము నని. ప్రతీయమాన మనేకవిధముల నున్నది: 1. విధిలో నిషేధము. 2. నిషేధములో విధి. 3. విధిలో విధ్యంతరము. 4. నిషేధమున నిషేధాంతరము. 5. విధినిషేధమున విధి. 6. అవిధి నిషేధమున నిషేధము. 7. విధినిషేధములలో విధ్యంతరము. 8. విధినిషేధ

ములలో నిషేధాంతరము. 9. విధిలో ననుభయము. 10. నిషేధమున ననుభయము. 11. విధినిషేధములలో ననుభయము. 12. అవిధినిషేధమున ననుభయము.

ప్రతీయమానాభిధీయమాన వాక్యార్థము లనంతము లయినందున ధ్వనిరూపము ననేకప్రకార మగును. ధ్వని రెండు విధములు – అర్థధ్వని శబ్దధ్వని యని. వీనిలో నర్థధ్వని యనునాదధ్వని రూపము ప్రతిశబ్దధ్వని రూపము నగును. అభిధీయమానవాక్యార్థానుస్యూతమై కాంస్యానునాదరూపముగా నర్థాంతరము గోచరించుట యనునాదధ్వని. కాంస్యధ్వని వలె నవిచ్ఛిన్నముగ ధ్వనించునదై యనునాదరూపముగా ప్రతీత మగును గావున ననునాదధ్వని యగును. అభిధీయవాక్యార్థము కన్న వేరుగా నున్నదై గుహాదిప్రతిశబ్దానురూపముగా నర్థాంతరమును గోచరింపజేయునదై ప్రతిధ్వనించినచో నది ప్రతిశబ్దధ్వని యగును. గుహలో పౌరుషాదిశబ్దములకు ప్రతిశబ్దములు కలుగుచుండును. అవి ధ్వని నుత్పాదించునవిగా నున్నవి. అన్యాభిధానమున నన్యము చెప్పునదై వేరుగా భాసించుచు ప్రతిశబ్దధ్వని యగును.

శబ్దధ్వనియు రెండు విధములు – అనునాదరూపము, ప్రతిశబ్దరూపము నని. ఇట్లే యితరములగు ధ్వనివిశేషములను మహాకవిప్రయోగములలో గవేషించుట యుచితము. ఇక శారదాతనయ లక్ష్యముల భావన ముచితము.

శాంత్యైవోఽస్తు కపాలేతి వాక్యాదావాదిమో ధ్వనిః
కపాలదామలిఖితాం ప్రత్యుత్యాదిపదాత్మికామ్. 189

లిపిం గణాః పఠంతీతి వాక్యార్థో యోఽభిధీయతే
తేన సృష్ట్యాదికర్తౄణాం దేవానాం దామ గమ్యతే. 190

ప్రతీతేన ప్రతీతా స్యాచ్ఛంభోర్దేవాదిసంస్మృతిః
తయాఽస్య నిత్యతైకత్వస్వాతంత్ర్యాదిః ప్రతీయతే. 191

యత్త్రతానుస్యూతమేవ ధ్వనన్యత్రావసీయతే
సోఽనునాదధ్వనిర్నామ తస్యోదాహృతిరీదృశీ. 192

"శాంత్యైవోస్తు కపాలదామ" అనుశ్లోకమున మొదటిదగు ననునాద ధ్వని యున్నది. ఇందలి ధ్వన్యమానార్థము వాచ్యార్థానుస్యూతమై ధ్వనించుట

నిశ్చిత మగును. కావున నసునాదధ్వని. దీని యుదాహృతి యిట్టిది. ఈ శ్లోకము శృంగారప్రకాశమున ననునాదధ్వనికై యుదాహృత మయినది. సరస్వతీకంఠాభరణమున నీ శ్లోక మున్నది.

శాంత్యైవోస్తు కపాలదామ జగతాం పత్యుర్యదీయాం లిపిం
క్వాపి క్వాపి గణాః పఠంతి పదశో నాతిప్రసిద్ధాక్షరామ్.

విశ్వం స్రక్ష్యతి, వక్ష్యతి క్షితిమపామీశిష్యతేఽశిష్యతే
నాగైః రాగిషు రంస్యతేఽత్స్యతి జగన్నిర్వేక్ష్యతి ద్యామితి.

జగదధీశ్వరు డయిన శివుని కపాలదామ శాంతిసంధాయక మగుగావుత! ఆ కపాలలలాటమాలాగత మయిన లిపిని నంది మొదలగు ప్రమథగణములవా రచ్చటచ్చట ప్రసిద్ధాక్షరములుగా లేనందున పదశః పదములు పదములుగా పఠించు చున్నారు. ఆ పఠన మిట్లున్నది. విశ్వం స్రక్ష్యతి-జగములు సృజించును. క్షితిం వక్ష్యతి-భూమిని వహించును. అపాం ఈశిష్యతే-జలముల ఐశ్వర్యము వహించును. నాగైః అశిష్యతే-వాయురూపుడగుటచే సర్పములచే భక్షితు డగును. రాగిషు రంస్యతే-విషయాసక్తులలో క్రీడించును. జగత్ అత్స్యతి-జగమును భక్షించును. ద్యాం నిర్వేక్ష్యతి-స్వర్గ మనుభవించును. ఇట్లిందు నిరూపించుటచే, బ్రహ్మాదు లస్తమించినను శివుడస్తమింప డని శివప్రభావము గోచరించును. ఇందు నందిప్రభృతులు కపాలలిపిని పదశః పఠించుచున్నారను వాక్యార్థ మభిధీయమానము. ఇది యవి బ్రహ్మాదుల కపాలములని గోచరింప జేయుచున్నది. మహాధ్వోపసంహారము కలిగినను శివు డనుపహితప్రభావుడై యని ఏకాకియై యుండునని గోచరించును. ఈ ధ్వన్యమానము విశ్వం స్రక్ష్యతీత్యాది పదార్థమున ననుస్యూతమై యనునదమున నున్నట్లు నిరూపితమగుటచే ననునాదధ్వని యని భోజు డనెను. ఈభావముల నీ గ్రంథము సూత్రీకరించినది.

కపాలదామలిఖిత మయిన స్రక్ష్యత్యాదిపదాత్మక మయిన లిపిని గణములు పఠించు చున్నారను వాక్యార్థము అభిధీయమానము. దానిచే సృష్ట్యాది కర్తలగు దేవుల దామగమ్యు మగును. ఇట్లీ ప్రతీత మయిన యర్థము శివుని దేవాదిసంసరణము ప్రతీత మొనరించును. ఆ సంసరణముచే శివుని నిత్యత్వము ఏకత్వము స్వాతంత్ర్యము మొదలగునవి ప్రతీతము లగును. ఇట్టి వ్యజ్యమాన మంతయు నభిధీయమానమున ననుస్యూతమై యున్నది. కావున ననునాద ధ్వని యగును.

శివుని గళము నందలి కపాలమాలలోని కపాలములు బ్రహ్మ విష్ణు వరుణ వాయు కామ యమ దేవేంద్రులకు సంబంధించినవిగా గోచరించును. ఇచట కపాలమాల పంచవక్త్రుడయిన శివుని లలాటమాల యని భావించుట తగునా? నంద్యాదులు లిపిస్తకము పఠించిరి. శివుని మెడలోని కపాలమాల బ్రహ్మాదుల దని భోజుడు స్పష్టముగ ననెను. ఇట్లనుట యుక్తము.

భమ ధమ్మిఅ వీసత్థో ఇత్యాదిర్వాఽనునాదభాక్
భ్రమేతి విధిరూపో యో వాక్యార్థోఽభిహితః పురః. 193

న గంతవ్యా చ గోదేతి నిషేధోఽనేన గమ్యతే
తేన సంకేతభూమి స్తదనుస్యూతం ప్రతీయతే. 194

అనునాదధ్వని కొక యుదాహరణము నిరూపిత మయినది. ధ్వని కారాదిప్రసిద్ధ మయిన వేరొక యుదాహరణ మిచట నున్నది. భ్రమ ధార్మికే త్యాదిక మేని యనునాదభాజన మగును.

భ్రమధార్మిక విస్రబ్ధం స శ్వాఽద్యమారితస్తేన
గోదా నదీ కచ్ఛ కుడుంగ వాసినా దృప్తసింహేన.

ధార్మిక! నీ విచట నిశ్శంకముగా సంచరింపుము. గోదానదీ నికుంజ మున నివసించు దృప్తసింహము ఆ శునకమును చంపినది. ఇచట మొదటగా భ్రమయను విధిరూపమగు వాక్యార్థము నిరూపిత మయినది. దీనిచే గోదా ప్రదేశము నీకు పోదగినది కాదు. నీ విచట భ్రమింపవలదు. "మా భ్రమ" అను నిషేధము గోచరించుచున్నది. దీనిచే నిది మా సంకేతభూమి యని భాసించును. ఇది వాచ్యానుస్యూతమై వ్యంగ్య మగుచున్నది. కావున నిది యనునాదధ్వని లక్ష్యము.

లావణ్య సింధురిత్యాది ప్రతిశబ్దనిదర్శనం
యతః సింధూత్పలాద్యర్థానననుస్యూతః స్వనన్నపి. 195

తత్తత్సమానావయవా న్నూపాతిశయబోధకాన్
పృథగేవోపలభతే స ఏవ స్యాత్ప్రతిధ్వనిః. 196

అర్థమగు ప్రతిశబ్దధ్వని కిది యుదాహరణము. అభిధీయమాన

వాక్యార్థము కన్న వేరుగా నుండి గుహాదులలోని ప్రతిధ్వని వలె ననురూప మగు నర్థాంతరమును గోచరింప చేయునేని ప్రతిశబ్దధ్వని యని నిరూపితమె.

లావణ్యసింధురపరైవ హి కేయమత్ర
యత్రోత్పలాని శశినా సహ సంప్లవంతే.

ఉన్మజ్జతి ద్విరదకుంభతటీ చ యత్ర
యత్రాపరే కదలికాండమృణాలదండాః.

ఇచట లావణ్యసింధువు వేరొకటి కలదు. ఇది యేమి? ఉత్పలములు చంద్రునితో గూడి యీదుచున్నవి. గజకుంభములు మునుగుచున్నవి. కదలి కాండములు మృణాలదండములు వేరువిధముగా నున్నవే! దీనిలో వ్యంగ్యార్థము వాచ్యము లగు సింధూత్పలాదులతో ననుస్యూతము కాదు. రూపాతిశయబోధకము లగు తత్తత్సమానావయవములను వేరుగా నిరూపించుచున్నది. అదియె ప్రతిధ్వని. ఇందు భోజుని ప్రతిపాదన మిట్లున్నది. ఉత్పలాదిశబ్దములకు లోచనాదు లుపమేయములు. ఉత్పలాదిశబ్దముల కుత్పలాదులు వాచ్యములు. ఆపదములు లోచనాదులతో సాదృశ్యము బోధించునవై వర్ణనీయ వనితకు చారుత్వోత్కర్షమును ధ్వనింప జేయుచున్నవి. అది వాచ్యము కన్న వేరుగా ననుస్యూతముగా నుండుటచే ప్రతిశబ్దధ్వని యయినది.

భక్తిప్రహ్వాయ దేత్యాదావనునాదః ప్రతీయతే
విశేషణానాం తుల్యత్వాత్సామర్థ్యాత్కరశబ్దజాత్. 197

క్రియాసురితి వాక్యార్థో హస్తానుస్యూతమేవ యత్
అనునాదం ప్రజనయన్ రూపైః పురుషరూపతామ్. 198

తేజస్వితాం చ ధ్వనయత్యనునాదోఽత్ర దృశ్యతే

శబ్దధ్వనియు రెండు విధములు. అందు అనునాదరూపధ్వని కిది యుదాహరణము. మయూరుని సూర్యశతకములోని యీ శ్లోక మిట్లున్నది.

భక్తిప్రహ్వాయ దాతుం ముకులపుటకుటీకోటరక్రోడలీనాం
లక్ష్మీమాక్రష్టుకామా ఇవ కమలవనోద్ఘాటనం కుర్వతే యే,
కాలాకారాంధకారాననపతితజగత్సాధ్వసధ్వంసకల్యాః
కల్యాణం వః క్రియాసుః కిసలయరుచస్తే కరా భాస్కరస్య.

ఇందు శబ్దశక్తిస్వాభావ్యమున లభించు రెండు భావములు సంగ్రాహ్యములు. కిసలయ కాంతి కల సూర్యకిరణములు శుభ మాపాదించు గావుత. భక్తివినమ్రమున కిచ్చుటకై మొగ్గల మాటున నున్న శోభ నాకర్షించునవై యవి కమలవనవికసన మాపాదించు చున్నవి. ఆ కిరణములు చీకటిలో చీకాకుపడు లోకుల వ్యాకులము పోగొట్టునవిగా నున్నవి. రెండవభావ మిట్లు పరిగ్రాహ్యము. భాస్కరు డను చోరవీరుని కరములు మీకు బంగారము కూర్చుగావుత. తన్ననుసరించి యుండు భక్తివినమ్రమున కిచ్చుటకై భవనక్రోడములలో దాచి యుంచిన సంపదకు నై యుద్ఘాటన మొనరించు కరములు కాలాంధకారమున సంచరించు వారి సాధ్వసధ్వంస సమర్థములుగా నున్నవి.

దీనిలో భాస్కరకరములు కల్యాణ మాపాదించు గావుత మను వాక్యార్థము కరశబ్దశక్తిస్వాభావ్యమున కిసలయరుచీత్యాది సర్వవిశేషములు సాధారణములుగా నుండుట వలనను హస్తరూపార్థమున ననునాదము కలుగ జేయుచున్నది. భాస్కరభగవానునకు తేజోరూపత్వము పురుషరూపత్వమును ధ్వనింపజేయుచున్నది. ఈ యుభయము వాచ్యానుస్యూతమె యయినందున ననునాదధ్వని. ఇట్టిభావ మిచటి కారికలలో గ్రాహ్యము.

విశేషణముల తుల్యత్వము వలన కరశబ్దజన్య మయిన సామర్థ్యము వలన క్రియాసుః అను వాక్యార్థము హస్తరూపార్థానుస్యూతముగనె అనునాదాత్మకార్థమును ప్రకాశింప జేయుచున్నది. సూర్యునందు పురుషరూపత్వమును తేజస్విత్వమును ధ్వనింపజేయుచున్నది కావున ననునాదధ్వని యయినది.

దత్తానందేతి వాక్యాదౌ ప్రతినాదధ్వనిర్యథా. 199

విశేషణానాం తుల్యత్వాత్సామర్థ్యాదపి యో గిరః
ప్రతిశబ్దం ప్రజనయన్ధేనుషు స్వవిశేషణైః. 200

మాహాత్మ్యం ధ్వనయత్యాసాం ప్రతినాదో భవేత్తతః
శబ్దధ్వనిర్ద్వివిధా భూతః శబ్దాదేవావగమ్యతే. 201

"దత్తానందాః ప్రజానాం" అను పద్యమున శాబ్ద మయిన ప్రతినాదధ్వని యున్నది. పూర్వశ్లోకము నందు వలె విశేషణముల తుల్యత్వ మున్నది. శబ్దసామర్థ్య మున్నది. స్వవిశేషణములచే ధేనురూపార్థమునందు ప్రతిశబ్దము నుత్పాదింపజేయునదై సూర్యకిరణముల మాహాత్మ్యమును ధ్వనింపజేయుచున్నది.

కావున నిది ప్రతినాదాత్మక మయిన ధ్వని. శబ్దధ్వని ద్విధాభూతమై శబ్దము వలననె యవగత మగుచున్నది.

ఇట్టి యీ గ్రంథకారికాభావము గుర్తించుటకు శృంగారప్రకాశము నం దుదాహృత మయిన శ్లోకమును తద్భావమును తత్సమన్వయము నీ విధముగా దెలియదగును.

దత్తానందాః ప్రజానాం సముచితసమయాక్లిష్టసృష్టైః పయోభిః
పూర్వాహ్ణే విప్రకీర్ణా దిశి దిశి విరమత్యహ్ని సంహారభాజః
దీప్తాంశోర్దీర్ఘదుఃఖప్రభవభవభయోద న్వదుత్తారనావో
గావో వః పావనానాం పరమపరిమితాం ప్రీతిముత్పాదయంతు.

ఈ శ్లోకమున గూడ శబ్దశక్తిస్వాభావ్యమున భాసించు భావద్వయము నీ విధముగా గుర్తించునది. సూర్యదేవుని కిరణములు పరిపూత లయిన వారలకు నపరిమిత మయిన ప్రీతిని సంపాదించు గావుత. ఆ కిరణములు తగిన సమయమున సృజించిన జలములచే ప్రజల కానంద మిచ్చునవి, పూర్వాహ్ణమున దిశదిశలలో వ్యాపించినవి, సాయంసమయమున నుపసంహృతము లయినవి, దీర్ఘదుఃఖసంజాత మయిన సంసారభయమును సంహరించునవిగా నున్నవి.

రెండవ భావ మీ విధమున నుండును. గోవులు పరిపూతులయిన వారల కమితప్రీతిని సంపాదించు గావుత. ఆ గోవులు సముచితసమయమున నక్లిష్టముగా క్షీరముల నిచ్చి ప్రజల కానంద మిచ్చుచున్నవి. పూర్వాహ్ణమున దిశలలో దిరుగులాడి సాయంసమయమున శాలకు జేరుచున్నవి. సంసారమున దుఃఖభాజను లగు వారిని వైతరణినది దాటింప జేయుటకు నావలుగా నున్నవి.

ఇచట స్తూయమానము లగు సూర్యకిరణములు శబ్దశక్తిస్వాభావ్యమున, తుల్యవిశేషణయోగమున ధేనువు లందు ప్రతినాదము కలుగజేయుచున్నవి. ధేనువులందును విశిష్టమగు మాహాత్మ్యశేషమును ప్రతిధ్వనింప జేయుచున్నవి.

తాత్పర్య మను మూడవ సంబంధము యొక్క నిరూపణోపక్రమమున సూచితము లయిన అభిధేయ ప్రత్యాయ్య ధ్వనిరూపములు నిరూపితము లయినవి. ఈ యంశమున మీమాంసింపదగిన విషయము మిగిలి యున్నది.

ధ్వని యని తాత్పర్య మని రెండుపదములిచట సూచితములు. ధ్వని తాత్పర్యములకు భేదము కలదని కొందరందురు. వానికభేదమె యున్నదని కొందరందురు. ఇట్టి మతద్వయమునకు సామంజస్యము సూచింపవలసిన యావశ్యకత యున్నది. ఈ పర్యాలోచనమున కీ ప్రఘట్టార్థ మావశ్యకము.

ధ్వనితాత్పర్యయోః కైశ్చిత్పృథక్త్వం కథ్యతే బుధైః
"అప్రతిష్ఠమవిశ్రాంతం స్వార్థే యత్పరతామిదమ్. 202

వాక్యం విగాహతే తత్ర న్యాయ్యా తత్పరతాఽస్య సా
యత్ర తు స్వార్థవిశ్రాంతం ప్రతిష్ఠాం తావదాగతమ్. 203

తత్ప్రసర్పతి తత్తస్మాత్సర్వత్ర ధ్వనినా స్థితిః"
ధ్వనితాత్పర్యయోర్భేదం కేచిన్నేచ్ఛంతి తన్మతే. 204

సమానలక్షణత్వాచ్చ తయోర్న పృథక్ స్థితిః
ఉక్తం చ టీకాకారైశ్చ తయోరైక్యం ప్రతి క్వచిత్. 205

"ఏతావత్యేవ విశ్రాంతిస్తాత్పర్యస్యేతి కింకృతమ్
యావత్కార్యప్రసారిత్వాత్తాత్పర్యం న తులాధృతమ్." 206

ఇచటి భావార్థవివేచనమునకు ముందుగా శృంగారప్రకాశము నందలి విశేషమును, దశరూపకము నందలి విషయసంపదను గుర్తించుట యావశ్యకము. భోజశృంగారప్రకాశములో నిట్లున్నది.

"తాత్పర్యమేవ వచసి, ధ్వనిరేవ కావ్యే" మాటలో తాత్పర్యమె కావ్యమున ధ్వనియై యాస్వాద్యమని యున్నది. కావ్యవిషయముగా నున్న ధ్వని వచోవిషయముగా నున్న తాత్పర్యము - ఈ ద్వయమునకు భేదమేమి ? శాస్త్రమున నవక్రవచన ముండును. లోకమున నది యుండును. అర్థవాదాదులలో వక్రవచన మున్నది. అది కావ్యము. వక్తృవాక్యమున భాసించు నభిప్రాయసర్వస్వము తాత్పర్యము. అది యర్థధర్మము. ధ్వని శబ్దధర్మము. సౌభాగ్యము వలె తాత్పర్య మాంతరగుణము. వాగ్దేవిలావణ్యము వలె ధ్వని బాహ్యము. ఇవి దగ్గరగా నున్నందున ద్వయమున ద్వయము నెన్నుదురు. సురభియై శాఖములను మధుమాధవము లందురు కదా ! ఇది ధ్వని తాత్పర్యముల భేదము. సత్యమె. ఇప్పటికి నిది నిదర్శనమున ప్రతిపాదితము కాదో ? అయినచో వినవలయును. ప్రతిపాదింతును.

అనంతరగ్రంథ మంతయు కావ్యమున ధ్వనియని గ్రహింపదగును. వచనమున తాత్పర్యము రెండు విధములు — శాస్త్రమున నొకటి లోకమున నొకటి. ఆప్తోపదేశరూపమగు నాగమము శాస్త్రము. దానికై ప్రత్యాత్మ వేదనీయమగు ప్రత్యక్ష మపేక్షితము. ఆగమ ప్రత్యక్షములకు సహకారముగా లోకమును ప్రమాణము. వివక్షితార్థమునకు ప్రమాణత్రయమున ప్రతిపాదన ముండును. అది వాక్యార్థము. ప్రతిపాద్యుడగు పురుషుడు అప్రతిపన్నుడు విప్రతిపన్నుడు సంశయితుడుగా నుండును. ఆతురానాతురులలో భోజన మనా తురుడె గ్రహించునట్లు ప్రకృతమున గూడ గ్రాహ్యము. అప్రతిపన్నుని యను రోధమున విప్రతిపన్నసంశయితులకును ప్రథమముగా నాగమమె నిరూపితము. విప్రతిపన్నుడు సంశయితు డాగమము మానింపడు. వారికై సర్వప్రమాణ బలీయమగు ప్రత్యక్ష ముపన్యసింపదగి యుండును. విప్రతిపన్నుడు వైయాత్య మున ప్రత్యక్షమును గూడ నాదరింపడు. కావున వాని శాసనమునకై బ్రహ్మాస్త్ర రూపము సార్వలౌకికము నగు యుక్తి కావలెను. ప్రమాణత్రయోపన్యాస హేతువుగా నుండునది వక్త్రభిప్రాయము. ప్రమాణత్రయోపన్యాసమున సాంఖ్యదర్శనాశ్రయమున నిది సద్రూపముగనె ప్రతీతమగును. సాంఖ్యులు ప్రత్యక్ష మనుమాన మాప్తవచన మని ప్రమాణోపన్యాసక్రమ మాచరించుట యున్నది. ఇందాగమమును మొదట చెప్పుటలో తాత్పర్యమేమి? అప్రతిపన్నాను రోధమున నాగమమునె మొదట చెప్పవలసి వచ్చినది. "అన్యదప్యుచ్యతే" వేరొక హేతువును కలదు. "న తథా పదార్థాః ప్రత్యక్షేణ ప్రతీయమానాః స్వదంతే, యథా వాగ్మినాం వచోభిరావేద్యమానాః" "వక్తల వచనములచే నావేద్యమానము లాస్వాద్యమానము లగునట్లు ప్రత్యక్షముగ ప్రతీతములగు పదార్థము లాస్వాద్యమానములు కాజాలవు." అని యాగమమును మొదట చెప్పుటచే సూచిత మగును. "మేము సర్వథా సాంఖ్యదర్శనాశ్రయులము గాము." అనియు ప్రమాణవ్యుత్క్రమమున ప్రతిపాదిత మగును. "సాహిత్యస్య సర్వపార్షదత్వాత్" సాహిత్యము సర్వోత్తీర్ణము కదా! శాస్త్రీయవచననిరూపణ మున నిట్లున్నది. ఇట్లె లౌకికవచనమునగూడ అభిధీయమానము ప్రతీయమా నము నగు తాత్పర్యమును పర్యాలోచన మొనరింపవలెను. ఇంక నీ విషయ మున నపేక్షితమును నా శృంగారప్రకాశమున జూడనగును. ఇప్పటికె యిది విస్తృత మయినది.

ధ్వని తాత్పర్యములకు పార్థక్యము కలదనుటలో భోజభావము నిరూపిత మయినది. ధనంజయధనికుల భావ మిచట సమాలోచనీయము. అందలి తాత్పర్యనిరూపకవచనము లిం దుల్లిఖితము లయినవి. అందలి కారిక లిందున్నవి. ధనంజయుడు దశరూపకరచయిత; ధనికుడీతని సోదరుడు. ఇతడు దశరూపక మునకు ఆలోకమను సమన్వయాత్మకవ్యాఖ్య రచించెను. ఇద్దరి భావము లేకవిధముననున్నవి. సోదరులు వ్యంజనావృత్తి నిషేధింతురు. తాత్ప ర్యముచే సర్వము గమ్యమందురు. ధనికుడు రసనిష్పత్తి విషయమున ఈ వాదము నిరూపించి ఖండించెను. రసాదులకు కావ్యముతో వ్యంగ్యవ్యంజక భావము లేదని భావ్యభావకసంబంధ మున్నదని భావనాక్రియావాది మతానుసార మున నిరూపించెను. కావ్యమున భావ్యభావకసంబంధమునె స్థాపించెను. "ధ్వని వేరు తాత్పర్యము వేరు" అను వాదము చూపి ధనికుడు సర్వము తాత్పర్య రూప మనెను. భేదవాద మభేదవాదము ధనికవాచమున నున్నదని శారదా తనయుడు భావించి యీ ప్రతిపాదన ముపక్రమించెను. ఇక నిందలి కారికల యర్థము నిట్లు భావించునది.

ధ్వని తాత్పర్యములకు కొందరు పృథక్త్వము చెప్పుదురు. వాక్యము స్వార్థమున సప్రతిష్ఠమై యవిశ్రాంతమై యన్యార్థపర మగునచో నచట తాత్పర్య మనుట న్యాయ్యము. ఎచట వాక్యము స్వార్థవిశ్రాంతమై స్వస్వరూప మున ప్రతిష్ఠను పొందినదై యన్యార్థమున ప్రసారము పొందునో యచట నంతట ధ్వని స్థితి కలది యగును. ఇట్లు తాత్పర్యమునకు ధ్వనికి భేదము కలదు

"విషం భుంక్ష్వ మా చాస్య గృహే భుంక్థాః" యను స్థలమున విష భక్షణ నియోగపరమగు నర్థమున వాక్యమునకు విశ్రాంతి లేదు. విషభక్ష ణార్థము వాక్యార్థము కాదు. ప్రధానవాక్యార్థపరముగనె వాక్యము ప్రసరించును. కావున నిట్టి స్థలములందు తాత్పర్యము.

రసప్రతీతి కల స్థలములందు వ్యంగ్యమునకు వాక్యార్థత్వము లేదు. వ్యంగ్యము తృతీయకక్షావిషయము. వాక్యార్థము ద్వితీయకక్షావిషయము. ద్వితీయకక్షలో విభావాదిప్రతిపత్తియె కాని రసావగతి లేదు. కావున ధ్వని తాత్పర్యములకు భేదము కలదు.

ఇట్టి ధ్వనితాత్పర్యముల భేదమును కొందరంగీకరింపరు వారి మత మున ధ్వనితాత్పర్యములకు లక్షణము సమానము. వానికి పృథక్స్థితి లేదు.

దశరూపక టీకాకారుడు ధనికుడు (నాట్యవేదటీకాకారు డయిన భట్టనాయకుడో!) ధ్వని తాత్పర్యముల కొకచో నైక్యము నిరూపించెను.

తాత్పర్యమునకు క్రియాకారక సంసర్గాత్మక మయిన వాక్యార్థకక్ష యందే విశ్రాంతి యుండు ననుటలో నిమిత్తమేమి? తాత్పర్యము యావత్కార్య ప్రసారము కలది కావున తులాధృతము కాదు. తాత్పర్య మింతవఱకే ప్రసరించును; ఇటుపై ప్రసరింపదు - అనుట యుక్తము కాదు. తాత్పర్యమునకు నిశ్చిత మయిన యవధి లేదు. తాత్పర్యము వక్త కభిలషిత మయిన ప్రయోజనము-కార్యము సిద్ధించు వఱకు ప్రసరించును. వక్తృవివక్ష సిద్ధించు పర్యంతము తాత్పర్యము వ్యాపించును. పౌరుషేయవాక్యము వివక్షాపర తంత్రము. కావ్యమునకు వక్తృభిప్రేతతాత్పర్యమునె నిశ్చయింపవలెను. తాత్పర్యము ద్వితీయకక్షలో విశ్రాంత మగునని నియమము లేదు. వివక్షితార్థసిద్ధి పర్యంతము తాత్పర్యవ్యాప్తి యున్నది. ధ్వనియు నిట్టిది కావున ధ్వనితాత్పర్యములకు భేదకథన మావశ్యకము కాదు.

ధ్వనితాత్పర్యయోర్భేదో బ్రాహ్మణబ్రహ్మచారివత్
తదవాంతరభేదో హి ప్రాయేణ పృథగుచ్యతే. 207

బ్రాహ్మణబ్రహ్మచారులకు వలె ధ్వనితాత్పర్యములకు భేదము భావించునది. బ్రాహ్మణుడు బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థ సన్యాసి భేదములు కలవాడగును. తాత్పర్యము అభిధీయమానము ప్రతీయమానము ధ్వనిరూప మను భేదములు కల దగును. బ్రహ్మచారి బ్రాహ్మణాతిరిక్తుడు కాడు. ధ్వని తాత్పర్యాతిరిక్తము కాదు. బ్రహ్మచారి బ్రాహ్మణుడె. ధ్వని తాత్పర్యమె. సామాన్యముగా తదవాంతరభేదము వేరుగా నిరూపిత మగుచున్నది. భోజుడు శృంగారప్రకాశములో నీ యంశము నీ విధముగా జెప్పెను.

తాత్పర్యమేవ వచసి ధ్వనిరేవ కావ్యే
సౌభాగ్యమేవ గుణసంపది వల్లభస్య
లావణ్యమేవ వపుషి స్వదతేఽంగనాయాః
శృంగార ఏవ హృది మానవతో జనస్య. 208

వచనమున తాత్పర్యమె యాస్వాద్యము. కావ్యమున ధ్వనియె యాస్వాద్య మగును. వల్లభుని గుణసంపదలో సౌభాగ్యమె సంభావ్యము. అంగనాదేహమున లావణ్యమె రస్యము. అభిమానము కలవాని హృదయ

మున శృంగారమే యాస్వాద్యమాన మగును. వచఃకావ్యములలో తాత్పర్య ధ్వను లున్నవి. సామాన్యముగా వాక్యమున తాత్పర్యమె. వక్రతావిచ్ఛిత్తి కల కావ్యమున ధ్వని యున్నది.

అతో ధ్వన్యాఖ్యతాత్పర్య గమ్యమానత్వతః స్వతః
కావ్యే రసాలంకారాదిః వాక్యార్థో భవతి ధ్రువమ్. 209

ఏవం త్రిరూపం తాత్పర్యం తత్తత్తాత్పర్యవేదిభిః
వక్తృద్వారా వాక్యధర్మ ఏవేతి పరికీర్త్యతే. 210

కావున కావ్యమునందు రసాలంకారాదికము వాక్యార్థ మగును. ధ్వని యను తాత్పర్యమున గమ్యమాన మగుటచే నది వాక్యార్థము. ధ్వన్యమానము వస్తు వలంకారము రస మని త్రివిధముగా నుండగా నిందు రసము ధ్వన్యమానమె కావున వాక్యార్థరూపము కాదు. విభావాదిసంసర్గాత్మకమె వాక్యార్థము. రసము విభావాదిసంసర్గమున ధ్వన్యమానము. వస్త్వలంకారములు ధ్వన్యమానము లయి నను వాక్యార్థవిశ్రాంతములు నగును. గుణీభూతవ్యంగ్యములుగా నెన్నదగిన రసవదాద్యలంకారములును వాక్యార్థరూపము లగును.

ఇట్లు తాత్పర్యవేదులు తాత్పర్యము త్రిరూప మనిరి. తాత్పర్యము వక్తృద్వారమున వాక్యధర్మమె యని కీర్తిత మయినది. శాస్త్రగహన మయిన యీ విషయ మింక నాకరముల నుండి గ్రాహ్యము. ఈ యనంతరము పూర్వోద్దిష్ట ప్రకారమున ప్రవిభాగ సంబంధమును నిరూపింపవలెను.

అర్థస్యైతావతః శబ్ద ఏతావానఖిలమిత్యయం
ప్రవిభాగోఽర్థభాగేషు శబ్దభాగవిభాగతా. 211

మహావాక్యార్థదేహస్య య ఏవావయవాః స్మృతాః
తే చావాంతరవాక్యార్థాస్తత్ర తత్రయథాక్రమమ్. 212

మహావాక్యస్యావయవభూతావాంతరవాక్యభాక్
విభాగః ప్రవిభాగః స్యాత్పదానామప్యవాంతరే. 213

వాక్యే పదార్థేషు పదే ప్రకృతిః ప్రత్యయస్తతః
తదర్థేషు విభాగో యః ప్రవిభాగ ఇతీరితః. 214

అపి యద్వ్యతిరేకేణ నిష్కృష్టం ప్రవిభాగతః
ప్రత్యాయనం పదార్థానాం పదేన ప్రథమం తతః. 215

వివక్షా చైవ తాత్పర్యం ప్రవిభాగ ఇతి క్రమాత్
ఏవం శబ్దేచానురూప్యం వక్తృద్వారా నిరూప్యతే. 216

ఇంతటి యర్థమునకు ఇంతటి శబ్దము చాలును; ఈ యర్థమునకీ శబ్దము చాలును - అను విధమున నర్థభాగము లందు శబ్దభాగవిభాగముండుట ప్రవిభాగ మని యందురు. మహావాక్యార్థదేహమున కేవేవి యవయవములుగా ప్రఖ్యాతము లయినవో యవి యవాంతర వాక్యార్థములుగా నా యా స్థలము లందు గోచరించు చున్నవి. మహావాక్యమున కవాంతరవాక్య మవయవము. అది దాని విభాగము. అవాంతరవాక్యములలో పదములు అవయవములుగా నున్నవి. అది ప్రవిభాగము. మహావాక్యార్థమున నవాంతరవాక్యార్థము అందు పదార్థము ప్రవిభాగపదమున వ్యవహార్యము. పదమున ప్రకృతి ప్రత్యయము ప్రవిభాగమె. తదర్థముల విభాగము ప్రవిభాగమె. ప్రవిభాగతః ప్రవిభాగము సరిగ లేకపోయినచో నిష్కృష్టముగా పదార్థముల ప్రత్యాయనము-ప్రతిపత్తి కలుగదు. కావున పదమునందు నట్టిపరిజ్ఞానము కలుగుటకై వివక్ష తాత్పర్యము ప్రవిభాగము వక్తృద్వారముననె నిరూపిత మగును. ఇట్లే శబ్దమున నానురూప్యమును వక్తృద్వారమున నిరూపిత మగును.

అప్రసక్తము కాని యీ విషయము నిచట సంభావింప వలెను. పదమున వాక్యమున ప్రబంధమున గాని ఈ శబ్దమున కీ యర్థము, ఈ యర్థమున నీ యీ శబ్దము అని శబ్దార్థములకు పరస్పరము సంబంధించిన విధముగా వేరు వేరుగా నిర్ధారణ మొనరించుట ప్రవిభాగము. ఈ ప్రవిభాగ మన్వయ, వ్యతిరేకములచే రెండు విధములు. అత్యంత సంసృష్టము లగు పదార్థముల ప్రవిభాగమున నన్వయవ్యతిరేకముల కన్న వేరొక హేతు వుండదు.

లోకమున బధిరు డయినను కంటితో చూచును. చెవి యున్నను కన్ను లేనివాడు కానడు ఇట్లన్వయవ్యతిరేకములచే కన్నులు చెవు లున్నప్పుడు రూపాలోకము నేత్రముననే కలదని శ్రోత్రమునకు లేదని వ్యవస్థాపిత మగుచున్నది. ఇట్లే శబ్దశాస్త్రమున గూడ నున్నది. సుబంతములు తిజంతములు నయిన పదములలో అర్థములు శబ్దములు అత్యంతము సంసృష్టములై యున్నవి. ప్రకృతి ప్రత్యయములు మిథః సంబంధించి యుండును. ఇట్టి వానికి అన్వయ వ్యతిరేకముల వలననె ప్రవిభాగము సంపాదింప వలెను.

అన్వయవ్యతిరేకములు ప్రవిభాగమును సంపాదింపగలవా? అవి యర్థవత్త నాపాదింప గలవా? శబ్దార్థముల కవధారిత మయిన సామర్థ్యము అన్వయవ్యతిరేకములచే ప్రవిభక్త మగును. బహుశబ్దము లేకార్థములుగా నున్నవి. శబ్ద మొకటి బహ్వర్థములుగ నుండును. నియమముగ నొక శబ్ద మొక యర్థము ననె యున్నచో ప్రవిభాగము కుదురును. శబ్దము లనేకము లేకార్థమున నుండుట, ఒక శబ్ద మనేకార్థ మగుట యున్నది కదా! ప్రకృతిప్రత్యయార్థ విభాగమున నన్వయవ్యతిరేకములు నిమిత్తము లగునా? అయిన, ప్రకృతియె సర్వార్థ మిచ్చును. ప్రత్యయ మేని సర్వార్థప్రదము. రెండును రెండర్థములను జెప్పును. అప్పు డర్థవత్త సిద్ధము కాదా? సిద్ధించును. అర్థవత్త సిద్ధింప దని యనము. ఆ యన్వయవ్యతిరేకము లుండవు అప్పుడిది ప్రకృత్యర్థ మని యిది ప్రత్యయార్థ మని యెట్లు తెలియును? అన్నియు ప్రకృత్యర్థము లని యన్నియు ప్రత్యయార్థములని సామాన్యశబ్దములె యగును. సామాన్యశబ్దములు విశేషము ప్రకరణము లేక విశేషార్థమున నుండవు ప్రకరణాదులు లేకున్నను స్వభావతః ఒక యర్థము గోచరించినచో సామాన్యశబ్దము లనము ప్రకృతి ప్రకృత్యర్థమున నున్నది; ప్రత్యయము ప్రత్యయార్థమున నున్న దందుము. కావున నన్వయవ్యతిరేకములచే శబ్దము లర్థములు వ్యవస్థితములు. అన్వయవ్యతిరేకముల వలననె వ్యావహారిక మయిన యర్థవత్త యున్నది. శబ్ద ముత్తరకాలమున నర్థము త్యజింపదు గ్రహింపదు. శబ్దము త్రివిధము: నివర్త్యము-అన్వాఖ్యేయము-ప్రతిపాదకము నని. వీనిలో నధర్మహేతువగు నపభ్రంశము నివర్త్యము. ధర్మహేతువు లోకవేదముల ప్రయోగార్హ మన్వాఖ్యేయము ప్రకృతిప్రత్యయాది విభాగకల్పనచే స్వరూపబోధ మొనరించునది ప్రతిపాదకము. దానికై యన్వయవ్యతిరేకములు లేకున్నను వ్యవస్థకై కల్పితము లయినవి. అవి శాస్త్రార్థవ్యవహారనిబంధనము లగుచున్నవి. అన్వయవ్యతిరేకములు లేకున్న శాస్త్రవ్యవహార మసుకరము. ఇది భోజభాష.

శబ్దార్థసంబంధము త్రిస్కంధము కాగా ప్రథమస్కంధము నందలి వృత్తి వివక్షాతాత్పర్యప్రవిభాగములు సావష్టంభములుగా నిరూపితము లయినవి. రెండవ స్కంధములోని వ్యపేక్షాసామర్థ్యాన్వయైకార్థీభావముల నిపుడు నిరూపింప వలెను.

సా వ్యపేక్షా పదార్థానామాకాంక్షా యా పరస్పరం
యా చ క్రియాకారకాదిభావేనాన్వయయోగ్యతా.

వాక్యే పదపదార్థానాం తత్సామర్థ్యమితీరితమ్
పరస్పరస్య గ్రథనం పదానామన్వయః స్మృతః. 21
స క్షీరనీరవత్క్వాపి తిలతండులవత్క్వచిత్
పాంసూదకవదన్యత్ర దృశ్యతే బహుధాన్వయ . 21
అవిభాగేన భవనమేకార్థీభావ ఇష్యతే
అనేనైవ ప్రకారేణ వ్యాఖ్యాతా ముక్తకాదయః. 22

పదార్థములకు పరస్పరము క్రియాకారకాదిభావమున గల యన్వయ యోగ్యతారూపముగను యాకాంక్ష వ్యపేక్ష యనబరగును. ఒక పదమునకు పదాంతరముతో గల యన్వయయోగ్యత యని భావము. ఆకాంక్షారహిత మయిన వాక్యము ప్రమాణము కాదు. గౌరశ్వః; పురుషో హస్తీత్యాది వాక్యమున పదములకు పరస్పర మన్వయము లేనందున ప్రామాణ్యము లేదు. సాపేక్ష శబ్దశక్తిప్రకాశ మను పేరుగల శృంగారప్రకాశము లోని యష్టమ ప్రకాశమున వ్యపేక్షానిరూపణమున భోజప్రతిపాదన మిట్లున్నది. పదార్థముల కితరేతరత్వ త్వాకాంక్షయె వ్యపేక్ష. ఇది సన్నిహిత యోగ్యమున నుండును. సన్నిహితము యోగ్యము కాకున్న వ్యవహిత మయినను యోగ్యమునే యపేక్షించును.

ఈ వ్యపేక్ష సంక్షేపముగా త్రివిధము - ఆభిధానికి నైయాయికి నైషేధకి యని. ఇందాభిధానికి శ్రుతి-సమాఖ్యా-వాక్య-వికల్ప-సముచ్చయ-అతిదేశాదిభేదములతో నున్నది. నైయాయికి, ఊహ-విపర్యయ-విపరిణామ-అధ్యాహార-వాక్యవిశేషవ్యవహిత - కల్పనాదిభేదమున నున్నది. నైషేధకి, వచన-అసంభవ-విరోధ-కృతార్థ-పరిసంఖ్యా- అవధారణాదిభేదములతో నున్నది. ఇవి యింక నవాంతరభేదముల నున్నవి.

సామర్థ్యము. శబ్దార్థసంబంధములలో నిది యారవది. వాక్యమున పదములు పదార్థములు సంగతముగానుండుట సామర్థ్యము. ఇంత మాత్రమే యిందున్నది. ఇందు భోజరీతిని కొంత కలుపుకొన వలెను. ముఖ్యముగా సామాన్యాత్మక మయిన సామర్థ్య మను సంబంధము వ్యపేక్షలో నుండును. వ్యపేక్ష కల పదార్థములకు పరస్పరము సంబంధరూపత సామర్థ్యమని సామర్థ్య రూపము. భేదము సంసర్గము ఉభయము నని సామర్థ్యము త్రివిధము. "రాజ్ఞో భృత్యః" యను స్థలమున భృత్యశబ్దము పరాయత్తార్థవృత్తియె కాని స్వతంత్రార్థవృత్తి కాదని నిశ్చితమె. సామాన్యముగా స్వామి సంసర్గము నిశ్చిత

మయినందున స్వామ్యంతర వ్యవచ్ఛేదము భాసించును. ఇదియే భేదము. ఇతర ములు నాలోచనీయములు.

అన్వయము. పదముల పరస్పరగ్రథన మన్వయము. ఆ యన్వయ మొకచో క్షీరనీరములవలె నొకచో తిలతండులములవలె నొకచో పాంసూదక విధమున నన్వయ మనేకవిధముల నున్నది ఇందలి యీ యంశమున కింకను జతపఱచ వలెను. వ్యపేక్షాదులచే నేకార్థపరముగా నుపాత్తము లయిన పదార్థములకు మిథోఽభిగ్రథన మన్వయ మని భోజనిరుక్తి. ఈ యన్వయము శాక్తమని వైభక్తమని శక్తివిభక్తమయ మని మూడు విధములు. కర్మాది శక్తినిర్వృత్తము శాక్తము. సంబంధాది విభక్తినిర్వృత్తము వైభక్తము రెండిటిచే నిర్వృత్తము శక్తివిభక్తిమయము. క్షీరనీర తిలతండుల పాంసూదక సాదృశ్యమును భోజుడేకార్థీభావమున సూచించెను.

ఏకార్థీభావ మెనిమిదవది. అవిభాగమున నుండుట యేకార్థీభావము. ఈ ప్రకారముననె ముక్తకాదులు వ్యాఖ్యాతము లయినవి. వ్యపేక్షాసామర్థ్యా న్వయములు కల పదార్థములకు తిలతండుల విధమున క్షీరనీరరీతి పాంసూదక పద్ధతి అవిభాగమున నుండుట యేకార్థీభావ మగును. ఇది వ్యపేక్షకన్న భిన్నమె. ఏకార్థీభావమునం దైకపద్య మైకశబ్ద్య మైకస్వర మేకవిభక్తికత్వ మేకపదాభావ మేకశేష ముండును. వ్యపేక్షలో నివి యుండవు. ఈ యేకార్థీభావము సమాస తద్ధితాఖ్యాదులలో నుండును. ఇంక నవాంతరభేదము లనేకములు కలవు. క్రియా కారకావ్యయ విశేషణ పదార్థములు పరస్పర ముపకార్యోపకారక భావ మున నుండగా భావన విధి ప్రతిభగా వాక్యార్థ ముండును. కావున ఏకక్రియా కారకాభినివేశమున నున్న యుగలక సందానితక కలాపక కులకాది వాక్యవిశేష ములు నిరూపితములె యగును.

ద్వాభ్యాం చతుష్పదీభ్యాం తు యుగలం, త్రిసృభిః పునః
సందానితం, చతసృభిః కథితం చ కలాపకమ్. 221

ఏకప్రఘట్టకేనైవ నిబద్ధో వాక్యవిస్తరః
స సంఘాతో భవేత్, కోశో నానావాక్యోపసంగ్రహః. 222

నానాప్రఘట్టకైర్బంధః కోశ ఇత్యుచ్యతే బుధైః
స ఏవోద్యానసలిలక్రీడాదిభి రనేకధా. 223

ప్రబంధమధ్యే నద్ధశ్చేదేతత్ప్రకరణం భవేత్
తత్సమూహః ప్రబంధః స్యాత్ తత్ర రామాదివద్భవేత్. 224

న రావణాదివదిత్యత్ర విధితశ్చ నిషేధతః
సిద్ధో మహావాక్యార్థో యః స చతుర్వర్గసాధనః. 225

"వ్యాఖ్యాతా ముక్తకాదయః" ఏకార్థీభావస్వరూపప్రతిపాదనమున ముక్తకాదులు వ్యాఖ్యాతప్రాయములని సూచితమయినది. ముక్తకము, యుగలము, సందానితము, కలాపకము, సంఘాతము, కోశము, ప్రకరణము, ప్రబంధము - అనునెనిమిది ముక్తకాదులిందు సూచితములు. నాలుగుపాదములతో గూడిన యేకాన్వయము కల స్వస్వరూపపరిపూర్ణ మయిన అన్యాపేక్షారహిత మయిన పద్యము ముక్తకము. రెండు చతుష్పదులతో నున్నచో యుగలము. ఇదియె యుగ్మము. మూడు చతుష్పదులున్న సందానితము. ఇదియె విశేషకము. నాలుగు చతుష్పదు లున్న కలాపకము. ఏకప్రఘట్టకమున నిబద్ధ మయిన వాక్యవిస్తరమునకు సంఘాతకమని పేరు. నానావాక్యోపసంగ్రహము కోశము. నానాప్రఘట్టకములతో నున్న బంధమును కోశమె. నానాప్రఘట్టక నిబద్ధమయిన కోశ ముద్యానసలిలక్రీడాదులచే ననేకవిధముగా ప్రబంధమధ్యమున నద్ధ మయిచో నది ప్రకరణ మగును. అట్టి ప్రకరణముల సమూహము ప్రబంధము. శ్రీమద్రామాయణ మొక ప్రబంధము. అందు రామాదులవలె వర్తింప వలెనను విధివలన, రావణాదులవలె వర్తింపరాదను నిషేధమువలన సిద్ధమగు మహావాక్యార్థము చతుర్వర్గసాధనమగును.

ఈ విషయమున భోజభావములలో కొంతవిశేషమున్నది. ఏకప్రఘట్టకోపనిబంధము కల సుభాషితముల సమూహము సంఘాతము. అనేక ప్రఘట్టకోపనిబద్ధముల సమూహము కోశము. నగరఋతూద్యానచంద్రార్కోదయార్ణవవర్ణనాదులు సంఘాతరూపములె. అవి ప్రబంధాంతఃప్రసారముకల వాక్యసమూహరూపములై ప్రకరణవ్యపదేశమున నవాంతరవాక్యత్వము పొందుచున్నవి. అవి ప్రబంధార్థమున్నవై యేకార్థీభావ మనుభవించు నవి యగును. మహావాక్యార్థము వానిచే నుపకృతమగును. సర్గబంధాదులలో నాఖ్యాయికాదులలో ముఖప్రతిముఖగర్భనిర్వహణములను పంచసంధులను గూడి యుపక్షేపపరికరాది చతుష్షష్టి సంధ్యంగసహితమై భారత్యాదివృత్తిచతుష్టయోపేతమై విశేషణ విశేష్యభావసంయుతమై మహావాక్యార్థరూపమున ప్రథిత మగును. ఇది వేరొక

ప్రబంధైకార్థీభావమని సమాఖ్యాత మయినది. తద్రూపము అయిన రామాయణాదిప్రబంధార్థముల వినిశ్చయమున సముపహితసంస్కారుడగు సహృదయునకు "రామవద్వర్తితవ్యం న రావణాదివత్" అను విధినిషేధప్రతిభావిశేష ముదయించును. అది సమస్త విశ్వవ్యాపి చతుర్వర్గైకహేతువు. మహావాక్యైకార్థమై అర్థమూర్తిగా విపరిణతమయిన అనాదినిధన మఖండమగు శబ్దబ్రహ్మ యని విఖ్యాత మయినది.

అఖండస్స ఏష వాక్యార్థః శబ్దబ్రహ్మేతి గీయతే
శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి.
ఇదమాద్యం పదస్థానం సిద్ధిసోపానపర్వణాం
ఇయం సా మోక్షమాణానా మజిహ్మా రాజపద్ధతిః.

ఈ యఖండవాక్యార్థము శబ్దబ్రహ్మ. శబ్దబ్రహ్మనిష్ణాతుడు పరంబ్రహ్మ పొందును. సిద్ధిసోపాన పర్వములలో నిది మొదటి పదస్థానము. ముక్తి భాజనుల కిది యవక్రమయిన రాజపద్ధతి.

శబ్దార్థసంబంధములలో నాలుగు నాలుగు నిరూపితము లయినవి. ఇక నాలుగున్నవి.

అతః స్కంధో వ్యపేతాదిః వాక్యవాక్యార్థయోరపి
స్మృతోఽంతరంగభూతశ్చైత్యేవం నిర్ణీయతే బుధైః. 226

ఏవంవిధస్య వాక్యస్య సుప్రయోగార్హతోచ్యతే
నిర్గుణత్వం సదోషత్వం రసాలంకారశూన్యతా. 227

ఏతాని ఘ్నంతి వాక్యస్య సుప్రయోగార్హతాం ధ్రువం
ప్రయోగయోగ్యతాం కుర్యుర్యేచత్వారో గుణాదయః. 228

ఉక్తంచ

"సగుణం సరసం కావ్యం సాలంకారం చ యద్భవేత్
తన్నిర్దోషం సదోషం తు తద్విపర్యయతో భవేత్. 229

వ్యపేతాదిక మయిన యీ స్కంధము వాక్యవాక్యార్థములలో నంతరంగముగా నున్నదని బుధులు నిర్ణయించిరి. ఏవంవిధమయిన వాక్యమునకు సుప్రయోగార్హత నిరూపిత మగును. నిర్గుణత్వము సదోషత్వము రసశూన్యత

అలంకారశూన్యత అనునవి వాక్యము యొక్క సుప్రయోగార్హతను నశింప జేయు ననుట నిశ్చితము. గుణాదులు నాలుగు ప్రయోగయోగ్యతను సంపాదించును. సగుణము సరసము సాలంకారము నగునది కావ్యము. అది నిర్దోషము. విపర్యయముగ నున్నచో నది సదోష మగును.

## దోషములు

దోషస్త్రిధా పదే వాక్యే వాక్యార్థేచ యథాక్రమం
తత్ర తత్రైవ భిన్నాః స్యుస్తేఽపి షోడశధా పునః. 230

భోజాదిభిరలంకారా గుణా దోషాశ్చ దర్శితాః
అతో విరమ్యతే తేషాం రూపం కథయితుం మయా. 231

ప్రబంధము నందు దోషము త్రివిధము - పదమున వాక్యమున వాక్యార్థమున. అవి క్రమముగా నచ్చటచ్చట పదునారు విధముల భిన్నములుగా నున్నవి. భోజాదు లలంకారములను గుణములను దోషములను నిరూపించిరి. కావున వాని రూపకథనమునుండి విరమించుచున్నాము. వాని నాయా గ్రంథము లందు దర్శింప వచ్చును.

భోజాదులు నిరూపించి రనుట శృంగారప్రకాశసమాదరము. భోజాశయ మీ విధమున నున్నది. శబ్దార్థముల సాహిత్య మభిధావివక్షాదులచే నిరూపితము కాగా వాక్యము ప్రయోగయోగ్యమగునో కాదో నిశ్చిత మగును. ఒక శబ్దము నేని సమ్యక్ ప్రయోగించినచో నది స్వర్గమున లోకమున కామదుఘ యగుననిరి. దుష్ప్రయుక్తమయినచో నధర్మమున కగుననిరి. దోషహానము గుణాదానము అలంకారయోగము రసావియోగ మున్నప్పుడు సమ్యక్ప్రయోగ ముపపన్నమగును. వీనిలో దోషహానమె మొదట విధేయము. కామినీశరీరము కమనీయరూపసంపదుపేత మయినను ఒక కుష్ఠపు బిందు వున్నను దౌర్భాగ్య మనుభవించును.

దోషములు మూడు విధములు - పదదోషములు, వాక్యదోషములు, వాక్యార్థదోషములు నని. పదగతదోషాభావము వాక్యప్రయోగయోగ్యతానిశ్చాయకము. దోషయుతత్వ మనర్హతానిశ్చాయకము. వాక్యావస్థలో పదములు పదార్థము లుండవు. చిత్రమున నీలపీతరక్తాదులు గాని, పానకమున గుడామలకమరీచాదులు కాని, గ్రామరాగమున షడ్జర్షభగాంధారాదులు కాని చిత్రాదులకన్న వేరుగా భాసింపవు. అట్లే వాక్యమునందును క్రియాకారకవిశేషణాదిపదములు గాని తదర్థములు గాని వాక్యవాక్యార్థముల కన్న వేరుగా

గోచరింపవు. వాక్యార్థమఖండమె. అయినను పదగత దోషగుణనిరూపణము యుక్తమె.

పదదోషములు 16: అసాధువు అప్రయుక్తము కష్టము అనర్థకము అన్యార్థకము అపుష్టార్థకము అసమర్థము అప్రతీతము క్లిష్టము గూఢార్థము నేయార్థము సందిగ్ధము విరుద్ధము అప్రయోజకము దేశ్యము గ్రామ్యము.

వాక్యదోషములు. 16: శబ్దహీన పునరుక్తిమత్ అపక్రమ భిన్న వృత్త యతిభ్రష్ట విసంధి వ్యాకీర్ణ సంకీర్ణ గర్భిత అపద అశరీర హీనోపమ అధికోపమ భిన్నలింగ భిన్నవచన శ్లేషాదిగుణవిపరీతములు.

వాక్యార్థదోషములు 16: అపార్థ వ్యర్థ ఏకార్థ ససంశయ అపక్రమ భిన్న అతిమాత్ర పరుష విరస న్యూనోపమ అధికోపమ అసదృశోపమ అప్రసిద్ధోపమ నిరలంకార అశ్లీల విరుద్ధములు.

## గుణములు

నిర్దోషమగు కావ్యమునకు శరీరమునకు వలె కామనీయకోపపత్తిలో గుణోపాదాన మలంకారయోగ ముపాయము. గుణోపాదానాలంకారయోగములలో గుణోపాదనము గరీయః. కావున నదియె ముందుగా నిరూపిత మగును. గుణోపాదానమున నియతియు, అలంకారయోగమున కామచారమును కలదు ఇదియె గుణాలంకారముల విశేషము వనితాదేహమున గుణములు మూడు విధములు; ఆగుణాభిలాషుల కవి యాదరాతిశయహేతువులు-బాహ్యములు, ఆంతరములు, వైశేషికములు నని. అన్వవాయన యోరూపలావణ్యాదులు బాహ్యములు. శీలవైదగ్ధ్యమహాభాగ్యప్రభృతు లాంతరములు. దోషము లయిన నాశ్రయవిశేషాద్యుపాధివలన గుణత్వము పొందునవి వైశేషికములు.

కావ్యశరీరమునందును గుణములు మూడు విధములు. అందు బాహ్యములు శబ్దగుణములు. ఇవి యన్వయాదులవలె బాహ్యములుగా నవభాసించును అంతరము లర్థగుణములు. ఇవి సౌశీల్యాదులవలె విమర్శవిజ్ఞేయములు. వైశేషికములు దోషగుణములు. ఇవి ప్రమాతృవిశేషోపాధివలన దోషము లయినను గుణములుగా సమాఖ్యాతము లగును.

శబ్దగుణములు 24: శ్లేష, ప్రసాద, సమత, మాధుర్య, సౌకుమార్య, అర్థవ్యక్తి, కాంతి, ఉదారత, ఉదాత్తత, ఓజః, ఔర్జిత్య, ప్రేయః, సుశబ్దత,

సమాధి, సౌక్ష్మ్య, గాంభీర్య, విస్తర, సంక్షేప, సమ్మితత్వ, భావికత్వ, గతి, రీతి, ఉక్తి, ప్రౌఢి-అనునవి.

అర్థగుణములు 24: శ్లేషాదులు. వాని పేరి నామములు సమానములు. లక్షణములు భిన్నములు. పదాదిదోషములు కనుకరణాదులతో గుణత్వాపత్తికై దోషగుణములు కలవు. పూర్వపు వానివలె నివియు త్రివిధములు. ప్రత్యేకముగా నిరువది నాలుగు భేదముల నున్నవి.

దోషహానము గుణాదానము గుర్తించి కవి కావ్యము నిబంధించిన నిహాపరభోగము లనుభవించును. నిర్దోషము సగుణము సాలంకారము రసాన్విత మయిన వచస్సు సచ్చేతస్సులలో వసించును. దోషపరివర్జనమున గుణముల యావర్జనమున నంతరంగ ముండగా నలంకృతియోగము సుందర మగును.

## అలంకారములు

కావ్యశరీర మపాస్తదోష ముపాత్తగుణము కాగా చారుతోత్కర్ష ప్రసిద్ధికై యలంకారయోగమావశ్యకము. అలంకారములు మూడు విధములు—బాహ్యములు, ఆభ్యంతరములు, బాహ్యాభ్యంతరములు. వస్త్రమాల్యవిభూషణాదులు బాహ్యములు. దంతపరికర్మ నఖచ్ఛేదాలకకల్పనాదు లాంతరములు. స్నాన ధూప విలేపనాంజన ముఖవాస తాంబూలోపయోగాదులు బాహ్యాభ్యంతరములు. ఇవి లోకశరీరగతములు. కావ్యశరీరము నందును వస్త్రమాల్యభూషణాదిస్థానీయములు జాత్యాదు లయిన శబ్దాలంకారములు. దంతపరికర్మాదిస్థానీయములు స్వభావాఖ్యానాదులు అర్థాలంకారములు. స్నానధూపవిలేపనాదిస్థానీయములు ఉపమాదు లుభయాలంకారములు. ఇవి బాహ్యాభ్యంతరోభయాలంకారవ్యపదేశము పొందుచున్నవి.

వ్యుత్పత్త్యాదికమున శబ్దమునే భూషింపజేయునవి శబ్దాలంకారము లిరువదినాలుగు గలవు:

జాతి గతి రీతి వృత్తి రచన ఘటన ముద్ర ఛాయ యుక్తి భణితి శ్రవ్యత ప్రేక్ష్యత అభినేయత అధ్యేయత వాకోవాక్య ప్రశ్నోత్తర ప్రహేలిక గూఢ చిత్ర శ్లేష యమక అనుప్రాసములు.

వ్యుత్పత్త్యాదికమున నర్థమునే భూషింపజేయునవి యర్థాలంకారములు 24: జాతి సూక్ష్మ సార సమాహిత భావ విభావన హేతు అహేతు సంభవ విరోధ దృష్టాంత వ్యతిరేక అన్యోన్య పరివృత్తి మీలిత వితర్క స్మరణ భ్రాంతి ఉపమాన అనుమాన వక్ర అర్థాపత్తి అభావ ఆగమ ప్రత్యక్షములు.

శబ్దవిశేషద్వారకముగా నర్థవిశేషము ప్రతీతమయినచో నుభయాలంకారములు. ఇవియు 24. ఉపమ రూపకము సామ్యము సంశయము సమాధి సమాసోక్తి సహోక్తి సముచ్చయ తుల్యయోగిత లేశ అపహ్నుతి అప్రస్తుత ప్రశంస ఉత్ప్రేక్ష అర్థాంతరన్యాస దీపక పరికర క్రమ పర్యాయ అతిశయ ఆపేక్ష విశేష శ్లేష భావిక సంసృష్టులు.

ఈ యలంకారములలో నవాంతరభేదము లున్నవి. శబ్దసంశ్రయాలంకారములకన్న అర్థభూషలకు ప్రకర్ష యున్నది. ఇంతకన్న నుభయాలంకృతి యభిరూప. అంతకన్నను సంసృష్టి శోభ కలది.

సదాశివమతము

రసస్య వాక్యతాత్పర్యగోచరత్వాద్యథార్థతః
అతోఽనేన ప్రకారేణ వాక్యార్థత్వం చ సిద్ధ్యతి. 232

రసము వాక్యతాత్పర్యగోచరము. తదర్థమును తత్స్వరూపఫలమున ననుసరించి రసము నర్థే నిశ్చయింపవలెను. కవి కావ్యతాత్పర్యము రసమే. రసప్రతిపాదనమునకే కవి కావ్యమురచించెను. కవి తాత్పర్యము రసమునందె యున్నది. "తస్మిన్ పరః తత్పరః తత్పరస్య భావః తాత్పర్యం." రసబంధాధ్యవసాయమున నున్న కవి తాత్పర్యము రసమే. ఈ ప్రకారమున రసమునకు వాక్యార్థత్వము సిద్ధ మగుచున్నది.

రసాశ్రయే విగాయంతి కేచిత్తేషాం నిరాశ్రయా
భరతాదిమతేనైవ క్రియతే సోపపత్తికా. 233

ప్రోక్తః సదాశివేనాస్య స్వరూపాశ్రయనిర్ణయః
"రసః స ఏవ స్వాద్యత్వాద్రసికస్యైవ వర్తనాత్. 234

నానుకార్యస్య వృత్తత్వాత్కావ్యస్యాతత్పరత్వతః
ద్రష్టుః ప్రమోదవ్రీడేర్ష్యారాగద్వేషప్రసంగతః. 235

లౌకికస్య స్వరమణీసంయుక్తస్యేవ దర్శనాత్"
రత్యాదిరేవస్థాయ్యాఖ్యః తత్తదాలంబనాశ్రయః. 236

స్వవిభావాదిసంసృష్టరూపేణైవ రసో భవేత్
వ్యాపారేణ చ కావ్యస్య తదీయాభినయేన చ. 237

రసాత్మకత్వాదియమాశ్రాసియా స్వాద్యత్వమేష్యతి
సామాజికాదిరేవాస్య రసస్యాశ్రయ ఉచ్యతే. 238

రసాశ్రయ విషయమున కొందరు కొన్ని భావములను వెలువరించిరి. అవి విగానరూపములు, విరుద్ధములు. వాని నిరాక్రియ సోపపత్తికముగా నుండును. భరతాదుల ప్రక్రియానుసారముగ నా వాదములు నిరాకృతము లగును. భరతాదులు ప్రామాణికులు. భరతుడు అభినవగుప్తుడు ఇంక నిట్టివారు సూచించిన నిర్ణయానుసారమున విగీతవాదముల నిరాకరించుట యుక్తము. సదాశివుడు రసస్వరూపాశ్రయ నిర్ణయము నిరూపించెను. అది యిట్లున్నది.

ఆస్వాద్యమాన మగునదియె రసము. ఆ రసము రసికుడగు సామాజికునకు సంబంధించునదియె. సామాజికుడె వర్తమానుడు కావున నాతడె రసాశ్రయుడు; రస మనుకార్యుడగు రామునకు సంబంధించినది కాదు. అను కార్యులు గతించిరి. కావ్యము రామాద్యనుకార్యులకుగా నుదయింపలేదు. కావ్యము సామాజికపరమె కాని రామాదిపరము కాదు. ఈ కావ్యమువలన రామాదుల కుపయోగము కలుగు గావుత మని కవి కావ్యము రచింప లేదు. సామాజికులకు రసానందము కలుగు గావుత మని కవి కావ్యము రచించెను. కావున రసము సామాజికులదె; రామాదులది కాదు. రస మనుకార్యునిదె యయి నచో ద్రష్ట యగు సామాజికున కేకవిధమగు ప్రతీతి కలుగదు. లోకమున ప్రత్యక్షముగా ప్రేయసీప్రియుల ప్రణయచేష్టలను దర్శించునపుడు లోకమాన వున కేకవిధప్రతీతి కలుగదు. రాగము కలవానికి ప్రమోదము కలుగును. సభ్యమానవున కిది యసభ్యచేష్ట యని వ్రీడ కలుగును. పిదప రాగము కలవానికి ఈర్ష్య జనించును. క్షుద్రకామునకు రాగ ముదయించును. తన భోగ్య నీత డందుకొని నాడని యుద్రిక్తునకు ద్వేష ముదయించును. ఇట్లు భిన్నభిన్నభావు లకు భిన్నభిన్నభావములు కలుగును. అట్లే రస మనుకార్యునిదే యగునేని కావ్యమున గూడ నిట్టి వేరు వేరు భావములు కలుగవలసి వచ్చును. అట్లు కలుగుట లేదు. కావున రస మనుకార్యునిది కాదు.

స్థాయ్యాత్మక మయిన రత్యాదికము తత్తదాలంబనాశ్రయముగా నుండి తమ తమ విభావాదిసంసర్గమున సముల్లాసము పొంది రసమగును. కావ్యమునకు సంబంధించిన వ్యాపారముచే తత్తదభినయసంబంధముచే రసాత్మకత పొందుట స్థాయిభావమునకు నియతమై యున్నది. సామాజికులు తమ యందున్న స్థాయి సముల్లసిత మగుట నాస్వాదింతురు. కావున సామాజికుడె రసమున కాశ్రయ మనదగును. "ఆది" యనుట నాట్యమున సామాజికుడు కావ్యమున భావకుడు నని భావము.

రసస్య వర్తమానత్వాన్నానుకార్యస్య సంభవః
అనుకార్యస్య రామాదేః కాలాతిక్రమదర్శనాత్. 239

నాతిక్రాంతానుకార్యస్య రసభావనయా కవిః
కరోతి కావ్యం, రసికాన్ రంజయేయమితీచ్ఛయా. 240

బధ్నాతి కావ్యం యత్తస్మాద్రసః సామాజికాశ్రయః
అతః సామాజికోద్దేశప్రవృత్తత్వాద్యథార్థతః. 241

కావ్యస్యాతత్పరత్వేన తాత్పర్యం తద్రసే భవేత్
అతో రసస్య తాత్పర్యగమ్యత్వం సమ్యగీరితమ్. 242

అతోఽస్తు జన్యజనకసంబంధో రసకావ్యయోః
అతః సామాజికస్యైవ రసస్యాశ్రయతా స్థితా. 243

సదాశివమతముగా నిరూపిత మయిన యర్థమున కిందు కొంత విశదీకరణ మున్నది. రసము వర్తమాన కాలికము. కావ్యమాస్వాదించుసమయమునసె యిది యున్నది. ఆస్వాదమునకు పూర్వసమయమున లేదు. ఇట్లు రసము వర్తమాన మయినందున నతీతులగు ననుకార్యులకు సంబంధించినది కాదు. అనుకార్యుడగు రాము డత్యంతము ప్రాచీనుడు. ఇప్పటివాడు కాడు. అతీతుడు అతిక్రాంతు డనుకార్యుడగు వాని రసభావనమున కవి కావ్యము రచింపడు. రసికులను రంజింప జేయుదు నను నభిలాషమున కావ్యము బంధించును కావున రసము సామాజికాశ్రయమని నిశ్చయింప దగును. వాస్తవముగా కావ్యము సామాజికోద్దేశముననే ప్రవృత్త మయినది. రామాదితాత్పర్యమున కావ్యము ప్రవృత్తము కాలేదు. రసమునందే కవితాత్పర్యము. అందువలన రసము తాత్పర్యగమ్య మనుట యుక్తము. కావున రసమునకు కావ్యమునకు జన్యజనకభావ మంగీకృత మగుగావుత. కావ్యము జనకము; రసము జన్యము. కాగా నీ యుపపాదనమున సామాజికుడె రసాశ్రయ మనుట సిద్ధ మయినది.

నను స్వదయితాసక్తం పశ్యతో న రసోదయః
తర్హి రామాదిరసికాన్ శృణ్వతో జాయతే కథమ్. 244

రామాదిరర్థో న భవేద్విభావోఽస్య రసస్య తు
అవిద్యమానత్వాదేవ రామాదేర్న రసోద్భవః. 245

అత్రావివక్షితస్వార్థవిశేషోఽత్ర వర్తినః
ధీరోదాత్తాద్యవస్థానాం ప్రతిపాదనవర్త్మనా. 246

రామాదిశబ్దో రత్యాదేర్విభావో భవతి స్ఫుటం
ఇమమేవార్థముద్దిశ్య కథితం భరతాదిభిః. 247

శబ్దోపహితరూపాంస్తాన్బుద్ధేర్విషయతాం గతాన్
ప్రత్యక్ష ఇవ రామాదీన్కారణత్వేన మన్యతే. 248

రామాదిగతభోగాదిప్రతిపాదనవర్త్మనా
సుదృఢాహితసంస్కారాతిశయాస్తే సభాసదః. 249

శశ్వద్విధూత స్వ పర వివేకాశ్చ విశేషతః
సంభోగాద్యనుసంధానప్రవణాహంకృతిత్వతః. 250

నిర్వికల్పం నిరుపమం స్వాదం తత్రోపభుంజతే

ఏవముక్తం భవతి-స్వతోఽవిద్యమానైరపి రామాదిభిః కవి సందర్భ కౌశలేన ప్రత్యక్షవత్ శబ్దోపనీతైః తద్వ్యాపారానుసంధానైక చిత్తతయా శ్రోతృభిః స్వపరవివేకవిధూననేన ప్రతిపన్నో రసో జాయతే.

అనుకార్యులందు రసము లేదు. రసము సామాజికులందే యున్నది. అయినచో సామాజికాశ్రయరసమున విభావమేది ? రామాదులు విభావమెట్లగుదురు ? ఇట్టి శంకానివారణమునకై యీ ప్రఘట్టార్థము భావనీయము. నాట్యరంగమున లోకరంగమున సదృశప్రతీతి యుండునన్న ఉపపాదనమున నొక యాశంక యుదయింప వచ్చును. స్వదయితాసక్తు డయిన వానిని లోకమున జూచువారలకు రాగక్రోధాదు లుదయించును గావున రసోదయ ముండదు కదా ? కావ్యనాట్యములలో రాగాదుల గూడి రసికు లయిన రామాదులను వినినప్పుడు చూచినప్పుడు రసోదయ మెట్లు కలుగును ? లోకమున వలె నిచట గూడ రాగద్వేషాదు లుదయించును గావున రసోదయ మెట్లు కలుగును ? సామాజికునకు సంబంధించిన రసమునకు రామాదులు విభావములు కారు. రామాదు లిప్పుడు లేరు కదా ! వారు వర్తమానులు కారు. కావుననె రస ముదయింపదు.

ఈ యాశంకాపరిహారమునకై యీ యర్థమును భావింపవలెను. రామాద్యనుకార్యులు స్వార్థవిశేషమున వివక్షితులు కారు. కావ్యము తత్పరము కాదు కదా! రామాదిశబ్దములు ధీరోదాత్తాద్యవస్థలను ప్రతిపాదించును. అట్టి ప్రతిపాదనమార్గమున రామాదిశబ్దము రత్యాదులకు విభావ మగును. ఇందెట్టి యాపత్తియు లేదు. ఈ యర్థమునె యుద్దేశించి భరతాదు లిట్లు నిరూపించిరి: రామాదులు రామత్వాదికమును విడనాడి ధీరోదాత్తాద్యవస్థలను ప్రతిపాదించు వారయినపుడు సామాజికరత్యాదుల కుద్బోధకత్వము వహింతురు.

రామాదులు శబ్దోపహితస్వరూపులై బుద్ధిలో విషయముగా భాసింతురు. అట్లు బుద్ధివిషయీకృతులు కాగా ప్రత్యక్షముగ గోచరింతురు. అట్టి రామాదులను సహృదయుడు కారణముగ - విభావముగ భావించును. రామాదిగతము లయిన భోగాదులను ప్రతిపాదించు మార్గమున సభాసదులు సుదృఢముగా సంస్కారాతిశయము కలవారు కాగలరు. స్వపరవివేకమును వారు విధూనన మొనరింతురు. ఇది నాది, ఇది పరునిది అను భేదజ్ఞానమును విడనాడుదురు. సంభోగాదుల యనుసంధానప్రవణు లగుదురు. వారు స్వాహంకారమయ స్వభావసహితు లగుదురు. ఆ సమయమున నిర్వికల్పము నిరుపము నయిన స్వాదము ననుభవింతురు. రామాదు లతీతు లయినందున వర్తమానులు కానందున రామాదిరూపమున భాసింపరు. కవి సందర్భకౌశలమున ప్రత్యక్షముగ భాసింతురు. ఆయా రామాది శబ్దోపనీతులై స్పష్టముగా భాసింతురు. శ్రోతలు సహృదయు లగువారు తద్వ్యాపారముల యనుసంధానమె ముఖ్యముగా చిత్తమున భావింతురు గావున స్వపరవివేకవిధూనన మొనరింతురు. అప్పుడు రసము సహృదయుల ప్రతిపత్తిలో గోచరించును. ఇట్లు రసోదయమును భావించునది.

కావ్యానుసంధానవశాత్ శ్రోతృసామాజికౌ రసే. 251

రసికౌ తద్వదేవ స్యాన్నటోఽపి చ రసాశ్రయః
ఇతి ప్రష్టుః ప్రతివచః పురస్తాదేవ దర్శితమ్. 252

కావ్యానుసంధానమున శ్రోతయు నాట్యానుసంధానమున సామాజికుడును రసికులు - రసాశ్రయు లగుదురు. అట్లే నటుడును రసాశ్రయుడు కాదగునుగదా! నటుడును కావ్యానుసంధాన మొనరింపగలడు, రసాశ్రయు డేలకాడు? అని ప్రశ్నించు వానికి ప్రతివచనము పూర్వమె ప్రతిపాదిత మయినది. నయుడు

కేవల మభ్యాసపాటవమున నన్నిటిని ప్రదర్శించును గాని రసభావవైవశ్య మాతనికి లేదు. కావ్యానుసంధాన మొనరించు వాడగునేని సహృదయుడుగనె యాతని పరిగణన ముండును, అప్పుడు నటు డను వ్యవహారము లేదు.

అతః సామాజికస్యాపి కావ్యస్య చ రసస్య చ
భావ్యభావకరూపోఽపి సంబంధోఽ స్తీతి దర్శితః 253

ప్రతిపాద్యప్రతిపాదకసంబంధః పూర్వమేవో క్తః
తత్త్రైవ జన్యజనకసంబంధోఽపి ప్రకాశితప్రాయః. 254

కావున కావ్యరససామాజికులకు భావ్యభావక రూప సంబంధమును కలదని పూర్వము నిరూపిత మయినది. కావ్యము భావకము; రసము భావ్యము. సామాజికుడు కావ్యద్వారమున రసమును భావించును. భావకుడగు సామాజికునందున్న భావకతావ్యాపార-భావన మహిమ వలన రసములు భావ్యమానములై యాస్వాద్యము లగును. ఈ యంశమిదివరలో సూచిత మయినది. ఇట్లేరసకావ్యములకు ప్రతిపాద్యప్రతిపాదక సంబంధము కలదని పూర్వమే నిరూపితము. రసము ప్రతిపాద్యము; కావ్యము ప్రతిపాదకము. ఇట్లే జన్యజనకసంబంధమును పూర్వమె ప్రకాశితప్రాయము.

నటాభినయచాతుర్యాత్ప్రబంధే కవికల్పితే
ప్రయోగానుభవో జ్ఞేయః శ్రోతుః సామాజికస్య చ. 255

తత్తచ్ఛబ్దార్థ సంబంధనిర్ణీతిద్వారపూర్వకః
స్వస్వశబ్దార్థసంబంధవిత్తిర్నిర్ణీతిరుచ్యతే. 256

కవికల్పిత మయిన ప్రబంధమున నటాభినయచాతుర్యమున శ్రోతకు సామాజికునకును ప్రయోగానుభవ ముండుట యావశ్యక మని తెలియ దగును. నాట్యకావ్యానుసంధానమున చిరాభ్యాసమున్న వారలకు తత్ప్రయోగానుభవము కలవారలకు రసాస్వాదము కలుగును. ఆ యా శబ్దార్థముల సంబంధ నిర్ణయము ద్వారము. ఆ ద్వారపూర్వకముగా స్వస్వశబ్దార్థసంబంధవిజ్ఞానము నిర్ణీత మగును ఇట్టి శబ్దార్థసంబంధపరిజ్ఞానమున్ననె వాక్యార్థము లయిన రసాదుల యనుభవము కలుగును. నటప్రయుక్తాభినయార్థముల గుర్తించి, కవిప్రయుక్త శబ్దార్థసంబంధవిశేషముల గుర్తించి ప్రయోగానుభవము సంపాదించిననె వాక్యార్థీభూత రసపరిజ్ఞానము కలుగు ననుట ముహూర్మహు ర్భావనీయము.

## శబ్దార్థసంబంధము

ఈ ప్రసంగమున శబ్దార్థసంబంధవిస్తరణ మావశ్యక మగుట నిరూపణీయము.

సర్వస్యైవ హి శబ్దస్య స్వార్థవృత్తివిభాగతః
షోఢా విభాగో భవతి తత్తదర్థవశాదపి. 257

స వాచనికో లాక్షణికో వ్యంజకో గమకోఽపి చ
ప్రత్యాయకద్యోతకాఖ్యావితి షోఢా విభిద్యతే. 258

తత్తచ్ఛబ్దోపాధితయా షోఢా సోఽర్థో విభజ్యతే
అర్థజ్ఞాపకసామర్థ్యసంబంధః సోఽపి షడ్విధః. 259

ఏతేభ్యో భిన్న ఏతేభ్యస్తాత్పర్యార్థోఽపి దృశ్యతే

శబ్ద మారు విధములు. తన యర్థవిషయమున నున్న వృత్తివిభాగానుసారమున నీ విభాగము కలుగును. తత్తదర్థవశమున గూడ నీ షోఢా విభాగము సంగతమగును. వాచనికము, లాక్షణికము, వ్యంజకము, గమకము, ప్రత్యాయకము, ద్యోతకము నని యారు విధముల శబ్దము నిగదిత మయినది. ఆ యా శబ్ద ముపాధిగా నర్థము నారు విధముల విభక్తమయినది. శబ్ద మర్థమును గోచరింపజేయుటలోని సామర్థ్యరూపమయిన సంబంధము నారు విధములు. ఈ షడ్విధశబ్దముల కన్నను తాత్పర్యార్థము వేరుగా గోచరించుచున్నది. ఇక శబ్దార్థసంబంధవిశేషములు సూచితములు కాగలవు.

అర్థే గృహీతసంబంధః శబ్దో వాచకసంజ్ఞకః. 260

యద్గుణాద్యవిశేషేణ వస్తుమాత్రం ప్రతీయతే
తద్వస్తు వాచ్యసంజ్ఞోఽర్థ ఇతి విద్వద్భిరీరితః. 261

సా శబ్దస్యాభిధా వృత్తిః వస్త్వేకజ్ఞాపకక్రియా

వాచ్యవాచకాభిధల స్వరూప మిందున్నది. అర్థమున సాక్షాత్సంకేతమును అందుకొనిన శబ్దము వాచకమను పేరు గలది. గుణాదివిశేషరహితముగా వస్తుమాత్రమె గోచరింపగా నది వాచ్యము అను సంజ్ఞ కలది యగును. ఆ శబ్దమున కా యర్థమున నున్న వ్యాపారము వస్త్వైకజ్ఞాపక మగు క్రియ అభిధా వ్యాపార మగును.

స్వార్థే స్వవృత్త్యయోగేన తత్సంబంధిని వస్తుని. 262

తద్రూపేణ తు బోద్ధవ్యః శబ్దో లాక్షణికో భవేత్
తాదృగర్థోభవేల్లక్ష్యో లక్షణావృత్తిసంశ్రయః. 263

స్వాభిధేయావినాభూతప్రతీతే వస్తుని క్వచిత్
శబ్దవ్యాపారవిశ్రాంతి హేతుతా లక్షణోచ్యతే 264

లక్ష్యలక్షకలక్షణల స్వరూప మిందున్నది. శబ్దము స్వసంకేతికమయిన యర్థమున స్వప్రవృత్తియుండనందున స్వార్థమును సంబంధించియుండు నర్థాంతరమున ప్రవర్తించినచో తద్రూపమున నిది లాక్షణికశబ్ద మగునని తెలియవలెను. వివక్షితాంశమున స్వార్థముపయోగింపనందున నుపయోగించు స్వార్థసంబంధియగు నర్థాంతరము చెప్పుశబ్దము లాక్షణికము. "గంగాయాంఘోషః" అను స్థలమున గంగాప్రవాహరూపార్థము ఘోషాధికరణముగా నుపపన్నము కానందున, గంగాప్రవాహమునందు ఘోషముండదు కావున, ప్రవాహమునకు సంబంధించిన తీర రూపార్థమునందు గంగాశబ్దము వర్తించుటచే లక్షకశబ్ద మయినది. అచట తీర రూపార్థము లక్ష్యము. అది లక్షణావృత్తి సమాశ్రయము. స్వాభిధేయావినాభూత ప్రతీతి లక్షణ యనిరి. స్వాభిధేయము గంగాప్రవాహము. తదవినాభూతము-తత్సంబద్ధమగు తీరరూపార్థప్రతీతి లక్షణ. ఈ యర్థమే యిట్లు నిరూపితమయినది. స్వాభిధేయమునకు సంబంధముగా గోచరించు తీరరూపార్థవస్తువునందు శబ్దవ్యాపారము విశ్రాంతమగుటలో హేతువగునది లక్షణ.

సంబంధమత్యజన్ వాచ్యలక్ష్య తద్ధర్మ తద్గుణైః
తత్తద్విశిష్టాతిశయం వ్యంజయన్ వ్యంజకో భవేత్. 265

రసాలంకారవశతో గుణధర్మవశాత్తు వా
వాచ్యాదతిశయో వాఽపి లక్ష్యాదతిశయోఽపి వా. 266

దృశ్యతే యత్ర తద్రూపమర్థం వ్యంగ్యం వివృణ్వతే
స్వపదార్థధర్మగుణగత రసాదిసహకారికర్మసామర్థ్యాత్
అతిశయవదర్థకల్పిత విశ్రాంతిర్వ్యక్తి రిత్యుక్తా. 267

వ్యంజక వ్యంగ్య వ్యంజనా స్వరూపమిచట నున్నది. వ్యంజకశబ్దము వాచ్యార్థ లక్ష్యార్థ తద్ధర్మ తద్గుణములతోటి సంబంధమును విడనాడదు. వాచ్య

లక్ష్యవిశిష్ట మయిన యతిశయమును వ్యంగ్యమొనరించును. కావున వ్యంజకము వ్యంజకశబ్దముచే గోచరించు వ్యంగ్యార్థమునందు రసాలంకారవశమున గాని గుణధర్మవశమునగాని వాచ్యవశమునగాని లక్ష్యవశమునగాని గోచరించు నతిశయముండును. అట్లు సాతిశయమగునది వ్యంగ్యార్థమని వివరించిరి.

ఇక వ్యక్తి - వ్యంజనా లక్షణ మిట్లున్నది. రసాదులలో సహకారి కారణము లగు వాని కర్మ సామర్థ్యము స్వపదార్థధర్మగుణగతముగా నుండును. ఆ సామర్థ్యమువలన నర్థమునం దతిశయము గోచరించును. అట్టి యర్థమున పర్యవసానము పరిక్లుప్త మగును. రసాదిరూపార్థమున విశ్రాంతి పొందునది వ్యంజన యని భావము.

విశిష్టే వాచ్యలక్ష్యార్థే తద్విశేష్యైకదేశతః
వివక్షితార్థం క్రమశో గమయన్ గమకో భవేత్. 268

విశిష్టవాచ్యలక్ష్యార్థవిశేషణసమాశ్రితం
గుణభావరసాదీనాం గమనం గమ్య ఈరితః. 269

విశిష్టే వాచ్యలక్ష్యేఽర్థే విశేషణవిశేష్యయోః
యావదర్థం వివృణ్వంతీ వృత్తిర్గతిరితీరితా. 270

గమ్యే గమకశబ్దస్య వృత్తిర్గతిరితి స్మృతా

గమకగమ్యగతి నిరూపణ మిందున్నది. వాచ్యార్థము విశేషణ విశిష్టమై యున్నప్పుడు, లక్ష్యార్థము విశేషణవిశిష్టమై యున్నప్పుడు వాని విశేష్యైకదేశానుసారముగా వివక్షితార్థము క్రమముగా నవగమింపజేయు శబ్దము గమక మగును. విశిష్టము లయిన వాచ్యలక్ష్యార్థములకు సంబంధించిన విశేషణ సమాశ్రితమగు గుణమును భావమును రసమును ఈ మొదలగు వాని నవగమింప జేయుట గమ్యమనదగును. విశిష్టమగు వాచ్యలక్ష్యార్థములలోని విశేషణవిశేష్యములలోని సర్వార్థమునువివరించు వృత్తి గతి యని వ్యవహారము కల దయినది. విశిష్టమున విశేష్యాశ్రయ వివక్షితవిశేషమును గోచరింపజేయునది గమకము. విశేషణాశ్రయ గుణభావ రసాద్యవగమనము గమ్యము, విశేషణవిశేష్యములకు సంబంధించిన యావదర్థమును వివరించువృత్తి గతి యని సారార్థము.

స్వవృత్తిద్వారతః స్వార్థవిశేషణగుణాదితః, 271

అర్థాంతరమనుస్యూతం ద్యోతయన్ ద్యోతకో భవేత్
గుణధర్మరసాదిభ్యః ప్రతీతేభ్యః పృథక్ పృథక్. 272

తత్తద్విశేషణసామర్థ్యకల్ప్యోఽర్థో ద్యోత్య ఈరితః
వాక్యార్థావయవీభూత పదార్థాన్ జిఘ్రతీ క్రమాత్. 273

వివక్షితే ద్యోతమానా యా వృత్తిర్ద్యుతిరుచ్యతే
ద్యోత్యే ద్యోతకశబ్దస్య వ్యాపృతిర్ద్యుతిరీరితా. 274

ద్యోతక ద్యోత్య ద్యుతి స్వరూపమిందున్నది. స్వవృత్తిద్వారమున స్వార్థవిశేషణరూపము లయిన గుణాదుల ననుసరించి యనుస్యూత మయిన యర్థాంతరమును ద్యోతన మొనరించు శబ్దము ద్యోతకము అనదగి యున్నది. ప్రతీతము లయిన గుణధర్మరసాదుల కన్న వేరువేరుగా తత్తద్విశేషణసామర్థ్య కల్ప్య మయిన యర్థము ద్యోత్యము అనదగును. వాక్యార్థావయవీభూతము లయిన పదార్థములను క్రమముగా ననుగత మొనరించు కొనునదై వివక్షితార్థమున ద్యోతమానమగు వృత్తి ద్యుతి యగును. ద్యోత్యార్థమునందు ద్యోతక శబ్దమున కున్న వ్యాపారము ద్యుతి యని గ్రహింపదగును.

ప్రతీతోఽతిశయో యత్రవాచ్యలక్ష్యాదివస్తుషు
ప్రత్యాయయం స్తమేవార్థం శబ్దః ప్రత్యాయకో భవేత్. 275

గుణే రసే వాఽలంకారే పదవాక్యార్థసంశ్రయే
ప్రతీయమానోఽతిశయః ప్రత్యాయ్యో లక్ష్యవాచ్యయోః. 276

అవిశ్రమేణ వ్యాపారో రసాద్యతిశయావధిః
ప్రత్యాయకస్య ప్రత్యాయ్యే ప్రతీతిరితి కథ్యతే. 277

ప్రత్యాయక ప్రత్యాయ్య ప్రతీతుల స్వరూప మిచట నున్నది. వాచ్య లక్ష్యాదులలో ప్రతీత మయిన యతిశయ రూపమగు నర్థమును ప్రత్యాయన మొనరించు శబ్దము ప్రత్యాయకము. పదవాక్యార్థసమాశ్రయముగా నున్న గుణమునగాని రసమునగాని యలంకారమునగాని ప్రతీయమానమగు నతిశయమును ప్రత్యాయ్య మందురు. వాచ్యార్థమున లక్ష్యార్థమున ప్రతీయమానమగు నతిశయము ప్రత్యాయ్య మగును. ప్రత్యాయకమగు శబ్దమునకు ప్రత్యాయ్యమగు నర్థవిషయమున రసాద్యతిశయావధికమగు వ్యాపారము, మధ్యలో నెచటను విశ్రాంతిపొందని వ్యాపారము, రసాద్యతిశయముననె విశ్రాంతిపొందు వ్యాపారము ప్రతీతిరూపమగు వ్యాపారమని పెద్దలు నిర్ణయించిరి.

## దేశకాలాదుల గుణధర్మములు

వాక్యార్థరసాద్యనుభవము శబ్దార్థసంబంధాధీన మయినందున శబ్దార్థముల షడ్విధసంబంధ మీవిధముగా నిర్ణీత మయినది. శబ్దార్థసంబంధద్వాదశకమున రసావియోగము ముఖ్య మయినందున తన్నిరూపణమునకై దేశకాలాదుల గుణధర్మాఖ్యాన మపేక్షితము.

దేశ కాల క్రియా జాతి రూపవాచ్యాదివస్తుషు
షట్పదార్థవిచారాయ గుణా ధర్మాశ్చ కల్పితాః. 278

కవిభిః స్వీక్రియంతే తే తద్జ్ఞైః కావ్యాదిసంపదే
అత్రైవాఽప్యభిధీయంతే వాచ్యాద్యర్థోపలబ్ధయే. 279

దేశము కాలము క్రియ జాతి యను పదములచే జెప్పదగిన వస్తువులలో గుణములు ధర్మములు కలవని నిర్ణీత మయినది. ఈ గుణధర్మకల్పనము ద్రవ్యగుణకర్మాదిషట్పదార్థపరిశీలనమున కుపయోగించును. తత్తత్స్వరూపవిచారమున సమర్థులగు కవులు కావ్యాదుల సంపత్సిద్ధికై వీనిని స్వీకరింతురు. వాచ్యాద్యర్థముల యుపలబ్ధికై వాని నిచటనే నిరూపింతుము. తన్నిరూపణము తత్తదర్థవివేక మీయగలదు.

దేశే నిమ్నోన్నతత్వాదిరాకారో ధర్మ ఈరితః
తస్మిన్ మృదుత్వ కాఠిన్య కార్ష్ణ్య శౌక్ల్యాదయో గుణాః. 280

నక్తం దివవిభాగేన ద్విధా కాలః ప్రకీర్తితః
తమస్తేజశ్చ తద్ధర్మౌ గుణా స్తత్రా ర్తవాదయః. 281

యః సంయోగవిభాగాదిః క్రియాధర్మః స కథ్యతే
తత్ర వైఫల్యసాఫల్యానుసాధుత్వాదయో గుణాః. 282

నివృత్తిశ్చ ప్రవృత్తిశ్చ జాతిధర్మావితీరితౌ
ధైర్యాదయో గుణా స్తత్ర సహజాహార్యరూపతః. 283

దేశము కాలము క్రియ జాతి యనువానిచే వాచ్యము లగు వస్తువుల గుణధర్మము లిందున్నవి. దేశమున నిమ్నత్వ మున్నతత్త్వ మను నాకారమును ధర్మ మందురు మృదుత్వము కాఠిన్యము కృశత్వము శుక్లత్వము మొదలగునవి గుణములు. కాలము - రాత్రియని, పవలని రెండు విధములు. రాత్రిధర్మము తమస్సు, పగటిధర్మము తేజస్సు. ఆర్తవాదులు-ఋతుధర్మము మొద

లగునవి కాలగుణములు. సంయోగము విభాగము మొదలగునవి క్రియాధర్మములు. వైఫల్యము సాఫల్యము సాధుత్వము మొదలగునవి క్రియాగుణములు. నివృత్తి ప్రవృత్తి యనునవి జాతిధర్మములు. ధైర్యాదులు గుణములు. ఇవి సహజాహార్యరూపమున నుండును. ఇట్లు దేశకాలక్రియాజాతులకు కల్పితము లయిన ధర్మగుణములు నిరూపితము లయినవి. ఇటుపై వీని భేదములను గొన్నిటిని జెప్పవలయును.

తే భవేయుస్త్రిధా తత్ర వాఙ్మనఃకాయరూపతః
శోభనాశోభనత్వేన తే భవేయుః పునర్ద్విధా. 284

ధైర్యాదయోఽత్ర సహజా ఆహార్యోఽభ్యాస సంభృతః
మాధుర్య నిష్ఠురత్వాదిగుణో వాచి ప్రకల్పితః. 285

క్రూరత్వశాంతిమత్త్వాదిగుణాః స్యుర్మానసా గుణాః
లావణ్యసౌకుమార్యాదిః శారీరః కల్పితో గుణః. 286

జాతిగుణము లయిన ధైర్యాదిగుణములు సహజాహార్యరూపములు కాగా నవి మఱల వాఙ్మనఃకాయరూపమున త్రివిధము లగు చున్నవి. ఇవియు శోభనము లని యశోభనము లని మఱల రెండు విధములు. ధైర్యాదులు సహజగుణములు. ఆహార్యమనునది తెచ్చిపెట్టుకొన్నట్టిది. అభ్యాసమున సంపన్న మయిన గుణము. మాధుర్యము నిష్ఠురత్వము మొదలగు గుణములు వాచికములు. వాక్కునందు ప్రకల్పితములయిన గుణములు. క్రూరత్వము శాంతిమత్త్వము మొదలగు గుణములు మానసము లయిన గుణములు. లావణ్యము సౌకమార్యము మొదలగు గుణములు శారీరములయిన కల్పితగుణములు.

గుణత్రయోపాధిభిన్నా త్రిధా ప్రకృతిరుచ్యతే
అర్భకత్వాద్యవస్థైవ తాసు ధర్మితయోచ్యతే. 287

జాత్యాశ్రయా గుణా ఏవ తాసు ప్రకృతిషు స్వతః

సత్త్వరజస్తమోగుణములను మూడు గుణముల యుపాధులచే భిన్నమై ప్రకృతి మూడు విధముల నున్నది – సాత్త్వికప్రకృతి, రాజసప్రకృతి, తామసప్రకృతి యని. ఆ ప్రకృతులలో నర్భకత్వాద్యవస్థయె ధర్మిగా నుండునని యనిరి. జాత్యాశ్రయము లయిన గుణములె యా ప్రకృతు లందుండునని విఖ్యాతము.

దేశకాలాదులందు కల్పితము లయిన గుణధర్మములు షట్పదార్థమున కుపయోగించుట పూర్వము నిర్దిష్ట మయినది. ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయము లను పదార్థషట్కమునకు సంబంధించి గుణధర్మములను జెప్పుట ప్రకృతము పేక్షితము. ఆ యపేక్షిత మిచట నున్నది.

ఆకారవత్త్వాదిరేవ ద్రవ్యధర్మ ఇతీర్యతే. 288

గుణః శోభాఽఽభిరూప్యాదిః ద్రవ్యే కవిభిరుచ్యతే
వ్యక్తతాఽవ్యక్తతాదిస్తు గుణే ధర్మ ఇతీర్యతే. 289

వస్తుశోభాకరత్వం యత్స గుణః కల్పితో గుణే
ధర్మో గుణో యః క్రియాయాస్స స ఏవేహ కర్మణి. 290

ధర్మః స ఏవ కవిభిః సామాన్యే పరికల్పితః
యదవాంతరసామాన్యభేదాశ్రయసహిష్ణుతా. 291

వ్యక్తిషు వ్యావృత్తిత్వం సామాన్యే కల్పితో గుణః
స్వాశ్రయాభిన్నరూపత్వం ధర్మః స్యాత్సమవాయభాక్. 292

గుణద్రవ్యైకఘటనాసామర్థ్యం గుణ ఈరితః
ముగ్ధత్వాదివిశిష్టత్వం యత్స ధర్మో విశేషభాక్. 293

వినియోగార్హతా తేషాం గుణ ఏవేతి కల్ప్యతే

ఆకారవత్త్వము మొదలగునది ద్రవ్యధర్మము. శోభ అభిరూప్యము మొదలగునవి ద్రవ్యమున గుణము లని కవు లందురు. ఇంతవఱకిది పదార్థము లలో ద్రవ్యవిషయము. వ్యక్తత అవ్యక్తత యనునవి గుణమున ధర్మములు. వస్తుశోభాకరత్వ మనునది గుణమున కల్పిత మయిన గుణము. గుణమున గుణ ముండదు. కావుననె యిది కల్పిత గుణము. గుణానంతరము కర్మ విశేషము చెప్పవలెను. పూర్వము క్రియాగతములుగా నిరూపించిన ధర్మగుణ ములె; అనగా, సంయోగవిభాగాదిధర్మము, వైఫల్యసాఫల్యసుసాధుత్వాదిగుణ ములు కర్మకును సంబంధించి యుండునని గ్రహింపదగును. అవాంతరసామా న్యభేదాశ్రయసహిష్ణుత యనునది సామాన్యమున కవి పరికల్పిత మయిన ధర్మము. "నిత్యమేకమనేకానుగతం సామాన్యం. పరం సత్తా అపరం ద్రవ్యత్వాది" అని తార్కికుల సంగ్రహవచనము. సామాన్యము స్వరూపతః అనేకానుగత ముగా నుండును. సమవాయసంబంధమున ననేకవృత్తి యగును. కావున

"నిత్యత్వే సత్యనేకసమవేతత్వం" అనునది సామాన్యలక్షణము. పరసామాన్యము ద్రవ్యగుణకర్మలం దుండును. ఏకైకగతము అపరసామాన్యము. కాగా అవాంతరసామాన్యభేదాశ్రయసహిష్ణుత స్పష్టము. ఆ యా వేరు వేరు వ్యక్తులలో వ్యాప్యవృత్తిత్వ మనునది సామాన్యమున కల్పిత మయిన గుణము. ఇది సామాన్యము. ఇక సమవాయము: స్వాశ్రయాభిన్నరూపత్వ మనునది సమవాయము నందలి ధర్మము. గుణము ద్రవ్యమునందు సమవాయసంబంధమున నుండును. అప్పుడు స్వాశ్రయ మయిన ద్రవ్యమున కన్న నచటి సమవాయమునకు వేరు రూప ముండదు. గుణద్రవ్యములకు ఏకఘటనాసామర్థ్య ముండుట యనునది సమవాయము యొక్క గుణము. ఇక విశేష మున్నది. ముగ్ధత్వాది విశిష్టత్వ మనునది విశేషగత మయిన ధర్మము. వినియోగార్హతయె విశేషముల గుణము. ఇట్లు షట్పదార్థముల ధర్మగుణములు గ్రాహ్యములు.

యే ధర్మా యే గుణాః క్లుప్తా వాచ్యలక్ష్యాదివస్తుషు. 294

తైస్తైస్తదర్థాతిశయో గ్రాహ్యః కావ్యాదిసంపదే

వాచ్యములు లక్ష్యములు నయిన కావ్యవస్తువులలో నే యే ధర్మములే యే గుణములు క్లుప్తములై యున్నవో యా యా ధర్మములచే నా యా గుణములచే తత్తదర్థాతిశయమును గ్రహింప వలెను. ఇది యంతయు కావ్యాది సంపదకై సహకరించును. సముచితధర్మగుణోపేతముగా వాచ్యలక్ష్యవస్తు నిబంధన మొనరించిననె తదతిశయము కావ్యసంపద కనుకూల మగును.

## వివక్షితార్థము

వర్ణేన చ పదేనాపి పదాభ్యాం చ పదై రపి. 295

వాక్యేన వాక్యార్థేనైతే హ్యర్థాః షోఢా వికల్పితాః
వివక్షితార్థసంపత్తిహేతవః స్యుర్యథోచితమ్. 296

వాచ్యలక్ష్యాద్యర్థము లనేకములు ప్రదర్శితములు కాగా వివక్షితార్థ ప్రతిపాదనమున సమర్థములగు వానిని నిర్దేశింపవలసి యున్నది. అట్లు ప్రతిపాదకము లారు కలవు - వర్ణము, పదము, పదద్వయము, అనేకపదములు, వాక్యము, వాక్యార్థము నను వానిచే వివక్షితప్రతిపాదనము కలుగును. ఇట్లు ప్రతిపాదకములగు నివి యారు విధములుగా వికల్పితము లయినవి. ఈయారును యథోచితముగా వివక్షితార్థసంపత్తిహేతువులు. యథోచిత మనుటచే నొక్కొక్క స్థలమున నొకటి రెండు మూ డెన్ని యయిన నుండవచ్చు నని భావము.

కారకేణ కదాచిత్స్యాదభిధాయాః కదాచన
తద్ధితేన సమాసేన సర్వనామ్నా కదాచన. 297

ప్రకృత్యా ప్రత్యయేనాపి ధాతుకాకూపసర్గతః
వక్తుర్వివక్షాఽలంకారరసాదిభ్యః కదాచన. 298

వాచ్యో లక్ష్యత్వమాయాతి లక్ష్యో వాచ్యత్వమేతి చ
ఏవం వినిమయం చాపి వ్యత్యయం చ పరస్పరమ్. 299

వాచ్యాదయోఽర్థా యాస్యంతి స్వోచితాతిశయాప్తయే
ఏతద్రూపేణ బోద్ధవ్యం తత్తదర్థవివేక్తృభిః. 300

సముచితకావ్యము నందు వక్తృవివక్ష యనేకవిధముల భాసించును. ఆ విధానముల పరిగణన మిందున్నది. కారకమున నొకప్పుడు, అభిధ వలన మరి యొకప్పుడు వివక్ష భాసించును. తద్ధితమున సమాసమున సర్వనామమున నొక ప్పుడు గోచరించును. ప్రకృతిచే ప్రత్యయముచే గూడ నవభాసించును. ధాతు కాకూపసర్గముల వలనను భాసించును. ఒకప్పు డలంకారరసముల వలనను వివక్షా భావమున్నది. వివక్షా సూచకములగు నిట్టి వానిచే వాచ్యము లక్ష్య మగును. లక్ష్యము వాచ్యత్వము పొందును. స్వస్వసముచిత మగు నతిశయ ప్రాప్తికై వాచ్యాద్యర్థము లన్నియు పరస్పరము వినిమయమునేని వ్యత్యయమునేని పొందుట యున్నది. ఆ యా యర్థములవివేచన మొనరించు వారు ఈ యా విధములుగా వివక్షితార్థసిద్ధి యుండుటను గుర్తింపవలెను.

వివక్షితార్థమున కనేకపర్యాయపదము లున్నవి. వాని స్వరూప నిర్వచనము ప్రకృతోపయోగియగును. పర్యాయషట్క మిచట భావనీయము.

వివక్షితమభిప్రాయః ఫలం భావః ప్రయోజనం
తాత్పర్యమితి పర్యాయశబ్దా వాక్యార్థగోచరాః. 301

ప్రయుజ్యమానోఽభీష్టార్థః కారకాదిసమన్వితః
నీయతే యత్ప్రబోధాయ తత్ప్రయోజన ముచ్యతే. 302

యోఽర్థో బుద్ధిస్థితోఽభీష్టో వక్తృవాక్యేన గమ్యతే
తద్వివక్షితమిత్యుక్తం దర్పణాదౌ ముఖాదివత్. 303

యదర్థస్యాభిముఖ్యేన పదార్థా హ్యుపకుర్వతే
సోఽభిప్రాయ స్తదుత్కర్షః ప్రాయశ్శబ్దేన కథ్యతే. 304

ప్రధానముపకాత్యోఽర్థః పదార్థా హ్యుపకారకాః
తత్పరత్వం పదార్థానాం తాత్పర్యం తదితీరితమ్. 305

అభీష్టార్థపరీపాకో నేత్రాదేరథవా కవేః
ద్రుమాదిఫలవద్యత్ర స్వాద్యతే తత్ఫలం భవేత్. 306

వ్యాపారో యత్ర నేత్రాదేః శృంగారాదిర్విభావ్యతే
అర్థసందర్భచాతుర్యాత్స భావ ఇతి కథ్యతే. 307

వాక్యార్థగోచరములగు నారు పర్యాయశబ్దము లున్నవి: వివక్షితము-అభిప్రాయము-ఫలము-భావము-ప్రయోజనము-తాత్పర్యమునని. వీని స్వరూప నిర్వచన మటునిటుగా నిటనున్నది, ౧. ప్రయోజనము-కారకాది సమన్విత మయిన యభీష్టమగు నర్థము ప్రయుజ్యమానమగుచు నే యర్థప్రబోధనమునకై సమానీతమగునో ఆ యర్థము ప్రయోజనమని యనదగును. ౨. వివక్షితము-బుద్ధిస్థితమయిన యభీష్టార్థము దర్పణాదికమున ముఖాదులు వలె వక్తృవాక్యమున గమ్యమగునో, పాఠకుని బుద్ధిగతమయిన భావమె కావ్యము నందలి వక్తృవాక్యమున భాసించినచో నది వివక్షిత మనదగును. ౩. అభిప్రాయము-పదార్థము లన్నియు నే యర్థము యొక్క యాభిముఖ్యమున నుపకరించునవి యగునో యా యర్థ మభిప్రాయ శబ్దమున నెన్నదగినది యగును. ఇందు ప్రాయశ్శబ్దమున తదుత్కర్షము గోచరించును. అభి = అభిముఖ్యమున, ప్రాయః = ఉత్కర్ష కలది అభిప్రాయము. ౪. తాత్పర్యము-ఉపకార్యమగు నర్థము ప్రధానము; పదార్థము లుపకారకములు. పదార్థములకు ప్రధానార్థపరత్వమున్నచో తాత్పర్యమగును. ౫. ఫలము-కావ్యమున నాయకాదుల యభీష్టార్థ పరిపాకము కాని, కవియొక్క యభీష్టార్థపరీపాకము కాని వృక్షాదుల ఫలము వలె సమాస్వాద్య మగునేని ఫలమగును. ౬. భావము — అర్థసందర్భచాతుర్యమున నాయకాదుల శృంగారాదివ్యాపారము బాగుగా విభావిత మగునేని యది భావ పదమున వ్యపదేశింప దగును.

## భాట్ట - ప్రాభాకరమతములు

వాక్యార్థము యొక్క స్వరూప మీమాంస మొనరించినవారు మీమాంసకులు. వారిలో భాట్టమతానుయాయుల భావమునకును ప్రాభాకరమతానుయాయుల భావమునకును భేదము కలదు. వాని సామంజస్యప్రతిపాదనము నావశ్యకము. ఈ విషయ మిట ప్రస్తుత మగును.

భాట్టైః ప్రాభాకరై రేష వాక్యార్థః కథ్యతే ద్విధా
పదార్థానోన్యోన్యసంసర్గోవాక్యార్థ ఇతి భట్టవాక్. 308

పదార్థఏవ వాక్యార్థ ఇతి ప్రాభాకరా విదుః
కవేర్వివక్షయా యస్య ప్రాధాన్యం పరికల్ప్యతే. 309

భవేత్స ఏవ వాక్యార్థ ఇతి నిర్ణీయతే బుధైః

భాట్టులు ప్రాభాకరులు నీ వాక్యార్థము రెండు విధముల నుండు ననిరి. పదార్థముల యన్యోన్యసంసర్గమె వాక్యార్థమని భట్టవాక్కు. పదార్థమె వాక్యార్థమని ప్రాభాకరు లందురు. కవి వివక్షానుసారమున ప్రధాన మగు నదియె వాక్యార్థమని బుధులు నిర్ణయించిరి. ఇట్టిది సూత్రప్రాయ మయిన మూలసారము. ఇచటి యీ మూడు భావములు వివరణాపేక్షములు. వీని నిట్లు గ్రహింపదగును. శృంగారప్రకాశమున నీ వాదములు సూచితములు.

అభిహితము లగు పదార్థముల కన్వయముండునా? అన్వితములగు పదార్థముల కన్వయముండునా? "ఉచ్యతే". ఇందు మతభేద మున్నది. కొందరందురు-అన్వితముల కభిధానము; అభిహితముల కన్వయము అని. మరికొందరందురు-అన్వితముల కభిధానము కాదు, అభిహితములకు నన్వయము కాదు అని. వీని స్వరూప మిట్లుండును. కుమారిలభట్టానుయాయులు అభిహితాన్వయవాదులు. అభిహితములగు పదముల కన్వయము నిరూపింతురు. ప్రభాకరానుయాయులు అన్వితాభిధానవాదులు. పదాంతరములతో నన్వితము లయిన పదముల కన్వయ మభిధానింతురు. వాక్యార్థజ్ఞానమున మూడు హేతువు లున్నవి — ఆకాంక్ష, యోగ్యత, సన్నిధి యని. ఆకాంక్ష-వాక్యార్థజ్ఞానమునకై పదములకు పారస్పరిక సంబంధ మావశ్యకము. ఆకాంక్ష లేకున్న ఒకేవాక్య మన్న జ్ఞాన ముదయింపదు. యోగ్యత — శబ్దముల పరస్పరసంబంధమున బాధాభావము. సన్నిధి — పదము పదము సమీపమున నుండుట. వ్యవధాన మున్న బోధ కలుగదు. ఈ మూడుహేతువుల ద్వారమున శబ్దములు పరస్పరాన్విత ములై విశిష్టార్థము నీయగలవు. అప్పుడా శబ్దసమూహము వాక్యము.

ఇట్టి వాక్యమున రెండువిధము లగు నర్థము లుండును. ఒకటి పదార్థము. రెండవది వాక్యార్థము. అభిధచే పదార్థప్రతీతి కలుగును. తాత్పర్య వృత్తిచే వాక్యార్థప్రతీతి కలుగును. వాక్యార్థబోధ అభిధావృత్తిచే గలుగదు.

తద్బోధమునకై తాత్పర్యవృత్తి నంగీకరింప వలెను. ఇది యభిహితాన్వయ వాదము.

అన్వితాభిధానవాదు లీ తాత్పర్యవృత్తి నంగీకరింపరు. వాక్యార్థము వాచ్యద్వారమున గోచర మగు నందుకు. అభిధావృత్తియందె తాత్పర్యవృత్తి సమావిష్టమై యుండునని వీరిభావము. వ్యుత్పత్తిబలమున శబ్ద మర్థమును బోధించును. వృద్ధవ్యవహారమున వ్యుత్పత్తి కలుగును. వృద్ధులు వాక్యము ననె వ్యవహరింతురు. పదమున వ్యవహరింపరు. వృద్ధుడు వాక్యప్రయోగ మొనరింపగా మధ్యముడు తదర్థపరిజ్ఞానమున ననుకూలముగా వ్యవహరించును. అది గుర్తించి బాలుడు "ఈ వాక్యమున కిది యర్థము" అని అఖండవాక్యార్థము తెలిసికొనును. ఇట్లు పదము లన్నియు వాక్యార్థమునే యవగమింప జేయు చున్నవి. వాక్యార్థము క్రియాకారక సంసర్గరూపము. కారకములు క్రియా సంబంధోన్ముఖములు. క్రియలు కారకవిరహాసహిష్ణువులు. కావున అన్వితపద ములకె స్వశబ్దములచే నభిధాన ముండును. కాగా వాక్యార్థము శాబ్దమె. అభి హితాన్వయపక్షమున వలె వాక్యార్థము పారంపర్యమున గలుగునది కాదు. ఇది యన్వితాభిధానవాదము.

సాహిత్యప్రకాశన మయిన భావప్రకాశనమున నీ వాద మా వాద మే వాద మభిమానవాదము కాదు. ఈ యంశము నిరూపించుటకే "కవేర్వి వక్షయా" యున్నది. కావ్యమున కవివివక్ష ననుసరించిన యర్థనిశ్చయము యుక్తము. సామాన్యమయిన వక్తృవివక్షాశ్రయణము యుక్తము కాదు. "వక్తుం ఇచ్ఛా—వివక్షా". కవి కావ్యమున నే యంశమును జెప్పుట కిచ్ఛపడి యట్టి శబ్దరచన మొనరించెనో యాతని వివక్షానుసారమున నా యంశమును భావింపవలెను. ఇట్టి వివక్షాధీనముగా నే యర్థమునకు ప్రాధాన్యము కవి నిశ్చ యించెనో గుర్తింపవలెను. తత్ప్రధానతానుకూలముగనె యితరార్థములను కవి యనుసంధానించుటను నిశ్చయింపవలెను. అట్లే యర్థమునకు ప్రాధాన్యము నిశ్చిత మయినచో యా యర్థమె వాక్యార్థము. ఇట్లు సాహిత్యప్రకాశవాదులు నిశ్చయింతురు. ఇట్లు సామరస్యము భావించునది.

అర్థాః పదై రభిహితాః స్వాతంత్ర్యేణ పృథక్పృథక్. 310

అన్యోన్యయోగ్యసంసర్గమాకాంక్షంతే పరస్పరం
సంసర్గ యోగ్యైః కథితైః సంస్పృష్టాస్తే విమృశ్య చ. 311

కస్యోపకుర్మ ఇతి చ ప్రధానస్యోపకుర్వతే
ప్రధానం యత్పరం తేఽపి పదార్థాస్తత్పరా యతః. 312

భవంతి తస్మాత్తాత్పర్యమిత్యర్థాంతరముచ్యతే
వక్తృద్వారా వాక్యధర్మస్యైవ వాక్యార్థకల్పనమ్.

భాట్ట ప్రాభాకరమత సామరస్యము సూచిత మయిన పిమ్మట తదుపోద్బలకముగా గొంత చెప్పవలసి యున్నది. దానికై తాత్పర్యార్థమును వాక్యార్థ మగుట యిచట నిరూపిత మగును. పదములచే నర్థము నిరూపిత మగును. ఈ పదము వలన నీ యర్థమును గుర్తింప వలెనను ననాదిగా నియమ మున్నందున నాయా పదము లా యా యర్థములను జెప్పగలవు. పదము పదాంతరసహకార మక్కరలేకుండగనె వేరువేరుగా స్వతంత్రముగా నర్థము నిరూపించును. అట్లు పదాభిహితము లయిన పదార్థములు పరస్పర మన్యోన్య యోగ్యసంసర్గ మాకాంక్షించునవి యగును. అట్టి యా పదములు విమర్శపురస్సరముగా ప్రకథితము లయిన సంసర్గయోగము లగు వానితో సంసృష్టము లగును. అట్లు సంసృష్టము లయిన యవి ''మేము దేని కుపకరింతు'' మని ప్రధానమున కుపకరించును. ప్రధానము యత్పరముగా నుండునో పదార్థములును తత్పరములై యగును. కావున తాత్పర్యమనునది కవివివక్షావిషయ మయిన యర్థాంతర మయినది. వక్తృద్వారమున వాక్యధర్మమె వాక్యార్థమని ప్రకల్పితము నిశ్చితము నయినది.

విశేషణాని సర్వత్ర విశింషంత్యపి సర్వతః
విశేష్యస్య ప్రధానత్వం స్వాశ్రయత్వం వివృణ్వతే. 314

విశేషణము లంతటను విశేష్యయుక్తములు విశేష్యసంగతములై యయి యుండును. విశేష్యమునకు ప్రాధాన్యము సంపాదించునవి యగును. తమకు విశేష్యమె యాశ్రయ మని వివరించు నవి యగును. స్వరవిశేషణములు విశేష్యముతోడనె సంగతము లగుటయు, తమలో తాము వేనితోడను సంగతములు కాకుండుటయు, స్వవిశేష్యాశ్రయముననె యుండుటయు సర్వత్ర ప్రసిద్ధము. ఇట్టి యీ యుక్తి ననుసరించియు పదార్థవాక్యార్థసంగతిని దర్శింప వలెను. పదార్థము లంతట వాక్యార్థ సంగతములై యగును. వాక్యార్థమునకె ప్రధానత్వమును స్వాశ్రయత్వమును విశద మొనరించును.

అతో రసాలంకారాదేః ప్రాధాన్యం యత్ర దృశ్యతే
తత్తదన్యతమస్తత్ర వాక్యార్థత్వం ప్రయాస్యతి. 315

రసవియోగాత్మక మయిన సంబంధ నిర్ణయములో నిగమనాత్మకముగా నీ యర్థమును భావింపవలెను. ఏ స్థలమునందు రసాలంకారాదులకు ప్రాధాన్యము భాసించునో అచట రసాలంకారాదులలో నన్యతమము వాక్యార్థత్వమును పొందును. కవివివక్షానుసారి ప్రాధాన్య మిందే యుండును. ఇందే కవితాత్పర్య మున్నదని నిశ్చయింప వలెను.

ఇతి శబ్దార్థయో రూపం సిద్ధం శబ్దార్థనిర్ణయే
భట్టాభినవగుప్తార్యపాదై రేవం ప్రదర్శితమ్. 316
ఏవం విభావ్య కవిభి స్తత్తదర్థో నిబధ్యతాం

శబ్దార్థనిర్ణయవిషయమున శబ్దార్థముల రూప మీ విధముగా సిద్ధమయినది. శ్రీమదభినవగుప్తభట్టార్యపాదు లీ విషయము నీ విధముగనె ప్రదర్శించిరి. అభినవగుప్తప్రదర్శితవిధముననె యిది నిదర్శిత మయినది. ఇది యభినవగుప్తసిద్ధాంత మయినందున కవులు బాగుగా విభావన మొనరించి తత్తదర్థములను నిబంధింతురు గావుత మని యిది కవ్యుపదేశము.

అపరైః కైశ్చిదాచార్యైః ప్రకారాంతరకల్పితమ్. 317
శబ్దార్థయోః స్వరూపం తు తద్వివిచ్యాభిధీయతే
శబ్దస్త్రిధా వాచకశ్చ తథా లాక్షణికోఽపి చ. 318
వ్యంజకశ్చ తదర్థశ్చ త్రిధా వాచ్యాదిభేదతః

## మమ్మట మతము

సాహిత్యలాక్షణికులు దర్శనాచార్యులు కొందరు శబ్దార్థముల స్వరూపమును ప్రకారాంతరమున నిరూపించిరి. కావ్యప్రకాశకారు లయిన మమ్మటభట్టపాదు లిట్లు ప్రకారాంతరమున నిర్ణయించిన శబ్దార్థస్వరూపమె సాహిత్యజగమున బహులవ్యాప్తిలో నున్నది. కావున కావ్యప్రకాశగ్రంథములో నిరూపించిన విధమున విశదముగా నిరూపింతుము. ఇట్టి వివిచ్యాభిధానమున దీని యవశ్యానుసంధానము సూచిత మయినది.

శబ్దము—వాచకము, లాక్షణికము, వ్యంజకము అని మూడు విధములు. వాని యర్థములును—వాచ్యము, లక్ష్యము, వ్యంగ్యము నని మూడు విధములు.

తాత్పర్యార్థః పదార్థేభ్యో వాక్యార్థోఽస్తీతి కేచన. 319

వాచ్యాదిరర్థో వాక్యార్థ ఇతి ప్రాభాకరాదయః

తాత్పర్యార్థ మనునది వేరుగా నొకటి కలదని భాట్టమతానుయాయు లందురు. వీ రభిహితాన్వయవాదులు. పదముల పరస్పరాన్వయమున వాక్యార్థ ముల్లసించుచున్నది. ఆ వాక్యార్థమును శబ్దముననె కలుగును. ఆయర్థమును జెప్పుటకు శబ్దమునందు తాత్పర్య మను వృత్తి కలదని యంగీకరింప వలసి యున్నది. అట్టి తాత్పర్యవృత్తిప్రతిపాద్యము తాత్పర్యార్థము. తాత్పర్యార్థము వాచ్యలక్ష్యవ్యంగ్యములలో నేదియుగాదు. వానికన్న విలక్షణము. పదార్థముల వలన వాక్యార్థ మవభాసించును. అదియె తాత్పర్యార్థము. ఇది భాట్టమతము.

అన్వితాభిధానవాదు లయిన ప్రాభాకరానుయాయులు వాక్యార్థము వాచ్యమే యని యందురు. వాక్యార్థబోధ వృద్ధవ్యవహారమున గలుగును. అట్లు గలుగు తాత్పర్యార్థ మను వాక్యార్థమును వాచ్యమె. ఇట్టి రెండువాదములు పూర్వోత్తరార్థములచే సూచితములు.

యస్య యత్రావ్యవహితసంకేతో గృహ్యతే స్ఫుటమ్. 320

స తస్య వాచకః శబ్ద ఇతి శబ్దానుశాసనం
జాతి క్రియా గుణ ద్రవ్య భేదాత్సంకేతితః పునః. 321

చతుర్ధా భిద్యతే, తేషు జాతిరేకేతి కేచన
గౌరిత్యేవ హి శబ్దస్య ప్రవృత్తిర్జాతిగా స్మృతా. 322

గచ్ఛతీత్యస్య శబ్దస్య ప్రవృత్తిః స్యాత్క్రియాగతా
శుక్ల ఇత్యస్య శబ్దస్య ప్రవృత్తిర్గుణగామినీ. 323

డిత్థాదిసంజ్ఞాశబ్దస్య ప్రవృత్తిర్ద్రవ్యగామినీ

వాచకాదుల స్వరూపము క్రమముగా నిరూపించుట యావశ్యకము. కావ్యప్రకాశము ద్వితీయోల్లాసములో నిరూపిత మంతయు నిందిచట సూత్రప్రాయముగా నున్నది. దీని విస్తృత వివరణము నా రచితకావ్యప్రకాశ ద్వితీయోల్లాసమున నున్నది. అందీ విషయమును గ్రహింప వచ్చును. ప్రకృత మపేక్షిత మయినంతగా నా యర్థము నిరూపిత మగును,

వాచకశబ్దముయొక్క సంకేతితాది భేదము లీ ప్రఘట్టమున నున్నవి. ఏ శబ్దమున కే యర్థమున నవ్యవహితమగు సంకేతము స్ఫుటముగా సంగృహీత మగునో యా యర్థమున కా శబ్దము వాచక మగు ననుట శబ్దానుశాసనము. సాక్షాత్సంకేతిత మయిన యర్థము నభిధానించు శబ్దమునకు వాచకమని పేరు. ఈ శబ్దమున నీ యర్థమును బోధింపవలయు నను ఈశ్వరేచ్ఛ సంకేతము. సారస్వత వృద్ధులు ప్రవర్తింపజేసిన శబ్దార్థనియమము సంకేతము. సంకేతసహాయ మున్ననే యర్థప్రతీతి యుండును. సంకేతము గ్రహింపని వారికేదో యర్థము గోచరించునే గాని యర్థవిశేషము గోచరింపదు. సంకేతితార్థము జాతి-క్రియా-గుణ-ద్రవ్యభేద మున నాలుగు విధములుగా నున్నది. ద్రవ్య మనునది యదృచ్ఛాత్మకము. ఇది వా కరణమహాభాష్యకారమతము. "సంకేతితార్థము జాతిరూప మగునది యొక టియె. అందు గుణ క్రియా యదృచ్ఛాభేదములు లేవు" అని కొంద రందురు. ఈ కొందరు మీమాంసకులు. జాత్యాదిపక్షము, జాతిపక్షము—రెండిం దానూత్రి తము లయినవి.

## ఉపాధి

'గౌః' అను శబ్దము యొక్క ప్రవృత్తి జాతిగతము. "గచ్ఛతి" యను శబ్దము యొక్క ప్రవృత్తి క్రియాగతము. "శుక్లః" అను శబ్దము యొక్క ప్రవృత్తి ద్రవ్యగతము.

ప్రవృత్తేశ్చ నివృత్తేశ్చ వ్యక్తిర్యోగ్యా స్వభావతః. 324

అర్థక్రియాకారితయా వృత్తిస్తస్యామవస్యతి
ఆనంత్యాద్వ్యభిచారాచ్చ వ్యక్తీనాం తత్ర తత్ర తు 325

సంకేతకరణాశక్తేః సంకేతః స్యాదుపాధితః
గౌః శుక్లశ్చలతీత్యాదిశబ్దానాం నైవ సంభవేత్. 326

క్వచిత్కదాఽపి విషయవిభాగ ఇతి యత్తతః
ఉపాధావేవ సంకేతః స్వతః శబ్దస్య గృహ్యతే. 327

వ్యక్తిశక్తివాదము, ఉపాధిశక్తివాదము అను రెండు వాదములలో మొదటిది ఖండిత మగుట రెండవది యంగీకృత మగుట యిందున్నది. ప్రవృత్తి యోగ మగునది కాని నివృత్తియోగ్య మగునది కాని వ్యక్తియె. యర్థక్రియా కారి యయినందున శబ్దశక్తి వ్యక్తి యందె నిశ్చిత మగును. 'గౌః' అనగా గోవ్యక్తియె యర్థము. ఇది వ్యక్తిశక్తివాద స్వరూపము. ఇది యుక్తము కాదు. వ్యక్తిశక్తి నంగీకరించినచో నానంత్యము వ్యభిచారము నను దోష

ములు వాటిల్లును. కావున వ్యక్తియందు సంకేత మొనరించుట శక్యము కాదు. ఉపాధి ననుసరించియె సంకేత మంగీకరింపవలెను. వ్యక్తియందే సంకేత మంగీకరించిన వేరొక దోషమును వచ్చును. "గౌః శుక్లః చలః డిత్థః" అని నాలుగు విధముల విషయ విభాగ మున్నది. వ్యక్తిసంకేతమున నీ విషయవిభాగము కుదురదు. కావున నుపాధియందే సంకేతము సంగృహీత మగుట యుక్తము. ఉపాధియందే సంకేతమును గుర్తింపవలెను ఉపాధినానావిమతమున జాతి గుణ క్రియా యదృచ్ఛా శబ్దములకు భేదముండును. కావున వ్యక్తికి సంబంధించిన యుపాధిరూప మయిన ధర్మమునందే సంకేత మొనర్ప వలెను. ఉపాధియందొనరించిన సంకేత ముపాహిత వ్యక్తి యందు ప్రవృత్తినివృత్తులను సంపాదింపగలదు. ఉపాధివాదమె శాస్త్రయుక్తి సమ్మతము.

ఉపాధిర్వస్తు ధర్మస్సః సిద్ధః సాధ్య ఇతి ద్విధా
సిద్ధోఽపి స్యాత్పదార్థస్య ప్రాణదో వా విశేషకృత్. 328

ఉపాధిః సిద్ధరూపో యః సా జాతిరితి కథ్యతే

ఉపాధి వస్తుధర్మము. అది సిద్ధము, సాధ్య మని ద్వివిధము. ఇందు సిద్ధము పదార్థమునకు ప్రాణప్రద మని, విశేషాధాన హేతు వగునది యని రెండు విధములు. సిద్ధరూపమగు నుపాధి జాతి యని యుండును. ఈ పంక్తుల భావము నొకింత విశదముగా గ్రహించుట యుక్తము. ఉపాధి రెండు విధములు–వస్తుధర్మము, వక్తృయదృచ్ఛాసన్నివేశితము నని. వస్తుధర్మమును రెండు విధములు – సిద్ధము, సాధ్యము అని. సిద్ధవస్తుధర్మమును ద్వివిధము — పదార్థమునకు ప్రాణప్రద మగునది యొకటి; విశేషము నాధానించుటలో హేతువు రెండవది. ప్రాణప్రదమగునది జాతి. రెండవది గుణము. సాధ్య మగు వస్తుధర్మము క్రియారూపము. సంజ్ఞారూపముగా నుండునది వక్తృయదృచ్ఛా సన్నివేశిత మయిన యుపాధి.

వస్తుధర్మ మనునది వస్తువులందు నైసర్గికముగా నుండు జాతి, గుణ, క్రియారూపమగు ధర్మము. వక్తృయదృచ్ఛాసన్నివేశిత మగునది వాస్తవముగా వస్తువులం దుండదు. అయినను వ్యవహర్త యగు వ్యక్తి నిర్నిబంధనముగా తన యిచ్ఛానుసారమున నాయా వస్తువులందు దానిని సన్నివేశింప జేయును. చైత్రమైత్రాదిసంజ్ఞగా నది యుండును. వస్తుధర్మము సిద్ధ, సాధ్యరూపమున నుండు ననుటలో సిద్ధమగునది పూర్వమె నిష్పన్నమై యున్న

దని గ్రహింప వలెను. సిద్ధవస్తుధర్మములో ప్రాణప్రద మగునది జాతి. ప్రాణప్రదమనుట స్వరూపలాభహేతు వని భావము. ప్రాణప్రదము వలె నుండునది కావున నిది ప్రాణప్రదము. అది లేకున్న వస్తువునకు స్వరూపమె సిద్ధింపదు. ప్రాణనమె ప్రాణము. అనగా వ్యవహారయోగ్యత. దానిని నిర్వహించునది. "ప్రాణం వ్యవహారయోగ్యతాం ప్రదదాతి సంపాదయతి" అని వ్యుత్పత్తి. ఆ వస్తు వుండునంతవర కది సంబంధించి యుండును. నిఖిలవ్యక్తులం దుండునట్టి జాతియె యిది. ఉపాధి, జాతి యనునవి యర్థాంతరములు కావు. భర్తృహరి పదవాక్యముల తత్త్వము నిరూపించు వాక్యపదీయగ్రంథమున నిది ప్రాణప్రద మగుటను నిరూపించినాడు. ఈ యంశమున ప్రామాణికసంవాద ముండుటను గుర్తింప వచ్చును.

ఉక్తో వాక్యపదీయేஉపి జాత్యుపాధిః స తద్యథా. 329

స్వరూపతో గౌర్న గౌః స్యాన్నా గౌరితి చ తత్త్వతః
తత్ర గోత్వాభిసంబంధాద్గౌరిత్యేవాభిధీయతే. 330

వాక్యపదీయమున జాత్యుపాధి యిట్లు కీర్తిత మయినది—"న హి గౌః స్వరూపేణ గౌః నాప్యగౌః గోత్వాభిసంబంధాత్తు గౌః" ఇది వాక్యపదీయవాక్యమని కావ్యప్రకాశమున నుదాహృతము. దీని యర్థ మిది. గోవు స్వరూపమున తన వ్యక్తిరూపముగా "గోవు" అను వ్యవహారప్రయోజకము కాదు. ఉపాధిరహిత మయిన గోవ్యక్తియందు గో పదమును ప్రయోగించినచో ఘటము నందును గోపదమును ప్రయోగింపవచ్చును గదా! ఏదో యొక స్వరూపమున నది రెండిటను గలదు. కాన వ్యక్తి ననుసరించి గోత్వరూపమగు జాతి యచట లే నందు వలన నది గోవ్యవహారము సంపాదింప జాలదు. గోవ్యవహారమునకు గోవ్యక్తి ప్రయోజకము కాదని భావము. అది గోభిన్న మనియు వ్యవహరించుటకు శక్యము కాదు. అట్టిదానిని జూచి యశ్వమహిషాది వ్యవహార మొనర్పము. గో వనుటకు ననకపోవుటకును వ్యక్తి నిబంధనము కాదు. అశ్వాదిజాత్యంతరము లచట కూడి యుండలేదు. కాగా జాతియే స్వరూపసిద్ధి హేతు వగుచున్నది. కాన గోత్వాదిసంబంధముననే గోవు గోవు అగును. గోత్వముకలదని గుర్తించిననే గోవు గోశబ్ద వ్యవహార్య మగునని

భావము. ఈ వస్తుధర్మము పదార్థమునకు స్వరూపసంపాదక మయినందున ప్రాణప్రద మగుచున్నది.

యః శుక్లాదినా వస్తు లబ్ధసత్త్వం విశిష్యతే
స సిద్ధో వస్తుధర్మోఽత్ర గుణోపాధిరితీరితః. 331

సాధ్యః పూర్వాపరీభూతావయవాదిక్రియాత్మకః
గచ్ఛతీత్యత్ర విద్వద్భిః క్రియోపాధితయోచ్యతే. 332

యత్సంహృతక్రమం వక్త్రా సంజ్ఞారూపో యదృచ్ఛయా
ఉపాధిత్వేన డిత్థాదిష్వర్థేషూపనివేశితః. 333

స శబ్దః సిద్ధసాధ్యాన్యో ద్రవ్యోపాధిరితి స్మృతః
శుక్లశ్చలతి గౌర్డిత్థః ఇత్యాదౌ తు చతుష్టయీ. 334

ప్రవృత్తిరితి శబ్దానాం మహాభాష్యకృదభ్యధాత్

ఇతరము లయిన వస్తుధర్మముల స్వరూపవిచార మిచట నున్నది. జాతిచే వ్యవహారయోగ్యతను పొందిన వస్తువు సిద్ధస్వరూపము లబ్ధసత్తాకము నగును. అట్టి వస్తువు శుక్లాదికముచే విశేషితమై సజాతీయములగు నితరవస్తువుల కన్న వేరుగా నగును. అట్లున్న సిద్ధ మయిన వస్తుధర్మము గుణోపాధి యని వ్యవహృత మగుచున్నది. సాధ్యమగు వస్తుధర్మము పూర్వాపరీభూతావయవ ములు కల క్రియారూపము. "గచ్ఛతి" అను స్థలమున నిది క్రియోపాధిక వస్తు ధర్మ మనిరి. సాధ్యమయిన యుపాధిక్రియారూపము. సాధ్యముగా ప్రతీయమాన మగుటయె క్రియ యొక్క రూపము. సాధ్యత్వమన నుత్పాద్యమానత్వమని వైయాకరణు లంగీకరించిరి. పూర్వాపరీభూతావయవములు కల సమూహ మంతయు నొకే క్రియ యగును. ఒక క్రియలో గొన్ని పూర్వావయవములు కొన్ని యపరావయవములు. ఇట్లు వానిలో నొక క్రమమున్నది. ఈ క్రమోప లక్షిత మయిన క్రియయె యిచట వివక్షితము. క్రియోపాధి యెల్లప్పుడు సాధ్యరూపమునసె యుండును.

వక్తచే యదృచ్ఛగా సంజ్ఞారూపము డిత్థాద్యర్థములలో నుపాధి రూపముగా నివేశిత మయినది. యదృచ్ఛాశబ్దము నందు క్రమ ముపసంహృత మగును. ఇది "సిద్ధసాధ్యాన్యః." సిద్ధసాధ్యముల కన్న భిన్న మయినది. ఈ శబ్దము ద్రవ్యోపాధి యని ప్రఖ్యాత మయినది.

యదృచ్ఛాత్మక మగునది నాల్గవ యుపాధి. వక్త తన యిచ్ఛానుసారముగా సంజ్ఞారూపమగు నుపాధిని సన్నివేశింప జేయును. ఒకని యుమాధవు డని యెన్ని నపుడు ఆ నామశబ్ద స్వరూప మంత్యవర్ణబుద్ధి నిగ్రాహ్యముగ నుండును. ఉత్తరోత్తరవర్ణముల నుచ్చరించు సమయమందు పూర్వపూర్వ వర్ణములు వినాశము పొందును. అప్పు డుమాధవశబ్దస్వరూపము తుదకు గలుగు వర్ణబుద్ధిచే స్పష్ట మగును పూర్వపూర్వవర్ణము నశించినను వాని వలన నొక సంస్కార ముత్తరోత్తరవర్ణమునం దుదయించును. ఆ యా వర్ణ సంస్కారముతో గూడుకొనిన బుద్ధి యుమాధవసంజ్ఞాశబ్దరూపము నవగతము చేయును. తుదకు గోచరము లయిన యా వర్ణములందు క్రమము లేదు. అందలి క్రమమంతయు నుపసంహృత మగును. ఉచ్చారణ కాలములో గోచరించు క్రమ మనుసంధాన సమయమున నుపయోగింపదు. ఆ క్రమమె యిచట నుండుననుట విరుద్ధము. సంహృత క్రమమయిన వర్ణసముదాయరూప మగు స్వరూపమును వక్త స్వతంత్రముగా గూర్చును. అందుననె యదృచ్ఛాత్మకము.

ఈ యదృచ్ఛాత్మకశబ్దము సిద్ధసాధ్యాన్య మని శారదాతనయు డనుచున్నాడు వస్తుధర్మము సిద్ధసాధ్యరూపము. ఇంత కన్న భిన్న మగునది వక్తృయదృచ్ఛాసన్నివేశితము. కావునసె ఉపాధి వస్తుధర్మ మని, వక్తృయదృచ్ఛా సన్నివేశిత మని నిరూపిత మగు నది. ఈ రేఖాలిపిలో నిది స్పష్ట మగును.



ప్రాణప్రదమగు జాతి, విశేషాధానహేతువయిన గుణము, సాధ్య మయిన క్రియ, యదృచ్ఛాశబ్దము అని యుపాధి నాలుగు విధములుగా నిర్ణీత మయినది. మహార్థము కల యీ శాస్త్రసరణి ననుసరించి మహాభాష్యకారుడు "గౌః శుక్లః చలః డిత్థః ఇత్యాదౌ చతుష్టయీ శబ్దానాం ప్రవృత్తిః" అని నాడు. అర్థము అందలి శబ్దముల ప్రవృత్తి, ప్రవృత్తినిమిత్తభేదముల ననుసరించి యిట్లు నాల్గువిధములుగా నుండును ఉపాధి నాల్గువిధములు కాగా శబ్దమును నాల్గువిధము లగునని భావము.

గుణత్వం యదణుత్వాదేః పాఠాచ్చ గుణమధ్యతః. 335

పారిభాషిక మేవేతి కణాద మతికల్పితం

కణాదుడు వైశేషికసూత్రకర్త. గుణమధ్యపాఠము వలన అణు త్వాదులకు గుణత్వ మంగీకరించెను. అది యాతని మతికల్పనము. అది పారి భాషికమె. ఈ చెప్పిన విధానము ననుసరించి చూడగా పరమాణుత్వము మొదలగునది జాతి యని చెప్పదగి యున్నది. అందుచే పరమాణ్వాదిశబ్దము లును జాతిశబ్దములె యగును. కాని కణాదుని వైశేషికశాస్త్రమం దది గుణ మని యున్నది. వాస్తవముగా నవి ప్రాణప్రద మగుట వలన జాతివాచకమె కావలయును. పరమాణ్వాదులను గుణమధ్యమున పఠించుట యుపపత్తిసహము కాదు. వారు చెప్పు గుణత్వము కేవలము పారిభాషికము మాత్రమె. పరి మాణము నాలుగు విధములు—అణు-మహత్-దీర్ఘ-హ్రస్వపరిమాణములు తద్భేద ములు. ఆ పరిమాణమునె పరమాణువని పరమమహత్తని చెప్పుట కలదు. పరమాణుపరిమాణము పరమాణుద్రవ్యమునకు ప్రాణప్రదము. అందుచే పర మాణుత్వమునకు జాతిత్వమునె యంగీకరింపవలెను. వైశేషికులు గుణమధ్య మున పఠించుట స్వసిద్ధాంతానుసార మయిన పరిభాషామాత్రమె.

గుణక్రియాయదృచ్ఛాదేరైకరూప్యేఽపి తత్త్వతః. 336

తత్తదాశ్రయభేదేన భేదః ప్రాయేణ లక్ష్యతే
ఏకం ముఖం యథాఽదర్శాద్యాలంబనవిభేదతః. 337

భిన్నం భిన్నమివాభాతి తథైవ స్యుర్గుణాదయః

గుణక్రియాయదృచ్ఛాదులకు తత్త్వతః ఏకరూపత్వమె యున్నది. అయినను సామాన్యముగా నాయా యాశ్రయభేదమున భేదమున్నట్లు కన్ప

డును. ముఖ మొక్కటియె యయినను దర్పణాద్యాలంబనభేదమున భిన్నభిన్నముగా గన్పించును. ఇట్లే గుణాదులు నేకరూపము లయిన నాలంబనభేదమున వేరు వేరుగా గోచరించుటను గ్రహించునది. విప్రతిపత్తి రాహిత్యమునకై యీ విషయము నిట్లు గ్రహింపవలెను. గుణక్రియాయదృచ్ఛ లనంతములు కదా! వ్యక్తియందు సంకేతమును గ్రహించినచో నానంత్యవ్యభిచారదోషములు సంప్రాప్తము లయినట్లు గుణక్రియాయదృచ్ఛాత్రయమును గూడ నా దోషము లనుబంధించునే! జాతి సర్వానుస్యూతమై యున్నందున నా దోషము లనుబంధింపకపోవచ్చును. ఘటశుక్లము పటశుక్లమని శుక్లగుణ మెన్నియో విధముల నున్నది. ఓదనపాకము గుడపాకము నని క్రియ యనేకవిధముల నున్నది. మాధవుని యదృచ్ఛ యుమాధవుని యదృచ్ఛ యని యదృచ్ఛయు నానావిధము లగును. ఇట్లు నానాత్వ మున్నప్పు డానంత్యవ్యభిచారములెట్లు పరిహరింప దగును?

ఇట్టి శంకాసమాధానముగా నీ ప్రసంగార్థము భావనీయము. గుణక్రియాయదృచ్ఛలు వాస్తవముగా నేకరూపములె. ఆశ్రయభేదమున వానియందు భేద మున్నట్లు కన్పడును. ముఖ మొక్కటియె యయిన నది ఖడ్గమున నొకవిధముగా ప్రతిబింబించును; అద్దమున మరియొక విధముగా గోచరించును. ఖడ్గాలంబమున ముఖము శ్యామముగా నుండును. తైలాలంబమున స్నిగ్ధముగా నుండును. దర్పణాలంబనమున నుజ్జ్వలముగా నుండును. ఇట్లా యా యాలంబన భేదమున ముఖము నానారూపమున భాసించునే గాని యచట భేదమే లేదు. ఏకరూపమె కలదు. గుణక్రియాయదృచ్ఛ లేకరూపములె యగుట స్వభావము.

భిన్నే హిమపయఃశంఖాద్యాశ్రయే పరమార్థతః. 338

అభిన్న ఇవ శుక్లాదౌ యద్వశాదుపజాయతే
శుక్లః శుక్లోఽయమిత్యాదిరభిన్నప్రత్యయక్రమః. 339

తద్ధి శుక్లత్వసామాన్యం తత్ప్రవృత్తినిమిత్తకమ్
యథా డిత్థాదిశబ్దేషు బాలవృద్ధశుకాదిభిః. 340

ఉదీరితేషు ప్రత్యేకం భిద్యమానేషు తత్త్వతః
డిత్థాదిత్వం తత్తదర్థే డిత్థాదావనువర్తతే. 341

అతశ్చ సర్వశబ్దానాం జాతిరేకైవ తత్త్వతః
స్వప్రవృత్తినిమిత్తం తన్న వ్యక్తిరితి నిశ్చితా. 342

జాత్యాది పక్షము జాతిపక్షము నను రెండుపక్షములు సూచితములు. వానిలో నింతవఱకు జాత్యాదిపక్షము ప్రతిపాదిత మయినది. ఇక "జాతిరేవ-వా" యను జాతిపక్షమును నిరూపింపవలసి యున్నది. జాతిమాత్రమె సంకేతిత మని మీమాంసకమతము. గుణక్రియాయదృచ్ఛలకు భేద మాశ్రయభేదమున గలిగినది కాదు. వాస్తవముగా వాని యందు భేదము కలదు. కావున నంతట జాతియే ప్రవృత్తినిమిత్త మని మీమాంసకమతసారము.

హిమపయఃశంఖాద్యాశ్రయ మయిన శుక్లము పరమార్థతః భిన్నము. ఇట్లు భిన్నమె యయినను 'శుక్లము శుక్లము' అను నభిన్నప్రత్యయక్రమ మభిన్నముగ గలుగు చున్నది. భిన్న మయిన ప్రత్యయము, అభిన్న మయిన యభిధానము యుక్తము కాదు. అట్టి ప్రవృత్తినిమిత్తము శుక్లత్వసామాన్యము. శుక్లత్వరూప మగు జాతియె యిందు ప్రవృత్తినిమిత్తము.

డిత్థాదిశబ్దము లందును జాతి యున్నది. బాలవృద్ధశుకాదులచే డిత్థాది శబ్దము లుచ్చరితము లయినపుడు భిన్నభిన్నములుగనె యుండును. వేరొక విధమున గూడ నీ భేదము విశదము. తత్త్వతః డిత్థాదిపదార్థములు ప్రతిక్షణము భిన్నభిన్నములె యగుచున్నవి. క్షణక్షణము దేహమున మార్పు గలుగుచునే యుండును. బాల్యమున కౌమారమున యౌవనమున వార్ధకమున మానవుడు మారుచునె యుండును. ఆ యా సమయము లందలి సంజ్ఞలును భిన్నభిన్నములె. అయిన నభిన్నవ్యవహారమె యున్నది. అయినను డిత్థత్వరూపసామాన్యము — జాతి తత్తదర్థములం దనుగతముగనె యున్నది. అచట కూడ జాతియె ప్రవృత్తినిమిత్త మని తెలియవలయును.

కావున సర్వశబ్దములకు తత్త్వతః జాతి యొక్కటియె ప్రవృత్తి నిమిత్తము కాదని నిశ్చితము. ఇట్లు జాత్యాదిపక్షము జాతిపక్షము నిరూపిత మయినది. ఇందు మమ్మటునకు జాత్యాదిపక్షమె యభిమతమని జాతిపక్ష మభిమతము కాదని గుర్తింప వలెను. తదనుసారముగనే శారదాతనయుడును ప్రతిపాదించెను. ఇంక నిందలి యన్వయవిశేషమును నా కావ్యప్రకాశ విమర్శనీ వ్యాఖ్యలో జూడవచ్చును.

తద్వానపోహః శబ్దార్థ ఇతి కైశ్చన కథ్యతే
ప్రకృతానుపయోగిత్వాదత్రాస్మాభిర్న కథ్యతే. 343

శబ్దార్థవిషయమున నే చూపిన రెండు వాదములె కాక ఇంకను రెండు వాదములు కలవు. అవి యిం దుట్టంకితములు. తార్కికులు శబ్దార్థము తద్వాన్ - తత్ జాతి, తద్వాన్ = జాతివిశిష్ట మయిన వ్యక్తి అని యంగీకరింతురు. బౌద్ధులలోని సౌగతులు శబ్దార్థము అపోహము - అది కానిది, అతద్వ్యావృత్తి యందురు. ఈ వాదములు ప్రకృతమున నుపయోగించునవి కావు. కావున మే మిచట వాని నిరూపించుట లేదు. ఈ వాదములస్వరూపమును నా కావ్యప్రకాశ ద్వితీయోల్లాసమున జూడవచ్చును. విస్తరమని యిట రూపింప లేదు.

### అభిధ

అతః సర్వస్య శబ్దస్య ముఖ్యోఽర్థో జాతిరేవ సా
వ్యాపారస్తత్ర శబ్దస్య ముఖ్యో యః సాఽభిధా భవేత్. 344

శబ్దస్య ముఖ్యేఽర్థేవృత్తిస్తత్తద్వ్యక్తిష్వవస్యతి

ఏ శబ్దమున కయినను సాక్షాత్సంకేతిత మయిన యర్థమె ముఖ్యార్థము. అది జాతిరూపము. ఆ ముఖ్యార్థవిషయమున శబ్దమునకు సంబంధించిన ముఖ్య వ్యాపార మభిధ యగును. ముఖ్యార్థమున శబ్దవ్యాపారము ఆ వ్యక్తులందు సంగత మగును.

ఇచట అభిధావ్యాపారనిరూపణ మున్నది. సాక్షాత్సంకేతిత మయిన యర్థమునకే ముఖ్యార్థ మని పేరు. కాని ముఖ్య మను వేరొక యర్థము లేదు. మొదటగా గోచరించు నది యగుటచే నీ యర్థమునకు ముఖ్య మను పేరుపన్నము "ముఖమివ ముఖ్యః" యని ముఖశబ్దవ్యుత్పత్తి. శబ్దవ్యాపారము వలన గోచరించు అర్థము ముఖ్యము. లక్ష్యాద్యర్థముల కన్న నీ యర్థమె ముందుగా గోచరించును. అట్టి సాక్షాత్సంకేతిత మయిన ముఖ్యార్థవిషయమై శబ్దమునకు గల ముఖ్యవ్యాపార మభిధ యని భావము.

### లక్షణ

లక్షణేత్యత్ర శబ్దస్య వ్యాపారాంతరముచ్యతే. 345

ముఖ్యార్థబాధే తద్యోగే రూఢితోఽథ ప్రయోజనాత్
అన్యోఽర్థోలక్ష్యతే యత్సా లక్షణాఽఽరోపితా క్రియా. 346

కావ్యశాస్త్రము నందు శబ్దమునకు లక్షణ యను వ్యాపారాంతరము నిరూపిత మగును. ముఖ్యార్థబాధ యుండగా తత్సంబంధ ముండగా రూఢి వలన గాని ప్రయోజనము వలన గాని యన్యార్థము లక్ష్యమాణ మగునేని యది లక్షణ యగును. లక్షణ యారోపితవ్యాపారము అని మూలార్థము. దీని వివరణము నిట్లు గుర్తించునది.

వాచకనిరూపణానంతరము లక్షకనిరూపణ మావశ్యకము. లక్షక లక్ష్యములు లక్షణా నిరూపణమున సుగమము లగును. కావున నిందు లక్షణ నిరూపితమగును. లక్ష్యార్థమును జెప్పు లక్షకశబ్దము నందున్న వ్యాపారము లక్షణయగును. లక్షణ యారోపితక్రియ. శబ్దమున సహజముగా నుండునదికాదు. అర్థప్రతీత్యనుకూలముగా కల్పితము.

ముఖ్యార్థబాధ ముఖ్యార్థయోగము రూఢిప్రయోజనములలో నేదియేని యొకటి యీ త్రయము లక్షణాహేతువు. రూఢిప్రయోజనములలో నన్యతర ముండవలయు ననుటచే లక్షణ ద్వివిధ మని చెప్పినట్లయినది — రూఢిలక్షణ, ప్రయోజనలక్షణ యని. ముఖ్యార్థబాధ, సంబంధ మనునవి రెండింటను సాధారణములు. ఈలక్షణాస్వరూప ముదాహరములందు విశద మగును.

కుశలః కర్మణీత్యత్ర కుశలావాద్యయోగతః
రూఢితో లక్షయత్యేవ శబ్దః కర్మణి కౌశలమ్. 347

ఘోషాధికరణత్వస్య గంగాదీనామసంభవాత్
ముఖ్యార్థబాధే తత్తీరే రూఢితః సుప్రసిద్ధితః. 348

యతో ఘోషస్య వసతిర్లక్ష్యతే సాపి లక్షణా
గంగాతటే ఘోష ఇతి శబ్దో ముఖ్యార్థభాగపి. 349

పావనత్వం లక్షయతి ధర్మస్యాతిప్రయోజనాత్
ప్రయోజనాదముఖ్యోఽర్థో ముఖ్యేనార్థేన లక్ష్యతే. 350

యస్మిన్నారోపితః శబ్దవ్యాపారః సాంతరార్థభాక్

"కుశలః కర్మణి" అనునది రూఢిలక్షణ కుదాహరణము. "కుశాన్ లాతీతి కుశలః" దర్భలను గ్రహించువాడని కుశల పదార్థము. "కర్మణి కుశలః" అనుచోట దర్భగ్రహణయోగ్యత యభిప్రేతము కాదు. దర్భగ్రహణయోగ్యతా

రూప మయిన ముఖ్యార్థ మచట బాధిత మయినది. అది యచట సంబంధించుట లేదు. కావున వాక్యసార్థకతాసిద్ధికై వేరొక యర్థమును స్వీకరింపవలసి యున్నది. ఆ యర్థము ముఖ్యార్థమునకు సంబంధించి యుండదగును. దర్భ లను దీయుటలో నత్యంతము సావధానత యవసరము. దర్భాగ్రములు తీక్ష్ణముగా నుండుటచే వాని బాధ కలుగకుండునట్లు వివేకత్వ మచట నవసర మగుచున్నది. ఈ వివేచకత్వరూప మయిన సంబంధ ముండుటచే కుశలశబ్దము ప్రవీణు డను నర్థమున రూఢ మగుచున్నది. రూఢివలన కర్మ యందలి నిపుణత్వమును లక్ష్య మాణ మొనరించును. కావున నిందు రూఢిలక్షణ.

"గంగాయాం ఘోషః" అనునది ప్రయోజనలక్షణ కుదాహరణము. గంగా ప్రవాహమున ఘోషము కలదు అను ముఖ్యార్థము బాధితము. గంగాదు లకు ఘోషాధికరణత్వము సంభవింపదుగదా! ముఖ్యార్థము బాధితము కాగా వాక్యార్థోపపత్తికై తీరరూపార్థము నచట గ్రహింపవలెను. గంగాతీరము గంగాప్రవాహ మను ముఖ్యార్థమునకు సంబంధించియె యున్నది. ఈ సంబం ధము సామీప్యాత్మకము. "తీరే ఘోషః" గంగాతీరమున ఘోషమునకు వసతి లక్షిత మగును. తీరము లక్షిత మగుట లోకమున సుప్రసిద్ధముగా నున్నది. కావున నిది లక్షణ.

"గంగాతటే ఘోషః" అను ముఖ్యశబ్దప్రయోగము వలన పావన త్వాది ధర్మములు ప్రతిపాదితములు కావు. లాక్షణికపద ప్రయోగముననె యవి గోచరించును. ఇట్టి ప్రయోజన మున్నందున ముఖ్యార్థముచే నముఖ్యార్థము-లక్ష్యార్థము లక్ష్యమాణ మగుచున్నది. కావున నిది యారోపిత మగు శబ్ద వ్యాపారము. సాంతరార్థనిష్ఠమయిన వ్యాపారము. అంతరము వ్యవధానము. (ముఖ్యార్థబాధ యుండుటచే సాంతర మయినది.) ముఖ్యార్థము వ్యవహితము కాదు. అది నిరంతరార్థము. నిరంతరార్థనిష్ఠ మయిన వ్యాపారము ఆరోపి తముకాదు. సాంతరార్థ నిష్ఠ మయిన వ్యాపార మారోపితము. అర్థము వలన గోచరించిన వ్యాపారము కావున లక్షణ యర్థవ్యాపార మయినను వాచ్యధర్మము వాచకము నం దుపచరిత మగుట యను న్యాయమున నిది శబ్దవ్యాపార మయినది.

ఈ ప్రఘట్టమున భావప్రకాశనములోని శ్లోకవాక్యములు కొన్ని కావ్యప్రకాశానుగతముగ లేవు. అంతట ప్రకాశార్థమునె నిరూపించిన యీ

ప్రకాశనము కొన్ని స్థలములందు స్ఖలిత మయినది. "రూఢిశ్చ సుప్రసిద్ధిః", "పావనత్వం లక్షయతి ధర్మఖ్యాతిప్రయోజనాత్" - వీనిని మమ్మటానుసారముగ సవరించుకొని భావించుట యుక్తము. అట్లె యిందు నిరూపితము.

శుద్ధేయం లక్షణా, సేయం భవేదర్థవశాద్ద్విధా. 251

ఉపాదానాభిధా కాచిదన్యా లక్షణలక్షణా
ఆరోపితా క్రియా యత్ర సోపాదానాఖ్యలక్షణా. 352

కుంతః ప్రవిశతీత్యుక్తే స్వసంయోగినమేవ సః
స్వస్య ప్రవేశసిద్ధ్యర్థం యదాక్షిపతి పూరుషమ్. 353

కుంతప్రవేశో ముఖ్యార్థః కుంతస్య తదసంభవాత్
స్వక్రియాఽఽరోప్యతే యస్మిన్ యుక్తా సారోపితా క్రియా. 354

సాంతరార్థోఽత్ర శబ్దస్య వ్యాపారోఽర్థాంతరాశ్రయః

లక్షణ - శుద్ధలక్షణ, గౌణీలక్షణ యని రెండువిధములు. శుద్ధలక్షణ యర్థవశమున ద్వివిధ యగును - ఉపాదానలక్షణ, లక్షణలక్షణ యని. "కుంతః ప్రవిశతి" అనునది యుపాదానలక్షణ కుదాహరణము. "స్వసిద్ధయే పరాక్షేపః" స్వసిద్ధికై పరాక్షేప మున్నచో నుపాదానము. శక్యార్థమున కన్వయప్రవేశసిద్ధి కలుగుటకై స్వసంబద్ధ మయిన యర్థమును సామర్థ్యమున స్వీకరించు యుపాదానలక్షణ. 'కుంతః ప్రవిశతి' అను స్థలమున కుంతశబ్దమునకు ఈటె అను ఆయుధవిశేషము ముఖ్యార్థము. కుంత మచేతనము. ప్రవేశనము కుదురదు. "ప్రవిశతి" సంప్రవేశసిద్ధికై కుంతము ధరించు పురుషుని లక్షింప జేయును. కుంతము ధరించిన పురుషుడు ప్రవేశించుచున్నాడని యర్థము కలుగును. ఇది సాంతరార్థనిష్ఠ మయిన యారోపితక్రియ. దీని సార మిట్లు సంగ్రాహ్యము. కుంతము స్వప్రవేశమునకై స్వసంయుక్తపురుషుని గోచరింపజేయుచున్నది. "స్వసిద్ధయే పరాక్షేపః" సంగత మయినది. కావున ఉపాదానలక్షణ మయినది.

గౌరనుబంధ్య ఇత్యత్ర స్వానుబంధన సిద్ధయే. 355

వ్యక్తిరాక్షిప్యతే జాత్యా న శబ్దేనాభిధీయతే
"విశేష్యం నాభిధా గచ్ఛేత్ క్షీణశక్తిర్విశేషణే." 356

ఇతి న్యాయాదుపాదానలక్షణా నాత్ర శంక్యతాం
రూఢిప్రయోజనాభావాజ్జాతివ్యక్త్యోరభేదతః. 357

క్రియాదీనామభావాచ్చ నైవోపాదానలక్షణా

"గౌరనుబంధ్యః" యను వాక్యము కలదు. ఇచట నుపాదాన లక్షణ యగునా? గోపదమున జెప్పదగిన గోత్వరూప మయిన జాతి తన కనుబంధన సిద్ధికై గోవ్యక్తి నాక్షిప్త మొనరించును. గోవ్యక్తి యా స్థలమున శబ్దముచే నభిహితము కాదు. "అభిధాశక్తి గోత్వరూప మయిన విశేషణమున ప్రసరించి క్షీణశక్తి యగును గావున విశేష్యమగు గోవ్యక్తిపర్యంతము ప్రసరింపదు" - ఇట్టి న్యాయమున గోవ్యక్తి యభిధచే నిరూపితము కాదు. "స్వసిద్ధయే పరాక్షేపః" గోత్వమున కన్వయసిద్ధికై వ్యక్త్యాక్షేప మున్నందున నుపాదానలక్షణ యగును కదా!

ఈ స్థలమున నుపాదానలక్షణ శంక యొనరింపరాదు. ఇది రూఢి కాదు. ఇందు ప్రయోజనము లేదు. జాతి వ్యక్తులకు భేదము లేదు. క్రియాదు లిందు లేవు. జాతి వ్యక్త్యవినాభావమున నుండును గావున వ్యక్తిని భాసింప జేయును. అవినాభావమున భాసించునేని లక్షణ యపేక్షితము కాదు. కాన నిట నుపాదానలక్షణ ప్రసరింపదు.

అకారి కారయ కురు క్రియతామితి యద్వచః. 358

భావః కారయితా కర్మ కర్తా చాక్షిప్యతే యతః
ఇత్యాదావప్యుపాదానలక్షణా నైవ శంక్యతామ్. 359

అవినాభావమున నాక్షిప్యమాణ మగుట యనేకస్థలము లందు ప్రసిద్ధముగా నున్నది. అట్టి స్థలములం దుపాదానలక్షణను శంకింపరాదు. "అకారి" చేయబడెను అను స్థలమున భావార్థ మాక్షిప్త మగును. "తేన ఇదం అకారి" వానిచే నిది చేయబడెను. "కారయ" చేయింపుము అనగా కారయిత - చేయించు వాడు గోచరించును. 'కురు' అనగా "కర్మ" గోచరించును, "ఘటం కురు". "క్రియతాం" చేయబడుగావుత యనగా కర్త "త్వయా" నీచేత గోచరించును. ఇట్లాయా స్థలము లందు భావాదు లాక్షిప్యమాణము లగుచుండగా నుపాదాన లక్షణాశంక యుచితము కాదు. కావున "గౌరనుబంధ్యః" అను స్థలమున నుపాదానలక్షణ యుచితము కాదు.

తత్తదర్థస్వరూపాప్తేరన్యథానుపపత్తితః
అర్థాపత్తిప్రమాధీనా క్రియాకర్త్రాదికల్పనా. 360

యత్ర స్యాదర్థసామర్థ్యం తత్రార్థాపత్తిరుచ్యతే
శ్రుతసామర్థ్యయోగేన శ్రుతార్థాపత్తిరుచ్యతే. 361

దేవదత్తాదిపురుషపీనత్వానుపపత్తితః
భోజనస్య నిషిద్ధస్య దివా రాత్రౌ ప్రకల్ప్యతే. 362

అర్థాపత్తిర్భవేద్యద్వా శ్రుతార్థాపత్తిరేవ వా
గౌరనుబంధ్య ఇత్యత్ర శ్రుతార్థాపత్తిరేవ సా. 363

''గౌరనుబంధ్యః'' యను స్థలమున నుపాదానలక్షణ కాదనుట కుపపత్త్యంతర మిచట నిరూపిత మగును. తత్తదర్థస్వరూపసిద్ధి వేరొక విధముగా నుపపన్నము కానందువలన నట్టి స్థలమున క్రియాకర్త్రాది కల్పనను అర్థాపత్తి యను ప్రమాణాధీనముగా సిద్ధమగును. అర్థాపత్తి యచట నుండునో యచట నర్థాపత్తి యుండునందురు. శ్రుతసామర్థ్యము కూడుకొని యున్నచో శ్రుతార్థాపత్తి యందురు. ప్రత్యక్షముగా చూచి నప్పటి సామర్థ్య మున్నచో దృష్టార్థాపత్తి-అర్థాపత్తి యందురు. ఈ యంశమును ఈ యుదాహరణమున దర్శింపవచ్చును.

''పీనో దేవదత్తః, దివా నభుంక్తే'' యను వాక్యము కలదు. దేవదత్తుడు బలిసి యున్నాడు. పగటిసమయమున భుజింపడు. అని తదర్థము — దివాభోజన మొనరింపని వాడు బలిసియుండుట యుపపన్నము కాదు. అనుపపన్న మయిన దేవదత్తుని పీనత్వము రాత్రిభోజన మాత్రప్త మొనరించును. ఇది యర్థాపత్తి కాని, శ్రుతార్థాపత్తి కాని కావచ్చును. దేవదత్తుడను పురుషుని పీనత్వానుపపత్తి వలన, దివాభోజనము నిషిద్ధము కాగా రాత్రిభోజన మాత్రప్తమై ప్రకల్పిత మగును. ఇది యర్థాపత్తి లభ్యము. ఇట్లే ''గౌరనుబంధ్యః'' యను స్థలమున గూడ అర్థాపత్తియగునే కాని ఉపాదానలక్షణ కాదు.

ఘోషాధికరణత్వస్య సిద్ధయే స్వతటోపరి
స్వార్థం సమర్పయత్యేవ గంగాశబ్దో యతస్తతః. 364

ఇత్యాదిలక్షణేనైవ, శుద్ధేయముభయాత్మికా

ఇతి న్యాయాదుపాదానలక్షణా నాత్ర శంక్యతాం
రూఢిప్రయోజనాభావాజ్జాతివ్యక్త్యోర భేదతః. 357

క్రియాదీనామభావాచ్చ నైవోపాదానలక్షణా

"గౌరనుబంధ్యః" యను వాక్యము కలదు. ఇచట నుపాదాన లక్షణ యగునా? గోపదమున జెప్పదగిన గోత్వరూప మయిన జాతి తన కనుబంధన సిద్ధికై గోవ్యక్తి నాక్షిప్త మొనరించును. గోవ్యక్తి యా స్థలమున శబ్దముచే నభిహితము కాదు. "అభిధాశక్తి గోత్వరూప మయిన విశేషణమున ప్రసరించి క్షీణశక్తి యగును గావున విశేష్యమగు గోవ్యక్తిపర్యంతము ప్రసరింపదు" - ఇట్టి న్యాయమున గోవ్యక్తి యభిధచే నిరూపితము కాదు. "స్వసిద్ధయే పరాక్షేపః" గోత్వమున కన్వయసిద్ధికై వ్యక్త్యాక్షేప మున్నందున నుపాదానలక్షణ యగును కదా!

ఈ స్థలమున నుపాదానలక్షణ శంక యొనరింపరాదు. ఇది రూఢి కాదు. ఇందు ప్రయోజనము లేదు. జాతి వ్యక్తులకు భేదము లేదు. క్రియాదు లిందు లేవు. జాతి వ్యక్త్యవినాభావమున నుండును గావున వ్యక్తిని భాసింప జేయును. అవినాభావమున భాసించునేని లక్షణ యపేక్షితము కాదు. కాన నిట నుపాదానలక్షణ ప్రసరింపదు.

అకారి కారయ కురు క్రియతామితి యద్వచః. 358

భావః కారయితా కర్మ కర్తా చాక్షిప్యతే యతః
ఇత్యాదావప్యుపాదానలక్షణా నైవ శంక్యతామ్. 359

అవినాభావమున నాక్షిప్యమాణ మగుట యనేకస్థలము లందు ప్రసిద్ధ ముగా నున్నది. అట్టి స్థలములం దుపాదానలక్షణను శంకింపరాదు. "అకారి" చేయబడెను అను స్థలమున భావార్థ మాక్షిప్త మగును. "తేన ఇదం అకారి" వానిచే నిది చేయబడెను. "కారయ" చేయింపుము అనగా కారయిత - చేయించు వాడు గోచరించును. 'కురు' అనగా "కర్మ" గోచరించును, "ఘటం కురు". "క్రియతాం" చేయబడుగావుత యనగా కర్త "త్వయా" నీచేత గోచరించును. ఇట్లాయా స్థలము లందు భావాదు లాక్షిప్యమాణము లగుచుండగా నుపాదాన లక్షణాశంక యుచితము కాదు. కావున "గౌరనుబంధ్యః" అను స్థలమున నుపాదానలక్షణ యుచితము కాదు.

తత్తదర్థస్వరూపాప్తేరన్యథానుపపత్తితః
అర్థాపత్తిప్రమాధీనా క్రియాకర్త్రాదికల్పనా. 360

యత్ర స్యాదర్థసామర్థ్యం తత్రార్థాపత్తిరుచ్యతే
శ్రుతసామర్థ్యయోగేన శ్రుతార్థాపత్తిరుచ్యతే. 361

దేవదత్తాదిపురుషపీనత్వానుపపత్తితః
భోజనస్య నిషిద్ధస్య దివా రాత్రౌ ప్రకల్ప్యతే. 362

అర్థాపత్తిర్భవేద్యద్వా శ్రుతార్థాపత్తిరేవ వా
గౌరనుబంధ్య ఇత్యత్ర శ్రుతార్థాపత్తిరేవ సా. 363

''గౌరనుబంధ్యః'' యను స్థలమున నుపాదానలక్షణ కాదనుట కుప పత్త్యంతర మిచట నిరూపిత మగును. తత్తదర్థస్వరూపసిద్ధి వేరొక విధముగా నుపపన్నము కానందువలన నట్టి స్థలమున క్రియాకర్త్రాది కల్పనము అర్థాపత్తి యను ప్రమాణాధీనముగా సిద్ధమగును. అర్థాపత్తి ఎచట నుండునో యచట నర్థాపత్తి యుండునందురు. శ్రుతసామర్థ్యము కూడుకొని యున్నచో శ్రుతార్థాపత్తి యందురు. ప్రత్యక్షముగా చూచి నప్పటి సామర్థ్య మున్నచో దృష్టార్థాపత్తి-అర్థాపత్తి యందురు. ఈ యంశమును ఈ యుదాహరణమున దర్శింపవచ్చును.

''పీనో దేవదత్తః, దివా నభుంక్తే'' యను వాక్యము కలదు. దేవదత్తుడు బలిసి యున్నాడు. పగటిసమయమున భుజింపడు. అని తదర్థము — దివాభోజన మొనరింపని వాడు బలిసియుండుట యుపపన్నము కాదు. అనుప పన్న మయిన దేవదత్తుని పీనత్వము రాత్రిభోజన మాక్షిప్త మొనరించును. ఇది యర్థాపత్తి కాని, శ్రుతార్థాపత్తి కాని కావచ్చును. దేవదత్తుడను పురుషుని పీనత్వానుపపత్తి వలన, దివాభోజనము నిషిద్ధము కాగా రాత్రిభోజన మాక్షిప్తమై ప్రకల్పిత మగును. ఇది యర్థాపత్తి లభ్యము. ఇట్లే ''గౌరనుబంధ్యః'' యను స్థలమున గూడ అర్థాపత్తియగునే కాని ఉపాదానలక్షణ కాదు.

ఘోషాధికరణత్వస్య సిద్ధయే స్వతటోపరి
స్వార్థం సమర్ప్యయత్యేవ గంగాశబ్దో యతస్తతః. 364

ఇత్యాదిలక్షణేనైవ, శుద్ధేయముభయాత్మికా

లక్షణ లక్షణ యిందు నిరూపిత మగును. "పరార్థే స్వసమర్పణం" ఇతరపదార్థమున కన్వయము సంపాదించుటకై స్వార్థసమర్పణ మున్నచో లక్షణ లక్షణ యగును. "గంగాయాం ఘోషః" యనునది యుదాహరణము. ఇందు గంగాశబ్దము స్వార్థ మయిన ప్రవాహరూపార్థమును విడనాడు చున్నది. గంగాప్రవాహమునందు ఘోషాధికరణత్వముపపన్నము కానందున గంగాతట మునందు ఘోషాధికరణత్వము సిద్ధింప జేయుటకై గంగాపదము స్వార్థమును విడనాడినది. ఇట్లిం దన్యార్థలక్షణ ముండుటచే లక్షణ లక్షణ యయినది. ఉపాదానలక్షణ లక్షణలక్షణయను నుభయాత్మక మయిన యీ లక్షణ శుద్ధలక్షణ యగును. సాదృశ్యసంబంధముతో లేనందున శుద్ధ.

ఆరోప్యారోపవిషయౌ సిద్ధభేదౌ పరస్పరమ్. 365

సామానాధికరణ్యేన నిర్దిశ్యేతే యది క్వచిత్
సారోపాఽన్యా విషయిణాఽఽరోప్యమాణేన కుత్రచిత్. 366

అంతఃకృతే నిగీర్ణేఽస్మిన్నారోపవిషయే సతి
ఏషా సాధ్యవసానాత్మా లక్షణేతి విభావ్యతే. 367

లక్షణాభేదము భంగ్యంతరమున నిం దుపపాదిత మగును. కొందరు గౌణీవృత్తి నంగీకరించిరి. అదియు లక్షణలో నంతర్భవించునని యిం దుపపాదిత మగును. సారోప, సాధ్యవసాన యని లక్షణ రెండు విధములు. ఆరోప్యమాణ, మారోపవిషయము నను రెండును సిద్ధభేదములు. ఆ రెండిటి భేద మనపహ్నుతము. అవి యొకచో సామానాధికరణ్యమున – సమానవిభక్తికపదములచే ననుట నిర్దిష్టము లయినచో సారోప యగును. ఇది శుద్ధలక్షణ కన్న భిన్నము. ఆరోపవిషయము విషయి యగు నారోప్యమాణముచే నంతఃకృతము నిగీర్ణ మయినచో సాధ్యవసానలక్షణ యగును. (విషయికి ఆరోప్యమాణమని, విషయమున కారోపవిషయ మని పేరు. "గౌః బాహీకః" బాహీక దేశ పురుషుడు గోవు. అను నది సారోపోదాహరణము. "గౌః అయం" అను నది సాధ్యవసానోదాహరణము.

ఇమౌ భేదౌ చ సాదృశ్యాత్సంబంధాంతరతోఽపి చ
గౌణౌ శుద్ధౌ చ విజ్ఞేయౌ లక్షణాభేదవేదిభిః. 368

సాదృశ్యహేతూ భేదౌస్తః సారోపాధ్యవసానికా
గౌర్బాహీకో గౌరయం చేత్యుక్తోదాహృతిరేతయోః. 369

సారోప, సాధ్యవసాన యను నీ రెండు భేదములు సాదృశ్యము హేతువుగా గలవి యయినచో గౌణము లని; సంబంధాంతరము హేతువుగా గలవి యయినచో శుద్ధలక్షణారూపము లని లక్షణాభేదవేదు లగువారు గుర్తింప వలెను. సారోప, సాధ్యవసానిక యను రెండుభేదములు సాదృశ్యహేతుకములు. "గౌర్వాహీకః, గౌరయం" అను రెండు నా రెండిటి కుదాహరణములు.

లక్ష్యమాణా అపి స్వార్థసహచారిగుణా యతః
గోశబ్దస్య పరార్థాభిధానే యాంతి నిమిత్తతామ్. 370

గవి స్వార్థే సహచరా గుణా జాడ్యాదయశ్చ యే
గుణాస్తేషామభేదేన లక్ష్యంతేఽత్ర పరార్థగాః. 371

న పరార్థోఽభిధీయేతేత్యేవం కేచన జానతే
లక్ష్యమాణా అపి స్వార్థే జాడ్యమాంద్యాదయో గవి. 372

బాహీకాఖ్యాపరార్థాభిధానే వృత్తినిమిత్తతాం
గోశబ్దస్య ప్రయాంతీతి కేచిదూచుర్విచక్షణాః. 373

ద్వయోః సాధారణీభూతగుణాదేరాశ్రయత్వతః
పరార్థో బాహీకో లక్ష్యః స్వార్థేనేత్యపరే విదుః. 374

"గౌర్వాహీకః" మొదలగు నుదాహరణములలో బాహీకాదులందు గవాదిశబ్దములు ప్రవర్తించుచున్నవి. ఆ ప్రవృత్తినిమిత్తము లెవ్వి? అను విషయమున మతభేదములు కలవు. ఇచట వానిని విచారించుట సముచితము.

౧. గోశబ్దము పరార్థమును చెప్పుటలో స్వార్థసహచారిగుణములు లక్ష్యమాణము లయినను నిమిత్తము లగును. గౌః బాహీకః అనునపుడు గోశబ్దమునకు గోవు వాచ్యార్థము. గోసహచారు లయిన జాడ్యమాంద్యతిష్ఠన్మూత్రత్వాదిగుణములు లక్ష్యమాణములు. లక్ష్యమాణము లయిన నీ గుణములు బాహీకార్థమును అభిధావృత్తిచే ప్రతిపాదించును.

౨. గోశబ్దముచే గోనిష్ఠజాడ్యమాంద్యాద్యభిన్న బాహీకనిష్ఠ గుణములు లక్ష్యమాణము లగును. అట్టి గుణాశ్రయుడుగా బాహీకుడు భాసించును. కాని బాహీకార్థము అభిధచే ప్రతిపాదితము కాదు అని రెండవవాదము.

౩. గోశబ్దముచే జాడ్యమాంద్యాదులు కల బాహీకుడె లక్ష్యమాణుడగునని మూడవవాదము. గోశబ్దము బాహీకార్థమును జెప్పుటలో నిట్లు

ప్రవృత్తినిమిత్తము గ్రహింపవలెను. ఈ మూడవపక్షమె మమ్మటపక్షము. సాధారణగుణాశ్రయముగా పదార్థమె లక్ష్యమగును. జాడ్యమాంద్యాదిగుణ విశిష్టమునందె లక్షణ. ఇట్లు పదార్థమె లక్ష్యమాణ మగును. జడిమాదిగుణములు లక్ష్యము లగు ననుట కాదు. పరార్థ మభిధీయమాన మగుననుటయు కాదు. ఇట్లె యిందలి వాక్యభావమును సమన్వయించుకొన వలెను. గోబాహీకులకు సాధారణము లయిన గుణముల కాశ్రయముగా పరార్థము లక్ష్య మగును అని.

అపి చేదవినాభావే సతి క్రోశతి మంచయోః
ఆక్షేపేణైవ మర్త్యాదిసిద్ధేర్నైవాత్ర లక్షణా. 375

పైన నిరూపించిన వాదమును పరిశీలింపగా అభిధేయావినాభూతప్రతీతి లక్షణయగు నన్న ప్రామాణికవాదము ననుసరించినట్లు భాసించును. ఇచట అవి నాభావ మనునది సంబంధమాత్రమె. నాంతరీయకము కాదు. అట్లె యయిన "మంచః క్రోశతి" అను స్థలమున లక్షణ కాకపోవును. జొన్నచేనులో పిట్టలను తోలుటకై గడమంచెలు సిద్ధపఱచి దానిపై నున్నవారు కేకలు వేయుదురు. "మంచః క్రోశతి" గడమంచె కేక వేయుచున్నదని వాచ్యము. మంచ మచేత నము. క్రోశన మొనరింపలేదు. మంచపదమున మంచస్థు డయిన పురుషు డను నర్థము లక్ష్యము - మంచెపై నెల్లప్పుడు పురుషు డుండడు. అందు వలన నాంతరీయక మయిన యవినాభావసంబంధము చెప్పరాదు. నాంతరీయకాత్మకావి నాభావసంబంధమె యయినచో నాక్షేపముననె మర్త్యాదిసిద్ధికలుగును గావున లక్షణ యక్కర లేదు. క్రోశతి మంచముల కవినాభావము సంబంధమాత్రమె యయినందున, అప్పు డాక్షేపమున మర్త్యాదిసిద్ధి యుండదు గావున లక్షణ యగును. ఇట్టిభావము నీ శ్లోకమున గ్రహింపవలెను.

యదాయుర్ఘృతమిత్యాదౌ సాదృశ్యాదన్యదేవ హి
కార్యకారణభావాది సంబంధాంతరముచ్యతే. 376

భేదే సత్యపి తాద్రూప్యప్రతీతిర్గౌణభేదయోః
అభేదావగతిః క్వాపి ప్రయోజనవతీ భవేత్. 377

శుద్ధయో ర్భేదయోరన్యా వై లక్షణ్యేన యద్భవేత్
అర్థక్రియాకారితాది తత్ప్రయోజనవద్భవేత్. 378

తాదర్థ్యాదుపచారాఖ్యా లక్షణా క్వాపి దృశ్యతే
ఇంద్రార్థే స్థూణ ఇంద్రోఽయమిత్యాదౌ సా విలోక్యతే. 379

క్వచిత్స్వస్వామిభావేన లక్షణాఽపి భవేద్యథా
రాజకీయః స పురుష ఇత్యాదౌ దృశ్యతే స్ఫుటమ్. 380

సాదృశ్యసంబంధమూలకము లయిన సారోపా సాధ్యవసానా స్వరూప విచారానంతరము సాదృశ్యేతరసంబంధమూలకము లయిన వానిని నిరూపింప వలయును. "ఆయుర్ఘృతం", "ఆయురేవేదం" ఇత్యాదులలో సాదృశ్యము కన్న నన్యమగు కార్యకారణభావాది సంబంధాంతర మున్నది. ఇచటి యారోపాధ్యవసానముల నా విధముగనె సంగతపఱచ వలెను.

గౌణభేదము లయిన సారోపాసాధ్యవసానములలో భేదమున్నను తాద్రూప్యప్రతీతి కలుగుటయు, సర్వథా అభేదావగతియు ప్రయోజనముగా నుండునని భావింపవలెను. శుద్ధలక్షణాభేదము లయిన సారోపా సాధ్యవసానము లలో అన్యవైలక్షణ్యమున కార్యకారిత్వము, అవ్యభిచారమున కార్యకారిత్వము ప్రయోజనముగా నుండును. వీని నిట్లుదాహరణములలో తెలియునది.

"గౌర్వాహీకః" అను సారోపలో గోవునకు వాహీకునకు భేద మున్నను తాద్రూప్యప్రతీతి ప్రయోజనముగ భాసించును. రెండురూపములు వేరుగా నున్నను విషయిరూపమె విషయమున నం దవభాసించుట తాద్రూప్యము- గోరూపము వాహీకునందు భాసించుట. "గౌరయం" అను సాధ్యవసానలో సర్వథా అభేదము ప్రయోజనము. రెండిటి కెట్టి భేదము గోచరింపక పోవుట అభేదప్రతీతి.

"ఆయుర్ఘృతం" అను సాదృశ్యేతర కార్యకారణభావసంబంధము కల సారోపలో అన్యవిలక్షణముగా ఘృతము ఆయుష్కారణము కార్యకారి యగునని భాసించును. ఘృత మాయుష్యమును కలిగించును. క్షీరాదు లిట్లు కాదు. కావున క్షీరాదులకన్న నాయుర్జననమున ఘృతము విలక్షణము అని భాసించును. "ఆయురేవేదం" సాధ్యవసానలో ఘృత మవ్యభిచరితముగ- అవశ్యముగ నియమముగా కార్యకారి యగుట భాసించును. మూలములో "అన్య వైలక్షణ్యేన అవ్యభిచారేణ చ" అని యుండదగును. అవ్యభిచారేణ అనునది సాధ్యవసానకు సంబంధించినదిగా నావశ్యకము.

సాదృశ్యేతరసంబంధము లనేకములు కలవు - తాదర్థ్యసంబంధము, స్వస్వామిభావసంబంధము, అవయవావయవిభావ సంబంధము, తాత్కర్మ్య సంబం

ధము వని. యాగమున నింద్రార్థముగా నియమితమగు స్థూణమును ''ఇంద్ర'' పదమున వ్యవహరింతురు. స్థూణము - స్తంభము. రాజకీయ పురుషుని రాజని వ్యవహారమొనర్చుటలో స్వస్వామిభావసంబంధము కలదు. అవయవావయవి భావసంబంధ మీ వక్ష్యమాణములో నున్నది.

హస్త ఇత్యపి యథైవ కరాగ్రం
లక్షయత్యథ న వక్తి కరం తం
అవయవావయవిభావనిబంధా
లక్షణాఽపి చ తథైవ సుధీభిః. 381

అవయవావయవిభావమె యంగాంగిభావము. హస్తపదము కరమును చెప్పక కరాగ్రమును చెప్పునది యయినప్పుడు అవయవావయవిభావనిబంధన మయిన లక్షణ యగునని సుధీకులు భావింతురు. హస్త మనగా చాచిన చేయి. ఇరువదినాలుగంగులముల ప్రమాణము కలది. దాని యగ్రభాగ మాత్రమయిన యవయవము నందు - కేవలము ముంజేయియందు ఇట్టి హస్తపదప్రయోగము లాక్షణికము.

అతక్షాఽతక్షదిత్యత్ర తాత్కర్మ్యాత్కాప్యపి లక్షణా
ఏవం షోఢా సముద్దిష్టా లక్షణా లక్ష్యవేదిభిః. 382

తాత్కర్మ్యమున లక్షణ యుండుట యిందున్నది. తత్కర్మకారిత్వ రూప మయిన సంబంధమునను లక్షణ యున్నది. ''అతక్షా అతక్షత్'' తక్ష కాని వాడు అతక్ష. ఆతడు తక్షణ మొనరించెను. ఇచట తాత్కర్మ్యమున లక్షణ యున్నది. వడ్రంగి కాని వానిని వడ్రంగి యనుట. తక్ష వడ్రంగి. ఈ పదము జాతివిశేషము నందు రూపము. ఒక్కొక్కడు తా నా జాతికి సంబంధింపక పోయినను జీవనమునకై యా జాతివ్యాపారము నాశ్రయించుటచే నా జాతినామమున వ్యవహృతు డగును.

ఈ నిరూపితము లయిన సంబంధములె కాక యితర సంబంధములును గలవు. ''ఏకశతం షష్ట్యర్థాః'' సాదృశ్యేతరసంబంధము లెన్ని యున్నను శుద్ధ లక్షణ యని యన్నిట సారోపా, సాధ్యవసాన లుండువని తెలియదగును.

లక్ష్యవేదు లీ విధముగా లక్షణ యారువిధములు అనిరి. లక్షణ మొదట రెండువిధములు - శుద్ధాలక్షణ, గౌణీలక్షణ యని. శుద్ధాలక్షణ నాలుగు

విధములు - ఉపాదానలక్షణ, లక్షణలక్షణ, సారోపలక్షణ, సాధ్యవసానలక్షణ యని. గౌణీలక్షణయు రెండువిధములు - సారోప, సాధ్యవసాన యని.

### గౌణీ లక్షణాభేదము

లక్షణాయాం గౌణవృత్తిర్నాంతర్భవతి కర్హిచిత్
లక్ష్యమాణగుణైర్యోగాద్వృత్తేరిష్టా తు గౌణతా. 383

అగ్నిర్మాణవకేత్యాదౌ గుణవృత్తిం ప్రచక్షతే
అగ్నిశబ్దః స్వముఖ్యార్థబాధాన్మాణవకే స్వతః. 384

తద్గుణే పింగలత్వాదౌ యాం వృత్తిం ప్రతిపద్యతే
తాం గౌణీవృత్తిరిత్యాహుః శబ్దవృత్తివిచక్షణాః. 385

భేదః సాధ్యవసానాత్మా సారోపాత్మా చ యో భవేత్
తయోరన్యతరైవేయం వృత్తిర్గౌణీతి కేచన. 386

గౌణీవృత్తి యేస్థలమున గాని లక్షణలో నంతర్భవింపదు. లక్ష్యమాణములగు గుణములతో సంబంధముండుట వలన శబ్దవృత్తికి గౌణత కలుగుచున్నది. అగ్నిః మాణవకః యనునది గుణవృత్తికి ఉదాహరణము. మాణవకునందగ్నిశబ్దము ప్రయుక్త మయనది. అనగ్ని యయిన మాణవుకు నందు ప్రయుక్తమయిన యగ్నిశబ్దము బాధితము—ముఖ్యార్థబాధ యున్నది. అగ్నిగతములయిన పింగలత్వాదిగుణము లం దగ్నిశబ్దము వృత్తి కలది యయినందున గౌణీవృత్తి యందురు. ఇది శబ్దవృత్తి విచక్షణుల నిర్ణయము.

ఈ చెప్పిన లక్షణయుత మయిన లక్షణావిషయమున నిరూపించిన సారోపాసాధ్యవసానభేదములలో నీ గౌణి కూడి యున్న దని కొందరందురు. ఇట్లు లక్షణా భేదప్రపంచనము వ్యంగ్యాలంకారవిశేషములలో నుపయోగించునని గ్రహించవలెను.

### వ్యంగ్యము

తత్తాదృగ్లక్షణోపేత లక్షణావిషయే క్వచిత్
ప్రయోజనే సతి వ్యంగ్యం భవేత్, రూఢౌ న సంభవేత్. 387

యత్ర రూఢిః ప్రసిద్ధా స్యాత్తత్ర వ్యంగ్యం న సేత్స్యతి
యత్ర ప్రయోజనం నాస్తి తత్ర వ్యంగ్యం న దృశ్యతే. 388

ధ్వనివ్యాపారహేతుర్య స్తద్వ్యంగ్యస్య ప్రయోజనం
ప్రయోజనం వినా క్వాపి న వ్యంగ్యం వ్యజ్యతే స్ఫుటమ్. ౬౮౯

అభిధా లక్షణామూలం వ్యంగ్యం సిద్ధ్యేత్ప్రయోజనాత్

ప్రయోజననిమిత్తక మయిన లక్షణ యున్న స్థలముననే వ్యంగ్యము లభించును. రూఢినిమిత్తక మయిన లక్షణ యున్న స్థలమున వ్యంగ్యము సంభవింపదు. రూఢి ప్రసిద్ధముగా నుండునేని వ్యంగ్యము సిద్ధము కాదు. ప్రయోజనము నిమిత్తముగా లేకున్న నచట వ్యంగ్యము గోచరింపదు. ధ్వనివ్యాపారహేతువుగా నుండునది వ్యంగ్యము. అదియె ప్రయోజనము. ప్రయోజనములేక వ్యంగ్యము వ్యజ్యమానము కాదు. ప్రయోజనము వలనే అభిధా మూల వ్యంగ్యము, లక్షణామూలవ్యంగ్యము సిద్ధించును.

ఇట్లున్న నిచట ఈ విషయమునకు కావ్యప్రకాశములో "వ్యంగ్యేన రహితా రూఢౌ సహితా తు ప్రయోజనే", "ప్రయోజనం హి వ్యంజన వ్యాపారగమ్యమేవ" అని యున్నది. రూఢి యుండగా లక్షణ వ్యంగ్యరహితముగా నుండును. ప్రసిద్ధినిబంధనముగా కుశలాదిపదము లను ప్రయోగించినపుడు లక్షణ వ్యంగ్యయుక్తము కాదు. రూఢిలక్షణలో లక్ష్యలక్షకభావము వాచ్యవాచక భావప్రాయముగనె యుండును. ప్రయోజన ముండునేని లక్షణ వ్యంగ్యార్థసహితముగా నుండును. ప్రయోజనవతి లక్షణలో వ్యంగ్య మవశ్యముగా నుండును. ప్రయోజనము వ్యంగ్య మేకార్థములు. ఫలసాహిత్యమన వ్యంగ్యసాహిత్య మని తేలినది. లక్షణలోని ఫలము వ్యంజన వ్యాపారగమ్యమే. అందలి యా ఫలము వ్యంగ్యము అని కావ్యప్రకాశపంక్తి భావము. ఇట్టి భావమునే భావప్రకాశనము నిరూపించినది. ఇచట విశిథిలములుగా నున్న పంక్తులలో దీని సమన్వయించుకొనవలెను.

అగూఢం గూఢమిత్యేతద్వ్యంగ్యం ద్వేధా విభిద్యతే. ౩౯౦

అగూఢం తత్స్ఫుటం యస్య ప్రతీతిరభిధేయవత్
అనుస్యూతా యదవ్యక్తా ప్రతీతిర్గూఢముచ్యతే. ౩౯౧

గూఢాగూఢాత్మకం వ్యంగ్యమేకమస్తీతి కేచన
వ్యక్తావ్యక్తప్రతీతిర్య త్తద్గూఢాగూఢముచ్యతే. ౩౯౨

భావికాత్మని పద్యే తు తత్తద్వ్యంగ్యం విలోక్యతే

లక్షణాస్థలమున భాసించు వ్యంగ్యము అగూఢమని, గూఢమని రెండువిధములు నున్నది. అగూఢ మనునది స్ఫుటముగా నుండును. దాని ప్రతీతి వాచ్యార్థమువలె స్పష్టముగ నుండును. అనుస్యూతముగా నవ్యక్తముగా నుండు వ్యంగ్యమును గూఢవ్యంగ్య మందురు. గూఢాగూఢాత్మక మయిన వ్యంగ్యమును గలదని కొందరందురు. వ్యక్తావ్యక్త మగు ప్రతీతినె గూఢాగూఢ మందురు. "భావికాత్మని" యను పద్యమున నా యావ్యంగ్యము గోచరించు చున్నది. ఈ భావికాత్మని పద్యమెచట నున్నదో తెలియలేదు. వీని లక్ష్య పరీక్షకై (నా కావ్యప్రకాశము సమీక్షించునది.)

## లక్షణామూలవ్యంజన

వ్యంగ్యే లాక్షణికస్యాత్ర వ్యాపారో వ్యంజనాత్మకః. 393

లక్షణా తాదృశీ గూఢవ్యంగ్యావ్యంగ్యార్థయోగతః
పశ్చాదగూఢవ్యంగ్యేతి త్రేధా వ్యంగ్యప్రతీతితః. 394

లాక్షణికశబ్దమునకు సంబంధించిన వ్యంగ్యవిషయమున వ్యాపారము వ్యంజనాత్మకము. వ్యంజనావ్యాపారము వలననె యచటి వ్యంగ్యము గోచరించును. వ్యంగ్యప్రతీతి ననుసరించి లక్షణ యందలి వేరొక భేదత్రయ మూహింప దగును. ఇవి మూడు విధములు - గూఢవ్యంగ్య లక్షణ, అవ్యంగ్య లక్షణ, అగూఢవ్యంగ్య లక్షణ యని. ఇందు భాసించు వ్యంగ్య మిట్లుండును గావున నీ నామసంకేత ముచితము.

తద్భూర్లాక్షణికః శబ్దస్తద్వ్యాపారోఽంజనాత్మకః
యస్య ప్రతీతిమాధాతుం లక్షణా సముపాస్యతే. 395

ఫలే శబ్దైకగమ్యేఽత్ర వ్యంజనాన్నాపరా క్రియా

యత్ర ప్రత్యాయయితుం ప్రయోజనం లక్షణాశబ్దః
వాక్యే ప్రయుజ్యతే.ఽస్మాన్నాన్యో హేతుః ప్రయోజనావాప్తేః. 396

తస్మాదేవ చ శబ్దాత్తద్వ్యాపారస్తథాంజనాత్మైవ
తేన వ్యాపారేణ వ్యంగ్యం తత్ర ప్రయోజనం భవతి. 397

గంగాయాం ఘోష ఇత్యాదివాక్యే తత్తీరసంగతః
పావనత్వాదిధర్మో యః ప్రతీతో వ్యంగ్యమేవ తత్. 398

తద్భ్యాః — తదాశ్రయము లక్షణాశ్రయ మయిన శబ్దము లాక్షణికము. లాక్షణిక శబ్దము ప్రయోజనప్రకాశనానుకూల మయిన వ్యాపారము వ్యంజనాత్మకము. లక్షణలో గోచరించు ప్రయోజనమును ప్రతిపాదించుటకు లక్షణ సమర్థము కాదు. అందు వ్యంజనయే సమర్థము. లక్షణయె వ్యంగ్యమును నిరూపింపదా? "యస్య ప్రతీతి" కారిక యీ యంశమునె ప్రతిపాదించును. లక్షణా వృత్తి ప్రయోజనైకప్రాణము. ఈ కారికలో లక్షణాపదము లక్షకశబ్దపరము. "గంగాయాం ఘోషః" యను స్థలమున, శీతలత్వ పావనత్వాది రూప మయిన ప్రయోజనమున కనుభవరూప మయిన ప్రతీతిని సంపాదించుటకు లక్షకశబ్దమునె యంగీకరించు చున్నారు. "గంగాతటే ఘోషః" అని యనక "గంగాయాం ఘోషః" యని లక్షకపదమునె స్వీకరించుట వలన ఫలము శబ్దైకగమ్య మయినది. ఆ ఫల మనుమానాది గమ్యము కాదు. అట్టి ఫలము విషయమై వ్యంజనావ్యాపారము తప్ప ఇతరవ్యాపార మేదియు లేదు. శబ్దము వలననె ప్రయోజనము భాసించుటచే వృత్త్యంతరకల్పన మావశ్యక మయినది. ఆ వ్యంగ్యప్రతీతి యశాబ్ద మని తలచినచో లక్షణకు మూలహానియె యగును; లాక్షణికప్రయోగము నిష్ఫల మగును. ప్రయోజనము ప్రతిపాదింప వలెనని లాక్షణికము ప్రయోగించి నపుడు అచట ప్రమాణాంతరమున ప్రయోజనము కలుగదు. అచట వ్యంజన కాక ఇతరవ్యాపార మేదియు లేదు. ప్రయోజనప్రతీతికై లక్షణాశబ్దమును వాక్యమున ప్రయోగించినప్పుడు ప్రయోజనసిద్ధి కచట వేరొకటి లేదు. ఆ ప్రయుక్తశబ్దముననె వ్యాపార మెన్న వలెను. అది యంజనమె. ఆ వ్యాపారమున ప్రయోజనము వ్యంగ్య మగును. "గంగాయాం ఘోషః" ఇత్యాది వాక్యమున తీరసంగత మయిన పావనత్వాదిధర్మము వ్యంగ్యముగ గోచరించును. ఇట్లిచటి పావనత్వాది ప్రతిపాదనమున నభిధ సమర్థము కాకూడదా? లక్షణయె సమర్థము కావచ్చుకదా. ఇట్టి భావమున నీ సమీక్ష భావింపదగి యుండును.

పావనత్వాదిధర్మస్య గంగాశబ్దస్య చ క్వచిత్
గృహ్యేతే న చ సంకేత స్తస్మాన్నాత్రాభిధా భవేత్. 399

ముఖ్యార్థబాధాదిహేతోరభావాన్నైవ లక్షణా
అత స్తల్లక్షణాశబ్దవ్యాపారాద్వ్యంజనాత్మకాత్
ఋతేన పావనత్వాదిధర్మః క్వాపి ప్రతీయతే. 400

పావనత్వాదిధర్మమునకు గంగాశబ్దమునకును సంకేత మేమియు లేదు. అందు వలన నిచట పావనత్వాది ప్రత్యయమున కభిధ సమర్థము కాదు. ముఖ్యార్థబాధాదికము లేనందున లక్షణయు నిచట ప్రసరింపదు. కావున లక్షణా శబ్దవ్యాపార మయిన వ్యంజన కతిరిక్తముగా వేరు వ్యాపారమున పావనత్వాది ధర్మము గోచరింపదు. అభిధాలక్షణల కిచట ప్రసక్తి లేదు. ఈ యంశమె కావ్య ప్రకాశములో నిట్లు నిరూపిత మయినది.

ఉక్తంచ:

"నాభిధా సమయాభావాద్ధేత్వభావాన్న లక్షణా
లక్ష్యం న ముఖ్యం నాప్యత్ర బాధో యోగః ఫలేన నో." 401

న ప్రయోజన మేతస్మిన్ న చ శబ్దః స్ఖలద్గతిః
గంగాశబ్దో యథా స్రోతోబాధా త్తత్తీరలక్షకః. 402

తద్వత్తత్ర సబాధశ్చేల్లక్షయే త్తత్ప్రయోజనం
ముఖ్యోఽర్థో న తటం తత్ర స్వార్థబాధో న దృశ్యతే. 403

గంగాశబ్దార్థతీరస్య పావనత్వాదిభిః క్వచిత్
లక్షణీయైర్న సంబంధో నాపి లక్ష్యం ప్రయోజనమ్. 404

తస్మిన్ప్రయోజనే లక్ష్యే తేన లక్ష్యం ప్రయోజనం
ఇత్యేవమనవస్థా స్యాత్సా మూలక్షయకారిణీ. 405

సంకేతము లేనందున నభిధ ప్రయోజనప్రతిపాదనమునందు ప్రవర్తింపదు. అభిధ సంకేతసహాయ మున్ననే ప్రవర్తించును. గంగాశబ్దమునకు ప్రవాహమునందే సంకేతము కలదు. ప్రయోజనము నందు సంకేతము లేదు. శైత్యాది ప్రయోజనము నందు లక్షణకు ప్రసరము లేదు. "హేత్వభావాత్" అనునది యిందు హేతువు. లక్షణాహేతువు లిందు లేనందున లక్షణ ప్రసరింపదు. ముఖ్యార్థబాధాదిత్రయము లక్షణాహేతువు. ముఖ్యార్థబాధ, ముఖ్యార్థసంబంధము, రూఢిప్రయోజనములలో నన్యతరము లక్షణాహేతువు. ఈ త్రయములో నేదియు నిచట లేదు. ఈ యంశ మిటుపై శ్లోకమున నున్నది.

ముఖ్యార్థ మనునది యుండుట, తద్బాధ, ముఖ్యార్థములో నితరమునకు సంబంధ ముండుట, ప్రయోజన ముండుట, శబ్దము స్ఖలద్గతి యగుట

యను నిది లక్షణలో సామగ్రి. ఇట్టి సామగ్రి యేదియు ప్రకృతాంశమున లేదని కారికలోని వాక్యపంచక పరిపాటిచే నిరస్తమగును.

"గంగాయాం ఘోషః" అనుచోట లక్ష్యమయిన తీరరూపార్థము గంగా శబ్దమునకు ముఖ్యార్థము కాదు. లక్ష్యము ముఖ్యార్థము కాదు. తీర రూపార్థము నందు బాధ యేదియు లేదు. లక్ష్య మయిన తీరమునకు శీతత్వాదిప్రయోజన ముతో నేమియు సంబంధము లేదు. పావనత్వమునకు తీరమునకు సాక్షాత్సం బంధ మేదియు లేదు. ఫలము ప్రవాహసమవేతమె కాని తీరసమవేతము కాదు. ఈ శైత్యాదికము లక్ష్య మయినచో నిందు వేరొక ప్రయోజన మేమియు గల్పింప వీలులేదు. ప్రయోజనమందు ప్రయోజనాంతర ముండదు. ముఖ్యార్థ ప్రతిపాదక మయిన గంగాశబ్దము శైత్యపావనత్వాది ప్రయోజన ప్రతిపాదన ములో స్ఖలద్గతి - అసమర్థము కాదు.

గంగాశబ్దము స్రోతోరూపార్థమున బాధ యున్నందున తీరలక్షక మయినది. అట్లె తీరరూపార్థమున బాధ కలది యయినచో శీతత్వాదిప్రయోజన మును లక్ష్యము చేసెడిది. తటము ముఖ్యార్థము కాదు. అచట స్వార్థబాధయు లేదు. గంగాశబ్దార్థ మయిన తీరమునకు లక్షణీయములగు పావనత్వాదులతో నెచటను సంబంధము లేదు. ప్రయోజనము లక్ష్యమును గాదు. ఆ పావనత్వాది ప్రయోజనమును లక్ష్యమెయయినచో ఆ లక్ష్యమువందు వేరొకప్రయోజనమును జెప్పవలసియుండును. ఆ ప్రయోజనము కూడ లక్ష్యమె యగునేని యందు వేరొకప్రయోజనము జెప్పవలసియుండును. ఇట్లు ప్రయోజనము లందు ప్రయో జనములను జెప్పవలసి రాగా మూలక్షయకారిణి యగు ననవస్థ యను దోషము వాటిల్లును. అనవస్థాకల్పనము కన్న వ్యంజనాంగీకారము సమంజసము. కాన ప్రయోజనము లక్ష్యమగు ననుట పాడిగాదు.

పావనత్వాదిభిస్తీరం యుక్తమేవ హి లక్ష్యతే
గంగాశబ్దేనాధికార్థప్రతిపత్తిః ప్రయోజనమ్. 406

విశిష్టలక్షణైషా స్యాత్ వ్యజ్యతే నాత్ర కించన

విశిష్టలక్షణ నంగీకరించినచో వ్యంజన నంగీకరింపవలసిన యవసరము లేదు. అప్పుడు వ్యంజనప్రకాశనము వ్యర్థ మగును అని కొందరందురు. వారి భావ మిట్లుండును.

శీతత్వాదిరూప మయిన కేవల ప్రయోజనమును లక్ష్యముగా స్వీక రించినపుడు పూర్వము చెప్పిన దోషము వాటిల్లవచ్చును. శీతత్వపావనత్వాది ప్రయోజన సహితమయిన తటము లక్ష్య మగుగావుత. మొదట తటము లక్షిత మగుట, అనంతరము పావనత్వాదు లవభాసించుట యన్న పూర్వపశ్చాద్భావ మిందు లేదు. పావనత్వాది ప్రయోజనయుక్తముగనె తీరము లక్షిత మగును. "గంగాయాః తటే ఘోషః" అను ముఖ్యశబ్దప్రయోగమున కన్న నిం దధికార్థ ప్రతిపత్తి ప్రయోజనము. ఇది విశిష్ట యగును. కావున నింత కతిరిక్తముగా వ్యంజనా ప్రతిపాద్య మనునది యేదియు నుండదు అని.

ఈ వాదము సమ్మతముకాదు. తన్నిరాసమునకై యిది భావనీయము.

ఇతివాదిన ముద్దిస్య ప్రత్యుత్తర ముదీర్యతే. 407

"ప్రయోజనేన సహితం లక్షణీయం న యుజ్యతే
జ్ఞానస్య విషయో హ్యన్యః ఫలమన్యదుదాహృతమ్". 408

ప్రత్యక్షాదేర్హి నీలాదిర్విషయో హి స్వభావతః
ప్రాకట్యం వాఽథ సంవిత్తిః ఫలత్వేనోపయుజ్యతే. 409

అతో విశిష్టే కస్మింశ్చిల్లక్షణా నోపయుజ్యతే
అతో గంగాదిశబ్దేన తత్తటే లక్షితే పునః. 410

పావనత్వాదయో ధర్మవిశేషాస్తత్ర సంభవాః
ప్రతీయంతేఽభిధాద్యన్యవ్యాపారాద్వ్యంజనాత్మకాత్. 411

పై విధముగా బలుకు వాది నుద్దేశించి ప్రత్యుత్తరము నిరూపిత మగును. ప్రయోజనసహిత మయిన లక్ష్యము నంగీకరించుట యుక్తము కాదు. అది ప్రమాణసాధ్యమును కాదు. లక్షణీయము ప్రయోజన సహితముగ నుండుట యుక్తము. జ్ఞానవిషయము వేరు. ఫలము వేరు. లక్షణీయము, ప్రయోజనము నను వానికి సహావస్థానము కుదరదు. జ్ఞానమునకు విషయ మగునది జ్ఞానము కన్న వేరయినట్లు జ్ఞానమునకు ఫలముగా నుండునదియు జ్ఞానము కన్న నన్యము. దీని నిట్లు దృష్టాంతమున గ్రహించునది.

మీమాంసకులలో భాట్టమతానుయాయులిట్లందురు. ఘటజ్ఞానము కలుగగనె ఘటము జ్ఞాత మయిన దని; జ్ఞాతత యనుసంధానమున నుండును.

జ్ఞానము కలుగగనె జ్ఞాతత యను నొక ధర్మ ముదయించుననని యూహింపవలెను. జ్ఞాతత యనునది ఘటధర్మము; ఘటజ్ఞానమునకు ఫలము. ఇంతకు నిదిసారము. ఘటము జ్ఞానవిషయము. జ్ఞాతత ఫలము. ఈ రెండును భిన్నభిన్నములు. ప్రత్యక్షాదిజ్ఞానమునకు నీలాదికము విషయము. ప్రకటత ఫలము. ప్రకటత, జ్ఞాతత పర్యాయములు.

నైయాయికులును విషయ, ఫలములకు భేద మంగీకరింతురు. ప్రత్యక్షాదిజ్ఞానమునకు నీలాదికము విషయము కాగా 'సంవిత్తి' ఫలమని వారందురు. ఘటజ్ఞానము కలుగగనె "ఘటవిషయక జ్ఞానవానహం" అను నాకారము కల యనువ్యవసాయ ముదయించును. ఈ యనువ్యవసాయమునకె సంవిత్తి యని పేరు. ఈ సంవిత్తి జ్ఞాతృధర్మము.

కావున విశిష్టమునం దెచ్చటను లక్షణ యుపయుక్తము కాదు. గంగాది శబ్దమున తటము లక్షితము కాగా పావనత్వాది ధర్మవిశేషము లచట సంభవించును. ఆ పావనత్వాదు లభిధాదుల కన్న నన్య మయిన వ్యంజనాత్మకవ్యాపారమున ప్రతీతము లగునని నిశ్చయింపవలెను.

అభిధా లక్షణా రూపా త్తథా తాత్పర్యరూపతః
ఏభ్యో భిన్నో భవేదత్ర వ్యాపారో వ్యంజనాత్మకః. 412

ధ్వనన వ్యంజనేత్యాది శబ్దవాచ్యో భవత్యసౌ
ఏవం హి లక్షణామూలం వ్యంజకత్వముదాహృతమ్. 413

తటాదికము లక్షితము కాగా విశేషము లయిన పావనత్వాదులు ప్రతీయమానము లగును. లక్ష్యప్రతీతి సమనంతరము ప్రయోజనప్రతీతి యను నియమ మున్నది కదా! ఆవిశేషము లభిధచే గోచరింపవు. లక్షణచే గోచరింపవు. తాత్పర్యవృత్తిచే గోచరింపవు. కావున వ్యాపారాంతర మవశ్య మంగీకరింపవలెను. ఆ వ్యాపార మభిధాదుల కన్న భిన్నము. ఇందది వ్యంజనాత్మకమయిన వ్యాపారము. దీనికే ధ్వనన మని, వ్యంజన మని, ద్యోతన మని, ప్రత్యాయన మని పేరులు కలవు. ఇట్లిచట లక్షణామూలమయిన వ్యంజకత్వము నిరూపితమయినది.

### అభిధా మూలవ్యంజన

అభిధామూలమప్యత్ర వ్యంజకత్వం ప్రచక్షతే
బహుధా చాభిధామూలం వ్యంజకం కథ్యతే బుధైః. 414

"అనేకార్థస్య శబ్దస్య వాచకత్వే నియంత్రితే
సంయోగాద్యైరవాచ్యార్థధీకృత్ వ్యాపృతిరంజనమ్". 4·5

లాక్షణికము వేరు. వ్యంజకము వేరు. లాక్షణికమునకె వ్యంజకత్వము కలదని భ్రమ పడరాదు. లక్షణామూల మయిన వ్యంజకత్వము నిరూపిత మయినది. అభిధామూల మగు వ్యంజకత్వమును జెప్పవలసి యున్నది. వ్యంజకత్వము వ్యంజన.

శబ్దములలో గొన్ని నానార్థకశబ్దములుకలవు. ఒక వాక్యములో నున్న నానార్థకశబ్దము తన యర్థముల నన్నిటి నచట చెప్పదు. ఆ సందర్భానుకూల మయిన యొక యర్థము మాత్ర మచట గోచరించును. ఇతరము లవభాసింపవు. అనేకార్థశబ్దము యొక్క యర్థాభిధాయకతా శక్తి వక్ష్యమాణసంయోగాదులచే నియంత్రణము కల దగును. అది శృంఖలిత మగును. అనేకార్థముల బోధించు నా శక్తిని సంయోగాదు లడ్డుపెట్టును. కాగా నన్యార్థములు స్ఫురింపవు. అయిన నట్టి స్థలములందు భావుకుల ప్రతిభాసము ననుసరించి నిరుద్ధ మయిన యర్థాంతరమును బుద్ధిగోచర మగును. అట్టి యెడల అభిధేయాతిరిక్త మయిన అర్థాంతరధీజనక మయిన వ్యాపారము వ్యంజనావ్యాపారమె కాని యన్యము కాదు.

కారికార్థము నిట్లు భావించునది. అభిధామూల మగు వ్యంజకత్వమును గలదని వ్యంగ్యభావుకు లనుచున్నారు. అభిధామూలమగు వ్యంజక మనేక విధముల కలదని బుధులందురు. అనేకార్థక మయిన శబ్దమునకు సంబంధించిన వాచకత్వము సంయోగవియోగాదులచే నియంత్రితము కాగా వాచ్యముకాని యర్థముయొక్క బుద్ధిని గలుగజేయువ్యాపారము అంజనమె-వ్యంజనవ్యాపారమె.

నానార్థకస్థలము లందా శబ్దమునకు స్వసంబంధిసర్వార్థము లందును సంకేతము సమానముగా నుండును. నియమిత అర్థమును ప్రత్యాయనము చేయుట కవకాశము లేదు. మొదటగా నా యర్థమె యేల భాసింప వలెను? మరి యొక యర్థ మేల భాసింపరాదు? అని సందేహము కలుగును. అప్పుడా శబ్దములె సంయోగాదిసహాయము కలవయినచో నియతార్థప్రత్యాయన మొనర్పగలవు. ప్రకరణాదిక మే యర్థమున దాత్పర్యగ్రాహక మగునో యా యర్థమె ప్రథమమున నభిధచే గోచరించును. ఇతరార్థముల నప్పు డభిధ చెప్పలేదు. అయినను

సంవిధానసౌందర్యమున నర్థాంతరబోధ కలుగుటలో వ్యంజనయె వ్యాపారమని భావము. ఇటుపై సంయోగాదుల స్వరూప మీక్షించునది.

"సంయోగో విప్రయోగశ్చ సాహచర్యం విరోధితా
అర్థః ప్రకరణం లింగం శబ్దస్యాన్యస్య సన్నిధిః. 416

సామర్థ్యమౌచితీ దేశః కాలో వ్యక్తిః స్వరాదయః
శబ్దార్థస్యానవచ్ఛేదే విశేషస్మృతిహేతవః". 417

శబ్ద మనేకార్థ మయినను అభిధను ప్రతినియతార్థమునందు నియమించు సంయోగాదు లెవ్వి? ఈ విషయమున నభియుక్తుల సంవాదము ననుసరించి సంయోగాదుల గుర్తించుట యుక్తము. భగవాన్ భర్తృహరి సంయోగాదుల నిట్లు నిర్దేశించిరి. ఇవి శబ్దార్థమున కనవచ్ఛేద మున్నపుడు విశేషస్మృతి హేతువు లగును. విశేషార్థము నివి స్మరింప జేయును. వివక్షిత మయిన యర్థము నివి సంపాదించు నని భావము. అనవచ్ఛేద మనగా, ననేకత్వము. నానార్థకశబ్దముల వలన నానార్థములు భాసించును గావున నందు సందర్భానుకూలమగు విశేషార్థము నివి స్మరింపజేయును.

ఇచటి యనవచ్ఛేద పదమునకు గొందరు తాత్పర్యసందేహ మని యర్థము చెప్పుదురు. నానార్థక శబ్దమున కనేకార్థములలో నే యర్థము నందు తాత్పర్యము కలదో? యని సందేహము కలిగినప్పుడు సంయోగాదులు తాత్పర్య నిశ్చయహేతువు లగు నని భావము. "అనవచ్ఛేదము—నియంత్రణము లేక పోవుట" అని కొందరి దృష్టి. నానార్థకశబ్దము యొక్క యర్థమునకు నియంత్రణము లేకపోవుట ప్రసక్త మయినపుడు సంయోగాదు లా నియంత్రణము అవచ్ఛేదము సంపాదించు నని భావము.

1. సంయోగము, 2. విప్రయోగము, 3. సాహచర్యము, 4. విరోధిత, 5. అర్థము, 6. ప్రకరణము, 7. లింగము, 8. అన్యశబ్దసన్నిధి, 9. సామర్థ్యము, 10. ఔచితి, 11. దేశము, 12. కాలము, 13. వ్యక్తి, 14. స్వరము అభినయము అపదేశము పాఠధర్మము.

హరిశబ్దోఽపి సింహాదేరనేకార్థస్య వాచకః
శంఖచక్రాదిసంయోగాద్విష్ణుమేవ వ్యనక్తి చ. 418

శంఖాద్యయోగః శక్రాదౌ హరిశబ్దేన గమ్యతే

సంయోగాదుల కుదాహరణములం దీ విధముగా సమన్వయము సంపాదింపదగును. హరిశబ్దము సింహాద్యనేకార్థములకు వాచకము. "సశంఖచక్రో హరిః" యని నప్పుడు శంఖచక్రాదిసంయోగము వలన హరిపదము విష్ణురూపార్థమునె స్పష్ట మొనరించును. సంయోగము ప్రసిద్ధ మగు సంబంధము. ద్రవ్యము ద్రవ్యమునకు గల సంబంధము సంయోగము. అది కొన్ని యెడల నర్థవిశేషహేతు వగును. సశంఖచక్రుడు హరి యనునది యుదాహరణము. శంఖచక్రముల సంయోగము హరికి గలదని యర్థము. శంఖచక్రసంయోగము హరిపదాభిధను నియంత్రణము చేయును. హరిపదమునకు యముడు వాయువు ఇంద్రుడు చంద్రుడు సూర్యుడు విష్ణువు సింహము కిరణము అశ్వము శుకము సర్పము మర్కటము కప్ప యని నానార్థములు కలవు. అయినను శంఖచక్రసంయోగమున నానార్థక మయిన హరిపదము విష్ణురూపార్థము నం దభిధానియంత్రణము కలదగును. తదితరార్థములందు శంఖాదిసంయోగము ప్రసిద్ధము కాదుకదా! శక్రాద్యర్థములలో శంఖచక్రముల సంయోగము లేకపోవుటను "సశంఖచక్రో హరిః" అనునది సూచించును.

విప్రయోగమునకు భావప్రకాశనములో నుదాహరణము లేదు. అట్లె యౌచితికి కాలమునకు లక్ష్యము లేదు. ఈ యుదాహరణములు నిరూపితముల వలన సమున్నేయములు కాగలవని శారదాతనయుడు తలచి యుండును. అథవా గ్రంథమున త్రుటితము లయి యుండును. అయినను నా కావ్యప్రకాశములోని వీని స్వరూప మీ విధముగ భావనీయము.

విప్రయోగము: ప్రసిద్ధమగు సంయోగసంబంధము లేకపోవుట. ఇదియు నర్థవిశేషహేతువు. "అశంఖచక్రో హరిః" అనునది యుదాహరణము. శంఖచక్రముల సంయోగము హరికి లేదు. ఈ శంఖచక్రసంయోగాభావము హరిపదము నానార్థ మయినను విష్ణురూపార్థము నందు నియమించును. వియోగము సంయోగపూర్వక మగుట ప్రసిద్ధము. ఒకప్పుడున్న శంఖచక్రసంయోగము ప్రస్తుతము లేదని భావము. శంఖచక్రవియోగము విష్ణువుకాని వానియందుండదు.

ఔచితి యోగ్యత. "పాతు వో దయితాముఖం" మిమ్ము దయితాముఖము రక్షించుగావుత! అని యుదాహరణము. ఇటముఖశబ్ద మనేకార్థకము. వదనము సామ్ముఖ్యము ఉపాయము ప్రారంభము అనునవి తదర్థములు. ఈ యర్థములందు యోగ్యత కలిగిన సామ్ముఖ్యరూపార్థమె ప్రకృతోపయోగి. ఉక్తం

తితు డయిన ప్రియునకు ప్రియాసామ్ముఖ్యమె అనుకూల్యమె మనోరథ మీడే ర్చును. అనుకూల్యము లేకపోయినచో కేవల దయితావదనము మనోరథసాధ నము కాజాలదు. కాన ప్రకృతము నం దిట్టి యోగ్యత ముఖశబ్దము నానుకూ ల్యార్థమునందు నియమించుచున్నది. ఇందౌచితి కలదు.

కాలము. ''చిత్రభానుర్విభాతి'' అనునది యుదాహరణము. చిత్ర భాను శబ్దమునకు సూర్యుడు అగ్ని యను నర్థములు కలవు. పై వాక్యము పగలు పలికిన దయినచో సూర్యు డను నర్థమున నభిధానియమనమును, రాత్రి పలికిన దయినచో నగ్నిరూపార్థమున నభిధానియమనమునుండును. ఇట్టి నియమనము కాలకృతము.

రామం విహాయార్జునం చ రామార్జునపదం యథా. 419

విరోధం కార్తవీర్యస్య భార్గవస్య వ్యనక్తి చ

విరోధము. సహానవస్థానము. కూడియుండక పోవుట. వధ్యఘాతక భావమును విరోధమె. ఛాయాతపములు అనునది సహానవస్థానరూప విరోధో దాహరణము. ఛాయాపదమునకు నీడ సూర్యభార్య యను నానార్థము లున్నవి. ఆతపముతో కూడియుండక పోవుట యను సహానవస్థానవిరోధము ఛాయాపదమును నీడ అను నర్థమునందు నియమించును.

''రామార్జునగతిస్తయోః'' వారిది రామార్జునగతి యనునది వధ్య ఘాతకభావరూప విరోధోదాహరణము. ఇందు రామపదము నానార్థము. అర్జున పదము నానార్థము, కార్తవీర్యార్జునుడు పాండవార్జునుడు అర్జునవృక్షము ఇత్యాదు లర్జునార్థములు. శ్రీరాముడు భార్గవరాముడు రామపదార్థములు. రామపదార్థము నియమిత మయినగాని యర్జున పదార్థము తెలియదు. అర్జున పదార్థము నియత మయినగాని రామపదార్థము తెలియదు. కాని యెదుట కానబడు వారిద్దరు ప్రసిద్ధవిరోధము కలవా రగుట వలన వారు ''రామార్జున సదృశాచారము కలవారు'' అని యర్థము కలుగును. ప్రస్తావవశమున నీ విరో ధము గోచరము కాగా, ఏ రామున కే యర్జునునకు విరోధము కలదో యా రామార్జునులె–పరశురామకార్తవీర్యార్జునులె యిచట గోచరింతురు. రామార్జున శబ్దాభిధ పరశురామకార్తవీర్యార్జునార్థములం దేకసమయమునందే నియమనము పొందును.

ఈ యర్థభావనముతో నిందలి యుదాహరణకారిక యున్నది. రామార్జునపదము రాముని అర్జునుని విడనాడి భార్గవునకు కార్తవీర్యునకు గల విరోధము విశదమొనరించును. శ్రీరామునకు పాండవార్జునునకు విరోధప్రసక్తి లేనందున నట్టిప్రసక్తి కల భార్గవకార్తవీర్యులె భాసింతురని భావము. విరోధము భాసింపనంతవరకు ఆ పదార్థముల యర్థభానము ఉండదు. మొదట విరోధము భాసింపగా విరుద్ధు లవభాసించుట నిందు గ్రహింపవలెను.

రామలక్ష్మణశబ్దేన సాహచర్యాభిధాయినా. 420

ప్రమంతరే గౌరవాది వినయాది వ్యనక్తి చ

సాహచర్య స్వరూప మిందు సంభావనీయము. సాహచర్యము సహచరత్వము కూడియుండుట. ''రామలక్ష్మణౌ'' అనునది యుదాహరణము. లక్ష్మణసాహచర్యము రామపదాభిధానియమన మొనరించును. రామపదమునకు దశరథపుత్రు డయిన శ్రీరాముడు, పరశురాముడు, బలరాముడు, మాధవ రాముడు అని యనేకార్థము లున్నవి. అయిన నది దాశరథియందు నియంత్రిత మగును. ఈ భావ మిచట సంగమనీయము. సాహచర్యము చెప్పు రామ లక్ష్మణ శబ్దద్వారమున వ్యంజన యన్యపురుషునందు గౌరవాదులను వినయాదు లను స్పష్టపఱచును.

భవచ్ఛిదం భజ స్థాణు మిత్యర్థాద్వ్యజ్యతే శివః. 421

సర్వం జానాతి దేవోఽయం యుష్మదర్థ ఇతీరితే

భృత్యేష్టకారితా భర్తుర్వ్యంగ్యా ప్రకరణాదిహ. 422

మకరధ్వజ ఇత్యుక్తే తల్లింగాద్వ్యజ్యతే స్మరః

అర్థ ప్రకరణ లింగ స్వరూపము లిందున్నవి. ''భవచ్ఛిదం స్థాణుం భజ'' అనునది యుదాహరణము. స్థాణుపదము శివార్థము బోధించును. స్థాణు పదమున కనేకార్థములు కలవు. శివుడు కొయ్య మేకు తదర్థములు. సంసార నాశరూప మయిన ప్రయోజనవశాన స్థాణుపదాభిధ శివార్థమున నియంత్రిత మగును. ఇట్లె మూలార్థమును సంగతపఱచు కొనవలెను.

ప్రకరణము వక్తృశ్రోతృబుద్ధిస్థత. చెప్పువానికి వినువానికి బుద్ధి గతమై యున్న ధర్మము. అప్పటి ప్రస్తుతమున కనుగుణమయిన సందర్భము ప్రకరణము. ''సర్వం జానాతి దేవః అయం యుష్మదర్థః'' ''దేవుడు సర్వము

తెలియును. ఈతడు మీ కోఅకు'' అని యుదాహరణము. దేవపదమునకు దేవత రాజు మేఘము నని నానార్థము లున్నవి. అయినను ప్రకరణము రాజార్థము నం దభిధానియమనము చేయును. ఇచట భృత్యుడు రాజు నుద్దే శించి పలుకుటలో రాజభృత్యుల సంవాద మిచట ప్రకరణము. ఈ యంశమున వక్తకు శ్రోతకును రాజు మాత్రమె బుద్ధిగతుడు. ఈ ప్రకరణమున ప్రభువు భృత్యేష్టకారి యగుట గోచరించును.

లింగము అసాధారణ చిహ్నము. పరపక్షములం దుండని ధర్మము. సంయోగాతిరిక్తసంబంధమున నుండునది. "కుపితో మకరధ్వజః'' ఉదాహరణము. మకరధ్వజ పదమునకు సముద్రుడు మన్మథుడు నని యర్థము లున్నవి. కోపలక్షణ మయిన లింగము మన్మథునకె కలదు. అచేతనమగుట సముద్రమున కది లేదు. సముద్రవ్యావృత్తమయిన కోపధర్మము మకరధ్వజ పదాభిధా శక్తిని మన్మథు నందే నియమించుచున్నది. మకరధ్వజోక్తి మన్మథునే చెప్పు ననుట మూలమున భావనీయము.

మన్మథుడు మత్స్యధ్వజుడు మకరధ్వజుడును. మకరము మొసలి. అది మన్మథునకు ధ్వజముగా గలదా? కొన్ని ప్రాచీనశిల్పములలో నట్లున్నదట. సామాన్యముగా నంతట మత్స్యధ్వజత మీనధ్వజత ప్రసిద్ధము. మకరపదము నక్రార్థమున నుండియు మీనార్థమునను ప్రసిద్ధమై యుండునా? ఇది విషయాంతరము.

దేవః పురజిదిత్యుక్తే దేవశబ్దస్య సన్నిధేః. 423

పురజిత్త్వం శివస్యేతి వ్యజ్యతే శివ ఏవ హి

అన్యశబ్దసన్నిధి యిందున్నది. శబ్దాంతరసన్నిధాన మభిధానియామక మగును. నియతార్థక మయిన శబ్దాంతరముతో సామానాధికరణ్యముండుట. "దేవః పురజిత్'' అనునది యుదాహరణము. ఇందు దేవపదము నానార్థకము. పురజిత్ పదము శివరూపార్థము నందు నియతము. అట్లు నియతార్థ మయిన పురజిత్పదసాన్నిధ్యము నానార్థక మయిన దేవశబ్దమును శివార్థము నందు నియమించు చున్నది.

మధుమత్తః పిక ఇతి వసంతో వ్యజ్యతే స్ఫుటమ్. 424

భాత్యత్ర దేవ ఇత్యుక్తే రాజధానీ ప్రతీయతే

మిత్రం భాతీతి సుహృది మిత్రో భాతీతి భాస్కరే. 425

స్వాహేంద్రశత్రురిత్యత్ర స్వరేణార్థాంతరధ్వనిః
ఏవమాది ప్రయోగేషు తత్తదర్థో విభావ్యతామ్. 426

సామర్థ్యము, దేశము, వ్యక్తి, స్వరము అనునవి యథాక్రమముగా నిందున్నవి.

సామర్థ్యము కారణ మగుట– "మధుమత్తః పికః" పికము మధు మత్త మనునది లక్ష్యము. మధుశబ్ద మిందు నానార్థము. వసంతుడు తేనె తద ర్థములు. అయినను మధుశబ్దము వసంతార్థమునందె నియంత్రిత మగుచున్నది. కోకిలమదజనన సామర్థ్యము వసంతునకె కలదు. మధ్వాదుల కా సామర్థ్యము లేదు. కాన వసంతుడె మధుశబ్దవాచ్యుడు.

దేశము కూడ అభిధానియామకము. "భాతి అత్ర దేవః" ఇచట దేవుడు భాసించు చున్నాడు. "అత్ర" అని యనుటచే రాజధాని గోచరించును. రాజధానిలో దేవుడనుట రాజధాని రూపదేశమున రాజార్థమునందే యభిధ నియం త్రిత మగును.

వ్యక్తి. పుంనపుంసకాది లింగమునకు వ్యక్తియని పరిభాష. "మిత్రం భాతి, మిత్రో భాతి" మిత్రశబ్దము నపుంసకలింగ మయినచో సుహృదర్థలాభము, పుంలింగమయినచో సూర్యార్థలాభము కలుగును. మిత్రశబ్దము నానార్థ మయి నను లింగనిర్దేశమున నర్థవిశేషము నందు నియంత్రిత మగును.

స్వరము. ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము అను స్వరము వేదము నందే విశేషప్రతీతి కలుగజేయును. కావ్యమున నది విశేషప్రతీతికారి కాదు. కావ్యమున స్వరము నత్యంత మాదరింప వలసిన యవసరము లేదు. ఉదాత్తాది స్వరములు కావ్యమున నర్థవిశేషనియామకములు కావు. కొన్ని యెడల శ్లేషా దులలో నది సమాదరణీయము. "స్వాహా! ఇంద్రశత్రుర్వర్ధస్వ!" అను వైదిక పదమున 'ఇంద్రశత్రు' వనునది స్వరవిశేషమును బట్టి నానార్థక మగును. "ఇంద్రః శత్రుః యస్య సః" అని బహువ్రీహిసమాస మయినచో మొదటి పద ముదాత్త స్వరము కలదగును. "ఇంద్రస్య శత్రుః" అని షష్ఠీతత్పురుష మయినచో చివరి పద ముదాత్తమగును. ఇట్లు వ్యాకరణము నిరూపించు చున్నది. ఆద్యు దాత్త మయినచో నింద్రుడు శాతనము - మారణము చేయువాడని యర్థము. అంత్యోదాత్త మయినచో నింద్రుడు శాతనము పొందు వాడని యర్థము

లభించును. ఉచ్చారణము నందలి స్వరమును బట్టి యర్థము మారును. కావున స్వర మచట అర్థవిశేషము సంపాదించును.

ఈ నిరూపించిన సంయోగాద్యుదాహరణములలో నీ యంశము నను పదము భావింపవలెను. నానార్థకశబ్దము లేకార్థము నందు సంయోగాదులచే నియంత్రితములు కాగా నర్థాంతరప్రతీతి వ్యంజన వలననె గలుగును. కావుననె శారదా తనయుని "ధ్వన్యతే వ్యజ్యతే వ్యనక్తి" మొదలగు పదముల ప్రయోగసాంగత్యము భావింపవచ్చును. ఈ యర్థమిట్లు విశద మగును.

సంయోగాదిభిరేతైస్తు వాచకత్వే నివారితే
అనేకార్థస్య శబ్దస్య యదర్థాంతరదర్శనమ్. 427

అభిధా నాత్ర వర్తేత తస్యాః స్వార్థే నియామనాత్
ముఖ్యార్థబాధాద్యభావాల్లక్షణా నాత్ర వర్తతే. 428

అతోఽత్ర శబ్దవ్యాపారః పారిశేష్యాత్తదంజనం

ఈ నిరూపించిన సంయోగాదులచే వాచకత్వము నివారితము కాగా అనేకార్థక శబ్దమునకు సంబంధించిన యర్థాంతరమున నభిధ ప్రవర్తింపదు. అది స్వార్థముననె నియమనము పొందినది కదా! ముఖ్యార్థబాధాదులు లే నందున లక్షణ ప్రసరింపదు. కావున పారిశేష్యమున వ్యంజన మను శబ్దవ్యాపారమె ప్రవర్తించు నని గ్రహింపదగును. అర్థాంతర మట్టి స్థలము లందు శబ్దశక్తిమూలమయిన ధ్వనన వ్యాపారముననె భాసించును.

తద్వ్యంజనయుతః శబ్దో యః సోఽర్థాంతరయుక్తథా. 429

అర్థోఽపి వ్యంజకస్తద్వత్సహకారితయా మతః

ఇంతకు గొంతగా వ్యంజన నిరూపితమయినది. తద్ద్వారా వ్యంజక శబ్దము నిరూపించుట యిందున్నది. ఇంతవఱకు నిరూపించిన వ్యంజనయుతమయిన శబ్దము వ్యంజకము. ఈ వ్యంజకశబ్దము నాశ్రయించిన వ్యంజన వ్యంగ్యమును భాసింప జేయును. శబ్దము వ్యంజక మయినట్లు అర్థమును వ్యంజకమని యిందు నిరూపితమగును. శబ్దము వ్యంజక మయిన స్థలము నం దా శబ్దార్థ మజాగలస్తనరీతి వ్యర్థము కాదు. అర్థాంతరసంబంధ మున్నందువలన శబ్దము వ్యంజక మయినది కదా! ఇట్లె యర్థమును అర్థాంతరసంబంధము

కలుగుట వ్యంజక మగును. కావున నర్థమును పూర్వము చెప్పిన వ్యంజనము నందు సహకారిగా నుండుననుట సమ్మతము. ఈదృశస్థలములందర్థము సహకారి మాత్రముగ నుండుటచే నిచట వ్యంజన శబ్దశక్తిమూల మనియె వ్యవస్థ శబ్దము వలన గాని యర్థమువలనగాని ప్రధానముగా వ్యంజన వ్యాపార మున్నచోట ధ్వని తత్తన్మూలక మగుట నిరూపితమగును. ప్రధానము ననుసరించి వ్యపదేశ ముండును గదా! శబ్దశక్తిమూల వ్యంజనములో నర్థము సహకారి యగునట్లు అర్థశక్తిమూల వ్యంజనములో శబ్దమును సహకారి యగుట నిరూపితము కాగలదు.

వాచ్యలక్ష్యవ్యంగ్యభూతా యేఽర్థాః పూర్వముదాహృతాః. 420

తేషాం తద్వాచకాదీనామర్థవ్యంజకతోచ్యతే
వక్తృబోద్ధవ్యకాకూనాం వాక్యవాచ్యాన్యసన్నిధేః. 431

ప్రస్తావదేశకాలాదేర్వైశిష్ట్యాత్ప్రతిభాజుషాం
యోఽర్థస్యాన్యార్థధీహేతుర్వ్యాపారో వ్యక్తిరేవ సా. 432

బోద్ధవ్యః ప్రతిపాద్యః స్యాత్ కాకుః స్యాద్ధ్వనిక్రృతిర్ధ్వనేః
ప్రస్తావః స్యాత్ప్రకరణమర్థా వాచ్యాదయస్తథా. 433

ఇంగితాకారచేష్టాదిరాదిశబ్దేన చోదితః
క్రమాద్వాచ్యస్య లక్ష్యస్య వ్యంగ్యస్యోదాహృతిః కృతా. 434

వాచక లక్షక వ్యంజకము లను శబ్దములకు వాచ్య లక్ష్య వ్యంగ్య రూపము లయిన యర్థములు పూర్వము నిరూపితము లయినవి. ఇప్పు డిక అర్థ వ్యంజకత నిరూపిత మగును. వాచ్యాద్యర్థమయి మూడును వ్యంజకము లగుట సూచితమె. అయినను వాని వ్యంజకత యిచట వ్యాఖ్యాత మగును.

వక్త బోద్ధవ్యుడు కాకువు వాక్యము వాచ్యము అన్యసన్నిధి ప్రస్తావము దేశము కాలము మొదలగువాని వైశిష్ట్యము వలన, నవనవోన్మేషశాలి ప్రజ్ఞారూప ప్రతిభాస్వరూపు లగువారికి కావ్యవాసనావాసితాంతరంగు లయిన సహృదయులకు నవీనార్థప్రతిపాదక మయిన వాచ్య లక్ష్య వ్యంగ్యరూప త్రివిధార్థమునకు సంబంధించిన వ్యాపారము వ్యంజనవ్యాపారమె. వ్యంగ్యసంవేదన వైదగ్ధ్యమున కతిపయ సహృదయులు మాత్ర మధికారులు. వక్త్రాది వైలక్ష

ణ్యము హేతువుగా ప్రతిభాశాలుర కన్యార్థసంవేదన మిచ్చు వ్యాపార మర్థ వ్యంజన యని సారాంశము.

వక్త్రాది నవక స్వరూప మీ విధమున గుర్తింపవచ్చును. ఇందు కొన్నిటి రూప మున్నది. కొన్నిటిది లేదు. అన్నిటి స్వరూపము కావ్య ప్రకాశానుసారమున సంగ్రాహ్యము.

౧. వక్త. ఇతరులకు దెలియుటకై వాక్యప్రయోగము నరించువాడు వక్త. కావ్యమున కవి వక్త. కావ్యమున కవి నిబంధించిన వ్యక్తులును వక్తృ పదమున వ్యవహార్యులు.

౨. బోద్ధవ్యుడు. ప్రతిపాద్యుడు. ఎవనికి బోధించుటకై వక్త వాక్యములను ప్రతిపాదించునో యాతడు ప్రతిపాద్యుడు. మూలములోని బోద్ధవ్యపదమున బోధనీయార్థభ్రమ గలుగరాదని మూలకర్తయే ప్రతిపాద్యు డని యర్థము నుడివెను.

౩. కాకువు. ధ్వని వికారము కాకువు. దీనిచే వక్తయొక్క శోక హర్షాదుల నూహింపవచ్చును. "కాయతి అర్థాంతరమితి కాకుః" అర్థాంతరము నవగమింప జేయునది కాకువు. ప్రకృతార్థమున కన్న నర్థాంతరమున శబ్దము చలించు స్వభావము కలదగుట కాకువు. "ఈషదర్థే కు శబ్దః, తస్య కాదేశః, కుః భూమిః, హృదయస్థ వస్తు ప్రతీతేః ఈషద్భూమిః కాకుః" హృదయగత మయిన వస్తుప్రతీతిని సూచించునది కాకువు. ఇంకను కాకువిశేషము లిందె పూర్వము సూచితము లయినవి.

౪. వాక్యము. పదముల సమూహము వాక్యము. ఏకార్థప్రతిపాద కము. ఐకార్థ్యము కలది.

౫. వాచ్యము. వాచకశబ్దప్రతిపాద్య మగు నర్థము. "అర్థా వాచ్యా దయః" అని యిందలి నిరుక్తి. వాచ్యము స్వస్పందసుందర మయిన వైలక్ష ణ్యము కలదై వ్యంగ్యవ్యంజక మగును. సార్థకములు రమణీయములు నయిన విశేషణము లున్న వాచ్యమె యిచట వాచ్యము.

౬. అన్యసన్నిధి. అన్యుని సన్నిధి. వక్తృబోద్ధవ్యుల కన్న నితరు డన్యుడు. ఆతని సన్నిధానము - సామీప్యము అన్యసన్నిధి. తద్వైశిష్ట్యము నర్థవిశేషమును ద్యోతనము చేయును.

౭. ప్రస్తావము ప్రకరణము. ఒక్కొక్క సందర్భవశమున గూడ నర్థాంతరప్రత్యయ ముదయించును.

౮. దేశము. నిర్జనముగా నుండు ప్రదేశము. ఆయా సందర్భ సముచిత మగు న దేశవైశిష్ట్యము గ్రాహ్యము.

౯. కాలము. పగలు రాత్రి ప్రాతస్సాయములు మొదలగు కాలవిశేషములన్నియు గ్రాహ్యములు.

''కాలాదేః'' అది శబ్దమున నింగితాకార చేష్టాదు లభ్యూహ్యములు. వక్తృ వైశిష్ట్యాదులలో వాచ్యము లక్ష్యము వ్యంగ్యము స్వవైశిష్ట్యమున ముఖ్యవ్యంగ్యములకు వ్యంజకముల గుటయు భావనీయము. వీనియుదాహరణములు సమన్వయము లిట్లుండును.

''అతిపృథులం జలకుంభం గృహీత్వా సమాగతాస్మి సఖి! త్వరితం
శ్రమ స్వేద సలిల నిశ్వాస నిస్సహా విశ్రామ్యామి క్షణమ్.'' 435

అత్రచౌర్యరతస్యైవగోపనం గమ్యతేస్ఫుటమ్

వక్తృవైశిష్ట్యమున వాచ్యార్థము వ్యంజక మగుట కిది యుదాహరణము. ఒక తరుణి యొకనాడు నదీతీరమున కేగినది. అపు డచట తలచి వేచియున్న యుపనాయకు డామె నుపభోగించినాడు. అపు డా తరుణి సద్యోభుక్త ముక్త. ఆమెకు స్వేద ముదయించినది. శ్రమకలిగినది. ఇంక సంభోగచిహ్నములు పట్టినవి. గృహమునకు వచ్చిన పిమ్మట నా తరుణి వాని దాచి యాచి తన చెలియను వంచనచేయుట కిట్లనును — ''సఖి! పెద్దజలకుంభము పట్టి వేగముగా వచ్చితిని. శ్రమ కలిగినది. చెమట పట్టినది. నిశ్వాసనిస్సహ నయితిని. క్షణము విశ్రమించెదనె!'' ఇది వాచ్యార్థము. దీనిని సామాన్యముగా గుర్తించిన వారి వలన నామె కేమియు మాటరాదు. కాని యామె యతిచారిణి యని దుశ్శీల యని గుర్తించి యామె భావము గుర్తించి నప్పు డర్థాంతరము భావుక హృదయముల కవభాసించును.

''సఖి! నిజము''! నిన్ను వంచన చేయుదునా? అతిపృథుల మయిన కుంభము కదా! అది దుర్వహము. ఇంక నది నిండు కుంభ మగుట దుర్వహము. నా యంతట నేనే వచ్చితిని. ఎవరును సహాయము లేరుకదా! అందును మెల్లగ వచ్చితినా? త్వరితముగ వచ్చితిని. మధ్యమార్గములో నేనేమియు

విశ్రమింపలేదు. నా కిక శ్రమకలుగ దేమి? నా సుకుమారాంగత నీ వెరిగినదే యయ్యెను. చూచితివా? శ్రమ నెంతటి నీటిపోత పట్టినదో. ఇంక క్షణము విశ్రమించెదనె!'' అను నిట్టిభావము శబ్దపరివృత్తి యున్నను గలుగును. అందు వలన నిచటి వ్యాపారము శబ్దసంబంధి కాదు. అర్థసంబంధి కాదు ఈ వక్త్రి కామిని యసతీచరితము కలదని మొదట ప్రమాణాంతరమున నవగతము కావ లెను. పిమ్మట "వ్యభిచారిణి యిట్లు పలుకుచున్న" దని వక్తృవైశిష్యమున చౌర్యరతగోపనము చేయుట గోచరించును. అట్టి రతము సరిత్తీరమున లతా కుడుంగముననె సంభవించును. వాచ్యార్థసహజముగా భాసించిన శ్రమస్వేదా దులు వ్యంగ్యానుగతములై ప్రతిభాశాలురకు భాసించును. దీనిలో చౌర్యరతగోపన మొనరించు చున్నదని గమ్యమాన మగుచున్నదని సారాంశము.

ఖేదోమయి నయోగ్యః స్యాత్కర్తుం యోగ్యః కురుష్వితి.
తథాభూతాది వాక్యాదౌ స్వరకాకుః ప్రకాశ్యతే

అనంతరము కాకు వైశిష్ట్యమున కిచట సూచన మున్నది. భట్ట నారాయణరచిత వేణీసంహార నాటక ప్రథమాంకమున నీశ్లోకమున్నది.

"తథాభూతాం దృష్ట్వా నృపసదసి పాంచాలతనయాం
వనే వ్యాధైస్సార్థం సుచిరముషితం వల్కలధరైః
విరాటస్యావాసే స్థితమనుచితారంభనిభృతం
గురుః ఖేదం ఖిన్నే మయి భజతి నాద్యాపి కురుషు."

సహదేవుడు భీమునితో "ఆర్యా! మీరిట్లు సంభృతక్రోధు లయినచో నన్నగారు ధర్మరాజెక్కప్పుడు ఖిన్ను లగుదురేమో'' అనగా భీముడు "ఏమీ? గురుపు అన్న ఖిన్నుడగునా? గురువులకు ఖేదపడుటయు తెలియునా?" అని యీ శ్లోకము వ్యాహరించెను. పాంచాలతనయ ద్రౌపది రాజుల సభలో వస్త్రాకర్షణ కేశాకర్షణ పరిభవము పొందుటను, వల్కలము ధరించి మన మంద రము వనములో వ్యాధులతో సమముగా సుచిర ముండుటను, విరాటుని కొలు పున ననుచితారంభమున రహస్యముగా నుండుటను, యుధిష్ఠిరుడు చూచియు ఖిన్నుడ నయిన నా విషయమున ఖేదము పడును. కౌరవుల విషయమై యిప్ప టికిని ఈ దురవస్థ యందును ఖేదము పొందడు.'' అనునది యిందు ప్రథమ మున గోచరించు వాచ్యము. ఇట్టి భావము కల యీ పద్యమున సోపహాసకాకు వుచే లభించు వాక్యార్థము "గురువు యుధిష్ఠిరునకు నా యందు ఖేద మచితము కాదు, కౌరవులందే ఖేదము యుక్తము'' అని వ్యంగ్యార్థము.

ఈ పద్యమున "మయి, కురుషు" "నా యందు కౌరవులందు" అను పదద్వయము కాకుస్థానము. వీనిని ధ్వనివికార విశేషముతో నుచ్చరించినపుడు రెండుస్థలము లందును ప్రశ్నమాత్రము సూచించి కాకువు విశ్రాంత మగును. ఆ పిమ్మట తద్వైశిష్ట్యము కలిగిన సహృదయునకు "ఇన్నిసిపై ఖేదపడుట యుక్తముః కానందున యుధిష్ఠిరునకు ఖేదము నా యందుచితము కాదు. అనేకాప రాధము లాచరించిన కౌరవులందే యుచితము" అని వ్యంగ్యము భాసించును. ఇది భీముని క్రోధప్రకర్షము సూచించును.

ఈ యంశమున నీ గ్రంథకర్త వాక్య మిట్లున్నది. ఈ కాకువు స్వర కాకువు. "నా యందు ఖేదము యోగ్యముకాదు. కురువులందె ఖేదపడుట యుక్తము" అని మొదట సూచించి సమన్వయసరణి నిట్లు ప్రతిపాదించెను.

ఖేదో మయి న యోగ్యః స్యాత్కర్తుం యోగ్యః కురుష్వితి. 436

తథాభూతాదివాక్యాదౌ స్వరకాకుః ప్రకాశ్యతే
వాచ్యసిద్ధ్యంగమత్రోక్తః స్వరః కాకుర్భవేదితి. 437

నైవం శంక్యం గుణీభూతవ్యంగ్యత్వం కాకువేదిభిః
ప్రశ్నమాత్రేణాపి కాకోర్విశ్రాంతేరత్ర దర్శనాత్. 438

నా యందు ఖేద ముచితము కాదు. కురువులందు ఖేదము చూపుట యుక్తము అని. "తథాభూతా" దివాక్యములలో స్వరకాకువు ప్రకాశిత మయినది. ఇచట నిరూపిత మయిన స్వరకాకువుచే భాసించు నర్థము వాచ్యసిద్ధ్యంగ మను గుణీభూతవ్యంగ్య మగునని కాకుస్వరూపవిదులు శంకింపరాదు. ప్రశ్న మాత్రమున గూడ కాకువు విశ్రాంతమగుట యిచట నున్నది. సూత్రప్రాయ ముగా నున్న యిచటి భావము నీ విధముగా గ్రహించుట యుక్తము.

నాయందు ఖేద ముచితము కాదను ఖేదానౌచిత్యరూప మయిన వ్యంగ్యార్థము వాచ్యార్థమునకు శోభనతాసంపాదమున సాధక మగుచున్నది. "నా యందు ఖేదము. కౌరవులందది లేమి" - ఇది పాత్రాపాత్రవైపరీత్యము. ఈ వాక్యార్థ మయుక్త మయినందున సరిగా పర్యవసిత మగుట లేదు. తత్పర్య వసానము సంపాదించుటకు వ్యంగ్యము నర్పించు కాకువు సమర్థ మయినది. ఇట్లు కాకువు వాచ్యసిద్ధిలో నంగము కాగా, తద్ద్వారమయిన వ్యంగ్యమును వాచ్య సిద్ధ్యంగమె యయినది. గుణీభూత మయినది. ఇందలి వచనము కుపితు డుద్ధ

తుడు నయిన భీమునిది. అందుచే నది విపర్యయము నందు పర్యవసింప వలెను. అది కాకు వ్యంగ్యమయిన ప్రశ్నరూపార్థము లేక సంభవింపదు. కాకువ్యతిరేకముగా వివక్షితవాచ్యమె సిద్ధింపదు. కాకువు నాశ్రయింప కున్న వాచ్యసమన్వయము ఘటింపదు. కాకు వనునది యొక శబ్దధర్మము కదా. శబ్దస్పృష్టము శబ్దోక్తమె యగును. అర్థము వాచ్యసామర్థ్యాక్షిప్త మయినందు వలన వ్యంగ్యమయినను వాచకశబ్దస్పృష్ట మయినందువలన గుణీభూతమగును కదా! కాగా నిది గుణీభూతవ్యంగ్యోదాహరణమె కాని ధ్వన్యుదాహరణ మెట్లగును? ప్రధాన ధ్వన్యుదాహరణ ప్రస్తావమున నీ ప్రసక్తి యేల? అని యిచటి యాశంకార్థము.

సమాధానార్థము నీ విధముగా సంభావింపవలెను. కాకు వింద్రు క్రోధప్రకర్షకము. క్రోధము రౌద్రరసస్థాయి. కాగా కాకువు రసమున కంగమయినది. వ్యంగ్య మయిన రౌద్రరసమె యిచట ప్రధానము. వాచ్యార్థము దాని కంగము కావున గుణీభూతవ్యంగ్యమని యాశంకింప నవసరము లేదు. ''ఇప్పటికిని కురువుల విషయమై ఖేదము పొందడా?'' అను స్థలమున గల నిషేధరూపమగు ప్రశ్న కాకువును వాక్యార్థప్రతీతి యందే పర్యవసానము పొందును. ఏ కాకువులేక వాక్యార్థబోధయె పర్యవసానము పొందదో అట్టి కాకువు నిరూపించిన వ్యంగ్యార్థము గుణీభూత మగును. కాని యిట్టిస్థలము లందు కాదు. ఈ స్థలము నందు కాకువు వ్యంగ్యార్థమును నిరూపింపకనే కేవల ప్రశ్న మాత్రముననె విశ్రాంతము కాగలదు.

ఇచట కాకువునకు రెండు సామర్థ్యము లున్నవి — కేవలము ప్రశ్నమాత్రార్థమును నిరూపించుట, వ్యంగ్యార్థమును నిరూపించుట యని. వ్యంగ్యనిరపేక్ష మయిన ప్రశ్నమాత్రార్థమున గూడ వాక్యార్థము పర్యవసానము పొందును. ఇట్లు వాక్యార్థపర్యవసాన మున్నను వ్యంగ్యార్థము రమణీయతానిదానముగా స్ఫురించును. ఆ వ్యంగ్యార్థముననె యా వాక్యార్థపర్యవసానము కలుగ వలెనని లేదు. ఈ వ్యంగ్యార్థము లే కున్నను వాక్యార్థమునకు పర్యవసాన మున్నందున వ్యంగ్యము గుణీభూత మగుట లేదు. ఏ వ్యంగ్యార్థములేక వాచ్యార్థము పర్యవసన్నమె కాదో ఆ వ్యంగ్యార్థముననె వాచ్యార్థము సిద్ధము కావలసి యున్నప్పుడు, అట్టి వ్యంగ్యార్థ మట్టి వాక్యసిద్ధిలో నుపకరించి నందున వాచ్యసిద్ధ్యంగము కావచ్చును. కాని యిచట నట్టి విధానము లేదు.

"తదా మమ గండస్థల నిమగ్నాం దృష్టిం న నయస్యన్యత్ర
ఇదానీం సైవాహం తౌ చ కపోలౌ న సా దృష్టిః." 439

అత్ర ప్రచ్ఛన్నకామిత్వం కాంతయా వ్యజ్యతే ప్రియే

వాక్యవైశిష్ట్యమున వాచ్యము వ్యంజకమగుట కిది యుదాహరణము. ఒక నాయకునకు ధీరగంభీర యయిన ప్రియురాలు కలదు. ఒకనాఁ డొక సౌందర్యాభిమానిని యయిన వనిత వారి యింటికి వచ్చినది. తన ప్రియురాలి దగ్గరగా నుపవిష్ట యయినది. ఆ సౌందర్యదేవతపై నాయకున కభిలాష కలదు. అనిమేష నయనముతో జూడదలచినాడు. కాని నికటమున తన నాయిక యున్నది కదా! ఆమె చూచుచుండగా చూడరాదు. ఇట్టి భావమున నాయకుడు సాక్షాత్తుగా జూడ జంకి తన నాయికాస్వచ్ఛకపోలమండలప్రతిబింబిత యగు నామెను సాదరముగా తనివిదీర జూడ నుత్సుకు డయినాడు. నాయికాముఖావలోకనమిషమున జూచి చూపరి యయినాడు. ఆ సుందరి కొంత కాలముండి వెడలి పోయినది. కపోలప్రతిబింబనము లేదు. నాయకుడు నిరీక్షణ నివృత్తు డయినాడు. ఈ దృష్టి వికారమును చతురనాయిక గుర్తించినది. రహస్యము తెలిసికొనినది. చురుక్కుమన్నది. ఇట్లనినది.

"అప్పుడు నా గండస్థలనిమగ్న మయిన దృష్టిని మరల్చ లేదు. ఇప్పుడు ఆ నేనే. ఆ కపోలములె. ఆ దృష్టి లేదే!" ఇది వాచ్యార్థము. "ఆ నీ హృదయనిహిత సౌందర్యముద్ర ఆమె వచ్చి నాసన్నిధిలో నున్నప్పుడు నా కపోలము నందు నీ దృష్టి సద్భావస్నేహధర్మము కలదిగా నిర్నిమేషముగా నట్టె నిలబడెనె! ఎట్లును మఱల్చవైతివె! ఇప్పు డామె వెళ్ళిపోగా నీ దృష్టి దాక్షిణ్యమున తాటస్థ్యశాలిని యై వేరయినది. ఆ నేనే ఆ కపోలములె ఆ చూపేది? ఆమె యుండగా జూచితివా? ఆమె పోగానె మానితివా? ఆహాహా! నీ ప్రచ్ఛన్నకాముకత్వ మేమయా! ఇంతటి యుబలాట ముండెనేమి?" అని వ్యంగ్యము. అవిచిత్రమగు వాచ్యము సర్వజనసాధారణము. వ్యంజనసహకార సముచిత మయిన వైచిత్ర్య మీ వ్యంగ్యమున గలదు.

వాచ్యవైశిష్ట్యము

మలయానిలసంఫుల్లకుసుమామోదమేదురమ్. 440

ఆరామం పశ్య సుముఖి! మనోభవనికేతనం
కామిని! ప్రవిశాత్రేతి వ్యజ్యతే సురతార్థినా. 441

వాచ్యవైశిష్ట్యమున వాచ్యార్థము వ్యంజక మగుట కుదాహరణము. ఇందలి వాచ్యార్థమె స్వస్పందసుందర మయిన వైలక్షణ్యము కలదగుట వలన వ్యంగ్యవ్యంజక మగును. ఒక రమణార్థి కాముకుడు కామిని నుద్దేశించి యిట్లు పలుకును — "ఓ సుముఖి! ఈ యారామము చూడుము. మలయానిలమున సంఫుల్లము లయిన కుసుమముల పరిమళమున మేదురముగా నున్న యీ యారామము మనోభవనికేతనము కదా!" ఇచట "కామిని! యీ యారామము ప్రవేశింపుము. సురతమునకు ప్రవేశింపుము." ఇందలి వాచ్యము విశేషణ వైశిష్ట్యము వలన కాముకాభిప్రాయము నభివ్యంగ్యము చేయుచున్నది.

"సుదత్యనార్ద్రమనాః శ్వశ్రూర్మాం గృహాభరే సకలే
క్షణమాత్రం యది సంధ్యాయాం భవతి న వా భవతి విశ్రామః. 442

సంకేతకాలః సంధ్యేతి వ్యజ్యతేఽత్ర కయాచన

అన్యసన్నిధివైశిష్ట్యమున కిది యుదాహరణము. వాచ్య మిందు వ్యంజకమై వ్యంగ్యార్థము నుల్లసింప జేయును. వక్తృబోద్ధవ్య భిన్న మయిన తటస్థవ్యక్తిసన్నిధానము యొక్క వైలక్షణ్య మిందు వ్యంజకత్వమున నిదానము. ఒక పరకీయ నొకడు కామించినాడు. వారి సమాగమమునకు సంకేతకాలమిం కను సిద్ధము కాలేదు. ఆత "డెపుడా? యెపుడా" యని సంకేత కాల మర్థిం చుచు తటస్థుని వలె నా ప్రక్కగా నున్నాడు. ఆ ప్రచ్ఛన్నకాముకునకు కాల విశేషమును సూచింప వలెనని యా కామిని సంకల్పము. ప్రక్కయింటి యామెను సంబోధించి తన యత్తగారి యొత్తిడి నుపాలంభముగా జెప్పుదాని వలె నా తటస్థభావమున నున్న కాముకునకు సంకేతకాలము నిట్లు సూచించు చున్నది.

"అమాయముగా నా పనులు చేయు నన్ను నా యత్త యకారణ ముగా సకల మయిన యింటి చాకిరి యందు ప్రేరణము చేసి పెత్తనము చేయును. సాయంకాలసమయములో క్షణమాత్ర మయిన విశ్రామము కలు గునో? కలుగదో? ఏమిచేయుదునమ్మా!" అని వాచ్యము.

అసలే ఆమె అత్త. అందు నిరార్ద్రముగా నకరుణముగా నన్నాజ్ఞా పించును. ఇంటిలోని పని యంతయు నేన చేయవలయును. సర్వకాలము

నేను వ్యాగ్రముగా నుండక తప్పదు. క్షణమేని విశ్రామము కలిగిన సాయం కాలమె కలుగ వలయును. అప్పుడే యే మాత్రమేని యవకాశము లభించును. ఇతర సమయము లం దేమియు కలుగు సట్లు లేదు. అని చలితచరిత సన్నిహితు నకు గోచరించునట్లు నిరూపించు వ్యంగ్యము. దీనిలో సంధ్యాసమయము సంకేత కాలమని యొకతె సూచించుట వ్యంగ్యమని సారము.

"శ్రూయతే సమాగమిష్యతి తవ ప్రియోఽద్య ప్రహరమాత్రేణ. 443

ఏవమేవ కిమితి తిష్ఠసి తత్సఖి! సజ్జయ కరణీయం"

కస్యాశ్చిజ్జారసంభోగే నిషేధోఽత్ర ప్రతీయతే. 444

ప్రస్తావవైశిష్ట్యమున వాచ్యము వ్యంగ్య మగుట కిది యుదాహరణము. ఒక యువతి యనుభవరసిక. ఇష్టప్రియు నభిసరించుటకై యతనము చేసినది. ఇంతలో నామె పతి వచ్చునట్లు తెలిసికొనిన తత్సఖి యిప్పటి యామె యభిసరణమును నివారించుట కిట్లు పలుకును "ఒక - జాములో నీ ప్రియుడట! వచ్చునని వినవచ్చుచున్నది. నీ విట్లే యుందు వేమి? చేయవలసిన పని సర్ది కొనవమ్మా!" ఇది జనసమక్షమున గూడ జెప్పదగిన వాచ్యార్థము. "నేనెప్పుడో వినుటకాదు. ఇప్పుడే వినుచున్నాను. ఒకజాములోపలె యాతడు వచ్చునట! రేప తెల్లుండలో వచ్చునని కాదు. ఆ వచ్చునది నీ ప్రియుడట! ఏమి ప్రియుడో? ప్రియుడని సోల్లుంఠనోక్తి. అతడే ప్రియుడయిన నీవిట్లుద్యమింతువా? నిన్ననురాగింప జేసికొనలేని యా మగవాడెంతటి ప్రియుడు? ఆ వచ్చువాడెంతటి యుబలాటముతోడనో వచ్చును. ఇప్పుడే అటు వెళ్ళి యిటు వత్తు ననుకొందువేమో? అంతత్వరగా నెట్లు రా గలవు? వచ్చిన నా యుప భోగచిహ్నములెట్లు దాచెదవు? నీ భర్త నీ యా చిహ్నలను గుర్తించినచో! ఏదో! నీ భర్త వచ్చుచున్నాడు. ఆతడెంత యాకలితో నున్నాడో! ఆతనికి నీవు చేయునది యింతియే కదా! త్వరపడుము. కరణీయపాక మొనరింపుము! ఇప్పుడు నీ వభిసరించుట ప్రమాదము. ఆ యభిసారికావేషము మాని యింటిలో పనులు చేయుము." ఇప్పు డభిసరింప వలదని వ్యంగ్యము. ఈ చెప్పు సకియ కా కామిని రహస్యము తెలియును. ఆమె యభిసారసముచితవేషము ధరించు సమయమున భర్త ప్రత్యాగమన వార్తను తెలియజేసి యా యభిసరణము నిషేధించు చున్నదన్న ప్రస్తావము గుర్తించిన సహృదయులకు వ్యంగ్య మవభాసించును. జారునితో సంభోగవిషయమున నొకతె నిషేధించు చున్నదని యిందు ప్రతీయమానమగునని సారాంశము.

నిమీల్య లోచనే కాచిత్ప్రియే గురుజనావృతా
పశ్యతి స్వస్తికాకారకరేణాలింగతి స్తనౌ. 445

నిమీలనాదింగితేన యామినీతి ప్రతీయతే
చేష్టయా స్వస్తికాకృత్యా గాఢాశ్లేషః ప్రతీయతే. 446

వైశిష్ట్యముల సంఖ్యానించు నపుడు "వాచ్యాదయ" యను నాది పదమున ఇంగితాకారచేష్టాదుల జెప్పినందున నిచట చేష్టావైశిష్ట్యమున వాచ్యము వ్యంజక మగుట కిది యుదాహరణము. ఒకని జూచి వాని యభీష్ట ప్రియ నానాచేష్టలు సాభిప్రాయముగా ప్రదర్శించినది. వానిని సామోదముగా నాయకుడు గుర్తించినాడు. ఆ విషయమున కవి యిట్లు వర్ణించుచున్నాడు.

గురుజనులతో పరివృత యయిన యామె ప్రియుడు చూచుచుండగా లోచనములను మూసికొని స్వస్తికాకారహస్తమున స్తనముల నాలింగనము చేసికొనుచున్నది. ఇందు నిమీలనాదింగితమున యామినీసమయము – రాత్రి గోచరించును. పద్మసదృశములగు నేత్రములను మూయుటచే పద్మసంకోచము కూర్చు రాత్రి భాసించును. స్వస్తికాకృతి చేష్టావిశేషముచే గాఢాశ్లేషము గోచరించును. కమలములు మీలనము పొందిన పిమ్మట సంధ్యాకాలమున జీకటిలో నీవు రావలయును. పారితోషికముగా గాఢాలింగన మిత్తునని వ్యంగ్యము.

ద్విత్రాదిభేదే వక్త్రాది మిథోయోగే సతి క్వచిత్
క్రమాద్వ్యంగ్యస్య లక్ష్యస్య వ్యంజకత్వం నిదర్శ్యతామ్ 447

ఇప్పటి కిట్లుదాహృతములలో నొక్కొకదానియం దితరభేదాంతరములును గలవు. ఇతరభేదములకు నవియే యుదాహరణములు కావచ్చును. నిస్సందేహ మయిన వ్యుత్పత్తి కలుగుటకై వేరు వేరుగా నుదాహరణములు నిరూపితము లయినవి. వక్తృబోద్ధవ్యాదులు ప్రత్యేకముగా వ్యంజకములు కావలయునన్న నియమము లేదు. అవి యొకటొకటి మిళితములై వ్యంజకములు కావచ్చును. వక్తృబోద్ధవ్యాదివిశేషమున వాచ్యమె వ్యంజక మగుటయే కాక వ్యంగ్యము వ్యంజక మగును. లక్ష్యము వ్యంజక మగును. వాచ్యము లక్ష్యమగుటయె యుదాహరణములలో నున్నది. లక్ష్యమునకు వ్యంజకత్వము, వ్యంగ్యమునకు వ్యంజకత్వ మభ్యూహింప దగును. ఇంకను ద్విత్రాదిభేదమున

ననేకభేదములు కలుగును. వానిని వ్యుత్పన్నమతులు స్వయముగా నూహించి గుర్తించుట సముచితము.

> శబ్దప్రమాణవేద్యోఽర్థో వ్యనక్త్యర్థాంతరం యతః
> అర్థస్య వ్యంజకత్వే తచ్ఛబ్దస్య సహకారితా. 448
> శబ్దైనైవ నివేద్యోఽయం న ప్రమాణాంతరేణ చ

అర్థమునకు మాత్రము వ్యంజకత చెప్పినచో శబ్దార్థోభయరూప మయిన కావ్యము వ్యంజక మగుట యుపపన్నమా? శబ్ద మర్థము కావ్యమయి నపు డే యొకటియో వ్యంజక మనుట న్యాయమా? ఈ యంశమున సమా ధానించుట కీ కారిక సమర్థము.

శబ్దప్రమాణమున వేద్యమయిన యర్థము వాచ్యము కాని లక్ష్యము కాని వ్యంగ్యము కాని వ్యంగ్యమగు నర్థాంతరమును ద్యోతనము చేయును. అప్పుడర్థము వ్యంజకము కాగా శబ్దమునకు సహకారిత్వ ముండును. అర్థము వ్యంజక మయిన స్థలమున శబ్దము పరివృత్తిసహ మగును. ఉన్న శబ్దమును మార్చి శబ్దాంతరము నచట కూర్పవచ్చును. అర్థము మాత్ర మచట ప్రధా నము. అందుచే నర్థమునకు ప్రాధాన్య ముండును. శబ్ద మప్రధాన మగుట సహ కారిగా నుండును. శబ్దవ్యంజకత యున్న స్థలమున శబ్దము ప్రధానము; అర్థ మప్రధానము. ఈ యంశము పూర్వము నిరూపిత మయినది. ఇచట నర్థప్రధా నత గుర్తించునది.

మొత్తమున కర్థశక్తిమూలమున గాని శబ్దశక్తిమూలమున గాని శబ్దా ర్థములు రెండును పరస్పరసహకారము కలవై వ్యంజకము లగునని గ్రహింప వచ్చును. అందుచే శబ్దార్థోభయమయ మయిన కావ్యము వ్యంజక మగుట యనుపపన్నము కాదు.

> శబ్దప్రమాణవేద్యోఽర్థో వ్యనక్త్యర్థాంతరం యతః

ఇచట నర్థవ్యంజకత ముఖ్యముగా నిరూపితము. శబ్దప్రమాణ వేద్య మయిన యర్థమె యర్థాంతరవ్యంజకము కావలయును. కాని ప్రమాణాంతర వేద్య మయిన యర్థము వ్యంజక మగుట సమ్మతము కాదు. ప్రమాణాంతరవే ద్యార్థము వ్యంజకమును కాజాలదు. కావుననే శబ్దమును వ్యంజకత్వమున నిమిత్తమగును.

## ధ్వనికావ్యభేదములు

ఏవం ప్రకారై ర్బహుభిః కృతే శబ్దార్థనిర్ణయే. 449

స్వరూపం దోషగుణయో రసాలంకారయోరపి
అవశ్యమభిధాతవ్యం అపి తత్రాపి ధర్మిణి. 450

ప్రదర్శితే తద్ధర్మాణాం హేయోపాదేయతాస్థితిః
జ్ఞాయతే యత్తతః కావ్యభేదాన్ ప్రాగభిదధ్మహే. 451

ఇట్లు బహుప్రకారముల శబ్దార్థనిర్ణయ మొనరింపగా దోషములను గుణములను రసముల నలంకారముల నవశ్యముగా నిరూపింప వలసి యున్నది. అయినను ధర్మియగు కావ్యమును ప్రదర్శించిననె కావ్యధర్మము లయిన దోషముల హేయత గుణాలంకారముల యుపాదేయత స్పష్టముగ గోచరించును. కావున ధర్మియగు కావ్యమునకు సంబంధించిన భేదముల నిచట నిరూపింతుము. ధర్మి యగు కావ్యమును ప్రదర్శించుట యనగా నవాంతరభేదసహితముగా కావ్యమును నిర్దేశించుట యని భావము. దోషము కావ్యధర్మము కాదు. తదభావమె కావ్యధర్మము. పరంపరాసంబంధమున నుపచారమున దోషములు కావ్యధర్మము లనుటను సంగతపఱచు కొనునది.

## ధ్వనికావ్యము

అవివక్షితవాచ్యో యః తత్ర వాచ్యం భవేద్ధ్వనౌ
అర్థాంతరే సంక్రమితమత్యంతం వా తిరస్కృతమ్. 452

ప్రధానే లక్షణామూలగూఢవ్యంగ్యే సతి క్వచిత్
యత్రావివక్షితం వాచ్యం తత్ర ధ్వనిరితి ధ్వనౌ. 453

తదేవానుపయుక్త్యాదేర్వాచ్యమర్థాంతరే యది
నమితం తద్భవేదర్థాంతరసంక్రమితాఖ్యయా. 454

ధ్వనికావ్యము లక్షణామూలక, మభిధామూలక మని రెండు విధములు. ఇందు లక్షణామూలకము అవివక్షితవాచ్యమని, అభిధామూలకము వివక్షితాన్యపరవాచ్యమని వ్యవహృత మగును. అవివక్షితవాచ్యధ్వని రెండు విధములు - అర్థాంతరసంక్రమితావివక్షితవాచ్యధ్వని, అత్యంతతిరస్కృతావివక్షిత వాచ్యధ్వని యని. అల్పవిషయమగుట మొదటగా లక్షణామూలధ్వని స్వరూప వివేచన మిందున్నది. ఈ యుపక్రమముతో నీ ప్రఘట్టము భావనీయము.

ధ్వనికావ్యమున నవివక్షితవాచ్య మను నే ధ్వని కలదో అందలి వాచ్యము రెండు విధములు — అర్థాంతరమున సంక్రమించిన వాచ్యము, అత్యంతము తిరస్కృతమయిన వాచ్యము నని. లక్షణామూల మగు గూఢవ్యంగ్యమునకు ప్రాధాన్య మున్నపుడె అవివక్షితవాచ్యధ్వనిభేద మగును. అర్థాంతరసంక్రమితవాచ్య మనగా, వాచ్యార్థము వాచ్యరూపమున ప్రకృతాన్వయమున నుపయుక్తము కానందున నావాచ్య మర్థాంతరమున పరిణత మగునేని యర్థాంతరసంక్రమితవాచ్య మగును. ఉదా :

యథా త్వాం వచ్మి విదుషాం సమవాయోఽత్ర తిష్ఠతి
ఆత్మీయాం మతిమాదాయ స్థితిమత్ర విధేహి తత్. 445

ఉపదేశాదిరూపేణ గమ్యతే వచనాది యత్
తదేవానుపపత్త్యాదేః క్వాప్యత్యంతతిరస్కృతమ్. 446

మయి చోపకృతం సుభ్రు సౌజన్యం ప్రథితం త్వయా
కుర్వీదృశం పరమపి సుఖమాస్వ శరచ్ఛతమ్,
అత్రాపకారిణీం చేటీం విపరీతలక్షణయా కథయతి. 457

అర్థాంతరసంక్రమితావివక్షితవాచ్య ధ్వన్యుదాహరణ మిచట మొదట నున్నది. విద్వత్సభ కేగు నొకని వాని యాప్తుడు పలుకుట. అసాధారణజ్ఞానము కల విద్వాంసుల సముదాయ మిట నున్నది —"నీవు నీ బుద్ధి ననుసరించి సావధాన స్థితి ననుసరింపుము, నీ వుపదేశార్హుడవు. నేనాప్తుడను. నేను చెప్పుచున్నాను.''

దీనిలో సంబోధ్యు నుద్దేశించి "త్వాం వచ్మి" అని చెప్పుట యుపయుక్తము కాదు. వక్తవ్యవిషయ కథనమునవె యది సిద్ధమగును. "నీవుపదేశ్యుడవు. నేనాప్తుడను. ఉపదేశింతును." అనునది యిందు లక్ష్యము. ఈ విధముగా వాచ్యము పరిణత మగును, హితసాధనత్వ మిచట వ్యంగ్యము.

అనంతర మత్యంతతిరస్కృతావివక్షితవాచ్యధ్వన్యుదాహరణ సమన్వయము లున్నవి. అత్యంతతిరస్కృత మనగా పూర్వము చెప్పిన విధమున వాచ్యము ప్రకృతమున నుపపన్నము కానందు వలన నత్యంతము తిరస్కృతమై యితరార్థలక్షక మగును. ఉదా : అపకార మొనరించిన చేటి నుద్దేశించి విపరీత లక్షణ విధానమున నాయిక యిట్లు పలుకుచున్నది - "ఓ సుభ్రువా! నావిషయమున నీవు బాగుగా నుపకార మొనరించితివి. సౌజన్యము ప్రకటించితివి. ఇటుపై కూడ నీ విట్లే చేయుము. నూరు సంవత్సరములు సుఖముండుము."

ఉపకృతం - అపకృతం, సౌజన్యము - దౌర్జన్యము, సుఖము - దుఃఖము అని లక్ష్యము. అపకారాద్యతిశయ మిందు వ్యంగ్య మగును. ఇట్లు లక్షణామూలకము లయిన అర్థాంతరసంక్రమితాత్యంతతిరస్కృతవాచ్యధ్వనులు రెండును నిదర్శితము లయినవి.

అభిధామూలక మగు ధ్వనికి వివక్షితాన్యపరవాచ్యధ్వని యని పేరు. ఇది రెండు విధములు - అసంలక్ష్యక్రమధ్వని, సంలక్ష్యక్రమధ్వని యని. ఈ భావసంగ్రహణమున నీ శ్లోకముల భావింప నగును.

వివక్షితం వ్యంగ్యనిష్ఠం వాచ్యం యత్ర ప్రకాశతే
తత్రాలక్ష్యక్రమవ్యంగ్యో లక్ష్యవ్యంగ్యక్రమః పరః. 458

రసస్తు న విభావాదిస్తై రేవాసావితి క్రమః
స చేన్న లక్ష్యః సోఽసంలక్ష్యక్రమవ్యంగ్య ఉదాహృతః- 459

రసభావతదాభాసభావశాంత్యాది రక్రమః
భిన్నో రసాద్యలంకారాదలంకార్యతయా స్థితః. 460

ఆభాసభావశాంత్యాదేః క్రమో నైవాత్ర లక్ష్యతే
తేషాం వ్యంగ్యక్రమే లక్ష్యే లక్ష్యవ్యంగ్య క్రమోభవేత్. 461

భావోదయాదిః ప్రాధాన్యాదలంకార్యతయా స్థితః
రసాదిర్యత్ర తత్రైష వ్యంగ్య ఏవ భవిష్యతి. 462

వివక్షితాన్యపరవాచ్య మనగా వివక్షితము అన్యపరము నగు వాచ్యము కలధ్వని. అన్యపరమగుట వ్యంగ్యనిష్ఠమగుట. వాచ్యార్థ మబాధితముగా నుపపన్నమగును. వ్యంగ్యపరము నగును. ఇట్టివి వివక్షితాన్యపరవాచ్యధ్వని యగును. ఇందు అలక్ష్యక్రమవ్యంగ్యము, లక్ష్యక్రమవ్యంగ్యము నని రెండు భేదములు గలవు. వాచ్యప్రతీతికిని వ్యంగ్యప్రతీతికిని మధ్య గల క్రమము సులక్ష మగునేని సంలక్ష్యక్రమ మని పేరు. క్రమమున్నను సూక్ష్మ మయినందున సుగ్రాహము కాదేని అసంలక్ష్యక్రమ మని పేరు. రసాదిధ్వని అసంలక్ష్యక్రమ నామమునను, వస్త్వలంకారధ్వని సంలక్ష్యక్రమనామమునను వ్యవహృతమగును. రసాదిధ్వని యందు క్రమ మున్నది కాని యది యత్యంతము సూక్ష్మ మయినందున, శతపత్ర పత్రశత వేధము వలె స్పష్టగోచరము కాదు. విభావాదులనే రస మని యనరు. విభావాదులచే రసప్రతీతి కలుగును. "న హి విభావాదయ

ఏవ రసః. అపి తు రసస్తైః. ఇత్యస్తి క్రమః''. విభావాదులు కారణములు. రసాదులు కార్యములు. కార్యమున కన్న నియతమగు కారణము పూర్వవృత్తి యగును. విభావాదిప్రతీతికిని రసాదిప్రతీతికిని క్రమము కలదు. అది సూక్ష్మ మగుటచే లక్ష్యమాణము కాదు. అందుననె యలక్ష్యక్రమవ్యంగ్యములు రసాదులని యనిరి. ఇవి యలక్ష్యక్రమములె కాని యక్రమధ్వనులు కావు.

రసము భావము రసాభాసము భావాభాసము భావశాంత్యాదులు అసంలక్ష్యక్రమవ్యంగ్యములని పరిగ్రాహ్యము. ఈ రసాదులు రసాద్యలంకారముల కన్న భిన్నములు. ఇవి యలంకార్యములు కాని యలంకారములు కావు. అలంకారము లప్రధానములు. అలంకార్యములు ప్రధానములు. రసభావముల ప్రతీతిక్రమము గోచరింపక పోవుటయె కాదు. ఆభాస భావశాంత్యాదులకును క్రమము లక్ష్యమాణము కాదు. కావున నవియు నసంలక్ష్యక్రమములె. కాని రసభావాదులు సర్వసమయముల నలక్ష్యక్రమములె కాదు. ఒకప్పు డవి సంలక్ష్యక్రమములు నగును. వాని వ్యంగ్యక్రమము లక్ష్యమాణ మగునేని యవి లక్ష్యక్రమవ్యంగ్యములె యగును. భావోదయము భావసంధి భావశాంతి భావశబలత యనునవి యభివ్యంగ్యము లగునపుడు ప్రాధాన్యము కలవై యలంకార్యములుగా నుండునేని ధ్వనివ్యవహారభాజనము లగును. రసాదిక మలంకార్యముగ నున్నను వ్యంగ్య మగును.

ప్రాధాన్యాద్యత్ర వాక్యార్థస్యాంగభూతో రసాదికః
కావ్యభేదో గుణీభూతవ్యంగ్య ఇత్యభిధీయతే 463

భావశాంత్యాదయోఽంగిత్వం రసే ముఖ్యే ప్రయాంతి చ
అర్థాంతరే సంక్రమితమత్యంతం వా తిరస్కృతమ్. 464

ఇతిద్వయం గుణీభూతవ్యంగ్యేఽంగాంగిత్వమేవ్యతః

ఇతరవాక్యార్థము ప్రాధాన్యముపొంది యుండగా రసాదిక మంగముగా నున్నచో నచట రసాదిధ్వని వ్యవహారము రాదు. రసాదిక మచట నలంకారమే యగును. అలంకార్యము కాదు. ఇట్లు ధ్వనికారుడు నిశ్చయించినాడు.

''ప్రధానేఽన్యత్రవాక్యార్థే యత్రాంగం తు రసాదయః
కావ్యే తస్మిన్నలంకారో రసాదిరితి మే మతిః.''

అని ధ్వనికారు డనెను. "అన్యవాక్యార్థము ప్రధానము కాగా రసాదు లంగము లగునేని యచట రసాదిక మలంకార మగునని నా నిశ్చయము." అని యానందవర్ధనుని నిశ్చయము. రసము స్వేతరము ప్రధానముగా నున్నప్పుడు ఒకరసము వర్ణిత మగునపుడు వేరొకరసము ప్రధానముగా నున్నను, భావము ప్రధానముగా నున్నను, ఇంక నేది ప్రధానముగా నున్నను ఆ రస మంగ మగును; ప్రధానము కాదు. కావున అలంకారముగా జెప్పదగినదె యగును.

రసాదిక మంగ మయినపుడు ధ్వనికావ్య మను వ్యవహారముండదు. అప్పుడు గుణీభూతవ్యంగ్య మనియె వ్యవహారము కలుగును. వ్యంగ్యము గుణముగా - అప్రధానముగా నయిన - గుణీభూత మయిన గుణీభూతవ్యంగ్య మని భావము. ఈ ప్రసంగముననె కావ్యభేదములను నిరూపింప వలసి యున్నది.

యత్రాతిశాయీ వ్యంగ్యోఽర్థో వాచ్యాత్కావ్యం ధ్వనిర్భవేత్. 465

ఇది ధ్వనికావ్య లక్షణము. వాచ్యార్థముకన్న వ్యంగ్యార్థము అతిశయితముగా నున్నచో ధ్వనికావ్య మగును. అభిధావృత్తి ప్రతిపాద్యమగు నర్థముకన్న వ్యంజనావృత్తిప్రతిపాద్యమగు నర్థము అధికచమత్కారజనకముగా నున్నచో ధ్వనికావ్య మని భావనీయము.

ఇట్టి కావ్యమునకు ధ్వని యను వ్యవహారము కలుగుటలో మూలభూత మగు నుపపత్తి నిరూపితము కావలయును. ధ్వని నిరుక్తి యపేక్షితము. ఆ సంజ్ఞ వలని విశేష మావశ్యకము.

ప్రధానభూతస్ఫోటాఖ్య వ్యంగ్యస్య వ్యంజకస్తు యః
శబ్దస్తత్ర ధ్వనిరితి వ్యవహారః కృతో బుధైః. 466

న్యగ్భావితవాచ్యస్య వ్యంగ్యస్య వ్యంజనక్షమం
శబ్దార్థయుగలం తచ్చ ధ్వనిరిత్యభిధీయతే. 467

ధ్వనిః స్యాదుత్తమం కావ్యం సప్రబంధః సుదుర్లభః

వ్యాకరణవిద్యావిదులగు బుధులు ప్రధానము స్ఫోటరూపము నగు వ్యంగ్యమునకు వ్యంజక మయిన శబ్దము ధ్వని యని వ్యవహార మొనరించిరి. ఈ వాదము నంగీకరించిన సాహిత్యప్రకాశులును వాచ్యార్థము నప్రధాన మొన

రించిన వ్యంగ్యమును వ్యంజన మొనరించుటలో సమర్థమగు శబ్దార్థయుగలమును "ధ్వని" యనిరి. ధ్వనికావ్య ముత్తమము. అదియె ప్రబంధము. ఇట్టిది సుదుర్లభము. ఇట్టి సామాన్యార్థము ననుసరించి యిచటి విశేషము నిట్లవధరింప వలెను. ఇచట నిర్దిష్టులయిన బుధులు వైయాకరణులు. "ప్రథమే హి విద్వాంసో వైయాకరణాః, వ్యాకరణమూలత్వాత్సర్వవిద్యానాం" సర్వవిద్యలు వ్యాకరణమూలములు. వైయాకరణులు ప్రథమ విద్వాంసులు. వైయాకరణులు స్ఫోటవాదము నంగీకరింతురు. వారి దృష్టిలో స్ఫోట ప్రధానము. అట్టి స్ఫోట రూపమయిన వ్యంగ్యమును వ్యంజన మొనరించు శబ్దమునకు వారు ధ్వని వ్యవహారము నంగీకరించిరి. ఈ వైయాకరణుల మతమును సాహిత్యవాదులు సంగీకరింతురు. సాహిత్యవిదులు శబ్దార్థయుగల మునకు ధ్వని వ్యవహారము నేర్పఱచిరి. ప్రధానముగ నవభాసించు వ్యంగ్యార్థమును వ్యంజన మొనరించుటలో సమర్థమయిన శబ్దార్థయుగలము వీరి మతమున ధ్వని. ఏతద్రూప మయినయుత్తమ కావ్యము ధ్వని. ధ్వని కావ్యమె ప్రబంధము.

## గుణీభూతము — చిత్రము

వాచ్యాదనతిశాయీ చ వ్యంగ్యోఽర్థో యత్ర దృశ్యతే. 468

తత్కావ్యం తు గుణీభూతవ్యంగ్యం తన్మధ్యమం భవేత్
యత్ర శబ్దస్య వైచిత్ర్యం యత్రార్థస్య విచిత్రతా. 469

యత్ర వ్యంగ్యం న ప్రతీతం తత్కావ్యమధమం స్మృతమ్

గుణీభూతవ్యంగ్యమను మధ్యమకావ్యము, చిత్రమను నధమకావ్యము లక్షిత మగును. వ్యంగ్యార్థము వాచ్యము కన్న నతిశయితము కాకున్నచో నది గుణీభూతవ్యంగ్యమను మధ్యమ కావ్య మగును. ప్రాధాన్య ముండుట వ్యంగ్యమునకు స్వాభావికమయిన స్వరూపము. అప్రాధాన్యముండుట యౌపాధిక రూపము. వ్యంగ్య మప్రధాన మగుట యనేకవిధముల నుండును. వాచ్య వ్యంగ్యములు రెండును సమప్రధానము లయినచో వ్యంగ్యమునకె ప్రాధాన్య మున్నట్లుకాదు. అచట వ్యంగ్యమునకు వాచ్యాతిశాయిత లేదు. వ్యంగ్యము సర్వప్రధాన మయినవె ధ్వనికావ్యము. అట్లు కాకున్న మధ్యమకావ్య మని వివేకము.

అధమకావ్యమునకు చిత్రకావ్య మని పేరు. దీని లక్షణము అవ్యంగ్య మనుట. "యత్ర వ్యంగ్యం న ప్రతీతం" వ్యంగ్య మిందు భాసింపదు. వివక్షిత రూపమున వ్యంగ్యము భాసించదు. శబ్దవైచిత్ర్యమె ముఖ్యమగును. అర్థవిచిత్రతయె ముఖ్యమగును. దేవన్నృపాదుల యాకృతి జ్ఞాపనమునకై చిత్రముల లిఖింతురు. చూచువారి చిత్త మాకృష్ట మగును. అనుక్షణమున వారి స్మృతిలో దేవాదులు భాసింతురు. అట్లె యీ కావ్యమును. ఇందు ప్రాణమన దగిన వ్యంగ్యముండదు. వెంటనే యాస్వాదము కలుగ జేయుటకు కవి గుణాలంకారముల నిబంధించును. శబ్దములను బింకముగా గూర్చును. శబ్దవైచిత్ర్య మున్నచో శబ్దచిత్రమని, అర్థవైచిత్ర్యమున్నచో నర్థచిత్రమని సంకేతము. శబ్దభాగమున అర్థభాగమున చిత్రతయుండునే గాని రసాదు లుండవు.

ఇట్లు కావ్యత్రయము లక్షిత మయినది. ఇందుత్తమకావ్యమయిన ధ్వనికావ్యమున విశేషములు కలవు.

అనుస్వానాభసంలక్ష్యక్రమవ్యంగ్యస్థితిస్తు యః. 470
శబ్దార్థోభయశక్త్యుత్థః త్రిధా స కథితో బుధైః

అభిధామూలకమగు వివక్షితాన్యపరవాచ్యధ్వని యందలి సంలక్ష్యక్రమవ్యంగ్య మనుస్వానాభము - అనురణనాత్మకము అందురు. "అనుసృత్య స్వనతీతి, అనుసృత్య రణతీతి" అనుసరించి స్వనించును రణించును. కాంస్యఘంటానినాదమున ధారావాహిక మయిన ధ్వని యుండును. ఒకధ్వని ననుసరించి వేరొక ధ్వని యుండును. అందువలన నట్టి నామము సంగత మయినది. ఈ సంలక్ష్యక్రమధ్వని శబ్దశక్తిసముద్భవము, అర్థశక్తిసముద్భవము, ఉభయశక్తిసముద్భవము నని మూడు విధములు. వాని పేరు లిట్లు శ్లోకబద్ధము లయినవి.

యః శబ్దశక్తిమూలానురణనాత్మా స చ ధ్వనిః. 471
తథార్థశక్తిమూలానురణనాత్మాపి చ ధ్వనిః
శబ్దార్థశక్తిమూలానురణనాత్మాపి చ ధ్వనిః. 472

శబ్దశక్తిమూలానురణనాత్మకధ్వని వివేచనమునకు సంయోగవిప్రయోగాదులను, అర్థశక్తిమూలానురణనాత్మకధ్వనివివేచనమునకు వక్తృబోద్ధవ్యాదివిశేషములను గుర్తింపవలసి యున్నది. శబ్దశక్తిలో శబ్దము పరివృత్త్యసహము, అర్థశక్తిలో పరివృత్తిసహము అను విశేషము పూర్వము సూచిత

మయినది, శ్లిష్టశబ్దము అశ్లిష్టశబ్దములు సమముగ నున్నచో నుభయశక్తిమూలక మని యౌచిత్యమున గ్రహింపదగును.

అలంకారోఽథ వస్త్వేవ శబ్దాద్యత్రావభాసతే
పరస్పరస్య ప్రాధాన్యాత్రప్రధానేతరకల్పనా. 472
వ్యంగ్యే రసాలంకారాదౌ ధ్వనికావ్యం తదుత్తమం
స చేల్లక్ష్యో భవేన్మధ్యస్తస్మిన్వాచ్యే తథాఽధమః. 474

శబ్దశక్తి మూలానురణన రూపవ్యంగ్యము రెండు విధములు — శబ్దశక్తిమూలాలంకారధ్వని, శబ్దశక్తిమూలవస్తుధ్వని యని. ఈ విభాగ మిందున్నది. ఏ కావ్యము నందు పరివృత్త్యసహమయిన శబ్దము వలన ఉపమాద్యలంకారము భాసించునో, పరివృత్త్యసహ మయిన శబ్దమున కేవలము వస్తుమాత్రమె యవభాసించునో అచట అలంకారధ్వని, వస్తుధ్వని యని విభాగము గుర్తింప వలెను. అలంకారమేని వస్తువేని ప్రధానముగ నభివ్యంగ్యము కావలెను. అలంకార మనునది సచిత్రవస్తువు. వస్తురహితము కాదు. వస్తు వనునది యచిత్రవస్తువు. అలంకారము వస్తుమిశ్రితముగనె యుండును. వస్తు వలంకారము భాసించునపుడు ఒకప్పు డలంకారము ప్రధానముగ నుండును. వేరొక సమయమున వస్తువె ప్రధానముగ నుండును. వస్తు వలంకారము ప్రధానముగ వ్యంగ్య మయినపుడె ధ్వని యనవలెను. అలంకారము ప్రధాన మయినపుడు వస్తు వప్రధాన మగుటయు, వస్తువు ప్రధాన మయినపు డలంకార మప్రధాన మగుటయు నభ్యూహ్యము. వస్తుమాత్రమున నలంకారము వ్యజ్యమాన మగునపుడు ధ్వని యని వ్యవహరించుట యుక్తము. కావ్యవృత్తి యలంకారాశ్రయము గావున నట్లు వ్యవహారము యుక్తము. అలంకారముచే వస్తు వభివ్యజ్యమాన మగునపుడు, అలంకారమునకు చారుత్వాతిశయము కలదో వస్తువునకు చారుత్వోత్కర్షము కలదో సమీక్షించి నిర్ణయింప వలెను.

రసాలంకారాదులు వ్యంగ్యము లగునపు డుత్తమ మగు ధ్వనికావ్య మని వ్యవహరింపవలెను. వస్త్వలంకారము లప్రధానముగ భాసించునవి యగునేని గుణీభూతమను మధ్యమకావ్య మగును. అవి వాచ్యములె యగునేని యధమకావ్యవ్యవహారమె కలుగును.

అగూఢమపరస్యాంగం వాచ్యసిద్ధ్యంగమస్ఫుటం
సందిగ్ధతుల్యప్రాధాన్యే కాక్వాక్షిప్తమసుందరమ్. 475

వ్యంగ్యమేవం గుణీభూతవ్యంగ్యస్యాష్టౌ భిదాః స్మృతాః
ఉదాహరణమేతేషాం కావ్యబంధేషు దృశ్యతే. 476

ఏవం ధ్వనికృదాచార్యైః వ్యంగ్యభేదాః సమీరితాః
స్వరూపముక్తం వాచ్యాదేస్తత్తద్భేదాశ్చ దర్శితాః. 477

గుణీభూతవ్యంగ్యరూపమయిన మధ్యమకావ్యమున నెనిమిది భేదములు కలవు అగూఢము - అపరాంగము - వాచ్యసిద్ధ్యంగము - అస్ఫుటము - సందిగ్ధము - తుల్య ప్రాధాన్యము - కాక్వాక్షిప్తము - అసుందరము నని. గుణీభూత వ్యంగ్యమగు వ్యంగ్య మిట్లష్టభేదములు కలదిగా నిర్ణీత మయినది. కావ్యబంధములలో వీనికి సముచితోదాహరణములు కలవు. వాని నాయాస్థలములలో సమన్వయించుకొనునది.

ధ్వనికృదాచార్యులగు శ్రీరాజానక ఆనందవర్ధనులు మమ్మటభట్టు మొదలగు వారు వ్యంగ్యభేదములను నిరూపించిరి. వారి మతానుసారమున నివి యిట్లు సముల్లిఖితము లయినవి. ఉపక్రమము నందలి సూచనానుసారముగా వాచ్యాదుల స్వరూపము ప్రతిపాదిత మయినది. తత్తద్భేదములును ప్రదర్శితము లయినవి.

## తాత్పర్యార్థము

ఏతేభ్యోఽన్యత్తు తాత్పర్యం వాక్యార్థోఽస్తీతి జానతే
ఏతేభ్యోఽన్యస్తు కథితస్తాత్పర్యార్థోఽపి కేషుచిత్. 478

సమన్వయే పదార్థానాం పదార్థోఽపి చ తత్త్వతః
విశేషరూపో వాక్యార్థస్తాత్పర్యమితి మన్యతే. 479

పదార్థా యే పదానాం స్యురన్వితానాం పరస్పరం
త ఏవ వాక్యార్థాత్మానో నాన్యోఽర్థోఽస్తీతి కేచన. 480

సర్వస్యైవ చ శబ్దస్య స్వార్థవృత్తివిభాగతః
తాత్పర్యార్థో భవేచ్ఛ్రోతుః వివేక్తుః ప్రీతికారకః. 481

ఇంతవఱకు నిరూపించిన వాచ్యలక్ష్యవ్యంగ్యములకన్న నతిరిక్తముగా తాత్పర్య మనునది కలదని, యది వాక్యార్థరూపమని కొందరంగీకరించిరి. వీని కన్న నతిరిక్తముగా తాత్పర్యార్థము కలదని కొందరి భావములలో గలదు. ఈ

విషయ మిదివరలో సూచితమె. పదార్థముల కాకాంక్షాదికమున సమన్వయము కలిగిన పిమ్మట విశేషరూపమగు వాక్యార్థము సముల్లసించునని, యది తాత్పర్యరూప మని కొందరు తలచిరి. అది తత్త్వతః పదార్థరూప మయినను - పదార్థముల సముదాయాత్మక మయినను విశేషరూపముగా నుండునని వారి యాశయము. ఇది యభిహితాన్వయవాదిమతము. మరికొందరు అన్వితాభిధానవాదులు పరస్పరమన్వితము లయిన పదముల యర్థములె వాక్యార్థాత్మకములని, అంతకన్న నతిరిక్తముగా తాత్పర్యార్థ మనునది లేదని యనిరి. కాని యీ విషయమును భావింపవలెను. సర్వశబ్దమునకు స్వార్థవృత్తి విభాగమున తాత్పర్యార్థ మనునది కలదు. అది శ్రోతకు వివేక్తకు ప్రీతికారకముగ నుండును. ఇట్లు నిరూపితమయిన ప్రాక్తనార్థమును ప్రకృతమున స్మరించుట సముచితము.

శ్రోతృత్వం తదితి ప్రాహుః శబ్దతాత్పర్యవేదినః
శబ్దశక్తిమహిమ్నా యద్వ్యంగ్యాద్యర్థవివేచనమ్. 482

తదేవ చ వివేక్తృత్వం ఆహురర్థవివేచకాః
వ్యంగ్యతాత్పర్య తద్భేద శబ్దశక్తి నిరూపణమ్. 483

తాత్పర్యము శ్రోతృ వివేక్తృ ప్రీతికారక మనుటలో శ్రోతృక్త్వస్వరూపము నిరూపింపవలసి యున్నది. శబ్దశక్తిమహిమానుసారమున వ్యంగ్యాద్యర్థములను వివేచన మొనరించి గ్రహించుట శ్రోత్వతృ మగునని శబ్దతాత్పర్యవేదు లందురు. వ్యంగ్యతాత్పర్యతద్భేదముల యనుసారమున శబ్దశక్తినిరూపణ మొనరించుట వివేక్తృత్వ మగునని యర్థవివేచకు లందురు. శ్రోతృత శబ్దముఖముగా నుండునని, వివేక్తృత యర్థముఖముగా నుండునని గ్రహింపవచ్చును. శబ్దము యొక్క స్వార్థవృత్తి విభాగానుసారమున నావిర్భవించు తాత్పర్యార్థము నిట్టి శ్రోతృవివేచకులు ప్రీతిపురస్సరముగ సంభావింతురనుట యుక్తముగ నున్నది.

కవేర్వివక్షితార్థోయః తత్తాత్పర్యముదాహృతం
తాత్పర్యస్య స్వరూపం యత్తద్విశేషశ్చ తద్భిదా. 484

యథావగతమస్మాభిః పరస్తాత్కథయిష్యతే

కవివివక్షితార్థము తాత్పర్యము. తాత్పర్యస్వరూపమును తద్విశేషమును తద్భేదములను మేము గుర్తించిన విధమున ననంతరగ్రంథమునందు విశద

మొనరింతుము. ఇదివరలో కొంత నిరూపిత మయినను మఱల నిరూపించుట యావశ్యకము.

ఇత్థం కల్పలతాయాం తు వాచ్యాద్యర్థచతుష్టయమ్. 485

నిర్ణీతం వాచకాదేశ్చ శబ్దస్యాపి చతుష్టయం
తచ్చ కావ్యప్రకాశేన మయాప్యత్ర ప్రదర్శితమ్. 486

కల్పలతాగ్రంథము నందు వాచ్యాద్యర్థచతుష్టయ మీ విధముగ నిర్ణీత మయినది. వాచకాదిశబ్దచతుష్టయము నిరూపితమయినది. ఈయంశము కావ్యప్రకాశప్రతిపాదితము. వాని యనుసారమున నేను నిందు ప్రదర్శించితిని. ఇట్టిది యుక్తిప్రమాణసిద్ధ మగుటచే కవితాకాము లాదరింప దగును.

## గుణాదులు

దోషా గుణాశ్చాలంకారాః శబ్దార్థోభయరూపతః
క్వచిద్రసాశ్చ తద్యోగ్యా యోగ్యతాత్ర విచార్యతే. 487

ఆక్షేపతః సమాధానాదర్థేష్వతిశయో భవేత్
ఆక్షేపశ్చ సమాధానమతోఽర్థస్యాభిధీయతే. 488

శబ్దార్థగతములుగా దోషములు గుణము లలంకారములు ప్రతిపాదితములు. రసములును శబ్దార్థగతములుగా నుండుట యొకచో నిరూపితము. అస్తు. తద్యోగ్య మయిన యోగ్యత యెట్టిదో యిచట పరిశీలింపదగును. ఆక్షేపమున సమాధానమున నర్థములందలి యతిశయము విశదమగును. కావున నాయా యర్థతత్త్వసమున్మీలనమునకై యాక్షేపము సమాధానము నిచట ప్రతిపాదిత మగును.

స్వతః శుద్ధస్య వర్ణస్య కో దోషః కో గుణో భవేత్
రసాదేరాశ్రయత్వం తదమూర్తస్య కథం భవేత్. 489

విభుత్వాత్తస్య వర్ణస్య క్వాచిత్కత్వం కథం భవేత్
అలంకారోఽపి నైవ స్యాదలంకార్యావినిశ్చయాత్. 490

దోషాదేరాశ్రయో వర్ణః పదం వాఽథ కిముచ్యతే
వాక్యం వా కిమలంకారో నైవ వర్ణస్య యుజ్యతే. 491

పదే చేత్తత్పదం కీదృక్ తత్స్వరూపం నిరూప్యతాం
వర్ణః పదం కిం వర్ణౌ వా వర్ణా వా పదముచ్యతే. 492

అవ్యాప్తేరప్యతివ్యాప్తేః పదం దుష్యతి లక్షణే
సుప్తిఙన్తం పదమితి యది స్యాత్పదలక్షణమ్. 493

సుబంతం పదమస్తీతి తిఙన్తమపిచాపరం
సముచ్చయేన న పదం సుప్తిఙన్తాత్మకం భవేత్. 494

లక్షణం వ్యభిచారి స్యాదతివ్యాప్త్యాదిదోషతః
పదే వాక్యే చ వాక్యార్థే దోషః కీదృక్స్వరూపవాన్. 495

స్థానే పదాదౌ న గుణః కీదృగాత్మా చ వర్తతే
వాక్యస్య లక్షణం కీదృక్తస్య దోషాదయో యది. 496

సమూహో యః పదానాం తు తద్వాక్యమితి లక్షణం
వాక్యం ద్వాభ్యాం త్రిచతురైః పంచషట్సప్తభిశ్చ వా. 497

అష్టభిర్వా భవేత్తస్మాల్లక్షణం వ్యభిచారి తత్
ఏకప్రయోజనాభావాదన్యథా వాక్యలక్షణమ్. 498

దోషో గుణో వాలంకారో రసో వాఽథ కదాచన
పదే వాక్యే చ వాక్యార్థే న హి శబ్దాత్మకో భవేత్. 499

ఆశ్రయాశ్రయి సంబంధో న భవేచ్ఛబ్దయోః క్వచిత్
అథ తద్వ్యతిరేకశ్చేద్దోషాదిరిహ కథ్యతే. 500

భిన్నాధికరణత్వేన సంబంధో న ఘటిష్యతే
అతో దోషాదయః శబ్దే వ్యర్థాః స్యుః కల్పితా అపి. 501

శబ్దార్థగత దోషగుణాలంకారస్థితి యాక్షేపసమాధానవిధానముల విశద మొనరింపదలచి యిచట ఆక్షేప ముపపాదించుట నిట్లు గుర్తింపవలెను వర్ణము స్వతః శుద్ధము. ఆ వర్ణమునకు దోష మేమి? గుణ మేమి? అమూర్త మయిన వర్ణమునకు రసాశ్రయత్వ మెట్లుపపన్న మగును? వర్ణము విభువు. సర్వవ్యాపి. అది యొకచో నుండు ననుట యెట్లు కుదురును? అలంకార్య నిశ్చయము లే నందువలన నలంకారము నుండదు.

దోషాదుల కాశ్రయము వర్ణమా? పదమా? వాక్యమా? అలంకార మనునది యేమి? అది వర్ణమునకు యుక్తము కాదు కదా! పదమున దోషాదు

లుండు నందురేని పద మన నెట్టిదో దాని స్వరూపమును నిరూపింపవలెను. ఒక వర్ణము పద మగునా? రెండు వర్ణము లున్న పద మగునా? అనేకవర్ణము లున్ననే పద మన వలెనా?

పదమునకు లక్షణ మేమి? ఏమేని లక్షణ మున్ననది యవ్యాప్తి దోషదుష్ట మగును. అతివ్యాప్తిదోషదుష్ట మేని యగును. "సుప్తిఙన్తం పదం'' అని వ్యాకరణ సూత్రము. సుబంతము తిఙంతము పదమని కదా ఇదియే పదలక్షణమా? సుబంతము పదము. తిఙంతము పదము. సుబంతములో తిఙంతత్వము లేదు. తిఙంతములో సుబంతత్వము లేదు. సముచ్చయ రూపమున సుబంత తిఙంతాత్మకముగా పద ముండదు. ఇక పదలక్షణ మేమి? అతివ్యాప్త్యాదిదోషముల వలన లక్షణము వ్యభిచరిత మగుచున్నది.

పదమున వాక్యమున వాక్యార్థమున దోష మెట్టి స్వరూపమున నుండును? పదాదిస్థానమున గుణముండు నందురేని యా గుణ మే యాకారమున నుండును? వాక్యమున దోషాదు లుండునందురేని వాక్యలక్షణ మేమి? "పదముల సమూహము వాక్యము" అని వాక్యలక్షణమా? రెండు పదము లున్న వాక్య మగునా? మూడు నాలుగు పదములతో వాక్యము సిద్ధ మగునా? ఐదు పదము లున్న వాక్యమా? షట్సప్తపదములతో వాక్యము నిష్పన్న మగునా? అష్టపదములున్న వాక్యమగునా? కాన పదలక్షణము కుదురలేదు. అది వ్యభిచరిత మగుచున్నది. పదసమూహము వాక్య మను లక్షణము యుక్తముగ లేదు. దాని వలన ప్రయోజనమును లేదు. కావున వాక్యలక్షణ మును వేరుగా జెప్పవలెను.

పదమున వాక్యమున వాక్యార్థమున దోషము గుణము అలంకారము రసము నెప్పుడు నుండనే యుండవు. దోషాదికము శబ్దాత్మకము కాదు. శబ్దముల కెచ్చటను ఆశ్రయాశ్రయిభావ ముండదు. దోషాదికము శబ్దాత్మకము కాక తద్భిన్న మయినచో భిన్నాధికరణ మయినందున తత్సంబంధమె యుపపన్నము కాదు. కావున దోషాదులు శబ్దమున కల్పితము లయినను వ్యర్థములె. ఈ విధముగా నిచట ఆక్షేపార్థము గుర్తింప వలెను.

ఇతి బ్రువంతముద్దిశ్య తత్సంబంధోఽభిధీయతే
వక్తృసంబంధవశతః శబ్దే దోషాదికల్పనా. 503

దోషాదిర్వక్తృధర్మః స్యాద్వక్త్రధీనతయాస్య హి
స్వార్థే స్వవృత్త్యయోగ్యత్వం యేన శబ్దస్య దృశ్యతే. 503

స దోషః కథ్యతే వక్తృప్రయోగాధీన ఏవ సః
స్వార్థే స్వవృత్తియోగ్యత్వద్వారా శబ్దస్య యద్భవేత్. 504

ప్రత్యాయకత్వసామర్థ్యసౌలభ్యం స గుణో భవేత్
వాచ్యాద్యతిశయో యేన దృశ్యతే శబ్దహేతుకః. 505

స ఏవార్థగుణోఽజ్ఞేయః తత్తదర్థేషు దృశ్యతే
యేఽర్థా ఇవాదిశబ్దానాం తేఽలంకారా ఇతి స్మృతాః. 506

ప్రయుంజతే తాన్కవయః శబ్దార్థోభయరూపతః
కవిప్రయోగచాతుర్యాత్స నీరక్షీరవద్రసః. 507

శబ్దార్థేషూపయుజ్యేత ప్రాయో వ్యంగ్యస్స సర్వదా
వర్ణే గుణో న దోషో వా తే స్యాతాం పదవాక్యయోః. 508

రసాదయోఽపి వాక్యాదిప్రబంధేషూపయోగినః
కవిసందర్భవశతో దృశ్యంతే యత్రతత్రతః. 509

తస్మాదమీ వక్తృధర్మా నైతే స్యుః శబ్దగోచరాః
వక్తుర్వివక్షాధీనం యచ్ఛబ్దే దోషాధిరోపణమ్. 510

తస్మాద్దోషాదయో వక్తృపరాధీనా న శబ్దగాః
తస్మాదలంకృతిగుణరసవత్కావ్యనిర్మితిః. 511

ధ్వనిరూపైవ కర్తవ్యా నిర్దోషా కీర్తిసంపదే

పూర్వప్రఘట్టమున ఆక్షేపవిధానము సూచిత మయినది. అట్లు పలుకు వాని నుద్దేశించి తత్సంబంధ మిచట నిరూపిత మగును. శబ్దమున దోషాది కల్పనము వక్తృసంబంధవశమున సిద్ధము. దోషాదులు వక్తృధర్మములు. దోషాదులు వక్త్రధీనములుగ నుండును. శబ్దము స్వార్థమున స్వవృత్త్యయోగ్య మయినచో నది దోషమగును. అదియు వక్తృప్రయోగాధీనము. గుణ మీ విధముగ భావనీయము. శబ్దమునకు స్వార్థమున స్వవృత్తి యోగ్యతావ్యాపారముగా ప్రత్యాయకత్వసామర్థ్య సౌలభ్య ముండుట గుణ మగును. ఇట్టి గుణము

నందు శబ్దహేతుక మయిన వాచ్యాద్యతిశయము గోచరించును. ఆ యా యర్థము లందాయా యతిశయము భాసించును. దాని నప్పు డర్థగుణ మందురు. ఇవాదిశబ్దములకు సంబంధించిన యర్థము అలంకారము అగునని పరిగణించిరి.

ఇట్లు దోషగుణాలంకారములు వక్తృధర్మములు వక్త్రాధీనములుగ నున్నవి. వీనిని కవులు శబ్దార్థోభయరూపముగ ప్రయోగించు చున్నారు. కవి ప్రయోగచాతుర్యము వలన రసము నిరతిశయరూపమున శబ్దార్థములం దుపయుక్త మగును. సామాన్యముగా సర్వదా యీ రసము వ్యంగ్యమె యగును.

వర్ణమున గుణ ముండదు. దోష ముండదు. పదవాక్యములందు నా గుణదోషము లుండవు. వక్తృవివక్షాధీనములుగనె యవి యుండును.

వాక్యాదిప్రబంధములలో రసాదులును కవిసందర్భవశమున నుపయోగులుగా నుండుట గోచరించుచునే యున్నది. కావుననె రసాదులు వక్తృధర్మములు. శబ్దగోచరములు కావు. శబ్దమున దోషాధిరోపణము వక్తృవివక్షాధీనముగనె యుండును. కావున దోషగుణాలంకారములు వక్తృపరాధీనములె కాని శబ్దగతములు కావు.

ఇట్లున్న విషయమును సమగ్రముగ సమాకలన మొనరించి దోషరహితముగా నలంకారసహితముగా గుణయుతముగా రసవత్కావ్యనిర్మాణ మొనరించుట యుక్తము. అట్టి కావ్యనిర్మితి ధ్వనిరూపముగనే యుండదగును. నిర్దోషముగ నుండవలెను. అట్లున్ననె కీర్తిసంపాదకమగును. ఇట్టి యంశ మాక్షేప సమాధానరూపమున నిరూపిత మయినది.

ధ్వనిర్నిరూప్యతేఽతైవ వ్యంజకత్వేన చోదితః. 512

క్రమేణోచ్చార్యమాణేషు వర్ణేష్వర్థస్య వాచకః
ఆదిమః కిం ద్వితీయః కిం తృతీయః కిం తథాఽంతిమః. 513

ప్రత్యాయకత్వశక్తిస్తు కస్మిన్నేతేషు దృశ్యతే
క్రమేణ శ్రూయమాణత్వాద్వర్ణానాం నశ్వరత్వతః. 514

సముచ్చయేన వర్ణానాం వాచకత్వం న యుజ్యతే
సాపేక్షత్వాదాదిమస్య స్వార్థే వృత్తిర్న జాయతే. 515

మధ్యమానామపి స్వార్థప్రతీతౌ స్యాదనిశ్చయః
అంతిమశ్చేదథైకస్య సంబంధోఽనర్థకో భవేత్. 516

అర్థాసంస్పర్శితై వాస్మాద్ధేతోః శబ్దస్య నిశ్చితా

ధ్వనికావ్యప్రశంస సూచిత మయినది. ధ్వని స్ఫోటరూపము. ఈ విష యమును నిశ్చయపరచుటకై పూర్వము వలె నాక్షేపసమాధానములు స్వీకృతము లయినవి. ముందుగా నాక్షేపసరణి నిట్లు గుర్తింప వలెను. వ్యంజకత్వపథమున సూచిత మయిన ధ్వని యిచట నిరూపిత మగును. ఒకపదము నందలి వర్ణములు క్రమముగా నుచ్చార్యమాణము లగుచుండగా నచట నర్థమునకు వాచక మగు నది యేది? ఆదిమవర్ణ మర్థమునకు వాచకమా? ద్వితీయవర్ణము వాచకమా? తృతీయమా? అంతిమ వర్ణమా? ఇన్నిగా నున్న యీ వర్ణములలో నే వర్ణము నందర్థప్రత్యాయకశక్తి యున్నది? వర్ణములు సముదాయరూపమున నర్థము నకు వాచకము లనుట యుక్తము కాదు. ఆ పదమునందలి వర్ణములు క్రమ ముగా శ్రూయమాణము లగుచున్నవి కాని యేకకాలమున శ్రుతము లగుట లేదు. రెండవవర్ణ ముచ్చార్యమాణ మగునప్పటికి మొదటి వర్ణము నశించుచున్నది. శబ్దము రెండు క్షణముల యనంతర ముండదు. పదమున నుచ్చార్యమాణము లగు వర్ణములు సాపేక్షము లయినందున మొదటి వర్ణమునకు స్వార్థమున వృత్తి యుండు ననుట యుక్తము కాదు. మధ్యగతములుగా నున్న వర్ణములకును స్వార్థప్రతీతిలో సామర్థ్యముండు నన్న నిశ్చయములేదు. అంతిమవర్ణమె యర్థ సమర్పక మగుననుటయు యుక్తము కాదు. అనేకవర్ణము లుండగా నొక యంతిమ వర్ణమునకె సంబంధమున్నదనుట యనర్థకము ఇట్లీ విధముగా బరిశీ లింపగా శబ్దమున కర్థసంస్పర్శిత లేదనియె యనవలసి వచ్చుచున్నది. కావున పదమున కర్థవాచకత యుపపన్నముగ లేదు.

ఈ యాక్షేపనిరాసమునకు తరువాతి గ్రంథము సమర్థము. ఈ యంశ మిదివరలో నిరూపితప్రాయ మయినను ప్రకృతాంశదార్ఢ్యాపాదమునకై పునర్ని రూపణ మపేక్షితము.

మైవం మన్యస్వ! శబ్దస్య స్వార్థసంస్పర్శిత్వముచ్యతే. 517

అర్థప్రతీతిః శ్రోతౄణాం శబ్దోచ్చారాదనంతరం
జాయతే తస్య హేతుర్యః సోఽర్థాపత్తిప్రమాణకః. 518

స వర్ణవ్యతిరేకాత్మా కోఽపి స్యాత్సోఽపి చ ధ్వనిః
ధ్వనిః సామాన్యరూపః స్యాద్వర్ణాః తద్వ్యక్తయః స్మృతాః. 519

స వర్ణవ్యంజనద్వారా తమర్థం వ్యంజయేత్స్ఫుటం
స ధ్వనిః స్ఫోట ఇత్యత్ర శాబ్దికైః పరిభాష్యతే. 520

ఇత్థం శబ్దార్థ సంబంధో ధ్వనికృద్భిర్నిరూపితః
తదుక్తేన ప్రకారేణ సంక్షేపాదత్ర దర్శితః. 521

ఇతి శ్రీశారదాతనయవిరచితే భావప్రకాశనే శబ్దార్థసంబంధతద్భేద ప్రకారనిర్ణయో నామ షష్ఠోఽధికారః సమాప్తః.

శబ్దమున కర్థస్పర్శిత్వము లేదని తలప వలదు. శబ్దమునకు స్వార్థ సంస్పర్శిత్వము కలదు. అది యిచట నిరూపిత మగును శబ్దము నుచ్చరించిన పిమ్మట శ్రోతల కర్థప్రతీతి కలుగును. అట్లు ప్రతీతికలుగు ననుటలో నర్థాపత్తి ప్రమాణక మయిన హేతువు కలదు. పదమును వినిన యనంతర మర్థప్రతీతి కలుగుచున్నది కావున వేరొక విధముగా నా యర్థప్రతీతి యుపపన్నము కానందున నా శబ్దముననె యా యర్థప్రతీతి కలుగుచున్న దని నిశ్చయింప వలెను. ఆ హేతువు వర్ణముల కన్న నతిరిక్తమయినదని గ్రహింప వలెను. అదియే ధ్వని. వర్ణము లందలి యాధ్వని సామాన్యరూపము. వర్ణము లా సామాన్యరూపమున కాశ్రయరూపము లయిన వ్యక్తులు. అట్లు సామాన్యరూప మయిన యా ధ్వని వర్ణవ్యంజనద్వారమున నా యర్థమును స్ఫుటముగా వ్యంజన మొనరించును. ఆ ధ్వనియె స్ఫోటము. ఇట్టివిధముగా శాబ్దికులు పరిభాషించిరి. ఆ వైయాకరణుల స్ఫోటవాదమును సాహిత్యకులు నంగీకరించిరి. ఇట్టి శబ్దార్థ సంబంధమును ధ్వనికారులు నిరూపించిరి. ధ్వనికారు డయిన శ్రీ మదానంద వర్ధనుడు నిరూపించిన ప్రకారమున సంక్షేపముగా నిచట నిదర్శిత మయినది. ఆనందవర్ధన ధ్వన్యాలోకము సాహితీజగమున మూర్ధన్య మయిన గ్రంథము. తదుక్తమార్గానుసారమున నిరూపణ మిందున్నందున నిది సముపాదేయగ్రంథ మని భావము.

ఇది శ్రీ శారదాతనయ విరచితమైన భావప్రకాశమునందు భావాలోకమున
శబ్దార్థసంబంధ తద్భేద ప్రకార నిర్ణయ మనెడి
షష్ఠాధికారము.

# సప్తమాధికారము

## నాట్యేతివృత్త శరీరలక్షణాభిధానము

### నాట్యము

ఈ యధికారమునకు నాట్యేతివృత్తశరీరలక్షణాభిధాన మని నామము కలదు. నాట్య నృత్య నృత్తముల స్వరూపము ప్రతిపాదించిన పిమ్మట తత్సంబద్ధముగా గేయనిరూపణ మావశ్యకము కాగా షట్త్రింశత్తత్త్వములను చెప్పి సృష్టికథనమున శారదాతనయు డుత్సుకము పడెను. దేహోత్పత్తి నాద శ్రుతి స్వర సముత్పత్తి నిరూపించెను. ఈ ప్రసంగమున సంగీతశాస్త్రవిశేషముల నిరూపించుట యావశ్యక మయినది. ఉపక్రమించిన గేయస్వరూపము చెప్పి విశేషముల నింకను తన శారదీయగ్రంథమున నుపపాదించుటను సూచించెను. అనంతరము నటుని కర్తవ్యతానిరూపణము పూర్వాంగము నాంది సూత్రధారుడు తద్విధులు ప్రతిపాదితము లయినవి. నాటకవస్తువు విభాగము పంచ సంధులు ప్రయోజనములు ప్రసంగాగతము లయిన యితరవిశేషము లిందు సాధికారముగా నిరూపితము లయినవి. నాట్యోచితము లయిన వివిధవిషయముల వివేకమున కీ సప్తమాధికారము చక్కగా సహకరించును.

ఉక్తా రసా రసవ్యక్తిర్నాట్యేనైవేత్యుదీరితా
అవస్థానుకృతిర్నాట్యమితి సామాన్యలక్షణమ్. 1

రామాదితాదాత్మ్యాపత్తిర్నటే యా నాట్యముచ్యతే
రూపకం తద్భవేద్రూపం దృశ్యత్వాత్ప్రేక్షకై రిదమ్. 2

రూపకత్వం తదారోపాత్కమలారోపవన్ముఖే
దశధైవేతి మునినా తద్భేదనియమః కృతః. 3

రసాశ్రయత్వమప్యుక్తం రసాదేరాశ్రయత్వతః
తదేవం దశధా భిన్నం వాక్యార్థాభినయాత్మకమ్. 4

ఈ సప్తమాధికారము నాట్యము నితివృత్తమును నిరూపించునది కావున నిచట నాట్యసామాన్యలక్షణము ప్రతిపాదిత మగును. రూపక నిర్వచనము

స వర్ణవ్యంజనద్వారా తమర్థం వ్యంజయేత్స్ఫుటం
స ధ్వనిః స్ఫోట ఇత్యత్ర శాబ్దికైః పరిభాష్యతే. 520

ఇత్థం శబ్దార్థ సంబంధో ధ్వనికృద్భిర్నిరూపితః
తదుక్తేన ప్రకారేణ సంక్షేపాదత్ర దర్శితః. 521

ఇతి శ్రీశారదాతనయవిరచితే భావప్రకాశనే శబ్దార్థసంబంధతద్భేద ప్రకారనిర్ణయో నామ షష్ఠోఽధికారః సమాప్తః.

శబ్దమున కర్థస్పర్శిత్వము లేదని తలప వలదు. శబ్దమునకు స్వార్థ సంస్పర్శిత్వము కలదు. అది యిచట నిరూపిత మగును శబ్దము నుచ్చరించిన పిమ్మట శ్రోతల కర్థప్రతీతి కలుగును. అట్లు ప్రతీతికలుగు ననుటలో నర్థాపత్తి ప్రమాణక మయిన హేతువు కలదు. పదమును వినిన యనంతర మర్థప్రతీతి కలుగుచున్నది కావున వేరొక విధముగా నా యర్థప్రతీతి యుపపన్నము కానందున నా శబ్దముననె యీ యర్థప్రతీతి కలుగుచున్న దని నిశ్చయింప వలెను. ఆ హేతువు వర్ణముల కన్న నతిరిక్తమయినదని గ్రహింప వలెను. అదియే ధ్వని. వర్ణము లందలి యాధ్వని సామాన్యరూపము. వర్ణము లా సామాన్యరూపమున కాశ్రయరూపము లయిన వ్యక్తులు. అట్లు సామాన్యరూప మయిన యీ ధ్వని వర్ణవ్యంజనద్వారమున నా యర్థమును స్ఫుటముగా వ్యంజన మొనరించును. ఆ ధ్వనియె స్ఫోటము. ఇట్లీవిధముగా శాబ్దికులు పరిభాషించిరి. ఆ వైయాకరణుల స్ఫోటవాదమును సాహిత్యకులు నంగీకరించిరి. ఇట్లీ శబ్దార్థ సంబంధమును ధ్వనికారులు నిరూపించిరి. ధ్వనికారు డయిన శ్రీ మదానంద వర్ధనుడు నిరూపించిన ప్రకారమున సంక్షేపముగా నిచట నిదర్శిత మయినది. ఆనందవర్ధన ధ్వన్యాలోకము సాహితీజగమున మూర్ధన్య మయిన గ్రంథము. తదుక్తమార్గానుసారమున నిరూపణ మిందున్నందున నిది సముపాదేయగ్రంథ మని భావము.

ఇది శ్రీ శారదాతనయ విరచితమైన భావప్రకాశమునందు భావాలోకమున
శబ్దార్థసంబంధ తద్భేద ప్రకార నిర్ణయ మనెడి
షష్ఠాధికారము.

# సప్తమాధికారము

## నాట్యేతివృత్త శరీరలక్షణాభిధానము

### నాట్యము

ఈ యధికారమునకు నాట్యేతివృత్తశరీరలక్షణాభిధాన మని నామము కలదు. నాట్య నృత్య నృత్తముల స్వరూపము ప్రతిపాదించిన పిమ్మట తత్సంబద్ధముగా గేయనిరూపణ మావశ్యకము కాగా షట్త్రింశత్తత్త్వములను చెప్పి సృష్టికథనమున శారదాతనయు డుత్సుకము పడెను. దేహోత్పత్తి నాద శ్రుతి స్వర సముత్పత్తి నిరూపించెను. ఈ ప్రసంగమున సంగీతశాస్త్రవిశేషముల నిరూపించుట యావశ్యక మయినది. ఉపక్రమించిన గేయస్వరూపము చెప్పి విశేషముల నింకను తన శారదీయగ్రంథమున నుపపాదించుటను సూచించెను. అనంతరము నటుని కర్తవ్యతానిరూపణము పూర్వాంగము నాంది సూత్రధారుడు తద్విధులు ప్రతిపాదితము లయినవి. నాటకవస్తువు విభాగము పంచ సంధులు ప్రయోజనములు ప్రసంగాగతము లయిన యితరవిశేషము లిందు సాధికారముగా నిరూపితము లయినవి. నాట్యోచితము లయిన వివిధవిషయముల వివేకమునకీ సప్తమాధికారము చక్కగా సహాకరించును.

ఉక్తా రసా రసవ్యక్తిర్నాట్యేనైవేత్యుదీరితా
అవస్థానుకృతిర్నాట్యమితి సామాన్యలక్షణమ్. 1

రామాదితాదాత్మ్యాపత్తిర్నటే యా నాట్యముచ్యతే
రూపకం తద్భవేద్రూపం దృశ్యత్వాత్ప్రేక్షకై రిదమ్. 2

రూపకత్వం తదారోపాత్కమలారోపవన్ముఖే
దశధైవేతి మునినా తద్భేదనియమః కృతః. 3

రసాశ్రయత్వమప్యుక్తం రసాదేరాశ్రయత్వతః
తదేవం దశధా భిన్నం వాక్యార్థాభినయాత్మకమ్. 4

ఈ సప్తమాధికారము నాట్యము నితివృత్తమును నిరూపించునది కావున నిచట నాట్యసామాన్యలక్షణము ప్రతిపాదిత మగును. రూపక నిర్వచనము

నిరుక్త మగును. దశరూపకము రసాయశ్రయ మగుటయు ప్రతిపాదిత మగును. నాట్యసామాన్యలక్షణ మిట్లున్నది. ఇంతకు పూర్వాధికారములలో రసములు రసవ్యక్తి నిరూపితము లయినవి. అది నాట్యముననె యనియు ప్రతిపాదితము. అవస్థానుకృతి నాట్య మని నాట్యసామాన్యలక్షణము. కావ్యము నందు నిబంధించిన ధీరోదాత్తాదుల యవస్థావిశేషములను అనుకరించుట, చతుర్విధాభినయ ద్వారమున తాదాత్మ్యాపత్తి నాట్యము. వేషభూషాదులు అభినయప్రత్యాభినయములు ఆలాపసంలాపముల ద్వారమున ఆ యా పాత్రల ప్రతినియతము లయిన యవస్థల యనుకరణ మొనరింపగా తాదాత్మ్యాపత్తి కలుగును. నట దుష్యంతుల కభేదప్రతిపత్తి కలుగును. ఇట్టి తాదాత్మ్యాపత్తి నాట్యము. సామాజికులకు నటునందు గలుగు తాదాత్మ్యాపత్తి నాట్యము కాగా నిదియే రూప మని రూపక మని వ్యవహృత మగుచున్నది. ఆ నాట్యమె ప్రేక్షకులచే దృశ్యమాన మగుటచే రూప మనదగియున్నది. నాట్యమనునది కేవలము శ్రవ్యకావ్యము కాదు. రంగమున నభినీతము నగును. దృశ్య మగును. ప్రేక్షకులు దర్శింతురు. నీలాదిరూపము దృశ్యమాన మగుటచే రూప మయి నట్లు ఇదియు చక్షుర్గ్రాహ్య మగుటచే రూపమగుచున్నది. ఈ నాట్యమును రూపక మనియు నందురు. రామాద్యవస్థల యారోపమున నుండుటచే నిది రూపకము. ముఖము నందు కమలారోపము వలె నిది రూపకము. నాట్యము రూపము రూపకము అను శబ్దత్రయము ఒకే యర్థమున ప్రవృత్తము లయినవి. ఈ శబ్దత్రయమునకు ప్రవృత్తినిమిత్తభేద మిచట ప్రదర్శిత మయినది.

## దశవిధ రూపకములు

ఇట్టి యీ నాట్యము పది విధములని భరతముని నాట్యవేదమున భేద నియమ మొనరించెను. ఈ నాట్యము రసాదుల కాశ్రయముగా నున్నందున రసాశ్రయ మనియు ననెను. రసముల నాశ్రయించియుండు నిది దశప్రకారము. "దశధైవ" ఏవ కారము చేర్చుటచే నవధారణము - నిశ్చయము గోచరించును. ఇది పది విధములె కాని యిందు న్యూనాధిక రీతులు లేవు. శుద్ధభేదములు పదియె యని యనుట శుద్ధభేదాభిప్రాయమున నని గ్రహింపదగును. సంకీర్ణ రూపముగ నాటిక కలదని కొందరంగీకరింతురు. ఈ విషయమున నీ శారదా తనయుని భావము విశదము కాగలదు. ఇట్లీ నాట్యము దశవిధముల నున్నది. ఇది వాక్యార్థాభినయాత్మకము. నాటకము - ప్రకరణము - భాణము - ప్రహసనము - డిమము - వ్యాయోగము - సమవకారము - వీథి - అంకము - ఈహామృగము నని యాభేదములు. వీని స్వరూపము విశదము కాగలదు.

రసాశ్రయా యద్యపి స్యుర్నాటికాతోటకాదయః
నాటకాదిష్వథైతేషామన్తర్భావాన్న తే పృథక్. 5

నాటకే చ ప్రకరణే నాటికాయాః పురాతనైః
అంతర్భావః కృతస్తస్యాం తోటకస్యాపి దర్శితః. 6

నాటికాయా నాటకస్యాభేదః ప్రకరణస్య వా
సట్టకస్తోటకస్యైవ భేద ఇత్యభిధీయతే 7

తోటకస్యోచ్యతే సద్భిరంతర్భావోఽపి నాటకే
నాటకాదేరయం భేదో నాటికా రూపకం భవేత్. 8

నాటికాప్రతిమత్వాచ్చ సట్టకోఽపి తథావిధః
నాటకే తోటకస్యాంతర్భావాద్రూపకమేవ సః. 9

దివ్యమానుషసంయోగస్తోటకం నాటకానుగం
నవాష్టసప్తపంచాంకం దివ్యమానుషసంగమమ్. 10

తోటకం నామ తత్ర్యాహుర్భేదో నాటకసంభవః
నృత్యభేదా భవేయుస్తే డోంబీ శ్రీగదితాదయః. 11

నాటిక తోటకము మొదలగునవి కొన్ని రసాశ్రయములుగనె యున్నవి. వానిని వేరుగా పరిగణింప నవసరము లేదు. వానికి నాటకాదులలో నంతర్భావము చెప్పనగును. వానిని వేరుగా పరిగణింప నక్కరలేదు. పురాతనులు కొందరు నాటకముననుప్రకరణముననుఅ నాటిక కంతర్భావము నిరూపించిరి. తోటకమునకు నాటిక యందంతర్భావమంగీకరించిరి. నాటికకు నాటకమునకు భేదము లేదు. నాటికకు ప్రకరణమునకు భేదము లేదు. సట్టక మనునది తోటక భేదమె యనిరి. తోటకమునకును నాటకమున నంతర్భావమును కొంద రంగీకరించిరి. నాటిక నాటకాదుల భేదము. కావున నాటికయు రూపకమె యగును. సట్టక మనునదియు నాటికాప్రతిమము; నాటికాసదృశము. కావున వేరుగా పరిగణింపనక్కఱ లేదు. సట్టకమును రూపక మగును. నాటకమున తోటక మంతర్భవించును గావున నదియు రూపకమె. దివ్యమానుషసంయోగమున్న తోటకము నాటకానుగతమె యగును. తొమ్మిది యెనిమిది ఏడు అయిదు అంకము లుండుట దివ్యమానుషసంగము ముండుట తోటక మనిరి. ఇట్టి తోటకము

నాటకసంభవమయిన భేదము. ఇక డోంబి శ్రీగదితము మొదలగునవి నృత్య భేదము లగును. నృత్యభేదస్వరూపనిరూపణాత్మక మయిన నవమాధికారమున డోంబీ శ్రీగదితాదుల స్వరూపము నిరూపితము కాగలదు. అష్టమాధికారమున దశరూపకముల లక్షణము లక్షితము కాగలదు.

వాక్యార్థపదార్థాభినయములు

యద్యద్రసాత్మకం తత్తద్వాక్యార్థాభినయాత్మకం
యద్యద్భావాశ్రయం తత్తత్పదార్థాభినయాత్మకమ్. 12

నృత్యం భావాశ్రయం నృత్తం రసాశ్రయముదాహృతం
నృత్యనృత్తవిభాగశ్చ బహుభిర్బహుధోదితః. 13

తద్ద్వయం నాటకాదీనాం భూయసా హ్యుపకారకం
నృత్యనృత్తవిభాగస్తు పరస్తాత్కథయిష్యతే. 14

పూర్వరంగే నాటకాదావుపయోగోఽత్ర దృశ్యతే

ఏది యేది రసాత్మకమో యది యది వాక్యార్థాభినయాత్మకము. ఏది యేది భావాశ్రయమో యది యది పదార్థాభినయాత్మకము. నృత్యము భావాశ్రయమని, నృత్తము రసాశ్రయమని ప్రతిపాదిత మయినది. నృత్యనృత్త విభాగము ననేకు లనేకవిధముల నిరూపించిరి. నృత్యనృత్తములు రెండును నాటకాదుల కధికముగా నుపకరించునవి యగును. నృత్యనృత్తవిభాగము ననంతరాధికారములలో నిరూపింతుము. నాటకాదుల పూర్వరంగములో నృత్య నృత్తముల యుపయోగము గోచరించు చున్నది.

నాటకాద్యుపయోగోఽత్ర గాయకానాం ప్రదర్శ్యతే. 15

నృత్తం గీతం చ వాద్యం చ నాటకాద్యుపకారకం
గేయం ప్రాణాః ప్రయోగస్య సర్వం వా గేయముచ్యతే. 16

గేయసాధ్యం హి ధర్మార్థకామమోక్షచతుష్టయం
తస్మాద్గేయసముత్పత్తిః సంక్షేపేణాత్ర కథ్యతే. 17

నాటకాదులలో గానము యొక్క యుపయోగ మున్నది. అది యిం దుపక్రాంత మగుచున్నది. ఇచట గాయకులకు సంబంధించిన నాటకాద్యుప యోగము ప్రదర్శిత మగును. నృత్తము గీతము వాద్యము నను మూడును నాటకాదులలో నుపకారకములు. గేయము ప్రయోగమునకు ప్రాణము.

ప్రయోగము సర్వము గేయ మనుటయు సముచితము. ధర్మార్థకామమోక్ష చతుష్టయము గేయసాధ్యము. కావున సంక్షేపముగా గేయసముత్పత్తి యిచట ప్రతిపాదిత మగును.

ఇచటి గేయనిరూపణప్రతిజ్ఞానుకూలముగా కాశ్మీరశైవాద్వైతమున ప్రత్యభిజ్ఞాసంప్రదాయమున స్పందవాదు లంగీకరించు షట్త్రింశత్తత్త్వములు సృష్టి ప్రాణిసముత్పత్తి ప్రాణవిభాగము నాడీరీతి నాదవర్ణోత్పత్తి స్వరసంపత్తి రాగోత్పత్తి గీతిసముత్పత్తి సర్వ మాధ్యాత్మికముగా ప్రతిపాదిత మగును. సహృదయపాఠకులు సావధానముగా నీ గేయాధికారమును సమ్యగ్భావ మొనరించుట సముచితము.

## సృష్టికథనము

ఇహ తత్త్వాని షట్త్రింశత్ - శివః శక్తిః సదాశివః
ఈశ్వరః శుద్ధవిద్యేతి శుద్ధాన్యేతాని పంచ చ. 18

మాయా కాలోఽథ నియతిః కలా విద్యా తతః పరం
రాగః పురుష ఏతాని శుద్ధాశుద్ధాని సప్త వై. 19

తతః ప్రకృతిరేతస్యాః ప్రకృతేస్తు గుణత్రయం
గుణత్రయేఽపి భిద్యంతే రూపనామక్రియాః సదా. 20

ఈ సంప్రదాయమునందు షట్త్రింశత్తత్త్వములు కలవు. స్వకీయ కార్యము నందు ధర్మము నందు స్వసమానవస్తువు నందు వ్యాపకముగా నుండు పదార్థమును తత్త్వ మందురు. ఇవి ముప్పదియారు.

| | |
|---|---|
| ౧. శివ - శక్తి - సదాశివ - ఈశ్వర - శుద్ధవిద్య | ౫ |
| ౨. మాయ - కల - విద్య - రాగ - కాల - నియతి - పురుష | ౭ |
| ౩. ప్రకృతి - బుద్ధి - అహంకార - మనః | ౪ |
| ౪. శ్రోత్ర - త్వక్ - చక్షుః - జిహ్వా - ఘ్రాణ | ౫ |
| ౫. వాక్ - పాణి - పాద - పాయు - ఉపస్థ | ౫ |
| ౬. శబ్ద - స్పర్శ - రూప - రస - గంధ | ౫ |
| ౭. ఆకాశ - వాయు - వహ్ని - జల - భూమి | ౫ |
| | ౩౬ |

ఈ తత్త్వము లిచట ఏడు వర్గములుగా విభక్తములై యున్నవి. మొదటి యయిదు శివాదులు శుద్ధతత్త్వము లని, తరువాత నున్న మాయాది పురుషాంతము లేడు తత్త్వములు శుద్ధాశుద్ధతత్త్వము లని వ్యవహారసంకేత మున్నది. పురుషానంతరము ప్రకృతి కలిగినది. ప్రకృతివలన గుణత్రయ ముద యించినది. గుణత్రయము నందును నిత్యము రూపనామక్రియలు భిన్నభిన్న ములుగా నుండును.

ఈదృగ్విలక్షణాం శక్తిం యదా సంక్రమతే పుమాన్
ప్రాజ్ఞ తైజస విశ్వత్వ భేదత్రయ మథాన్వగాత్. 21

ప్రధానమనయోర్వ్యాప్తం ప్రాజ్ఞ ఏకోఽన్యవస్తుని
శిష్టస్త్వస్మింస్త్వసంపూర్ణ ఇత్థమేషాం ప్రవర్తనమ్. 22

తైజసః సప్తధా భిన్నో బుద్ధి గర్వ ఖ వాయుభిః
వహ్న్యంభః క్షితిభిస్త్వేతే కార్యకారణమూర్తయః. 23

ఏతేషాం సమవాయాత్తు విశ్వ ఆసీచ్చ తన్మయః
సోఽపి త్రైవిధ్యమన్విచ్ఛన్విరాట్పురుష ఈశ్వరః. 24

బీజత్రయేణ భిన్నః స్యాత్సోమసూర్యాగ్నిరూపిణా
స రుద్రోపేంద్ర పద్మోత్థ గుణత్రయ విభేదినా. 25

విశ్వాఖ్యే పార్థివే చాఽండే ప్రాణినో భూతమూర్తయః
చతుష్ప్రకార సంభిన్నా నశ్వరాస్తు ప్రజజ్ఞిరే. 26

పురుషు డిట్టి విలక్షణ మయిన శక్తిసంక్రమము కలవాడు కాగా ప్రాజ్ఞు డని తైజసు డని విశ్వు డని ప్రభేదత్రయము పొందు వాడగును. ఇచట సూత్రప్రాయముగా నున్న సృష్టితత్త్వము నీ విధముగా గ్రహింపవలెను. సృష్టి క్రమమునందు తమఃసర్గము మొదటిది. తమఃసర్గ మనుట ప్రకృతి యని భావము. ఈ ప్రకృతిసర్గము నుండి మహత్సర్గ ముదయించినది; ఇది రెండవది. మహత్సర్గమునుండి త్రివిధమయిన అహంకారసర్గము కలిగినది; ఇది మూడవది. దీనినుండి పంచతన్మాత్రము లనదగిన శబ్దస్పర్శరూపరసగంధములు సూక్ష్మ భూతము లుదయించినవి. పంచతన్మాత్రలలో పంచజ్ఞానశక్తులు పంచక్రియా శక్తులు కలవు. జ్ఞానశక్తులు వ్యష్టివేషమున జ్ఞానేంద్రియములను గలుగ జేయును. సమష్టివేషమున అంతఃకరణమును గలుగజేయును. క్రియాశక్తులును

వ్యష్టి వేషమున కర్మేంద్రియములను, సమష్టి వేషమున ప్రాణమును గలుగజేయును. ధర్మిగానున్న శబ్దాదు లాకాశాదిభూతములను గలుగజేయుచున్న వనుట వస్తుస్థితి.

వ్యష్టిరూపముగా నున్న స్థూలోపాధులతో గూడుకొనిన చైతన్యము విశ్వ పదమునను, సూక్ష్మోపాధులతో నున్న చైతన్యము తైజస పదమునను, కారణోపాధులలో నున్న చైతన్యము ప్రాజ్ఞ పదమునను వ్యవహృత మగుచున్నది. సమష్టిరూపమున నున్న స్థూలములతో నున్న చైతన్యము వైశ్వానర పదమునను, సూక్ష్మములతో నుండునది హిరణ్యగర్భ పదమునను, కారణముల నుండు చైతన్యము ఈశ్వరపదమునను వ్యవహృత మగుచున్నది. అంతఃకరణ కారణోపహితు డయిన పరమాత్మ హిరణ్యగర్భుడని, ప్రాణకారణోపహితుడు సూత్రాత్మయని, అవిభక్తప్రాణాంతఃకరణోపహితు డంతర్యామి యని యందురు. ఈ మువ్వురు బ్రహ్మ విష్ణు రుద్ర పదములతో వ్యవహరింపదగియున్నారు. విశ్వాదులు జాగ్రదాద్యవస్థలకు, వైశ్వానరాదులు సృష్టిస్థితిసంహారములకు సంబంధించి యుందురు.

ప్రాజ్ఞాదులలో ప్రాజ్ఞుడు ప్రధానుడు. తైజసు డసంపూర్ణుడు. తైజసవిశ్వులలో ప్రాజ్ఞు డనుగతుడుగా నుండును. వీరి వర్తన మిట్లున్నది. తైజసుడు సప్తభేదముల నుండును. బుధ్యహంకారములు పంచభూతములు మొత్తమేడురూపములు. ఈ సప్తకీతులు కార్యకారణమూర్తులతో నున్నవి. వీని సముదాయమున విశ్వుడు తన్మయుడుగా నున్నాడు. విరాట్పురుషు డయిన ఈశ్వరుడు త్రైవిధ్య మనుసరించి సోమ - సూర్య - అగ్ని రూపములు కలవాడయినాడు. గుణత్రయవిభేదము కల బీజత్రయమున రుద్ర విష్ణు బ్రహ్మ వ్యవహారము కలవాడయినాడు. ఈ పార్థివాండమునకు విశ్వ మని పేరు. ఇందు ప్రాణులు పంచభూతమయమూర్తులుగా నుందురు. జరాయుజ - స్వేదజ - అండజ - ఉద్భిజ్జ రూపమున నశ్వరు లుదయించిరి. (ఇంక నిచటి వివేకవిస్తర మును నా అభినవదర్శనమున జూడ నగును.)

జీవత్వమేషామపరం ప్రతిభేదమియాత్ప్రభుః
కాలప్రేరితయోర్వాయుర్దంపత్యోః సంగమాన్మిథః. 27

పౌరుషీం ప్రాకృతీం శక్తిం శుక్లశోణితరూపిణీం
వాయుద్వయేన సహితం గర్భాశయముపానయేత్. 28

అనాదయశ్చ క్షేత్రజ్ఞా బహవః కర్మభావితాః
సంతి కాలార్థినః శేషాః కశ్చిత్కాలేన చోదితః. 29

గర్భాశయం స్వయం పిత్రోః మలాభ్యాం సహ సంవిశేత్
తత్ర నిత్యో భవేద్వాయుః ప్రాణాపానాత్మకః స్వయమ్. 30

గుణభూతాత్మకే బీజే కారణార్థసమన్వితే
సర్వవ్యాప్తా పరా శక్తిః అస్మిన్ క్షేత్రజ్ఞతామియాత్. 31

పార్థివాండము నందు నాలుగు విధముల నశ్వరప్రాణు లుదయింతు రనుట సూచిత మయినది. పురుషు డీ నాలుగు భేదముల ననుసరించి జీవత్వము పొందు వాడగును. కాలప్రేరితులై దంపతులు పరస్పరము సంగమ మొనరింపగా వాయువు శుక్లశోణితాత్మకమయిన పౌరుషశక్తిని ప్రాకృతశక్తిని వాయుద్వయసహితముగా ప్రాణాపానరూప మయిన వాయుద్వయసహితముగా గర్భాశయము చేర్చును. అనాదిగా నున్న క్షేత్రజ్ఞు లనేకులు కర్మభావితులై కాల మపేక్షించువారుగా నుండగా నొక క్షేత్రజ్ఞుడు — జీవుడు కాలచోదితుడై గర్భాశయము చేరును. తన కర్మపాకమున తానే పితరుల మలములతో గూడుకొని గర్భాశయము చేరును. అచట గర్భాశయమునందు ప్రాణాపానాత్మక మయిన వాయువు నిత్య ముండును. కారణార్థసమన్విత మయిన గుణభూతాత్మకబీజమునందు సర్వవ్యాప్త మయిన పరాశక్తి క్షేత్రజ్ఞత్వము పొంది యుండును ఇట్లు క్షేత్రజ్ఞునకు గర్భాశయప్రవేశము భావనీయము.

ద్వాభ్యాం త్రయాణాం వ్యక్తిః స్యాత్త్రిభ్యో భవతి పంచకం
పంచభ్యః పంచకానాం తు చతుష్కం ప్రతిపద్యతే. 32

శుక్లార్తవౌ ద్వయం తత్ర త్రితయం తు గుణత్రయం
భూతాని శ్రవణాదీని శబ్దవాగాది పంచకమ్. 33

భాషణాదీని వాక్యాదిచతుష్టయముదాహృతం
తత్సంశయప్రమాతృత్వనిశ్చయానుభవార్థకృత్. 34

ఈదృగ్విలక్షణో జంతుర్జరాయుగ్రస్తదేహవాన్
కాలపాకేన పూర్ణాంగో జాయతేఽయమవాఙ్ముఖః. 35

రెండింటిచే మూడింటి కభివ్యక్తి కలుగును. మూడింటిచే నయిదింటి కావిర్భావము కలుగును. అయిదింటిచే పంచకముల చతుష్కమును పొందువా

డగును. ఇట్లిది సాంకేతిక భాషగా నున్నది. దీని యర్థవివేచన మనంతర శ్లోకమున నున్నది. రెండు — ద్వయము అనగా స్త్రీపురుషుల శుక్లశోణితములు. మూడు-త్రితయ మనగా గుణత్రయము - సత్త్వరజస్తమోగుణములు. అయిదు — పంచకము అనగా అకాశవాయువహ్నిజలభూము లన్న పంచ భూతములు; శ్రవణాదులన దగు శ్రోత్రత్వక్చక్షుఃజిహ్వా ఘ్రాణములు, శబ్ద వాగాదిపంచకముచేసూచితములగు శబ్దస్పర్శరూపరసగంధములు, వాక్పాణి పాదపాయుఉపస్థలు గ్రాహ్యములు.

స్త్రీపురుషుల శుక్లశోణితములచే సత్త్వరజస్తమోగుణముల యభి వ్యక్తికలుగును. ఆ గుణత్రయము వలన శ్రోత్రాదిపంచకము, వాగాదిపంచ కము, శబ్దాదిపంచకము, ఆకాశాదిపంచకము గలుగును. ఇట్లు శివాది భూమ్యంతషట్త్రింశత్తత్త్వముల యావిర్భావము పరిగ్రాహ్యము.

గర్భాశయగతుడై యున్న జీవుడు విలక్షణస్వభావుడు, జరాయు గ్రస్త మయిన దేహమున నుండి కాలపాకమున పూర్ణాంగుడై యీతడు వాఙ్ముఖుడై జన్మించుచున్నాడు.

షణ్ణవత్యంగులాయామం సర్వేషాం చ శరీరిణామ్
శరీరం తస్య మధ్యః స్యాదాధారః కందసంజ్ఞితః. 36

వలయత్రితయాకారః సోమసూర్యాగ్నిమండలైః
వహ్నేః శిఖా తస్య మధ్యే నీపాంతః కేసరాకృతిః. 37

పరాప్రకృతిరేషా స్యాదంబికేత్యపరే విదుః
బహిస్తిర్యక్చరన్వాయుః శరీరాంతః శివాజ్ఞయా. 38

ప్రాణాదిభేదాత్పంచాత్మా శరీరం వ్యాప్య తిష్ఠతి
యేన ప్రాణితి సర్వశ్చ స ప్రాణో మూర్ధని స్థితః. 39

జరాయుజ మయిన దేహవర్ణన మిట నున్నది. సర్వశరీరధారులకును శరీరము షణ్ణవతి — తొంబదియారంగుళముల పొడవుతో నుండును. ఆ శరీరముయొక్క మధ్యభాగ మాధారము. దానికి కంద మని పేరు. సోమ మండలము సూర్యమండలము అగ్నిమండలమునను మూడు వలయముల యాకారముతో నది యుండును. ఆ కందము యొక్క మధ్యభాగమునందు నీపాంతః కేసరాకృతి కలిగిన వహ్నిశిఖ యున్నది. ఇది పరాప్రకృతి. అంబిక యని

కొంద రందురు. శరీరాంతర్భాగమున వెలుపల నడ్డముగా వాయువు శివాజ్ఞాను సారమున సంచరించుచున్నది. ప్రాణాపానవ్యానోదానసమాన భేదమున వాయువు పంచాత్మకమై శరీరమున వ్యాపించియున్నది. దేహమున ప్రాణవాయు వట్లుండుటచే నందరు జీవించుచున్నారు. ఆ ప్రాణము మూర్ధమున నున్నది.

ఉరఃకంఠచరో బుద్ధిహృదయేంద్రియచిత్తధృక్
ష్ఠీవన క్షవథూద్గార నిఃశ్వాసాంతఃప్రవేశకృత్. 40

ఉరఃస్థానముదానస్య నాసానాభిగలాంశ్చరేత్
వాక్ప్రవృత్తిప్రయత్నోర్జాబలవర్ణస్మృతిప్రదః. 41

వ్యానో బహిఃస్థితః కృత్స్నదేహచారీ మహాజవః
గత్యవక్షేపణోత్క్షేపనిమేషోన్మేషణాదికృత్. 42

ప్రాయః సర్వాః క్రియాః తస్మిన్ ప్రతిబద్ధాః శరీరిణాం
సమానోఽగ్నిసమీపస్థః కోష్ఠే చరతి సర్వదా. 43

అన్నం గృహ్ణాతి పచతి వివేచయతి ముంచతి
అపానోఽపానగః శ్రోణిబస్తిమేఢ్రోరుగోచరః. 44

శుక్లార్తవ శకృన్మూత్ర గర్భనిష్క్రామణ క్రియః

ఆ ప్రాణవాయు వురఃకంఠములందు సంచరించునదై బుద్ధి హృదయేంద్రియ చిత్తములను ధారణము చేయును. ఉమ్మివేయుట దగ్గుట కక్కుట నిశ్వసించుట మ్రింగుటలను గలుగ జేయును. ఉదానవాయువున కురము స్థానము. నాస నాభి గలముల సంచరించును. వాక్ప్రవృత్తి కలిగించును. శరీర బల ముత్సాహము సంపాదించును. వర్ణ స్మృతి నాపాదించును. వ్యానవాయువు బహిస్సంచారమున నుండును. సర్వశరీరము సంచరించును. మహాజవమున నుండును. గతి యవక్షేపణము ఉత్క్షేపము నిమేషము ఉన్మేషము మొదలగు వానిని గలుగ జేయును. దేహధారుల సర్వక్రియలు వ్యానవాయువు నందు ప్రతిబద్ధములై యున్నవి. సమానవాయువు కోష్ఠాగ్ని సమీపమున నున్నదై సర్వదా సంచరించును. తిను నన్నము గ్రహించును. తిన్న యన్నము పక్వ మొనరించును. వివేచన మొనరించును. విడనాడును. అపానవాయు వపానము - గుదము - ముడ్డి యందుండును. పిఱుదు లందుండును. పొత్తికడుపు నందుండును. మేఢ్రము- శిశ్నము నందుండును. ఊరువులందు సంచరించును. పురుషుల శుక్లమును స్త్రీ

యా ర్తవమును మలమును మూత్రమును గర్భనిష్క్రమణమును సంపాదించును. ఇట్లు శరీరధారుల శరీరమున ప్రాణాదుల విభాగమును స్థానములను కర్మలను గుర్తింప వలెను.

## నాడీవ్యవస్థ

హృదయగతముగా పదవిధము లగు స్థూలనాడు లున్నవి. వాని కేడు వందల భేదములు కలవు. ఇవి సూక్ష్మనాడులు.

దశ జీవనధామాని శిరోరసనబంధనమ్. 45

కంఠోష్ఠహృదయం నాభిః వస్తిః శుక్లో గుదౌజసీ
దశ స్థూలశిరాః హృత్స్థాస్తాః సర్వాస్సర్వతో వపుః. 46

రసాత్మకం వహంత్యోజ స్తన్నిబద్ధం హి చేష్టితం
భిద్యంతే తా స్తతః సప్తశతాన్యాసాం భవంతి తు. 47

హృదయగతముగా పది స్థూలములయిన నాడు లున్నవి. అవి జీవనాడులు. జీవనస్థానములు. శిరస్సు నాలుక కంఠము ఓష్ఠము హృదయము నాభి పొత్తికడుపు శుక్లము గుదము ఓజస్సుల ననుసరించి యుండును. ఆ నాడులు హృదయగతములై సర్వదేహమును రసాత్మకముగ వహించునవి యగుచున్నవి. ఓజస్సు చేష్టితము తన్నాడీనిబద్ధము. హృదయము నందున్న దశనాడులు సప్తశత సంఖ్యగా మారుచున్నవి. వ్యాపించుచున్నవి.

సిరాజాలధరా నామ తిస్రశ్చాభ్యంతరాశ్రయాః
ఇడా చ పింగలా చేతి సుషుమ్నా చేతి నామతః. 48

సుషుమ్నా మధ్యమా నాడీ శిఖాం వహ్నేః సమాశ్రితా
శిఖాప్రాణేన సంస్పృష్టా నాదాఖ్యాం లభతే స్ఫుటమ్. 49

అభ్యంతరాశ్రయము లయిన మూడు నాడులు నాడీసమూహమును ధరించి యున్నవి. ఇడానాడి పింగలానాడి సుషుమ్నానాడి యని వాని పేరులు. సుషుమ్న యనునది ఇడాపింగలా నాడీ మధ్యగతముగా నున్నది. వహ్నిశిఖ నాశ్రయించి యీ నాడి యున్నది. ప్రాణసంస్పృష్టమయిన యీ వహ్నిశిఖ "నాదము" అని వ్యవహారము కల దయినది. ఇట్లు మానవదేహమున నాద ముత్పన్న మగుచున్నది. ఈ నాదమున వర్ణము లావిర్భవించురీతి భావనీయము.

సుషుమ్నావర్త్మనై వోర్ధ్వం యాతి వ్యోమాంబుజావధి
యోగినాం నాదరూపేణ స్వానుభూతివిధాయినీ. 50

ఇతరేషాం కలారూపాన్వర్ణాన్విసృజతి క్రమాత్
నాదః శ్రుతిసముత్పత్తిః శ్రుతిభ్యః స్వరసంభవః. 51

నాడీభ్యః శ్రుతిసంభూతిః నాడీనాం స్థానముచ్యతే
స్థానాని సర్వవర్ణానాం సప్త వ్యక్తికరాణి తు. 52

ప్రాణసంభూత మయిన వహ్నిశిఖ సుషుమ్నామార్గమున నూర్ధ్వ గమన మొనరించును. వ్యోమాంబుజము-సహస్రారకమలము వఱకు గమనము చేయును. యోగుల కది నాదరూపమున స్వానుభవము సంపాదించును. ఇతర మానవులకు క్రమముగా కలా రూపము లయిన వర్ణములను సృజించును. నాదము శ్రుతికి సముత్పత్తిస్థానము. శ్రుతుల వలన స్వరము ఉదయించును. నియతము లయిన నాడుల వలన శ్రుతు లుదయించును. ఆనాడుల స్థానము నిరూపితము కాగలదు. సప్తసంఖ్యాకము లయిన స్థానములు సర్వవర్ణములకు వ్యక్తిసంపాదక ములు.

కంఠతాల్వోష్ఠమూర్ధానో దంతాశ్చేతి పృథక్పృథక్
ఏకం స్యాత్కంఠతాలుభ్యాం కంఠోష్ఠాభ్యామథాపరమ్. 53

దంతోష్ఠజిహ్వాస్థానానాం సంభవాః స్యుః పృథక్పృథక్
చతస్రో జత్రుబంధిన్యో నాడ్యః కంఠముపాశ్రితాః. 54

తాలుమూలస్య బంధిన్యస్తిస్రస్తత్రైవ చ స్థితాః
ఓష్ఠయోరుభయోర్నాడ్యౌ బంధిన్యౌ ద్వే వ్యవస్థితే. 55

చతస్రో మూర్ధబంధిన్యో నాడ్యో బ్రహ్మపదాశ్రయాః
నాడ్యశ్చతస్రస్తిష్ఠంతి దంతానాబధ్య సర్వతః. 56

కంఠతాల్వోరంతరా స్యుః నాడ్యస్తిస్రస్సుసంగతాః
కంఠోష్ఠయోర్ద్వే బంధిన్యౌ నాడ్యౌ తత్రైవ తిష్ఠతః. 57

ఏవం ద్వావింశతిర్నాడ్యో మధ్యనాడ్యాం హృది స్థితాః

కంఠము తాలువు ఓష్ఠము మూర్ధ దంతములు అనునవి వేరు వేరుగ స్వర వర్ణ వ్యక్తి సంపాదకస్థానములు. కంఠతాలుసంయుక్త మొకస్థానము, కంఠోష్ఠసంయుక్త మన్యస్థానము. ఇట్లేడు స్థానములు స్వరవర్ణవ్యక్తిసంపాదక ములుగా నున్నవి. దంతము ఓష్ఠము జిహ్వా అను స్థానములకు వేరువేరుగా సంభ

వము లయిన నాలుగు నాడులు మూపుల యొక్క సంధియెముక కనుబంధముగా కంఠము నాశ్రయించి యున్నవి తాలుమూల బంధమున మూడునాడు లచటనె యున్నవి. ఓష్ఠములు రెండింటికి రెండు బంధినీనాడులు వ్యవస్థితములై యున్నవి. మూర్ధబంధినీ నాడులు నాలుగు గలవు. అవి బ్రహ్మపదమును సహస్రారము నాశ్రయించి యున్నవి. దంతముల సంతత ననుబంధించి నాలుగు నాడులున్నవి. కంఠతాలువుల మధ్యభాగమున మూడు నాడులు సుసంగతములై యున్నవి. కంఠోష్ఠములలో రెండు బంధినీనాడులు కలవు. ఇట్లిరువది రెండు నాడులు హృదయమున మధ్యనాడి యం దనుగతములై యున్నవి.

| | |
|---|---|
| ౧. కంఠాశ్రిత జత్రుబంధినీ నాడులు | ౪ |
| ౨. తాలుమూలాశ్రితములు | ౩ |
| ౩. ఓష్ఠబంధినీనాడులు | ౨ |
| ౪. మూర్ధనాడులు | ౪ |
| ౫. దంతసంబంధములు | ౪ |
| ౬. కంఠతాలుసమాశ్రయములు | ౩ |
| ౭. కంఠోష్ఠసంబంధములు | ౨ |
| మొత్తము. | ౨౨ |

ఇట్లీ యిరువది రెండు నాడులు వ్యక్తిసంపాదకములు.

## స్వరోత్పత్తి

యుగపన్మరుదాహత్యా నాదస్తాసు ప్రవేక్ష్యతి. 58

త్రుటికాలమితాః స్యుస్తు శ్రుతయః శ్రుతిగోచరాః
యదూర్ధ్వం హృదయగ్రంథేః కపాలఫలకాదధః. 59

ప్రాణాశ్చరంతి తత్రైతా వ్యజ్యంతే శ్రుతయః పృథక్
వ్యక్తిస్థానేషు వర్ణానాం స్వరసంజ్ఞా భవంతి తాః. 60

కంఠే సజ్జతి యో నాదః స షడ్జః స్యాచ్చతుశ్శ్రుతిః
ఋషభస్త్రిశ్రుతిః తాలుమూలే తస్య ప్రసంభవాత్. 61

శబ్దో గోస్తాం బిభ్రదోష్ఠే గాంధారో ద్విశ్రుతిర్భవేత్
మూర్ధమధ్యస్థితో నాదో మధ్యమః స్యాచ్చతుః శ్రుతిః. 62

పంచభిర్జాయతే దంతతాలుకంఠోష్ఠమూర్ధభిః
చతుశ్శ్రుతిః పంచమః స్యాద్దంతపంక్తిసమాశ్రయః. 63

కంఠతాలుధృతో నాదో ధైవతస్త్రిశ్రుతిర్భవేత్
నాదో నిషణ్ణః కంఠోష్ఠే నిషాదో ద్విశ్రుతిర్భవేత్. 64

స్వర్యమాణతయా తత్తత్స్థానేషు మరుదాహతేః
స్వరసంజ్ఞాం లభంతే తే తత్తన్నామపురస్కృతాః. 65

ఒకే సమయమున గాలి తాకుడుచే నాద మానాడులందు ప్రవేశించును. అప్పుట శ్రుతులు త్రుటికాల మితములై శ్రుతిగోచరము లగును. హృదయ గ్రంథికి పైగా కపాలఫలకమునకు క్రిందుగా ప్రాణములు సంచరించును గావున నచట శ్రుతులు వేరువేరుగా భాసించును. వర్ణముల వ్యక్తి స్థానములలో నవి స్వరసంజ్ఞ కల వగుచున్నవి. కంఠమున సక్త మగు నాదము షడ్జము. అది చతుఃశ్రుతికము. తాలుమూలమున త్రిసంభవమయినందున నచటి స్వరము ఋషభము త్రిశ్రుతికము. ఓష్ఠమున సంభృత మగు నాదము గాంధారము ద్విశ్రుతికము. మూర్ధమధ్యస్థిత మయిన నాదము మధ్యమము చతుఃశ్రుతికము. దంతపంక్తి సమాశ్రయమున నాదము పంచమము, ఇది చతుఃశ్రుతికము. దంత తాలు కంఠోష్ఠ మూర్ధములను నయిదుస్థానముల నిది యుదయించును. కంఠతాలుధృత మయిన నాదము ధైవతము ఇది త్రిశ్రుతికము. కంఠోష్ఠమున నిషణ్ణమై యుండు నాదము నిషాదము ద్విశ్రుతికము. ఆ యా స్థానములలో మరుదాహతి వలన నివి స్వర్యమాణములు కావున తత్తన్నామపురస్కృతములై స్వరసంజ్ఞ పొందినవి.

## సప్తధాతువులు

సప్తస్థానములలో సప్తస్వరములు సముత్పన్నము లగుట వాని స్వరూప మింతవరకు ప్రతిపాదిత మయినది. స్వరోత్పత్తి విషయమున నన్యభావములను గలవు. అవియు సమాదరపాత్రములు. వాని స్వరూప వివేచనము కూడ స్వరోపాసనానుసంధానముల కుపయోగించును. స్వరములు ధాతూత్పన్నములని కొందరి మతము. ఆ మతమిచట నిరూపిత మగును.

అన్యే ధాతుభ్య ఉత్పన్నాః స్వరా ఇత్యేవ జానతే
ధాతవః సప్త భూతానామన్తః సప్తాగ్నయః స్థితాః. 66

కేచిదగ్నయ ఇత్యేవం కేచిదూష్మేతి మన్వతే
త్వగసృఙ్మాంసమేదోఽస్థిమజ్జాశుక్లాని ధాతవః. 67

ధమన్యస్స్యుశ్చతుర్వింశ దరవన్నాభి మాశ్రితాః
శరీరమనుగృహ్ణంతి తాః సర్వా హ్యత్ర సర్వతః. 68

తాసూర్ధ్వమేకా మూర్ధానం ఏకా౽ధఃకోష్ఠమాశ్రితా
ఓజాంసి సప్తధాతూనాం వర్ధయంత్యంతరా స్థితా. 69

ఉరస్యో ధాతుకన్యో౽పీత్యేకే ప్రాహుర్హృదాశ్రయః
ఆయుర్వేదే తత్స్వరూపం త్రిప్రకారముదాహృతమ్. 70

చతస్రః శుక్లవర్ధన్యస్తాస్తు కందసమాశ్రయాః
తిస్రో ధమన్యో వర్ధన్యో మజ్జాయా నాభిమాశ్రితాః. 71

అస్థీని వర్ధయంత్యౌ ద్వే ధమన్యౌ హృదయం శ్రితే
కంఠే చతస్రో వర్ధన్యో ధమన్యో మేదసం శ్రితాః. 72

చతస్రో మాంసవర్ధిన్యో ధమన్యస్తాలుమూలగాః
మూర్ధ్ని తిస్రో౽స్రువర్ధన్యో ధమన్యో౽ధోముఖాశ్రితాః. 73

భ్రువోర్మధ్యే ధమన్యౌ ద్వే త్వగ్వర్ధన్యౌ వ్యవస్థితే

కొందరు ధాతువుల వలన స్వరములు సముత్పన్నము లయినవనియె గుర్తింతురు. సర్వప్రాణులకు శరీరమున సప్తధాతువులు కలవు. దేహమున సప్తాగ్నులు గలవు. కొందరు వాని నగ్నులందురు. కొందరూష్మ యందురు. త్వక్కు-అసృక్-మాంస-మేదస్సు-అస్థి-మజ్జ-శుక్లము అనునవి యేడును శరీరము నందుండు ధాతువులు. దేహమున నిరువది నాలుగు ధమనులు కలవు. అవి చక్రపు టాకులవలె నాభి నాశ్రయించి యున్నవి. అవి యన్నియు నంతట శరీరము ననుగ్రహించునవిగా నున్నవి.

ఆ ధమనులలో నొకటి యూర్ధ్వముగా శిరఃపర్యంత మభివ్యాప్తమై యున్నది. మరి యొకటి యధఃకోష్ఠము నాశ్రయించి యున్నది. ఇది సప్త ధాతువుల యోజస్సులను వృద్ధి పొందింప జేయునదై దేహమున నున్నది. ఉరస్సంజాత మయిన ధాతు వొకటి కలదని యది హృదయాశ్రయముగా నుండునని కొందరందురు. ఆయుర్వేదమునందు ధమనుల స్వరూపము మూడుప్రకారముల నున్న దని నిరూపిత మయినది. శుక్లవర్ధనీధమనులు నాలుగు. అవి కందము నాశ్రయించి యున్నవి మజ్జావర్ధనీధమనులు మూడు. అవి నాభిననుసరించి యున్నవి. అస్థివర్ధనీధమనులు రెండు. అవి హృదయాశ్రయములు. మేదోవర్ధనీధమనులు మేదస్సు నాశ్రయించి యుండునవి నాలుగు. అవి కంఠశ్రితములు. మాంసవర్ధనీధమలు నాలుగు. అవి తాలుమూలగతములు. అసృగ్వర్ధనీధమ

నులు మూడు. అవి యధోముఖములై మూర్ధాశ్రితములుగా నున్నవి. త్వగ్వర్ధనీ ధమనులు రెండు. అవి భ్రూమధ్యమున వ్యవస్థితములై యున్నవి.

శ్రుతులు

దహరాకాశమధ్యస్థసహస్రదలశోభితే. 74

విస్ఫురత్కేసరాశ్లిష్టకర్ణికే పంకజోదరే
నివాతదీపవత్స్థాస్నుయో సోమసూర్యాగ్నిమండలే. 75

ఆత్మా నిస్సంగ ఏవైకః సాక్షీ సర్వస్య కర్మణః

దహరాకాశ మధ్యగత మయిన సహస్రదలశోభిత మయిన, వికసించిన కేసరాశ్లిష్టకర్ణికమయిన పంకజము యొక్క మధ్యభాగమున నివాతదీపము వలె నిశ్చలముగా స్థిరముగా నిస్సంగ మగు ఆత్మయున్నది. అది యొకటియె యున్నది. అది సర్వకర్మసాక్షిగా నున్నది. సోమసూర్యాగ్నిమండలాత్మక మయిన హృదయపద్మమున సర్వసాక్షిగా ఆత్మ యుండునని గ్రహింపవలెను.

తస్య స్యామీతి సంకల్పే మన ఆఖ్యాం లభేత సః. 76

విషయేభ్యః ప్రయత్నేన మన ఆత్మాఽధితిష్ఠతి
మనోఽధితిష్ఠతి ప్రాణపూర్వాన్ పంచసమీరణాన్. 77

తే ధాతూన్వ్యాప్య ధమనీముఖేభ్యస్తత్ర సంభవాన్
అగ్నిం ప్రజ్వలయంత్యేవ తేభ్యో నాదః ప్రవర్తతే. 78

ధమనీనామనేకత్వాత్ ధ్వనయః స్యురనేకధా
ధ్వనయః శ్రుతిసంజ్ఞాం తు లభంతే తత్ర తత్ర చ. 79

ఆ యాత్మకు "బహుస్యాం" బహువిధముల నగుదు నను సంకల్పముదయి పగా "మనః" అను సంజ్ఞ కలిగినది. అప్పుడు విషయముల నుండి విడిపడిన మనస్సును ఆత్మ యధిష్ఠించి యుండును. ఆ మనస్సు ప్రాణాపానాది పంచవాయువుల నధిష్ఠించును. ఆ వాయువులు ధాతువులను వ్యాపించి యుండి ధమనీముఖముల నుండి యుత్పన్నము లయిన యగ్నులను ప్రజ్వలిప జేయును. ధమనుల నుండి నాదము ప్రవృత్తమగును. ధమను లనేక విధములు కావున ధ్వను లనేకవిధముల నుండును. ఆ యా స్థలములందు ధ్వనులు శ్రుతిసంజ్ఞను పొందును. ఇట్లిది శ్రుతుల యుత్పత్తివిధము.

శ్రుతిసంఖ్యాఽపి తత్రత్య ధమనీసంఖ్యయా భవేత్
ఉదాత్తశ్చానుదాత్తశ్చ స్వరితప్రచయావితి. 80

ఆఖ్యాం లభంతే శ్రుతయః తత్తత్థ్సానాశ్రయాః క్రమాత్

ఆ యా స్థలము లందున్న ధమనీసంఖ్యానుసారముగా శ్రుతిసంఖ్య యుండును. శ్రుతు లాయా స్థానముల నాశ్రయించినవై క్రమముగా ఉదాత్తము అనుదాత్తము స్వరితము ప్రచయ మను పేరు ధరించును. ఇక శుక్లాది ధాతువుల వలన షడ్జాదిస్వరము లుదయించుట నిరూపిత మగును. ఆ యా ధాతుస్థానములందు స్వరముల స్థితి యుండుటయు నిరూపితము కావలెను.

షడ్జాదిస్వరములు

శుక్లధాత్వగ్నిజో నాదః స్వరః షడ్జః చతుశ్రుతిః. 81

మజ్జాధాత్వగ్నిజో నాదో ఋషభః త్రిశ్రుతిస్వరః
అస్థిధాత్వగ్నిజో నాదో గాంధారో ద్విశ్రుతిస్వరః. 82

మేదోధాత్వగ్నిజో నాదో మధ్యమః స్యాచ్చతుశ్రుతిః
మాంసధాత్వగ్నిజో నాదః పంచమః స్యాచ్చతుశ్రుతిః. 83

రక్తధాత్వగ్నిజో నాదః త్రిశ్రుతిర్ధైవతస్వరః
త్వగ్ధాతువహ్నిజో నాదో నిషాదో ద్విశ్రుతిస్వరః. 84

శుక్లధాత్వగ్నిజన్యమగు నాదము షడ్జస్వరము-స. షడ్జమున నాలుగు శ్రుతు లున్నవి. మజ్జాధాత్వగ్నిజన్య మయిన నాదము ఋషభస్వరము - రి. ఇందు మూడు శ్రుతులున్నవి. అస్థిధాత్వగ్నిజన్య నాదము గాంధార స్వరము - గ. ఇది ద్విశ్రుతిస్వరము. మేదోధాత్వగ్నిజన్య నాదము మధ్యమ స్వరము - మ. ఇది చతుశ్రుతికము. మాంసధాత్వగ్నిజన్య నాదము పంచమ స్వరము - ప. ఇది చతుశ్రుతికము. రక్తధాత్వగ్నిజన్యనాదముధైవతస్వరము - ధ. ఇది త్రిశ్రుతికము. త్వగ్ధాత్వగ్నిజన్యనాదము నిషాదస్వరము - ని. ఇది ద్విశ్రుతికము.

ఆధారగః శుక్రధాతుర్మజ్జాధాతుస్తు నాభిగః
హృదాశ్రయోఽస్థిధాతుః స్యాన్మేదోధాతుస్తు కంఠగః. 85

మాంసధాతుస్తాలుమూలే రక్తధాతుస్తు మూర్ధగః
భ్రూమధ్యగః స్యాత్త్వగ్ధాతుః క్రమాదేవం స్థితాః స్వరాః. 86

శుక్రధాతువు మానవుని మూలాధారస్థానగతమై యున్నది. మజ్జాధాతువు నాభిగతము. అస్థిధాతువు హృదయాశ్రయము. మేదోధాతువు కంఠగతము. మాంసధాతువు తాలుమూలము నందున్నది. రక్తధాతువు మూర్ధ

గతము. త్వగ్ధాతువు భ్రూమధ్యగతము. క్రమముగా స్వరము లిట్లు నియతస్థితిక ములై యున్నవి.

శుక్లస్యావరణం మజ్జా తదావరణమస్థి చ
అస్థ్నామావరణం మేదో మాంసం తస్యావృతిః భవేత్. 87

మాంసావరణమస్రం స్యాత్త్వక్చాస్రావరణం భవేత్
తస్మాత్త్వజః స్వరస్తారో మందః స్యాత్ శుక్లజః స్వరః. 88

ఏవముచ్చైస్త్వనీచైస్త్వభావ స్తేషాం విలోక్యతాం
శ్రుతీనాం చ స్వరాణాం చ స్థితిరేషాం స్వభావతః. 89

స్వర్యమాణతయా తత్తత్స్థానేషు మరుదాహతేః
స్వరసంజ్ఞాం లభంతే తే తత్తత్షడ్జాదినామభిః. 90

స్వరములలో మంద్రతారాదిభేదములు కలుగుటలో హేతు విచట నిరూపిత మగును. శుక్లమునకు మజ్జ యావరణముగా నున్నది. మజ్జ కావరణ మస్థి. అస్థుల కావరణము మేదస్సు. మాంసము మేదస్సున కావరణ. అస్రము మాంసావరణము. త్వక్కు అస్రమున కావరణము. ఇట్లుండగా త్వక్సంజాత మయిన స్వరము తారముగా నుండును. శుక్లజన్యమగు స్వరము మందముగా నుండును. ఇట్లే స్వరముల కుచ్చైస్త్వమును నీచైస్త్వమును సమాలోచన మొనరింపదగును. శ్రుతులకు స్వరములకు నిట్లు స్థితి స్వభావజముగా నున్నది. ఆ యా స్థానము లందు వాయ్వాఘాతము వలన స్వర్యమాణము లగుటచే స్వరము లయినవి. ఆ యా షడ్జాదినామములతో నవి వ్యవహృతము లగుచున్నవి.

## గ్రామములు, మూర్ఛనలు

ధ్వనేర్వివక్షావశతో గ్రామభేదప్రకల్పనా
వివక్షయైవ రాగాణాం మూర్ఛనా తానకల్పనా. 91

మధ్యమస్వరతో నాదో యో నిర్వర్తితుమీహితః
స ఏవ మధ్యమగ్రామః షడ్జగ్రామో యథాస్థితః. 92

త్రిచతుఃశ్రుతికౌ మధ్యగ్రామే పంచమధైవతౌ
అంత్యాదిక్రమయోగేన వ్యత్యయాత్సప్తమూర్ఛనాః. 93

గ్రామయోరుభయోస్తానత్రయే తాః సప్త సప్త చ
తానత్రయే ద్వాదశభిః స్వరైర్ద్వాదశ మూర్ఛనాః. 94

గతాగతీర్వితన్వంతి తేన తాస్తిర్యగాయతాః
శ్రుతయో గానకాలేఽత్ర సంయోగైక్యం భజంతి తాః. ౪౮

గ్రామములు మూర్ఛన లను వాని స్వరూప మిచట నున్నది. ధ్వని వివక్షావశమున గ్రామముల భేదకల్పన సిద్ధమయినది. వివక్ష వలననే రాగముల మూర్ఛనలు సిద్ధము లగుచున్నవి. తానముల కల్పనము సిద్ధమయినది. మధ్యమ స్వరారంభముగా నాదము నిర్వర్తింపదలచినచో మధ్యమ గ్రామమని, షడ్జస్వరా రంభముగా నాదనిర్వర్తన మిష్ట మయినచో షడ్జగ్రామమని వ్యవహారము కలుగు చున్నది. మధ్యమ గ్రామమునందు పంచమస్వరము త్రిశ్రుతికము, ధైవతస్వరము చతుఃశ్రుతికము నగును. అంత్యాదిక్రమ యోగమున వ్యత్యయము వలన సప్త మూర్ఛనలు గలుగును. షడ్జ మధ్యమ గ్రామము అందును తానత్రయము నందును మూర్ఛనలు సప్త సప్త సంఖ్యాకములుగా గలుగును. తానత్రయము నందు ద్వాదశస్వరములచే ద్వాదశమూర్ఛనలు గలుగును. కావున తిర్యగాయ తము లయిన శ్రుతులు గతాగతుల నొనరించును. గాన కాలమున సంయోగైక్య మును పొందును. ఇట్టిది యిచట శబ్దార్థము.

సంగీతశాస్త్ర సంప్రదాయసిద్ధము లయిన సాంకేతికపదము లిచట ప్రయుక్తము లయినవి. వాని స్వరూపార్థముల నీ విధముగా గ్రహింప వచ్చును. శ్రుతి—స్వరము—గ్రామము—మూర్ఛన—తానము-రాగము అనునవి యిచట నుప యుక్తము లయినవి. శ్రుతిపదము నాధారశ్రుతి యను నర్థమున గ్రహింప వలెను. శ్రుతులు తగిన విధమున నున్నచో 'శ్రుతిబద్ధ సంగీతము'' అందురు. శ్రుతి స్వరావయవము. ప్రథమశ్రవణమున హ్రస్వమాత్రకముగా వినదగినది. ఒకశబ్దము వినునపుడు మొదట వినబడు సూక్ష్మభాగము శ్రుతి యగును. శ్రుతియే దీర్ఘ దీర్ఘమై ''స్వరము'' అగును. స్వరసప్తకము ప్రసిద్ధము. సప్తస్వరము లందు ద్వావింశతి ౨౨ శ్రుతులుండును. శ్రుతి యనంతరమున ననురణనాత్మకముగా నుండు శబ్దము స్వర మందురు. ఒకే శబ్దమున నాహతిచే గలుగు శబ్దము ధారా క్రమమున నుత్పన్నమై క్రమముననె లీనమగును. ఈ విధానము ననురణన మందురు. అనురణనము స్వరమునకు ముఖ్యస్వరూపము. అనురణనమున స్వరము లందలి శ్రుతు లవభాసింపగలవు. శ్రుతిస్వరములకు భేదమును ప్రాచీనులు నిశ్చ యించిరి. రెండు మూడు నాలుగు శ్రుతుల వలన స్వరము లుదయించుట్లను నాట్యవేదము చెప్పినది. ఒక శ్రుతి వలన స్వర ముదయింపదు. ఒక శ్రుతి

"స్వతోరంజకత్వము" కలదికాజాలదు. స్వరమునకనురణనమును గుదురదు. శ్రుతి స్వరావయవమును గాకపోవును. స్వరమె యగును. అది శాస్త్రవిరుద్ధము. ఇరువదిరెండు శ్రుతులకు నిరువది రెండు నామములున్నవి. తీవ్ర—కుముద్వతి—మంద—ఛందోవతి—దయావతి—రంజని—రతిక—రౌద్రి—క్రోధ—వజ్రిక—ప్రసారిణి—ప్రీతి—మార్జని—క్షితి—రక్త—సందీపని—ఆలాపిని—మదన్తి—రోహిణి—రమ్యా—ఉగ్ర — క్షోభిణి.

గ్రామశబ్దము సమూహవాచి. కుటుంబము లోని వారంద రేకముగ నుండి మర్యాదాపాలన మొనరించునట్లు సంవాదిస్వరము లొక సమూహముగా నుండుట గ్రామ మందురు. ఇందు శ్రుతులు వ్యవస్థితరూపమున నుండును. గ్రామములు షడ్జగ్రామమని, మధ్యమగ్రామమని, గాంధారగ్రామమని మూడు విధములు. గాంధార గ్రామ మతితార మతిమంద్రము నయినందున భరతుడు నిరూపింపలేదు. షడ్జమధ్యగ్రామములనే భరతుడు చెప్పెను. కొందరు గాంధార గ్రామ జాత రాగముల నుపదేశించిరి. యజ్ఞముల కుపయోగించు రాగములను నారదుడు నిరూపించెను. లౌకిక ప్రయోజనమునను గొన్ని యుండునని నాన్యదేవు డనెను. లౌకికవినోదములలో రాగవినియోగమును అప్రశస్తమని కొందరు భావించిరి. గాంధారగ్రామము స్వర్గమున నున్నదని నారదు డనెను.

ఆ యా స్వరముల శ్రుతు లీ విధమున నుండును.

షడ్జ 4. ఋషభ 3. గాంధార 2. మధ్యమ 4. పంచమ 4. ధైవత 3. నిషాద 2. మొత్తము స్వరములు 7. శ్రుతులు 22.

షడ్జగ్రామమున స్వరములు "స రి గ మ ప ధ ని" అను క్రమముననె యుండును.

మధ్యమగ్రామమునందు మధ్యమస్వరముతో సమారంభముండును గావున—మధ్యమ 4. పంచమ 3. ధైవత 4. నిషాద 2. షడ్జ 4. ఋషభ 3. గాంధార 2. మధ్యగ్రామమున స్వరములు "మ ప ధ ని స రి గ" అను క్రమమున నుండును. ఇందు పంచమధైవతముల శ్రుతి సంఖ్య మారును. పంచమ ధైవతములు త్రిచతుః శ్రుతికములుగా నుండును. రెండు స్వరములకు నవశ్రుతి వ్యవధానము కాని త్రయోదశశ్రుతివ్యవధానము కాని యున్నచో నా స్వరములు సంవాది స్వరము లగును. షడ్జగ్రామములో షడ్జపంచమములు ఋషభధైవతములు, గాంధారనిషాదములు, షడ్జమధ్యమములు పరస్పరము సంవాది స్వరములు. మధ్యమగ్రామములో షడ్జపంచమములకు పరస్పరము సంవాదము లేదు. ఋషభపంచమములకు పరస్పరము సంవాదము కలిగినది.

మూర్ఛనాస్వరూప మిట్లు పరిగ్రాహ్యము. సప్తస్వరములు క్రమయుక్తములు కాగా మూర్ఛన యగును. మూర్ఛాధాతువున నిది సిద్ధ మయినది. మోహము ఉచ్ఛ్రాయము ధాత్వర్థములు. ఆరోహావరోహక్రమయుక్తమయిన స్వరసముదాయము మూర్ఛన యని, యారోహక్రమమున నుండు స్వరసముదాయము తాన మని యనిరి. ఆరోహక్రమమున నుండు స్వరసముదాయము మూర్ఛన యని, అవరోహక్రమమున స్వరసంప్రదాయము తాన మని కొందరనిరి. తానములు మూర్ఛనాశ్రయములని, మూర్ఛనలో నొకటి రెండుస్వరముల లోపమున తానము లగునని యనుట భరతసమ్మతము. సప్తస్వరములు క్రమముగా నారోహమున నవరోహమున నుండుట మూర్ఛన యని సంగీతరత్నాకరకారు డనెను. "స రి గ మ ప ధ ని, ధ ప మ గ రి స" అను విధ మొక విధమగు మూర్ఛన. అవరోహక్రమమున శ్రుతిలో నుండు మార్దవము మూర్ఛన యగునని కొందరి భావము. గాయకులకు శ్రోతలకు రాగామృతహ్రదమున మనోనుజ్జన ముండుట మూర్ఛన యని కోహల మతము. కాని సప్తస్వరములకు క్రమపూర్వక ప్రయోగముండుట మూర్ఛన యనుట భరతసమ్మతము.

షడ్జగ్రామమున సప్తమూర్ఛన లుదయించును. ఉత్తరమంద్ర - రజని - ఉత్తరాయత - శుద్ధషడ్జ - మత్సరీకృత - అశ్వక్రాంత - అభిరుద్గత యని వీని పేరులు. వీనికాదిస్వరములు షడ్జ నిషాద ధైవత పంచమ మధ్యమ గాంధార ఋషభము లుండును.

స రి గ మ ప ధ ని
ని స రి గ మ ప ధ
ధ ని స రి గ మ ప
ప ధ ని స రి గ మ
మ ప ధ ని స రి గ
గ మ ప ధ ని స రి
రి గ మ ప ధ ని స

మధ్యమగ్రామమున గూడ సప్తమూర్ఛన లుదయించును. సౌవీరి - హారిణాశ్వ - కలోపనత - శుద్ధమధ్య - మార్గి - పౌరవి - హృష్యక యని వీని పేరులు. వీని కాదిస్వరములు మధ్యమ - గాంధార - ఋషభ - షడ్జ - నిషాద - పంచమము లుండును.

మ ప ధ ని స రి గ
గ మ ప ధ ని స రి
రి గ మ ప ధ ని స
స రి గ మ ప ధ ని
ని స రి గ మ ప ధ
ధ ని స రి గ మ ప
ప ధ ని స రి గ మ

స్వరసప్తకము ననుసరించిన యీ మూర్ఛనావాద మిట్లుండగా, ద్వాదశస్వరం మూర్ఛనావాద మొకటి కలదు. కంఠమున తంత్రీవాద్యమున జాతివిశేషము లను రాగ విశేషములకు ప్రయోగింపవలసి యుండును. అప్పుడు మంద్రమధ్యతారస్థానముల ప్రాప్తి యుండును. అప్పుడు ద్వాదశ స్వరములతో మూర్ఛన లుండుట గ్రాహ్యము. అప్పుడే రాగసిద్ధి యుండును. మూర్ఛనలో మంద్రతారస్థానములకై సప్తస్వరములనే కాక ఇంకను కొన్ని స్వరములను కలుప వలసి యుండును. మంద్రతారస్వరయోజనమున రాగ సిద్ధికలుగును. కావున మూర్ఛనలో ద్వాదశస్వరము లుండుటయావశ్యకము. ఇట్టి భావమున సప్తస్వరమూర్ఛనలలో నాద్యంతములందు స్వరముల గొన్నిటిని కూర్చుట యావశ్యక మయినది. అప్పుడు ద్వాదశాక్షర యుతము లయిన మూర్ఛనలు ద్వాదశసంఖ్యాకములు షడ్జగ్రామమున మధ్యమ గ్రామమున భావనీయము లగును. ఆ స్వరసన్నివేశ మిట్లుండును.

1. ధ ని స రి గ మ ప ధ ని స రి గ
2. ని స రి గ మ ప ధ ని స రి గ మ
3. స రి గ మ ప ధ ని స రి గ మ ప
4. రి గ మ ప ధ ని స రి గ మ ప ధ
5. గ మ ప ధ ని స రి గ మ ప ధ ని
6. మ ప ధ ని స రి గ మ ప ధ ని స
7. ప ధ ని స రి గ మ ప ధ ని స రి
8. ధ ని స రి గ మ ప ధ ని స రి గ
9. ని స రి గ మ ప ధ ని స రి గ మ
10. స రి గ మ ప ధ ని స రి గ మ ప

11. రి గ మ ప ధ ని స రి గ మ ప ధ
12. గ మ ప ధ ని స రి గ మ ప ధ ని

ఇవి షడ్జగ్రామమునకు సంబంధించిన మూర్ఛనారూపములు. ఇట్లె మధ్యమగ్రామమునకు సంబంధించిన మూర్ఛనారూపములను ప్రస్తరించి గుర్తించనగును. "ని స రి గ మ ప ధ ని స రి గ మ" అనునవి మొదటి మూర్ఛనా స్వరములు. వీని ప్రస్తారవిన్యాసముతో నవశిష్టములను గుర్తింపవచ్చును.

ఒకవిషయ మిచట హృదయధార్యము. సప్తస్వరమూర్ఛనల క్రమ మవరోహోన్ముఖము. షడ్జగ్రామమునకు సంబంధించిన మూర్ఛనలో క్రమముగా స ని ధ ప మ గ రి స్వరము లున్నవి. మధ్యమగ్రామమునకు సంబంధించిన మూర్ఛనలో క్రమముగ మ గ రి స ని ధ ప స్వరములున్నవి. ద్వాదశస్వరమూర్ఛన లారోహోన్ముఖములు. అందు షడ్జగ్రామములో ధ ని స రి గ మ ప, మధ్యమ గ్రామములో ని స రి గ మ ప ధ స్వరము లారంభమున నున్నవి. ఇట్టి యీ గహన విషయము నాయా గ్రంథముల నుండి గుర్తించుట యుచితముగా నుండును.

స్మృతి వ్యవసిత ఆరంభ స్పర్శ భిన్న లయక్రమాత్
షడ్భిరంగైః సుసంపన్నాః శ్రుతయః పరికీర్తితాః. 96

స్మృతిర్ధ్వనేస్తారతమ్యవిమర్శ ఇతి కథ్యతే
నాడీముఖేభ్యో నాదస్య వ్యక్తిర్వ్యవసితం భవేత్. 97

శ్రుత్యైక్యభావనౌత్సుక్యమారంభ ఇతి కీర్తితః
స్పర్శస్తద్ధ్వనిస్పర్శో వ్యక్తిస్థానేషు సప్తసు. 98

భిన్నో ధ్వనేః ప్రభేదః స్యాచ్చతుస్త్రిద్విప్రకారతః
శ్రుతీనాం లీయమానత్వం లయో నీచోచ్చభావతః. 99

శ్రుతులకు షడంగరీతి యున్నది. అది యిందున్నది. స్మృతి - వ్యవసితము - ఆరంభము - స్పర్శము - భిన్నము - లయము అను నారును క్రమముగా శ్రుతులకు సంబంధించిన యంగములు. శ్రుతులు షడంగ సుసంపన్నములై యుండుట పరికీర్తిత మయినది. క్రమముగా వీని లక్షణము లిట్లున్నవి. ధ్వని తారతమ్యవిమర్శమును స్మృతి యందురు. నాడీముఖముల నుండి నాదము వ్యక్త మగుటను వ్యవసిత మందురు. శ్రుతుల నైక్యభావనమున గలుగు

నౌత్సుక్యమునకు ఆరంభ మని పేరు. సప్తవిధము లయిన స్వరవ్యక్తిస్థానము లలో నా యా ధ్వనుల స్పర్శమును స్పర్శ మందురు. నాలుగు మూడు రెం డను ప్రకారమున ధ్వని ప్రభేదమును భిన్న మందురు. శ్రుతులు నీచోచ్చభావ మున లీయమానము లగుటను లయ మందురు. ఈ షడంగసంపన్నత శ్రుతుల కావశ్యకము.

తాస్త్రిధా స్యుః పునః భిన్న న్యూనాధిక విభాగతః
భిన్నా ద్విశ్రుతికా స్తత్ర న్యూనాస్త్రిశ్రుతిసంజ్ఞకాః. 100

చతుఃశ్రుతీకా అధికాః స్వరాంశాః శ్రుతయ స్త్విమాః
స్వరితేనానుదాత్తేన భిన్నసంజ్ఞాః ప్రకీర్తితాః. 101

ఉదాత్తాచ్చానుదాత్తాచ్చ స్వరితాన్న్యూనసంజ్ఞితాః
ఉదాత్తానుదాత్త(?)స్వరితప్రచయేనాధికాః స్మృతాః. 102

శ్రుతులకు భిన్నాదివిభాగమున త్రిధా విభాగ మున్నది. భిన్నములు న్యూనములు అధికము లని శ్రుతులు మూడు విధము లగుచున్నవి. ద్విశ్రుతి కములు భిన్నము లని, త్రిశ్రుతికములు న్యూనము లని, చతుఃశ్రుతికము అధిక ములని స్వరాంశశ్రుతులను భావింపవలెను. స్వరితస్వరమున ననుదాత్తస్వరమున నవి భిన్నసంజ్ఞ కల వయినవి. ఉదాత్తానుదాత్తస్వరితముల వలన న్యూనసంజ్ఞ కలవయినవి. ఉదాత్తానుదాత్తస్వరితప్రచయముల వలన శ్రుతు లధికసంజ్ఞ కల వయినవి.

యథా శ్రుతిభవాః శుద్ధరాగా ఇతి సమీరితాః
భిన్నాధికాః క్రమభవాః గౌడరాగాః ప్రకీర్తితాః. 103

అధికన్యూనసంసృష్టిమయా వేసర సంజ్ఞకాః
భిన్నన్యూనోపగమనాద్భిన్నరాగా ఇతి స్మృతాః. 104

సాధారణాః స్యుర్వ్యత్యస్తభిన్నన్యూనాధికాత్మకాః

రాగములలో నయిదు భేదములు కలవు. యథాశ్రుతిభవములు శుద్ధ రాగములు. భిన్నాధికములు క్రమభవములు నగునవి గౌడరాగములు. న్యూనాధికసంసృష్టి స్వరూపము లగు నవి వేసర రాగములు. భిన్న న్యూనసంబంధమున భిన్నరాగములు. భిన్నన్యూనాధికస్వభావములు వ్యత్యస్త

ములు కాగా సాధారణరాగములు నగునని రాగవిదులు కీర్తించిరి. ఇతి శబ్దార్థము.

రాగవిషయమున నిది సంగ్రాహ్యాంశము. స్వరవర్ణ విశేషిత మయిన ధ్వని విశేషము జనచిత్తరంజక మగుచేని రాగమగును. జగమున నున్న వారి చేతో రంజన మొనర్ప గలుగునవి రాగములు. "రంజనాద్రాగః". రాగములు రెండు విధములు — ప్రాచీనరాగములు నవీనరాగములు నని. ప్రాచీనరాగము లను మార్గరాగములని భాషారాగము లని యందురు. నవీనరాగములకు దేశీ రాగము లని పేరు. మార్గరాగ భాషారాగ దేశీరాగములకు శుద్ధరాగ ఛాయా లగరాగ సాధారణరాగము లనియు పేరు కలదు. భరతాదుల యుపదేశానుసా రమున మార్గరాగము లందు శుద్ధ వికృత జాతిలక్షణములు స్పష్టముగా నిరూ పితము లయినవి.

మార్గరాగములలో మూడు భేదములున్నవి - గ్రామరాగ శుద్ధరాగ ఉపరాగములు అని. గ్రామరాగము లయిదు విధములు — శుద్ధ భిన్న గౌడ వేసర సాధారణరాగములు అని. కావ్యనాటక గీతాభిరుచి ననుసరించి, కావ్యము లందలి రీత్యనుసారమున, నాటకము లందలి వృత్త్యనుసారమున గీతులలో భేదము కలిగినది. గీతిపంచకానుసారమున గ్రామరాగములలో నయిదు భేద ములు సిద్ధము లయినవి.

శుద్ధగీతిలో స్వరము వక్రతారహితమై మృదులముగా నుండును. గౌడగీతిలో స్వరములకు నిబిడత్వ ముండును. మూడుస్థానములలో సంచా రము గమకయుక్తముగా నుండును. మంద్రస్థానమున విశేషసంచార ముండును. వేసరములో స్వరప్రయోగము వేగముగా నుండును. రక్తిపూర్ణముగా నుండును. భిన్నగీతిలో స్వరము వక్రము సూక్ష్మము మధురము గమక యుక్తముగ నుండును. సాధారణగీతిలో పై నాలుగు లక్షణములు మిశ్రిత ములై యుండును. ఈ రాగముల యనుసారమున గ్రామరాగము లుత్ప న్నము లయినవి. శారదాతనయు డీ యంశమును సూత్రముగ సూచించినాడు. ఇక స్వరములవలన రాగము లుదయించిన రీతి నిరూపిత మగును.

ఉదాత్తశ్చానుదాత్తశ్చ స్వరితప్రచయావపి. 105
నిహతం కంపితం చైవ తథాకంపితమేవ చ
తాని స్వరాణామంగాని సంతి సంజ్ఞాంతరాణ్యపి. 106

ఆద్యంతాన్వయభేదేన న్యూనభిన్నాధికేన చ
మంద్రమధ్యమతారేణ ఛాయాసంఖ్యాక్రమేణ చ. 107

ఉదాత్తేనానుదాత్తేన స్వరితప్రచయేన చ
కంపితాకంపితేనైవ స్వరేభ్యో రాగసంభవః. 108

ఆద్యంతాన్వయభేదస్తు మూర్ఛనైవేతి కీర్త్యతే
న్యూనభిన్నాధికత్వం తు పురస్తాదేవ దర్శితమ్. 109

మంద్రమధ్యమతారం తత్థ్సానత్రయమీరితం
రాగవ్యక్తికృతాలాపశ్ఛాయేతి పరిభాష్యతే. 110

షాడవౌడువ సంపూర్ణ భేదః సంఖ్యేతి కీర్త్యతే
అత్రోదాత్తాదయస్సప్త ప్రసిద్ధా ఇతి నేరితాః. 111

గ్రహాంశస్తారమంద్రౌ చ షాడవౌడవితే అపి
అల్పత్వం చ బహుత్వం చ న్యాసోపన్యాస ఏవ చ. 112

ఏతద్రాగవిభాగార్థం దశకం జాతిలక్షణం

స్వరాంగములు సప్తసంఖ్యాకములు కలవు. ఉదాత్తము - అనుదాత్తము - స్వరితము - ప్రచయము - నిహతము - కంపితము - అకంపితము అని. వీనికి సంజ్ఞాంతరములును గలవు. స్వరముల వలన రాగములు సంభవించుచున్నవి. ఆద్యంతాన్వయభేదము - న్యూనభిన్నాధికభావము - మంద్రమధ్యమతారస్వభావము - ఛాయాసంఖ్యాక్రమము - ఉదాత్తానుదాత్తవిధానము - స్వరిత ప్రచయవిధానము — కంపితాకంపితరీతి అనువాని సంబంధమున స్వరములు రాగసంభవకారణము లగుచున్నవి. వీనిలో ఆద్యంతాన్వయభేద మనునది మూర్ఛన యగునని నిరూపిత మయినది. స్వరముల యారోహావరోహ విన్యాసము దీని రూపము. న్యూనభిన్నాధిక విధానములు నిరూపితములు. వానివలన గూడ రాగము లుదయించు ననుటకై యిచట సూచితములు. మంద్రమధ్యమతారవిధానము స్వరముల స్థానత్రయ మనియు నిరూపితప్రాయము. ఛాయాసంఖ్యాక్రమ మను వానిలో ఛాయ యనగా రాగవ్యక్తికై యొనరించు నాలాప మని గ్రహింప దగును. ఇట్టి ఛాయాక్రమము రాగోదయహేతువు. షాడవ ఔడువ సంపూర్ణ భేదమును సంఖ్య యందురు. ఉదాత్తాదిసప్తకము ప్రసిద్ధము కావున నిరూపింప నవసరము కాదు. గ్రహ - అంశ - తార — మంద్ర—

షాడబ-ఔడువ-అల్పత్వ-బహుత్వ-న్యాస-అపన్యాసము లను దశకము రాగ విభాగమున కయిన జాతిలక్షణము. నానావిధములగు రాగము లుదయించుటకీ దశక మాధారము.

ఏతైః సప్తశతం రాగాః సంఖ్యాతా గీతకోవిదైః. 113

రాగాః సంపూర్ణనామానః స్వరసప్తకసంయుతాః
తానా న్యేకోనపంచాశత్కథ్యంతే పూర్ణనామసు. 114

ద్విచత్వారింశతా తానైః భాషాః షడ్భిః స్వరైర్భవేత్
పంచత్రింశన్మితై స్తానైః విభాషాః పంచభిః స్వరైః. 115

అష్టావింశతిభిస్తానైః అనుభాషా చతుఃస్వరైః
ద్వాదశారసముత్పన్నా ద్వాదశస్వరపూరితాః. 116

తానాః చతురశీతిస్తు తేఽపి స్యుర్మధ్యమాదయః

ఈ పది గ్రహాదుల వలన నేడువందల రాగము లుదయించునని గీత కోవిదులు సంఖ్యానించిరి. ఈ రాగము లన్నియు స్వరసప్తకముతో గూడుకొనిన పూర్ణ రాగములు. ఈ పూర్ణ రాగములందు తానము లేకోనపంచాశత్— 49. ఒకటి తక్కువగా నేబది యున్నవనిరి. భాషారాగములు విభాషారాగములు అనుభాషారాగములు మరికొన్ని కలవు. వానిలో భాషారాగములు నలుబది రెండు తానములచే నారుస్వరములచే గలుగును. విభాషారాగములు ముప్పది యయిదుగా పరిమితము లయిన తానములచే నయిదు స్వరములచే గలుగును. అనుభాషారాగములు ఇరువదియెనిమిది తానములచే నాలుగుస్వరములచే గలుగును. ద్వాదశస్వరపూరితము లయిన ద్వాదశార సముత్పన్నములగు తానములు ఎనుబది నాలుగు కలవు. అవి మధ్యమాదులని పరిగణించిరి. భాషారాగపదము లోని భాష యనగా గ్రామరాగముల యాలాపప్రకారమని యర్థము. అట్లె విభాషాంతరభాషాశబ్దములును తత్తదనంతరోత్పన్నము లయిన యాలాప ప్రకారములని తెలియ వలయును. రంజనమున రాగత్వ మందును గలదని గ్రాహ్యము— "గ్రామరాగాణా మేవాలాపప్రకారా భాషావాచ్యాః" అని మతంగోక్తి.

తానములను గురించిన విషయ మొకింత ప్రకృత మావశ్యకము. "తన్యతే విస్తార్యతే ఇతి తానః" శుద్ధములగు మూర్ఛనలకు తానములని పేరు. వివక్షితస్వరములలో నొక స్వరమున కపకర్షమున స్వరద్వయాపకర్షణమున

షాడవ—ఔడువీకృతము లయిన మూర్ఛనలు తానము లగును. అనగా సప్తస్వర ములుండ వలసినవి కాగా షట్స్వరము లున్నచో షాడవము లని, పంచస్వరము లున్నచో ఔడవితము లని యందురు. శుద్ధమూర్ఛనలు షట్స్వరపంచస్వరమూర్ఛ నలు తానము లగునని భావము. షడ్జగ్రామగతము లయిన మూర్ఛనలు షడ్జస్వర హీనములు కాగా సప్తతానము లగును. ఋషభహీనము లయినను సప్తతానములు కలుగును. పంచమహీనములు సప్తతానములు. నిషాదహీనములు సప్తతానములు. కావున షడ్జగ్రామమున షాడవతానములు అష్టావింశతి 28 అగును. మధ్యమ గ్రామమున సప్తమూర్ఛనలు షడ్జరహితము లయినపుడు సప్తతానములు, ఋషభ రహితములు సప్తతానములు, గాంధారరహితములు సప్తతానములు కాగా షాడవ తానములు 21 అయినవి. గ్రామద్వయమున నున్న తానములు కలసి $28+21=49$ తానము లయినవి. ఔడువితము లయిన తానము లీ విధ ముగా నున్నవి. షడ్జగ్రామమునలోని మూర్ఛనలు షడ్జపంచమ రహితములు కాగా ఔడువ తానము లేదు గలుగును. గాంధార నిషాదరహితము లయినచో సప్తతాన ములు కలుగును. ఋషభపంచమరహితము లయినచో సప్తతానములు. మొత్తమివి యేకవింశతి 21 తానము లయినవి. మధ్యమగ్రామమున ఋషభధైవత రహితములు సప్తతానములు, గాంధార నిషాదరహితములు సప్తతానములు. ఇట్లు మధ్యమగ్రా మమునందలి ఔడువితతానములు పదునాలుగు. గ్రామద్వయమునన్నున్న ఔడువ తానములు ముప్పదియైదు యయినవి. షాడవౌడువ తానము లన్నియు $49+35=84$ చతురశీతి సంఖ్యాకము లయినవి. ఇంక నీ తానవిషయమున గ్రాహ్యా శేషము లనేకములు కలవు. ప్రవేశమున నిగ్రహమున తానక్రియ రెండువిధ ములు.స్వరములు వ్యుత్క్రమోచ్చారితములు కాగా కూటతానములు వెలువడును. కూటతానసంకలనమున 282240 తానము లగుననిరి.ఇట్టి విధానముల నన్నిటి నా యా గ్రంథములందు జూడదగును.

పదం యతిర్గతిః స్థానం లయః కాల స్తథా త్రిధా 117
సప్తవింశదలంకారా గమకాః సప్త చైవ హి
ద్వావింశన్మార్గగమకా ద్వావింశచ్ఛ్రుతిగామినః. 118
ఏతేషామేకతాయోగో యథా గీతేఽవగమ్యతే
తథైవ తే ప్రయోక్తవ్యా గాయకైర్గీత కోవిదైః. 119

గీతమునందు పదాదుల కేకతాయోగ మావశ్యకము. పదము-యతి-గతి—స్థానము-లయ—కాలము—సప్తవింశదలంకారములు-సప్తగమకములు - ఇరువది

రెండు మార్గగమకములు-ఇరువది రెండు శ్రుతిగామిగమకములు అను వీనికి ఏకతాయోగము సహాయోగము గీతము నందత్యంత మావశ్యకము. గీతప్రయోగమునందు వీని సామరస్య మవభాసించునట్లుగా గీతకోవిదు లగు గాయకులు సావధానులుగ నుండవలెను. గాయకు లిట్లే గీతప్రయోగ మొనరింప వలసి యున్నది. ఇంక పదాదుల స్వరూపము ప్రతిపాదిత మగును.

తద్భవం తత్సమం దేశీత్యేతత్స్యాత్పదలక్షణం
పదం స్వరాధికరణమర్థప్రత్యయకారి యత్. 120

తద్భవము తత్సమము దేశి యని పదము త్రివిధము. స్వరముల కాధారము. అధికరణము. అర్థజ్ఞానము కలుగ జేయునది పదము. ఇది పదలక్షణము.

తిస్రః స్యుర్యతయో నామ్నా ద్వంద్వ భిన్న సమా ఇతి
తాసాం మార్గాస్త్రయోఽపి స్యుః చిత్ర వార్తిక దక్షిణాః. 121

ఆద్యంతయోశ్చ మధ్యే చ లయపాణి పదైః సమా
వాద్యప్రాధాన్యభూయిష్ఠా చిత్రే జ్ఞేయా సమా యతిః. 122

క్వచిచ్చైవావతిష్ఠేత క్వచిచ్చైవ ప్రధావతి
వాద్యగేయాత్మికా వృత్తా భిన్నా స్రోతోవహా గతిః. 123

అవ్యక్తవర్ణా ద్వంద్వాఖ్యా గురుభిర్లఘు భిస్యుతా
లంబితా గేయభూయిష్ఠా గోపుచ్ఛా దక్షిణే యతిః. 124

యతులు మూడు విధముల నున్నవి — ద్వంద-భిన్న—సమ యని. ఆ యతుల మార్గములు మూడు గలవు — చిత్ర-వార్తిక - దక్షిణములు అని వీనిలో సమయతి యనునది ఆద్యంతమునందును మధ్యయందును సమానమగు లయవిధానమున గూడ యుండుట. సమపాణిపదములతో (సమపాణి అర్ధపాణి ఉపరిపాణి) మండును. లయప్రయోగనియమము యతి కావున నిందు నియత లయరీతి యుండును. చిత్రమార్గమునందు వాద్యప్రాధాన్య మధికముగా నుండును. అట్టిది సమయతి. భిన్నయతిని స్రోతోవహా యతి యనియు నందురు. స్రోతస్సు—ప్రవాహము జలము వృద్ధి కాక పూర్వము విలంబితగతిలో నుండును. జలము వృద్ధికాగా వేగముగ ప్రవహించును. అట్లె యీ యతి మొదట విలంబితరీతితో నుండి, మధ్యలో మధ్యలయ ననుసరించి తుదకు ద్రుత

లయ గలది యగును. ఈ యంశమె ఒకచో నిలబడును, ఒకచో ప్రధావన మొనరించు నని సూచిత మగునది. విలంబితమధ్యలయరీతి, మధ్యద్రుతరీతియు స్రోతోవహ యతి యగు నందురు. స్రోతోవహాయె భిన్నయతి. ఇది వార్తిక మార్గమున నుండునది యని గ్రాహ్యము. మూడవది ద్వంద్వయతి. దీనినే గోపుచ్ఛాగ్రయతి యనియు నందురు. గోపుచ్ఛసాదృశ్యము ననుసరించి మొదట ద్రుతరీతి మధ్యలో మధ్యరీతి అంతమున విలంబితరీతి యున్నచో గోపుచ్ఛ యతి యందురు. ఇదియె ద్వంద్వయతి. అవ్యక్తవర్ణమై గురులఘువులతో గూడినదై విలంబితలయాన్వితమై గేయభూయిష్ఠముగా నుండునది ద్వంద్వ యతి. ఇది దక్షిణమార్గసంచార యతి.

సింహో మృగ స్తథా భృంగో రథశ్శకట ఏవ చ
ఏతేషాం గతయః పంచ గీతే గీతివిదీరితాః. 125

గీతమునందు గీతివిదులు నిరూపించిన యయిదు గతులు కలవు—సింహ గతి-మృగగతి—భృంగగతి—రథగతి—శకటగతి యని.

స్థానము క్తం లయస్త్రేధా ద్రుతం మధ్యం విలంబితం
కాలస్త్రిధా ద్విమాత్రశ్చ చతుర్మాత్రోఽష్టమాత్రికః. 126
చిత్రే చ వార్తికే మార్గే దక్షిణే చ నియమ్యతే

గత్యనంతరము చెప్పదగినది స్థానము. స్థాన మిదివరలో నిరూపితము. అనంతరము లయ. లయ మూడు విధములు—ద్రుతలయ - మధ్యలయ - విలంబిత లయ యని. కాలము మూడు విధములు — ద్విమాత్రకాలము చతుర్మాత్ర కాలము అష్టమాత్రకాలము అని. కాలము చిత్రమార్గమున వార్తికమార్గమున దక్షిణ మార్గమున నియత మగును. ఇక నలంకారములు చెప్పవలెను.

ప్రసన్నం మధురం రక్తం గంభీరం విశదం లఘు 127
స్పష్టముల్లాసి లలితం గుర్వోజస్వి సమం మృదు
ప్రౌఢం ప్రరూఢమాత్తం చ విదగ్ధం శుద్ధముద్ధతమ్. 128
విదర్భితం పల్లవితం నవం కోరకితం కలం
నిరపేక్షం నిరాకాంక్షం నిరాలంబన మేవ చ. 129
సప్తవింశదలంకారా హ్యేత ఏవ గుణాః స్మృతాః.

ప్రసన్నాది నిరాలంబనాంతములు సప్తవింశదలంకారములు — ౨౭. అలంకారములనే గుణము లందురు. వర్ణ విశేషముల ననుసరించిన స్వరముల కూర్పు, గానసౌందర్యము సంపాదించు ఘటన మలంకారము. కావ్యము లందు వర్ణితములగు నలంకారములు వేరు. ఈ గీతాలంకారములు వేరు ఇవి స్వర సంధాన స్వరూపములు. లక్షణవిశేషవిశిష్ట మయిన వర్ణసముదాయ మలంకారమని భరతాదుల భావము. అలంకారలక్షణవ్యుత్పత్తుల నిట్లు గుర్తించునది. అలంకార మన నేమి? వ్యుత్పత్తి యెట్టిది? అలంకారమనగా మండనము. కటకకేయూరా ద్యలంకారమున నారి నరుడు మండితులై శోభకల వారగుదురు. అట్లే యిందలి ప్రసన్నాద్యలంకారములచే నలంకృత మయిన వర్ణాశ్రయ మయిన గీతి గాతకు శ్రోతకు సుఖావహ మగును. "డుకృఞ్ కరణే" ధాతు వలంపూర్వమై 'అలంకార' మగును. ఈ యలంకారము లనేకములయిన నిచట నిరువదియేడు సంకేతితము లయినవి. నియతవిధానమున స్వరముల నుచ్చరించుట వర్ణ మందురు. ఈ వర్ణము నాలుగు విధములు — స్థాయి—ఆరోహి-అవరోహి-సంచారి యని. స్థాయి వర్ణాదుల సముదాయ మలంకారము.

ద్వాభ్యాం త్రిభిశ్చతుర్భిః స్యాదలంకారోఽథ పంచభిః. 130

సముచ్చితైస్త ఏవ స్యుర్గుణాః గీతేః పృథక్ పృథక్
అలంకారాః ప్రయుజ్యంతే ఛాయాలాపేషు ధాతుషు 131

షట్త్రింశత్స్యురలంకారా వర్ణేషు భరతోదితాః
వర్ణాశ్రయానలంకారాన్ వదంత్యన్యే త్రయోదశ. 132

వర్ణద్వయము వర్ణత్రయము వర్ణచతుష్టయము వర్ణపంచకము నియతముగా గూడుకొనగా నలంకార మగును. అవియే సముచ్చితములు కాగా గుణము లన దగినవగును. గీతికన్న వేరు వేరుగా నలంకారములు ఛాయాలాపము లందును ధాతువు లందును ప్రయుక్తములగును. వర్ణములలో ముప్పదియారలంకారములను భరతుడు చెప్పెను. వర్ణాశ్రయము లగు నలంకారములను కొందరు పదమూ డని పరిగణించిరి.

కంపితః స్ఫురితో లీనః త్రిభిన్నః తిరిపుస్తథా
ఆందోలితశ్చాహతశ్చ గమకాః సప్త కీర్తితాః. 133

స్వరూపం కథ్యతే నైషాం వ్యాఖ్యాతత్వాదనేకశః

గమకములు సప్తసంఖ్యాకము లున్నవి. కంపిత - స్ఫురిత—లీన—త్రిభిన్న—త్రిరిపు-ఆందోలిత-ఆహతము లేడును గమకములు. స్వరమున రంజనమునకై కంపనము కలిగించుటను గమక మందురు. ఒకస్వరమునకు పూర్వోత్తర స్వరముల గలుపుకొని వేగముగా స్వరమును పలుకగా గమకము సముత్పన్న మగును. వీని స్వరూపము నిచట ప్రతిపాదించుట లేదు ఇతరు లనేకవిధముల వ్యాఖ్యానించిరి. కొందరు గమకములు పదునైదు కలవనిరి. వాని నా యా స్థలములందు జూడదగును.

నిస్వానితం చ స్ఫురితం వితతం విధుతం తథా. 134

భ్రమితం దీర్ఘలలితమురస్ఫారం శిరోగురు
ఉల్లోలితాక్షిప్తకే చ లీలోత్సారితకుంచితే. 135

ప్రతిశ్రుతమురఃక్షిప్తం కంఠాక్షిప్తకమేవ చ
సమాక్షిప్తం కోమలం చ మూర్ధాక్షిప్తం వికృష్టకమ్. 136

ఉద్వర్తితం పరావృత్తమపవర్తితమేవ చ
ఏతాని మార్గగమకా ఇతి విద్వద్భిరీరితాః. 137

మూర్ఛనాక్రమతస్తత్తత్స్వరశ్రుతిసమాశ్రయాః

మార్గగమకము లిరువదిరెండు కలవు. ఈ శ్లోకము లందున్న నిస్వానితాది అపవర్తితాంతము లిరువది రెండును మార్గగమకములు. మూర్ఛనాక్రమానుసారమున నాయా స్వరములకు శ్రుతులను సమాశ్రయించి ఇరువదిరెండు శ్రుతి గమకము లని యనిరి. వీని లక్షణస్వరూపముల నిచట నిరూపించుట లేదు.

### గీతలక్షణము

మానపంచకసంయుక్తం రీతిపంచకసంయుతమ్. 138

చతురాయామసంభిన్నం ఛందోభిశ్చాష్టభిర్యుతం
ధ్వనిశారీరసంభిన్నం విచిత్రస్వరవర్తనమ్. 139

తత్తచ్ఛాయాపరిష్కారలలితం గీతముచ్యతే

ఇందు గీతలక్షణ మున్నది. గీతము గానము గీతి గేయము గాంధర్వము పర్యాయములు. స్వర పద తాల సమన్వయ మున్న గీత మగును. గీతా

చార్యులు గీతము సమముగా నుండుట నభిలషింతురు. పండితులు వ్యక్తముగా నుండవలె నందురు. కాంతులు మధురముగా నుండుట కాంక్షింతురు. ఇతరులు వికృష్టముగా నుండవలెనందురు. శూరు లిం దుత్సాహ మభిలషింతురు. విరహాతురులు కరుణముగా నుండుటను, విటులు పరిహాసాఢ్యముగా నుండుటను, యోగు లధ్యాత్మసంగత మగుటను, ఉత్సవప్రియులు మంగలముగా నుండుటను, భక్తిసమన్వితులు స్తోత్రముగా నుండుటను, వాద్యప్రియులు విషమప్రాయముగా నుండుటను, ప్రౌఢక్రమముతో నుండుట నభిలషింతురు. ఇట్టి గీతలక్షణ మిట్లున్నది.

మానపంచకము రీతిపంచక మిందుండవలెను. చతురాయామములతో గూడి యుండదగును. ఎనిమిది ఛందములతో నుండవలెను. ధ్వని శారీరసమ్మిశ్రము కావలెను. విచిత్రస్వరవర్తనముతో నుండవలెను. తత్తచ్ఛాయాపరిష్కార లలితము కావలెను. ఇట్టిది గీత మనదగి యున్నది. ఇందలి విశేషణార్థము ప్రస్తుత మగును. మానపంచకమను ప్రథమరూపములో నయిదు మానములు కలవు.

సమానముచ్ఛ్రితం లంబం భిన్నం చైవాపకృష్టకమ్. 140
మానపంచక మేతత్తు కథితం గీత కోవిదైః

గీతకోవిదులు మానపంచక మీ విధమున నుండు ననిరి. సమానము— ఉచ్ఛ్రితము—లంబము—భిన్నము—అపకృష్టక మను నయిదు మానపంచకము. ఈ విషయ మిట్లుపై నిరూపితము కాగలదు.

సమానం తద్భవేత్స్థానం ధ్వనిశారీరసామ్యకృత్. 141

తేషాం కస్యచిదుత్సృష్టిరుచ్ఛ్రితం పరికీర్తితం
స్థానేస్థానే లంబతే చేద్ధ్వనిస్తల్లంబమీరితమ్. 142

ధ్వనిశారీరసంశ్లేషో యస్తద్భిన్నమితీర్యతే
యత్రాపకృష్యతే గీతే ధ్వనిస్తదపకృష్టకమ్. 143

ధ్వనిశారీరములకు సామ్యసంపాదక మగు స్థానము సమాన మను మాన మగును. ఆ ధ్వనులలో నొకధ్వని కుత్సృష్టి యున్నచో ఉచ్ఛ్రిత మను మాన మగును. ధ్వని స్థాన స్థానమున విలంబము కలదగునేని లంబ మాన మగును.

ధ్వని శారీరములకు సంశ్లేషమున్నచో నది భిన్న మాన మగును. గీతమున ధ్వని యపకర్ష ము కలదగునేని యపభ్రష్టక మానమగును. ఇట్లు మాన పంచకము నిరూపిత మయినది. గీతము మానపంచక సంయుక్తము కావలయు నన్న ప్రథమార్థమును భావించునది. ఇట్లు పై రీతి పంచకము ప్రతిపాదనీయమగును.

రీతయో గౌడ పాంచాల లాట వైదర్భ మిశ్రజాః
ఆగతిశ్చ గతిశ్చాపి వ్యావృత్తిః వ్యాకులీనతా. 144

ఏతద్గీతప్రయోగేషు చతురాయామసంజ్ఞితాః
అతలం తరలం చైవ ముల్లోలమలగం తథా. 145

ఉగ్రాణం లిప్సితం చైవ ఘట్టితం చ విఘట్టితం
ఏతాని రాగగీతేషు ఛందాంసీతి చ మన్యతే. 146

ఛందోగతివిశేషోఽత్ర న మాత్రావర ణకల్పితః

గౌడీరీతి పాంచాలీరీతి లాటీరీతి వైదర్భీరీతి మిశ్రరీతి యను నవి యయిదు రీతులు. ఇది రీతిపంచకము. ఆగతి—గతి - వ్యావృత్తి - వ్యాకులీనత యను నాలుగు గీతప్రయోగము లందలి చతురాయామములు. రాగగీతములందు తొమ్మిది ఛందస్సులు కలవు. అతలము—తరలము-ఉల్లోలము-అలగము-ఉగ్రాణము-లిప్సితము-ఘట్టితము-విఘట్టితము ననునివి ఛందస్సులు. ఇందలి ఛందోగతి విశేషము మాత్రాగణకల్పితము వర్ణగణకల్పితము కాదు. ఇక నిటుపై అతలాదిగీతచ్ఛందముల స్వరూపము విశదీకృత మగును.

ధాతుమాతృషు యో రాగః తాలమానవినాకృతః. 147

తత్సంస్పృష్టపదాభాతి గీతే తదతలం విదుః
తరలీక్రియతే యత్ర తాలాదిస్తారతమ్యతః. 148

తరలం తత్, తదుల్లోలముల్లోలో యత్ర యో ధ్వనిః
రాగస్థానేష్వలగ్నో యో లయతాలవశానుగః. 149

తదాశ్రయాగతిర్గీతేః అలగం కథ్యతే బుధైః
ఉగ్రాణం తద్యదుగ్రేణ రాగతాలప్రకల్పనమ్. 150

రాగాంతరం లిప్సతే యద్రాగస్తల్లిప్సితం విదుః
రాగాంతరేణ వ్యావిద్ధం గీతం ఘట్టితముచ్యతే. 151

విఘట్టితం విరుద్ధేన తాలేన స్యాద్విఘట్టితం

అతలాది రాగగీత చ్ఛందస్సుల స్వరూప మిచటనున్నది. ధాతు మాతువులందలి రాగము తాలమానరహిత మయినను గీతగానసమయమున తాల మానసంస్పృష్టముగనె భాసించునేని యతల మను ఛంద మచట లగ్నమయినదని భావింప నగును. వాక్కు మాతువు, గేయము ధాతువు. ఇవి తాల మాన సహితము లగుట గానసంప్రదాయము. తరలము. తారతమ్యవశమున తాలాదికము తరలీకృత మగునేని తరలచ్ఛంద మందురు. ఉల్లోలము. గానసమయమున ధ్వని యుల్లోల మగునేని యుల్లోల మను ఛంద మగును. అలగము. లయతాల వశమున వేదేని ధ్వని రాగస్థానములలో నలగ్నముగనె యుండునేని తదాశ్రయ మయిన గీతగతి యలగచ్ఛందమున నున్నదందురు. ఉగ్రాణము. సముదగ్ర మగు ధ్వని విశేషమున రాగతాలప్రకల్పన మున్నచో నుగ్రాణ మగును. లిప్సితము. గీతము నందలి రాగము రాగాంతరలిప్సతో నుండునేని లిప్సిత మగును. ఘట్టితము. రాగాంతరవ్యావిద్ధమగు గీతము ఘట్టిత మగును. విఘట్టితము. విరుద్ధమగు తాలమున గీతము విఘట్టిత మయినచో విఘట్టిత మగును. ఇట్లిచట ఛందోవిధానము లున్నవి.

భిన్నముచ్చం తథావర్తం కీలం చాకులమేవ చ. 152

ముదితం చ ద్రుతం చైవ దోషాః సప్తైవ గీతిజాః

గీతిదోషము లేడుగలవు. భిన్నము-ఉచ్చము-అవర్తము-కీలము- అకులము-ముదితము-ద్రుతము నని. వీనిస్వరూపము లిచట నిరూపితములు కాలేదు. ఇట్టి వాని నన్నిటిని తత్తదాకరగ్రంథము లందు జూడదగునని శారదాతనయుడు భావించెను అనుస్వానవిహీనత రూక్షత త్యక్తగక్తిత నిస్సారత విస్వరత కాకిత్వము స్థానవిచ్యుతి కార్శ్యము కార్కశ్యము మొదలగు దూషణములచే కుశారీరము కలుగునని రత్నాకరకారు డనెను. ఇవి యన్నియు గుణవిపర్యాసరూపములు. అదుష్టశారీరము మహాభాగ్యమున ననేకోపాయముల వలన గలుగును.

ఈదృక్స్వరూపం భోజాద్యైః స్వప్రబంధేషు నోదితమ్. 153

భట్టాభినవగుప్తార్యపాద్యై రేతత్ప్రకాశితం
ఇతః పరం విశేషాస్తు భోజసోమేశ్వరాదిభిః. 154

వ్యాఖ్యాతా భరతాదీనాం మతేనేతి విరమ్యతే.
మయాపి శారదీయాఖ్యే ప్రబంధే సుష్ఠు దర్శితమ్. 155

సంగీతం తస్య భేదాశ్చ తత్రైవాలోక్యతాం బుధైః
ఆయామభేదగత్యాదేః స్వరూపం కథయిష్యతే. 156

సంగీతమునకు సంబంధించిన యిట్టి స్వరూపమును భోజాదులు స్వప్రబంధము లందు నిరూపింపలేదు. భట్టాభినవగుప్తపాదు లీ విషయమును ప్రకాశిత మొనరించిరి. భోజసోమేశ్వరాదు లిటుపై విశేషములను భరతాదుల మతానుసారమున ప్రతిపాదించిరి. కావున వాని నిచట నిరూపించుట లేదు. శారదీయ మను ప్రబంధమున నేనే సంగీతశాస్త్రవిషయమును విశదముగా ప్రదర్శించితిని. సంగీతమును తద్భేదములను బుధు లా శారదీయ ప్రబంధముననె యాలోకింప దగును. శారదాతనయుని శారదీయప్రబంధము లభింపలేదు. జాయసేనాపతిగీత రత్నావళి గ్రంథమును లభింపలేదు. శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరమె లభించు సంగీతగ్రంథములలో మొదటిది. రత్నాకరునకు పూర్వుడైన శారదాతనయుని గ్రంథము లభించిన నప్పటి సంగీతసర్వస్వము తెలియును. అదిలేదు. అది తెలియదు. ఆ యామభేదములను గత్యాదులను వాని స్వరూపములను మున్ముందు ప్రతిపాదింతును.

## పూర్వరంగము

ఇంతటి మహోయత్నమున నిరూపితమయిన విషయమంతయు సంగీతోదయ స్వరూపపరిచింతనములకు సంబంధించియున్నది. నాట్యమున కుపయోగించు నంతగా సంగీతస్వరూపము ప్రతిపాదిత మయినది. నాట్యరూపములలో వాచికభాగమున సంగీతము ప్రసక్తము కావున నపేక్షిత మయినంతగా నిది నిరూపితము. ఉపక్రాంత మయిన నాట్యము తత్సంబంధివిషయము లింకను ప్రతిపాదింప దగియున్నవి. అందు నటకర్తవ్యతానిరూపణ మావశ్యకము.

నటో గీతేన వాద్యేన నృత్తేనాభినయేన చ
రంగే రామాద్యవస్థాభిరనుకార్యాభిరంజసా. 157

రామాదితాదాత్మ్యాపత్తేః ప్రేక్షకాన్నయిష్యతి
సభాపతిః సభా సభ్యా గాయకా వాదకా అపి. 158

నటీనటాశ్చ మోదంతే యత్రాన్యోన్యానురంజనాత్
అతోరంగ ఇతి జ్ఞేయః పూర్వం యత్ర ప్రకల్ప్యతే 159

తస్మాదయం పూర్వరంగ ఇతి విద్వద్భిరుచ్యతే
కలాః పాతాః పాదభాగాః పరివర్తాశ్చ సూరిభిః. 160

పూర్వం క్రియంతే యద్రంగే పూర్వరంగే భవేదతః
తస్య ద్వావింశదంగాని ప్రత్యాహారముఖాని చ. 161

నటుడు గీతమున వాద్యమున నృత్తమున అభినయమున ననుకరింపదగిన రామాద్యవస్థా విశేషములచే రామాదితాదాత్మ్యబుద్ధిని ప్రేక్షకుల కుదయింప జేయును. ప్రేక్షకులను "రసయిష్యతి" రసాస్వాదసమర్థుల నొనరించును. సభాపతి సభ సభ్యులు గాయకులు వాదకులు నటీ నటులు నందరు నన్యోన్యానురంజకమున నామోదము పొందుదురు. కావున నది రంగ మయినది. రంజన మాపాదించునది యగుట రంగ మయినది. పూర్వప్రకల్పిత మగుటచే పూర్వ రంగ మయినది. కావుననే నాట్యవిదులు దీనిని పూర్వరంగ మనిరి. రంగము నందు కలుగు పాతములు పాదభాగములు పరివర్తములు పూర్వమె ప్రయుక్తము లగును గావునను పూర్వరంగ మయినది. ఇట్లు పూర్వరంగస్వరూపమును ద్వివిధముగా గుర్తింపవలెను. ఈ పూర్వరంగమునకు సంబంధించి ప్రత్యాహార ప్రముఖము లయిన యంగములు ఇరువది రెండు కలవు.

ప్రత్యాహారోఽవతరణమారంభాస్రావణే అపి
వక్త్రపాణిస్తతస్తత్ర భవేత్తు పరిఘట్టనా. 162

సంఘట్టనా తతో మార్గాసారితం చ తతో భవేత్
శుష్కావకృష్టకం తత్రోత్థాపనం పరివర్తనమ్. 163

నాందీ ప్రరోచనా తత్ర త్రిగతాసారితే అపి
గీతం ధ్రువా త్రిసామ స్యాద్రంగద్వారమతః పరమ్. 164

స వర్ధమానకం చారిర్మహాచారి స్తతః పరం
ఏతాన్యంగాని కథ్యంతే పూర్వరంగస్య సూరిభిః. 165

పూర్వరంగమునకు సంబంధించిన యంగము లిరువదిరెండు కలవు. వాని నామము లిట్లున్నవి. ప్రత్యాహారము-అవతరణము—ఆరంభము-ఆస్రావణము-వక్త్రపాణి-పరిఘట్టన—సంఘట్టన - మార్గాసారితము-శుష్కావకృష్టకము-ఉత్థాపనము - పరివర్తనము-నాంది - ప్రరోచన-త్రిగతము — ఆసారితము-గీతము-ధ్రువ-త్రిసామ—రంగద్వారము—వర్ధమానకము — చారి - మహాచారి రూపములు. వీని లక్షణములు నిరూపితము లగును.

పూర్వరంగస్వరూపలక్షణకథనసమయమున కలాపాత పాదభాగ పరివర్తములు పూర్వ మాచరించుట నిరూపిత మయినది. ఆ కలాపాతాదుల స్వరూప పరిజ్ఞానము పూర్వరంగాంగస్వరూపపరిజ్ఞానమున కుపకరించును. కావున వాని స్వరూప మిట్లు గ్రహింపదగును.

నిమేషకాలో మాత్రా స్యాన్మాత్రే ద్వే యత్కలా భవేత్
ద్విమాత్రా స్యాత్కలా చిత్రే చతుర్మాత్రా వార్తికే. 166

అష్టమాత్రా తు విద్వద్భిః దక్షిణే సముదాహృతా
నిమేషాః పంచ విజ్ఞేయా గీతకాలే కలాంతరమ్. 167

తత్రావాపోఽథ నిష్క్రామో విక్షేపశ్చ ప్రవేశనం
చతుర్వికల్ప ఇత్యేవం నిశ్శబ్దః పరికీర్తితః. 168

శమ్యా తాలో ధ్రువశ్చైవ సన్నిపాతస్తథైవ హి
సశబ్దలక్షణా హ్యేతే విజ్ఞేయాస్తు చతుర్విధాః. 169

నిష్క్రామశ్చ ప్రవేశశ్చ ద్వికలౌ పరికీర్తితౌ
ఏషామంతరపాతాస్తు పాతసంజ్ఞాః ప్రకీర్తితాః. 170

గురుప్లుతాని మిత్వాఽథ ద్విమాత్రం పరికల్పయేత్
పాదభాగైశ్చతుర్భిస్తైర్మాత్రామపి చ లక్షణైః. 171

పరివర్తో భవేత్తాల పరివృత్తిః పునః పునః

నిమేషకాలము మాత్ర. రెండు మాత్రలు కల. చిత్రమార్గమున కల ద్విమాత్రగా నుండును. వార్తికమార్గమున కల చతుర్మాత్రికము. దక్షిణమార్గమున కల అష్టమాత్రకముగా నుండుటను విద్వాంసులు పరిగణించిరి. గీతికాలమునందు పంచనిమేషములు కలాంతరముగా నుండుట తెలియవలయును. అచట ఆవాపము–నిష్క్రామము–విక్షేపము–ప్రవేశనము నని నిశ్శబ్దము చతుర్వికల్పముగా నుండుట పరికీర్తిత మయినది. సశబ్ద క్రియలు నాలుగువిధములు — శమ్యా–తాల–ధ్రువ–సన్నిపాతరూపములు. నిష్క్రామము ప్రవేశము అను రెండు ద్వికలములు. వీని యంతరపాతములకు పాతము అను సంజ్ఞ యున్నది. గురుప్లుత ముల మానముల గుర్తించి ద్విమాత్రరీతిని నిశ్చయించుకొనవలెను. నాలుగుపాద భాగములచే లక్షణానుసారమున మాత్రానిశ్చయ మొనరింపదగును. పునః పునః తాలపరివృత్తి నొనరించుట పరివర్తన మగును. ఇట్లు కలాపాతాదుల సంకేత

మున్నది. ఈ యంశ మిచటి విషయవివేకమునకు సహకరించును. గీతాదుల మితిని నియమించు కాలమును తాల మందురు. కాల మనస్వీనము. దాని పరిచ్ఛేదమెట్లు? లఘు-గురు-ప్లుత-ద్రుతాదులచే క్రియకు మితి-పరిచ్ఛేదము కలుగును. ఆ క్రియ సశబ్దక్రియ కాని నిశ్శబ్దక్రియ కాని స్వేచ్ఛాకృత క్రియ కాని యగును. క్రియాపరిచ్ఛిన్న మయిన కాలమునకు తాల మని పేరు. తాలము మార్గతాల మని దేశితాల మని రెండువిధములు. అందు మార్గతాలక్రియ ద్విప్రకారము — నిశ్శబ్దక్రియ సశబ్దక్రియ యని. నిశ్శబ్దక్రియను కలాశబ్దమున వ్యవహరింతురు. అది నాలుగు విధములు — ఆవాపము-నిష్క్రామము-విక్షేపము-ప్రవేశకము నని. సశబ్దక్రియ నాలుగు విధములు— శమ్య-తాలము-ధ్రువము-సన్నిపాతము నని. సశబ్దక్రియను పాతశబ్దమున కలాశబ్దమున వ్యవహరింతురు. నిశ్శబ్దక్రియను కలాపదముననె వ్యవహరింతురు. అందు లఘ్వక్షరముల యుచ్చారణమునకు వలసిన కాలమునకు మిత మయిన క్రియ తత్కాలవ్యాపిక్రియ మాత్ర యందురు. ఈ మాత్రానియమమున తాలప్రకరణము నందు లఘుగుర్వాదులను కల్పించుకొనవలెను. లఘువు ఒకమాత్ర. మాత్రాద్వయము గురువు. మాత్రాత్రయము ప్లుతము. మాత్రార్ధము ద్రుతము. అనుద్రుతాదులను లెక్కింపనక్కఱ లేదు. తాలము రెండువిధములు - చతురశ్రము త్ర్యశ్రము నని. చతురశ్రమునకు "చచ్చత్పుటః" అని పేరు. త్ర్యశ్రమునకు "చాచపుటః" అని పేరు. ఈ చచ్చత్పుట-చాచపుటములు మూడు మూడు విధములు యథాక్షరము - ద్వికలము-చతుష్కలము నని చచ్చత్పుట భేదములు. యథాక్షరము-అష్టకలము-చతుష్కల మని చాచపుట భేదములు. మద్రకాదిగీతములలో నాలుగు పాదభాగములతో నొక మాత్ర యగును. ఇచటిమాత్ర పారిభాషికము. "పరివర్తో భవేత్తాలపరివృత్తిః పునః పునః"-పునః పునః తాలపరివృత్తి పరివర్త మను వాక్యార్థ మిట్లు భావనీయము. పాదభాగములకు పరివర్తన ముండుట. ఒక క్రియను తాలమును సమాప్త మొనరించి వేరొక దాని నారభించుట నావృత్తి యందురు. ఈ యావృత్తియె పరివృత్తి. పునః పునః ఆవృత్తి యుండుట పరివర్త రూపము.

## పూర్వరంగాంగములు

కుతపస్య తు విన్యాసః ప్రత్యాహార ఉదాహృతః. 172

కుతపో మురజాదీనాం భాండాదీనాం చ యః స్మృతః
యదాశ్రీయంతే భాండాద్యాః ప్రత్యాహారస్తతో భవేత్. 173

అత్రావతరణం తత్స్యాద్గాయకానాం నివేశనం
బహుకార్యసమారంభ ఆరంభ ఇతి కథ్యతే. 174

వాద్యానాం మురజాదీనాం ప్రస్తుతిః కార్యకః చ్యతే
ఆశ్రావణం నామ భవేద్వస్మిన్వాతోద్యరంజనమ్ 175

తంత్ర్యాదేర్దండహస్తైర్వై ర్భృష్టిరాతోద్యరంజనం
విభాగో వాద్యవృత్తీనాం వక్త్రపాణిరిహోచ్యతే. 176

సమోపపరిపూర్వాశ్చ పాణయః త్రివిధాః స్మృతాః

పూర్వరంగస్వరూప కథనానంతరము ప్రత్యాహారాద్యంగముల స్వరూప లక్షణ మిచట ప్రస్తుతమగు చున్నది. ఈ ప్రఘట్టమున ప్రత్యాహారము—అవతరణము—ఆరంభము-ఆశ్రావణము—వక్త్రపాణి—అను నవి దు నిరూపితము లగును. ఇందలి విధానము లన్నియు భరతుని నాట్యవేదాను సారమున నున్నందున నా రచిత నాట్యవేదము నుండి కొన్ని విషయములు సంగ్రహీతము లయినవి. నా నాట్యవేదమున శ్రీమదభినవగుప్తుని భావములు నిరూపితము లయినందున శారదాతనయు డభినవగుప్తానుగామి యయినందున నా భావము లుపాదేయములు.

1. ప్రత్యాహారము. కుతపవిన్యాసమునకు ప్రత్యాహార మను నామ ముదాహృత మయినది. రంగమున మురజాదులకు భాండాదులకు సముచిత మగు విన్యాసము కుతప మన దగును. నేపథ్యగృహద్వారముల మధ్యగా మార్దంగికుడు పూర్వాభిముఖుడై యుండుట, పాణవికు లాతని వామభాగమున నుండుట, రంగపీఠమునకు దక్షిణముగా గాయను డుత్తరాభిముఖుడై యుండుట, అతని యెదుట నుత్తరమున దక్షిణాభిముఖముగా గాయనీస్త్రీ లుపవిష్ట లగుట, వామమున వైణికు లుండుట, వేరొక ప్రక్కగా వాంశికు లుండుట అనునది యంతయు కుతప సన్నివేశము. ప్రత్యాహార మొక విచిత్రవిన్యాసము. శబ్దవిశేషము నను సంధానించుచు నాట్యభూమికచే సముజ్జ్వలత నాధానించు నటవర్గ మిందుండును. విప్రకీర్ణములుగా నుండు విశేషముల ఢౌకనము ప్రత్యాహార మయినది.

2. అవతరణము. రంగమున గాయకుల నివేశనమున కవతరణ మని పేరు. గాయకుల నివేశనవిన్యాసమునె యవతరణ మని గుర్తింప వలెను. రంజకవర్గమున గీతమవశ్యము ఉండవలయు ననుట నాట్యాచార్యులు నిర్దేశింతురు. పురుషుడు లక్షణోపేతముగా గీతవిధాన మనుసరించి గాన మొనరించును. కాని

స్త్రీ విరహిత మయిన యీ ప్రయోగము సుఖావహము కాదని సూక్తి యున్నది. అయినను కేవలము పురుషులె గాత లగుటయు నిట సూచితమగును. గాయనీగాయక సమావేశము సుందరమని యంద రందురు.

3. ఆరంభము. బహుకార్యసమారంభ మారంభము. పరిగీత క్రియారంభమున కారంభ మని పేరు. దీని వ్రాయుటలో పూర్వరచితములయిన నా గ్రంథముల విషయములు అందలి పంక్తులు పంక్తులు సహయోగమిచ్చినవి.

నవకాల స్వభావముగ నా భావప్రకాశనముకై కొందరి నడిగి యభిప్రాయముల ప్రకటించుట రమ్యమగును. కాని యెవరినడుగుదును? సంగీత విదులనడుగుదునా? వారికి సంగీతశాస్త్ర పరిచయమున్నదా? ఉన్నను కవితా చుంబనము లేదుకదా! కవితాభావుకులనడుగుదునా? వారు సంగీతశత్రువులు కాకున్నను పరిచితి కలవారా? కామశాస్త్రి యీ మోక్షశాస్త్రము గుర్తించునా? వేదాంతవాది సాహితీ సంవాదియా? ఎవరికి ప్రత్యభిజ్ఞాపరిచయమున్నది? ఎన్ని యున్నను శృంగారప్రకాశన భోజులగుదురా? ఇది కామశాస్త్రము. ఇది నాట్య శాస్త్రము. ఇది కావ్యశాస్త్రము. ఇది స్త్రీశాస్త్రము. ఇది పురుష దర్శనము. ఇది వ్యాకరణనిరుక్తి. ఇది సంవిచ్ఛాస్త్రము. ఇది అభినవదర్శనము. అభినయ దర్శనము. ఇది కావ్యాలోకము. ఇది కావ్యప్రకాశము. ఇది రూపకశాస్త్రము. ఇది సాహిత్యతంత్రము. ఇది సకల తంత్రము. మారాయుడుశాస్త్రి ఏమేని వ్రాయగలడు? రాయుడుశాస్త్రి యేడి?

ఈ గీతారంభము లేకున్న నే యారంభము నుండదు. పూర్వరంగాంగము లన్నియు దృష్టప్రయోజనములు. మొదట రంజకవర్గ ఢౌకనము, పిమ్మట నుపరంజక మగు గీతము ప్రధాన మగుట గేయముండును. గీతగేయమునకు శారీరము బింబము. శారీరస్వరములె యన్నిట మూలభూతములు. ఆశారీరస్వరానుసంధానమునకై "ఆలాపము" అను నారంభ మావశ్యకము. పరిగీతక్రియాలాప మారంభము.

4. ఆస్రావణము. మురజాదివాద్యముల ప్రస్తుతి ఆతోద్యములచే రంజన మొనరించుట ఆశ్రావణము. సర్వవిధాతోద్యములు తాలప్రధానముగ నుండును గదా! పూర్వరంగ మాతోద్యగర్భముగ నున్నదని యంతట విశదము చేయు విధానము ఆశ్రావణావిధాన మగును. క్వాణ నిక్వాణ సుభగము లయిన సర్వాతోద్యములు సముచితస్వరసంధానము కల వయినప్పు డుపరంజనము స్వతస్సిద్ధముగ భాసించును. అది యాస్రావణము.

౬. వర్తిపాణి. దండహస్తాదులచే తంత్ర్యాదిదీప్తి ఆతోద్యములచే రంజనము వాద్యావృత్తుల విభాగము వర్తిపాణి యందురు. వాద్యముల వృత్తి విభాగమున కిది యావశ్యకము. వాద్యవర్తిమున పాణి యుండుట వర్తిపాణి. శారీరస్వరమును బింబభూతస్వరముగా భావించి నపుడు వేణుస్వరమును ప్రతిబింబ భూత స్వరముగా భావింతుము. ఈ వైణవస్వర స్వరూపానుసంధానమునకు దక్షిణ వృత్తి వామవృత్తి మొదలగు వృత్తుల విభాగానుసంధానరూపముగా నుండు ఆసారణము వర్తిపాణి యగును. వర్తిము ప్రారంభము. వర్తిమున హస్తాంగుళి వ్యాపారము వర్తిపాణి యయినది. సమపాణి ఉపపాణి పరిపాణి యని పాణి విధానములు మూడు కలవు.

తంత్ర్యోజస్కరణార్థం యత్నా ప్రోక్తా పరిఘట్టనా. 177
అత్ర పాణివిభాగో యో మతః సంఘట్టనా బుధైః
సంఘట్టనా విధిర్వీణాగత ఇత్యేవ కేచన. 178
యోగోఽత్ర తంత్రీభాండానాం మార్గాసారితముచ్యతే
కలాపాతవిభాగోఽత్ర భవేదాసారితక్రియా. 179
అనర్థవర్ణాపాకృష్టిర్భవేచ్ఛుష్కాపకృష్టకం
శుష్కాపకృష్టకం తేన తేన ఇత్యుచ్చారణం భవేత్. 180
యస్మాదుత్థాపయంత్యాదౌ ప్రయోగం నాందిపాఠకాః
తస్మాదుత్థాపకం జ్ఞేయం వాగంగవ్యక్తికారకమ్. 181
యస్మాత్తు లోకపాలేభ్యః పరివృత్య చతుర్దిశం
నమస్కుర్వంతి తస్మాత్తు పరివర్తన ముచ్యతే. 182

ఇచట పరిఘట్టనము - సంఘట్టనము - మార్గాసారితము — శుష్కాపకృష్టకము - ఉత్థాపనము — పరివర్తనము అనువాని రూపలక్షణ మున్నది.

౬. పరిఘట్టనము. తంత్రుల యోజస్కరణార్థ మగు విశిష్టక్రియ పరిఘట్టనము. పరిఘట్టనము పరిచలనము. ఇది తంత్రుల మీటుట మద్దెల సాటుట యనదగును. తంత్రుల యోజఃకరణమునకు పరితశ్చాలన మావశ్యకము. శుష్కప్రయోగానుసంధానమునకు పరిఘట్టన మావశ్యకము.

7. సంఘట్టన. పాణివిభాగము సంఘట్టన మని కొందరు, వీణాగత మయిన సంఘట్టనావిధి సంఘట్టన మని కొందరు ననిరి. వాద్యములలో చళ్ళావ

నద్ధము లగు వాద్యములు వీణావాద్యముల కుపజీవకములు. ఆ యవనద్ధవాద్య ముల యనుసంధానమునకు సంవాదిధ్వనుల సరిచూచుకొనుచు ప్రహారము లొన రించుట సంఘట్టన మగును. సంఘట్టనము సమ్యక్ ఘట్టనము.

8. మార్గాసారితము. తంత్రీభాండముల యోగమునకు మార్గాసారిత మని పేరు. తంత్రవాద్యములయు భాండవాద్యములయు సమాయోగమున మార్గాసారితము కలుగును. ఒకదాని ధ్వని వేరొకదానిలో సంక్రమించుటయ గాక అనుహార్యానుహర్తృరూపమున నుండు వైణవ పౌష్కర శబ్దములకు పరస్పరము సమ్మేళనము సంపాదింప వలెను. ఆ సమ్మేళనమె మార్గాసారితము. మార్గమున ఆ సమంతాత్ సారణము మార్గాసారణము మార్గాసారితము. ఇందు కళాపాతవిభాగము ఆసారితక్రియ యగును.

9. శుష్కాపకృష్టము. గీతము లందున్న అనర్థపదముల అపాకృష్టి శుష్కాపకృష్ట మగును. ఇది ధ్రువాపదము. అర్థము లేని ఝుం టుం ఝుం టుం పదములతో నుండును. శుష్కాక్షరములతో నిది ప్రయుక్త మగును. "తే న తే న" అను శుష్కవచనము లుండును. తే - సంగీతమనుసరింపనివారు, న - ముక్తిభాజనులుకారు అనునర్థమును సంగీతప్రియాభిమాను లభి మానింతురు.

10. ఉత్థాపకము. నాందిపాఠకులు ప్రయోగ ముత్థాపింప జేయుదురు. ఈ ప్రయోగము వాగంగవ్యక్తికారకము. నాందిపాఠకు లందరు ప్రారంభమున ప్రయోగ ముత్థాపింప జేయుదురు. రంగారంభమునసె యిది ప్రయుక్త మగును. రంగప్రయుక్తము లగు ప్రత్యాహారాదు లన్నియు దీన నుత్థాపితము లగును. వాని వాని కన్నిటికి ఫలము నిరూపించి తగిన పాత్ర్యమును సముచితాభినయ మును స్ఫుట మొనరించు శక్తి దీని యందే యున్నది.

11. పరివర్తము. నలుదిక్కుల తిరిగి లోకపాలురకు నమస్కరించుట యుందుండును. రంగమునందున్న నర్తకీనర్తకులు నలుదిక్కులు పరావర్తన మున దిరిగి దిక్పతులకు వందన మాచరింతురు. రంగవిఘ్నశాంతి నొనరింపవలసిన దేవీదేవనమస్క్రియలు చతుర్దిశాపరివర్తనమున గోచరించుటచే నిది పరివర్తన మన్న పూర్వరంగాంగ మయినది.

## నాందీరూపము

నందీ వృషో వృషాంకస్య జగదాదౌ జగత్పతేః
నృత్యతః కల్పనాయోగాజ్జగామ కిల రంగతామ్. 183

తస్య తద్రూపసంబంధాత్పూజా సాందీతి కథ్యతే
దేవతాదినమస్కారమంగలారంభపాఠకైః. 184

యా క్రియా నంద్యతే నాట్యారంభే నాందీతి సా స్మృతా
యా పూర్వరంగసంబంధాద్ద్వావింశత్యంగవర్తినీ. 185

సభ్యాన్నందయతీత్యేవం సాపి నాందీతి కీర్త్యతే
యద్యప్యంగాని భూయాంసి పూర్వరంగస్య నాటకే. 186

తథాప్యవశ్యం కర్తవ్యా నాందీ విఘ్నోపశాంతయే
నాందీశ్లోకో విధాతవ్యః చంద్రనామాంక ఏవ సః. 187

యథైవ చంద్రసంబంధో లక్ష్యతే వ్యజ్యతేఽథవా
నాందీశ్లోకే తథా యత్నః కర్తవ్యః కవిభిస్సదా. 188

చంద్రాయత్తతయా నాట్యే ప్రవృత్తే రససంపదాం
ఏతదుత్థాపనాద్యంగచతుష్కం నాందిపాఠకైః. 189

విధేయమస్మాత్ప్రియంతే బ్రహ్మాద్యాః స్వర్వదేవతాః
సూత్రధారః పఠేత్తత్ర మధ్యమం స్వరమాశ్రితః. 190

నాందీం పదైర్ద్వాదశభిః అష్టభిర్వాప్యలంకృతాం
తత్సంఖ్యాతై ర్భవేన్నాందీ వాక్యైః క్వాపి విపశ్చయా. 191

సమపాదాఽథవా నాందీ భవేదితి చ కేచన

12. నాంది. ఇందు నాందీరూపనిర్ణయ మున్నది. నాందీవిశేషము లున్నవి. నాందీనియమములున్నవి. జగదాదిసమయమున జగత్పతియగు వృషాంక శివునివృషభ మయిన నంది, నర్తన మొనరించు శివుని కల్పనాయోగమున రంగ త్వము పొందెను. నందియే రంగ మయ్యెను. నందికి రంగరూపసంబంధమున నాచరించు పూజ నాంది యయినది. నాట్యారంభమునందలి యీ క్రియ దేవతాది నమస్కార మంగలారంభపాఠకులచే నభినంద్యమాన మగుటచే నాంది యయి నది. పూర్వరంగసంబంధమున నిరువది రెండంగముల నున్నదై సభ్యుల నానంద పెట్టునది కావునను నాంది యయినది. ఇట్లు నాందీపద ప్రవృత్తినిమిత్తము మూడువిధముల నున్నదని గ్రహించునది.

నాటకమున పూర్వరంగము నందు బహులముగా నంగములు కలవు. అయినను విఘ్నోపశాంతికై నాంది నవశ్య మాచరింపవలెను. చంద్రనామాంక

ముగా నాందీశ్లోకమును గూర్పవలెను. చంద్రసంబంధము లక్ష్యమగునట్లుగాగాని, వ్యంగ్య మగునట్లుగా గాని నాందీశ్లోకమున కవులు యత్న మొనరింపవలెను. నాట్యమున రససంపదల ప్రవృత్తి చంద్రాయత్తము కావున చంద్రాంకిత నాంది యావశ్యకము. నాందిపాఠకు లుత్థాపనాద్యంగచతుష్కమును కూర్పవలెను. దాని వలన బ్రహ్మాదిసర్వదేవతలు సుప్రీతు లగుదురు. అచట సూత్రధారుడు మధ్యమ స్వరము నాశ్రయించి నాంది పఠింప వలెను. ఆ నాంది పండ్రెండు పదములతోగాని యెనిమిది పదములతో గాని యలంకృతము కావలెను. ఎచ్చటనేని శివతాను సారమున అష్ట - ద్వాదశ సంఖ్య కల వాక్యములచే గాని నాంది యలంకృతము కావలెను. కొందరు నాంది సమపాదముగ నుండవలయు నందురు. శ్లోకపాద మును పదముగా సంభావింపగా రెండుశ్లోకము లష్టపద నాంది యగుట, మూడు శ్లోకములు ద్వాదశపదనాంది యగుట భావింపదగును. ఇది నాందీ విషయము.

ప్రరోచనా సాయత్త్రైవ ప్రఖ్యాతోదాత్తవస్తునః. 192

ప్రశంసయా ప్రేక్షకాణాామున్ముఖీకరణం తు యత్
సూత్రధారో నటశ్చైవ తథా వై పారిపార్శ్వకః. 193

కుర్వంతి యత్ర సల్లాపం తదేతత్త్రిగతం స్మృతం
ఆసారితం బహిర్గీతవిధిరిత్యుచ్యతే బుధైః. 194

అత్ర గీతివిధిఃపూర్వైర్బహుశో భరతాదిభిః
వ్యాఖ్యాతస్తత్ర వై పుల్యాన్నాస్మాభిరభిధీయతే. 195

మంద్రకాదిషు గీతేషు సర్వేష్వేవ విధిః స్మృతః
అధికాచావకృష్టా చ ప్రావేశిక్యావసానికీ. 196

అంతరాచేతి పంచైతా ధ్రువానాటకసంశ్రితాః
త్రిసామ స్యాత్త్రినృత్తం చ త్రిలయం చ త్రిపాణి యత్. 197

వాగంగసత్త్వాభినయైస్త్రిన్నృత్తమభిధీయతే

ఇచట నాంద్యనంతరము ప్రతిపాదింపదగిన పూర్వరంగాంగములు ప్రతిపాదితము లగును. ప్రరోచన - త్రిగతము - ఆసారితము - గీతి - ధ్రువ - త్రిసామ - అనునవి యిచట ప్రతిపాద్యములు. వీనియనంతరము రంగద్వారము- వర్ధమానకము - చారి - మహాచారి ప్రతిపాదితము లగును.

13. ప్రరోచన నాటకమున వర్ణ్యమానమగు ప్రఖ్యాత ముదాత్తము నయిన వస్తువు యొక్క ప్రశంసచే ప్రేక్షకుల కున్ముఖీకరణము సంపాదించుట ప్రరోచన యనదగును. కావ్యోపక్షేపము హేతువుగా కావ్యార్థవిషయమున సామాజికులకు సిద్ధప్రాయముగ నామంత్రణము సూచించుట ప్రరోచన. హేతు యుక్తమయిన యుక్తియుక్త మయిన వచనమున సామాజికులకు కావ్యార్థము నం దాభిముఖ్య ముదయించునట్లు చేయుట ప్రరోచనము.

14. త్రిగతము. సూత్రధారుడు నటుడు పారిపార్శ్వకుడు ననుమూవురు సల్లాప మొనరించుటను త్రిగత మందురు. రాబోవు నాటకము లోని విషయ మును వా రాలాపము చేయుట. సూత్రధారున కిరు ప్రక్కల నుండువారిలో విదూషక వేషభాషానుకార మొనరించువాడు విదూషకుడు. రెండవ యాతడు పారిపార్శ్వకుడు. ఆ మూవురి సంలాపములో భవిష్యన్నాటకాంశము కూడి యుండును. మాటలలో మాటగా వారు మాట లాడుకొనుచు కావ్యార్థము సూచింతురు. ఇది త్రిగతపదమున వ్యవహార్యము.

15. ఆసారితము. ఇది బహిర్గీతవిధి యని బుధు లందురు. కలాపాత విభాగములకై యాసారిత క్రియ ననుసరింతురు. రాగవాద్యకాలక్రియల స్వరూప సంధానమున గేయవస్తుగత తాలస్వరూపము నుపక్షేపించుట యాసారితము. ఇది యంతయు దేవతాకీర్తనరూప మయిన గీతవిధి. ఇది దృష్టప్రయోజనము.

16. గీతివిధి. పూర్వులయిన భరతాదులు గీతవిధి ననేకవిధముల వ్యాఖ్యానించిరి. వారు విపులముగా నిరూపించిరి. కావున మేమిచట దాని నిరూపించుటలేదు. మంద్రకాదిగీతములలో నన్నిటిలో నీగీతివిధి యున్నది.

17. ధ్రువ. నాటకసంశ్రితము లయిన ధ్రువాగీతు లయిదు గలవు— అధిక - అపకృష్ట - ప్రావేశికి - ఆవసానికి - అంతర యని యా ధ్రువాభేద ములు. ఇంకను కొన్ని భేదములు కలవు. ఇవియె యిందు నిరూపితములు. వస్తుప్రయోగ ప్రకృతి రస భావ ఋతు వయో దేశ కాలావస్థలను గుర్తించి తత్తద్విధానమున ధ్రువాగీతిని ప్రయోగవిదులు ప్రయోగింపదగును. అన్నియు గీతప్రయోజ్యములు.

18. త్రిసామ. త్రినృత్తము త్రిలయము త్రిపాణికము నగునది త్రిసామ యగును. వాగంగసత్త్వాభినయములచే నిర్వర్త్యమాన మగునది త్రినృత్త మగును. ఇట్లే త్రిలయ త్రిపాణి పదార్థములు ద్రుతమధ్యవిలంబితలయలు సమ ఉప పరి పూర్వపాణులు ప్రకృతానుగతముగా భావనీయములు.

యస్మాదభినయో యత్ర ప్రథమం త్వవతార్యతే. 198

రంగద్వారమతో జ్ఞేయం వాగంగాభినయాత్మకం
సుకుమారం విజానీయాచ్ఛృంగారరససంభవమ్. 199

స్మరాశ్రయే చ దంపత్యోర్వృత్తం హర్షాత్మకం భవేత్
పత్యౌ సన్నిహితే యస్మిన్ ఋతుకాలాదిదర్శనమ్. 200

గీతకార్యాభిసంబంధం నృత్తం తత్ర ప్రయోజయేత్
దూత్యాశ్రయం యదా చ స్యాదృతుకాలాదిదర్శనమ్. 201

ఔత్సుక్యచింతాసంబంధాత్తత్ర నృత్తం న యోజయేత్
ఖండితా విప్రలబ్ధా చ కలహాంతరితాపి వా. 202

యస్మిన్ రంగే భవేన్నారీ తత్ర నృత్తం న యోజయేత్
సఖీప్రవృత్తే సల్లాపే దయితే ప్రోషితే సతి. 203

సద్భిర్న యోజ్యతే నృత్తం ప్రియేఽసన్నిహితేఽపి చ
దేవస్తుత్యాశ్రయం గీతం యదంగం యత్ర దృశ్యతే. 204

మాహేశ్వరై రంగహారై రుద్ధతైస్తత్ప్రయోజయేత్
యత్ర శృంగారసంబంధం గానం స్త్రీపురుషాశ్రయమ్. 205

దేవ్యాః కృతై రంగహారైర్లలితైస్తత్ప్రయోజయేత్

19. రంగద్వారము. ఇందు రంగద్వార ప్రవిచారమున్నది. వాగంగాభినయాత్మక మయిన యభినయము రంగద్వారమున ప్రథమముగా నవతారితమగును. కావున నిది రంగద్వారము. ఇది శృంగారరససంభవము. ఇది సుకుమారము. దంపతులు స్మరాశ్రయస్వభావమున నున్నపుడు హర్షాత్మక మయిన నృత్తముండును. ప్రియుడుసన్నిహితుడై యుండగా నీ రంగద్వారమున నా యాఋతుకాలాది దర్శనాత్మకము గీతక్రియాభిసంబద్ధము నయిన నృత్తమును ప్రయోగింప వలెను. రంగమున ఖండితగా కాని విప్రలబ్ధగా గాని కలహాంతరితగా గాని నారి యుండునేని యచట నృత్తమును ప్రయోగింపరాదు. దయితుడు ప్రోషితుడయినపుడు సఖితో సల్లాపము ప్రవృత్త మయినపుడు నృత్తప్రయోగ మాయోజితముకాదు. ప్రియు డసన్నిహితు డయినను నృత్తాయోజన ముండదు.

దేవస్తుత్యాశ్రయ మయిన రంగాంగముగా నున్నప్పుడు మాహేశ్వరము లయిన యుద్ధతాంగహారములతో నృత్తము కూర్పవలెను. శృంగార

సంబంధము కల స్త్రీపురుషాశ్రయగానము ప్రవర్తమయినప్పుడు ఉమాదేవి యాచరించిన లలితాంగహారములతో నృత్తప్రయోగము కూర్పవలెను.

తతస్త్రిసామ్నా దేవస్య పుష్పాంజలిముదీరయేత్. 206

తిరస్కృతరసోత్కర్షః కించిదామోదసూచకః
పుష్పాంజలిభవః శ్లోకః కార్య ఆశీఃపురస్సరః. 207

తతః పుష్పాంజలిం ముక్త్వా రంగపీఠం పరీత్య చ
ప్రణమ్య దేవతాభ్యశ్చ కర్తవ్యోఽభినయస్తదా. 208

యత్రాభినేయం గేయం స్యాత్తత్ర వాద్యం న యోజయేత్
అంగహారప్రయోగే తు భాండవాద్యం ప్రయోజయేత్. 209

సమం రక్తం విభక్తం చ స్ఫుటం శుద్ధం ప్రహారజం
నృత్తాంగగ్రాహి వాద్యజ్ఞైర్యోజ్యం వాద్యం తు తాండవే. 210

రంగద్వారనిరూపణప్రసంగమున నృత్తోచిత దేశకాలములు కీర్తితము లయినవి. నృత్తారంభమున నొనర్పదగిన పుష్పాంజలి నిరూపితము కానున్నది. కావున తత్సముచిత మయిన దేవీదేవనృత్తరీతి నియతియు నిర్దిష్ట మయినది. భావివస్తునాయకాది సూచకముగా నుండదగు నంగహారముల ప్రయోగప్రక్రియయు నిర్దిష్ట మయినది. ఈయనంతరము వర్ధమానకాదుల నిరూపింప వలెను. కాని రంగాంగపుష్పాంజలి ప్రతిపాదింపవలసి యున్నది. ఇదిగో పుష్పాంజలి.

అనంతరము త్రిసామ విధానమున దేవునకు పుష్పాంజలి నిరూపింప వలెను. పుష్పాంజలి భవమగు నొక శ్లోక మాశీఃపురస్సరముగా నచట నిరూపింప దగును. ఆ శ్లోక మామోదసూచకము కావలెను. పుష్పాంజలిమోచన మొనరించిన పిమ్మట రంగపీఠపరిక్రమమున ప్రదక్షిణ మాచరించి దేవతలకు నమస్కరించి యప్పు డభినయ మొనర్పవలెను.

అభినేయము గేయ మగు నేని యచట వాద్య మాయోజనము చేయరాదు. అంగహారముల ప్రయోగ ముండునేని భాండవాద్య మాయోజింప వలెను. వాద్యవిదులు తాండవమున గూర్చు వాద్య మీ విధమున నుండవలెను. సమము రక్తము విభక్తము స్ఫుటము శుద్ధము నృత్తాంగగ్రాహిగా వాద్యము ఉండదగును.

ఆసారితాది వా గీతం నృత్తం వాద్యమథాపి వా
వర్ధతేఽభినయో వా స్యాత్స భవేద్వర్ధమానకః. 211

ఏకవాద్యప్రచారో యః స చారీత్యభిధీయతే
మండలాదిప్రచారో యః స మహాచారిరిష్యతే. 212

పూర్వరంగాంగములలో నిక మిగిలిన వర్ధమానక చారి మహాచారి త్రితయ మిచట నున్నది. 20. వర్ధమానక మిట్లున్నది. ఆసారితాదికము గాని గీతము గాని నృత్తముకాని వాద్యము కాని యభినయము కాని రంగమున వృద్ధి పొందుచు నుండునేని వర్ధమానక మగును. 21. ఏకవాద్యప్రచార మె యున్న చారి యందురు. 22. మండలాదిప్రచారమున్నచో మహాచారి యందురు.

ఇతి ద్వావింశదంగాత్మా పూర్వరంగః ప్రకీర్తితః
ఏవం యః పూర్వరగం తు విధినా సంప్రయోజయేత్. 213

నాశుభం ప్రాప్నుయాదత్ర పశ్చాత్స్వర్గం చ గచ్ఛతి

ఇట్లిచట నిరువది రెండంగముల రూపమున నున్న పూర్వరంగము ప్రకీర్తిత మయినది. ఇట్టి పూర్వరంగ ప్రయోగమునకు ఫలము కలదు. పూర్వరంగ ఫలశ్రుతి యిట్లున్నది. ఈ పూర్వరంగమును విధివిధానమున సమ్యక్ప్రయోగ మొనరించినచో ప్రయోక్త యీజగమున నశుభమును పొందడు. అనంతరము స్వర్గము పొందును. ఈ ఫలశ్రుతి వలన పూర్వరం గాంగావశ్యకర్తవ్యత సూచిత మయిన దని భావింపవలెను. రంజనాత్మక మయిన దృష్టఫలము ప్రధాన మయినను అదృష్టఫలము నున్నప్పు డదియు నుపాదేయము.

ఇత్థం రంగవిధానస్య సంబంధాదిప్రసిద్ధయే. 214

గోత్రం నామ చ బధ్నీయాత్ప్వాజావాక్యం సభాసదాం
నాయకస్య చ యన్నామ గర్భనిర్దిష్టలక్షణమ్. 215

వాంఛాకలాపః ప్రథమః కలావిధిరనంతరః
వాంఛాశూన్యా న దృశ్యంతే వ్యవహారాః కదాచన. 216

వాంఛాకలాపస్తు కవేరభీష్టార్థప్రకాశనం
స్వాభిధేయగతత్వేన తద్ద్వివిధా పరిపఠ్యతే. 217

స్వగతం తు స్వగోత్రాది స్వస్య కీర్తిప్రకాశనం
అభిధేయగతం తత్తత్కావ్యనామ్నా ప్రకాశనమ్. 218

తన్నామ నాటకాద్యంతర్గర్భితార్థోపసూచకం
యదా హి రామాభ్యుదయం నామ నాటకమిత్యతః. 219

వాచ్యవాచకసంబంధో నాట్యవిద్భిర్విభావ్యతే
కీర్తిః ఫలం తయా స్వర్గస్థితిరత్ర ప్రయోజనమ్. 220

ఇట్లున్న రంగవిధానమునకు సభాసదులకు సంబంధాదిప్రసిద్ధిసంపాదనమునకై గోత్రనామములను నిబంధింప వలెను. సభాసదుల పూజావాక్యము కూర్పవలెను. నాయకుని నామము నిబంధింప వలెను. ఇది యంతయు గర్భనిర్దిష్టలక్షణముగా నుండదగును. నామగోత్రాదికము స్పష్టముగ నిర్దిష్టమగుట కాక వాక్యమధ్యమున గర్భితమై భాసించు నట్లుండవలెను. మొదట వాంఛాకలాపము అనంతరము కలావిధి యావశ్యకము. ఎప్పుడేని వ్యవహారములు వాంఛాశూన్యములుగా నుండవు. వాంఛాకలాపము, అభీష్టార్థప్రకాశనముగా కవి యభిధేయగతముగా రెండువిధముల నుండును. స్వాత్మగత మయిన గోత్రాదివిశేషకథనము తనకు కీర్తిప్రకాశన మగును. అభిధేయగతముగా నుండునది యా యా కావ్యనామవిశేషముచే ప్రకాశింప జేయదగును. నాటకమునకు నిరూపించు పేరు నాటకాదులలో నంతర్గర్భితమయిన యర్థమును సూచించునదిగ నుండుట యుక్తము. "రామాభ్యుదయం నామ నాటకం" అని యనుట యీ విశేషమునకు సూచకము. ఇట్లు వాచ్యవాచకసంబంధమును నాట్యవిదులు విభావనము చేయుదురు. కీర్తి ప్రత్యక్షఫలము. స్వర్గస్థితి యదృష్ట మయిన ప్రయోజనము.

యద్యప్యంగాని భూయాంసి పూర్వరంగస్య నాటకే
'నాంద్యంతే' శాబ్దబోధార్థముక్తాన్యంగాని లేశతః. 221

ప్రరోచనార్థో నాంద్యంతః ప్రత్యాహారాది కథ్యతే
అథనాంద్యంతశబ్దోఽత్ర షష్ఠీతత్పురుషోఽపి వా. 222

ఇత్థం రంగం విధాయాదౌ సూత్రధారే వినిర్గతే
తద్వన్నటః ప్రవిశ్యాన్యః సూత్రధారసమాకృతిః. 223

సూచయేద్వస్తు బీజం వా ముఖం పాత్రమథాపి వా

నాటకమునందు పూర్వరంగమునకు సంబంధించిన యంగము లనేక ములు కలవు. నాటకముల యారంభమున నుండు "నాంద్యంతే" అను పదము నకు సంబంధించిన శాబ్దబోధకొఱకై పూర్వరంగాంగములు లేశముగా నిచట నిరూపితము లయినవి. ఇచటి నాంద్యంత పదము ప్రరోచనార్థమై యుపాత్త మయినది. పూర్వరంగాంగములలో ప్రత్యాహారము మొదటిది కదా! ఆ ప్రత్యాహారము మొదలుగా నీ నాందిచివరి వరకు ప్రత్యాహారాది నాద్యంతము అను నర్థము నిచట గ్రహింపవలెను. అథవా; నాంద్యంతపదము షష్ఠీ తత్పురుష సమాసరూపముగా గ్రహించిన "నాంద్యాః అంతే" నాంది యొక్క అంతభాగము అను నర్థము లభించును. ఇట్లు నాద్యంతశబ్దార్థ బోధ ద్వివిధముగా పరిగ్రాహ్యము. ఇట్లె పూర్వరంగ మాచరించి సూత్రధా రుడు మొదట నిష్క్రమింపగా సూత్రధారునివలె వేరొక నటుడు సూత్రధార సమాకారుడు రంగము ప్రవేశించి నాటకీయవస్తువును సూచింపవలెను. ప్రధాన ఫలమునకు మూలభూతమగు కథాబీజము నేని సూచింప వలెను. ప్రథమాంక మున నిరూపితము కానున్న వస్తుప్రారంభము నేని సూచింప వలెను. రంగమున ప్రవేశించి ప్రయోగ మొనరింపబోవు పాత్రము నేని సూచింప వలెను! సూత్ర ధారసమాకృతి యగు రెండవసూత్రధారుడు తన వచనవిధానమున సంభాషణ క్రమమున వస్తుబీజముఖపాత్రసూచన మొనరించుట యావశ్యకము. సూత్రధార ద్వయకార్యవిశేష మీ విధమున నున్నది. ఇది నాటకారంభకార్యము.

## వస్తు స్వరూపము

అత్ర వస్తుస్వరూపం తు ప్రథమం సమ్యగుచ్యతే. 224

వస్తుతత్వాస్యత్ప్రబంధస్య శరీరం కవికల్పితం
ఇతివృత్తం తదేవాహుః నాట్యాభినయకోవిదాః. 225

చరితం నాయకాదీనామితివృత్తమితి స్మృతం
ప్రయోజనవశాత్తత్తు వర్తమానమపి క్వచిత్. 226

వృత్తవత్కల్ప్యమితి యదితివృత్తం తదుచ్యతే
గోపుచ్ఛవద్విధాతవ్యం, కావ్యాది కవిభిః సదా. 227

పశ్చాద్భాగే ప్రబంధస్య కర్తవ్యాస్తే రసాదయః
ఇతివృత్తాభిధం వస్తు యత్కావ్యే తద్ద్విధా భవేత్. 228

ఆధికారికమేకం తు ప్రాసంగికమథాపరం
తత్రాధికారికం ముఖ్యమంగం ప్రాసంగికం విదుః 229

వృత్తాంతో నాయకాదీనామత్ర స్యాదాధికారికః
ఉపనాయకవృత్తాంతః ప్రాసంగిక ఉదాహృతః. 230

నాయికానాయకాదీనాం వృత్తాంతో యస్త్రివర్గభాక్
కావ్యవ్యాపి స ఏవైష ఆధికారిక ఉచ్యతే. 231

ప్రస్తుత మిచట వస్తురూపము విశదముగా నిరూపితము కావలసియున్నది. వస్తువు ప్రబంధమునకు కవికల్పితమయిన శరీరము. నాట్యాభినయకోవిదు లీ వస్తువునె యితివృత్త మందురు. నాయకాదుల చరితము నితివృత్త మనిరి. ఒక్కొక్కస్థలము నందలి ప్రయోజనవశమున వర్తమానవస్తువును అతీతవస్తువుగా నిర్మితమగుట కలదు. కావున నదియు ఇతివృత్త మనియె వ్యవహృతమగును. వర్తమానము నతీతముగ నిరూపిత మగుననుట. కవు లెల్లప్పుడును కావ్యాదికమును గోపుచ్ఛసమాకారముగ నిర్మింపవలెను. పెద్దవి చిన్నవి యన్నియు సమముగా భాసించునట్లు, అచ్చటివేని యిచ్చటివేని యెచ్చటివేని సుశ్లిష్టములై యుండునట్లు, అన్నియు సమాకృతిశోభాసుందరములై యేకాశ్రయరమ్యములుగా నుండునట్లు కూర్పవలెను. రసాదు లన్నియు ప్రబంధపశ్చాద్భాగమున నాయోజనీయము లగును.

కావ్యమున నితివృత్తమను పేరుగల వస్తువు రెండువిధముల నుండును. ఒకటి యాధికారికము, రెండవది ప్రాసంగికము. ఆధికారికము ముఖ్యము. ప్రాసంగిక మంగము. నాయకాదుల వృత్తాంత మిచట నాధికారికమని, యుపనాయక వృత్తాంతము ప్రాసంగికమని సముదాహృత మయినది. ధర్మార్థకామభాజనమయిన నాయికానాయకాదుల వృత్తాంతము కావ్యవ్యాపిగా నుండునేని యాధికారిక మందురు. ఈ ప్రసంగమున నిక ప్రాసంగికవస్తు స్వరూప మావశ్యకము.

యశ్చోపనాయకాదీనాం వృత్తాంతో నాయకార్థకృత్
స నాంతరీయకశ్చార్థః ప్రాసంగిక ఉదాహృతః. 232
ఆజన్మనోఽభిషేకాంతం రామస్యైవాధికారికం
ప్రాసంగికంతు సుగ్రీవవిభీషణవిచేష్టితమ్. 233

ప్రాసంగికాభిధం వస్తు నాటకే భవతి త్రిధా
పతాకా ప్రకరీ యుక్త పతాకాస్థానక క్రమాత్. 234

సానుబంధం పతాకాఖ్యం ప్రకరీ చ ప్రదేశభాక్
ఉపనాయకవృత్తాంతో నాయకస్య ఫలార్థినః. 235

సాధకో లభ్యతే స్వార్థే సా పతాకేతి కథ్యతే
నాయకస్య కథామధ్యే తత్సమానస్య యా కథా. 236

ఆఫలోదయపర్యంతా సా పతాకేతి కథ్యతే
పతాకా మద్రరాజస్య శల్యస్య చరితం యథా. 237

ఫలం ప్రకల్ప్యతే యస్యాః పరార్థాయైవ కేవలం
అనుబంధవిహీనాం తాం ప్రకరీమితి నిర్దిశేత్. 238

యేన కేనాప్యనల్పేన హేతునా పూర్వముద్గతం
పశ్చాన్న దృశ్యతే యత్తు తద్వస్తు ప్రకరీ భవేత్. 239

ప్రకరీ కులపత్యంకే జటాయోశ్చరితం యథా
యథా పతాకా కస్యాపి శోభాకృచ్చిహ్నరూపతః. 240

స్వస్యోపనాయకాదీనాం వృత్తాంతస్తద్వదుచ్యతే
శోభాయై వేదికాదీనాం యథాపుష్పావృతాదయః. 241

తథాత్ర వర్ణనాదిస్తు ప్రబంధే ప్రకరీర్భవేత్

ప్రాసంగికస్వరూపకథనమునందే ప్రసక్తములగు పతాకా ప్రకారీ స్వరూపములు నిరూపితములు కావలెను. అవి యన్నియు నిందున్నవి. ఉపనాయకాదుల వృత్తాంతము ప్రాసంగికము. ఆధికారికవస్తువునం దిది నాంతరీయకము గా నపరిహార్యముగనుండును. నాయకుని ప్రయోజన సంపాదనమున సహాయకారిగ నుండును. ప్రధానకథాప్రసంగమున సిద్ధ మగుటచే నిది ప్రాసంగికము. శ్రీరామాయణగ్రంథమునందు శ్రీరాముని చరితము పుట్టినది మొదలుగా నభిషేక పర్యంత మాధికారికవృత్తాంత మని గుర్తించునది. రామాయణమునందే సుగ్రీవ వృత్తాంతము విభీషణుని విశిష్టచేష్టితము ప్రాసంగికవృత్తాంత మగును.

ప్రాసంగిక మను పేరు గల వస్తువు నాటకమున మూడు విధములుగ నుండును—పతాక, ప్రకరి, పతాకాస్థానకము నని. వీనిలో పతాకావస్తువు సానుబంధము. కొంతగా నితరవస్తువుతో ననుబంధము కలిగి యుండును.

ప్రకరీవస్తు వొక ప్రదేశమున మాత్రము సంబంధముకలిగి యుండును. అది యితరములతో ననుబంధించి యుండదు. ప్రధానఫలార్థి యయిన నాయకునకు సంబంధించిన యుపనాయకుని వృత్తాంతము సాధకమగుచు స్వార్థమును గూడ సిద్ధ మొనరించుకొనును. ఇట్టి సుగ్రీవాదివృత్తాంతము పతాకావృత్తాంతము పేరుతో వ్యవహృత మగుచున్నది. నాయకునకు సంబంధించిన కథాభాగమున తత్సమానుని కథ ఫలోదయపర్యంతము ప్రసరించి యుండునదె యగునేని పతాకా వృత్తాంతమగును. మద్రదేశప్రభు వయిన శల్యుని చరితము పతాకావృత్తాంత మని గుర్తించునది. ఇది భారతకథాసంబద్ధము.

ప్రకరీవృత్తాంత స్వరూప మీ విధముగా నుండును. పతాకావృత్తాంతమునకు సంబంధించిన ఫలము కేవలము పదార్థమునకె యగును. అనుబంధముతో నుండదు. ఇట్టి దానిని ప్రకరి యందురు. ఏదేని ప్రబంధాంశమున మొదట సముద్గత మయ్యు ననంతర మా వస్తువు గోచరింపదేని ప్రకరీవస్తు వగును. రామ కథాసంబద్ధ మయిన నాటకమున కులపత్యంకము నందు జటాయుచరితము ప్రకరీ రూపము. ఎవని కేని నాయకునకు చిహ్నరూపముగా నున్న పతాక శోభా సంపాదక మగును. అట్లె యుపనాయకాదుల వృత్తాంతము నాయకునకు శోభా సంపాదక మగును. పుష్పాక్షతాదులు వేదిక మొదలగు వానికి శోభాసంపాద కము లగుచున్నవి. ఆట్లె ప్రబంధమున ప్రకరీవృత్తాంతమునకు సంబంధించిన వర్ణనాదికము శోభాసంపాదక మగును. ఇట్లాధికారిక - ప్రాసంగిక - పతాకా - ప్రకరీవృత్తాంతస్వరూపము నిర్దిష్ట మయినది. ఇక పతాకాస్థానకస్వరూపము నిర్దేశింపవలెను.

## పతాకాస్థానకము

ఆగంతుకేన భావేన యదభివ్యక్తికారణమ్. 242

వస్తునో భావ్యవస్థస్య పతాకాస్థానకం తు తత్
తత్పతాకాప్రకర్యాదేః భావ్యవస్థస్య వస్తునః. 243

సూచనోపాయమేవాహుః పతాకాస్థానకం బుధాః
అతీతానాగతే కార్యే కథ్యేతే యత్రవస్తునా. 244

అన్యాపదేశవ్యాజేన పతాకాస్థానకం తు తత్
యత్రార్థే చింతితేఽన్యస్మిన్ తద్వదన్యః ప్రవర్తతే. 245

ఆగంతుకేన భావేన పతాకాస్థానకం తు తత్
తత్తుల్యసంవిధానం చ తథాతుల్యావిశేషణమ్. 246

ఇతి ద్విధా యదన్యోక్తిరూపం తత్ప్రథమం భవేత్
యత్సమాసోక్తిరూపం తు తత్స్యాత్తుల్యవిశేషణమ్. 247

వస్తువిభాగమున నాల్గవది యయిన పతాకాస్థానక మిచట నిర్దిశ్యమాన మగుచున్నది. ఇచట నాలుగు పతాకాస్థానము లున్నవి. పతాకాస్థానముల కితరులు నిర్దేశించిన లక్షణము లనంతరము నిర్దిష్టము లగును. భావ్యవస్థానుగత మయిన వస్తువు నాగంతుకభావమున సూచించుట—భావ్యర్థమున కవివ్యక్తి కారణము పతాకాస్థానము. పతాకాప్రకర్యాదిరూపమయిన భావ్యవస్థాపన్నమయిన వస్తువునకు సూచనోపాయము పతాకాస్థానక మనిరి. అన్యాపదేశవ్యాజమున ప్రకృత వస్తువుచే నతీతానాగతములగు కార్యములు సూచితము లగుచో పతాకాస్థానక మగును. అభిచింతితముగా నొక యర్థము నిరూపిత మగునప్పుడు దాని వలె నితరార్థ మాగంతుకభావమున ప్రవర్తించినచో నది పతాకాస్థానక మగును. ఇట్లు పతాకాస్థానకవిషయమున నాలుగు భావములు నిర్దిష్టము లయినవి. అన్నిట నొక దానిచే వేరొకటి భాసించుట యున్నది. ఈ పతాకాస్థాన మన్నిటను తుల్యసంవిధానరూపముగను తుల్యవిశేషణాత్మకముగను నుండును. ఈ రెండు విధానములలో మొదటిది అన్యోక్తిరూపముగను, తుల్యవిశేషణాత్మకమయిన రెండవది సమాసోక్తిరూపముగ నుండును.

పతాకాస్థానకస్యాన్యే చాతుర్విధ్యం ప్రజానతే
"సహసైవార్థసంపత్తిః గుణవృత్త్యుపచారతః
పతాకాస్థానకమిదం ప్రథమం పరికీర్తితమ్. 248

వచః సాతిశయం శ్లిష్టం కావ్యబంధసమాశ్రయం
పతాకాస్థానకమిదం ద్వితీయం పరికీర్తితమ్. 249

అర్థోపక్షేపణం యత్ర లీనం సవినయం భవేత్
శ్లిష్టప్రత్యుత్తరోపేతం తృతీయమిదమిష్యతే. 250

ద్వ్యర్థో వచనవిన్యాసః సుశ్లిష్టః కావ్యయోజితః
ఉపన్యాససుయుక్తం యత్తచ్చతుర్థముదాహృతమ్"
ఆదితస్త్రితయం తుల్యసంవిధానాత్మకం భవేత్. 251

చతుర్థం తు భవేత్తుల్యవిశేషణసమన్వితం

కొందరు పతాకాస్థానకమునకు చాతుర్విధ్య మంగీకరించిరి. గుణవృత్త్యుపచారవశమున సహసా—వేగముగా నర్థసంపత్తి యుండుట మొదటి పతాకా

స్థానకము. కావ్యబంధసమాశ్రయ మయిన సాతిశయశ్లిష్టవచనము రెండవపతాకా స్థానకము. లీనముగా నున్న యర్థోపక్షేపణము వినయోపేతముగ ప్రకాశిత మయినచో శిష్టప్రత్యుత్తరోపేతముగ నున్నచో తృతీయస్థానము. అర్థద్వయము నిరూపించువచనవిన్యాసము కావ్యయోజితమై సుశ్లిష్టముగ నున్నచో నుపన్యాస యుక్తముగ నవభాసించుచో చతుర్థపతాకాస్థానకము. ఈ నాల్గింటిలో మొదటి నుండి మూడు పతాకాస్థానములు తుల్యసంవిధానాత్మకము లని, నాల్గవది తుల్య విశేషణసమన్విత మని గ్రహింపవలెను. ఇందు శారదాతనయుని యోజనము కొంత కలదు. అది యిట్లు సంభావ్యము.

ఉద్దామోత్కలికేత్యాది రత్నావలీగతమ్. 252

యదుచ్యతే ద్వితీయేఽంకే తత్స్యాత్తుల్యవిశేషణం
యత్సిద్ధిచింతా యత్కాలే తత్కాలే తస్య సిద్ధయే. 253

విధీయతే యదన్యోక్తిస్తత్తుల్యం సంవిధానకం
"అపి నామ స గృహ్యేత" ఇతి కౌటిల్యచింతయా. 254

"గృహీతో" ఇతి సిద్ధార్థకోక్తిస్తుల్యవిధానకం

శ్రీహర్షరచిత రత్నావలి ద్వితీయాంకములో "ఉద్దామోత్కలికాం" అను పద్యమున తుల్యవిశేషణాత్మకమయిన పతాకాస్థానక మున్నది. విశాఖదత్త రచిత ముద్రారాక్షసమున "అపినామ స గృహ్యేత" అను కౌటిల్యచాణక్యుని చింతనానుసారమున "గృహీతః" అను సిద్ధార్థకునివచనము తుల్యసంవిధానకమున నున్నది. ఏ కాలమున నేకార్యసిద్ధికై చింతనముండునో యా కాలమున నాకార్య సిద్ధికై యితరుని వచనము తగినట్లుగా విహిత మగు నేని యది తుల్యమగుసంధా నకమగును. ఇటిచటి శబ్దార్థము గ్రాహ్యము. ఆయారూపకములలోని యా యా ప్రకరణానుసారి విశేష మీ విధముగ పరిగ్రాహ్యము.

రత్నావలిలో వత్సరాజుద్యానమున విహరించుచు నవమాలికోపన్యాస మున నిటనును.

ఉద్దామోత్కలికాం విపాండురరుచం ప్రారబ్ధజృంభాం క్షణా
దాయాసం శ్వసనోద్గమైరవిరలైరాతన్వతీమాత్మనః
అద్యోద్యానలతామిమాం సమదనాం నారీమివాన్యాం ధ్రువం
పశ్యన్కోపవిపాటలద్యుతి ముఖం దేవ్యాః కరిష్యామ్యహమ్.

ఉద్యానవనమున నవమాలికామాధవీలతలకు ప్రథమముగా కుసుమోద్గమమయినది. వత్సరాజు వాసవదత్తతో నుద్యానసంచారమున విషయసుఖాభిలాషమున పలికిన యీ పలుకులలో సాగరికాసందర్శనము సుఖనిమిత్తమను నాగామి భావ మున్నది. అది రెండవయర్థమున భాసించును. ఇచటి వచనవిన్యాసము సుశ్లిష్టమై యన్యార్థాలింగితమై ప్రసంగ ప్రతిపాదిత మయినది. ఇందు లతాపక్షమున ప్రకృత భావ మిటు భావనీయము. ఈ యుద్యానలత బాగుగా మొగ్గతొడగినది. తెల్లగా నున్నది. వికసించినది. గాలివలని కదలికలచే నటునిటు నూగుచున్నది. ఇట్టి యీ లత మదనభావములు కల నారి వలె నున్నది. ఇందు నారీపక్షమున భావము నిట్లు గ్రహింపదగును. ఈమె యుత్కలిక లధికములు. దేహకాంతి పాండురము. ఆవలింత లారంభ మయినవి. నిట్టూర్పు లధికముగా ప్రసరించి యీమె నాయాస పెట్టుచున్నవి అని. ఇటన్యనారిని జూచిన విధమున జూచి వాసవదత్తాదేవీవదనము కోపవిపాటల మొనరింతునని రాజభాష. ఇందు సమన్వయము ప్రదర్శిత మయినది.

ముద్రారాక్షసములో చాణక్యుడు తానాచరించిన ప్రయోగమున రాక్షసుడు పట్టుబడునా? యను సందేహమున "అపి నామ దురాత్మా రాక్షసో గృహ్యేత" — దుశ్చింతకల రాక్షసుడు పట్టుబడునా? అని పలుకగా ననంతరమె సిద్ధార్థకుని వచన సంఘటనమున నిశ్చయము సూచితమయినది. ఆయంశమిట్లున్నది. "అయం గృహీతః" "హంత గృహీతో దురాత్మా రాక్షసః?" "భద్ర అథ కోయం గృహీతః" "ఆర్యసందేశః" మీసందేశము గృహీత మని సిద్ధార్థకుడు పలుకుటలో రాక్షసగ్రహణనిశ్చయార్థమును చాణక్యుడు గుర్తించెను. ఇది తుల్యవిధానకము.

యదాధికారికం వస్తు ద్విధైవ పరికీర్తితమ్. 255

ప్రత్యేకం తత్త్రికం త్రేధా భిద్యతే కార్యయోగతః
ప్రఖ్యాతోత్పాద్యమిశ్రత్వభేదాత్త్రివిధముచ్యతే. 256

ప్రఖ్యాతమితిహాసాదిరుత్పాద్యం కవికల్పితం
మిశ్రం చ సంకరాదేవం నవధా వస్తుకల్పితమ్. 257

తస్మాదపీహ వస్త్వన్యద్దివ్యమర్త్యోభయాత్మకం
అనంతత్వాదథైతేషామూహ్యో లక్ష్యానుసారతః. 258

వస్తువిభాగ మిదివరలో నొక విధముగా సూచితమయినది. ఇచట వేఱొకవిధముగా వస్తువిభాగము గుర్తింపవలసి యున్నది. అధికారికవస్తువు

రెండు విధముల నున్న ప్రాసంగికవస్తువునను నీ మూడు కార్యయోగాను సారమున మరల మూడు విధములు—ప్రఖ్యాతము -ఉత్పాద్యము-మిశ్రము నని. ఇతిహాసాదిప్రసిద్ధము ప్రఖ్యాతము. కవికల్పిత ముత్పాద్యము. ఈ రెండిటి సంకరమున మిశ్రము. కాగా మూడును మూడువిధములై మొత్తము నవ విధము లగును. ఇంతకన్నను నేరుగా వేరొక భేదము కలదు. దివ్యము-మర్త్యము-ఉభయాత్మకము నని. ఇంక నిట్టి భేదముల ననంతముగా లక్ష్యానుసారమున నభ్యూహించునది. వాని నిట ప్రస్తావించుట లేదు.

అత్రాధికారికస్యాపి తథా ప్రాసంగికాత్మనః
వస్తునో భరతః ప్రాహ ఫలం తస్య భిదా అపి. 259

ఫలం త్రివర్గస్తచ్ఛుద్ధమేకానేకానుబంధి చ
త్రిభిర్ద్వాభ్యామథైకేన తేషామన్యోన్యసంకరాత్. 260

ఏవం ద్వాదశధా వస్తు ఫల భేదాః ప్రకల్పితా

భరతు డిచటి యాధికారికవస్తువునకు ప్రాసంగికవస్తువునకు ఫలమును భేదములను నిర్ణయించెను. ఫల మనునది త్రివర్గము. ధర్మార్థకామములు. ఈ త్రివర్గము శుద్ధముగా నుండును. ఏకానుబంధమున నుండును. అనేకానుబంధ మున నుండును. ధర్మార్థకామములు మూడును ఫలముగా నుండుట, రెండు పురుషార్థములె ఫలముగా నుండుట, ఒక పురుషార్థమె ఫలముగా నుండుట యున్నది. వీని యన్యోన్యసాంకర్యమును ఫలముగా నుండును. ఇట్లన్ని రీతుల పరిశీలింపగా వస్తుఫలభేదములు ద్వాదశవిధము లగుచున్నవి.

బీజమస్యేతివృత్తాంశః త్రివర్గస్యేరితం బుధైః. 261

ఫలం యదితివృత్తస్య స త్రివర్గ ఇతీరితః
ఉపక్షిప్తం తు యత్స్వల్పం విస్తారం యాత్యనేకధా. 265

హేతుర్యత్నాస్య త్రివర్గస్య తద్బీజమితి కథ్యతే
విస్తారో బహుధా తస్య నాయకాదివిభేదతః. 263

స స్వామాత్యోభయాయత్తసంసిద్ధేర్నాయకస్య తు
తత్తదుత్సాహరూపోఽయం విస్తార ఇతి కథ్యతే. 264

బీజముప్తం యథా స్కంధ శాఖా పుష్పాదిరూపతః
బహుధా విస్తృతిం గచ్ఛేత్ఫలాయాంతేఽవకల్పతే. 265

తథా నాయకమిత్రాదిరూపోఽంతే ఫలవాన్ భవేత్
బీజం చ వేణీసంహారే సత్త్వా ఇతి దర్శితమ్. 266

ధర్మార్థకామాత్మక మయిన త్రివర్గరూపఫలమునకు ఇతివృత్తము నందలి యొక యంశము బీజరూప మని బుధు లనిరి. ఇతివృత్తమునకు త్రివర్గము ఫలము. మొదట స్వల్పముగా నుపక్షిప్తమై యనంతర మనేకధా విస్తరము పొందునది త్రివర్గమునకు హేతువుగా నుండునది బీజమగును. నాయకాదుల విభేదానుసారమున బీజమునకు బహుధా విస్తారము కలుగును. నాయకుడు స్వాయత్తసంసిద్ధి—అమాత్యాయత్తసంసిద్ధి—ఉభయాయత్తసంసిద్ధి యని త్రివిధముగా నుండును గావున నా బీజాంశము తత్తదుత్సాహరూపముగా నుండుటయె విస్తారమని యనిరి. వృక్షమునకు సంబంధించిన బీజము భూమిలో పాదుకొల్పిన యనంతరము స్కంధముగా శాఖలుగా పుష్పాదిరూపముగా బహుధా విస్తృతి పొందును. తుదకు ఫలమగుటకు పర్యాప్తమగును. అట్లే నాయకమిత్రాదిరూపమున నున్న బీజాంశము ఫలసహిత మగును. భట్టనారాయణ రచిత వేణీసంహారమునందు "సత్త్వా మధురగిరః" యను శ్లోకమున బీజము నిదర్శిత మయినది. ఆ శ్లోక మిట్లున్నది.

సత్త్వా మధురగిరః ప్రసాధితాశా మదోద్ధతారంభాః
నిపతంతి ధార్తరాష్ట్రాః కాలవశాన్మేదినీపృష్ఠే.

వేణీసంహారములో ప్రస్తావనాప్రసక్తిలో ఋతువర్ణనముగా నిది యున్నది. ధార్తరాష్ట్రము లనదగిన హంసవిశేషములు మంచి పక్షములు మధుర స్వనములు కలవై దిశల నలంకరించి యుద్ధత సమారంభములు కలవై కాలప్రభావమున భూమిపై ప్రసరించుచున్నవి. ఇట్లు ప్రకృతార్థ మవభాసించుచుండగా నాటకీయార్థ మీ విధమున నవభాసించుచున్నది. ధృతరాష్ట్రుని యాత్మజులయిన దుర్యోధనాదులు సత్త్వమున నమధురవాక్కులతోనున్నారు. ప్రకృష్టముగా దిశల నన్నిటి నాధిసహితములుగ నొనర్చినారు. మదోద్ధతితో నున్నారు. కాలవశమున భూమిపై పడిపోవుచున్నారు అని.

ఫలే ప్రధానే విచ్ఛిన్నే బీజస్యావాంతరైః ఫలైః
తస్యావిచ్ఛేదకో హేతుః బిందురిత్యాహ కోహలః. 267

బిందుర్మానవిపత్తిభ్యాం ద్విరూపః కథ్యతే బుధైః
క్రోధేన మానజో బిందుః శోకేన స్యాద్విపత్తిజః. 268

లాక్షాగృహానలేత్యాది బిందోః సామాన్యలక్షణం(?)
కృష్టా యేనేతి పాంచాలీ వ్యాహృతా గౌరితి క్రుధా. 269
శోకేన ద్రౌపదీకేశాంబరాకర్షణపాతకిన్
ఇతి బిందోర్ద్విరూపత్వమన్యత్రోహ్యామిదం యథా. 270

ప్రధానఫలము బీజమునకు సంబంధించిన యవాంతర ఫలములచే విచ్ఛిన్నప్రాయము కాగా తదవిచ్ఛేదకమగు హేతువు బిందురూపముగ నుండు ననికోహాలు డనెను. మానము, విపత్తి యను వానిచే బిందువు ద్విరూపము. మానజన్యమగు బిందువు క్రోధహేతుకము. విపత్తి జన్యమగు బిందువు శోకహేతుకము. వేణీసంహారము నందలి లాక్షాగృహానలేత్యాదికములో బిందువునకు సంబంధించిన మానవిపత్తి జన్యము లగు బిందురూపములు కలవు. వేణీనాటకము నందే "కృష్టా యేన" "గౌరితివ్యాహృతా" "ద్రౌపదీకేశాంబరాకర్షణపాతకిన్" అను స్థలములందు మానరూపత శోకరూపత యున్నది. ఇట్లు బిందువు ద్విరూముగా నుండుట నభ్యూహించునది.

లాక్షాగృహానలవిషాన్నసభాప్రవేశైః
మానేషు విత్తనిచయేషు చ నః ప్రహృత్య
ఆకృష్టపాండవవధూపరిధానకేశాః
స్వస్థా భవంతి మయి జీవతి ధార్తరాష్ట్రాః.

ఈ శ్లోకభావము షష్ఠాధికారములో కామస్వరూపవిచార సమయమున నిరూపిత మయినది. కౌరవనాశాత్మక మయిన బీజార్థము దౌత్యారంభమున విచ్ఛిన్న కల్పము కాగా తదవిచ్ఛిన్నతానుసంధానమునకై యిందు మానవిపత్తి జన్య మయిన బిందువు విశద మయినది. వేణీతృతీయాంకమున-

కృష్టా యేన శిరోరుహే నృపశునా పాంచాలరాజాత్మజా
యేనాస్యాః పరిధానమప్యపహృతం రాజ్ఞాం గురూణాం పురః
యస్యోరఃస్థలశోణితాసవ మహం పాతుం ప్రతిజ్ఞాతవాన్
సోఽయం మద్భుజపంజరే నిపతితః సంరక్ష్యతాం కౌరవః.

అని యున్నది. భీముడు దుశ్శాసనుని బట్టి యిది పలుకును. నరపశు వీతడు పాంచాలరాజాత్మజ జుట్టు పట్టినాడు. రాజులెదుట గురువుల సమక్షమున కట్టుబట్ట హరించినాడు. నేను వీని వక్షోరక్తము త్రావుదునని ప్రతిజ్ఞ చేసితిని.

వీడు నా చేజిక్కినాడు. రక్షించికొనుడు.'' అని పలుకుటలో మానజబిందు వున్నది. "ఓరీ దురాత్మా! ద్రౌపదీకేశాంబరాకర్షణపాతకీ! ధార్తరాష్ట్రాపసద! క్షుద్రపశు! ఎచటికి బోయెదవు?'' అనుటలో మానబిందు వున్నది. ఇట్లేబిందువు రూపద్వయమున నుండుట నన్యస్థలములందు నభ్యూహించునది.

## అర్థప్రకృతులు

బీజం బిందుః పతాకా చ ప్రకరీ కార్యమేవ చ
అర్థప్రకృతయః పంచ కథాభేదస్య హేతవః 271

ఏతే కథాశరీరస్య హేతవః పరికీర్తితాః
సాధనత్వాద్ధి బీజస్య ప్రథమం తదుపక్షిపేత్. 272

సాధ్యత్వాదేవ కార్యస్య సర్వాంతే తత్ప్రయోజయేత్
అవిచ్ఛేదాయ రచయేద్బిందుం మధ్యే తయోరపి. 273

తత్ర తత్ర యథాయోగం పతాకాప్రకరీన్యసేత్

బీజము—బిందువు-పతాక-ప్రకరి – కార్య మను నయిదు కథాభేద హేతువులగు నర్థప్రకృతులు. ఇవి కథాశరీరమునకు హేతువులుగా పరికీర్తితము లయినవి. బీజము సాధనము కావున మొదటగా నిర్దేశింపవలెను. కార్యము—ఫలము సాధ్యము కావున సర్వాంతమున దాని నిరూపింపవలెను. బీజఫలముల యవిచ్ఛేదమునకై బిందువును మధ్యలో కూర్పవలెను. పతాకాంశమును ప్రకరీ విధానమును యథాయోగముగా నా యా స్థలము లందు కూర్పదగును.

ఉక్తా హ్యర్థప్రకృతయః తత్ప్రవృత్తిశ్చ దర్శితా. 274

యథా హి విశ్వామిత్రస్య ప్రోత్సాహోపచితః స్వతః
రామాద్యుత్సాహరూపోఽర్థో బీజమిత్యభిధీయతే. 275

యద్ద్వితీయే తృతీయేఽంకే జాత్యాద్యచ్ఛేదకారణం
అనుయాయీ భవేద్బిందుశ్చతుర్థాంకావధిః క్వచిత్. 276

యథాహి వీరచరితే చతుర్థేఽంకే విలోక్యతే
విష్కంభే మాల్యవద్వాక్యే హా వత్స ఇత్యుదీరితే. 277

సుగ్రీవాదేర్య ఉత్సాహో రామాద్యుత్సాహసాహ్యకృత్
సానుబంధః ఫలప్రాప్తేః సా పతాకేతి కథ్యతే. 278

యథా జటాయోర్వృత్తాంతః సీతాపహరణే కృతః
హనూమతో వా ప్రకరీ యథా సాగరలంఘనే. 279

తాతాజ్ఞామధిమౌలీతి వాక్యే కార్యం విలోక్యతే

అర్థప్రకృతులు నిరూపితము లయినవి. విత్త్వవృత్తియు ప్రదర్శిత మయినది. ఉదాహరణములందు వీని సమన్వయము సూచితము. ఒక సుప్రసిద్ధ గ్రంథమున సమన్వయము ప్రదర్శించినచో సంప్రాప్తవివేకాలోకులు భావుకులు సర్వత్ర సమన్వయము దర్శింపగలరు. శ్రీవాల్మీకి రామాయణమహా ప్రబంధము కవితాసామగ్రీసర్వస్వాలోచనమునకుపజీవ్యగ్రంథము. భవభూతిరచిత మహావీరచరితము మురారికవి యనర్ఘరాఘవము మొదలగు రామకథాశ్రయరూపకములలో నీ సంగతి ప్రదర్శనము సహృదయరోచకము. రామకథాక్రమభావనాసుతుల కిది ప్రీతిప్రదము.

శ్రీరామునకు స్వభావసహజముగా నుత్సాహ మున్నది. అది విశ్వామిత్రుని ప్రోత్సాహమున నుపచిత మయినది. అట్టి రామోత్సాహరూపార్థము బీజమనదగి యున్నది. ద్వితీయాంకమున తృతీయాంకమున జాత్యాద్యుచ్ఛేద కారణముగా బిందు వనుయాయిగా నున్నది. కొన్నిటిలో చతుర్థాంకావధికముగా బిందు వుండును. వీరచరితము చతుర్థాంకమున బిందువుగోచరించుచున్నది. చతుర్థాంకమునవిష్కంభమునందుమాల్యవంతుడు ''హా!వత్స!''యనిపలుకగా సుగ్రీవాదులకుదయించినయుత్సాహము రామాదులయుత్సాహమునకుసహాయకారిగానున్నది. సుగ్రీవోత్సాహము సానుబంధముగా ఫలప్రాప్తికనుకూలముగా నున్నందున పతాకావస్తువనదగి యున్నది. సీతాపహరణవృత్తాంతమున నిరూపిత మయిన జటాయు వృత్తాంతము గాని, సాగరలంఘనసమయమున నిరూపిత మయిన హనూమంతుని వృత్తాంతముగాని ప్రకరీ వృత్తాంత మగును. ''తాతాజ్ఞామధిమౌలి'' యనువాక్యమున కార్యము-ఫల మవభాసించుచున్నది. తాతాజ్ఞాశ్లోకము సమన్వయ మీ విధముగ నున్నది.

తాతాజ్ఞామధిమౌళి మౌక్తికమణిం కృత్వా మహోపోత్రిణః
దంష్ట్రావిద్ధవిలాసపత్రకబరీదృష్టా భృశం మేదినీ. 280
సేతుర్దక్షిణపశ్చిమౌ జలనిధీ సీమంతయన్నిర్మితః
కల్పాంతం చ కృతం సమస్త మదశగ్రీవోపసర్గం జగత్
అత్ర ధర్మార్థనిష్పత్తిః ఫలత్వేన ప్రకల్పితా. 281

తండ్రి యయిన దశరథుని యాజ్ఞను శిరమున మౌక్తికమణి నొనర్చి మహావరాహదంష్ట్ర విలాసపు దువ్వెన యయిన మేదినిని చూచుట యయినది.

దక్షిణపశ్చిమ సముద్రముల కవధి నేర్పఱచు సేతువు నిర్మిత మయినది. కల్పాంతము వఱకు సర్వజగము దశకంఠబాధలేనిదిగా నొనర్పబడినది. ఇట్లనుటలో ధర్మార్థనిష్పత్తి ఫలముగా నిరూపిత మయినవి.

ఇట్లర్థప్రకృతులకు గ్రంథములందు సమన్వయము సంభావించునది. అర్థప్రకృతుల యవస్థావిశేషములు వాని వీనిసంబంధమునగలుగు సంధులు ఆ యా సంధులకు సంబంధించిన యంగములు. వాని స్వరూపములు, సంధ్యంతరములు, సూచ్యాసూచ్యవస్తుస్వరూపము, రూపకభాషామర్యాద లిందు సూచితములు గావలసి యున్నవి.

## అవస్థలు

అవస్థాః పంచ కార్యస్య ప్రారబ్ధస్య ఫలార్థిభిః
ఆరంభ యత్న ప్రాప్త్యాశా నియతాప్తి ఫలాగమాః. 282

కార్యస్య నాయకాదీనాం వ్యాపారాపేక్షయా పునః
పంచావస్థా భవంతీతి భరతాదిభిరుచ్యతే. 283

ఔత్సుక్యమాత్రబంధస్తు యద్బీజస్య నియుజ్యతే
మహతః ఫలయోగస్య స ఖల్వారంభ ఇష్యతే. 284

అపశ్యతః ఫలప్రాప్తిం యో వ్యాపారః ఫలం ప్రతి
పరం చౌత్సుక్యగమనం స ప్రయత్నః ప్రకీర్తితః. 285

ఈషత్ప్రాప్తిశ్చ యా కాచిదర్థస్య పరికల్ప్యతే
సత్తామాత్రేణ తం ప్రాహుర్విధివత్ప్రాప్తిసంభవమ్. 286

నియుక్తా తు ఫలప్రాప్తిః యదా హ్యేవం ప్రపశ్యతి
నియతాం తు ఫలప్రాప్తిం సగుణాం తాం వినిర్దిశేత్. 287

అభిప్రేతం సమగ్రం చ ప్రతిరూపం క్రియాఫలం
దృశ్యతే యన్నివృత్తేతి ఫలయోగస్స ఉచ్యతే. 288

సర్వస్యైవ హి కార్యస్య ప్రారబ్ధస్య ఫలార్థిభిః
యథానుక్రమశో హ్యేతాః పంచావస్థా భవంతి హి. 289

ఫలార్థులు ప్రారంభించిన కార్యమునకు పంచావస్థలు కలవు—ఆరంభము-యత్నము-ప్రాప్త్యాశ-నియతాప్తి-ఫలాగమము నని వాని పేరులు. నాయకాదు లుద్దేశించిన కార్యమునకు వ్యాపారాపేక్షచే నయిదవస్థ లుండునని భరతాదులు

నిరూపించిరి. అంతట కోహలాదులు భరతాదులు సూచించి రనుట స్వగ్రంథ ప్రామాణ్యద్యోతకము. ఆ పంచావస్థల స్వరూప మీ విధముగా నున్నది.

ప్రధానఫలసిద్ధికై నియుక్త మయిన బీజమునకు సంబంధించిన విధ ముగా నౌత్సుక్యము మాత్రము నిబంధించుట ఆరంభ మను నవస్థ యగును. ఫల ప్రాప్తి గోచరింపక పోగా ఫలోద్దేశమున నున్న వ్యాపారము సనుధికౌత్సుక్య ముతో గూడి యుండుట ప్రయత్న మని ప్రకీర్తిత మయినది. ప్రాప్త్యాశ యను నదియె ప్రాప్తిసంభవము. సత్తామాత్రముగా ఫలమునకు సంబంధించిన ప్రాప్తి యీషన్మాత్రముగా యుక్తవిధానమున నిరూపిత మగునేని యది ప్రాప్తిసంభ వము, ప్రాప్త్యాశ. నాల్గవది యయిన నియతాప్తి యిట్లుండును. నియుక్త మగు ఫలప్రాప్తి సిద్ధప్రాయముగ నున్నచో నంగసహితమై యవభాసించినచో నది నియత ఫలప్రాప్తి-నియతమగు ఫలము యొక్క ప్రాప్తి నియతాప్తియని నిర్దేశింప నగును. ఫలాగమ మయిదవది. అది యిట్లుండును. అభిప్రేతమగు సమగ్రక్రియా ఫలము రూపరూపసముచితముగా నివృత్తమై సిద్ధమై గోచరించినచో నది ఫలా గమ మనదగును. ఫలార్థులు ప్రారంభించిన సర్వకార్యమునకు సంబంధించిన విధముగా ననుక్రమమున నీ పంచావస్థ లుండును. వీని స్వరూపసమన్వయమును మహాకవి ప్రబంధములలో సంభావించుట సముచితము.

శకుంతలాయాః క్షత్రేణ పరిగ్రాహ్యత్వమత్వతః
ఆరంభోఽసంశయం క్షత్రేత్యాదిదుష్యంతభాషితే. 290

ప్రయత్నో మాధవేనైవ మాలత్యాః సంగమాశయా
ప్రాణై సపోభిరిత్యాది యత్తత్కామందకీవచః. 291

ప్రీతే విధాతరీత్యాది ప్రాప్త్యాశా మాల్యవద్వచః
సందేహనిర్ణయో జాతః సాభిలాషం భవేతి చ. 292

దుష్యంతభాషితం యత్ర నియతాప్తిరియం వచః
భీమస్య వేణీసంహారే ఫలయోగోఽత్ర దర్శితః. 293

అవస్థాపంచకం హ్యేతదర్థప్రకృతిభిస్సహ
నిబంధనీయం కవిభిర్యథై వాన్యోన్యమన్వితమ్. 294

అభిజ్ఞానశాకుంతలనాటకము నందలి ప్రథమాంకములో నాశ్రమమున శకుంతలను చూచినప్పుడు శకుంతల క్షత్రియునకు స్వీకరింప దగిన దగుటచే

"అసంశయం క్షత్ర పరిగ్రహక్షమా" అను దుష్యంతభాషితము నందు ఆరంభావస్థ యున్నది. భవభూతి రచిత మయిన మాలతీమాధవమునందు, మాధవునితో మాలతికి సంగమము కలుగు కొఱకు యను నాశయమున కామందకిపలికిన "ప్రాణై స్తపోభిః" ఇత్యాది వచనమున ప్రయత్న మను నవస్థాసమన్వయము దర్శింప వలెను. రామాభ్యుదయ నాటకమునందు "ప్రీతే విధాతం" అను మాల్యవంతుని వాక్యమున ప్రాప్త్యాశ యున్నది. శాకుంతలనాటకము నందు శకుంతలావృత్తాంతము తెలిసికొనిన దుష్యంతుడు "భవ? హృదయ! సాభిలాషం సంప్రతి సందేహ నిర్ణయో జాతః" అని పలుకుటలో నియతాప్తి యున్నది. వేణీసంహారము నందు భీముని ఫలయోగము ప్రదర్శిత మయినది. కవు లీ యవస్థాపంచకము నర్థప్రకృతులతో జాటుగా నన్యోన్య మన్వితత మగునట్లుగా నిబంధింప వలెను. అర్థప్రకృతులకు నవస్థాపంచకమునకు యథాక్రమముగా యథాయోగ మన్యోన్య సంబంధమును బాగుగా సమీక్షించి నిరూపింప వలెను.

## సంధులు

తదన్వయవశాదర్థప్రకృతీనాం యథాక్రమం
ఏకైకస్య భవేత్సంధిరేకైక ఇతి నిర్ణయః 295

అథార్థప్రకృతీనాం తదవస్థాపంచకస్య చ
అన్వయో హ్యుపసంహారక్రమారంభక్రమాశ్రయః. 296

పంచావస్థాసమేతార్థప్రకృతీనాం యథాక్రమం
యథాసంఖ్యేన జాయంతే ముఖాద్యాః పంచసంధయః. 297

అన్తరైకార్థసంబంధః సంధిరేకాన్వయే సతి
అన్వితానాం కథాంశానాం పరమే తు ప్రయోజనే. 298

సంబంధః సంధిరిత్యుక్తోఽవాంతరైకప్రయోజనః
ఏకకార్యాన్వితేష్వత్ర కథాంశేషు ప్రయోగతః. 299

అవాంతరైకకార్యస్య సంబంధః సంధిరిష్యతే

ఆరంభాద్యవస్థల కర్థప్రకృతులతో యథాక్రమముగా గలుగు నన్వయవశమున నొక్కొక్క దాని కొక్కొక్క సంధి కలుగు నని నాటకశాస్త్ర నిర్ణయము. అర్థప్రకృతుల కవస్థాపంచకమునకు నుపసంహారక్రమాశ్రయ మయిన యారంభక్రమాశ్రయ మయిన యన్వయము కలుగును. ఆరంభాది పంచావస్థాసమేతము లయిన యర్థప్రకృతులకు ముఖప్రతిముఖాదిపంచసంధులు యథాసంఖ్యముగ గలుగును.

1. బీజారంభసమన్వయమున ముఖసంధి.

2. బిందుయత్నసంబంధమున ప్రతిముఖసంధి.

3. పతాకాప్రాప్త్యాశా సంబంధమున గర్భసంధి.

4. ప్రకరీనియతాప్తి సంబంధమున విమర్శసంధి.

5. కార్యఫలాగమసంబంధమున నిర్వహణసంధి.

పంచక పంచక సంబంధమున సంధిపంచక ముదయించును. సంధి యనగా ప్రధానప్రయోజనమున నన్వితము లయిన కథాంశములకు నేకాన్వయ మున్న నవాంతరైకార్థసంబంధము సంధి యన దగును. ప్రయోగముల యను సారమున నేకకార్యాన్వితము లయిన కథాంశము లందును ఏకాన్వయ మున్నను మధ్యలో అవాంతార్థసంబంధముండుట సంధియని భావము. ముఖ్యప్రయోజన మున్న నవాంతరప్రయోజన ముండుట సంధి. ఇట్లు సంబంధము సంధివ్యవ హారము బొందును. అవాంతరైకకార్యసంబంధము సంధి. ఇట్లిది పునరుక్తప్రాయ మయినను దార్ఢ్యాపాదనము.

ముఖం ప్రతిముఖం గర్భః సావమర్శోపసంహృతిః. 300

వివఖతోఽయముద్దేశక్రమోఽవస్థాక్రమో యథా
నానార్థరసహేతుస్తు బీజోత్పత్తిర్ముఖం భవేత్. 301

"అంహో అలంసోరాట్తి" రత్నావల్యాం ముఖం స్మృతం
బీజోత్పత్తిర్న హేతుః స్యాద్రసానాం ముఖసంధిభాక్. 302

తేషాం త్రివర్గసంబంధః ప్రాయో యస్మాన్న దృశ్యతే
నైవం కామోపయోగ్యత్ర శృంగారో దృశ్యతే రసః. 303

అర్థోపయోగీ వీరః స్యాద్రౌద్రోఽపి స్యాత్క్వచిత్క్వచిత్
రక్షారూపేణ ధర్మార్థోపయోగీ కరుణో భవేత్. 304

అద్భుతోఽపి మనఃప్రీతి ప్రదత్వాత్కామసాహ్యకృత్
తే భయానకబీభత్సహాస్యాః కావ్యేషు యోజితాః. 305

తత్తన్నేతృమనోవృత్తివశాత్ప్రాయస్త్రివర్గగాః
అతో రసానాం హేతుత్వం ముఖసంధేర్భవేదపి. 306

ముఖము ప్రతిముఖము గర్భము సావమర్శము ఉపసంహృతి యనునవి యయిదు సంధులు. అవస్థాక్రమ మున్నవిధమున సంధుల యుద్దేశక్రమము వివక్షిత మయినది. ముఖసంధి యనునది నానార్థరస హేతువు. బీజోత్పత్తిరూపము. నానావిధము లయిన ప్రయోజనములు కల రసములకు ముఖసంధి హేతువుగా నుండును గావున ఫలసిద్ధ్యనుకూలమగు బీజమున కుత్పత్తిస్థానముగా నుండు నని తాత్పర్యము. శ్రీహర్ష రత్నావలిలో సాగరిక యుదయనుని వార్తవిని "అంహో! ఈతడా రాజుదయనుడు. ఈతనికే నాన్న నన్నీ దలచెను" అని యనుటలో ముఖముపక్షిప్త మయినది.

ఇచట నీ యాశంకాసమాధానముల సంభావించుట సముచితము. ముఖసంధి రసములకు హేతువని బీజోత్పత్తిస్థానమని యనినట్లయినది. కాని బీజోత్పత్తి రసహేతువు ముఖసంధిభాజనము కాదు. నాటకములకు త్రివర్గము ఫలమనిరి. రసములకు త్రివర్గసంబంధము సామాన్యముగా నేమియు లేదు. ముఖసంధిలో ధర్మార్థకామాత్మక త్రివర్గబీజ సముత్పత్తి సముచితము కదా!

ఇట్లు భావింప దగదు. త్రివర్గసంబంధ మిందు నున్నది. రూపకములందు కామోపయోగి శృంగారరసము గోచరించుచునే యున్నది. అర్థోపయోగి వీర మున్నది. అచ్చటచ్చట రౌద్ర మర్థోపయోగిగ నుండును. రక్షారూపమున ధర్మార్థోపయోగి కరుణ రస ముండును. మనఃప్రీతిప్రద మగుటచే నద్భుతమును కామసాహ్య మొనరించునదిగ నుండును. కావ్యయోజితము లగు భయానకబీభత్స హాస్యములును ఆ యా నాయకుల మనోవృత్తివశమున సామాన్యముగా త్రివర్గగములె యగును. కావున ముఖసంధి రసములకు హేతుత్వము పొంది యుండుట సంగతమె యగును

## ముఖసంధి

బీజారంభోదాహృతిర్యా ముఖసంధేశ్చ సా భవేత్
అంగాని ద్వాదశైతస్య బీజారంభసమన్వయాత్. 307

ఉపక్షేపః పరికరః పరిన్యాసో విలోభనం
యుక్తిః ప్రాప్తిః సమాధానం విధానం పరిభావనా. 308

ఉద్భేదః కరణం భేదః ఇత్యంగాని ముఖస్య తు

బీజమున కారంభమునకు నిరూపించిన యుదాహృతి ముఖసంధికిని సంబంధించిన దగును. బీజారంభసమన్వయమున ముఖసంధికి పండ్రెండంగములు

కలవు. అవి యుపక్షేపాదిభేదాంతములు ద్వాదశ. ఇవి ముఖసంధి యంగములని గ్రాహ్యము. వీని లక్షణసూత్రవచనము లీ విధమున నున్నవి.

బీజన్యాస ఉపక్షేపః తద్బాహుల్యం పరిక్రియా. 309

తన్నిష్పత్తిః పరిన్యాసో గుణాఖ్యానం విలోభనం
సంప్రధారణమర్థానాం యుక్తిరిత్యభిధీయతే. 310

బీజాగమః సమాధానం ప్రాప్తిః కోఽపి సుఖాగమః
పరిభావోఽద్భుతావేశః విధానం సుఖదుఃఖకృత్. 311

కరణం ప్రకృతారంభ ఉద్భేదో గూఢభేదనం
భేదః ప్రోత్సాహనాఽంగాని కథితాని యథార్థతః. 312

ఇచట నుపక్షేపాదిభేదాంతద్వాదశాంగముల లక్షణము లున్నవి. విస్తర మని లక్ష్యముప్రదర్శింప లేదు.

౧. ఉపక్షేపము. బీజన్యాసము. ఫలహేతువగు బీజరూపార్థమును కూర్చుట. ఇది యారంభావస్థానుగతమై ఫలనిష్పాదక మగును. ఇట్లే యన్నిట సంభావ్యము.

౨. పరిక్రియ. తద్బాహుల్యము. బీజార్థమును కొంతగా బహుల మొనరించుట. బీజము సూచిత మయిన పిమ్మట తత్పుష్టిసంపాదనమునకై దాని దృఢ మొనరించుట పరిక్రియ. ఇదియె పరికరము.

౩. పరిన్యాసము. బాహుల్యరూపమయిన పరికరము పరిపక్వమగుట నిష్పన్న మగుట పరిన్యాసము, తన్నిష్పత్తి.

౪. విలోభనము. గుణాఖ్యానము. ఫలసంబద్ధ మయిన వస్తువునకు సంబంధించిన గుణముల వర్ణనము విలోభనము. ఏవడేని వస్తుగుణముల భావించి లుబ్ధుడగును. ఫలాసక్తి కలిగించుటకై తద్గుణాఖ్యాన ముచితము. నాయకు డిష్టప్రాప్త్యాసక్తుడగుట విలోభనము.

౫. యుక్తి. అర్థసంప్రధారణము. పాత్రలకు సంబంధించిన యభీష్టార్థముల యవధారణము-సమర్థనము యుక్తియను నాటకీయ తత్త్వ మగును.

౬. సమాధానము. బీజాగమము. బీజార్థమునకు సంబంధించిన యుపాదానము. యుక్తిద్వారమున బీజము వ్యవస్థాపనము చేయుట సమాధానము.

౮. ప్రాప్తి. సుఖాగమము. ఫలప్రాప్త్యాశతో నేదేని సుఖప్రాప్తి ప్రాప్తియను ముఖాంగ మగును.

౯. పరిభావము. అద్భుతావేశము. ఆశ్చర్యభావనము. నాటకీయ క్రియా విశేషములలో నాశ్చర్యజనకసన్నివేశముల భావించి యావేశము కలిగి యుండుట పరిభావము పరిభావనము నగును.

౯. విధానము. సుఖదుఃఖకృత్. నాయకాదుల హృదయములలో సుఖము కాని దుఃఖముకాని కలుగుట. ఫలప్రాప్తివిషయక మయిన యిచ్ఛ సుఖమో దుఃఖమో నాయకాదులలో సంచలితమై ప్రసారము పొందుట విధానము.

౧౦. కరణము. ప్రకృతారంభము. నాటకకథానురూప మయిన ప్రకృత కార్యారంభము కరణము. దీనిచే భావ్యంకవిశేషమును సూచిత మగును.

౧౧. ఉద్భేదము. గూఢభేదనము. ఇంతవఱకు గూఢముగా నున్న బీజార్థము ప్రకట మగుట. గూఢార్థసముద్భేదనము. బీజార్థమునకు సంబంధించిన యాచ్ఛాదనము తొలగి పోవుట.

౧౨. భేదము. ప్రోత్సాహనము. నాటకీయవ్యక్తి బీజార్థవిషయమున ప్రోత్సాహము కలిగి యుండుట భేదము.

తత్తదర్థానుసారముగా నీ ద్వాదశాంగము లిట్లు నిరూపితము లయినవి. ఇవి యన్నియు బీజారంభద్యోతకములు. సాక్షాత్తుగా గాని పారంపర్యమున గాని వీనిని నిబంధింప వలెను. వీనిలో నుపక్షేప-పరికర-పరిన్యాస-యుక్తి-ఉద్భేద—సమాధానము లవశ్యముగా నుండదగిన వని కొందరి భావనము.

వస్తునేతృరసాదీనామానుగుణ్యేన యోజయేత్
వివక్షితోఽత్ర నాంగానాం క్రమ ఇత్యేవ నిర్ణయః. 313

ఈ నిరూపితము లయిన యంగములలో గాని నిరూపితములు కానున్న యంగములలోగాని క్రమము వివక్షితము కాదు. వస్తు నేతృ రసాదుల యానుగుణ్యమున నపేక్షితము లగు వానిని కూర్పవలెను. అన్నిటి కన్నియు నుపయుక్తములు కావు. ఉపయోగించు వానిని గూర్పదగును. కొన్ని వస్తువుల విస్తరణమునకు క్రమానుసారమున నంగముల కూర్పు శోభసంపాదింపదు. వీని నట్లు

నిటు కూర్ప వచ్చును. ఈ నిర్ణయము చతుష్షష్ట్యంగము లందును భావింపదగి నది. ముఖసంధ్యనంతరము ప్రతిముఖసంధి నిరూపిత మగును.

### ప్రతిముఖసంధి

లక్ష్యాలక్ష్యఇవోద్భేద స్తస్య ప్రతిముఖం భవేత్
దృశ్యాదృశ్యతయా బీజవ్యక్తిః ప్రతిముఖం భవేత్. 314

ప్రత్యంకోపనిబద్ధానాం తత్తత్కార్యానుసారతః
ప్రయోజనానాం నిష్పత్తిర్దృశ్యత్వమిహ కథ్యతే. 315

బహూనాం తాదృగర్థానామనిష్పత్తిరదృశ్యతా
యథా సాగరికాయాం తు వత్సరాజస్య దర్శనాత్. 316

సమాగమేచ్ఛా బీజం తు దృశ్యాదృశ్యతయా స్థితం
బిందుప్రయత్నానుగమాదంగాన్యస్య త్రయోదశ. 317

విలాసః పరిసర్పశ్చ విధూతం శమ నర్మణీ
నర్మద్యుతిః ప్రగమనం నిరోధః పర్యుపాసనమ్. 318

పుష్పం వజ్ర ముపన్యాసో వర్ణసంహార ఇత్యపి

లక్ష్యాలక్ష్యముగా బీజార్థమున కుద్భేద ముండుట ప్రతిముఖసంధి యగును. బీజార్థాభివ్యక్తి దృశ్యాదృశ్యముగ నుండుట ప్రతిముఖరూపము. తత్తత్కార్యానుసారముగా నా యా యంకములలో నిరూపితము లయిన ప్రయోజనములకు నిష్పత్తి యుండుట దృశ్యత్వమని, బహుప్రయోజనముల కనిష్పత్తి యదృశ్యత్వమని గ్రహింపదగును. హర్షరత్నావళిలో వత్సరాజ దర్శనమున సాగరికలో గలిగిన సమాగమేచ్ఛాబీజము దృశ్యాదృశ్యముగా నున్నది. అట్టి బీజము లక్ష్యాలక్ష్యముగ నుద్భేదము కలదగుట ప్రతిముఖసంధి యని భావము. ఈ సంధిలో బిందు-ప్రయత్నముల యనుగమము వలన త్రయోదశాంగ ములు కలుగును. విలాసము-పరిసర్పము-విధూతము-శమము-నర్మ-నర్మద్యుతి-ప్రగమనము- నిరోధము-పర్యుపాసనము-పుష్పము-వజ్రము-ఉపన్యాసము-వర్ణ సంహారము అను నివి ప్రతిముఖాంగములు. వీని లక్షణ మిట్లున్నది.

రతిచేష్టా విలాసః స్యాద్దంపత్యోర్నవసంగమే. 319

పరిసర్పస్తు బీజస్య దృష్టనష్టానుసర్పణం
విధూతమరతిర్యూనోః సురతాప్రాప్తిసంభవా. 320

యూనోరరత్యుపశమః శమ ఇత్యుచ్యతే బుధైః
పరిహాసవచో నర్మ ధృతి స్తజ్జా ద్యుతిర్భవేత్. 321

యుక్తోత్తరం ప్రగమనం నిరోధః స్యాన్నిరోధనం
అనునీతిః పర్యుపాస్తిః పుష్పం సాతిశయం వచః. 322

ప్రత్యక్షనిష్ఠురం వజ్ర ముపన్యాసః ప్రసాదనం
వర్ణసంహార ఇత్యుక్తో నానాజాతీయసంగమః. 323

ఇచట విలాసాది వర్ణసంహారాంతప్రతిముఖసంధ్యంగము లున్నవి. వాని స్వరూప మున్నది.

1. విలాసము. రతిచేష్ట. దంపతులకు నవసంగమమున మందు రతిచేష్ట. నాయికానాయకులకు పరస్పరము రత్యర్థమై యిచ్ఛ యుండుట. ఆ యిచ్ఛను వారు రతివ్యక్త మొనరించుట విలాసమను ముఖసంధ్యంగము. ఈవిషయమున నాట్యవేదాభినవభారతిలో నొకవిశేష మున్నది. రసబంధాపేక్షమున సంధిసంధ్యంగము లుండవలెను గాని కేవలశాస్త్రస్థితిసంపాదనేచ్ఛతో నుండరాదు. రతిభోగార్థ సమీహ విలాస మనుట పుమర్థోపయోగి రసగత స్థాయిభావముల కన్నిటికి నుపలక్షణము. వీరప్రధానకము లయిన రూపకములలో ప్రతిముఖము నందె యాస్థాబంధముగా సుత్సాహము వర్ణింప వలెను. సముచితవిషయము నందలి యీహాత్మక మయిన చేష్ట విలాసము. వీరముఖ్యములలో నిట్టి విలాసము వర్ణనీయము.

2. పరిసర్పము. దృష్టనష్టానుసర్పణము. బీజ మొకప్పుడు దృష్టమగును. ఒకప్పుడు నష్టమగును. అట్టి బీజానుసర్పణము - అనుసరణము_అన్వేషణము పరిసర్ప మగును.

3. విధూతము. అరతి. నాయికానాయకులకు సంభోగము లభింపనందున గలుగు అనీహ విధూతము. బీజము నష్టప్రాయముగా భాసింపగా లక్ష్యమలక్ష్యముగ భావించి తదిచ్ఛ విడనాడుట విధూతము.

4. శమము. ప్రేయసీ ప్రియుల కరత్యుపశమము శమమను నంగము. అరతి పోగా లక్ష్యము నం దిష్టభావము శమము.

5. నర్మ. పరిహాసవచనము. పరిహాసాత్మక మయిన వచనము నర్మ సంజ్ఞము. కథావ్యక్తుల ద్వారమున కోమలపరిహాసవచనమును ప్రసరింపజేయుట నర్మ.

6. నర్మద్యుతి. కథావ్యక్తుల ద్వారమున నొకింత చమత్కారముగ ధైర్య ముత్పాదింప జేయుట నర్మద్యుతి.

7. ప్రగమనము. యుక్తోత్తరము. యుక్తముగా నుత్తర ముండుట. పరస్పరము వాక్యసందర్భమున నుత్తరోత్తరము మాటలు సాగుట, వాని ద్వారమున రాగప్రసారము కలుగుట ప్రగమనము. ఇదియె ప్రగయణ మనియు వ్యవహృతము.

8. నిరోధము. నిరోధనము. హితమునకు నిరోధనము కలుగుట. ప్రాప్యవస్తు ప్రాప్తి లేకుండునట్లు నాయకాదుల కవరోధము కలిగించుట నిరోధము. హితరోధో నిరోధన మ్మనియు దీనిలక్షణ మర్థసిద్ధము. నిరోధము లేకున్న ప్రేమప్రసారము సుందరముగ నుండదు.

9. పర్యుపాస్తి. అనునీతి అనునయము. ప్రతిమలాడుట. ప్రాప్తవ్యమున నవరోధము కలుగగా తద్విషయమున ననునయము ప్రస్తుతరాగరీతిని వృద్ధి పొందించును ఈ యనునయము పర్యుపాస్తి. పర్యుపాసనము.

10. పుష్పము. సాతిశయవచనము. విశేషసహిత మయిన వాక్యము పుష్పము. విశిష్టవాక్యములచే బీజోద్ఘాటన మొనరించుట పుష్పము.

11. వజ్రము. ప్రత్యక్షనిష్ఠురము. నాయకాదులనుద్దేశించి కథావ్యక్తులలో నెవరేని ప్రత్యక్షముగా నిష్ఠురవచనముల ప్రయోగింతురేని, తీక్ష్ణవచనములు మర్మభేదకవాక్యములు పల్కుదురేని వజ్ర మగును.

12. ఉపన్యాసము. ప్రసాదనము. ఉపాయసహితముగా ప్రసాదనము కూర్చుట. ఉపాయయుక్తము హేతుప్రదర్శకవాక్య ముపన్యాసము.

13. వర్ణసంహారము. నానాజాతీయసంగమము. చాతుర్వర్ణ్యాపగమనము. నాలుగువర్ణముల వారు నేకస్థలసంగతులై కార్యసాధకు లగుట వర్ణసంహారము.

ఈ పదమూడును ప్రముఖాంగములు. ముఖసంధిలో నిరూపితము లయిన అవాంతరబీజ మహాబీజ ప్రయత్నముల కనుగతము లగునట్లుగా వీనిని నిబంధింప వలెను. వీనిలో పరిసర్పము - ప్రశమము - వజ్రము - ఉపన్యాసము- పుష్పము అను వానికి ప్రాధాన్యము కలదని, ఇతరములను యథాసంభవముగా కూర్పదగునని యనిరి. వీనిలో క్రమము వివక్షితము కాదు. వ్యుత్క్రమరీతియు రూపకములందు గోచరించుచున్నది. ఈ యంశమిట నిరూపిత మగును.

ఏతేషాం చ క్రమో న స్యాత్ వ్యుత్క్రమస్యాపి దర్శనాత్
పౌర్వాపర్యం భవేన్నర్మద్యుత్యంశే విధుతాదికే. 324
విలాసాదేః ప్రధానత్వం నేత్రాదివశతో భవేత్

ఈ యంగములకు వ్యుత్క్రమము నున్నది. ఈ క్రమమె యుండదు. విధుతాదికము నర్మద్యుత్యంశమున పౌర్వాపర్యము నుండ దగును. అటుగలవి యిటు నుండును. విలాసాదులకు గొన్నిటికి ప్రధానత్వ మున్నది. అది నాయకాదుల వశమున గలుగును.

### గర్భసంధి

గర్భః స్యాద్దృష్టనష్టస్య బీజస్యాన్వేషణం ముహుః. 325
బీజస్యైవాంతరాయాదేరస్య ప్రతిముఖాంతరే
దృశ్యాదృశ్యతయా దృష్టనష్టస్యాన్వేషణం హి సః. 326
వ్యపాయశంకాఽనువృత్తేర్విచ్ఛేదస్యానువృత్తితః
పౌనఃపున్యం ముహురితి గర్భస్తాదృశ ఈరితః. 327
స్యాదత్రోత్సర్గతః ప్రాప్తిః పతాకాయా వికల్పతః
తథాప్యస్యా నివేశః స్యాత్ప్రాప్త్యాశాయా నియోగతః. 328
ప్రాప్త్యాశాయామవస్థాయాం గర్భసంధావిహోభవా
అపతాకే నివేశః స్యాద్బిందోర్బీజస్య వా క్వచిత్. 329
సమన్వయేఽర్థప్రకృతేః ప్రాప్త్యాశాయా ఇతీరితః
అభావస్తు పతాకాయా యథా మాలవికాదిషు. 330
సద్భావో దృశ్యతే తస్యామాలతీమాధవాదిషు
తస్మాత్పతాకా స్యాన్నేతి వికల్పం ప్రాహ కోహలః. 331
గర్భసంధేః ప్రసిద్ధత్వాన్నోదాహరణముచ్యతే
తృతీయాంకే తు మాలత్యా గర్భసంధిర్విలోక్యతే. 332
శరీరం క్షామమిత్యాది క్వ నేత్యంతం యదంతరా
అంగాని ద్వాదశైతస్య గర్భసంధేర్యథాక్రమమ్. 333
అభూతాహరణంమార్గో రూపోదాహరణే క్రమః
సంగ్రహశ్చానుమానం చ తోటకాధిబలే తథా. 334
ఉద్వేగసంభ్రమాక్షేపా ఇత్యంగాని భవంతి తు

పూర్వాంకములలో దృష్టనష్టముగా నున్న బీజార్థము నన్వేషించుట గర్భసంధి యగును. దృష్టనష్టాన్వేషణము నీ విధముగా గుర్తింప వలెను. ప్రతి ముఖసంధిలో బీజమున కంతరాయము మొదలగు వాని వలన దృశ్యాదృశ్యమగు స్థితి యేర్పడును. అదియే దృష్టనష్టస్థితి. అపాయశంకానువర్తనమున, విచ్ఛేద శంకానువర్తనమున పౌనఃపున్యమున ముహుర్ముహుః దృష్టనష్టస్థితి కలుగు చుండును. అట్టి బీజాన్వేషణ మీ గర్భాంకమున నుండును. ఈ గర్భాంకమున ప్రాప్త్యాశ సర్వసామాన్యముగా నుండును. పతాక వికల్పమున నుండును. అయినను ప్రాప్త్యాశానియమానుసారమున పతాకానివేశ ముండును. ప్రాప్త్యాశారోప మయిన యవస్థ యుండగా పతాకారహిత మయిన యీ గర్భసంధిలో బీజమునకు గాని బిందువునకు గాని యొక్కచో నివేశ ముండును. అర్థప్రకృతి యయిన పతాక అవస్థారోప మయిన ప్రాప్త్యాశ యను నీ రెండిటి సమన్వయమున నీ గర్భసంధి యగుట యౌచిత్యప్రాప్తము.

కాళిదాస మాలవికాగ్నిమిత్రమున పతాక లేదు. మాలతీమాధవాదు లలో పతాక యున్నది. కావున ''పతాక యుండును ఉండదు'' అని కోహ లుడు వికల్పము పలికెను. గర్భసంధి ప్రసిద్ధము కావున నుదాహరణము నిరూ పించుట లేదు. మాలతీతృతీయాంకమున గర్భసంధి యున్నది. ''శరీరం క్షామం'' మొదలుగా ''క్వ సా'' యను నంతవఱకు మధ్యలో గర్భసంధి యున్నది. ఈ గర్భసంధి కంగములు పండ్రెండు కలవు. వాని నిట్లు యథాక్రమముగ గుర్తించు నది. అభూతాహరణము - మార్గము - రూపము - ఉదాహరణము - క్రమము- సంగ్రహము - అనుమానము - తోటకము - అధిబలము - ఉద్వేగము-సంభ్రమము - ఆక్షేపము అనునవి ద్వాదశాంగములు.

అభూతాహరణం ఛద్మ తదా తత్త్వస్య కథనమ్. 335

అభూతాహరణం తత్స్యాద్వాక్యం యత్కపటాశ్రయం
తత్త్వార్థకీర్తనం మార్గో రూపం సందేహకృద్వచః. 336

ద్విత్రార్థసమవాయే తు వితర్కో రూపముచ్యతే
యత్తు సాతిశయం వాక్యం తదుదాహరణం భవేత్. 337

క్రమః సంచింతితార్థాప్తి ర్భావజ్ఞానమథాపరే
సంగ్రహః సామదానోక్తిరభ్యూహో లింగతోఽనుమా. 338

చేష్టయాఽన్యాతిసంధానం వదంత్యధిబలం బుధాః
సంరంభయుక్తం వచనం యత్తత్తోటకముచ్యతే. 339

ఉద్వేగోఽరికృతా భీతిః శంకాత్రాసౌ చ సంభ్రమః
గర్భబీజసముత్క్షేపాదాక్షేప ఇతి కీర్తితః. 340

గర్భసంధేరిహాంగానాం క్రమోఽపి న వివక్షితః

అభూతాహరణాది గర్భసంధ్యంగముల లక్షణ ముద్దేశానుసారముగా నిచట నిరూపితము.

1. అభూతాహరణము. ఛద్మ - కపట మున్న నభూతాహరణ ముండును. కపటప్రయోగద్వారమున ప్రాప్త్యనుకూలత కల్పించుట. ఛద్మ ప్రయోగమున తత్త్వకథనము-ప్రశంస యుండును. కపటాశ్రయ మయిన వాక్య మభూతాహరణ మను గర్భసంధ్యంగ మగును.

2- మార్గము. తత్త్వార్థకీర్తనము. నిశ్చిత మయిన తత్త్వము అర్థప్రాప్తి రూప మయిన తత్త్వము నిరూపించుట మార్గము.

3. రూపము. సందేహకృద్వచనము. ప్రాప్తిప్రతీక్షాసమయమున సందేహము కలిగించు నాయకాదుల వచనము, తర్కవితర్కమయ వాక్యముల ప్రయోగము రూపము. ఇష్టప్రాప్తి కలుగు నని తలచు నపుడు విఘ్నాశంక సందేహము కలిగించు వచనము రూపము. రెండుమూడు కలిసి యున్నప్పుడు, తత్సమవాయమున వితర్కముండుట రూప మగునని భావము.

4. ఉదాహరణము. సాతిశయవాక్యము. అతిశయముతో గూడిన వాక్యము, ఉత్కర్ష ఉన్నతితో గూడిన వాక్య ముదాహరణ మగును.

5. క్రమము. సంచింతితార్థప్రాప్తి. వస్తుప్రాప్తికై చింతన మొన రింపగా నట్టి చింతితార్థము యొక్క ప్రాప్తి క్రమ మను గర్భసంధి యంగ మగును. కొందరు భావజ్ఞానమె క్రమ మని యనిరి. వేరొకరి ద్వారమున నాయకాదుల భావజ్ఞానము క్రమ మగును.

6. సంగ్రహము. సామదానోక్తి. నాయకాదుల కనుకూలముగా నాచరించు వారలకై సామదానవచనములు పలుకుట సంగ్రహము.

7. అభ్యూహము. కొన్ని హేతువుల యాధారమున నాయకాదు లనుమాన మొనరించుట యభ్యూహము.

8. అధిబలము. చేష్టాభిసంధానము. చేష్టావిశేషముచే నితరుల నతి సంధాన మొనరించుట యధిబలము.

9. తోటకము. సంరంభయుక్తవచనము. క్రోధముతో కూడిన మాట తోటకము. ఈ సంరబ్ధవచన మాతరాయభూతమై యనియతప్రాప్తి హేతు వగుటయు నొకచో భేదహేతువై ప్రాప్త్యాశాన్విత మగుటయు గలదు.

10. ఉద్వేగము. అరికృతభీతి. శత్రువుల యాచరణము వలన గలిగిన భీతి యుద్వేగము.

11. సంభ్రమము. శంకాత్రాసము లుండుట. కథావ్యక్తులలో నుద యించు శంక భయముల సంచారము సంభ్రమ మగును.

12. ఆక్షేపము. గర్భబీజసముద్భేదము. గర్భబీజముల యుద్భేదము, గర్భగత మయిన బీజార్థసముద్భేదము బీజార్థమును సవిశేషముగా ప్రకట మగున ట్లొనరించుట యాక్షేప మనునంగము.

ఈ పండ్రెండును గర్భసంధి యొక్క ద్వాదశాంగములు. వీనిని ప్రాప్త్యాశాప్రదర్శకములుగా నిబంధింప వలెను. వీనిలో నభూతాహరణ - మార్గ - తోటక - అధిబల - ఆక్షేపములు ప్రధానములు. ఇతరములను యథా సంభవముగా ప్రయోగించునది. గర్భసంధి గతము లయిన ఈ యంగములకును క్రమము వివక్షితము కాదు. వస్తుసౌందర్యానుసారమున వీనిని కూర్పవచ్చును.

అవమర్శసంధి

క్రోధేనావమృశేద్యత్ర వ్యసనాద్వా విలోభనాత్. 341

గర్భనిర్భిన్నబీజార్థః సోఽవమర్శ ఇతి స్మృతః
గర్భనిర్భిన్నబీజార్థః సంబంధో వ్యసనాదిజః. 342

విచారనిర్ణయో యస్తు సోఽవమర్శ ఇతిస్మృతః
యథాహి వేణీసంహారే తీర్ణే భీష్మమహార్ణవే. 343

ఇత్యాదినైవ షష్ఠేఽంకే సోఽవమర్శో విలోక్యతే
తత్రాపవాదసంఫేటౌ విద్రవద్రవశక్తయః. 344

ద్యుతిః ప్రసంగశ్ఛలనం వ్యవసాయో నిరోధనం
ప్రరోచనా విచలనమాదానం చ త్రయోదశ. 345

దోషప్రఖ్యాఽపవాదః స్యాత్సంఫేటో రోషభాషణమ్
విద్రవో వధబంధాదిర్ద్రవో గురుతిరస్కృతిః. 346

విరోధశమనం శక్తిః తర్జనోద్వేజనే ద్యుతిః
అప్రస్తుతార్థకథనం ప్రసంగ ఇతి కథ్యతే. 347

వ్యవసాయః స్వశక్త్యుక్తిశ్ఛలనం చావమాననమ్
వ్యవసాయః పరిజ్ఞేయః ప్రతిజ్ఞాహేతుసంభవః. 348

సంరబ్ధానామవజ్ఞా యా తద్విరోధనముచ్యతే
పరస్పరస్య సంగ్రామః సంరంభేణ విరోధనమ్. 349

ఆమంత్రణం యత్సాధ్యస్య సిద్ధవత్సా ప్రరోచనా
వికత్థనా విచలనమాదానం కార్యసంగ్రహః. 350

ఏషాం క్రమప్రధానత్వే ప్రక్రియా పూర్వవద్భవేత్

అవమర్శసంధి స్వరూప మిందున్నది. గర్భసంధిలో విస్పష్ట మయిన బీజార్థమును క్రోధమున గాని వ్యసనమున గాని విలోభనమున గాని యవమర్శన మొనరించినచో నవమర్శ - విమర్శసంధి యగును. వ్యసనాదిజన్య మయిన సంబంధమునందు విచారజన్యమయిన నిర్ణయము నుండును. ఇట్లిది జరుగవలసి యున్నదను నిశ్చయమున ఫలప్రాప్త్యవసాయము నుండును. వేణీసంహారమున "తీర్ణే భీష్మమహోర్ణవే" యను స్థలమున షష్ఠాంకమునం దవమర్శము గోచరించు చున్నది. ఆ శ్లోక మిట్లున్నది.

"తీర్ణే భీష్మమహోర్ణవే కథమపి ద్రోణానలే నిర్వృతే
కర్ణాశీవిషభోగిని ప్రశమితే శల్యేపి యాతే దివం
భీమేన ప్రియసాహసేన రభసాదల్పావశేషే జయే
సర్వే జీవితసంశయం వయమమీ వాచా సమారోపితాః".

భీష్మసాగరము తరింపగా ద్రోణాగ్ని యెట్లో పోగా, కర్ణసర్పము శాంతింపగా, శల్యుడు గతింపగా, జయము స్వల్పావశేషముగా నుండగా ఇష్ట సాహసము కల భీముడు వెంటనే యీ మాటచే మమ్మందరిని జీవితసంశయము కలుగునట్లు చేసెను. దీనిలో స్వల్పావశేషముగా జయమున్నదనుటచే భీష్మా దులు గతించుటవలన నేకాంతవిజయావమర్శనము గోచరించుచున్నది. కావున విమర్శసంధిని నిశ్చయింప నగును.

విమర్శసంధిలో పదమూ డంగములు కలవు. అపవాదము - సంఫే టము - విద్రవము - ద్రవము - శక్తి - ద్యుతి - ప్రసంగము - ఛలనము - వ్యవసా

యము - నిరోధనము - ప్రరోచన - విచలనము - ఆదానము నను నివి విమర్శాంగ ములు. వీని లక్షణము లిట్లున్నవి.

1. అపవాదము. దోషప్రఖ్య. కథావ్యక్తికి సంబంధించిన దోషము లను ప్రఖ్యాపనము చేయుట.

2. సంఫేటము. రోషభాషణము. రోషముతో గూడిన సంభాషణము సంఫేటము. ఇది బీజాన్వయి యగును.

3. విద్రవము. వధాదికము. కథావ్యక్తుల వధము బంధము మొద లగునవి భయపలాయనాదులు విద్రవ మను విమర్శసంధి యంగము.

4. ద్రవము. గురుతిరస్కృతి. పెద్దలగు వారిని కథాముఖ్యులను గురుప్రాయులను తిరస్కరించుట ద్రవము.

5. శక్తి. విరోధశమనము. విరోధము శమించుట. కోప ముప శాంత మగుట శక్తి యను సంగము.

6. ద్యుతి. తర్జనోద్వేజనములు. కథాపాత్రమునకు తర్జన ముద్వే జనము సంపాదించుట ద్యుతి యంగము.

7. ప్రసంగము. అప్రస్తుతార్థకథనము. అప్రస్తుత మయిన యర్థము నిరూపించుట ప్రసంగము. ''గురుకీర్తనం ప్రసంగః'' అని కొందరు తలచిన లక్షణము. తల్లితండ్రి మొదలగు వారిని కీర్తించుట, మహనీయమగు వస్తువు నివేదించుట ప్రసంగము.

8. వ్యవసాయము. స్వశక్త్యుక్తి. కథావ్యక్తి తన శక్తిని సామర్థ్య మును స్పష్టముగా జెప్పుట వ్యవసాయ మను నంగము. ప్రతిజ్ఞాహేతువుల వలన గలుగునదియు వ్యవసాయము.

9. ఛలనము. అవమానవము. ఒకరి నొక రవమానించుట ఛలనము.

10. విరోధనము. సంరబ్ధనిరోధనము. సంరబ్ధుల యవజ్ఞ-తిరస్కా రము. క్రుద్ధు లయిన వారి స్వశక్తి ప్రకటనము విరోధన మను విమర్శాంగము. సంరంభమున పరస్పరము సంగ్రామ మొనరించుటయు విరోధనము.

11. ప్రరోచన. సాధ్యమగు నంశమును సిద్ధప్రాయముగ నామం త్రణమున నిర్దేశించుట. సిద్ధవ్యక్తుల వచనానుసారమున భావివిషయమును నిర్దే

శించుట ప్రరోచన యగును. భావ్యంశములను సిద్ధప్రాయముగ జూపుట యాసక్తి జనకము.

12. విచలనము. వికత్థన. స్వగుణావిష్కరణము ఆత్మశ్లాఘా వచనము విచలన మను నంగము.

13. ఆదానము. కార్యసంగ్రహము. సర్వకార్యములు సంగృహీతము లగుట యాదానము.

ఈవిమర్శాంగములు క్రమప్రధానత్వమున ప్రక్రియ పూర్వము వలె గ్రాహ్యము. యథాసంభవముగ యథోచితముగ వీనిని కూర్చవలెను. క్రమము వివక్షితము కాదు. వీనిలో అపవాద - శక్తి - వ్యవసాయ - ప్రరోచన - ఆదాన ములు ప్రధానములు.

## నిర్వహణసంధి

బీజవంతో ముఖాద్యర్థా విప్రకీర్ణా యథాయథమ్. 351

ఐకార్థ్యముపనీయంతే యత్ర నిర్వహణం తు తత్
బీజయుక్తా ముఖాద్యర్థాః పరమే చ ప్రయోజనే. 352

లభంతే యత్ర సంబంధం తన్నిర్వహణముచ్యతే
యథా హి రామాభ్యుదయే సుగ్రీవశ్చ విభీషణః. 353

కపయో రాక్షసా రామాభిషేకాభ్యుదయం యయుః
ఉపసంహృతిసందేశ్చ సంజ్ఞా నిర్వహణం త్వితి. 354

సంధిర్విబోధో గ్రథనం నిర్ణయః పరిభాషణం
ప్రసాదానందసమయాః కృతిభాషోపగూహనాః. 355

పూర్వభావోపసంహారౌ ప్రశస్తిశ్చ చతుర్దశ

ఇచట నిర్వహణసంధి స్వరూపము కలదు. రూపకకథావస్తు బీజ యుక్తము లయిన ముఖాద్యర్థము లింతవఱ కటునిటు విప్రకీర్ణములై యున్నవి. వాని కన్నిటికి నేకార్థత సంపాదించినచో నది నిర్వహణసంధి యగును. బీజ యుక్తము లయిన ముఖాదిసంధులలో కూర్పు పొందిన ప్రయోజనము లటునిటు విప్రకీర్ణములై యున్నవైనను పరమప్రయోజనమునందు సముచితమగు సంబంధ మును పొందునవి యగునేని యది నిర్వహణసంధి యగును. ముఖాద్యర్థముల కవాంతరప్రయోజన మున్నను ప్రధానప్రయోజన సంబంధ మున్ననే ఫలవత్త

నిర్ణయింపదగును. అట్టి ప్రధాన ఫలసంబంధమును నిర్ణయించునది నిర్వహణ సంధి యని భావము. రామాభ్యుదయ నాటకము నందు సుగ్రీవుడు విభీషణుడు కపులు రాక్షసు లందరును రామాభిషేకాభ్యుదయ మను ప్రధానఫలసంబంధము కలవా రయినారు. ఇట్టిదిది యుపసంహృతి సంధి. దీనికే నిర్వహణసంధి యని సంజ్ఞాంతరము కలదు. ఇందు పదునాలుగంగములు కలవు. సంధి - విబోధము - గ్రథనము — నిర్ణయము - పరిభాషణము - ప్రసాదము - ఆనందము — సమయము - కృతి — భాష — ఉపగూహనము — పూర్వభావము — ఉపసంహారము - ప్రశస్తి అనునవి. వీని లక్షణముల నిట్లు గ్రహింప దగును.

సంధిర్బీజోపగమనం విబోధః కార్యమార్గణమ్. 356

గ్రథనం తదుపక్షేపః తచ్ఛుద్ధిః కార్యవాచకః
నిర్ణయ స్త్వనుభూతాఖ్యః పునఃపునరితీరితః. 357

పరివాదకృతం యత్స్యా త్తదాహుః పరిభాషణం
పరిభాషా మిథో జల్పః ప్రసాదః పర్యుపాసనమ్. 358

ఆనందో వాంఛితావా ప్తిః సమయో దుఃఖనిర్గమః
కృతిర్లబ్ధార్థశమనం తత్థిరీకరణం తు వా. 359

మానాద్యర్థస్య సంప్రా ప్తిర్భాషేతి పరిభాష్యతే
కార్యదృష్ట్యద్భుతప్రా ప్తి పూర్వభావోపగూహనే. 360

వరప్రదానలాభాదిః కార్యసంహార ఉచ్యతే
ప్రశ స్తిర్వీర్యవిజయమంగలాదిప్రశంసనమ్. 361

నేత్రాదివశతోఽమీషాం ప్రాధాన్యం చ క్రమోఽపి చ
యథాసంభవమాధేయో వికల్పశ్చ సముచ్చయః. 362

తేషాం లక్ష్యేషు దృష్టత్వాన్నాన్యథా కల్పయేత్సుధీః

నిర్వహణసంధి యంగముల లక్షణములు పదునాలుగు నిచట యథా పూర్వముగా నిరూపితము లగును.

1. సంధి. బీజోపగమనము. ముఖాదులలో నిరూపితము లయిన బీజాంశములకు ప్రధానఫలసంబంధనిర్ణయమునకై బీజార్థసముద్భావన మొనరించుట సంధి యగును.

2. విబోధము. కార్యమార్గణము. ఇంతవఱకు లీనప్రాయముగా నున్న తన కార్యవిశేషమును మఱల నిచట నన్వేషించుట విబోధమను నిర్వహణాంగ మగును.

3. గ్రథనము. కార్యోపక్షేపము. తదుపక్షేపపదము నందలి తత్పదము కార్యవాచకము. కార్యమున కుపసంహారము సంపాదించుట గ్రథన మగును.

4. నిర్ణయము. అనుభూతాఖ్యానము. నాయకాదులు తా మనుభవించిన కార్యవిషయము నభివర్ణన మొనరించుట నిర్ణయము. మఱల మఱల ననుభవించిన విశేషముల కథన ముండుటయు గ్రాహ్యము.

5. పరిభాషణము. పరివాదకృత మగు విధానము. పాత్రల పరస్పర సంజల్ప ముండుట పరిభాషణము.

6. ప్రసాదము. పర్యుపాసనము. నాయకాదులను ప్రసన్నపఱచుట ప్రసాదన మొనరించుట పర్యుపాసనము. ఇదియె ప్రసాదము.

7. ఆనందము. వాంఛితావాప్తి. ఈప్సితవస్తుప్రాప్తి యానంద మగును. ముఖము నందలి యీప్సితము ప్రాప్తమగుట యిం దభ్యూహ్యము.

8. సమయము. దుఃఖనిర్గమము. నాయకాదుల దుఃఖము సమాప్త మగుట శాంతించుట. ఇష్టసిద్ధి వలన గలుగు దుఃఖశాంతి సమయము.

9. కృతి. లబ్ధార్థశమనము. ఇష్టార్థలాభమున నంద రుపశాంతికలవా రగుట. లభించిన యర్థమున గలుగు శాంతి కృతి యగును. లబ్ధార్థస్థిరీకరణము కృతి యగును.

10. భాష. మానాద్యర్థసంప్రాప్తి భాష - భాషణము. మానాది ప్రాప్తి సూచక భాషావ్యవహారము భాష యని పరిభాషిత మయినది.

11. పూర్వభావము. కార్యదృష్ట-కార్యదర్శనము పూర్వభావము. ఉద్దిష్ట మయిన ఫలమును దర్శించుట.

12. ఉపగూహనము. అద్భుతప్రాప్తి. నాయకాదుల కద్భుతవస్తు ప్రాప్తి యుపగూహనము.

13. కావ్యసంహారము. ఇది కార్యసంహారమును. వరప్రదానలాభాదికము. కావ్యార్థమున కిచట నుపసంహార ముండును.

14. ప్రశస్తి. వీర్యవిజయ మంగలాది ప్రశంసనము. వీర్యాదుల శంసనమున ప్రశస్తి యగును.

ఈ పంద్రెండును నిర్వహణాంగములు. ఇట్లు చతుష్షష్ట్యంగసమన్వితము లయిన పంచసంధులు ప్రతిపాదితము లయినవి. నాయకాదుల విధానానుసారమున నీ యంగములకు ప్రాధాన్యము క్రమము నుండును. సంభవానుసారముగా వికల్పము సముచ్చయము కూర్ప దగును. ఇట్టి విధానములు లక్ష్యము అందు గోచరించు చున్నందున వీనిని వేఱువిధమున గూర్పరాదు. ఈ చెప్పిన విధమున కూర్చుట సుందరము.

## సంధిప్రయోజనము

ఉక్తాఽంగానాం చతుష్షష్టిః షోఢా చైషాం ప్రయోజనమ్ 363
ఏతాన్యుక్తాని శృంగారప్రకాశే భోజభూభృతా
ఇష్టస్యార్థస్య రచనా వృత్తాంతస్యానుపక్షయః. 364
రాగప్రాప్తిః ప్రయోగస్య గోప్యానాంచైవ గోపనం
ఆశ్చర్యవదభిజ్ఞానం ప్రకాశ్యానాం ప్రకాశనమ్. 365
ఏవం ప్రయోజనం షోఢా సంధ్యంగానాముదాహృతం

అఱువది నాలు గంగములు నిరూపితము లయినవి. వీని ఘటనము వలని ప్రయోజన మాఱు విధముల నున్నది. ఈ ప్రయోజనములను భోజరాజు శృంగారప్రకాశమున నిరూపించినాడు. కావ్యగత మయిన యితివృత్తమును ముఖాదిరూపమున పంచధా విభాగ మొనరించినందువలన, ముఖాదిసంధుల యంగముల నా యా విధముల విభక్తముగా పరిశీలించినందు వలనను ప్రయోజన షట్కము సిద్ధ మగును. ఈ షట్ప్రయోజనసిద్ధికై యా చతుష్షష్ట్యంగములను కూర్పవలెననియు ననుశాసనము.

ఇష్టార్థరచన ప్రథమ ప్రయోజనము. అభీష్టమగు నర్థము - ప్రయోజనము సంపాదించుటకునై యంగనిబంధనము సమర్థ మగును. వృత్తాంతానుపక్షయము రెండవప్రయోజనము. ప్రతిపాదింప దలచిన వృత్తాంతము సముచితముగా నంగనిబంధమున నుపక్షీణము కాదు. ప్రయోగరాగప్రాప్తి మూడవ

ప్రయోజనము. దీనినే యభినయరాగసమృద్ధి యందురు. గోప్యార్థగోపనము నాల్గవది. నాటకరచనమున కొన్ని ప్రకాశ్యములు కొన్ని గోప్యములు. గోప్యముల గోపనము అంగనిబంధనమున గుదురును. ఆశ్చర్యావహముల యభిజ్ఞానసిద్ధి యయిదవ ప్రయోజనము. ప్రకాశ్యార్థప్రకాశన మారవప్రయోజనము. ఇట్లు సంధ్యంగములకు సంబంధించిన ప్రయోజనము లారును భావనీయములు.

## అంగావశ్యకత

యథాఽంగహీనః పురుషో న చ కార్యక్షమో భవేత్. 366

అంగహీనం తథా కావ్యం న ప్రయోగక్షమం భవేత్
కావ్యం యదనుదాత్తార్థం సమ్యగంగైస్సమన్వితమ్. 367

దీప్తత్వాత్తత్ప్రయోగస్య శోభామేతి న సంశయః
ఉదాత్తమపి యత్కావ్యం స్యాదంగైః పరివర్జితమ్. 368

హీనత్వాత్తత్ప్రయోగస్య న సతాం రంజయేన్మనః
తస్మాత్సంధిప్రయోగేషు యథాయోగం యథారసమ్. 369

కావ్యాంగాని ప్రయుంజీత ద్విత్రైర్హీనం న దుష్యతి
యావంత్యంగాని పశ్యంతే తావతామేవ కోవిదైః. 370

నిబంధః కార్య ఇత్యేవ నిర్ణయో భోజభూభృతః
ఉపక్షేపాదయోఽప్యత్ర ప్రబంధేష్వాధికారికాః. 371

ప్రాసంగికాశ్చ కవిభిః ప్రయోక్తవ్యా రసానుగాః

అంగప్రయోగావశ్యకత యిచట నిరూపిత మగును. అంగహీనుడయిన పురుషుడు కార్యసమర్థుడు కాడు. అంగహీన మగు కావ్యము ప్రయోగక్షమము కాదు. కావ్య మనుదాత్తార్థ మయినను లెస్సగా నంగములతో సమన్విత మగునేని ప్రయోగము దీప్తముగా నుండును గావున శోభ కలదగును. సంశయము లేదు. ఇచట ప్రయోగ మనునది రంగప్రయోగము చిత్తరంగప్రయోగము నని గుర్తించుట యుక్తము. అంగసాహిత్యమున శోభాసముత్పత్తి యిట్లున్నది. అంగరాహిత్యమున గలుగు విశేష మిట్లుండును. కావ్యముదాత్త మయినను అంగరహిత మయినచో నది ప్రయోగహీన మగును. అది సహృదయుల మనముల రంజింప జేయ జాలదు. కావున సంధిప్రయోగ

ముల సావధానత యావశ్యకము. యథాయోగముగా యథారసముగా కావ్యాంగములను ప్రయోగింపవలెను. రెండు మూడంగములు లేకున్నను రూపకము ప్రయోగము దుష్టము కాదు. భోజరాజభావ మీ విషయమున భావనీయము. ఏ యే స్థలము లం దెన్ని యెన్ని యంగములు పఠితము లయినవో కోవిదులగువారు గుర్తించి యన్ని యంగములను నిబంధింప వలెను. ఇది భోజనిర్ణయము. కవు లుపక్షేపపరికరాదులను ప్రబంధము లం దాధికారికములుగను ప్రాసంగికములుగను రసానుగతములగు నట్లును నిరూపింపవలెను. ఆధికారిక వృత్త ప్రకాశనమునకు గాని ప్రాసంగికవృత్తాంతవికసనమునకు గాని యంగముల సంయోజన మావశ్యకము. ఇంతవఱ కిది చతుష్షష్ట్యంగముల స్వరూపసమీక్ష. వీని యనుబంధముగా నిరువది యొకటి సంధ్యంతరము లున్నవి. అవి సంధుల విశేషములు. వాని ప్రయోగమునను చమత్కార ముదయించును. అవి నామాఖ్యానముననె వ్యాఖ్యాతస్వరూపములు.

## సంధ్యంతరములు

తథా సంధ్యంతరాంగాని ప్రయుంజ్యా త్తత్ర తత్ర తు. 372

సామ చాపి ప్రదానం చ భేదో దండో వధ స్తథా
ప్రత్యుత్పన్నమతిత్వం చ గోత్రస్ఖలిత మేవ చ. 373

మాయోపధిర్భయం హాసః క్రోధో భ్రాంతి స్తథై వ చ
ఓజస్సంవరణం చై వ తథా హేత్వవధారణమ్. 374

దూతో లేఖ స్తథా స్వప్నః తథా చిత్రం మదోఽపి చ
సంధ్యంతరాణి సంధీనాం విశేషాస్త్వేకవింశతిః. 375

సంధీనాం యాని వృత్తాని ప్రబంధేష్వనుపూర్వశః
స్వసంపద్గుణయుక్తాని తాన్యంగాని ప్రయోజయేత్. 376

సంధ్యంతరము లని చెప్పదగినవి యిరువదియొకటి కలవు. వీని నాయా స్థలము లం దౌచిత్యానుసారముగా ప్రయోగింపవలెను. సామము - ప్రదానము - భేదము - దండము — వధము - ప్రత్యుత్పన్నమతిత్వము - గోత్రస్ఖలితము — మాయ - ఉపధి - భయము - హాసము - క్రోధము - భ్రాంతి - ఓజస్సు - సంవరణము - హేత్వవధారణము - దూత - లేఖ - స్వప్నము - చిత్రము — మదము అను నివి సంధులకు సంబంధించిన విశేషములు. ఏకవింశతి సంఖ్యాకములు.

సంధులకు సంబంధించిన యంగములను స్వసంపద్గుణ యుక్తము లగు నట్లుగా ప్రబంధము లందు ప్రయోగింపవలెను. ప్రసిద్ధప్రబంధకారులు తమ ప్రబంధములలో వీనిని ప్రయోగించిన విధానమును పరిశీలించి ప్రబంధములందు ప్రయోగింప దగును. లక్ష్యలక్షణ పరిశీలన పురస్సరముగ కావ్యాంగముల బ్రయోగించుట వలన ప్రబంధగౌరవ మతిశయించును.

## సూచ్యాసూచ్యవిభాగము

ద్వేధా విభాగః కర్తవ్యః సర్వస్యాపీహ వస్తునః
సూచ్యమేవ భవేత్కించిద్దృశ్యం శ్రవ్యమథాపరమ్. 377

నీరసోఽనుచితస్తత్ర సంసూచ్యో వస్తువిస్తరః
నీరసం లౌకికోపేతమశాస్త్రీయం చ యద్భవేత్. 378

తద్వస్తుసూచనీయం స్యాదిత్యాహుర్భరతాదయః
దృశ్యస్తు మధురోదాత్తరసభావనిరంతరః. 379

రూపకమున నిరూపితమగు సర్వవస్తువును రెండు విధముల విభాగింప దగును. ఒకటి సూచ్యమగు వస్తువు. ఇట్టి సూచ్యసూచనాక్రమము ముందు నిర్దిష్టమగును. రెండవది దృశ్యశ్రవ్యము. దీని నసూచ్యమని ప్రదర్శనీయమని దృశ్యమని యందురు. ఇది దృశ్యశ్రవ్య మని యిందున్నది. దృశ్య మనుట చాలును. నీరస మనుచిత మయిన వస్తువిస్తరమును సంసూచ్య మొనరింప వలెను. నీరస మనుట లౌకికోపేత మశాస్త్రీయ మని గ్రాహ్యము. ఇట్టివస్తువు రంగమున ప్రదర్శ్యమానము కారాదని సూచనీయమె కావలయునని భరతాదులు నిరూపించిరి. దృశ్యవస్తువు మధుర ముదాత్తము రసభావనిరంతరముగా నుండును. ఇది రంగప్రదర్శనార్హము.

## అర్థోపక్షేపకములు

అర్థోపక్షేపకైః సూచ్యం పంచభిః ప్రతిపాదయేత్
విష్కంభచూలికాఽంకాస్యాంకావతార ప్రవేశకైః. 380

సూచ్యార్థసూచనోపాయాః సూరిభిః పంచ కీర్తితాః
వృత్తవర్తిష్యమాణానాం కథాంశానాం నిదర్శకః. 381

సంక్షేపార్థస్తు విష్కంభో మధ్యపాత్రప్రయోజితః
తత్ర సంక్షేపశబ్దో యః స ప్రయోజనవాచకః. 382

వృత్తవర్తిష్యమాణాంకద్వయ శేషార్థసూచకః
విష్కంభోఽంకద్వయస్యాంతర్యథాయోగం ప్రవేశకః. 383

సూచ్యార్థసూచన మొనరింపగల అయిదు అర్థోపక్షేపకములచే సూచ్య మును ప్రతిపాదింపవలెను. విష్కంభము - చూలిక - అంకాస్యము - అంకావతారము - ప్రవేశకము నను నయి దర్థోపక్షేపకములు. ఇవి యయిదు సూచ్యార్థసూచనో పాయము లని సూరు లనిరి. వానిలో విష్కంభస్వరూప మిట్లు పరిగ్రాహ్యము. అతీతకథాంశములను అనాగతకథాంశములను విష్కంభము ప్రదర్శించును. మధ్య పాత్రలచే ప్రయుక్త మగును. విష్కంభము సంక్షేపార్థము. ఇచట సంక్షేప శబ్దము ప్రయోజనవాచకము. విష్కంభము ప్రయోజనము కొఅకుగా నుండును. ప్రయోజన నిరూపణమునకు విష్కంభము ప్రయోగింప వలెనని భావము. కేవలము వృత్తవర్తిష్యమాణకథాంశసూచనమె కాక ప్రయోజనా పాదకముగ గూడ నుండవలెనని భావము.

ప్రవేశకమను నర్థోపక్షేపకమును వృత్తవర్తిష్యమాణకథాంశసూచ కము. పూర్వాంక శేషకథా సూచకమై యనంతరాంకసమారంభకథాసూచ కము నగును. విష్కంభ మంకద్వయమధ్యము నందున్నచో నంకద్వయశేషార్థ సూచక మగును. విష్కంభకము రూపకారంభమున నుండవచ్చును. అంకద్వయ మధ్యమున నుండవచ్చును. ప్రవేశక మంకద్వయమధ్యమునందే యుండును. ఈ యంశము విశదము కాగలదు.

ద్విధా భవేత్స విష్కంభః శుద్ధః సంకీర్ణ ఇత్యపి
శుద్ధోఽనేకై రథైకేన మధ్యపాత్రేణ యోజితః. 384

నీచమధ్యమపాత్రేణ సంకీర్ణస్తాదృశేన చ
కపాలకుండలాశుద్ధవిష్కంభః పితృకాననే. 385

ఉన్మత్తమాధవే సౌదామినీసంకీర్ణ ఇత్యపి
విష్కంభే నాయకాదీనాం ప్రవేశః కార్య ఏవ న. 386

శుద్ధః సంకీర్ణో వా ద్వేధా విష్కంభకో జ్ఞేయః
మధ్యమపాత్రః శుద్ధః సంకీర్ణో నీచమధ్యకృతః. 387

కుతోఽపి స్వేచ్ఛయా ప్రాప్తః సంబంధో నోభయోరపి
విష్కంభార్థః స విజ్ఞేయః కథాంశస్యాపి సూచకః. 388

వృత్తవర్తిష్యమాణాంకద్వయమధ్యే నివేశనం
విష్కంభస్యోక్తశేషార్థసూచనాయోపపాదితమ్. 389

విష్కంభము శుద్ధమని సంకీర్ణమని రెండు విధములు. మధ్యపాత్ర ప్రయోజితము విష్కంభము. మధ్యము డొకడేని యనేకు లేని యుందురు. మధ్యమపాత్ర ప్రయోజితమనుట శుద్ధవిష్కంభరూపము. నీచమధ్యపాత్రలచే ప్రయోజిత మయినచో సంకీర్ణవిష్కంభమగును. వృత్తవర్తిష్యమాణ కథాంశ సూచన మందు నిందు సమానము.

మాలతీమాధవము శ్మశానాంకమునందు కపాలకుండలావ్యవహారము శుద్ధవిష్కంభము. గ్రంథనాయకుడు మాధవుడున్మత్తుడుగా సంచరించిన స్థల మున సౌదామనీ సంకీర్ణమని భావింప నగును (?). విష్కంభాదులందు నాయకాదు లకు ప్రవేశము కూర్పరాదు. ఇట్లు విష్కంభకము శుద్ధము సంకీర్ణ మని రెండు విధముల నుండుటను, మధ్యమ పాత్ర ప్రయోగము శుద్ధమగుటను, నీచమధ్య కృతము సంకీర్ణమగుటను గుర్తించునది. విష్కంభమునం దింకను గొన్ని విశేష ములు గలవు. పూర్వోత్తరాంకములకు సంబంధింపకుండకనె ఎట్లో స్వవశము ననే సంప్రాప్తమై కథాంశమును సూచించునదియు నగును. వృత్తవర్తిష్య మాణాంకద్వయమధ్యమున విష్కంభము నివేశనము పొందుట నిరూపించిన యంశమున శేషార్థసూచనముకై యగునని యుపపాదిత మయినది. ఇంక నిచట గ్రాహ్యము లగు విశేషములను నాట్యవేదవివృతి యభినవభారతి విశద మొనరించినది. సూచ్యసూచకములతో ప్రవేశకమున నిరూపణీయ మున్నది. అది యిది.

నా రచిత గ్రంథములలో సంవాది విషయములున్నవి. వానిలో విసంవాదమును గోచరింపవచ్చును. ఏకనిశ్చయమునకు సర్వసమవలోకనము సముచితము. ఆ యేకనిశ్చయమును నేనే యేల వ్రాయనైతిని? పాఠక శ్రోతల యధికారమును నేన యందుకొనుట నా ధర్మముకాదు. ఒక్కొక విషయ మున నొక్కొక గ్రంథమంత వ్రాసి విషయగ్రహణమతుల మతి శ్రద్ధామాంద్య ముల నేను హేతువు కాజాలను.

వృత్తవర్తిష్యమాణాంకద్వయమధ్యే ప్రవేశనం
విష్కంభస్యానుదాత్తోక్త్యా యన్నీచేనార్థసూచనమ్. 390

తత్ర ప్రవేశకః ప్రాయః ప్రథమాంకే నిషిధ్యతే
నివేశః ప్రథమాంకేఽపి విష్కంభస్యావధార్యతే. 391

ఆదౌ విష్కంభకం కుర్యాదితి భోజేన దర్శితం

వృత్తవర్తిష్యమాణాంకము ల మధ్యలో విష్కంభప్రవేశన ముండుట, అందుదాత్తు లుండకపోవుట, నీచవ్యక్తు లర్థసూచన మొనరించుట యను విషయ భావనమున ప్రవేశక మంకమధ్యమున నుండునని గ్రహింపదగును. ప్రథమాంక మున ప్రవేశకము నిషిద్ధము. కావున ప్రథమాంకముననే విష్కంభ ముండుట నిశ్చిత మగుచున్నది. మొదట విష్కంభము కూర్పదగునని భోజుడు నిరూపించెను. ముఖాంకారంభమున నుండియు సరసవస్తువు సంప్రాప్త మగునేనియచట నంకము వనే యారంభము యుక్తము. అంకారంభమున సరసవస్తువు సంప్రాప్తముకాదేని యచట మొదటనే ముఖాంకారంభముననె విష్కంభమును కూర్పవచ్చునని భోజు డనుటను గుర్తించునది. సూచ్యసూచనమునకై విష్కంభప్రవేశములను కూర్ప వలసి యున్నప్పుడు ముందుగా ప్రవేశకమును నిబంధించుటకన్న విష్కంభమును నిరూపించుట యుక్తముగా నుండుననియు గ్రహింపదగును.

పరిజనకథానుబంధః ప్రవేశకస్తత్ర విజ్ఞేయః. 392

అంకచ్ఛేదం కృత్వా మాసకృతం వర్షసంచితం వాపి
తత్సర్వం కర్తవ్యం వర్షాదూర్ధ్వం న తు కదాచిత్. 393

నోత్తమమధ్యమపురుషైరాచరితో నాప్యుదాత్తవచనకృతః
ప్రాకృతభాషాచారప్రయోగమాసాద్య కర్తవ్యః. 394

విటమునిదైవతపురుషైః కంచుకిభిశ్చార్థయుక్తిమాసాద్య
సంస్కృతవాగ్భిరపేత్తం ప్రవేశకః సంవిధాతవ్యః. 395

విటతాపసవృద్ధామాత్యైర్మునికంచుకిభిస్తథా
ప్రవేశకమపీచ్ఛంతి సంతః సంస్కృతభాషిభిః. 396

కాలోత్థాపన నగరవ్యత్యాసారంభకామవిషయాణాం
అర్థాభిధానభూతః ప్రవేశకః స్యాదనేకార్థః. 397

దివసావసానకార్యం యద్యంకే నోపపద్యతే సర్వం
అంకచ్ఛేదం కృత్వా ప్రవేశకైస్తద్విధాతవ్యమ్. 398

బహ్వాశ్రయమప్యర్థం ప్రవేశకైః సంక్షిపేత్ప్రబంధేషు
అంకేషు స ప్రయుక్తో జనయతి ఖేదం ప్రయోగబంధస్య. 399

యత్రార్థస్య సమాప్తిర్న భవత్యంకే ప్రయోగబాహుల్యాత్
వృత్తాంతః స్వల్పకథః ప్రవేశకైస్సంవిధాతవ్యః. 400

బహుచూర్ణపదో భేదో జనయతి ఖేదం ప్రయోగస్య
పరిమితవాగాత్మకతా ప్రవేశకస్యోచ్యతే సద్భిః. 401

యుద్ధం రాజ్యభ్రంశం మరణం నగరోపరోధనం చైవ
అప్రత్యక్షకృతాని ప్రవేశకైః సంవిధేయాని. 402

ప్రవేశకవిధానమునకు సంబంధించిన నానావిశేషము లిచట నిరూపితము లగును. ప్రవేశకము పరిజనుల కథానుబంధముతో నుండుట తెలియవలసియున్నది. అంకచ్ఛేద మొనరించి ప్రవేశకము కూర్పవలెను. ఆ ఛేదము మాసకృతముగా నుండదగును. వర్షసంచితమేని కావచ్చును. సంవత్సరము కన్న నధికమగు వ్యవధాన ముచితము కాదు. ఎప్పుడేని యంతకన్న నధికసమయము నందు కూర్పరాదు. ప్రవేశకమును ఉత్తమ మధ్యమ పురుషు లాచరింపరాదు. ఉదాత్తవచనములతోడను ప్రవేశకమును గూర్పరాదు. ప్రాకృతభాషాచార ప్రయోగము ననుసరించి ప్రవేశకము కూర్పవలెను. ప్రాకృతభాషావ్యవహార మొనరించువారు ప్రవేశకమున ప్రయోగార్హులు. ఒకప్పు డొకవిధముగా నుదాత్త వచనము లుండదగును. విటులు మునులు దైవతపురుషులు కంచుకిజనులు స్వార్థయుక్తి ననుసరించి సంస్కృతవచనులగుట యున్నది. విటాదులు భాషావిదులగు నుదాత్తు లయినను స్వార్థకాంక్షతో ప్రాకృతాచారు లగుదురు. సంస్కృతభాషు లగుదురు. వారితో ప్రవేశకమును సిద్ధపఱచుటను కొందరభిజ్ఞు లంగీకరింతురు.

ప్రవేశక మనేకార్థనిబంధమున నుండును. కాలోత్థాపన మొనరించుట నగరవ్యత్యాసము ప్రథమానురాగము మొదలగు విషయముల ప్రయోజనము నిరూపించునదై ప్రవేశక మనేకార్థ మగును. దివసావసానకార్య మంకమున నుపపన్నము కానపుడు అంకచ్ఛేద మొనరించి ప్రవేశకములచే దాని నిరూపింపవలయును. బహ్వాశ్రయమగు నర్థము నెఱిగినను ప్రబంధము లందు ప్రవేశకములచే సంక్షిప్త మొనరింపవలెను. బహ్వాశ్రయార్థమును ప్రయోగించినచో నది ప్రయోగ

బంధమునకు ఖేదము కలిగించును. ప్రయోగబాహుల్యము వలన నంకమున నర్థ సమాప్తి కలుగకపోయినచో అల్పకథతో నున్న వృత్తాంతమును ప్రవేశకములతో విధానింపదగును. చూర్ణపదములు బహులముగా నున్నచో ప్రయోగమునకు ఖేదము కలిగించును. ప్రవేశకమునకు పరిమితవాగాత్మకత యుక్త మందురు. రంగప్రవేశయోగ్యములు కానివి కొన్ని యున్నవి. యుద్ధము రాజ్యభ్రంశము మరణము నగరోపరోధము మొదలగునవి ప్రత్యక్షకృతములు కారాదు. అప్రత్యక్ష కృతములుగా వీనిని ప్రవేశకములచే నిరూపింపవలెను. ప్రవేశక మిట్లుండగా విష్కంభవిషయమున కొన్ని విజ్ఞేయ విషయము లున్నవి.

అంకాంతరే ముఖే వా ప్రకరణమాశ్రిత్య నాటకం వాఽపి
విష్కంభకస్తు నియతః కర్తవ్యో మధ్యమైరధమైః. 403

ఇత్థం ప్రవేశవిష్కంభౌ భరతేన ప్రదర్శితౌ
సదృశాభ్యాం ప్రయోజ్యః స్యాదంకసంధౌ ప్రవేశకః. 404

ప్రవేశకస్య పాఠ్యం యత్తన్నాతిప్రచురం భవేత్
సంక్షేపార్థస్తు బహులం ప్రేక్షకౌత్సుక్యహేతవే. 405

నాటకము నాశ్రయించిగాని ప్రకరణము నాశ్రయించిగాని విష్కంభకము నిట్లు నియమముగా నిరూపింపవలెను. అంకముల మధ్యమున గాని ముఖాంకమున గాని కూర్పవచ్చును. మధ్యమాధములతో విష్కంభము కూర్ప జనును. ఈ యంశ మిదివరలో నిరూపిత మయినను స్పష్టతకై ప్రవేశకభేదనిరూపణమునకై పునరుక్తము. ఇట్లు ప్రవేశక విష్కంభములను భరతుడు ప్రదర్శించెను. ప్రవేశకము నంకసంధిలో ప్రకృతిసదృశు లగు నిద్దరు ప్రయోగింప జనును. ప్రవేశకమునకు సంబంధించిన పాఠ్యమతిప్రచురము కారాదు. ప్రవేశకము సంక్షేపార్థముగ నున్నచో నధికముగా ప్రేక్షకుల యౌత్సుక్యమున హేతు వగును. అది విస్తృత మయినచో వైరస్య హేతువు.

సంక్షిప సింధురాణ్మత్స్య ఘటోత్కచ వధో యథా
అవస్థాం కాలమాలోచ్య కార్యస్య గురులాఘవే. 406

ప్రవేశకాదికృత్యం యత్తదంకేషు విధీయతే
కార్యం ప్రవేశకేనాత్ర వర్షాదూర్ధ్వం న కించన. 407

ప్రవేశకేన న వధో నాయకస్య కదాచన
విధేయః కార్యమంకేఽత్ర సంధిర్వాఽప్యపసారణమ్. 408

యథా విభీషణేనాత్ర సంధిరుల్కాముఖస్య చ
దీర్ఘజిహ్వస్య మారీచవంచితే నాటకే కృతః. 409

నాయికా చ వసాగంధా నాయకో రుధిరప్రియః
తయోరిహాశ్వత్థామాంకే దృష్టం తదపసారణమ్. 410

వేణీసంహారనాటకమున సింధురాజవధ మత్స్యాధిపవధ ఘటోత్కచవధ మొదలగునవి సంక్షిప్తముగా నిరూపితములైనవి. తత్తదవస్థాలోచనమున, కాలపరిశీలనమున కార్యమునకు సంబంధించిన గురులాఘవముల పరిశీలనమున నిట్లు సంక్షేపకథనము సముచితము. వేణీతృతీయాంకారంభము నందలి ప్రస్తావనములో నిట్లున్నది. వసాగంధా రుధిరప్రియులు ప్రేయసీప్రియులు. "సింధురాజవధనాటి వలె ప్రతిదిన మర్జునుడు సమర మొనరించిన మాంసము వస రక్తము బాగుగా త్రావుదును." "రుధిరప్రియా! రా!" "వసాగంధా! నాకు దాహము" "ఇంత యుద్ధంలో దాహమా?" "కుమారుడు ఘటోత్కచుడు గతించినాడని హిడింబాదేవి దుఃఖించుతూ ఉంటే చూడడానికి వెళ్లాను. అందువలన దాహం" "అయితే ఈ ఏనుగుపుఱ్ఱెలో మాంసంరక్తంతో నంజుకో!" "ఇంత ఎక్కడిదే?" "భగదత్త శోణితముతో ఒకకడవ, సింధురాజవసతో రెండుబానలు, ద్రుపదమత్స్యాధిపాదుల రుధిరమాంసములతో వందకుండలు కూర్చాను." ఇట్లు సంక్షిప్తరీతి సుందరము. అంకములలో ప్రవేశకాదికృత్య మిట్లే యుండవలెను. వత్సరకాలము లోపుగా నున్న వస్తు సూచనమునకై ప్రవేశకకార్యము యుక్తము. వర్షాధికము యుక్తము కాదు. మారీచవంచిత మను నాటకమున విభీషణునితో సంధి ఉల్కాముఖునకు దీర్ఘజిహ్వనకు సంబంధించిన రీతి భావింపదగినది. ప్రవేశకమున నాయకుని వధ యెప్పుడు నుండరాదు. అంకమున సంధి కూర్చవలెను. అపసారణము సూచింపవలెను. వేణిలో నాయిక వసాగంధ నాయకుడు రుధిరప్రియుడు రంగము నుండి పోవుదురు. అశ్వత్థామాంకమున వారల కపసారణము గోచరించుచున్నది. ఇదియే యుక్తము.

అంతర్యవనికాసంస్థైః సూచనాఽర్థస్య చూలికా
అంతర్యవనికాసంస్థైః సూతమాగధవందిభిః. 411

అర్థోపక్షేపణం యత్ర క్రియతే సా హి చూలికా
ఏకైకాని శిరాంసీతి పద్యాదౌ సా చ దృశ్యతే. 412

పూర్వాంకాంతప్రవిష్టైర్యదుత్తరాంకార్థసూచనం
పూర్వాంకార్థానువృత్త్యర్థం తదంకాస్యముదీరితమ్. 413

అంకాంతపాత్రైరంకాస్యం ఛిన్నాంకార్థస్య సూచనం
యథా హి వీరచరితే ద్వితీయేఽంకేఽవసానకే. 414

రామభార్గవయోర్మధ్యే సుమంత్రేణ ప్రవిశ్య చ
విశ్వామిత్రవశిష్ఠౌ చ తదాహ్వానేన సూచితౌ. 415

రామయోస్తత్ర కలహోవిచ్ఛేదేనైవ తౌ పునః
తృతీయాంకప్రవేశేన సుమంత్రేణైవ సూచితౌ. 416

సూత్రణం సకలాంకానాం జ్ఞేయమంకముఖం బుధైః
యథా ''సౌదామినీ దాణిం థారే ఇ సిరి పవ్వదే.'' 417

అవలోకితయా ప్రష్టకామందక్యుత్తరేణ చ
సమాసతః శ్మశానాదికృతం సర్వాంకసూత్రణమ్. 418

అత్ర ముఖం విశ్లిష్టం యథోపరి శ్లిష్యతే త్రిధా వాక్యైః
పురుషస్యైవ తదంకం ముఖమితి సంతో వ్యపదిశంతి. 419

సూచ్యసూచకములలో నవశిష్టము లయిన చూలిక-అంకాస్యము-అంకావతార మను మూడు నిర్దిష్టములు కావలసి యున్నవి. అందు మొదటి రెండిందు నిరూపితములగును. యవనికాంతస్థితులగు వా రర్థసూచన మొనరించుట చూలిక యగును. సూతమాగధవందు లంతర్యవనికాసంస్థులు; వారచట నుండియే సూచ్యము సూచింతురు. వారర్థము సూచించుట-అర్థోపక్షేపణ మొనరించుట దాని విని రంగపాత్రలు కర్తవ్యనిష్ఠు లగుదురు. ''ఏకైకాని శిరాంసి'' అను పద్యాదిలో చూలిక గోచరించుచున్నది. మురారిరచితానర్ఘ రాఘవనాటకమున సప్తమాంకమున ''ఏకైకాని'' యున్నది.

"ఏకైకాని శిరాంసిరాత్రిచరచమూచక్రస్య హుత్వా నిజే
తేజోఽగ్నౌ దశకంఠమూర్ధశిరధో నిర్మాయ పూర్ణాహుతిం

అద్య స్వస్త్యయనం సమాప్య జగతో లంకేంద్రబందీకృతాం
సీతామప్యవలోక్య శోకరభసవ్రీడావృతో రాఘవః.''

శ్రీరాముడు తన తేజోగ్నిలో రాక్షసుల శిరముల నొక్కొక్కటిగా వ్రేల్చి, రావణశిరములతో పూర్ణాహుతి నొనరించి, జగమునకు స్వస్త్యయనము సమాపనము చేసి, లంకాధిపబంధీకృత యయిన సీతను చూచి యిప్పుడు శోకరభస వ్రీడా పరివృతు డయినాడు. ఇట్లు యవనికాంతర్గతులు పలుకుట చూలిక.

అంకాస్య స్వరూప మీ విధమున నున్నది. పూర్వాంకాంత ప్రవిష్టులు పూర్వాంకార్థానువృత్తికై యుత్తరాంకార్థసూచన మొనరించుట యంకాస్య మగును. అంకాంతపాత్రలు భిన్నాంకార్థము సూచించుట యంకాస్యము. వీర చరితము ద్వితీయాంకము చివరలో నిది యున్నది. రామపరశురాముల మధ్య సుమంత్రుడు ప్రవేశించి తదాహ్వానమున వశిష్ఠ విశ్వామిత్రులను సూచించెను. రామభార్గవుల కలహావిచ్ఛేదమునుమునసె తృతీయాంకమున ప్రవేశించి సుమంత్రుడు వశిష్ఠ విశ్వామిత్రులను సూచించెను. అంకాంతమున ప్రవేశించిన సుమంత్రు డిట్లు భిన్నాంకార్థము సూచించినందున నిది యంకాస్య మయినది.

అంకాస్యము నంకముఖ మనుటయు గలదు. సకలాంకముల సూత్రణ మంకాస్య మందురు. మాలతీమాధవమున వాక్యములలో నిది యున్నది. ప్రథ మాంక మిశ్రవిష్కంభమున నిట్లున్నది. అవలోకిత కామందకి సంభాషించుటలో సర్వాంకసూత్రణ మున్నది. "మాధవునకు కుతూహలము కలిగించి మదనో ద్యానమునకు పంపినాను. మాలతి కూడ వెళ్ళును. వారిద్దరు చూచుకొందురు.'' "మంచిపని.'' ''నిన్న చూడగా సౌదామిని గుర్తువచ్చినది''. "ఆసౌదామినీ శ్రీ పర్వతమున నున్నది." "ఎట్లు తెలిసినది?" "కపాలకుండల ప్రతిదినము శ్రీపర్వ తము నుండి వచ్చును అందు వలన తెలిసినది." "సర్వము సౌదామినిలో సంభా వితమె." ఈమాటలలో నవలోకిత యడుగుట కామందకి చెప్పుట వలన సంక్షిప్త ముగా శ్మశానాదులందు జరుగు విశేషమంతయు సంక్షిప్తముగా నాసూత్రిత మయినది. ఇది యంకముఖము. లోకమున పురుషుని ముఖము మూడు విధముల నుండుటయున్నది—స్వస్థానమున నుండుట విశ్లిష్టమగుట ఉపరిశ్లిష్ట మగుట యని. అట్లే యంకముఖమున ప్రకృతార్థము సూచించుచు తరువాతి యంకమును ప్రస క్తించుచు నిర్వహణార్థమును సూచించునది కాగలదు ఇట్లు అంకాస్య ముండుటను రూపకవిదు లుపదేశింతురు.

అంకావతార స్త్వంకాంతే పాతోఽంకస్యావిభాగతః
పూర్వాంకస్యావసానే క్తకథాఽవిచ్ఛేదిపూర్వకమ్. 420

ప్రవేశో భావినోఽంకస్య సోఽంకావతార ఇష్యతే
సమాప్యమాన ఏకస్మిన్ ఇతరాంకస్య సూచనమ్. 421

సమాసతో హి నాట్యజ్ఞైరంకావతర ఇష్యతే
యథా మాలవికాయాశ్చ ప్రథమాంకావసాన కే. 421

విదూషకప్రవేశాది నిష్క్రామాంతం యదుచ్యతే
పాత్రకృత్యం ద్వితీయేఽంకే తత్సంగీతకమాత్రతః. 423

ఆరభ్య గణదాసాదేరవిచ్ఛేదేన కల్పితః
అంకావతారో విష్కంభాద్యనంతరిత ఏవ సః. 424

సమాప్యమానే పూర్వాంకే యథా గౌరీగృహేఽభిధే
భావ్యంకనాయకావస్థాసూచనం తద్విలోక్యతామ్. 425

ఇం దంకావతార రూపావతరణ మున్నది- అంకావతార మంకాంతమున నుండును. అంకావిభాగమున నుండును. పూర్వాంకావసానమున నిరూపిత మయిన కథ కవిచ్ఛేదరూపముగా నుండును. భావ్యంకమునకు ప్రవేశాత్మకముగ నుండును. అట్టిది యంకావతారము. ఒక యంకము సమాప్త మగుచుండగా నిత రాంకమున కిది సూచక మగును. అంకావతారరూప మిట్లుండునని నాట్యజ్ఞులు సంగ్రహముగా నిరూపించిరి.

మాలవికాగ్నిమిత్రములో ప్రథమాంకావసానము నందు విదూషకుని ప్రవేశము మొదలుగా నిష్క్రమాంత మీ యంకావతార సాంగత్యము చూచు నది. ద్వితీయాంకమున తత్సంగీతమునకై గణదాస హరదత్తకలహారంభముగా పాత్రకృత్య మవిచ్ఛేదమున సూచిత మయినది. ఇట్లె యితరము లందును సమ న్వయము సరిజూచునది. ఈ యంకావతారము విష్కంభాదులలో నంతర్భవింపదు పూర్వాంకము సమాప్త మగుచుండగా రాబోవు నంకములోని నాయకాదుల యవస్థాసూచనాత్మకముగా నంకావతార ముండుట నంకావతారముగా గుర్తించు నది.

ఏతేష్వంక బహిర్భావః స్యాద్విష్కంభప్రవేశయోః
చూలికాయాః క్వచిద్బాహ్యే క్వచిన్మధ్యే నివేశనమ్. 426

ఏభిస్తు సూచయేత్సూచ్యం దృశ్యమంకైః ప్రదర్శయేత్
మధ్యే చ వేణీసంహారే దృశ్యతే చూలికా తథా. 427

ఇయమంకాదిబాహ్యేంక ముఖ గర్భాంక సామ్యతః
కథాఽవిచ్ఛేదహేతోస్తు చూలికా భోజకల్పితా. 428

గర్భాంకాంకముఖాభ్యామబహిష్కాభ్యాం స్వభావతస్త్వంకాత్
ఇతివృత్తావిచ్ఛేదే హేతుతయా చూలికా కథితా. 429

అంకముఖం గర్భాంకః కార్యోఽస్మిన్ చూలికాఽపి వా కుశలైః
మాభూదితి వృత్తానాం విచ్ఛేదో విస్తరో వేతి. 430

అంకాదిబాహ్యేవేవాంకముఖాంకావతారౌ స్వతః
ఏభిస్తు సూచయేత్సూచ్యం దృశమంకైః ప్రదర్శయేత్. 431

ఈ సూచ్యసూచకముల కంకము లందు సంగతి కూర్చుటలోని కొన్ని విశేషము లిచట గుర్తింపవలసినవి కలవు. విష్కంభము ప్రవేశకము అను రెండింటి కంకబహిర్భావమె యున్నది. అంకములతో నివి కలసి యుండవు. వేరుగా నుండును. చూలిక యొకప్పు డంకమధ్యముననె యుండును. ఒకప్పు డంకబహిర్భావమున నుండును. ఇట్లు వీనిచే సూచ్యమును సూచింప వలెను. దృశ్యము నంకములచే ప్రదర్శింపవలెను. వేణీసంహారనాటకమున చూలిక యంక మధ్యముననె యున్నది. ఇట్లంకమున కాదియందును, అంకమునకు బాహ్యమునను, అంకముఖ గర్భాంకసామాన్యమున కథలో విచ్ఛేదము లేకుండుటకై చూలిక భోజకల్పిత మయినది. చూలికాఘటనమున భోజనిరూపితము లయిన భావములు కథావిచ్ఛేదము సూచించునవిగా నున్నవని గ్రహింపవలెను. కావున గర్భాంకము అంకముఖములను నంకబాహ్యములు కాని వానితో స్వభావతః అంకమునుండియు నెట్టి కథావిచ్ఛేదము లేకుండుటకై చూలిక కూర్చుట యుక్తము. చూలిక యిట్లవిచ్ఛేదహేతువుగా నున్నది. రూపకమున కూర్పు పొందు నితివృత్తఖండ ములకు విచ్ఛేదము విస్తరము కలుగ కుండుటకై అంకముఖము గర్భాంకము చూలిక కూర్ప దగునని కుశలప్రజ్ఞులు నిరూపించిరి. అంకముఖ మంకాదిలో నుండుటయు అంకావతార మంకబాహ్యముగా నుండుటయు స్వభావసంగత మయిన విశేషము. ఇట్లు వీనిచే సూచ్యము సూచించి దృశ్య మంకములచే ప్రదర్శింప వలయు ననుట ప్రకృతార్థోపసంహారము. ఇక కొన్ని నాటకభాషా రూపముల నిరూపించి యీ యధికారము సమాప్తి మొనరింపదగును.

## నాటకభాష

ఏతద్ద్వయం ద్విధా భూతం శ్రావ్యమశ్రావ్యమేవ చ
సర్వస్య నియతస్యేతి క్రమాత్తద్ద్వయముచ్యతే. 482

సర్వే సదస్యా నియతో నట ఇత్యభిధీయతే
సర్వశ్రావ్యం ప్రకాశం స్యాదశ్రావ్యం స్వగతం మతమ్. 483

శ్రావ్యం తు నియతస్యైతన్నాట్యధర్మమపేక్ష్య చ
ద్విధా విభజ్యతే తత్ర జనాంతమపవారితమ్. 484

త్రిపతాకాకరేణాన్యానపవార్యాంతరా కథాం
అన్యోన్యామంత్రణం యత్స్యాత్తజ్జనాంతికముచ్యతే. 485

రహస్యం కథ్యతేఽన్యస్య పరావృత్యాపవారితం
వస్తునిర్వాహకత్వాచ్చ నాట్యధర్మప్రసంగతః. 486

ఆకాశభాషితం తత్కిం బ్రవీషీతి బ్రవీతి యత్
శ్రుత్వేవానుక్తమప్యేకః తత్స్యాదాకాశభాషితమ్. 487

సూచ్యవస్తువు కాని అసూచ్యవస్తువు కాని ప్రయోగములలో రెండు విధముల నుండును — శ్రావ్యమని అశ్రావ్యమని. వీనిని సర్వశ్రావ్యము నియత శ్రావ్యము అందురు. సర్వపదమున సదస్యులు, నియతపదమున నటుడు పరిభాషితులు. సర్వశ్రావ్యము ప్రకాశ మని, అశ్రావ్యము స్వగత మని వ్యవహృత మగును. నాట్యధర్మము ననుసరించి శ్రావ్యమును రెండు విధముల నున్నది— 'జనాంతికము అపవారితకము' అని వాని పేరులు. త్రిపతాకాహస్తమున నితరుల నపవారించి-వారు వినకుండునట్లు నిషేధించి, వారి సంభాషణ జరుగుచుండగనే యన్యోన్య మామంత్రణ మొనరించుట జనాంతిక మగును. అపవారిత మిట్లుండును. రంగమున నటుగా దిరిగి యితరునకు రహస్యము చెప్పుట యపవారితము. నాట్యధర్మప్రసంగమున కథానిర్వాహక మగుటను ఆకాశభాషితము వేరొకటి యున్నది. రంగమున నున్న యాతడు యవనికాపార్శ్వము చూచుచు "ఏమనుచున్నావు? ఇట్లనుచున్నావా?" యని యటు వ్యక్తి పలుక కున్నను పలికినట్లుగా భావించి పలుకుట యాకాశభాషిత మగును. ఇట్లె స్వప్నాయితాదులు గ్రాహ్యములు.

న కేవలం రసో నైవ లక్ష్యం నైవ చ లక్షణం
న నాయకస్యైవోత్కర్షో వర్ణ్యః సుకవినా క్వచిత్
కథాశరీరం సర్వేషామానుగుణ్యేన కల్పయేత్. 438

ప్రబంధనిర్మాణమున సుకవి సావధానుడుగా నుండదగునని కవి యుపదేశపరముగా నిది యావశ్యకము. సుకవి కేవలరసమును ముఖ్యముగా వర్ణింపరాదు. కేవలము లక్ష్యమె ప్రధాన మొనరింపరాదు. కేవలము లక్షణ మునె యనుసరింపరాదు. నాయకుని యుత్కర్షము వర్ణించుటయె ముఖ్యము చేసికొనరాదు. అందర కనుగుణ మగునట్లు కథాశరీరమును కల్పింపవలెను. సర్వ రంజనము ప్రధానము.

ఇత్యాద్యశేషమిహ వస్తువిశేషజాతం
రామాయణాది చ విభావ్య బృహత్కథాం చ
ఆసూత్రయేత్తదను నేతృరసానుగుణ్యాత్
చిత్రాం కథాముచితచారువచః ప్రపంచః. 439

ఇతి శ్రీశారదాతనయ విరచితే భావప్రకాశనే నాట్యేతివృత్తశరీరలక్ష ణాభిధానం నామ సప్తమోఽధికారః.

ఈ యధికారమున నిరూపించిన విధముగా నశేషవస్తువిశేషమును ప్రబంధమున చక్కగా నాసూత్రిత మొనరింపవలెను. రామాయణాదులను బృహ త్కథను మహాకవిగ్రంథములను పరిశీలించి కూర్పవలెను. రస–నాయకోచితముగా కథను చిత్రముగ నాసూత్రింప వలెను. సుకవి తగిన చారువచఃప్రపంచము కల వాడై సర్వసముచితముగ గూర్పవలెను.

ఇది శ్రీశారదాతనయ విరచితమైన భావప్రకాశమునందు భావాలోక
మున నాట్యేతి వృత్తశరీర లక్షణాభిధానము అనెడి
సప్తమాధికారము.

# అష్టమాధికారము

## దశరూపక లక్షణ కథనము

ఈ యధికారమునకు దశరూపకలక్షణ మని పేరు. దశరూపకములలో నాటకము మొదటిది. నాటకమునకు ప్రాధాన్య మున్నందున నాటకప్రశంస యున్నది. నాటకాలంకారములు తల్లక్షణము లిందు నిరూపితము లగును. ప్రేక్షక నటలక్షణములు ప్రాశ్నికుల విశేషములు ప్రకృష్టప్రేక్షక స్వరూప మున్నది. సూత్రధారకర్తవ్యము ప్రస్తావనారూపము అంకలక్షణము అంకాలంకారములు అంకసంఖ్య పూర్ణనాటకము తదూపములు వివేచితము లయినవి. ఉద్దేశాను క్రమమున ప్రకరణాదులు తదవాంతరవిశేషములు నిర్దిష్టము లయినవి. ఆ యా విషయప్రతిపాదనమున నితరుల మతము లుట్టంకితము లయినవి.

కథాశరీరం కావ్యస్య లక్షణం చోపపాదితం
భరతాదిభిరాచార్యైర్దర్శితేనైవ వర్త్మనా. 1

ప్రాథమ్యాన్నాటకస్యాస్య తత్సమ్యగభిధీయతే
నాటకం ప్రకరణం భాణః ప్రహసనం డిమః. 2

వ్యాయోగసమవాకారౌ వీథ్యంకేహామృగా ఇతి
తోటకం నాటికా గోష్ఠీ సంలాపః శిల్పకం తథా. 3

డోంబీ శ్రీగదితం భాణీప్రస్థానం కావ్యమేవ చ
ప్రేక్షణకం సట్టకం నాట్యరాసకం లాసకం తథా. 4

ఉల్లోప్యకం చ హల్లీస మథదుర్మల్లికాఽపి చ
మల్లికా కల్పవల్లీ చ పారిజాతకమిత్యపి. 5

రసాత్మకా దశైతేషు వింశద్భావాత్మకా మతాః
తేషాం రూపకసంజ్ఞాఽపి ప్రాయో దృశ్యతయా క్వచిత్. 6

త్రింశద్రూపకభేదాశ్చ ప్రకాశ్యంతేఽత్ర లక్షణైః

భరతాదినాట్యాచార్యులు ప్రదర్శించిన మార్గమున కథాశరీరము కావ్యలక్షణము నుపపాదిత మయినది. దశరూపకములలో నాటకమునకు ప్రాథమ్య మున్నందున నది సమధికముగా నిరూపిత మగును.

నాటకము-ప్రకరణము-భాణము-ప్రహసనము-డిమము- వ్యాయోగము-సమవాకారము-వీథి-అంకము-ఈహామృగము
అను దశకము రసాత్మకము.

తోటక-నాటికా-గోష్ఠీ - సంలాప - శిల్పక-డోంబీ-శ్రీగదిత-భాణీ-ప్రస్థాన-కావ్య- పేరిణక-సట్టక-నాట్యరాసక-లాసక-ఉల్లోప్యక-హల్లీస- దుర్మల్లికా-మల్లికా-కల్పవల్లీ-పారిజాతకములు.

అను నిరువది భావాత్మకములు- భావాత్మకములకు రూపకమను సంజ్ఞయు దృశ్యమాన మగుటచే నుపపన్న మని భావించునది. ఈ త్రింశద్రూపక భేదముల లక్షణములు ప్రకాశితములగును.

### నాటక లక్షణము

ప్రకృతిత్వాదథాన్యేషాం భూయో రసపరిగ్రహాత్. 7

సంపూర్ణ లక్షణత్వాచ్చ పూర్వం నాటకముచ్యతే
స్వేతరేషాం ప్రాకృతానాం నాటకస్యోక్తధర్మతః. 8

అతిదేశక్రమాత్స్వాంగసమర్పకతయోచ్యతే

ప్రథమముగా నాటకము నిరూపిత మగుటలో నౌచిత్యమున్నది. నాటకము సర్వవిధరూపకములకును ప్రకృతి. ప్రకృతి యనుట సర్వాంగోపదేశము కలది యని భావము. ఇతరములు వికృతిరూపములు. అందన్ని యంగము లుపదిష్టములు కావు. "ప్రకృతివత్ వికృతిః కర్తవ్యా" అను మీమాంసకన్యాయాను సారమున ప్రకృతిలో నుపదిష్టము లయిన యంగములను వికృతిలోనికి దెచ్చికొనవలసి యుండును. ఈ తెచ్చికొనుటను "అతిదేశము" అందురు. నాటక మితరముల కంగసమర్పకము కాగలదు. నాటకము నందు భూయోరస పరిగ్రహ మున్నది. ఒక రసము ముఖ్యమగుట అన్యరసము లంగములుగా నుండుట రసములకు సంబంధించిన యుద్దీపన ప్రశమన రీతులు రసోచితవిభావాదిసామగ్రీ సంధానము నాటకము నందు సాతిశయముగా నుండును. నాటకము సంపూర్ణ లక్షణము. నాటకమునందుండవలయు సంధులు సంధ్యంగములు పతాకాస్థానకములు మొదలగునవి యన్నియు నిందుండును. కావుననే మొదటగా నాటకమును జెప్పవల

యును. ఇతర రూపకము లన్నియు ప్రకృతి యగు నాటకమునకు సంబంధించినవి. ఈ నాటకము వానికన్నిటికిని అతిదేశక్రమమున స్వాంగముల సమర్పించునది యగును. ఇట్లిన్ని ధర్మముల వైశిష్ట్యమున్నందున నాటకము ప్రథమోపదేశ్యము. ముందుగా నిరూపణీయము. ఇంకను నాటకము విశిష్టము.

వికాస విస్తర క్షోభ విక్షేపాత్మకతోదితైః. 9

చేతోవికారై రంగాంగిభావాత్తాష్టరసయోగతః
రసాశ్రయత్వం; సంపూర్ణ లక్షణత్వం చ కథ్యతే. 10

అర్థప్రకృత్యవస్థాత్మ సంధిసంధ్యంగవృత్తిమత్
అర్థోపక్షేపకై ర్యుక్తం పతాకాస్థానకాదిభిః
రసాలంకారసహితం నాటకం పూర్ణ లక్షణమ్. 11

కావ్యార్థసంభేదము వలన స్వాదము నాల్గు విధముల కలుగును- వికాసము, విస్తరము, క్షోభము, విక్షేపము అని. ఈ నాల్గు విధములైన చేతోవికారములు నాల్గువిధములగు రసమయప్రవృత్తులకు హేతువు లగుచున్నవి. జనకములైన నాలుగు రసముల వలన జన్యములగు నాలుగు రసముల ఉత్పత్తిని అంగీకరింపవలసి యున్నది. వీనికి సముచితమైన అంగాంగిభావము వలన జన్యజనకభావము స్ఫుటమగును. ఇట్టి అష్టరసయోగమున కావ్యమునకు రసాశ్రయత్వమును నిశ్చయింపవచ్చును. నాటకప్రాథమ్యము నిరూపించుటలో భూయోరస పరిగ్రహమును పై విధముగా గుర్తించునది. సంపూర్ణ లక్షణత్వము అనునదియు ప్రాథమ్యహేతువుగా సూచితమైనది. దాని స్వరూప మిట్లు పరిగ్రాహ్యము. నాటకము పూర్ణలక్షణ మగుటకు ఈ చెప్పునవి అన్నియు నుండవలెను - బీజ బిందు పతాకా ప్రకరీ కార్యము లనెడు అర్థప్రకృతు లైదు. ఆరంభ, యత్న, ప్రాప్త్యాశా, నియతాప్తి, ఫలాగమము లనెడు అవస్థాపంచకము. అర్థప్రకృత్యవస్థాత్మకమైన ముఖ, ప్రతిముఖ, గర్భ, విమర్శ, నిర్వహణము లను సంధు లైదు. ఉపక్షేపపరికరాదులగు సంధ్యంగము లరువదినాలుగు. భారతీ, కైశికీ, సాత్వతీ, ఆరభటీ అని వృత్తులు నాలుగు. పతాకాస్థానకాదులైన అర్థోపక్షేపకము లను వానితో నాటకము కూడియుండుట రసాలంకారసహితమగుట నాటకమునకు సంబంధించిన పూర్ణ లక్షణము.

పంచ పంచ చతుష్షష్టిః చతుః పంచైకవింశతిః
షట్త్రింశన్నవతిర్యత్ర తదాహుర్నాటకం బుధాః. 12

అర్థప్రకృతయోఽవస్థాః పంచపంచేతి కీర్తితాః
అంగాని వృత్తయస్తత్ర సంధిసంధ్యన్తరాణి చ. 13

చతుష్షష్టిః చతుః పంచ సైకవింశతిభిః క్రమాత్
సంగీతాంగాని నవతిః షట్త్రింశద్భూషణాని చ. 14

పూర్వాధికారములలో వలె, అభీష్టమైన సాంకేతిక విషయమున పారిభాషిక గూఢార్థ పదములను ప్రయోగించుటలో శారదాతనయునకు అభిలాష యున్నది. పంచ, పంచ, చతుష్షష్టి, చతుః, పంచ, ఏకవిశంతిః, షట్త్రింశత్, నవతి, కూడి యుండుట నాటకస్వరూపమని బుధులు సాంకేతికముగా నిర్ణయించిరి. గూఢార్థములైన ఈ పదముల భావార్థము నీ విధముగా గ్రహింప దగును. అర్థప్రకృతులైదు మొదటి పంచ పదమున పరిగ్రాహ్యము. ఆరంభాద్యవస్థలైదు రెండవ పంచపదమున స్వీకార్యములు. సంధ్యంగము లరువదినాలుగు చతుష్షష్టి పద ప్రతిపాద్యములు. నాలుగు వృత్తులు చతుః పదమున గ్రాహ్యములు. తరువాత పంచపదమున ముఖాదిసంధులు గ్రాహ్యములు. ఏకవింశతిపదమున ఇరువది యొకటి సంధ్యంతరములు స్వీకార్యములు. అరువదినాలుగు, నాలుగు, ఏకవింశతి సంఖ్యాకములతో కూడిన ఐదుసంధులు, నవతి సంఖ్యాకములైన సంగీతాంగములు, షట్త్రింశత్ సంఖ్యాకములైన భూషణములు అను నివి యన్నియు నాటకమునకు పూర్ణతాసంపాదకముగా నున్నవి. నాటక మితరములకు ప్రకృతి యగుట రసపరిగ్రహ ముండుట సంపూర్ణలక్షణత్వ ముండుట నాటకప్రాథమ్యమునకు హేతువులుగా మొదట నా సూత్రితములైనవి. వాని స్వరూపసంకేతమును సూచితమైనది. పూర్వాధికారములలో నీ యంశములు విస్తృతముగా నిరూపితము లైనవి.

న తజ్ఞానం న తచ్ఛిల్పం న సా విద్యా న సా కలా
న తత్కర్మ న యోగోఽసౌ నాటకే యన్న దృశ్యతే. 15

అపి సిద్ధ్యేత విదుషాం ముక్తిరభ్యాసకౌశలాత్
న తు నాటకవిద్యేయం సర్వలోకానురంజనీ. 16

నాట్యమున లేనిది లేదు, లోకమున నపేక్షితము లన్నియు నాట్యమున నున్నవి — అను భావమును ప్రధానముగా నిరూపించుటకై భరతుడు నాట్యవేదమున "న తజ్ఞానం న తచ్ఛిల్పం" అను కారికను నిరూపించెను. భరతానుసారమున భావప్రకాశనము నిర్మింప దలచిన శారదాతనయుడు ప్రసంగప్రాప్త

మైన నాటకమున నాట్యమున నన్నిదంతయు నున్నదని నిరూపించుట కీ కారికను నిరూపించెను. రసాశ్రయ నాట్య నిష్పన్నములగు రూపకములలో నాటకము ప్రధానమైనందున నాట్యసంగతము నాటకసంగతము అగునని భావింపవలసి యున్నది. నాటకమున కానరానిది లేదు. నాటకమున అన్నియు ఉన్నవి. నాటకమున లేని జ్ఞానము లోకమున నేదియులేదు. నాటకమున లేని శిల్పము లోకమున ఏదియు లేదు. నాటకమున లేని విద్య లోకమునలేదు. నాటకమున లేని కళ లోకమున లేదు. నాటకమున లేని కర్మగాని, యోగము గాని లోకమున లేదు. లోకమున నపేక్షితములగు జ్ఞానశిల్పవిద్యాకలాకర్మయోగములు అన్నియు నాటకమున ఉన్నవి. "యదిహాస్తి తదన్యత్ర" ఏది ఇందు కలదో అది యంతట నున్నది. ఇందు లేని దెందును లేదు. ఇట్లనుట నాటకమున సర్వసామరస్య మున్నదని సర్వరంజన సామగ్రి యన్నదని నిరూపించినట్లగును. విద్వాంసులగు వారలకు అభ్యాసకౌశలమున ముక్తి ఒకప్పుడు లభించును. మరియొకప్పుడు లభింపదు. కాని ఈ నాటకవిద్య సర్వలోకానురంజన సామర్థ్యము కలది. భరతుడు నాట్యవేదమున నాట్యఫలసంకీర్తన మొనరించుచు అనేకప్రయోజనములను ప్రతిపాదించెను. వాని నన్నిటిని క్రోడీకరించి నాటకవిద్యారూపము ఈ విధముగా నిరూపిత మైనది.

నృపతీనాం యచ్చరితం నానారసభావచేష్టితై ర్బహుధా
సుఖదుఃఖోత్పత్తికృతం విజ్ఞేయం నాటకం నామ
రత్నావల్యాదిషు ప్రాయశ్చరితం రసభావయుక్. 17

సుఖం మలయవత్యాశ్చ దుఃఖం గరుడచంచునా
జీమూతవాహనస్యైతన్నాగానందే విభావ్యతే. 18

నాటకములందు నానారసభావచేష్టితములతో గూడుకొనిన నృపతుల బహువిధచరిత ముండును. అట్టి నాటకము సుఖోత్పత్తికృతము దుఃఖోత్పత్తికృతము నగును. శ్రీహర్షాదుల రత్నావల్యాదులలో సామాన్యముగా రసభావయుత మయిన చరిత మున్నది. అది సుఖోత్పత్తికృత మయిన చరిత మగుట స్పష్టము. శ్రీహర్ష నాగానందములో నాయకు డయిన జీమూతవాహనునకు గరుడుని చంచుకృతముగా దుఃఖము విభావిత మగును. అందు నాయిక యయిన మలయవతికిని దుఃఖమె విభావిత మగును. రాగకృత మయిన వియోగవేదనాత్మక దుఃఖము శృంగారమున రూపకసౌష్ఠవము సంపాదించుటను, రాగేతర

కృత మయిన వేదనాత్మకదుఃఖము దుఃఖాత్మకముగా నుండుటయు భావ్యము. అథవా; నాగానందమున మలయవతికి సుఖము, నాయకు డయిన జీమూతవాహ నునకు గరుడచంచువుచే దుఃఖము ననియు భావ్య మగును.

### అంకనియమము

నాటకే చ ప్రకరణే పంచాద్యా దశకీర్తితాః
అంకాః స్యుస్తత్ర పంచాంక మేతన్మారీచవంచితమ్. 19

షడంకం నాటకమిదం వేణీసంహారనాటకం
శాకుంతలాది సప్తాంక మష్టాంకం నలవిక్రమమ్. 20

దేవీపరిణయస్తత్ర నవాంకం నాటకం స్మృతం
దశాంకం నాటకమిదం బాలరామాయణాదికమ్. 21

కుందమాలాఽత్ర సుశ్లిష్టా సంధిపంచకసంయుతా
తథా చ వేణీసంహారః షట్త్రింశద్భూషణోజ్జ్వలః. 22

దేవీపరిణయః సర్వవృత్తినిష్పన్న ఉచ్యతే
ప్రవేశకాదినిష్పత్తిర్నాగానందే ప్రదర్శితా. 23

రూపకమునం దుండదగిన యంకముల విభాగ మిచట నిర్దిష్ట మగును. నాటకమున ప్రకరణమునను అయిదు మొదలుగా పదియంకము లుండదగునని కీర్తించిరి. మారీచకవంచిత మను నాటక మయిదంకములతో నున్నది. వేణీసంహార నాటక మారంకముల నున్నది. శాకుంతలాదికము సప్తాంకము. నలవిక్రమనాటక మష్టాంకము. దేవీపరిణయము నవాంకనాటకము. బాలరామాయణాదికము దశాంకము. దిఙ్నాగరచిత మయిన కుందమాలానాటకము సుశ్లిష్టము. సంధిపంచకముతో గూడియున్నది. వేణీసంహారనాటకము షట్త్రింశద్భూషణముల గూడి సముజ్జ్వలముగా నున్నది. దేవీపరిణయనాటకము సర్వవృత్తినిష్పన్న మనదగి యున్నది. నాగానందనాటకమున ప్రవేశకాదుల నిష్పత్తిరీతి ప్రదర్శితమె యయి నది. సంధ్యాదియుక్తములు ప్రశస్తములు నయిన నాటకములు నిర్దిష్టము లయినవి. వీనిలో మారీచవంచిత నలవిక్రమ దేవీపరిణయ నాటకముల స్వరూప మిప్పటికి నజ్ఞాతముగ నున్నది. వేణీసంహారాదులు నిర్జ్ఞాతములె. నాటకప్రాశస్త్యసంపాదకములలో నాట్యార్థసము త్తేజనములో గొన్ని నాటకాలంకారములు కలవు. వాని నామనిర్దేశము లక్షణకథనము ప్రకృత మపేక్షితము.

## నాటకాలంకారములు

నయాతిశయదాక్షిణ్య సిద్ధ్యభిప్రాయ గర్హణాః
ఉపదిష్టం చ మాలా చ సార్థాపత్తిశ్చ సంభ్రమః. 24

పశ్చాత్తాపః ప్రసిద్ధిశ్చ హేతుదృష్టాంతసంశయః
గుణాతిపాత ఆక్రందో విచారః ప్రాప్తిరేవ చ. 25

విశేషణం నిరుక్తిశ్చ కపటం చ మనోరథః
యాచ్ఞా నిదర్శనం చాశీరభిమానః స్పృహోఽపి చ. 26

పృచ్ఛాఽభిజ్ఞానముద్దిష్టం శోభోదాహరణే తథా
నీతిరక్షరసంఘాతః క్షోభశ్చార్థవిశేషణమ్. 27

ప్రోత్సాహనం గుణాఖ్యానం గుణోక్తిశ్చ నివేదనం
గుణానువాదోపపత్తిపరీవాదోద్యమా అపి. 28

అనుక్తసిద్ధిః కార్యంచ పరిహారస్తథాశ్రయః
ఉక్తిర్దేశోఽనువృత్తిశ్చ ప్రహర్షశ్చ క్షమేతి చ. 29

చతుష్షష్టి(?) రలంకారాః కథితా నాటకాశ్రయాః

నాటకాశ్రయము లయిన యలంకారములు నాటకాలంకారము లనదగినవి యిచట నిర్దిశ్యమానము లగును. అవి చతుష్షష్టి యని యిచట సంఖ్యానిర్దేశ మున్నది. కాని యవి యిచట చతుష్షష్టి లేవు. ఉన్నవానిపేరు లిట్లున్నవి.

నయ — అతిశయ - దాక్షిణ్య — సిద్ధి — అభిప్రాయ—
గర్హణ — ఉపదిష్ట - మాలా — అర్థాపత్తి - సంభ్రమ—
పశ్చాత్తాప—ప్రసిద్ధి - హేతు —దృష్టాంత - సంశయ—
గుణాతిపాత - ఆక్రంద — విచార — ప్రాప్తి — విశేషణం—
నిరుక్తి - కపట — మనోరథ — యాచ్ఞ - నిదర్శనం—
ఆశీః - అభిమాన — స్పృహా - పృచ్ఛా - అభిజ్ఞాన—
ఉద్దిష్ట - శోభా —ఉదాహరణ - నీతి - అక్షరసంఘాత-
క్షోభ — అర్థవిశేషణ - ప్రోత్సాహన - గుణాఖ్యాన - గుణోక్తి-
నివేదన - గుణానువాద — ఉపపత్తి - పరీవాద - ఉద్యమ-
అనుక్తసిద్ధి - కార్య -పరిహార — ఆశ్రయ — ఉక్తి-
దేశ — అనువృత్తి — ప్రహర్ష - క్షమ = 54

వీని స్వరూప మీ విధముగ నున్నది.

యూనోః ప్రియకరో యోఽర్థః స నయః కథ్యతే బుధైః. 30

విశేషకీర్తనం యత్స్యాదర్థే సోఽతిశయః స్మృతః
చిత్తానువృత్తిర్దాక్షిణ్యం సిద్ధిరిష్టార్థసంగమః. 31

స్వాద్యేష్వర్థేష్వహంమానః సోఽభిప్రాయ ఇతీరితః
కుత్సైవ గర్హణేత్యుక్తా క్రోధాన్మానాచ్చ మత్సరాత్. 32

లోకవేదమతాఖ్యానముపదిష్టముదాహృతా
గుణాభిధానం మాలా స్యాదర్థానామిష్టసిద్ధయే. 33

అర్థాంతరస్య కథనే యత్రాన్యోఽర్థః ప్రతీయతే
వాక్యమాధుర్యసంయుక్తా సార్థాపత్తిరితి స్మృతా. 34

వచనవ్యవహారేషు స్ఖలనం యస్స సంభ్రమః
అనుతాపో గతార్థస్య పశ్చాత్తాప ఇతీరితః. 35

ప్రసిద్ధిర్లోకవిఖ్యాతై ర్వాక్యైరర్థప్రసాదనం
పక్షప్రసాధకో హేతుః దృష్టాంతః సామ్యకీర్తనమ్. 36

అనిశ్చయేన వాక్యస్య సమాప్తిః సంశయః స్మృతః

నాట్యాశ్రయనాటకాలంకారములలో నయాదిసంశయాంతము లయిన పదునై దలంకారముల స్వరూప మిచట నున్నది. 1. నయము. ప్రేయసీప్రియు లకు ప్రియంకరమగు నర్థమును నయ మందురు. 2. అతిశయము. ఆ యర్థమున విశేషకీర్తన మతిశయము. 3. చిత్తానువర్తనము దాక్షిణ్యము. 4. ఇష్టార్థ సంప్రాప్తి సిద్ధి. 5. స్వాద్యార్థము లం దహంమాన మభిప్రాయము. 6. కుత్స నింద యొనర్చుట గర్హణము; ఇది క్రోధమున మానమున మత్సరమున గలుగును. 7. లోకవేదసమ్మతమగు మతము చెప్పుట యుపదిష్ట మగును. 8. గుణాభిధానము మాల యందురు. తత్తదర్థముల యిష్టసిద్ధికై గుణాభిధాన ముండుట మాల. 10. అర్థాపత్తి. అర్థాంతరము చెప్పునప్పు డన్యార్థము వాక్యమాధుర్యసంయుక్తమై యవభాసించిన నది యర్థాపత్తి యగును. 10. సంభ్రమము వచనవ్యవహారము లందు గల స్ఖలనము సంభ్రమము. 11. గతార్థమునకు సంబంధించిన యనుతాపము నకు పశ్చాత్తాప మనిపేరు. 12. లోకవిఖ్యాతములగు వాక్యములచే గలుగు

నర్థప్రసాదనమునకు ప్రసిద్ధి యని వ్యవహారము. 13. పక్షప్రసాధక మగునది హేతువు. 14. సామ్యకీర్తనమునకు దృష్టాంత మని పేరు. 15. సంశయము. నిశ్చయరహితముగా వాక్యము సమాప్త మొనరించుట సంశయము.

గుణాతిపాతో వ్యత్యస్తగుణాఖ్యానముదాహృతమ్. 37

ఆక్రందోఽభీష్టవిషయః శోకాలాప ఉదాహృతః
యథోచితముపన్యాసో విచారః పరికీర్తితః. 38

ఏకదేశాదశేషస్య జ్ఞానం ప్రాప్తిరుదాహృతా
సిద్ధార్థహేతూపన్యాస విశేషోక్తిర్విశేషణమ్. 39

ఇచట గుణాతిపాతాది విశేషణాంతము లయిన అయి దలంకారముల స్వరూప మున్నది.

16. వ్యత్యస్తగుణాఖ్యానము గుణాతిపాతము. 17. అభీష్టవిషయమునశోకాలాప మాక్రందము. 18. యథోచితముగా నుపన్యసించుట విచారము. 19. ఏకదేశమున సర్వవిషయజ్ఞానమునకు ప్రాప్తియని పేరు. 20. విశేషణము. సిద్ధార్థమున హేతువు నందలి విశేషముల చెప్పుట విశేషణమగును.

నిరుక్తిర్నిరవద్యోక్తిః పూర్వోక్తార్థప్రసిద్ధయే
ఉక్తార్థస్యాపలాపో యః కపటం తదుదాహృతమ్. 40
మనోరథోఽన్యాపదేశైః స్వాభిప్రాయస్య సూచనం
యాజ్ఞేతి కథ్యతేఽభీష్టసంగమప్రార్థనోభయోః. 41
నిదర్శనం తత్సమానవస్తురూపస్య కీర్తనం
ఆశీరభీష్టవిషయస్యాయురాద్యర్థవర్ధనమ్. 42
అంగీకారోఽభిమానః స్యాదర్థే హర్షాదిభిః కృతః
రమణీయార్థవిషయో రాగో యః సా స్పృహా మతా. 43
అన్వేషణం తు పృచ్ఛా స్యాదభిజ్ఞానం తు సూచనం
ఉద్దిష్టమర్థనిర్దేశః పారోక్ష్యాచ్చాపరోక్ష్యతః. 44
స్వభావప్రకటనం శోభేతి పరికీర్త్యతే
దృఢతుల్యార్థకృద్వాక్యముదాహరణముచ్యతే. 45

న్యాయానువర్తనం నీతిః లోకశాస్త్రావిరోధతః
స ఏవాక్షరసంఘాతో వాక్యం భిన్నాక్షరం చ యత్. 46

ఈ ప్రఘట్టమున నిరుక్తి మొదలుగా నక్షరసంఘాతము వరకు గల పంచదశాలంకారముల స్వరూపము కలదు. 21. నిరుక్తి. పూర్వోక్తార్థప్రసిద్ధికై పలుకు నిరవద్యోక్తి. 22. ఉక్తార్థము నపలపించుట కపటము. 23. అన్యాపదేశములచే స్వాభిప్రాయము సూచించుట మనోరథము. 24. నాయికానాయకుల యభీష్టసంగమ ప్రార్థన యాచన. 25. తత్సమానవస్తురూపము నిరూపించుట నిదర్శనము. 26. అభీష్టవిషయములను తన యాయురాద్యర్థములను వృద్ధి పొందింప జేయుట "ఆశీస్సు" అందురు. 27. పదార్థముల విషయమున హార్దాదులచే నంగీకారము సూచించుట యభిమాన మందురు. 28. రమణీయార్థవిషయక రాగము స్పృహ. 29. అన్వేషణమును పృచ్ఛ యందురు. 30. సూచన మొనరించుట యభిజ్ఞానము. 31. పరోక్షముగ గాని యపరోక్షముగ గాని యర్థనిర్దేశ మొనరించుట యుద్దిష్ట మగును. 32. స్వప్రభావప్రకటనము శోభ. 33. దృష్టము తుల్యము నయిన యర్థ మాపాదించు వాక్య ముదాహరణము. 34. నీతి. న్యాయానువర్తనమును నీతి యందురు. ఇది లోకశాస్త్రావిరోధమున నుండ దగును. 35. శ్లిష్టాక్షరముగా నుండు వాక్య మక్షరసంఘాత మగును.

ఆత్మన్యభూతతద్భావభావనం శోభ ఈరితః.
విశిష్టార్థప్రమాకృద్యద్వాక్యమర్థవిశేషణమ్. 47

త్వరానివేదనం యత్తు తత్ప్రోత్సాహనముచ్యతే
ఆఖ్యానం స్యాద్గుణాఖ్యానం గుణోక్తిర్గుణకీర్తనమ్. 48

సమావస్థానకథనం నివేదనముదాహృతం
గుణానువాదో యూనోర్యద్భూషయో ర్భూయో గుణస్తుతి . 49

ఉపపత్తిః స్వబుద్ధ్యాఽర్థే యోగ్యతాధానముచ్యతే
అపవాదో మృషాదోషస్తూత్సాహస్తూద్యమో భవేత్. 50

అనుక్తసిద్ధిరుక్తార్థస్యాన్యథాసిద్ధిరుచ్యతే
ప్రయోజనాభిధానం యత్కార్యమిత్యభిధీయతే. 51

పరిహారః ప్రతీతస్య కస్యాప్యర్థస్య మార్జనం
భీతాభయప్రదానం యత్స ఆశ్రయ ఇతీరితః. 52

ఉక్తిస్తత్త్వాభిధానం స్యాత్ స్తోతుం నిందితుమేవ చ
దేశః స్యాల్లింగినో జ్ఞానాభిధాన మితి కథ్యతే. 53

అభ్యర్థనానువృత్తిర్యా సాऽనువృత్తిరుదాహృతా
సంతోషోక్తిః ప్రహర్షః స్యాదనర్థాచ్ఛాదనం క్షమా. 54

ఇచట శోభాదిక్షమాంతము లయిన పందొమ్మిది నాట్యాలంకారముల రూప మున్నది. 36. శోభము తనయందు లేని తద్భావభావనము శోభ మగును. 37. విశిష్టార్థము యొక్క యథార్థ జ్ఞానము కలుగ జేయు వాక్యము అర్థ విశేష పదవాచ్యము. 38. త్వరానివేదనము ను ప్రోత్సాహన మందురు. 39. గుణముల కథనము గుణాఖ్యానము. 40. గుణముల కీర్తనము గుణోక్తి. 41. సమావస్థానము చెప్పుట నివేదనము. 42. యువావస్థలో నున్న వారి భూయో భూయో గుణస్తుతి గుణానువాద మగును. 43. స్వబుద్ధిచే పదార్థములందు యోగ్యత నాపాదించుట నుపపత్తి యందురు. 44. మృషాదోష మపవాదము. 45. ఉత్సాహ ముద్యమము. 46. చెప్పిన యర్థమున కన్యథాసిద్ధి యుండుట ననుక్తసిద్ధి యందురు. 47. ప్రయోజనకథనము ను కార్యమందురు. 48. ప్రసిద్ధ మగు నర్థము నేదేని మార్జన మొనరించుట పరిహారము. 49 భీతాభయప్రదానమున కాశ్రయ మనిపేరు. 50. స్తుతియొనరించుటకు గాని నిందించుటకు గాని తత్త్వము నిరూపించుట నుక్తి యందురు. 51. లింగిజ్ఞానాభిధానముదేశము. 52. సంతోషోక్తి ప్రహర్షము. 53. అభ్యర్థము ననుసరించుట ననువృత్తి యందురు. 54. అనర్థము నాచ్ఛాదించుటకు క్షమయని వ్యవహారము. ఇట్లీ విధముగా నాటకాలంకారముల స్వరూపకథన మున్నది. ఇట్లీ పారిభాషికము లయిన నాటకాలంకారముల గ్రథన మున నాటకశోభ యతిశయించును వివక్షితశృంగార రసపోషణము సముచిత ముగానుండును. ఇట్టి నాటకప్రయోగము సంతుష్టిసంపాదించును. లక్షణాలంకార మను నా నాట్యవేద భాగాత్మకగ్రంథములోని షట్త్రింశత్ కావ్య లక్షణముల నిట భావింపదగును. వానిరూపము వేరు; వీని రూపము వేరు.

ఈదృగ్లక్షణసంయుక్తం నాటకం సుప్రయోజితం
ప్రేక్షకస్య నటస్యాపి ప్రాశ్నికస్య కవేరపి. 55
స్యాద్భుక్తయే ముక్తయే చ తేషాం లక్షణ ముచ్యతే.

ఇట్లు లక్షణసంపన్నమయిన నాటకము సుప్రయోజిత మయినచో ప్రేక్షకునకు నటునకు ప్రాశ్నికునకు కవికిని భుక్తి ముక్తిప్రద మగును. సర్వ

లక్షణ సంపత్తి సుప్రయోగసంపద రెండు నావశ్యకములు. సర్వలక్షణసంపద యున్నను ప్రయోగము తగిన పథమున లే కున్నచో రాణింపదు. "ప్రయోగత్వ మనాపన్నే కావ్యే నాస్వాదసంభవః" యనినట్లు ప్రయోగసౌష్ఠవము లేకున్నచో నాస్వాద ముదయింపదు. ప్రయోగమున్నను లక్షణసంపత్తి లేకున్నచో నాస్వాద్యమె యుండదు గావున నాస్వాదము కలుగదు. అందుననె రెండు నావశ్యకములు. అప్పుడే ప్రేక్షకాదుల కది యామోదప్రదము. ప్రేక్షకాదుల స్వరూప వైభవము ననుసరించియు నాటకమహత్త యుండును. విశిష్టుల కామోదహేతు వగునదియు విశిష్ట మగును. కావున ప్రకృతము ప్రేక్షకాదుల లక్షణకథన మావశ్యకము. ఆలక్షణము నిరూపిత మగును. ప్రేక్షకలక్షణ మిట్లున్నది.

ప్రేక్షకుడు

యశోధర్మరతః శాంతః శ్రుతాభిజనవృత్తవాన్. 56

షడంగనాట్యకుశలః చతురాతోద్యవిచ్ఛుచిః
చతురోఽభినయజ్ఞశ్చ రసభావవివేచకః. 57

నైపథ్యదేశభాషాజ్ఞః కలాశిల్ప విచక్షణః
శబ్దచ్ఛందోఽభిధానజ్ఞః సర్వసిద్ధాంతతత్త్వవిత్. 58

త్యక్తమత్సరదోషశ్చ స నాట్యే ప్రేక్షకః స్మృతః

యశమున ధర్మమున నాసక్తుడు. శాంతుడు. శ్రుతము కలవాడు. అభిజాతుడు. మంచివృత్తము కలవాడు. షడంగసముపేత మయిన నాట్యమున కుశలుడు. నాలుగు విధము లయిన యాతోద్యముల నెరిగినవాడు శుచిప్రవృత్తి కలవాడు. చతురుడు. అభినయము తెలిసినవాడు. రసభావవివేచకుడు. నైపథ్య విధానము తెలిసిన వాడు. దేశభాషావిదుడు. కలాకోవిదుడు. శిల్పవిచక్షణుడు. శబ్దవిదుడు. ఛందోవిదుడు. కోశజ్ఞుడు. సర్వసిద్ధాంతతత్త్వవిదుడు. మత్సరదోషరహితుడు. ఇట్టివాడు నాట్యమున ప్రేక్షకుడు కాదగును.

నటుడు

షడ్భిర్గుణైరుపేతశ్చ ప్రయోగే వీతసాధ్వసః. 59

ఇంగితాకారచేష్టాజ్ఞః నానాప్రకృతిశీలవిత్
శిల్పవిన్నాయకాదీనాం తదాత్మ్యవృత్తిభావకః. 60

చిత్రవిచ్చిత్రవర్ణజ్ఞః తత్సంకరవిభాగవిత్
ఈ దృగ్గుణవిశిష్టస్తు నటో నాట్యే ప్రశస్యతే. 61

నటలక్షణ మీ విధమున నున్నది. ప్రేక్షకుని గుణము లన్నియు నీత నిలో సంగతములై యుండును. ఇంక నీ విశేషములు నుండును. నాటకప్రయో గమున సాధ్వసము లేనివాడు, ఇంగితముల నాకారములను చేష్టలను తెలిసినవాడు, నానాప్రకృతులను శీలములను గుర్తించిన వాడు, శిల్పవిదుడు, రామాదినాయ కుల తాదాత్మ్యాప్తి భావింపగలవాడు, చిత్రవిదుడు, విచిత్రవర్ణముల తెలిసినవాడు, నానావిధము లయిన రంగులను తత్సమ్మేళనములను తత్సంకరములను తద్విభాగ ములను చక్కగా గుర్తింపగలవాడు నటుడు. ఇంక నిట్టి గుణవిశిష్టు డగుట నాట్యమున ప్రశంసాస్పదము.

ప్రాశ్నికులు

నటప్రేక్షకయోరుక్తగుణైః ప్రతైర్విభూషితః
యజ్ఞవిత్ నర్తకశ్చైవ ఛందోవిత్ శబ్దవిత్ నృపః. 62

ఇష్టార్థః చిత్రకృత్ వేశ్యా గాంధర్వో రాజసేవకః
సముత్పన్నే చ సంఘర్షే ప్రాశ్నికాస్తే భవంతి హి. 63

యజ్ఞవిద్దేవతాయోగే నర్తకోఽభినయాదిషు
ఛందోవిద్వృత్తబంధేషు శబ్దవిత్పాఠ్యవిస్తరే. 64

విభూతిగుణసంభోగవీర్యాంతఃపురచేష్టితే
నృపః స్వచరితేషు స్యాదిష్టార్థస్సంస్తవే సదా. 65

ప్రమాణాకృతిచేష్టాసు నానాలంకారయోజనే
నాట్యానైపథ్యయోగేషు చిత్రకృత్తు ప్రశస్యతే. 66

కామోపచారే వేశ్యా తు గాంధర్వః స్వరతాలయోః
సేవకో వినయాచారే త ఏతే ప్రాశ్నికా మతాః. 67

ఇచట ప్రాశ్నికప్రశంసయున్నది. నాటకప్రయోగ సంఘర్షము సంప్రాప్త మయినపుడు ప్రయోగయోగ్యతను నిర్ణయించుటకు పదిమంది ప్రాశ్నికు లుండవలెను. పదిమంది యనుట సంఖ్యానియమనము కాదు. వారివారి విశేషవివేకము కలుగజేయుట యిందు ముఖ్యము ప్రాశ్నికు లనదగినవారు నిరూపించిన నటప్రేక్షకుల గుణములతో విభూషితు లగుట యావశ్యకము. ప్రేక్షకు లిట్టివారు కావలెను. యజ్ఞవిదుడు — నర్తకుడు— ఛందోవిదుడు- శబ్ద విదుడు-నృపాలుడు-ఇష్టార్థుడు — చిత్రకారుడు— వేశ్య - గాంధర్వవిదుడు-రాజ సేవకుడు - అను నీ పదిమంది సంఘర్షము సముత్పన్న మయినపుడు ప్రాశ్నికులు

గా వ్యవహరింపఁదగుదురు. వీరిలో యజ్ఞవిదుడు దేవతాయోగమునను, నర్తకు డభినయాదు లందును, ఛందోవిదుడు వృత్తబంధము లందును, శబ్దవిదుడు పాఠ్య విస్తరము నందును ఉపయోగింతురు. నగపాలుడు ఐశ్వర్యము గుణము సంభోగము పరాక్రమము అంతఃపురచేష్టితము స్వచరితము మొదలగు వానియందును, ఇష్టార్థుడు సంస్తవము నందును ఉపయోగింతురు. ఆ యా విషయముల పరిశీలనమున సహకరింతురు. చిత్రకారుడు, ప్రమాణములను గుర్తించి ఆకృతి చూచి చేష్టలు భావించి వీని విషయమున నానాలంకారములు యోజన మొనరించుటలో నాట్యమునకు సంబంధించిన నైపథ్యములను కూర్చుటలో సహకరించును. వేశ్యా కామోపచారముల సమీక్షాసహకారిణి యగును. గాంధర్వుడు స్వరతాలముల సమీక్షించును. వినయాచారముల విషయమున రాజసేవకుడు సహకారి యగును. ఇట్టి వీరు ప్రాశ్నికులుగా నుండఁదగుదురు. ప్రాశ్నికులు స్వనియతము లయిన విషయముల నాధారము చేసికొని సంఘర్షసమయమున సముచితముగ ప్రాశ్నికత్వమును నిర్వహింపవలెను.

## నాట్యప్రశస్తి

నానాశీలాః ప్రకృతయః శీలే నాట్యం ప్రతిష్ఠితం
యద్వృత్ స్వశిల్పం నైపథ్యం కర్మ వా చేష్టితం వచః. 68

తత్తన్నాట్యేన సాధ్యం యత్స్వకర్మవిషయే స్థితం
కాముకైశ్చ విదగ్ధైశ్చ శ్రేష్ఠిభిశ్చ విరాగిభిః. 69

శూరైః జ్ఞానవయోవృద్ధైః రసభావవివేచకైః
బాలమూర్ఖాబలాభిశ్చ సేవ్యం యన్నాట్యముచ్యతే. 70

లోకప్రకృతులు నానాశీలముల నుందురు. నాట్యము శీలమున ప్రతిష్ఠితము. శిల్పము నైపథ్యము కర్మ చేష్టితము వచన మెవని కే విధముగ నుండునో తమ కర్మ విషయమున నది యెట్లు వ్యవస్థితమై యున్నదో యది యంతయు నాట్యమున సాధ్యము కాగలదు. కాముకులు విదగ్ధులు శ్రేష్ఠులు విరాగులు శూరులు జ్ఞానులు వయోవృద్ధులు రసభావవివేచకులు బాలకులు మూర్ఖులు అబలలు — అందరు ఈ నాట్యమును సేవింప జనుదురు. కేవల మొక వర్గమునకే నాట్యసేవనము నియతము కాదు. ఇది సర్వోపదేశజననము. త్రైలోక్యభావాను కీర్తనము నాట్యమున నుండుట పరిగ్రాహ్యము.

తత్తత్కార్యేషు తేషాం తు యస్మాదేతత్ప్రవర్షణం
తుష్యంతి తరుణాః కామే విదగ్ధాః సమయాశ్రితే. 71

అర్థేష్వర్థపరాశ్చైవ మోక్షేష్వథ విరాగిణః
శూరా బీభత్సరౌద్రేషు నియుద్ధేష్వాహవేషు చ. 72
ధర్మాఖ్యానపురాణేషు వృద్ధాస్తుష్యంతి నిత్యశః
సత్త్వభావేషు సర్వేషు బుధాస్తుష్యంతి సర్వదా. 73
బాలా మూర్ఖాస్త్రియశ్చైవ హాస్యనైపథ్యయోస్సదా
యస్తుష్టే తుష్టిమాయాతి శోకే శోకముపైతి చ. 74
క్రుద్ధః క్రోధే భయే భీరుః స శ్రేష్ఠః ప్రేక్షకః స్మృతః

నాట్యము సర్వజనులకు సంతోషప్రదము. ఆ యా కార్యములలో నా యా వ్యక్తుల కిది ప్రహర్షణాత్మకము. తరుణు లందరు నాట్యమున సంతుష్టి పొందుదురు. ఒక్కొక్క రొక్కొక విషయము నభిమానించి యాదరించి యాస్వాదించి సంతుష్టి పొందుదురు. అంద రన్ని విధముల నానంద మందుకొనుట కీ నాట్యరీతి సహకార మిచ్చును. నాట్యము నందు కామము ప్రదర్శితము కాగా తరుణవయస్కులు సంతుష్టి పొందుదురు. విదగ్ధులు సమయాశ్రితాంశమున సంతుష్టి పొందుదురు. అర్థపరు లర్థము నం దాసక్తులు. విరాగులు మోక్షాసక్తు లగుదురు. శూరులగువారు రౌద్రబీభత్సాత్మకము లయిన యుద్ధనియుద్ధముల నాదరింతురు. వృద్ధులగువారు ధర్మాఖ్యానములు గల పురాణములం దాసక్తు లగుదురు. బుధులగువారు సర్వవిధము లయిన సత్త్వభావముల నాస్వాదింతురు, సంతసింతురు. బాలకులు మూర్ఖులు స్త్రీలును హాస్యము నైపథ్యము భావించి తుష్టు లగుదురు కథావ్యక్తులు తుష్టు లయినచో తుష్టి పొందుటయు, శోక మున్న శోకము పొందుటయు, క్రోధ మున్న క్రుద్ధులగుటయు, భయమున్న భీరువులగుటయు నుండునేని శ్రేష్ఠప్రేక్షకత యుండునని యభిజ్ఞు లనిరి. సుఖదుఃఖాదిభావభావితాంతరంగము కలవారు కావలయుట సూచితము.

నాట్యప్రశస్తి నిరూపించునపుడు నాట్యవేదమున భరతుడు "ధర్మ్యం అర్థ్యం యశస్యం సోపదేశం సర్వకర్మానుదర్శకం సర్వశాస్త్రార్థసంపన్నం సర్వశిల్పప్రదర్శకం నాట్యం" అని సూచించి నాట్యమున "ధర్మము క్రీడ అర్థము శమము హాస్యము యుద్ధము కామము వధ" యుండు ననెను. ధర్మప్రవృత్తులకు ధర్మము, కామోపసేవులకు కామము, దుర్వినీతులకు నిగ్రహము, శూరుల కుత్సాహము, అబుధులకు విబోధము, విద్వాంసులకు వైదుష్యము, ప్రభువులకు విలాసము, దుఃఖితులకు స్థైర్యము. అర్థోపజీవుల కర్థము, ఉద్విగ్నచేతసులకు

ధృతి, నాట్యమున గలుగు ననెను. "నానాభావోపసంపన్నం నానావస్థాంతరాత్మకం, లోకవృత్తానుకరణం, నరకర్మసంశ్రయం, హితోపదేశజననం, దుఃఖార్తశ్రమార్త శోకార్త విశ్రాంతిజననం, లోకోపదేశజననం నాట్యం" అనెను. నాట్యవేదభావముల క్రోడీకారము ప్రకృతమున భావింపదగును.

## నాటకారంభము

తదీదృఙ్నాటకారంభప్రకారోఽత్ర ప్రదర్శ్యతే. 75

ప్రయుజ్య రంగం నిష్క్రామేత్సూత్రధారః సహానుగః
స్థాపకః ప్రవిశేత్తత్ర సూత్రధారగుణాకృతిః. 76

దివ్యమర్త్యే స తద్రూపో మిశ్రమన్యతరస్తయోః
సూచయేద్వస్తు బీజం వా ముఖం పాత్రమథాపి వా. 77

నాటక మిట్టిది. ఇక నాటకారంభప్రకారము వర్ణితము కావలెను. నాటకలక్షణ సామగ్రిని సముచితముగా గ్రథించిననె నాటకము ప్రశంసనీయమగును. నాటకశాస్త్రమున గలదు గదా యని నిబంధించుట కుద్యమింపరాదు. లక్షణముల యథాస్థానప్రయోగమె సౌందర్యావహము. అట్టి ప్రయోగముననె నటప్రయోగము రాణించును. మొదట సూత్రధారుడు రంగప్రయోగ మొనరించి తన యనుచరులతో నిష్క్రమింపవలెను. అనంతరము స్థాపకు డనదగిన యొకడు సూత్రధారగుణాకృతియై ప్రవేశింపవలెను. అట్లు ప్రవేశించి నాటకీయమగు వస్తువునేని బీజమునేని ముఖమునేని సూచింపవలెను. అంకమున ప్రవేశింపబోవు పాత్రము నేని సూచింపవలెను. ఇట్లు సూచించుటలో నీ నియమము లున్నవి. నాటకమున దివ్యవస్తు వుండునేని స్థాపక సూత్రధారుడు దివ్యుడై సూచింపవలెను. మర్త్యమేని మర్త్యరూపుడై సూచింపవలెను. కథావస్తువు మిశ్రముగ నుండునేని దివ్యమర్త్యులలో నన్యతరరూపుడై సూచింపవలెను. ఇది స్థాపకు డనదగు రెండవ సూత్రధారుని కార్యము. వస్తు బీజ పాత్రముల సూచించుట నిటు నాటకములలో కవులు సూచించినారు. అది యిట్లు భావనీయము.

ప్రీతిర్నామ సదస్యానామిత్యాదేర్వస్తు సూచ్యతే
బీజం తు వేణీసంహారే సత్పథా ఇతి దర్శితమ్. 78

రత్నావల్యాం ముఖం ద్వీపాదన్యస్మాదపి దర్శితం
తవాస్మి గీతరాగేతి పాత్రం శాకుంతలే కృతమ్. 79

మురారికవి రచితానర్ఘరాఘవ నాటకమున "ప్రీతిర్నామ సదస్యానాం" అనుశ్లోకమున కథావస్తువు సూచిత మయినది. వేణీసంహారనాటకమున "సత్పక్షా మధురగిరః" అను శ్లోకమున నాటకీయబీజము సూచిత మయినది. శ్రీహర్ష రత్నావలిలో "ద్వీపాదన్యస్మాదపి" అను శ్లోకమున ముఖము సూచితమయినది. కాళిదాస శాకుంతలమునందు "తవాస్మి గీతరాగేణ" అను శ్లోకమున పాత్ర సూచన మున్నది. ఇట్లు వస్తుబీజాదులను సూచించుట వలన రచనానుశ్లిష్టత సిద్ధ మగును.

మురారినాటకాదులలో నున్న వస్తుబీజాదిసూచనముల నిట్లు గ్రహింప వచ్చును. మురారి నాటకమున నిది యున్నది.

"ప్రీతిర్నామ సదస్యానాం ప్రియా రంగోపజీవినః
జిత్వా తదపహర్తారమేష ప్రత్యాహరామి తాం"

సదస్యులకు ప్రీతి సంపాదించుట రంగోపజీవియగు వాని కభీష్టము. సదస్య ప్రీతి నా ప్రియ. నా ప్రియ హరించిన వాని జయించి దాని మరల దెచ్చెదను. కలహకందలు డను నటుడు రౌద్రబీభత్స భయానకాద్భుత రసభూయిష్ఠ మగు ప్రబంధ మభినయించి సదస్యప్రీతి హరించెను. నేను వాని జయించి సదస్యాభిమత రసభావ సంపద కల ప్రయోగము ప్రదర్శించి ప్రీతి కూర్చుదును. ఈ సూత్రధార వచనమున రావణాపహృత యయిన సీతాదేవిని శ్రీరాముడు రావణుని జయించి మరల దెచ్చుట యను నాటకీయవస్తువు సూచిత మయినది.

వేణీసంహారశ్లోకమున బీజము సూచిత మగుట పూర్వము నిరూపిత మయినది. రత్నావలిలో ముఖసూచన మిట్లున్నది.

"ద్వీపాదన్యస్మాదపి మధ్యాదపి జలనిధేర్దిశోప్యంతాత్
ఆనీయ ఝుడితి ఘటయతి విధిరభిమతమభిముఖీభూతః."

సింహలరాజదుహిత రత్నావళి సముద్రమున నావలో వచ్చునపుడు నావ పగులగా సముద్రమున బడినది. వణిజు డామెను పడవెక్కించి వత్సదేశమునకు దెచ్చి వత్సరాజాంతఃపురమునకు జేర్చెను. సాగరలబ్ధ యగుటచే సాగరిక

యయినది. రాజు ప్రేమించి కాడు దేవి యయినది. ఇది కథావస్తువు. ప్రథమాంకమున ప్రవేశించిన యౌగంధరాయణమహామంత్రి "ద్వీపాదన్యస్మాత్ "అని పలుకును ప్రస్తావనలో సూత్రధారు డంకముఖము సూచించుటకుగా నిది పలికెను. దీని యర్థ మిట్లున్నది అన్యద్వీపము నుండిగాని జలనిధిమధ్యము నుండి గాని, దిగంతమునుండి గాని యభిముఖ మయిన విధి యభిమతమును ఝటితి ఘటించును అని. ఈ యర్థ మ ఖముఖసూచక మగుట స్పష్టము.

శాకుంతలనాటకమున ప్రస్తావనలో సూత్రధారుడు ఋతుగాన మొనరింప వలెనని నటితో ననెను నటి గాన మొనరించినది. అప్పు డాతడు

"తవాస్మి గీతరాగేణ హారిణా ప్రసభం హృతః
ఏష రాజేవ దుష్యంతః సారంగేణాతిరంహసా."

అతివేగము కల సారంగమున నీ దుష్యంతుని వలె మనోహర మగు నీ గీతరాగమున నే నపహృతుడ నయితిని అని. వేటకై దుష్యంతు డడవి చేరగా వేగముగా పరుగెత్తు మృగము వెంట నాతడు దూర మేగినాడు. సారంగ మాతని నట్లాకర్షించినది. అట్టి దుష్యంతుడు రంగమున ప్రవేశించుట నీ సూత్రధారవాక్యము సూచించుచున్నది. దుష్యంతపాత్ర ప్రవేశము నీ సూత్రధారుడు సూచించినాడు

రంగం ప్రసాద్య మధురైః శ్లోకైః కావ్యార్థసూచకైః
ఋతుం కంచిదుపాదాయ భారతీం వృత్తిమాశ్రయేత్. 80

శ్లోకశ్చ భారతీవృత్త్యా సత్వ ఇత్యాదిరోచ్యతే
భారతీ సంస్కృతప్రాయో వాగ్వ్యాపారో నటాశ్రయః. 81

యా వాక్ప్రధానా పురుషప్రయోజ్యా
స్త్రీవర్జితా సంస్కృతపాఠ్యయుక్తా
స్వనామధేయైః భరతైః ప్రయోజ్యా
సా భారతీ నామ భవేత్తు వృత్తిః. 82

కావ్యార్థసూచకము లగు మధురశ్లోకములతో రంగప్రసాధన మొనరించి, ఋతువు నొకదాని నందుకొని భారతీవృత్తి ననుసరింప వలెను. వేణిలోని "సత్వతా మధురగిరః" యనునది భారతీవృత్తి నున్న శ్లోక మని భావనీయము. భారతీవృత్తి యనునది సంస్కృతప్రాయ మయిన వాగ్వ్యాపారము

అది నటాశ్రయము. భారతీవృత్తి స్వరూప మిట్లు నిరూపిత మయినది. వాక్ప్రధానము పురుషప్రయోజ్యము స్త్రీరహితము సంస్కృతపాఠ్యసహితము భరతులు తమ నామధేయమున ప్రయోగింప దగినది - ఇట్టిది భారతీవృత్తి యగును.

## ప్రస్తావన

సాంగైః ప్రరోచనాయుక్తైః వీథీప్రహసనాముఖైః
ప్రేక్షకాద్యున్ముఖీకారః ప్రస్తుతార్థప్రశంసయా. 83

ప్రరోచనా సా శ్రీహర్షో నిపుణేత్యాదనోచ్యతే
ప్రస్తుతిస్త్వేదృగర్థస్య యా సా ప్రస్తావనా స్మృతా. 84

మద్వర్గ్యా రసపాఠేతి పద్యే ప్రస్తావనోచ్యతే

ప్రస్తావనాస్వరూప మిచట నున్నది. ప్రస్తావనలో ప్రస్తావ మావశ్యకము. సాంగములు ప్రరోచనాయుక్తములు నగు వీథీప్రహసనాముఖములతో ప్రస్తుతార్థప్రశంసా పురస్సరముగా ప్రేక్షకాదుల కున్ముఖీకరణము సంపాదించుట ప్రరోచన యగును. రత్నావళిలో "శ్రీహర్షో నిపుణః కవిః" యను శ్లోకమున ప్రరోచన కలదు. ఇట్టి యర్థమునకు ప్రస్తావ ముండుటచే నిది ప్రస్తావన యయినది. మురారినాటకము లోని "మద్వర్గ్యా రసపాఠగీతిగతిషు" అను పద్యమున ప్రస్తావన యున్నది.

రత్నావలీ ప్రస్తావనలో సూత్రధారుడు :

"శ్రీహర్షో నిపుణః కవిః పరిషదప్యేషా గుణగ్రాహిణీ
లోకే హారి చ వత్సరాజచరితం నాట్యే చ దక్షా వయం
వస్త్వేకైకమపీహ వాంఛితఫలప్రాప్తేః పదం కిం పునః
మద్భాగ్యోపచయాదయం సముదితః సర్వో గుణానాం గణః."

శ్రీహర్షుడు నిపుణు డయిన కవి ఈ పరిషత్తు గుణముల గ్రహింపగలదు. వత్సరాజచరితము లోకమున మనోహరము. మేమును నాట్యమున దక్షులము. ఒకొక్కక విషయ మయినను వాంఛితఫలప్రదము. నా భాగ్యమున సర్వగుణగణము సంప్రాప్త మయినది. ఇది ప్రరోచన.

అనర్ఘరాఘవనాటకములో సూత్రధారు డిట్లనును:

"మద్వర్గ్యా రసపాఠగీతిగతిషు ప్రత్యేకముత్కర్షిణః
మౌద్గల్యస్య కవేర్గభీరమధురోద్గారా గిరాంవ్యూతయః

వీరోదాత్తగుణోత్తరో రఘుపతిః కార్యార్థబీజం మునిః
వాల్మీకిః ఫలతి స్మ యస్య చరితస్తోత్రాయ దివ్యా గిరః.''

నాం వా రందరు రసయుక్తముగా పాఠగీతిగతు లొనరించుటలో ప్రత్యేకముగా నుత్కర్ష కలవారు. మౌద్గల్యగోత్ర సంభూతు డయిన కవి (మురారి) వాక్ప్రసారములు గభీరమధురోద్గారములు. నాటకనాయకు డయిన రఘుపతి వీరు డుదాత్తుడు గుణోత్తరుడు. ఈ కావ్యబీజము వాల్మీకిముని. తచ్చరిత స్తుతికై దివ్యవాక్కు సఫలము. ఇందు కవి నట నాయకాది ప్రశంస ప్రరోచనా రూపము.

సూత్రధారో నటీయుక్తో వస్తు ప్రస్తావనావధి. 85

కురుతే యత్ర సద్వృత్తైః తదాముఖముదాహృతం
సూత్రధారో నటీం బ్రూతే మారిషం వా విదూషకమ్. 86

స్వకార్యప్రస్తుతాక్షేపి చిత్రోక్త్యా యత్తదాముఖం
నటీ విదూషకో వాపి పారిపార్శ్వక ఏవ వా. 87

సూత్రధారేణ సహితాః సంలాపం యత్ర కుర్వతే
చిత్రైర్వాక్యైః స్వకార్యోత్థైర్వీథ్యంగై రన్యథాపి వా. 88

ఆముఖం తత్తు విజ్ఞేయం బుధైః ప్రస్తావనాఽపి వా
ప్రవృత్తక కథోద్ఘాత ప్రయోగాతిశయైస్తథా. 89

వీథ్యంగైః షోడశైః తేషాం యోగః ప్రస్తావనోచ్యతే

సూత్రధారుడు నటీసహితుడై ప్రస్తావనావధికముగా వస్తువును మంచి వృత్తములతో సూచించునేని యది యాముఖ మనదగును. ఆముఖస్వరూపము గుర్తించుట కింకను గొన్ని విశేషములు కలవు. నటి విదూషకుడు మారిషుడు పారిపార్శ్వకు డనువారు సూత్రధారపరివారము. సూత్రధారుడు రంగమున ప్రవేశించి నటిని మారిషుని విదూషకు నుద్దేశించి పలుకుచు చిత్రోక్తివ్యవహార మున స్వకార్యప్రస్తుతార్థమును స్ఫురింప జేయునేని యాక్షేపింప జేయునేని యది యాముఖ మనదగును. ఈ యంశమె రూపాంతరమున నిట్లు గ్రాహ్యము. నటి విదూషకుడు పారిపార్శ్వకుడు సూత్రధారునితో గూడినవారై స్వకార్యా ర్థము లయిన చిత్రవాక్యములతో గాని నిరూపింపబోవు వీథ్యంగములతో గాని

వేరువిధమున గాని సల్లాప మొనరింతు రేని యది యాముఖ మగును. ఈ యాముఖమునె ప్రస్తావన యందురు. ప్రవృత్తకము - కథోద్ఘాతము - ప్రయోగాతిశయము అను వీథ్యంగములతో ప్రస్తావన యుండును. వీథ్యంగములు పదునారు కలవు. ఇట్టి వీథ్యంగములతో సంబంధ ముండుట ప్రస్తావన యగును.

ప్రవేశో యో వసంతాదిసామ్యేన స్యాత్ప్రవృత్తకమ్. 90

సత్పక్షేత్యాదినా శ్లోకే నాయమర్థో యదీరితః
స్వేతివృత్తసమం వాక్యమర్థం వా యత్ర సూత్రిణః. 91

గృహీత్వా ప్రవిశేత్పాత్రం కథోద్ఘాతో ద్విధోచ్యతే
ద్వీపాదిత్యాదివాక్యేన యథా యౌగంధరాయణః. 92

అర్థః క్రూరగ్రహేత్యాది ముద్రారాక్షస కల్పితః
ఆకర్ణ్య చాణక్యపాత్రప్రవేశ ఉపలక్ష్యతే. 93

ఏషోఽయమిత్యుపక్షేపాత్సూత్రధారప్రయోగతః
పాత్రప్రవేశో యత్రైష ప్రయోగాతిశయో మతః. 94

ఏష రాజేవ దుష్యంతేత్యాదినా స ప్రతీయతే
ప్రవృత్తక కథోద్ఘాత ప్రయోగాతిశయ త్రికే. 95

భీమ చాణక్య దుష్యంత ప్రవేశై ర్లక్ష్యతే క్రమాత్.

వసంతాదిఋతువుల సామ్యమున ప్రవేశ ముండుట ప్రవృత్తకము. వేణీసంహారము నందు "సత్పక్షా మధురగిరః" అను శ్లోకమున ఋతుసామ్యకృత మయిన ప్రవేశము సూచిత మగు నందున నది ప్రవృత్తకము. రెండవది యగు కథోద్ఘాత స్వరూప మీ విధమున నున్నది. రంగమున సూత్రధారుడు పలుకు నప్పుడు స్వేతివృత్తసమ మయిన వాక్యమును గాని యర్థమును గాని గ్రహించి పాత్రము ప్రవేశించు నేని యది కథోద్ఘాత మగును. ఇది రెండు విధములు—వాక్యము ననుసరించి ప్రవేశించుట, అర్థము ననుసరించి ప్రవేశించుట యని. రత్నావళిలో సూత్రధారుడు పలికిన ''ద్వీపాదన్యస్మాత్'' వాక్యమునె యనుసరించి యౌగంధరాయణుడు ప్రవేశించుట యున్నది. ముద్రారాక్షస నాటకమున "క్రూరగ్రహః స కేతుః''అని సూత్రధారు డనిన శ్లోకములోని యర్థమును గ్రహించి వాక్యశ్రవణానంతరము చాణక్యపాత్రము ప్రవేశించుట యున్నది.

ఈ రెండు నాటకము లందలి యుదాహరణములు రెండు విధముల నున్న కథోద్ఘాతమునకు లక్ష్యములుగా నున్నవి. మూడవది యయిన ప్రయోగాతిశయ మిట్లుండును. సూత్రధారుడు "ఏషోయం" "వీడుగో నితడు" అని సూచించిన ప్రయోగానుసారమున పాత్రప్రవేశ మున్నచో నది ప్రయోగాతిశయ మగును. శాకుంతల నాటకము ప్రస్తావనలో సూత్రధారుడు "ఏష రాజేవ దుష్యంతః" అని నప్పుడు పాత్రప్రవేశము ప్రయోగాతిశయరూపము. ప్రవృత్తకము - కథోద్ఘాతము - ప్రయోగాతిశయ మను మూడును భీమ - చాణక్య - దుష్యంత ప్రవేశములచే గోచరించును.

## వీథ్యంగములు

అథాత్రైతాని కథ్యంతే వీథ్యంగాని త్రయోదశ. 96

ఉద్ఘాత్యకావలగితే ప్రపంచత్రిగతే ఛలం
వాక్కేల్యధిబలే గండమవస్యందితనాళికే. 97

అసత్ప్రలాపవ్యాహారమృదవాని త్రయోదశ

వీథ్యంగములు పదమూడు కలవు. వానినిచటనిరూపింపదగును. ఉద్ఘాత్యకము - అవలగితము - ప్రపంచము - త్రిగతము - ఛలము - వాక్కేలి - అధిబలము - గండము - అవస్యందితము - నాలిక - అసత్ప్రలాపము - వ్యాహారము - మృదవము నను నివి వీథ్యంగములు. వీని లక్షణస్వరూప మిక నిరూపిత మగును.

గూఢార్థపద పర్యాయమాలా ప్రశ్నోత్తరస్య వా. 98

యత్రాన్యోన్యసమాలాపో ద్వేధోద్ఘాత్యం తదుచ్యతే
అన్యోన్యాలాపరూపైకా స్యాత్ప్రశ్నోత్తరమాలికా. 99

గూఢార్థపదపర్యాయమాలైకాలాపయోర్ద్వయోః
యథాహి పాండవానందే సా ప్రశ్నోత్తరమాలికా. 100

ఉద్ఘాత్యము రెండు విధములు. గూఢార్థము లయిన పదముల పర్యాయములను మాలారూపమున నిబంధించుట యొక విధము. ప్రశ్నోత్తరములకు సంబంధించిన విధముగా నన్యోన్యసమాలాపము కూర్చుట రెండవ విధము. ఈ విషయమె యిట్లు రూపాంతరమున పరిగ్రాహ్యము. ప్రశ్నోత్తరమాలికా రూపమున అన్యోన్యసమాలాపరూపముగా నుండునది యొకటియు, ఇద్దరి

యాలాపములలో గూఢార్థపదపర్యాయములు మూలము గా నుండుట రెండవ దియు నగును. పాండవానంద మను నాటకము నందు ప్రశ్నోత్తరమాలిక యీ రూపమున నున్నది.

''కా భూషా బలినాం? క్షమా, పరిభవః కోఽయం? స్వకుల్యైః కృతః,
కిం దుఃఖం? పరసంశ్రయో, జగతి కః శ్లాఘ్యో? య ఆశ్రీయతే,
కో మృత్యుః? వ్యసనం, శుచం జహాతి కే? యైర్నిర్జితాః శత్రవః,
కైర్విజ్ఞాతమిదం? విరాటనగరే ఛన్నస్థితైః పాండవైః.'' 101

ఇం దిరువుని సంభాషణము ప్రశ్నోత్తరరూపముగ నున్నది- బల వంతుల కలంకార మేమి? క్షమ. పరిభవ మేమి? తమ వంశమువారు కూర్చి నది. దుఃఖ మేమి? పరుల నాశ్రయించుట. జగమున శ్లాఘ్యు డెవడు? ఆశ్ర యింపబడువాడు. మృత్యు వేమి? వ్యసనము. దుఃఖము విడుచు వా రెవరు? శత్రువుల జయించిన వారు. ఈ విషయము నెవరు గ్రహించిరి? విరాటనగరమున రహస్యముగా నున్న పాండవులు.

అథ విక్రమోర్వశీయే రాజ్ఞో విదూషకస్య సల్లాపే
కామపదార్థప్రశ్నాద్గూఢార్థోఽలక్ష్యతాం నితరామ్. 102

కాళిదాస విక్రమోర్వశీయమునందు రాజు విదూషకుడు సంభాషించు టలో కామపదార్థప్రశ్న గలుగుట వలన నచటి వారి సంభాషణములో గూఢా ర్థము గోచరమగుట భావింపవలెను. అందిట్లున్నది — ''వయస్యా! కాముడంటె యెవరు? నీవుకూడా బాధపడు తున్నావె! వాడు పురుషుడా? స్త్రీయా?" "అనధీనమయిన మనస్సు సుఖములలో ప్రవర్తించును. స్నేహము యొక్క లలితమార్గమే కాముడు.'' ''ఇలా అన్నా తెలియలేదు. కాముడు ఇచ్ఛాప్రభవః ఎవడేది యిష్టపడితే దాన్ని కామిస్తాడు అనేనా?" "అంతే''- ఈ మాటలలో భావిభావ సూచక మయిన గూఢార్థిత భావ్యము. దీని యనంతర మవలగిత మను నంగము ఇట్లు భావ్యము.

యత్రైకత్ర సమావేశాత్కార్యమన్యత్ర్పసాధ్యతే
ప్రస్తుతేఽన్యత్ర వాఽన్యత్స్యాత్తచ్చావలగితం ద్విధా. 103

ప్రస్తుతార్థ సమావేశాదన్యకార్యస్య సాధనం
కార్యా సైకతలీనేతి(?) ప్రస్తుతార్థోపదేశతః. 104

సీతాత్యాగపరీవాదాదన్యకార్యస్య సాధనం
అప్రస్తుతసమావేశాదన్యకార్యస్య సాధనమ్. 105

తవాస్మి గీతరాగేణేత్యాదౌ తత్తు విలోక్యతే
అత్రాప్రస్తుత దుష్యంత మృగయావ్యాజతోఽన్యతః. 106

ప్రవేక్ష్యమాణపాత్రస్య సూచనం తన్నివేశనం
ప్రస్తుతార్థ సమావేశాదేకమన్యార్థసాధనమ్. 107

అన్యదప్రస్తుతార్థస్య ప్రవేశేనాన్యసాధనం

అవలగిత మను వీథ్యంగము రెండు విధములు. ఒక కార్యమున కొకచో సమావేశము వలన నా కార్య మన్యస్థలమున ప్రసాధిత మగునేని యొక విధమగు నవలగిత మగును. ఒక కార్య మొకచో ప్రస్తుతముకాగా నచట నప్రస్తుతసమావేశమున వేరొక కార్యము నిష్పన్న మగునేని యది రెండవ యవలగిత మగును. ఈ యవలగిత భేదముల నిట్లు లక్ష్యము లందు భావింప వచ్చును. ప్రస్తుతార్థసమావేశమున నన్యకార్యసాధన మను మొదటి యవలగితము శాకుంతలనాటకమున "కార్యా సైకతలీనహంసమిథునా" యను శ్లోకమున నున్నది. అచట చిత్రరచనాత్మక మయిన ప్రస్తుతార్థోపదేశమున, అపరాజితాతిరస్కృత స్వరూప మయిన శకుంతలాసఖి మిశ్రకేశి దుష్యంతప్రేమభావమును గుర్తించి మేనకకు దెలియ జెప్పుట వలన కణ్వాపాశ్రమమున ననుకూలత గలిగిన దని సంభావించుట యుక్తముగా నుండును. అప్రస్తుతసమావేశమున నన్యకార్యసాధన ముండుట యను రెండవ యవలగితము నిట్లు భావింప దగును. ఉత్తరరామ చరితములో సీతాత్యాగ పరీవాదము ననుసరించి "తపోవన దర్శనాభిలాష గల సీతను రథముపై నెక్కించి వాల్మీకి తపోవన పరిసరమున దిగబెట్టి రమ్ము" అని రాముడు లక్ష్మణునకు సూచించుటలో నిది భావనీయము కావలెను. శాకుంతలములోని "తవాస్మి గీతరాగేణ" అను దాని యందు నిది యున్నది. ఇచట అప్రస్తుత మయిన దుష్యంతుని మృగయావ్యాజమున ప్రవేశించు పాత్రసూచన మున్నది. కాగా నీ యవలగితము ప్రస్తుతార్థ సమావేశమున నన్యార్థసాధనము మొదటి యవలగితము; అప్రస్తుతార్థప్రవేశమున నన్యసాధన ముండుట రెండవ యవలగిత మని భావించునది. ఇక మూడవది యయిన ప్రపంచ మిట్లుండును.

అసద్భూతం మిథస్స్తోత్రం ప్రపంచో హాస్యకృన్మతః. 108

ప్రపంచస్య స్వరూపం తు నాగానందే విభావ్యతే

ప్రపంచ మను వీథ్యంగస్వరూప మిచట నున్నది. అసద్భూత మయిన పరస్పరస్తోత్రము ప్రపంచము. ఇది హాస్యకారి. ప్రపంచస్వరూపము నాగానంద మున విభావిత మగును. శ్రీహర్ష రచిత నాగానంద నాటకములో

"నిత్యం యో హి పిబతి సురాం జనస్సః
ప్రియాసంగమం చ యః కరోతి
మన్యే ద్వావపి దేవా
బలదేవో వా కామదేవో వా." 109

ఏ జనుడు నిత్యము సురాపాన మొనరించునో సర్వదా ప్రియాసంగమ మాచరించునో వారు గొప్పవారు. వారు దేవులు. బలదేవుడు కామదేవుడుగా వారు గణింప దగినవారు. ఇచట సురాసంభోగసంసక్తుల ప్రశంస అసత్యాయము హాస్యకారియుగా నున్నదనుట స్పష్టము.

శ్రుతిసామ్యాదనేకార్థయోజనం త్రిగతం త్విహ
నటాదిత్రితయాలాపః పూర్వరంగే తదిష్యతే.
ఏతత్ప్రస్తావనాత్మేతి కథ్యతే నాట్యవేదిభిః
త్రిగతం త్విందులేఖాయాం వీథ్యాం రాజ్ఞాఽభిధీయతే. 111

"కింతు కలహంసనాదో మధురో
మధుపాయినాం తు ఝంకారః
హృదయగతవేదనాయాః
తస్యా ను నూపురశ్చరణః". 112

ఇందు త్రిగతస్వరూప మున్నది. పూర్వరంగమునం దిది యుండును. నటాదిత్రితయాలాపము త్రిగతము. శ్రుతిసామ్యమున ననేకార్థయోజన మొనరించుట త్రిగతము. ఇది ప్రస్తావనాత్మక మని నాట్యవేదు లనిరి "ఇందులేఖ" యను పేరు గల వీథిలో నిది యున్నది. అందు రాజిట్లు పలుకును. "ఇది మధురమగు కలహంసనాదమా ? మధుపాన మొనరించిన మధుపముల ఝుంకారమా? వేదన హృదయమునం దుంచుకొనిన ఆమె చరణమంజీరశింజితమా?" నేపథ్యధ్వని విని యిట్లు అనేకార్థయోజన మొనరించుటచే నిది త్రిగతము.

ప్రియైరివాప్రియైర్వాక్యైర్విలోభ్య ఛలనా ఛలం
ఛలం చ వేణీసంహారే భీమార్జునవచో యథా. 113

"కర్తా ద్యూతచ్ఛలానాం జతుమయశరణోద్దీపనః సోఽభిమానీ
రాజా దుశ్శాసనాదేర్గురురనుజశతస్యాంగరాజస్య మిత్రం
కృష్ణాకేశోత్తరీయవ్యపనయనపటుః పాండవా యస్య దాసాః
క్వాస్తే దుర్యోధనోఽసౌ కథయత న రుషా ద్రష్టుమభ్యాగతౌ స్వః."

అప్రియవాక్యములను ప్రియవాక్యములనుగా బలికి విలోభనమున ఛలన మొనరించుట ఛలమను వీథి యంగ మగును. వేణీసంహారనాటకమున భీమార్జునులు గాంధారీధృతరాష్ట్రుల సమీపమున కేగుచు పలికిన పలుకులలో నీ ఛల మున్నది. ఆ పలుకు లిట్లున్నవి. "దుర్యోధను డెచట నున్నాడు? చెప్పుడు మేము కోపమున రాలేదు. చూచుటకు వచ్చినాము. ఆ దుర్యోధనుడు ద్యూతచ్ఛలములకు గర్త, లక్కయిల్లు గాల్చినవాడు,'అభిమాని' దుశ్శాసనాదులకు రాజు, అనుజశతమునకు గురువు, అంగరాజునకు మిత్రము, ద్రౌపది కేశాకర్షణ వస్త్రాకర్షణ సమర్థుడు, పాండవులను దాసులనుగా జేసినవాడు. ఆదుర్యోధను డెక్కడ?" ఇందన్నియు దెప్పిపొడుపు మాటలు. ప్రియవచనములుగా ప్రలోభ పెట్టునవి. కావున ఛలము.

వినివృత్త్యాఽస్య వాక్కేలిః ద్విస్త్రిః ప్రత్యుక్తితోఽపి వా
వాక్యాపరిసమాప్తిర్వా స్యాచ్ఛలార్థాభిధాయినః
అనర్ఘరాఘవే సూత్రి పారిపార్శ్వకయోర్యథా. 115

ప్రత్యుక్తిరూపా వాక్కేలిః సర్వత్రైవం విలోక్యతాం
ప్రక్రాంతవాక్యాసమాప్తిమాత్రరూపా క్వచిద్భవేత్. 116

సకుండలం సకవచమిత్యాదౌ సా విలోక్యతే
ఛలవాక్యాసమాప్తిర్యా సా భవేద్వినివర్తనే. 117

త్వం జీవితం చేత్యాగభ్య రామం ప్రతి సమీరితం
వాసంతికావచః శాంతమిత్యప్రియనివర్తనమ్. 118

వాక్కేలి స్వరూప నిరూపణమున కొన్ని మతభేదము లున్నవి. అన్నియు నిం దున్నవి. "వినివృత్త్యా వాక్కేలిః" అని కొందరి భావము. ప్రక్రాంత మయిన యర్థము సాకాంక్షముగ నుండగనె నివృత్తి సూచించుట, సమాపకక్రియ లేకుండగనె వాక్యము సమాప్తము చేయుట యొక విధమగు వాక్కేలి. రెండు మూడు నాలుగు ప్రత్యుక్తివిశేషముల వలన హాస్యము

సంబంధింప జేయుట వాక్కేలి యని కొందరి మతము. ఛలార్థము చెప్పువాని వాక్యాపరిసమాప్తి వాక్కేలియని కొందరు తలంచిరి. అనర్ఘరాఘవనాటకము నందు సూత్రధారపారిపార్శ్వకుల సంభాషణమున ప్రత్యుక్తిరూపమగు వాక్కేలి సంగతిని దర్శింప వలెను. ప్రక్రాంత మయిన వాక్యమున కసమాప్తిరూప మయిన వాక్కేలి యొకచో నుండును. "సకుండలం సకవచం" అను దానిలో నిది యున్నది. ఛలవాక్యమున కసమాప్తి వినివర్తనమున నుండును. ఉత్తరరామ చరితములో "త్వం జీవితం త్వమసి మే హృదయం ద్వితీయం" అని వనదేవత వాసంతి రాముసుద్దేశించి పలికినప్పుడు తుదకు "శాంతమథవా కిమిహోత్తరేణ" అనుటలో రాము డొనరించిన యప్రియాత్మక మయిన ఛలనివర్తన మున్నది.

అన్యోన్యవాక్యాధిక్యోక్తిః స్పర్ధయాఽధిబలం భవేత్
రామరావణయోరుక్తిః స్యాద్దశగ్రీవనిగ్రహే. 119

గండం ప్రస్తుతసంబంధి భిన్నార్థం సహసోదితం
సహభృత్యగణేత్యాదివాక్యే తత్తు విలోక్యతే. 120

యథా స్వవిజయోక్తిశ్చ పాండుపుత్రజయోక్తికృత్
యథోక్తస్యాన్యథావ్యాఖ్యా యత్రావస్యందితం హి తత్. 121

గృహీతచిత్రఫలకం రాజానమవలోక్య చ
సుసంగతా సాగరికాసల్లాపే తద్విలోక్యతే. 122

ఈ ప్రఘట్టమున అధిబలము - గండము - అవస్యందితము అను మూడు వీథ్యంగము లున్నవి. స్పర్ధచే నన్యోన్యము అధికాధికముగా వాక్యములు పలుకుట అధిబలము. దశగ్రీవనిగ్రహ నాటకములో రామరావణుల వచనవిశేషము అధిబలమున కుదాహరణము. గండము. ప్రస్తుతమునకు సంబంధించిన సహసా సముత్పన్న మయిన భిన్నార్థముగా నుండు వచనము గండ మనదగును. వేణీసంహారములోని "సహభృత్యగణం సబాంధవం" అను శ్లోకమున గండ మున్నది. దుర్యోధనుడు "పాండుసుతం సుయోధనః" అన దలచి "పాండుసుతః సుయోధనం" అని వ్యత్యస్తముగా బలికెను. కర్మకర్తృభావ వ్యత్యాసమున సుయోధనుడు పాండుసుతుని చంపునన్న యర్థము నశించి పాండుసుతుడు సుయోధనుని జంపునన్న యర్థము వచ్చినది. ఇది "సహసోదితం గండం." స్వవిజయోక్తి

పాండుపుత్రవిజయకారి యయినది. అవస్యందితము. యథోక్తవచనమున కన్యథా వ్యాఖ్య యొనరించుట యవస్యందిత మను నంగము. శ్రీహర్షరత్నావళిలో చిత్రఫలకము చేబట్టిన వత్సరాజును చూచి సుసంగతాసాగరికలు సల్లాప మొనరించుటలో నిది గోచరించుచున్నది.

సోపహాసనిగూఢార్థా నాలికైవ ప్రహేలికా
విలోక్యతే నాలికేయం ముద్రారాక్షసనాటకే. 123

"హంహో! బ్రాహ్మణ! మా కుప్య." ఇత్యాద్యరక్ష్య ప్రశ్నయుక్తిభిః
అపరక్తాంశ్చంద్రగుప్తాజ్ఞానామీత్యంతముచ్యతే. 124

అసంబద్ధకథాలాపోఽసత్ప్రలాప ఇతీరితః
మూర్ఖజనసన్నికర్షే హితమపి యత్ర ప్రభాషతే విద్వాన్
స చ గృహ్యతేఽస్య వచనం విజ్ఞేయోఽసత్ప్రలాపోఽసౌ. 125

యథా హి రామాభ్యుదయే సీతాపహరణోద్యతః
మారీచేన సహాయేన నిషిద్ధో రావణః క్రుధా. 126

నాలిక. అసత్ప్రలాపము - ఉపహాసముతో గూడుకొనిన నిగూఢార్థ మయిన ప్రహేలిక - విచిత్రవచనము నాలిక యగును. ముద్రారాక్షస నాటకమున నీ నాలిక యున్నది. అచట "హం హో! బ్రాహ్మణ! మా కుప్య" యని నిపుణకు డనును. చాణక్యదర్శనమునకై యమపటము పట్టిన వాడు రాగా చాణక్యశిష్యుడు శార్ఙ్గరవుడు కాదనెను. "మీ యుపాధ్యాయునకు దెలియని వానిని నేను చెప్పుదును." "మా యుపాధ్యాయుడు సర్వజ్ఞుడు" "అయినచో పుష్ప మెవరి కిష్టను కాదో తెలియునా?" "ఇది తెలియకున్న నేమి" "బాపనయ్యా! కోపింపకుమయ్యా!" వీ రీ విధముగా సంభాషించు నపుడు లోనున్న చాణక్యుడు విని "చంద్రగుప్తునిపై యనురాగము లేనివారిని నేను దెలిసికొంటినని భావము. వీడు నా పంపిన గూఢచారి నిపుణకుడు." "లోనికి పంపుము" అని చాణక్యుడు తలచునంతవఱకు నాలిక యుండుట గ్రాహ్యము.

అసత్ప్రలాపము. అసంబద్ధథాకలాపమున కసత్ప్రలాప మని పేరు. మూర్ఖజనుల సన్నిధిలో విద్వాంసుడు హితము పల్కినను ఆ హితము వారు గ్రహింపరు. అప్పు డా వచన మసత్ప్రలాప మగును. రామాభ్యుదయనాటక

ములో సీతాపహరణోద్యుక్తుడయిన రావణునకు సహాయముగా నుండు మారీచు డెంతగా మంచి చెప్పినను పట్టించుకొనలేదు. కోపపడి మారీచుడు రావణుని నిషేధించెను. ఇచట నసత్ప్రలాపసమన్వయము దర్శించునది.

ప్రాలపద్విపరీతం యదసల్లాపః స ఉచ్యతే
భుక్తా మయా హి గిరయః
స్నాతోఽహం వహ్నినా పిబామి నభః
హరిహరహిరణ్యగర్భాః
మత్పుత్రాః తేన నృత్యామి. 127

అసంబద్ధకథాలాపోఽసత్ప్రలాపోఽత్ర దృశ్యతే

ఇచట అసల్లాపలక్షణ మున్నది. అసల్లాపము అసత్ప్రలాపము. విపరీతముగా బలుకుట యసల్లాపము. ఒకచో మధుపానరతుని మాట లిట్లున్నవి. నేను పర్వతములను దినినాను. నిప్పుతో స్నానమును చేసితిని. ఆకాశము త్రావెదను. హరిహరహిరణ్యగర్భులు నా కొడుకులు. అందువలన చిందులు వేయుదును. ఇచట అసంబద్ధకథాలాపముగా నసత్ప్రలాప మున్నది.

ఇటుపై వ్యాహారము, మృదవము నను రెండు వీథ్యంగములు లక్షణీయములు. అందు వ్యాహార మిట్లున్నది.

అన్యార్థమేవ వ్యాహారో హాస్యలోభకరం వచః. 128

మాలవ్యాం గంతుమిచ్ఛంత్యాం గణదాసవిదూషకౌ
యత్ర సల్లపత స్తస్యా హాస్యలోభకరం వచః. 129

యావద్వీక్షేత రాజానం వ్యాపార స్తత్ర దృశ్యతే

వేరొకకార్యార్థమై హాస్యలోభకర మయిన వాక్యము పలుకుట వ్యాహార మగును. మాలవికాగ్నిమిత్రములో రాజసన్నిధిలో మాలవిక నృత్త మొనరించి నిష్క్రమించు నపుడు గణదాసవిదూషకులు సంభాషించుటలో వ్యాహార మున్నది. వారి సల్లాపము హాస్యలోభకరము. రంగమున భంగిలోనున్న మాలవిక రాజును మరల జూచు వరకు తద్వ్యాపార మచట ప్రసరించి యున్నది. నాట్యాచార్యులయిన గణదాసహరదత్తులు కలహింపడగా గణదాసశిష్య మాలవిక నృత్త మొనరింప వలసి వచ్చినది. ఆ నృత్తము దోషరహితముగా నున్న

దనియు ననవలసి యున్నది. మాలవికనృత్తానంతరము వెడలు నపుడు విదూషకు డాగు మనెను. ఆమె యాగినది. ఉపదేవిశుద్ధపై పోవచ్చునని గణదా సాపెను. ఈమె నృత్తమున దోషమున్నది. ఆ దోష మేమి? అదియె చెప్పుదును చెప్పుడు. దోషము దోషమె అది గుణ మెట్లగును? ఆ దోషమును జెప్పుడు. నృత్తారంభమున బ్రాహ్మణ పూజ చేయవలయును. ఆ పూజ నీమె చేయలేదు. ఇది దోషము. ఇట్టి విదూషకుని మాటవిని మాలవిక నవ్వినది. రాజును చూచినది. రాజును చూచెను. ఇందు కొరకె విదూషకు డట్టి వ్యాహారము సాగించెను. ఇక మృదవ మున్నది.

దోషా గుణా గుణా దోషా యత్ర స్యుర్మృదవం హి తత్. 130

యథా హి నాయకానందే గుణా దోషాయ కీర్తితాః
కస్మైచిత్కపటాయేతి లక్ష్మీముద్దిశ్య కేనచిత్. 131

యథా శాకుంతలే దోషా గుణాయ పరికీర్తితాః
మేదశ్ఛేదకృశేత్యాది మృగయా గుణకీర్తనైః. 132

దోషములు గుణములుగ గుణములు దోషములుగ వ్యవహృతము లగుట మృదవ మను వీథ్యంగ మగును. నాయకానందనాటకములో "కస్మై చిత్కపటాయ" యను శ్లోకమున లక్ష్మి నుద్దేశించి యొకడు పలుకుటలో గుణములు దోషములకై నిరూపితము లయినవి. శాకుంతలనాటకము నందు దోషములు గుణములుగా కీర్తితము లయినవి. "మేదశ్ఛేదకృశోదరం లఘు భవతి" యను శ్లోకమున మృగయాదోషములు గుణములుగా నభివర్ణితము లయినవి. మృగయాగుణ కీర్తన మొనరించుట ఆ సమయమున నావశ్యకము కావున దోషములు గుణీకృతము లయినవి. ఇట్లిచట వీథ్యంగములు నిదర్శితము లయినవి.

## వస్తు ప్రపంచనము

తేషామన్యతమేనార్థం పాత్రం వాఽఽక్షిప్య సూత్రభృత్
ప్రస్తావనాఽంతే నిర్గచ్ఛేత్తతో వస్తు ప్రపంచయేత్. 133

ప్రఖ్యాతం తు విధాతవ్యం నృత్తమత్రాధికారికం
అభిగమ్యగుణైర్యుక్తో ధీరోదాత్తః ప్రతాపవాన్. 134

కీర్తికామో మహోత్సాహః త్రయ్యాస్త్రాతా మహీపతిః
ప్రఖ్యాతవంశో రాజర్షిర్దివ్యో వా యత్ర నాయకః. 135

తత్ర్వయత్నేన కర్తవ్యమితిహాసాదివృత్తతః
యత్తత్రానుచితం కించిన్నాయకస్య రసస్య వా. 136

విరుద్ధం తత్పరిత్యాజ్యమన్యథా వా ప్రకల్పయేత్
ఉపాదేయం చ హేయం చ నిశ్చిత్యాత్యంతమగ్రతః. 137

ప్రకాశయేదుపాదేయం తిరస్కుర్యాత్తథేతరం.

వీథ్యంగములలో నొకదాని యనుసరణమున సూత్రధారుడు వస్తువునో యర్థమునో యాక్షిప్త మొనరింపవలెను. ప్రస్తావన సముచితముగా నిర్వహింపవలెను. ప్రస్తావనానంతరమున నిష్క్రమింపవలెను. ఇది సూత్రధారకార్యము. ప్రస్తావనానంతరము కవి నాటకమున వస్తువును ప్రపంచిత మొనర్పవలెను. విస్తరింపజేసి నిరూపింపవలెను. ప్రఖ్యాత మయిన యితివృత్తము నాధికారికముగా నిబంధింప వలెను. అధికారికవస్తువు నందలి నాయకు డిట్లుండుట యుక్తము. అభిగమ్యగుణయుక్తుడు ధీరోదాత్తుడు ప్రతాపయుతుడు కీర్తికాముడు మహోత్సాహుడు త్రయీరక్షకుడు మహీపతి ప్రఖ్యాతవంశము కలవాడు రాజర్షి యగువాడు నాయకుడుగా నుండునట్లు నిరూపింపవలెను. నాయకు డిందు దివ్యు డయినను కా దగును. ఇతిహాసాదు లందున్న వస్త్వనుసారమున నాటకీయవస్తువును గ్రహించి ప్రయత్నసహితముగ నిబంధింపవలెను. ఆ ప్రయత్న మిట్లున్నది. ఇది కవ్యుపదేశపరము. ప్రాక్తనేతిహాసమునందు నాయకునకేని రసమునకేని యనుచితమగు సంవిధాన ముండునేని విరుద్ధమగు విశేష ముండునేని ఆ యంశమును పరిత్యజింపవలెను. వేరొక విధముగా నా వస్తువును కూర్పవలెను. సముచితముగా నుండునట్లు అవిరుద్ధముగా నుండునట్లు కథావస్తువును కూర్పవలెను. ఇతిహాసాదిగత మయిన వస్తువును మొదటనే సమీక్షించి యుపాదేయమును హేయమును నిశ్చయింపవలెను. ఉపాదేయమును స్వీకరించి ప్రకాశింపజేయదగును. హేయమును విడనాడ వలెను. హేయోపాదేయసమీక్ష యావశ్యకము.

కథాశరీరం విభజేద్బీజబింద్వాదిపంచధా. 138

ముఖాదిపంచభిః సాంగైః నియతం తత్తదాఖ్యయా
పతాకావృత్తమప్యూనమేకాద్యైరనుసంధిభిః. 139

సంధ్యంతరాణి సాంగాని భవేయు రనుసంధయః
సంధ్యంగైరూనమేవాత్ర పతాకావృత్తమావహేత్. 140

తతః సంధ్యంతరాణ్యత్ర యథాయోగం ప్రయోజయేత్
అసంధిమేవ ప్రకరీం సర్వత్రాపి ప్రయోజయేత్. 141

నాటకమున వస్తువును కూర్చుటలో కవి సావధానతకై యిది సంగ్రాహ్యము. కవి కథాశరీరమును బీజ బిందు పతాకా ప్రకరీ కార్యరూపమున పంచధా విభాగింపవలెను. ఆ యా యంగములతో గూడుకొనిన విధమున ముఖ ప్రతిముఖాది పంచసంధుల సంయోజనానుకూలముగా కథాశరీరమును విభక్త మొనరింపవలెను. ముఖసంధి ప్రతిముఖసంధి మొదలగు నామసంకేతములతో నియత మగున ట్లొనరింప వలెను. పతాకావృత్తము నొకటి రెండు మూడనుసంధులు లేకుండగనే నిరూపింపవలెను. సాంగము లయిన సంధ్యంతరము లనుసంధు లగును. పతాకావృత్తమును సంపూర్ణముగా సంధ్యంగములతో నుండున ట్లొనరింపరాదు. కొన్ని సంధ్యంగములు తక్కువగనె యుండవలయును. పిమ్మట సంధ్యంగములను యథాయోగముగా గూర్చునది. ప్రకరీవృత్తాంతమును సంధి రహితముగనె కూర్పవలెను. సంధ్యంగములను కూర్పవలయు స్థలమున యథాయోగముగ గూర్పవలయునే గాని శాస్త్రస్థితి సంపాదనేచ్ఛతో నిబంధింపరాదు. నాటకశాస్త్రమున నిబంధింపవలెనని యున్నది గదా యని నిబంధింపరాదు. సముచితముగ నిబంధింప వలెను.

ఇతివృత్తము విభక్తము కాగా కూర్పవలయు విశేషములను సావధానముగా గుర్తింపవలెను. సూచ్యసూచనమున కగు విష్కంభము కూర్చుటలోని యీ నియమములు పాలనీయములు.

ఏవం విభక్తేతివృత్తస్యాదౌ విష్కంభకం న్యసేత్
అంకం వా విన్యసేద్విద్వాన్ యథావత్కార్యయుక్తితః. 142

ప్రస్తావనాయా మధ్యం యన్నాటకోపక్రమాత్మకం
తదేవాత్రాదిశబ్దేన విష్కంభస్థానమీరితమ్. 143

నీరసం సూచ్యతే యత్ర తత్ర విష్కంభకం న్యసేత్
యత్రాదితో రసస్తత్ర భవేదంకస్తు సాముఖః. 144

అపేక్షితం పరిత్యాజ్య నీరసం వస్తు విస్తరం
యదా సందర్శయేచ్ఛేషం కుర్యాద్విష్కంభకం తదా. 145

యదా తు సరసం వస్తు మూలాదేవ ప్రవర్తతే
ఆదావేవ తదాఽంకః స్యాదాముఖాక్షేపసంశ్రయః. 146

ఈ సూచించిన విధమున నితివృత్తమును విభక్త మొనరించి దాని యారంభములో విష్కంభమును కూర్పవలెను. ఇతివృత్తారంభము నం దంకము నేని కూర్పవలెను. అంకవిష్కంభకముల గూర్చుటలో నియమముల గుర్తించి కార్యయుక్త్యనుసారమున యథాతథముగా గూర్పవలెను. నాటకారంభమున గూర్పవలయు విష్కంభకమునకు నియతస్థానము కలదు. నాటకము నందలి యం కోపక్రమమునకును ప్రస్తావనకును మధ్య విష్కంభము కూర్పవలెను. ఇది విష్కంభస్థానము. ఇదియే "ఏవం విభక్తేతివృత్తస్యాదౌ" అను స్థలము నందలి "ఆదౌ" పదమున సూచితము. అంకారంభమున నీరసకథావస్తువు సూచిత మగు నపుడువిష్కంభకమును గూర్పవలెను. అంకారంభముననే రసమయవస్తు వుండునేని సాముఖముగా నచట నంకమునె నిబంధింప వలెను. నీరస మగు వస్తువిస్తరము పరిత్యజించి మిగిలిన అపేక్షితాంశమును ప్రదర్శింప వలసి యుండగా నచట విష్కంభకము రచింపవలెను. సరసవస్తువు మూలముననె యారంభముననె సంప్రాప్త మయినచో నచట నాముఖాక్షేపసంశ్రయ మగున యంకము నాది యందే కూర్పవలెను. ఇట్లంకవిష్కంభకసంయోజననియమముల గుర్తించునది.

పూర్వవృత్తాశ్రయమపి కించిదుత్పాద్యవస్తు చ
విధేయం నాటకమితి మాతృగుప్తేన భాషితమ్. 147

ప్రాగేవ సీతాహరణాద్యద్విభీషణ వర్ణనం
తద్వస్తూత్పాద్యమేతత్తు రామానందే ప్రదృశ్యతే. 148

నాటకమునందు గూర్పదగు వస్తు విషయమున మాతృగుప్తుని మత మీ విధముగ నున్నది. నాటకవస్తువు విషయమున పూర్వవృత్తాశ్రయముగా నున్నను—పురాణేతిహాసప్రసిద్ధముగా నున్నను కొంత కల్పితవస్తువును కూర్చి నాటకము రచింపవచ్చును. ఇది మాతృగుప్త భాషితము. రామానంద నాటకము నందు రావణుడు సీతను హరించుటకు పూర్వమె విభీషణ విశేషవర్ణనము కలదు. ఈ యంశ ముత్పాద్యము.

## అంక స్వరూపము

ప్రత్యక్షనేతృచరితో బిందువ్యాప్తి పురస్కృతః
అంకో నానాప్రకారార్థసంవిధానరసాశ్రయః. 149

నిర్దిష్ట నేతృచరితో నానారూపప్రయోజకః
అలంకారరసాధారో యః సోఽంక ఇతి కథ్యతే. 150

నాయక దేవీ పరిజన పురోహితామాత్య సార్థవాహానాం
నైకరసాంతరసహితో హ్యంకః ఖలు వేదితవ్యః సః. 151

అంక ఇతి రూఢిశబ్దో భావైశ్చ రసైః ప్రరోహయత్యర్థాన్
నానావిధానయుక్తో యస్మాత్తస్మాద్భవేదంకః
అంకః ప్రబంధచిహ్నత్వాద్రసస్యాశ్రయతోఽపి వా. 152

యత్రార్థస్య సమాప్తిర్యత్ర చ బీజస్య భవతి సంహారః
కించిదవలగ్నబిందుః సోఽంక ఇతి సదాఽవగంతవ్యమ్. 153

నాటకారంభచిహ్న మయిన అంక లక్షణ మిచట నిభాలనీయము. నాయక చరితము ప్రత్యక్షముగా గోచరించుట, బిందువ్యాప్తి పురస్కృతమై యుండుట, నానాప్రకారార్థ సంవిధానరసాశ్రయ మగుట అంకస్వరూపము నానా విధము లయిన ప్రయోజనముల సంవిధానము కల రసమునకు ప్రధాన ప్రతిపాద్య రసమునకు ఆశ్రయముగా నుండుట యని భావము. ఈ శ్లోకనిరూపితమయిన భావమె మరల నిట్లుద్దీపిత మగుచున్నది. నిర్దిష్టనేతృచరితము—నాయకచరితము నిర్దిష్టము కావలెను. ప్రత్యంకమున నది ప్రత్యక్షముగా నిర్దిష్టము కానున్నను ముఖాంకమున నేతృచరితము నిర్దిష్టముకావలెను నానారూపప్రయోజనము కలది కావలెను. ముఖాంకమునందు నానాప్రయోజనముల కానూత్రణము ఉండ వలెను. సముచితవర్ణనాత్మకము లయిన యలంకారములకు, అలంకార్యముగా నెన్నదగిన రసమున కంక మాధారముగా నుండవలెను. ఇట్లున్న నిది యంక మగును. ఇంక నంక సంకేత మీ విధమున నున్నది. నాయకుడు, దేవి, పరిజనము, పురోహితుడు, ఆమాత్యుడు, సార్థవాహు డను వారి నానావిధరసాంతరములతో గూడినదై యంక ముండ వలయు నని తెలియ దగును. ఇంకను అంక మనునది రూఢిశబ్దము. భావములచే రసములచే ప్రయోజనముల ను ప్రరోహింప జేయును. నానావిధానములతో గూడి యుండును. కావుననే యిది యంక మగును. అంకము ప్రబంధచిహ్నము. ఇది ప్రబంధాంకము. రసమున కాశ్రయము. రసాంకము. అంక మున నింకను ప్రయోజన సమాప్తి భాసించును. బీజార్థమునకు సంహారము-ఏక త్రీకరణమును భాసించును. ఇందు బిందురూపార్థ మవలగ్నమై యుండును. ఈ చెప్పిన దంతయు నంకసామాన్యలక్షణము. సర్వాంకములకు సంగత మగును.

ముఖాంకమునకె యుద్దిష్టములు కొన్ని యున్నను శిష్టముల నవశిష్టాంకములకు యథోచితముగ సంగత పరచుకొనుట యుక్తము.

నాటకమున నంకనిబంధనమున రసమే ముఖ్యమయినందున, రసాశ్రయముననె నాటకాదికము ప్రవృత్తమయినందున, రసము నిబంధింప తలంపుననె కవి నాటకాదు లందు ప్రవృత్తి కలవాఁడయినందున ఇతివృత్తమాత్రనిబంధనమున ప్రయోజనము లేనందున రసపరిపోషమున కవి సావధానుడు కావలసి యున్నది. రసనిబంధనైకతానహృదయుఁడగు కవి రసపోషమున నెట్లుండవలయునో యిచట నుపదిష్టమగును.

## రసపోషణము

అంకాశ్రయస్య కర్తవ్యో రసస్య స్థాయినోఽంగినః
పోషో విభావానుభావసాత్త్వికవ్యభిచారిభిః. 154

అనుభావవిభావాభ్యాం స్థాయినా వ్యభిచారిభిః
గృహీతముక్తైః కర్తవ్యం అంగినః పరిపోషణమ్. 155

అత్ర వస్తురసాదీనాం ఏకస్యాభినివేశినః
ఇతరేణోపమర్దస్తు న కర్తవ్యః కదాచన. 156

న చాతిరసతో వస్తు దూరం విచ్ఛిన్నతాం నయేత్.
రసం వా న తిరోదధ్యాద్వస్త్వలంకారలక్షణైః
నోపమాదిరలంకారో న స్యాదతిశయాదికః. 157

అంక ముపక్రాంతము కావున నంకమున రసపోషణప్రకార మీ విధమున నుండవలెను. అంకాశ్రయము స్థాయి యంగి యగు రసమునకు విభావానుభావసాత్త్వికవ్యభిచారి భావములచే పోషము సంపాదింప వలెను. అంగిరసపోషణ విషయమున అనుభావములకు విభావములకు స్థాయిభావమునకు వ్యభిచారిభావములకు గృహీతముక్తరీతి యుండుట యావశ్యకము. ఒక్కపర్యాయము విభావాదులను నిరూపించుట చాలదు. వానిని మరల మరల వర్ణింప వలెను. ఒకప్పుడు గృహీతములై ముక్తములై పునర్గృహీతము లగుట యుక్తము. సందర్భ సముచితముగా విభావాదులను వర్ణింప వలెను. వర్ణింపవచ్చునని యనపేక్షితముగా వర్ణింపరాదు. అట్టి రీతి వలన ప్రకృతము పరిమ్లానకల్ప మగును. వస్తువు శరీరము. రస

మాత్మ. వీనిని యథోచితముగా నభివర్ణింపదగును. అభినివేశమున వస్తువును వి_స్తరించునప్పుడు రసాభిమానమున వస్తువున కుపమర్దము కూర్పరాదు. అట్లే యభినివేశమున రసపరిపోషము కూర్చునపుడు వస్తువి_స్తృతిచే రసమున కుపమర్దము కూర్పరాదు. వస్తురసములలో నొకదాని కితరమున నుపమర్దము కూర్పరాదు. రసపోష మధికముగ సంపాదించుచు వస్తువును దూరముంచి విచ్ఛిన్న మొనరింప రాదు. వ_స్త్వలంకారరూపము లగు వానితో రసమును తిరోధానించుటయు దగదు. రసపరిపోష సమయమున నుపమాద్యలంకారవర్గము కూర్పదగదు. అందును అతిశయోక్త్యాదిక మాయోజింపరాదు. కావున నంకమున రసము నిబంధించుటలో సావధానత యావశ్యకమని భావము.

కాని కొన్ని యంకాలంకారము లుండదగును. వాని నిట్లు గు_ర్తించునది.

క్షమాగుణవదాక్రంద శోభోదాహరణాదయః
అలంకారాః స్యురంకస్య తే స్యుర్నాటకకావ్యయోః. 158

అంకనిబద్ధు లయిన యా యా వ్యక్తులకు దగిన విధమున క్షమాగుణ ముండుట ఆక్రందము శోభోదాహరణాదులు అంకమున కలంకారములగును. అవి నాటకమున కావ్యమున నుండదగును. ఇదివరలో నిరూపితము లయిన నాటకా లంకారములను భావించి యీ యంకాలంకారములను భావించునది.

వీరశృంగారయో రేకః ప్రధానోఽంగీ చ నాటకే
అంగమన్యేఽద్భుతరసః సంధౌ నిర్వహణే చ భవేత్. 159

ఏవం నానావిధరసభావాధికరణే కవిః
అంకే నిషిద్ధం విజ్ఞాయ విధేయం చ ప్రయోజయేత్. 160

నాటకమున నిబంధింపదగు రసముల విషయమున నీ సమీక్ష యావ శ్యకము. ప్రబంధములలో నానారసనిబంధనము ప్రసిద్ధమె. అయినను ఒకరసము నంగిరసముగా నిబంధింపదగును. అప్పుడు నాటకప్రబంధములకు సముత్కర్షము కలుగును. ఇట్లు ధ్వనికారుని యనుశాసన మున్నది. తదభిప్రాయసంవాదమున నిచటి యంశమును భావింపవలెను. వీరశృంగారములలో నొకరసము నాటకమున ప్రధాన మంగి కావలెను. ఇతరరసము లంగముగా నుండనగును. నిర్వహణ సంధిలో నద్భుతరసమును గూర్పవలెను. ఇట్లు నానావిధ రసభావాధికరణ మయిన నాటకమున కవిసావధానుడు కావలెను. ఇందిట్లున్నను ధ్వనికారవిరోధము

భావింపదగదు. "ఏకో రసో౽ంగీక_ర్తవ్యః" వీరశృంగారములలో నొకరసము నంగిగా నొనరించినచో నాటకప్రబంధమున కసాధారణశోభ కలుగునని యిచటి భావము. కాని వీరశృంగారాన్యతరనియమము పరము కాదు. వీరమును ముఖ్యముగా నిబంధించినప్పుడు శృంగారము సముచిత మయిన యంగరసముగా నుండ గలదు. శృంగార మంగిరసముగా నుండగా వీరము సముచితమయిన యంగరసముగా నుండ గలదు. ఇతరరసముల కంతటి సన్నిహిత మయిన యంగభావము యత్న సంపాద్యము. కావున వీరశృంగారనిబంధన మిచట సూచిత మయినది. రసములలో నభిమానాత్మకము లయిన రసములు వీరశృంగారములె. ఇతరరసములలో నింతటి యభిమానాత్మకత యుండదు. కావుననె వీని నిబంధనమున నాటకశోభ యతిశయించునని భావింప దగును. రసనిబంధనమున సావధాను డయిన కవి యంక నిషిద్ధములను గుర్తించి విధేయము లగు వానిని నిబంధింపవలెను. విధేయ నిబంధనము ప్రసక్త మయినప్పు డెల్లను సూచిత మగుచునె యున్నది. నిషేధ్య సూచన మావశ్యకము.

## నిషిద్ధములు

దూరాధ్వానం వధం యుద్ధం రాజ్యదేశాదివిప్లవం
సంరోధం భోజనం స్నానం సురతం చానులేపనమ్. 161

అంబరగ్రహణాదీని ప్రత్యక్షాణి న నిర్దిశేత్

దూరప్రయాణము వధము యుద్ధము రాజ్యవిప్లవము దేశాదివిప్లవము సంరోధము భోజనము స్నానము సురతము అనులేపనము వస్త్రాపకర్షణము మొదలగు వానిని రంగమున ప్రత్యక్షముగా నిర్దేశింపరాదు. ఇట్టివాని ప్రదర్శన ముద్వేగజనకము, జుగుప్సావహము, లజ్జాకరము నగును. కావున వీనిని సూచ్య సూచనారీతుల ననుసరించి విష్కంభాదులచే సూచింప వలెను. సూచింపదగిన వాని యందును నియమపాలన మావశ్యకము.

నాధికారివధః క్వాపి క_ర్తవ్యః కవిభి_స్తథా. 162

ఆవశ్యకం తు యత్కార్యం న త్యాజ్యం తత్ కదాచన
అధికారివధస్యాపి క్వచిత్స్యాత్కల్పనం మతమ్. 163

అర్వాక్ప్రహోరాత్స పునః ప్రత్యుజ్జీవిష్యతే యది.

నాటకప్రబంధనిర్మాత లెప్పుడును అధికారివధము నిరూపింపరాదు. ఆవశ్యకమయిన కార్యము నెపుడును విడువరాదు. ఆవశ్యకమును త్యజించి,

నిరూపింపరాని యాధికారికవ్యక్తివధము నిరూపించి నాటకాదర్శము భంగ మొన రింపరాదు. ఒకప్పు డెప్పుడని యధికారివధకల్పన మొనరింపవచ్చును గాని ప్రహారపాతము వెంటనే యాతడు ప్రత్యుజ్జీవితు డయినట్లు నిరూపింపవలెను. ఇట్టి ప్రత్యుజ్జీవనము నిరూపింపదలచిననె యధికారివధ మంగీకార్యము కాగలదు.

## అంకలక్షణ సంగ్రహము

నాయకస్య యదేకాహచరిత్రప్రతిపాదకః. 164

ఏకప్రయోజనాశ్లిష్టస్తత్రైవాసన్ననాయకః
విదూషకాదిభిః పాత్రైః ప్రయోజ్యశ్చ చతుస్త్రిభిః. 165

సమస్తపాత్రనిష్క్రామావసానోఽంకోఽభిధీయతే
పతాకాస్థానకాన్యత్ర బిందురంతే చ బీజవత్. 166

ప్రయుజ్యతే యది భవేత్తత్రాంక ఇతి కోహలః
ఏవమంకాః ప్రయోక్తవ్యాః ప్రవేశాదిపురస్కృతాః. 167

అంకమునకు సంబంధించిన స్వరూపలక్షణ మింక నీ విధముగ నున్నది. ఒక దినమున నాయకు డాచరించిన చరితము నంకము ప్రతిపాదించునది కావలెను. ఒక ప్రయోజనముతో సంబంధించి యుండదగును. అంకమునందు నాయకు డాసన్నుడై యుండవలెను. విదూషకాదులు మూవురు నలువురు పాత్రలు ప్రయోగించుటకు తగినది కాదగును. అంకాంతమునందు సర్వపాత్రలు నిష్క్ర మింపవలెను. ఇట్లుండగా నిది యంక మగును. ఇందు పతాకాస్థానకము లుండును. అంకాంతమున బీజయుక్త మయిన బిందువు నిరూపితము కావలెను. ఇట్లు ప్రయుక్తమయినచో నిది యంక మగునని కోహలభావము. ఈ విధముగా నంకవిషయమున ననేకుల భావము లనేకవిధముల నిరూపితము లయినవి. వీని నన్నిటిని భావించి సముచితాంశముల సంయోజనమున నంకములను ప్రవేశాది పురస్కృతముగా ప్రతిపాదింపవలెను.

ప్రధానభూతావంకేఽస్మిన్ విష్కంభశ్చ ప్రవేశకః
నాయకైకాహచరితరూప ఆసన్ననాయకః. 168

రసాదినిబిడో బీజ బిందు వ్యాప్తి పురస్కృతః
పాత్రైశ్చ నాయకాసన్నైః ప్రయోజ్యశ్చ చతుస్త్రిభిః. 169

పతాకాస్థానకస్ఫీతో విష్కంభాదిపురస్కృతః
సమస్తపాత్రనిష్క్రామావసానోఽంక ఇతీరితః. 170

అంకము నందు విష్కంభప్రవేశకములు ముఖ్యములు. నాయకు నొక నాటి చరితము నిరూపించునది యగుట, ఆసన్ననాయక మగుట, రసాదినిబిడ మగుట, బీజబిందువ్యాప్తిపురస్కృత మగుట, నాయకాసన్ను లయిన మూవురు నలువురు పాత్రలతో ప్రయోజ్య మగుట, పతాకాస్థానకములతో నతిశయితమై యుండుట, విష్కంభాదిపురస్కృత మగుట, అవసానమున సమస్తపాత్రల నిష్క్రమ ముండుట యనునవి యంకస్వరూపసంపాదకము లని సర్వలక్షణ సంగ్రహము.

## నాటకలక్షణ సంగ్రహము

పంచాంకమేతదవరం దశాంకం నాటకంస్మృతం
వీరశృంగారయోరన్యతరాంగి రసనిర్భరమ్. 171

శోభితం చాప్యలంకారై రుపమారూపకాదిభిః
రామాయణేతిహాసాది సుప్రసిద్ధాధికారికమ్. 172

ఉర్వ్యమర్త్యాది విఖ్యాత ధీరోదాత్తాదినాయకం
అర్థోపక్షేపకై ర్యుక్తం షట్త్రింశద్భూషణోజ్జ్వలమ్. 173

అర్థప్రకృత్యవస్థాతత్సంధిసంధ్యంతరాన్వితం
పతాకాస్థానకయుతం సాంగవృత్తిప్రవృత్తిమత్. 174

అన్యూనదశపంచాంకం నాందీప్రస్తావనాయుతం
యద్రూపకవిశేషః స్యాత్తన్నాటకమితి స్మృతమ్. 175

నాటకవిషయమున నిప్పటి కనేకవిశేషములు సూచితము లయినవి. ఈ ప్రఘట్టమున వాని నన్నిటిని క్రోడీకరించి ప్రదర్శించుట భావనీయము. ఒక విధ మగు నాటకము పంచాంక పరిమితముగా నుండును. నాటకమున నంకము లయిదు కన్న తక్కువగా నుండరాదు. వేరొకటి దశాంక పరిమిత మయిన నాటకము. ఇట్లు నిరూపింపగా నాటకమున నంకములు పదికన్న నధికముగా నుండరాదని సూచిత మగును. పంచాంకములకు పైగా పదియంకములకు లోపుగా నాటకమున నంకము లుండదగునని యభ్యనుజ్ఞ సూచిత మయినది. నాటకమున నుండదగిన సర్వవిశేషముల సంక్లుప్తి యిట్లు సంగ్రాహ్యము.

1. వీరశృంగారాన్యతరాంగిత
2. రసనిర్భరత
3. ఉపమారూపకాద్యలంకారశోభితత్వము

4. రామాయణేతిహాసాదులలోని సుప్రసిద్ధ మయిన యాధికారిక మయిన వస్తు వుండుట

5. దివ్యమర్త్యాదులుగా విఖ్యాతు లయిన ధీరోదాత్తాది నాయకు లతో నుండుట

6. అర్థోపక్షేపకముల సంబంధము

7. షట్త్రింశద్భూషణోజ్జ్వలత

8. అర్థప్రకృతు లవస్థలు తత్సంధులు సంధ్యంతరములతో గూడి యుండుట

9. పతాకాస్థానకసంబంధము

10. సాంగము లయిన వృత్తులతో ప్రవృత్తులతో నుండుట

11. దశపంచాంకవ్యవస్థ

12. నాందీప్రస్తావనాసంబంధము

ఈ విధముగా నుండు రూపకవిశేషము నాటకపదమున వ్యవహార్య మగునని తద్విదులనిరి.

ఏకాహచరితైకాంకః కార్యః చిత్రావలీ యథా
అంకః స్యాద్యాసరార్ధేన యథా గౌరీగృహాభిధః. 176

యద్విక్రమోర్వశీయాఖ్యం తత్పంచాంకం ప్రకల్పితం
షడంకం దృశ్యతే లోకే రామాభ్యుదయనాటకమ్. 177

శాకుంతలాదిసప్తాంక మష్టాంకం నలవిక్రమం
దేవీపరిణయ స్తత్ర నవాంకం నాటకం స్మృతమ్. 178

బాలరామాయణం నామ దశాంకం నాటకం స్మృతం
అతో హి నాటకస్యాస్య ప్రాథమ్యం పరికల్పితమ్. 179

పంచాంకాది దశాంకనాటకము లుండుట లక్షిత మయినది. ఎవరి నాటకము లే విధమున నున్నవో యిందు నిరూపిత మగును. ఇచట సూచితము లయిన నాటకములు శాకుంతలాదుల వలె సుప్రసిద్ధములు. లక్షణకారులు పేర్కొన్న నాటకము లసాధారణములు. కాని యా నాటకములు నేడు లభిం

చుట లేదు. ఒక యంకమున నొకనాటి నాయకచరితము నిరూపించుట యను నది "చైత్రావలి" నాటకమున నున్నది. దినార్ధమున నంకము నిరూపించుట "గౌరీగృహ" మను నాటకమున నున్నది. "విక్రమోర్వశీయ" నాటకము పంచాంక పరిమితముగా ప్రకల్పితమయినది. "రామాభ్యుదయ" నాటకము షడంకపరిమితము. "శాకుంత"లాదికము సప్తాంకమితము. "నలవిక్రమ" నాటకము అష్టాంకపరిమితము. "దేవీపణయము" నవాంకనాటకము, "బాల రామాయణ" మనునది దశాంకనాటకము. ఇట్లు సుప్రసిద్ధనాటకములు లక్షణ సుందరములై యున్నందున రూపకములలో నాటకమునకు ప్రాథమ్యము ప్రక ల్పిత మయినది.

నాట్యవేదం విధాయాదౌ ఋషీనాహ పితామహః
ధర్మాదిసాధనం నాట్యం సర్వదుఃఖాపనోదనమ్. 180
ఆసేవధ్వం తదృషయ స్తస్యోత్థానం తు నాటకం

పితామహుడు మొదట నాట్యవేదమును నిర్మించి సన్నిహితు లయిన ఋషుల నిట్లు పలికెను — ఈ నాట్యము ధర్మాదిసాధనము. ఇది సర్వదుఃఖాప నోదనము. ఋషులు ఈ నాట్యమును సేవింపుడు. దీని నాస్వాదింపుడు. నాట్య సముత్పన్నము నాటకము. నాటకమును భావింపుడు — అని

నాట్యవేదరీతి నిట్లు గ్రహింపవచ్చును. లోక మొకప్పుడు గ్రామ్య ధర్మప్రవృత్త మయినది. మహేంద్రాదులు పితామహసన్నిధికేగి దృశ్యము శ్రవ్యము నగు క్రీడనీయకము కావలె ననిరి. అది ప్రీతిప్రదమై రంజన మొనరించు నని వ్యుత్పత్తిప్రదమై ప్రబోధము కలిగించునని వారి భావము. ఈ కోరికను బ్రహ్మ గుర్తించి సర్వశ్రావ్య మగు నాట్యవేదము నిర్మించెను. సర్వవేదముల నుండి నాట్యవేదము నిర్మించెను. కుశల విదగ్ధ ప్రగల్భ జితశ్రమ ఋషులలో నాట్యవేదమును సంక్రమింపజేసెను. అట్లు సంక్రమింప జేయుటలో పై భావము పితామహుడు సూచించె నని శారదాతనయ భావము.

**తోటకము**

దివ్యమానుషసంయోగో యత్రాంకైరవిదూషకైః. 181
తదేవ తోటకం భేదో నాటకాస్యేతి హర్షవాక్
తదవ్యాపకమిత్యన్యే నాద్రియంతే విపశ్చితః. 182

నవాష్టసప్తపంచాంకం దివ్యమానుషసంగమం
తోటకం నామ తత్ప్రాహు ర్భేదం నాటకసంభవమ్. 183

ఇత్యేక ఆహురాచార్యా అన్యే త్వేవం ప్రచక్షతే
దివ్యమానుషసంయోగస్తోటకం నాటకానుగమ్. 184

నవాంకం తోటకం దృష్టం మేనకానహుషాహ్వయం
తోటకంమదలేఖాఽఽఖ్యంయ త్స్తంభితరంభకమ్. 185

క్రమాదష్టాంకసప్తాంకౌ దృశ్యేతే హ్యావిదూషకౌ
యద్విక్రమోర్వశీయాఖ్యం పంచాంకం తోటకం స్మృతమ్. 186

నాటకతత్త్వము నిరూపించిన పిమ్మట నాటకసంభవ మయిన తోటక విషయమున హర్షాదుల భావనిరూపణ మావశ్యక మని శారదాతనయు డిట్లు నిరూపించుచున్నాడు. తోటకస్వరూపవిషయమున హర్షు డీవిధముగ ననెను. ఇందు దివ్యమానుషసంయోగ ముండును. అంకము నందు విదూషకు లుండరు. ఇట్టిది తోటకము. ఇది నాటకభేదము. ఇది హర్షవాక్కు. ఈ భావమును కొందరు విద్వాంసులు అవ్యాపక మని యంగీకరింపలేదు. హర్షభావ మంగీకరింపని వారు వారి భావము నీ విధముగ నిరూపించిరి. తోటకము నాటకసంభవ భేదము. ఇది దివ్యమానుషసంగమమున నుండును. నవాంకము అష్టాంకము సప్తాంకము పంచాంకముగా నుండును. కొందరిట్లనగా మరికొందరిట్లందురు. దివ్యమానుష సంయోగాత్మక మయిన తోటకము నాటకానుగము. "మేనకానహుష" మను తోటకము నవాంకముగ గోచరించుచున్నది. "మదలేఖ" యను తోటక మష్టాంకముగా నున్నది. "స్తంభితరంభక" మను తోటకము సప్తాంకముగా నున్నది. ఈ రెంటిలో విదూషకులు లేరు. ఇవి యవిదూషకములు. "విక్రమోర్వశీయ"మను తోటకము పంచాంకమితము. ఇట్లు తోటక విషయన నానాభావములు భావనీయములు.

## సుబంధుమతము — నాటకపంచకము

సుబంధుర్నాటకస్యాపి లక్షణం ప్రాహ పంచధా
పూర్ణం చైవ ప్రశాంతం చ భాస్వరం లలితం తథా. 187

సమగ్రమితి విజ్ఞేయా నాటకే పంచ జాతయః
పూర్ణస్య నాటకాస్యాస్య ముఖాద్యాః పంచసంధయః. 188

ఉదాహరణమేతస్య కృత్యారావణముచ్యతే

సుబంధువు నాటకమునకు లక్షణము నిరూపించి యిది యయిదు విధము లగు ననెను. పూర్ణము-ప్రశాంతము-భాస్వరము-లలితము-సమగ్రము అని నాటకమున నయిదు జాతు లుండుట తెలియవలయు ననెను. పూర్ణనాటకమున ముఖాదిసంధిపంచక ముండు ననెను. "కృత్యారావణ" మను నాటకము పూర్ణనాటకము.

ప్రశాంతరసభూయిష్ఠం ప్రశాంతం నామ నాటకమ్. 189

న్యాసో న్యాససముద్భేదో బీజోక్తిర్బీజదర్శనం
తతోఽనుద్దిష్టసంహారః ప్రశాంతే పంచసంధయః. 190

సాత్త్వతీవృత్తిరత్ర స్యాదితి ద్రౌహిణిరబ్రవీత్
స్వప్నవాసవదత్తాఖ్యముదాహరణమత్ర తు 191

ఆచ్ఛిద్య భూపాత్స్వవ్యసనా దేవీ మాగధికా కరే
న్యస్తా యత స్తతో న్యాసో ముఖసంధిరయం భవేత్. 192

న్యాసస్య చ ప్రతిముఖం ససముద్భేద ఉదాహృతః
పద్మావత్యా ముఖం వీక్ష్య విశేషకవిభూషితమ్. 193

జీవంత్యవంతికేత్యేతత్ జ్ఞాతం భూమిభుజా యథా
ఉత్కంఠితేన సోద్వేగం బీజోక్తిర్నామ కీర్తనమ్. 194

ఏహి! వాసవదత్తే! క్వ క్వ యాసీత్యాది దృశ్యతే
సహావస్థితయోరేకప్రాప్త్యాఽన్యస్య గవేషణమ్. 195

దర్శనస్పర్శనాలాపై రేతత్స్యాద్బీజదర్శనం
"చిరప్రసుప్తః కామో మే వీణయా ప్రతిబోధితః
తాం తు దేవీం న పశ్యామి యస్యా ఘోషవతీ ప్రియా". 196

కిం తే భూయః ప్రియం కుర్యామితి వాగ్యత్ర నోచ్యతే
తమనుద్దిష్టసంహారమిత్యాహుర్భరతాదయః. 197

ప్రశాంత మను నాటకము సుబంధువు చెప్పిన వానిలో రెండవది. ఈ నాటకము ప్రశాంతరసవిధానమున భూయిష్ఠముగా నుండును. ప్రశాంత నాటకమునందు నయిదు సంధు లుండును. న్యాసము న్యాససముద్భేదము

బీజోక్తి బీజదర్శనము అనుద్దిష్టసంహారము అనునవి యిందలి సంధుల నామములు. సాత్త్వతీవృత్తి యిందుండునని బ్రహ్మకుమారు డనెను. భాసుని "స్వప్నవాసవదత్తము" అనునాటకము ప్రశాంతనాటకోదాహరణము. యౌగంధరాయణుడు వాసవదత్తను వత్సరాజునుండి విడదీసి, వ్యసనపరీత యయిన వాసవదత్తాదేవిని మగధదేశరాజకుమారి యయిన పద్మావతి హస్తమున న్యాసముగ నుంచెను. ఈ న్యాసము ముఖసంధి యగును. న్యాసమునకు సముద్భేదము ప్రతిముఖ సంధి యగును. వాసవదత్త చనిపోయిన దని పద్మావతిని వివాహముచేసికొనిన వత్సరాజు విశేషక విభూషిత మయిన-తిలక శోభితమయిన పద్మావతి ముఖమును జూచి అవంతిక యయిన వాసవదత్త జీవించియే యున్నదని తెలిసికొనెను. ఇది న్యాస సముద్భేదము. ఉత్కంఠితు దుద్వేగ సహితముగా నామకీర్తన మొనరించుట బీజోక్తి యను మూడవసంధి యగును. "ఏహి! వాసవదత్తే! క్వ? క్వ? యాసి?" వాసవదత్తా! రమ్ము! ఎటుపోయెదవు?. అని వత్సరాజనుట నామకీర్తనాత్మక మయిన బీజోక్తి యయినది. సహావస్థానమున నున్న నాయికా నాయకులు ఒకటి లభింపగా దర్శనస్పర్శనాలాపములచే వేరొకటి యన్వేషించుట బీజదర్శన మను నాల్గవసంధి యగును. "చిరప్రసుప్త మయిన నా కోరిక వీణచే ప్రతిబోధిత మయినది. ఆ నా దేవికి ఘోషవతి ప్రియ. ఆ నా దేవి కానరాదు గదా!" ఇందు బీజదర్శనమును సమన్వయింపవలెను. "కిం తే భూయః ప్రియం కుర్యాం" ఇంక నీకు ప్రియ మేమి యొనరింతు నను వచనము లేకుండుట యనుద్దిష్టసంహార మయిన సందవసంధి యని భరతాదులనిరి. ఇట్లు స్వప్నవాసవదత్తమున న్యాసాదుల సమన్వయము చూచునది.

మాలా నాయకసిద్ధ్యంగగ్లానిః తస్యాః పరిక్షయః
మాత్రావశిష్టసంహారో భాస్వరే పంచ సంధయః. 98

ఏకస్మిన్ నాయకే ఖ్యాతే తత్సామాన్యప్రతాపవాన్
యది స్యాత్ప్రతిపక్షశ్చ సా మాలేతి ప్రకీర్తితా. 199

యథా హి చంద్రగుప్తస్య నందనః ప్రతిపూరుషః
నాయకం ఛలయిత్వేష్టసిద్ధిర్యా పరిపంథినః
ఏషా నాయకసిద్ధిః స్యాన్మారీచేనేవ రావణః. 200
గర్భస్యాంగైర్విమర్దాదిదర్శనం గ్లానిరిష్యతే
కపిభిర్వార్ధిముత్తీర్య లంకావేష్టనమేవ తత్. 201

పరిక్షయో౽త్ర మోహాదిర్నాయకస్య రిపోర్బలాత్
స నాగపాశబంధాదీ రామలక్ష్మణయోరివ. 202

మాత్రావశిష్టసంహారసంధిరేకం తు నాటకే
శత్రుబందీకృతస్త్రీణాం తస్య శత్రోర్వధాదివ. 203

తత్పరీక్షాస్థితిర్మాత్రావశిష్టమితి కథ్యతే
యథా సీతాపరీక్షైవ రావణానంతరే కృతా. 204

భారతీవృత్తిభూయిష్ఠం వీరాద్భుతరసాశ్రయం
భాస్వరం నాటకం బాలరామాయణమిదం యథా. 205

భాస్వరనాటక స్వరూప మిపుడు భావనీయము. రాజశేఖరవిరచిత మయిన బాలరామాయణము భాస్వరనాటకము. భాస్వరనాటకమున పంచ సంధు లీ విధముగ నున్నవి. మాల - నాయకసిద్ధి - అంగగ్లాని - పరిక్షయము - మాత్రావశిష్టసంహారము అని. వీనిలో మాల యిట్లుండును. నాయకు డొకడు ప్రఖ్యాతుడై యుండగా, లోకాసామాన్యప్రతాపము కలిగిన ప్రతినాయకు డొక డుండునేని యది మాల యని ప్రకీర్తిత మయినది. దేవీచంద్రగుప్త నాటకమున నందనుడు ప్రతిపూరుషుడు. ప్రతాపాదులలో నాయకసమానుడు. ఇట్టిది మాలాసంధి. రెండవది యయిన నాయకసిద్ధి యిట్లుండును. నాయకుని వంచన మొనరించి ప్రతినాయకున కిష్టసిద్ధి నొనరించుట నాయకసిద్ధి. మారీచుడు నాయకు డయిన రాముని వంచించి ప్రతినాయకు డయిన రావణుని కిష్టము సాధించెను. గర్భాంకమున నంగములచే విమర్దాదిదర్శనము అంగగ్లాని. వానరులు వారిధిని దాటి లంకానగరము చుట్టుముట్టుట అంగగ్లాని. పరిక్షయ మీ విధమున నుండును. రిపుబలము వలన నాయకునకు మోహాదికము వర్ణించుట పరిక్షయము రామలక్ష్మణులకు నాగపాశబంధాదులు కలుగుట పరిక్షయము. నాటకమున మాత్రావశిష్టసంహారసంధి యిట్లుండును. శత్రుబందీకృత స్త్రీలకు శత్రువధము వలన తత్పరీక్షాస్థితి కూర్చుట మాత్రావశిష్ట మగును. రావణవధానంతరమున సీతాపరీక్ష పరీక్షాస్థితి. ఇట్లు మాలాదిసహిత మయిన భాస్వర నాటకము భారతీవృత్తి భూయిష్ఠముగా వీరాద్భుత రసాశ్రయముగా నుండును. బాలరామాయణము భాస్వర మయినది.

లలితం కైశికీవృత్తిశృంగారైకరసాశ్రయం
ఊర్వశీవిప్రలంభో౽త్ర తదుదాహరణం యథా. 206

విలాసో విప్రలంభశ్చ విప్రయోగో విశోధనం
ఉద్దిష్టార్థోపసంహారో లలితే పంచ సంధయః. 208

విలాసో నాయకాదీనాం యథ ర్తురతిసేవనం
యథా శ్రీవత్సరాజస్య వసంతోత్సవవర్ణనమ్. 208

ఈర్ష్యయా ఛందతో యూనోర్విప్రలంభః పృథక్ స్థితిః
యథా హి వత్సరాజస్య దేవ్యా వాసవదత్తయా. 209

విప్రలంభస్తు యాసాది వత్సరాంతమసంగతిః
యథా శర్మిష్ఠయా దేవ్యా యయాతేర్వర్ష పర్వణః. (?) 210

పరివాదభయాద్దోషశోధనం స్యాద్విశోధనం
యథా రామేణ వై దేహ్యా లంకావాసవిశోధనమ్. 211

యథా హి విక్రమోర్వశ్యాముద్దిష్టార్థోపసంహృతిః
ఊర్వశీయం చిరం గేహే సహధర్మచరీ తవ
భవత్వితీంద్రసందేశ స్తం పురూరవసం ప్రతి 212

లలిత మనునది నాల్గవ నాటకము. ఊర్వశీవిప్రలంభ మిం దుదాహరణము. లలితము నందును పంచసంధులు కలవు. విలాసము - విప్రలంభము – విప్రయోగము – విశోధనము - ఉద్దిష్టార్థోపసంహారము ననునవి యిందలి యయిదు సంధులు. నాయకాదుల ఋతుసేవన రతిసేవనములు విలాసరూపము. శ్రీహర్ష రత్నావళిలో శ్రీవత్సరాజు వసంతోత్సవవర్ణనము ఋతుసేవనాత్మక మయిన విలాసము. విప్రలంభ మిట్లుండును. ప్రేయసీప్రియులు ఈర్ష్యానిమిత్తముగా ఛందోనుసారమున పృథక్స్థితి నుండుట విప్రలంభము. వాసవదత్తాదేవితో వత్సరాజునకు ఈర్ష్యానిమిత్తక మయిన పృథగవస్థాన మున్నది. ఇది యొక విప్రలంభము. శర్మిష్ఠాదేవితో యయాతిమహారాజునకు సంప్రాప్త మయిన వత్సరాంతాసంగతి ఛందోనుసారమున నున్న విప్రలంభము. విశోధన మిట్లుండును. జనాపవాదభయమున దోషశోధన మొనరించుట విశోధనము. రాము డొనరించిన సీతాలంకావాసవిశోధన మీ విశోధనము. ఉద్దిష్టార్థోపసంహార మను నయిదవ సంధి యిట్లుండును. విక్రమోర్వశీయములో నుద్దిష్టార్థోపసంహృతి యున్నది. పురూరవు నుద్దేశించి దేవేంద్రుడు సందేశించుట - ''ఈ యూర్వశి చిరకాలము నీ

యింటిలో నీ సహధర్మచరి యగుగావుత'' మని దేవలోకము నుండి సందేశము పంపుట యుద్దిష్టార్థోపసంహృతి యగును.

సర్వవృత్తివినిష్పన్నం సర్వలక్షణసంయుతం
సమగ్రం తత్ప్రతినిధిః మహానాటకముచ్యతే. 213

సమగ్ర మను నయిదవ నాటక స్వరూప మిందున్నది. సమగ్రనాటకము సర్వవృత్తి వినిష్పన్న మగును. సర్వలక్షణసంయుతము నగును. ఈ సమగ్రనాటకమునకు ప్రతినిధి మహానాటకము సుబంధు నిరూపితమయిన నాటక పంచక మిట్లు నిరూపిత మయినది. ఇంకను వీనిలో నిరూపింప వలసిన విషయములు పరిమితముగా గలవు. అవి యిట్లున్నవి.

ఉపక్షేపః పరికరః పరిన్యాసో విలోభనం
ఏతాన్యంగాని కార్యాణి సర్వనాటకజాతిషు. 214

యుక్తిః ప్రాప్తిః సమాధానం విధానం పరిభావనం
ఏతాన్యవశ్యకార్యాణి ప్రశాంతే నాటకే బుధైః. 215

ఆజ్ఞాపవాదః సంఫేటః ప్రసంగో విద్రవస్తథా
సంగ్రహశ్చేతి సాంగాని సమ్యగ్యోజ్యాని భాస్వరే 216

విరోధం ప్రణయం చైవ పర్యుపాసనమేవ చ
పుష్పం వజ్రం చ బధ్నీయాదవశ్యం లలితే సుధీః. 217

సర్వేషాం యత్ర రూపాణి దృశ్యంతే వివిధాని చ
నాటకం నృత్తపారాఖ్యం తత్సమగ్రమితీరితమ్. 218

ఉపక్షేపము పరికరము పరిన్యాసము విలోభనము నను సంధ్యంగము లను సర్వనాటకజాతు లందును నిబంధింప వలెను. యుక్తి ప్రాప్తి సమాధానము విధానము పరిభావన మనువానిని ప్రశాంతనాటకమున బుధు లవశ్యముగా నిరూపింపవలె. భాస్వరనాటకము నందు ఆజ్ఞ అపవాదము సంఫేటము ప్రసంగము విద్రవము సంగ్రహము అను వానిని నితరాంగసహితముగా చక్కగా నాయోజన మొనరింప వలెను. లలితనాటకము నందు విరోధము ప్రణయము పర్యుపాసనము పుష్పము వజ్రము నను వాని నవశ్యముగా నిబంధింప వలెను. సమగ్రనాటకము నృత్తపార మను నామమున నున్నది. సర్వనాటకములకు సంబంధించిన వివిధములగు రూపము లీ సమగ్రమున నుండును. ఇది యంతయు

సుబంధుసూచిత మయిన వివేకము. సుబంధు గ్రంథము లభింపలేదు. సుబంధు బంధువై శారదాతనయుడె సూచించెను.

## ప్రకరణలక్షణము

ఇతివృత్తమథోత్పాద్యమత్ర ప్రకరణే మతం
వణిక్సచివవిప్రాణామేకః స్యాత్తత్ర నాయకః. 219

ధీరశాంతశ్చ సాపాయో ధర్మకామార్థతత్పరః
శేషం నాటకవత్సంధిప్రవేశకరసాదికమ్. 220

మాధవో ధీరశాంతశ్చ ద్విజాతిః కామతత్పరః
అపాయోఽఘోరఘంటాదివ్యాపారోఽత్ర విభావ్యతే. 221

ప్రకరణ మనునది రూపకములలో రెండవది.

దీనిలో నితివృత్త ముత్పాద్యము. పురాణాదిప్రసిద్ధము కాదు. కవికల్పితము. ఇందు వణిక్కు - సచివుడు - విప్రుడు — వీరిలో నొకడు నాయకుడు కాదగును. ధర్మకామార్థతత్పరు డయిన ధీరశాంతుడు నాయకు డగును. ఈతడు "సాపాయః" అపాయాంతరిత మయిన కార్యసిద్ధి కలవాడుగా నిబద్ధుడు కావలెను. మిగిలిన లక్షణ మంతయు నాటకము నందువలె నుండదగును. సంధిబంధము విష్కంభ ప్రవేశకాదులు పాత్రప్రవేశాదులు రసాదినిబంధనము సర్వము నాటకము నందు వలె నుండదగును. భవభూతి మాలతీమాధవములో మాధవుడు నాయకుడు. అతడు ధీరశాంతుడు. ద్విజాతి. కామతత్పరుడు. అఘోరఘంటాదివ్యాపార మపాయము. ఈ యపాయము తొలగిన యనంతరము మాధవునకు మాలతీ ప్రాప్తి వర్ణిత మయినది. ఇట్టి యిది ప్రకరణము. ఇం దింకను విశేషములు కలవు.

నాయికా ద్వివిధా నేతుః కులస్త్రీ గణికా తథా
క్వచిదేకైవ కులజా వేశ్యా క్వాపి ద్వయం క్వచిత్. 222

కులజాఽఽభ్యంతరా వేశ్యా బాహ్యా నాతిక్రమోఽనయోః
ఆభిః ప్రకరణం త్రేధా ద్వాభ్యాం సంకీర్ణ ముచ్యతే. 223

సంకీర్ణం తత్ప్రకరణం యత్స్యాద్ధూర్తసమాకులం
వేశ్యా కులస్త్రియోర్యోగో న స్యాత్ప్రకరణే స్వతః. 224

శిల్పాదివ్యపదేశేన భవేద్వేశ్యాసమాగమః
భాషేత ప్రాకృతం వేశ్యా సంస్కృతం కులనాయికా. 225

ప్రకరణమున నాయకు డగువానికి నాయిక రెండు విధముల నుండును- కులవనిత యని, గణిక యని. కొన్ని ప్రకరణములలో కులజనాయిక యొక్కతయే యుండును. కొన్నిటిలో వేశ్య యొకర్తుకయె నాయికగ నుండును. ఒకొక్కచో కులవనిత వేశ్యయను నిద్దరు నాయికలుగ నుందురు. కులజ యనగా అభ్యంతర; అంతఃపురముననుండు గృహిణి. వేశ్య యనగా బాహ్యా వనిత. వీరి స్వభావములకు వ్యతిక్రమము సముచితము కాదు. వేశ్య యభ్యంతర యగుట, కులజ బాహ్యా యగుట యుక్తముకాదు. నాయికల యునికి ననుసరించి ప్రకరణము మూడు విధము లగును. కులజయె యున్న ప్రకరణము, వేశ్యయె కల ప్రకరణము, వేశ్యాకులజ లిద్ద రున్న ప్రకరణము. వేశ్యా కులజ లిద్దరున్నచో సంకీర్ణ ప్రకరణ మగును. సంకీర్ణప్రకరణము ధూర్తసమాకులము. ప్రకరణమున వేశ్యాకులవనితల సంబంధము స్వభావసహజముగ నుండదు. శిల్పాదివ్యపదేశమున వేశ్యాసమాగమ ముండును. వేశ్య ప్రాకృతము భాషించును. కులనాయిక సంస్కృతము భాషించును. ఇంకను ప్రకరణమున జ్ఞాతవ్యములు కలవు.

యత్తు కవిరాత్మబుద్ధ్యా వస్తు శరీరం చ నాయకం చైవ
స్వయముత్పాద్య విరచయే త్తద్జ్ఞేయం ప్రకరణం నామ. 226

దాస విట శ్రేష్ఠియుతం వేశ్యాస్త్ర్యుపచారకారణోపేతం
మందకులస్త్రీచరితం కావ్యం కార్యం ప్రకరణే తు. 227

మధ్యమపురుషైర్నిత్యం యోజ్యో విష్కంభకోఽత్ర తత్వజ్ఞైః
సంస్కృతవచనానుగతః సంక్షేపార్థః ప్రవేశకవత్
ఇతి ప్రకరణే శుద్ధవిష్కంభో భోజనిర్మితః. 228

నోదాత్తనృపోపేతం న దివ్యచరితం న రాజసంభోగః
బాహ్యాజనసంప్రయుక్తం విజ్ఞేయం ప్రకరణం నామ. 229

ఈ ప్రఘట్టార్థము నాట్యవేదసంవాది. నా నాట్యవేదమున నిరూపితార్థ మిచట సహకారి. కావ్యనిర్మాత యగు కవి యాత్మశక్తి ననుసరించి

కావ్యవస్తు వనదగు సాధ్యఫలమును, శరీర మని యనదగిన అట్లు వ్యవహరింప దగిన సాధ్యఫలోపాయ మయిన కావ్యాభిధేయ వస్త్వాదికమును స్వయముగ నుత్పాదించి రచించునేని యది ప్రకరణమని తెలియ వలయును. కవి ప్రతిభా సముత్పన్నవస్తుక మౌత్పత్తికము. ఔత్పత్తిక వస్తు వున్నందున నిది ప్రకరణము. కతిపయ యువకవులు వస్తువును సముత్పాద్య మొనరింపరు. ప్రకరణము నిర్మా ణింపదలతురు. వారనుత్పాద్యము కూర్చిన ప్రకరణము కాదు. వారేమిచేయ వలయును? వా రనార్ష వస్తువును పరిగ్రహింప వలెను. పురాణాదు లార్షములు. పురాణవ్యతిరిక్తము లయిన బృహత్కథాదు లనార్షములు. తదుపనిబద్ధము లయిన కథలను వారు స్వీకరింప వచ్చును. వారు వారి కావ్యముల నాహార్యముగ నేని నిర్మింపవచ్చును. పూర్వకవి కావ్యముల నుండి వస్తు వాహరించుకొని వారు రూపించిన నది యభూతగుణయుక్తము కాగలదు. వారట్లాహరించిన వస్తు వాహార్యము. ఇతరకవులు కూర్చిన వాని నుండి తెచ్చికొనిన కథాంశము కవిత్వ మగునా? అప్పు డట ప్రకరణమను వాచోయుక్తి సంగత మగునా? అగును. అదియు ప్రకరణ మగును. అందుననె యుత్పన్నబీజవస్తుకము ప్రకరణ మనిరి. ఉత్పన్నము పూర్వప్రసిద్ధ మయిన కావ్యము. అందలి బీజము నందలి వస్తువు కలది యుత్పన్నబీజవస్తుకము. అదియు నభూతగుణయుక్తమె. కావున ప్రకరణ మగును. "ప్రకరోతి తదితి ప్రకరణం" దాని నిది ప్రకర్ష కలుగు నట్లొనరించి నందున ప్రకరణము. ఇట్లే పూర్వకవి సముత్ప్రేక్షితము లందును కవి యధి కావాపము కూర్చి ప్రకరణ మొనరింప వచ్చును.

ప్రకరణమున నుండదగు కావ్యము నీ విధముగా గూర్పదగును. దాస విట శ్రేష్ఠి యుతము వేశవనిత యుపచారకారణోపేతము మందకులస్త్రీచరిత ముగా నీ కావ్యముండు నని మూలార్థము. దీని వివృతికై యభినవవివృతి యభినవభారతి యపేక్షితము. నాట్యవేదాభినవభాష్యము నుండి యీ యపేక్షి తాంశము ఉద్ధృతము లయినవి. శిష్టవిశిష్టాంశముల కదియె పర్యాప్తము. ప్రక రణమున కంచుకిస్థానమున దాసుడు, విదూషక స్థానమున విటుడు, అమాత్యస్థాన మున శ్రేష్ఠి యుండ దగును. వేశ్యావాటమునకు వేశమని పేరు. అందలి వారు వేశ వనితలు. వారి యుపచారవిశేషములు వైశికాధికారమున నిరూపితములు. వేశోప చారము కారణముగా శృంగార ముండును. అట్టి శృంగారము ప్రకరణమున నావ శ్యకము. ఇది యిట్టిదయ్యు మందకులస్త్రీ చరితముగా నుండవలెను. కులస్త్రీవిషయ మయిన చేష్టితము మందముగనె యుండవలెను. అభినవగుప్తుని యుపాధ్యాయు

లిట్లనిరి. మందకులము లందలి స్త్రీల చరితమునె ప్రకరణమున నిరూపింపవలెను. కావున ప్రకరణమున కులాంగనయు మందకులయె యగునని దర్శి మయినది. ప్రకరణవిష్కంభము మధ్యమపురుషయోజ్యము. సంస్కృత వచనా గతము. ప్రవేశకము వలె సంక్షేపార్థమును. "విష్కంభయతి - ఉపస్తంభయ తీతి విష్కంభః" విష్కంభము వస్తువును సాధారము చేయును. ప్రతిష్ఠితము చేయును. ఇట్లొనర్చుట నుపస్తంభ మనవచ్చును. విష్కంభకము శుద్ధ మః సంకీర్ణ మని రెండు విధములు. కేవల మధ్యమ పాత్ర ప్రయుక్త మయినచో శుద్ధవిష్కంభము. నీచ మధ్యపాత్ర ప్రయుక్త మయినచో మిశ్రవిష్కంభము లేదా సంకీర్ణ విష్కంభము. ప్రకరణమున శుద్ధవిష్కంభమును భోజదేవు డుండుట సంభావించెను.

అర్థక్రియాకర్తృత్వతనె కర్తవ్యముగా నభిసంధాన మొనర్చుకొని ప్రవేశక విధముననె విష్కంభకమును సమాయోజన మొనరింపవలెను. సంధు సంక్షేపము ననుసరించి యర్థముల సంక్షేపము ననుసరించి విష్కంభకమును కూర్పవలెను. ఇందు సంధుల సంక్షేపానుసంధాన మావశ్యకము. యుద్ధము రాజ్యభ్రంశము మొదలగునవి యన్నియు కావ్యార్థములు. వాని క్రియార్థానుసంధానమె యర్థక్రియాపేక్ష. ఇట్టి యభిపేక్షతో విష్కంభసంయోజన మపేక్షితము.

ఇంకను ప్రకరణ మిట్లుండును. ఇది యుదాత్త నృపోపేతము కాదు. ఇందు దివ్యచరిత ముండదు. రాజసంభోగ ముండదు. బాహ్యజనసంప్రయోగముననె యుండును. ప్రకరణ మిట్లే యుండునని గుర్తించునది. దీని స్వరూప వివేక మిట్లుండును. ఈ ప్రకరణమున విప్రవణిక్సచివులు పురోహితామాత్య సార్థవాహు లుందురు. కావున నానారససంయుక్త మయిన చరితనిబంధన ముండును. కావున ప్రఖ్యాతోదాత్తనాయకము కాదు. ఉదాత్తనాయకతా నిషేధమున నాటకవైపరీత్య మర్థసమాయాత మగునని, నాటకమున దేవవ్యక్తి నాయకుడుగా నుండుట యుక్తము కానందున ప్రకరణమున దేవవ్యక్తి నాయకుడుగా నుండవచ్చునని యాపాదించుట తగదు. "న దివ్యచరితం" దీనినే సూచించును. ప్రకరణమున దివ్యచరితము నిబంధింపరాదు. నాటకము దివ్యాశ్రయోపేతము కావున దేవవ్యక్తులు ప్రయోజ్యులుగా నం దుండవచ్చును. ఆదేశరహితముగా నాయకు నాశ్రయించి దివ్యుల చరితము నం దుండ వచ్చునని

ప్రసక్తము కావచ్చును. కాని యదియు ప్రకరణమున నిషిద్ధ మగుచున్నది. నాటకము లోని దేవులు ప్రధానాశ్రయమున నుందురు. తుల్యయుక్తి ననుసరించి పరిశీలింపగా దేవుల వలె నప్రధానముగ నయిన రాజప్రవేశ మిందుండ దగునని యాశంక యుదయింప వచ్చును గాని యదియు నివారింప దగినదె. అందు కొఱకె రాజసంభోగ మిం దుండ దగదనుట. వారి భోగస్పర్శల కిం దవకాశము లేదు. విప్రవణిక్సచివాదుల భోగసంభోగముల నిం దభ్యూహించి నిబంధింప వలెను. అందునకె రాజ సంభోగనిషేధమె నిరూపిత మయినది. ప్రకరణము బాహ్యజనసంప్రయుక్తము కావలయునే కాని కంచుకి మొదలయిన యంతఃపుర పరిజను లిందు నియుక్తులు కారాదు. కంచుకి ప్రభృతు లంతఃపురోచితులు. తద్వ్యతిరిక్త బాహ్యజనులె యిందుందురు. ఎవరెవ రెట్టెట్టి వా రిందుండ దగుదురో "దాసవిటశ్రేష్ఠియుతం" శ్లోకమున నిరూపిత మయినది. ఇంకను ప్రకరణ నియతి యిట్లున్నది.

శకారః కుట్టినీ చేటీ ధర్మశాస్త్ర బహిష్కృతాః
విటచేటాదయో బాహ్యా నిత్యం ప్రకరణే మతాః. 230

వేశోపచారకుశలో మధురో దక్షిణః కవిః
ఊహాపోహక్షమో వాగ్మీ చతురస్రో విటో మతః. 231

ఉజ్జ్వలవేషాభరణః కుప్యత్యనిమిత్తతః ప్రసీదతి చ
ప్రాకృతభాషాచారో భవతి శకారో బహుగుణాఢ్యః. 232

అగమలింగవిహీనం దేశ కుల న్యాయ లోక విపరీతం
వ్యర్థైకార్థమపార్థం భవతి హి వచనం శకారస్య. 233

మధ్యమపురుషైర్యోజ్యః శుద్ధో విష్కంభకస్తు తత్త్వజ్ఞైః
సంస్కృతవచనానుగతః ప్రయోజనార్థః ప్రవేశకస్తద్వత్. 234

ఉత్పాద్యమితివృత్తం తు ధీరః శాంతశ్చ నాయకః
అపాయబహులక్లేశధర్మకామార్థతత్పరః. 235

సముచ్చయవికల్పాభ్యాం ప్రాప్తవేశకులాంగనం
శకార విట చేటాది తత్తత్పాత్ర సమాకులమ్. 236

రాజసంభోగసంకీర్ణం విష్కంభాదివినాకృతమ్.
అన్యూనాధికపంచాంకశాఖ్యాదిలక్షణసంయుతమ్. 287

ఈదృశం రూపకం యత్తు తద్వై ప్రకరణం భవేత్

ప్రకరణము నందుండదగిన యీ విధానములు గూడ భావింపదగును. శకారుడు కుట్టిని చేటి ధర్మశాస్త్రబహిష్కృతు లయిన బాహ్యజనులగు విటచేటాదులు నియతముగా ప్రకరణమున నుండదగుదురు. కుట్టిని-కుట్టని వేశ్యమాత శంభలి యందురు. విటుని లక్షణ మిట్లుండును. ఈతడు వేశోపచారకుశలుడు. మధురస్వభావుడు. దక్షిణుడు. తా నందుకై యాశ్రయించు వారి యందరి యందును సమాన ప్రవృత్తి కలవా డగును. కవియు నగును. ఊహాపోహ సమర్థుడు నగును. వాగ్మియు నగును. నలుముఖముల వ్యవహరింప గల వాడగును. ఇట్టివాడు విటుడు శకారుడు బహుగుణాఢ్యుడు. ఉజ్జ్వలవేషాభరణుడు. అకారణముగ కోపించును. అహేతుకముగ ప్రసన్నుడు నగును. శకారుడు ప్రాకృతభాషాచారుడు. శకారుని వచన మాగమలింగ విహీనము. దేశవిరుద్ధము - కులవిపరీతము - న్యాయాపేతము-లోకవి రుద్ధము-వ్యర్థము-ఏకార్థము-అపార్థము - శకార బహుల మయిన భాష మాటలాడును. ఇట్టివాడు శకారుడు.

మధ్యమపురుషయోజ్య మగు శుద్ధవిష్కంభము సంస్కృతవచనానుగతముగా ప్రయోజనావహముగా నుండునట్లు కూర్పవలెనని, ప్రవేశకము నట్లే నిబంధింపవలెనని యిదివరలో సూచిత మయినను సర్వార్థక్రోడీకారమున కిచట మరల నిరూపితము. సూచితముల నన్నిటి నిట్లు క్రోడీకరింపనగును.

1. ఉత్పాద్యమగు నితివృత్త ముండుట
2. ధీరశాంతుడు నాయకు డగుట
3. అపాయబహుల క్లేశములతో నుండుట
4. ధర్మకామార్థతత్పరత్వము
5. వికల్పసముచ్చయములతో వేశ్యాకులస్త్రీసంబంధము
6. శకారవిటచేటాదిచేష్టాసమాకులము
7. రాజసంభోగ (సంకీర్ణ ?) రహితము.

ఇట్టివివి ముఖ్యరూపములు. విష్కంభాదివిషయమున, సంకనియమ విషయమున గ్రాహ్యాములు సంగ్రాహ్యాములు. పది యంకముల కధికము కాకుండుట, అయిదంకములకు తక్కువ కాకుండుట యను లక్షణసంగతిని భావించునది. ఇట్టి రూపకము ప్రకరణము. ఇంకను సంభావ్యములగు విశేషములను నాట్యవేదము ప్రకరణసమీక్షలో గుర్తింపవచ్చును. గృహవార్త యుండునేని వేశ్య తగదు. వేశ్యయున్నచో కులసతీసంగమము తగదు. కారణయుక్త్యా వేశ్యా కులస్త్రీయోగము తగును.

పద్మావతీపరిణయో విప్రస్య చరితం భవేత్. 238

తథైవ మృచ్ఛకటికా వణిజాం చరితం భవేత్
కులస్త్రీనాయికం తత్తు మాలతీమాధవాభిధమ్. 239

యథా తరంగదత్తాఖ్యం గణికానాయికం కృతం
తథైవ మృచ్ఛకటికా విహితోభయనాయికా. 240

పద్మావతీపరిణయ మను ప్రకరణము విప్రచరితము కలది. మృచ్ఛకటిక వణిక్చరితము కలది. మృచ్ఛకటికనాయకుడగు చారుదత్తుడు బ్రాహ్మణుడే. ఆతడు వాణిజ్యవ్యవహారి యని యభ్యూహ్యము. మాలతీమాధవ ప్రకరణము కులస్త్రీ నాయికకము. తరంగదత్తప్రకరణము గణికానాయికముగా నిర్మితము. మృచ్ఛకటికలో చారుదత్త భార్య ధూతాదేవి యున్నది. ఆమె రంగప్రవిష్ట కాకున్న నభ్యూహ్యా. కాపున నా ప్రకరణ ముభయనాయికము. ఇట్లు ప్రకరణ లక్షణము యథోక్తముగా నిరూపిత మయినది.

## నాటికాలక్షణము

నాటకస్య ప్రకరణస్యోభయోః సంకరాత్మికా
లక్ష్యతే నాటికాఽప్యత్ర సంకీర్ణాన్యనివృత్తయే. 241

ప్రఖ్యాతో ధీరలలితః శృంగారోఽంగీ సలక్షణః
నాయకో ధీరలలితో వృత్తముత్పాద్యమేవ చ. 242

శృంగారోఽంగీ రసోఽంగాని వీరరౌద్రాదయో మతాః
వృత్తిశ్చ కైశికీ స్యాంగైర్నర్మస్ఫుంజాదిభిర్యుతా. 243

దేవ్యా ప్రధానయా నేతు స్తత్సదృశ్యా చ ముగ్ధయా
సంకరోఽత్రానురాగోఽపి నవావస్థో భవే త్తయోః. 244

దేవీభయేన సాశంకో నేతా ముగ్ధాసమాగమే.

నాటిక యిందు లక్షిత మగును. నాటకము ప్రకరణము అను రెండిటి సాంకర్యమున నాటిక కలుగును. ఇది తదుభయసంకరాత్మకము. నాటకప్రకరణముల సాంకర్యమున నాటిక యుత్పన్న మగునేని యితరరూపకముల సాంకర్యమున నితరసంకీర్ణములు నుదయింపవచ్చును గదా! అట్లు కాదు. సంకీర్ణాన్య నివృత్తికై నాటిక యిచట నిరూపితము. ఎన్ని సంకీర్ణము లయినను గలుగు భేదము నాటికయె; ఇతరనామము లక్కరలేదు. నాటికలో నాయకుడు ప్రఖ్యాతుడు ధీరలలితుడు. శృంగారము సర్వలక్షణముల గూడి యిం దంగిరసముగా నుండును. నాయకుడు ధీరలలితుడుగనె యుండదగును. వృత్త ముత్పాద్యము కావలెను. శృంగార మంగిరసము కాగా వీరరౌద్రాదు లంగరసములుగా నుండదగును. నర్మస్ఫుంజాదిస్వాంగములతో గూడిన కైశికీవృత్తి యిందుండదగును. నాయకునకు ప్రధానముగా నొక దేవి యుండును. ఆమె పట్టపుదేవి. ఆమెతో సమానముగా నొక ముగ్ధయు నుండును. దేవి, ముగ్ధ–ఇద్దరు నుందురు గావున నిం దనురాగము కూడ సంకరరూపమున నుండును. వారి యనురాగము నవావస్థతో నుండును. నాయకుడు ముగ్ధాసమాగమమున దేవీభయమున శాశంకాసహితుడుగా నుండును. నాటకప్రకరణలక్షణముల సాంకర్య మిందుండుట యభ్యూహించునది.

చత్వారః సంధయో లోపోఽవమర్శస్య భవిష్యతి. 245

న విటః పీఠమర్దశ్చ సహాయౌ భవతః క్వచిత్
నేతుః స్యాన్నర్మసచివో విరూపస్తు విదూషకః. 246

కైశ్చిన్నాటకధర్మైస్తదవిరోధిభిరాశ్రితం
స్త్రీప్రాయపాత్రం దేశస్థవర్ణనాకల్పశోభితమ్. 247

రూపకం చతురంకం యన్నాటికేత్యభిధీయతే

నాటికలో ముఖప్రతిముఖ గర్భ నిర్వహణసంధులు నాలుగే యుండును. అవమర్శ సంధి యుండదు. ఇందెచ్చటను విటుడు కాని పీఠమర్దుడు కాని

సహాయముగా నుండరు. నాయకునకు నర్మసచివు డొకడుండును. అతడు విరూపుడు. వాడె విదూషకుడు. ఈ చెప్పిన యంశముల కవిరుద్ధముగా నుండు కొన్ని నాటకధర్మములు నిందుండును. ఇందు పాత్రలు స్త్రీప్రాయముగా స్త్రీబహుళముగా నుందురు. దేశవర్ణనము ఋతువర్ణనములతో నిదిశోభితమై యుండును. ఇట్టి యీ రూపకము చతురంకము కాగా నిది నాటిక యయినది. ఇంకను నాటికలో నీ విశేషము లుండ దగును.

అత్రోత్పాద్యేతివృత్తత్వాత్ శృంగారాదిరసత్వతః. 248

ప్రఖ్యాతనృపనేతృత్వాత్ షట్త్రింశద్భూషణత్వతః
తుల్యత్వం నాటకేనాపి తథా ప్రకరణేన చ. 249

నాటికాయాః స్మృతం తత్ర విశేషోఽయముదాహృతః
తదుదాహరణం రత్నావలీ చ ప్రియదర్శికా. 250

సైవ ప్రవేశకేనాపి విష్కంభేన వినాకృతా
అంకస్థానీయవిన్యస్త చతుర్యవనికాంతరా
ప్రకృష్టప్రాకృతమయీ సట్టకం నామతో భవేత్. 251

ఈ నాటిక నాటకతుల్యము ప్రకరణతుల్యముగా సంభావిత మగుటలో కొన్ని హేతువు లీ విధముగ గలవు. ఉత్పాద్యేతివృత్తత్వము శృంగారాదిరసత్వము ప్రఖ్యాతనృపనేతృత్వము షట్త్రింశద్భూషణత్వము ననునవి నాటక ప్రకరణములందు నిందు సమముగ నున్నవి. నాటకలక్షణములు కొన్నియు, ప్రకరణలక్షణములు కొన్నియు నిందున్నందున నిది నాటిక. ఇందలి విశేషములు నిదర్శితము లయినవి. శ్రీహర్ష రత్నావలి నాటిక. ప్రియదర్శిక నాటిక.

ఈ ప్రసంగముననె సట్టకము లక్షణీయము. నాటికయే ప్రవేశక రహితము విష్కంభక రహితము నయినచో, అంకస్థానీయములుగా నాలుగు యవని కాంతరములు విన్యస్తము లయినచో సట్టక మను రూపక మగును. ఇది యంతయు ప్రకృష్టప్రాకృత మయముగా నుండును. మిగిలిన లక్షణవిశేష మంతయు నాటికలో వలె నిందు గ్రాహ్యము.

### భాణ లక్షణము

భాణస్తు ధూర్తచరితం స్వానుభూతం పరేణ వా

యత్రోపవర్ణయేదేకో నిపుణః పండితో విటః. 252

సంబోధనోక్తిప్రత్యుక్తీ కుర్యాదాకాశభాషితైః

సూచయేద్వీరశృంగారౌ శౌర్యసౌభాగ్యసంస్తవైః. 253

భూయసా భారతీవృత్తిరేకాంకం వస్తు కల్పితం

ముఖనిర్వహణే సాంగే లాస్యాంగాని దశాపి చ. 254

భాణ మను రూపకలక్షణ మిట్లు గ్రాహ్యము. తా ననుభవించిన అథవా పరు డనుభవించిన ధూర్తచరిత మిందుండును. నిపుణుడు పండితుడు నయిన కవి స్వపరానుభూత ధూర్తచరిత మభివర్ణించిన నది భాణ మగును. ఆకాశభాషిత విధానము ననుసరించి సంబోధనముల నుక్తిప్రత్యుక్తులను నిబంధింప వలెను. శౌర్యసౌభాగ్య సంస్తవములతో వీరశృంగారములను సూచింపవలెను. భారతీ వృత్తి బహులముగా నిందుండును. ఇందొకటియే యంక ముండును. వస్తువు కల్పిత మగును. సాంగముగా ముఖసంధి నిర్వహణసంధి యుండదగును. లాస్యాంగములు పదియు నిందుండును. గేయపదము—స్థితపాఠ్యము—ఆసీనము-పుష్పగండిక-ప్రచ్ఛేదకము-త్రిమూఢకము-సైంధవము-ద్విమూఢకము-ఉత్తమోత్తమకము-ఉక్తప్రత్యుక్తము అనునవి దశవిధలాస్యాంగములు. వీని స్వరూపములు నిరూపితములు కాగలవు.

కోహలాదిభిరాచార్యైరుక్తం భాణస్య లక్షణం

లాస్యాంగదశకోపేతం సమ్యగుత్పాద్యవస్తు చ. 255

భారతీవృత్తిభూయిష్ఠం శృంగారైకరసాశ్రయం

పరస్వాత్మానుభూతార్థధూర్తచారిత్రవర్ణనమ్. 256

తత్తద్విటోక్తిప్రత్యుక్తి విహితాకాశభాషితం

ముఖనిర్వహణప్రాయ సంధియుగ్రూపకం చ యత్. 257

ఏకాంకం చ భవేద్భాణ ఇతి విద్వద్భిరుచ్యతే

భాణస్య లక్షణం చేదృగ్భోజేనాపి ప్రకాశితమ్. 258

కోహలాదినాట్యాచార్యులు భాణలక్షణము నిరూపించిరి. అది యిట్లున్నది. పూర్వము చెప్పినలక్షణ మీ లక్షణము సమాన మయినను స్వోక్త

ప్రామాణ్య సంపాదనమునకు కోహలభావనిరూపణము సమర్థము. కోహలభావ సూత్రముల నిట్లు గ్రహించునది.

1. లాస్యాంగదశకముతో గూడి యుండుట
2. చక్కగా నుత్పాద్యవస్తువు నిరూపిత మగుట
3. భారతీవృత్తిభూయిష్ఠముగా నుండుట
4. శృంగారైకరసాశ్రయ మగుట
5. పరస్వానుభూతార్థధూర్తచారిత్రవర్ణనము
6. తత్తద్వటోక్తి ప్రత్యుక్తి విహితాకాశభాషితము
7. ముఖ నిర్వహణప్రాయ సంధి యోగము
8. ఏకాంక పరిమితము.

ఇట్టి రూపకము భాణమని విద్వన్నిర్ణయము. ఇట్టి భాణలక్షణమును భోజుడును ప్రకాశింపజేసెను. భాణములో లాస్యాంగము లుండుట సూచితము. లాస్యాంగముల నామ నిర్దేశ మీ విధమున నున్నది.

గేయపదం స్థితపాఠ్యం ఆశీనం పుష్పగండికా
ప్రచ్ఛేదకం త్రిమూఢం చ సైంధవాఖ్యం ద్విమూఢకమ్. 259

ఉత్తమోత్తమకం భావ్యముక్తప్రత్యుక్తమేవ చ
లాస్యం దశవిధం హ్యేతదంగనిర్దేశకల్పనమ్. 260

గేయపదాదులు లాస్యాంగములు. అంగనిర్దేశకల్పనాత్మక మయిన లాస్యము దశవిధము. నానాట్యవేదము నందును శృంగారప్రకాశము నందును లాస్యాంగములు నిరూపితము లయినవి. నాట్యవేదమున నభినవభావార్థమును ప్రకాశిత మయినది. ఇందు సంక్షిప్తలక్షణము లీ విధముగ నున్నవి.

వీణాదివాద్యయోగేన సహితం యత్ర భావ్యతే
లలితం నాయికాగీతం తద్గేయపదముచ్యతే. 261

చంచత్పుటాదినా వాక్యాభినయో నాయికాకృతః
భూమిచారిప్రచారేణ స్థితపాఠ్యం తదుచ్యతే. 262

భ్రూ నేత్ర పాదచలన విలాసాభినయాన్వితం
యోజ్యమాసీనయా పాఠ్యమాసీనం తదుదాహృతమ్. 263

నానావిధేన వాద్యేన నానాతాలలయాన్వితం
లాస్యం ప్రయుంజతే యత్ర సా జ్ఞేయా పుష్పగండికా. 264

అన్యాసంగమ శంకిన్యా నాయకస్యాత్తరోషయా
ప్రేమచ్ఛేదప్రకటనం లాస్యం ప్రచ్ఛేదకం విదుః. 265

ఇందయిదు లాస్యాంగముల లక్షణములున్నవి. వీని భావసారముల నీ విధముగా గుర్తించునది.

1. గేయపదము.

లలితమగు నాయికాగీతము వీణాదివాద్యప్రయోగసహితముగా సంభావిత మయినచో గేయపద మందురు. ఈ గేయపదము ప్రయోగమున కావ్యమున సంగత మగును. గేయపదనిర్వహణమునకు నాయికలె యుండవలయును. వారు వేరుగా రావలయును. రూపకపాత్రలట్లు చేయరాదు. ఆసనోపవిష్టలై స్వస్థలై గాన మొనరింప వలెను. నేపథ్యమున గాన మొనరింపరాదు. గేయమున కిది స్థానము కావున గేయపదము. ప్రయోగసంగత గేయము సామాజికరంజక మగును. కావ్యసంగత గేయము కవి యావేశవిశేషమును విజృంభింప జేయును.

2. స్థితపాఠ్యము.

నాయికాకృత మయిన వాక్యాభినయము చంచత్పుటాది తాలయుక్తము భూమిచారి ప్రచార సహిత మయినచో స్థితపాఠ్య మగును. వియుక్తవనిత మదనానల తప్తాంగి నిలబడి యుండియు నార్తరస మయిన ప్రాకృతభాషాపాఠ్యము పఠించుట స్థితపాఠ్యమని భరతోక్తి. ఇందు తాలయుక్తముగ వాక్యాభినయము కూర్చుట భూచారీవిశేషముల గూర్చుట భాణోచిత మని శారదాతనయుడు సూచించినాడు.

3. ఆసీనము.

రంగమున నాసీన యయిన నర్తకి పాఠ్యమును భ్రూ - నేత్ర - పాదముల చలనవిలాసములతో నభినయములతో నన్వీత మగునట్లుగ గూర్చినచో నాసీన మను లాస్యాంగ మగును. భరతు డిట్లనెను. సర్వాతోద్యరహితముగా నప్రసారితగాత్రముగా చింతాశోక సమన్వితముగా నూరక కూర్చొనియుండుట

యాసీనము అని. సర్వాభినయశూన్యత భరతసమ్మతము. నిరూపితాభినయా న్వితత్వ మిందు నిరూపితము. ఇదియు గొందరి మతము కావలయును.

4. పుష్పగండిక.

లాస్యము నానావిధవాద్యసముక్తముగా నానావిధతాలలయాన్విత ముగా నొనరించిన నది పుష్పగండిక. నారి నరవేషము ధరించి సఖివినోదమునకై లలితసంస్కృతగేయము గాన మొనరించినచో గానన్మత్తగీతాగతవై చిత్ర్యము కూర్చినచో పుష్పగండిక యని కొందరి భావము.

5. ప్రచ్ఛేదకము.

నాయకు డన్యాసంగమమున నున్నాడని శంకించి రోషము కలదై నాయిక ప్రేమచ్ఛేదప్రకటనమున కగు లాస్య మొనరించిన ప్రచ్ఛేదక మగును. భరతాభినవభావము వేరుగా నున్నది. ప్రియవిరహావిదూన యయిన యువతి జ్యోత్స్నాసంచార మొనర్చుచు ఛాయాదృశ్యమున కాంతుని స్మరించి సంభా వించి ప్రియసంసక్త యగుట, పానగోష్ఠీసమయము నందలి రూపభావనమున మదిరాప్రతిబింబితస్వభావునిగా ప్రియుని భావించి సక్త యగుట, అట్లె జలమున ప్రసాధనమున దర్పణమున బింబితప్రియభావముతో సంసక్త యగుటయు ప్రచ్ఛే దక మనిరి. ప్రచ్ఛేదకములోని ఛేదము ప్రేమచ్ఛేదాత్మక మని నిరుక్తిగా భావించి యీ శారదాతనయు డిట్లు చెప్పెను.

అనిష్ఠురశ్లక్ష్ణపదం సమవృత్తైరలంకృతం
నాట్యం పురుషభావాఢ్యం త్రిమూఢక ముదాహృతమ్. 266

దేశభాషావిశేషేణ చలద్వలయశృంఖలం
లాస్యం ప్రయుజ్యతే యత్ర తత్సైంధవముదాహృతమ్. 267

చారీభిర్లలితాభిశ్చ చిత్రార్థాభినయాన్వితం
స్పష్టభావరసోపేతం లాస్యం యత్తద్ద్విమూఢకమ్. 268

అపరిజ్ఞాతపార్శ్వస్థం గేయభావవిభూషితం
లాస్యం సోత్కంఠవాక్యం యదుత్తమోత్తమకం భవేత్. 269

కోపప్రసాదజనితం సాధిక్షేపపదాశ్రయం
వాక్యం తదుక్తప్రత్యుక్తం ద్వయోః ప్రశ్నోత్తరాత్మకమ్. 270

ఇచట త్రిమూఢకము సైంధవము ద్విమూఢకము ఉత్తమోత్తమకము ఉక్తప్రత్యుక్తము అను నయిదు లాస్యాంగముల స్వరూప నిరూపణ మున్నది.

6. త్రిమూఢకము.

పురుషభావాఢ్య మయిన నాట్య మనిష్ఠురశ్లక్ష్ణపదమై సమవృత్తాలంకృతమై యున్నచో త్రిమూఢకమగును. త్రిమూఢకలాస్యాంగములో నాయకుడు వ్యలీక మొనరించువాడు కాగా నొకతె విషణ్ణయై ద్వేషించును. అభినవ నాయిక యొకతె ప్రథమప్రణయ మగుట లజ్జాబంధమున నుండి వ్యథిత యగును. ఇట్లు మూవుర మోహ మించుకగును. ఇందు నాయకుని మాట లపరుష్య మనిష్ఠురములు. అందు రసోపయోగి గుణాలంకారాంశము స్వీకార్యము. సమవృత్తము లుండవలయు ననుటచే వృత్తకృత విచిత్రత సూచితము. విశేషకృత మయిన వృత్తవైచిత్ర్యమున నాట్యమునందు శోభ కలుగును. నాట్యసౌందర్యాధానములో గుణప్రభావము దీన సూచిత మగును.

7. సైంధవము.

సైంధవము నందు లాస్యప్రయోగముండును. ఈ లాస్యము దేశభాషావిశేషమున ప్రయుక్త మగును. లాస్యానుసరణమున వలయశృంఖలములు చలమానము లగును. ఇది సైంధవము. ప్రాకృతవచనములతో నొక పాత్ర సువ్యక్తకరణాన్వితముగా వ్యవహరించుట సైంధవము. సింధుదేశ భాషాశ్రయము సైంధవము. సైంధవభాషాశ్రయమున రంజనాధిక్య ముండుననుట సర్వభాషోపలక్షణము. కావుననె దేశభాషావిశేషాశ్రయమున లాస్య ముండుట నీ గ్రంథకారుడు సూచించెను.

8. ద్విమూఢకము.

ఇందును లాస్యముండును. ఈ లాస్యము లలితచారీగతి సంయుక్తము చిత్రార్థాభినయాత్మకము స్పష్టభావరసోపేతము నగును. ఇట్టి లాస్య మున్నచో ద్విమూఢక మగును. లాస్యాశ్రయ మయిన విశేషమున నాయకునకు నాయిక కిద్దరకు వ్యామోహము వర్ణిత మగును గావున నిది ద్విమూఢకము. నాయికాద్వయమునకు మోహమున్నను ద్విమూఢకమె. చారీగతికథనమున నంగాంగపరిక్రమములోని తాలానుసరణము దిశాచతుష్టయక్రమ

పరిక్రమము సూచితము. సామాజికులకు ముఖ మఖిసుఖముగా నుండుట ప్రతి ముఖవిధానమున దిశాసంచార మభ్యూహ్యము. ఇట్టి పరిక్రమమున వైచిత్ర్య మున్నది. కావుననె యిది చిత్రార్థాభినయాత్మక మగును.

9. ఉత్తమోత్తమకము.

ఇందలి లాస్యమున పార్శ్వమున నున్నవారిని గుర్తించుట యుండదు. గేయభావమున నిది విశిష్టమగును. సోత్కంఠవాక్యమున నుండును. ఇది యుత్తమోత్తమకము. ఇది యనేక రససంశ్రయ మని విచిత్రశ్లోకబంధ సముపేత మని హేలాభావవిచిత్రిత మని భరతు డనెను. నాట్యమున లాస్యాంగము లుత్తమములు, అందున నిది యుత్తమ మయినందున నుత్తమోత్తమకము. సర్వమిందు రసపర్యాయము. రసపర్యవసాయి రసనిష్యంది కాజాలని సన్నివేశము నభినవు డభినందింపడు.

10. ఉక్తప్రత్యుక్తము.

నాయికానాయకుల ప్రశ్నోత్తరాత్మక మయిన వాక్యము కోపప్రసాద జనితము సాధిక్షేప పదాశ్రయము నయినచో నుక్తప్రత్యుక్త మగును చిత్ర గీతార్థయోజిత మనియు నిందు కూర్పదగును. నాట్యోపయోగి యంశ మిం దిట్లుపజీవిత మగును. లక్షణశ్లోకములోని ప్రథమార్ధమున భావిలక్షణ మేకదేశ ముగా సూచితము. ద్వితీయార్ధమున పూర్వసమాకృష్టమయిన వైచిత్ర్యభాగము నాట్యోపయోగిగా నిర్దిష్ట మయినది. ఇక నీ యర్థము సంభావ్యము. కోప ప్రసాదజన్యము సాధిక్షేపపదాశ్రయము నయిన వచన ముక్తప్రత్యుక్తము. చిత్ర గీత మనదగిన ధ్రువాగానకావ్యములోని యర్థము నాట్యాంశమున సంయోజ నము పొందగా నుక్తప్రత్యుక్తము లోని వైచిత్ర్యము లాస్యాంగమున స్వీకృత మగును. భిన్నములుగా నుండు వాచ్యఖండలకములు రసావేశమహిమాతిశయ మునననె సమన్వయము పొందును.

నాయకాపరాధమున వ్యాకుల యయిన యొక ముగ్ధాధీర ప్రియునితో సంభాషించు చున్నది. "బాలే! ఏమి నాథా! మానిని! రోషము విడువుము! రోషము వచ్చి నేనేమి చేసితిని? నాకు ఖేదము. నాకు నీ వేమియు నపరాధ మొనరింపలేదు. అన్ని యపరాధములు నావె. గద్గదముగా నేడ్చెదవేమి? నేనెవరి కడ నేడ్చితిని? నా యెదుట. నీకు నేనెవరు? నీవు దయిత. కాననే యేడ్చు

చున్నాను.'' ఇందు క్తప్రత్యుక్తి నున్నది. రసావేశమున నే వీని కేకార్థసమ న్వయము కలుగును. ఇట్లే ద్విపదికా గీతార్థము లందును కావ్యార్థము రసావేశ మున నభినీయమానసుందరమై యభినయార్థసమావేశము పొందును. ఇదిలోక దృష్టము కాదు. అయిన నుపరంజకము. ఆకాశభాషితాత్మక మయిన యంశము స్వగతజనాంతికాపవారితకములు ఉక్తప్రత్యుక్తరీతి రమ్యము లగును. ఇట్టివి లోకమున నత్యంత మసంభావితములు కావు. లోకమున లేవని నాట్యమున నిషే ధింపరాదు. లోక సంభవాసంభవము లిం దరంచిత్కారములు.

లాస్యాంగముల విషయమున నీ యంశము సంప్రధార్యము. నాట్య మున కైశికి, తద్రచనకు వలయు ద్రవ్యసంపద సూచిత మయినది. కైశికీప్రసాద మున నాట్యము శాస్త్రాదిరోలక్షణమై సర్వజనాహరణీయ మయినది. కైశికీస్వ రూపావిర్భావమునకు లాస్యాంగము లావశ్యకములు. లాస్యాంగములకు రస భావభాగాభినివేశ మావశ్యకము. లాస్యవిధిలోని యంగములు నాటకోపయోగ మాపాదింపగలవు. నాటకము నందే కాక తదితరము లందును సంగతము లగును. నాటకవినిస్సృత మయిన భాణమున నివి యేకపాత్రప్రయోజ్యములు. నాటక మున లాస్యప్రయోగము వేరు. భాణమున నేకపాత్రహార్యలాస్యమున నాట్య రూపత యుండదు. నాట్యోపయోగితానిరూపణమునకు లాస్యాంగముల స్వరూపసంకేత మిచట నిరూపిత మయినది.

కొందరు చిత్రపదమని భావికమని రెండు లాస్యాంగముల నిరూ పించిరి. ఈ యధికప్రసంగ మభినవునకు సమ్మతము కాదు. లాస్యము దశాంగము దశవిధమని ప్రసిద్ధి. తద్విరోధము యుక్తము కాదు. ఈ ద్వయమున కుపయోగ మేనియు లేదు. కైశికీవృత్తి కుపయోగించు వైచిత్ర్యము దశక ముననె కలుగును. వైచిత్ర్య మనునది ప్రధాన మగు చిత్తవృత్తి యనువర్త నాంశమున విభావాద్యంశమున నుపరంజకభావమున గలుగును. సర్వవిధముల వైచిత్ర్యము సంపాదించుటకు పది లాస్యాంగములు చాలును. అయినను భరతు డన్యమతముగ రెండింటి నిరూపించినాడు. ఈ సర్వము సంభావిత మవుగావుత మని శారదాతనయుడు భావిక మను వేరొక లాస్యాంగమును నిరూపించెను. తల్లక్షణ మిట్లున్నది.

స్వప్నే విలోక్య దయితం క్రియతే యత్ప్రబుద్ధయా
మనోభవార్తయా భవ స్తద్వై భావికముచ్యతే. 27 ।

విరహిణి వనిత స్వప్నమున ప్రియుని చూచి మేల్కొని మన్మథ పీడితయై భావము ప్రకటించుట భావిక మగును. వివిధభావముల ప్రకటించుట భావికము. ప్రియుని యాకృతిని జూచి విరహిణి చిత్తవినోదము సంపాదించుట చిత్రపద మగును. ఈ రెండును పూర్వాధికరమ్యత నాపాదించునవి యన లేము.

భాణప్రయోజ్యములగు నృత్తభేదము లింకను గలవని కొందరనిరి. వారి భావసారము లిట్లున్నవి.

అపరైర్నృత్యభేదాస్తు గుల్మ శృంఖలికా లతాః
భేద్యకశ్చేతి చత్వారః కథ్యంతేఽత్ర మనీషిభిః. 271

గుల్మః సంభూయ యన్నృత్తం శృంఖలాన్యోన్యబంధనీ
పరస్పరాంగవేష్టేన యన్నృత్యం సా లతా మతా. 272

ఏకైకస్య బహిస్సంఘాన్నృత్తం యత్స చ భేద్యకః
పిండీబంధశ్చ గుల్మశ్చ పర్యాయావితి కేచన. 273

గుల్మబంధో విలంబే స్యాత్ శృంఖలా తు లయాంతరే
మధ్యమే స్యాల్లతాబంధో ద్రుతే స్యాద్భేద్యకః స్మృతః
భద్రాసనేన యంత్రేణ తత్తచ్ఛిక్షావిధీయతే. 274

కొందరు కొన్ని నృత్యభేదములను జెప్పిరి. గుల్మము–శృంఖలితము–లత–భేద్యకము ననునవి నాలుగు నృత్యభేదములు. అందరు కూడిచేయు నృత్తము గుల్మమని, అన్యోన్యబంధనాత్మకముగా నుండు నృత్తము శృంఖల యని, పరస్పరాంగవేష్టనమున నొనరించు నృత్యము లత యని యందురు. సంఘాత్మక మయిన నర్తకీగణము నుండి యొక్కొకరు విడిగా వచ్చి నృత్య మొనరించుటను భేద్యక మందురు. పిండీబంధ రూపము గుల్మరూపము నగునది యొకటియె యని గుల్మపిండీబంధములు పర్యాయములని యందురు. గుల్మబంధము విలంబిత లయవిధానమునను, లయాంతరమున శృంఖలావిధానమును, మధ్యమ లయానుసారమున లతాబంధమును, ద్రుతలయానుసారమున భేద్యకమును నిరూపింతురు. భద్రాసన యంత్రమున నా యా శిక్ష విహిత మగునని యిందున్నది. "భద్రాసనేన యంత్రేణ" పదమునకు సంబంధించిన సాంప్రదాయి

కార్థమును సమీక్షింప వలెను. సుస్థిరముగా నుండునొక స్థానాధారమున నీ నృత్యములు ప్రయోజ్యము కావచ్చును.

### ప్రహసన లక్షణము

భాణవత్స్యాత్ప్రహసనం తత్త్రిధా పరికీర్త్యతే
శుద్ధం క్వాప్యథ సంకీర్ణం క్వచిద్వైకృతమిత్యపి
తత్ర శ్రోత్రియ నిర్గ్రంథ శాక్యాదీనాం యథాయథమ్. 275

భాషాచేష్టితతద్రూప హాస్యవాక్యసమన్వితం
చేట చేటీ విట వ్యాప్తం శుద్ధం ప్రహసనం భవేత్. 276

ఉద్ఘాత్యకాది వీథ్యంగైర్మిశ్రం సంకీర్ణముచ్యతే
విటకాముకచేటాదివచోవేషధరైస్తు యత్. 277

పరివ్రాణ్మునిషండాద్యైః కృతం వైకృతముచ్యతే
రసస్తు భూయసా కార్యః షట్ప్రకార స్తతః. 278

ముఖం నిర్వహణం చైవ సంధీ ద్వావస్య కీర్తితౌ
అంకోప్యేకో భవేద్యస్య తత్తు ప్రహసనం భవేత్. 279

సైరంధ్రికా స్యాత్సంకీర్ణా శుద్ధా సాగరకౌముదీ
కలికేలిప్రహసనం యత్తద్వైకృతమీరితమ్. 280

ప్రహసనము రంజనప్రధానము. భాణసాదృశ్యము ప్రహసనములో గలదు. ప్రహసనము మూడు విధములు. ఒకచో శుద్ధము. వేరొకచో సంకీర్ణము. మరియొకచో వైకృతము. ఇందు శుద్ధప్రహసన మీ విధముగ నుండును. శ్రోత్రియులు దిగంబరులు శాక్యాదిపదమున జెప్పదగిన జైన బౌద్ధ ప్రభృతులుగా నుండువారు ప్రహసనమున నుందురు. వారి భాషితములు వారి చేష్టితములు నిందుండును. వారివారి హాస్యవాక్యము లుండును. చేటీచేటవిటులతో నభివ్యాప్తమైయుండును. హాస్యప్రధానము లయిన వచనము లుండును. శ్రోత్రియులు నిర్గ్రంథు లనదగు దిగంబరసన్యాసులు శాక్యమును లందరు కుత్సితపురుషులుగా నుందురు. వారి శీలము నింద్యమై ప్రహసనీయ మగును. కాపురుషసంప్రయోగము వారి వికల సంభాషణము ప్రహసనములో బహులముగా నుండును. దుష్ట మయిన యొకని చరితమె ప్రధానముగ పరిహసిత మయినచో శుద్ధప్రహసనము. శ్రోత్రియాదుల

చేష్టితము లగర్హితము లయినను ప్రాకృతపురుషుల సంక్రాంతిదౌరాత్మ్యము వలన వారి చరితము దూష్యము ప్రహసనీయము నగును. శ్రోత్రియాదులు స్వభావ శుద్ధులు; తదోద్యోగమున నిది శుద్ధ మగును.

సంకీర్ణ ప్రహసన మీ విధమున నుండును. ఉద్ఘాత్యకము అవలగితము మొదలగు వీథ్యంగములతో నిది మిశ్రిత మగును గావున సంకీర్ణము. ఇందు చేటీచేటవిట సంబంధము నుండును. సర్వజన భోగసంభోగయోగ్య యయిన వేశ్య, కామినీకాముకులకు సంధానకుశలు డయిన చేటుడు, స్త్రీపుంసస్వభావ దూరు డయిన నపుంసకుడు, విటుడు, ధూర్తుడు, ధూర్త, అంకుటాలు, విడిచిన విధవ మొదలగు పరివారపరిజన మిందుండును.

వైకృతప్రహసనము. షండ్రవాణ్మునిషండాదులు-సన్యాసులు మునులు నపుంసకులు విటకాముకచేటాదుల వేషవిశేషితులై వారి భాషాభూషితులై తద్రూపచ్ఛన్నులై యుందురు. వారల దంభదండములు వాదవివాదప్రతివాదములు వైకృతప్రహసనమున ప్రహసనీయములుగ నుండును.

షట్ప్రకారముగా నున్న హాస్యరసను నిందధికముగా నిరూపింప వలెను. హసిత విహసితాదిభేదము లిదివరలో నిరూపితము లయినవి. ముఖసంధి నిర్వహణసంధి యను రెండు సంధులు మాత్రమె ప్రహసనము నుండవలెను. అంక మొకటియె యుండును. ఇట్లుండగా నిది ప్రహసము. సాగరకౌముదీ ప్రహసనము శుద్ధమని, సైరంధ్రికా ప్రహసనము సంకీర్ణ మని, కలికేలి ప్రహసనము వైకృత మని గ్రహింప దగును. ఈ పేరులు కల ప్రహసనము లిప్పట లభించుట లేదు.

## డిమ లక్షణము

ఉద్ధతైర్దేవ గంధర్వ యక్ష రక్షో మహోరగైః
భూత ప్రేత పిశాచాద్యైః డిమః షోడశనాయకః 281

శృంగారహాస్యవిధురైః రసైర్దీప్తైర్నిరంతరః
కైశికీవృత్తిరహితో భారత్యారభటీ యుతః. 282

లుప్తావమర్శసంధిశ్చ చతుస్సంధిసమన్వితః
అంగిరౌద్రరసో పేతో బీభత్సాదినిరంతరః. 283

ప్రఖ్యాతవస్తువిషయో న్యాయమార్గీణనాయకః
చంద్రసూర్యోపరాగోల్కానిర్ఘాతాదిభిరుద్భటః. 284

ఉత్పాతైర్ఘోరసంగ్రామసంరంభభరితాంతరః
సప్రవేశకవిష్కంభశ్చతురంకో డిమః స్మృతః. 285

ఇదం త్రిపురదాహాఖ్యే లక్షణం బ్రహ్మణోదితం
ఉదాహరణమేతస్య వృత్రోద్ధరణ ముచ్యతే
తారకోద్ధరణం తద్వత్తత్ర తత్ర విలోక్యతామ్. 286

దశవిధరూపకములలో నొకటి యయిన డిమము యొక్క లక్షణ మీ విధముగా నున్నది. డిమము షోడశనాయకయుక్తముగా నుండును. ఇందలి నాయకు లుద్ధతులు. దేవ-గంధర్వ-యక్ష-రక్షో-మహోరగరూపులు. భూత-ప్రేత-పిశాచాదులు. డిమము దీప్తరసములతో నిరంతరముగా నుండును. శృంగార హాస్యము లుండవు. భారతీవృత్తి యారభటీవృత్తి యుండును. కైశికీవృత్తి యుండదు. ముఖ ప్రతిముఖ గర్భ నిర్వహణసంధులె యుండును. అవమర్శ సంధి యుండదు. అంగిరసము రౌద్రము. అది భీభత్సాది నిరంతరముగా నుండును. ఇందు వస్తువు ప్రఖ్యాతము. నాయకుడు న్యాయమార్గగామిగా నుండును. చంద్రోపరాగము సూర్యోపరాగము ఉల్కాపాతము పిడుగుపాటు మొదలగు వానితో నిది నిర్భరముగా నుండును. ఉత్పాతము లుండును. ఘోరసంగ్రామములు సంరంభములు నిండుగా నుండును. ప్రవేశక విష్కంభకము లుండును. డిమము చతురంకము. త్రిపురదాహ మను డిమము నందు బ్రహ్మ లక్షణము నిరూపించెను. వృత్రోద్ధరణము తారకోద్ధరణ ముదాహరణములు.

ఇది మూలానుగతార్థము. ఇందలి విశేషముల నిట్లు గ్రహించునది. ఇది ప్రఖ్యాతవస్తువిషయము కావున సర్వమితరము నాటకము నందువలె నుండును. సంధు లసమగ్రము లగుట, రసము లసమగ్రము లగుట యిందలి విశేషము. కావ్యయోని యన దగిన యిందలి వస్తువు దీప్తరసము కావున శాంతరస ప్రయోగ ముండు నను కొనరాదు. డిమము మాయేంద్రజాలబహులము కావున నానా పుస్తము లుత్థానయోగము లిం దపేక్షితములు. డిమము డింబము విద్రవము ననునవి పర్యాయములు. తద్యోగమున నిది డిమ మయినది "డయంత ఇతి డయః ఉద్ధతనాయకాః తేషాంవృత్తిర్యత్ర స డిమః" ఎగురుట, గంతులు చిందులు వేయుట డిఙ్ ధాత్వర్థము. ఇందు ప్రదేశకాదు లుండునని భరతాభినవభావము. దినచతుష్టయ

వృత్తము డిమమున ప్రదర్శించుచున్నది. చూలికాంక ముఖాంకావతారముల కుపయోగ మున్నది. అయినను ప్రవేశక ముండదు.

### వ్యాయోగ లక్షణము

వ్యాయోగస్త్వేతివృత్తం యత్ర ప్రఖ్యాతముదాహృతం
ధీరోదాత్తాశ్చ విఖ్యాతా దేవా రాజర్షయోఽథవా
నాయకాస్త్రిచతుష్పంచ భవేయుర్న దశాధికాః. 287

దివ్యయోనికథాల్పస్త్రీ పరివారస్త్రిసంధికః
గర్భావమర్శరహితో విష్కంభాదిసమన్వితః. 288

ఏకాహాచరితైకాంకో భారత్యారభటీయుతః
యుద్ధాధర్షణసంఘేటవిద్రవాదినిరంతరః. 289

క్వాచిత్కః స్వల్పశృంగారః షడ్దీప్తరసనిర్భరః
అస్త్రీనిమిత్తసంగ్రామో వ్యాయోగః కథితో బుధైః 290

వ్యాయోగము నందలి యితివృత్తము ప్రఖ్యాతము. ధీరోదాత్తులు విఖ్యాతులు నయిన దేవులు రాజర్షులు నాయకులుగా నుందురు. వారు మూవురు నలువు రయిదుగురు. ఇంక నెందరైన దగుదురు. కాని దశాధికముగా నుండదగరు. ఇందలి కథ దివ్యయోని. ఇది యల్పస్త్రీజనపరివారము. ముఖ ప్రతిముఖ నిర్వహణసంధులె యుండును. గర్భావమర్శసంధులుండవు విష్కంభకాదు లుండును. ఏకాహచరితైకాంకముగా నుండ దగును. భారతీవృత్తి యారభటీవృత్తి యుండును. యుద్ధాధర్షము సంఘేటము విద్రవము మొదలగు వానితో నిది నిరంతరముగా నుండును. క్వాచిత్కముగా స్వల్పశృంగార ముండును. శృంగార హాస్యశాంతములు వినా యితరములు అయిన షడ్రసము లిందుండును. అస్త్రీనిమిత్త మయిన సంగ్రామ మిందుండును. ఇట్లున్న నిది వ్యాయోగ మని యనిరి. ఇందు వేరుగా నున్న కొన్ని భరతాభినవభావముల గుర్తించుట శారదాతనయ భావరూపము గుర్తించుట కుపకరించును.

వ్యాయోగము డిమమునకు శేషభూతము. దివ్యనాయకు లిందుండరు. ఉదాత్తులు రాజాదులుందురు. అమాత్య సేనాపతి ప్రభృతులకు దీప్తరసత్వ ముండును. నాయకుల కిందు ప్రఖ్యాతత్వమె; ఉదాత్తత యంతగా నపేక్షితము

కాదు. ద్వాదశనాయకు లుండవచ్చును గాని భావదాశపరిమాణాంక వలదు. ఏకాంక మేకాహచరిత మగునందున సకాలకృత న్యాయప్రాప్తము ఇది రాజర్షి నాయకనిబద్ధమును కాదని భరతోక్తి. ఇందలి మూలమును లోని "దివ్యయోని కథా"యను స్థలమున "దీప్తయోని కథా" యని యుండదగునా? యని పించును. వ్యాయోగమునందలి రసము దీప్తముగా నుండుట యుక్తము.

## సమవకార లక్షణము

దేవాసురేతివృత్తం యత్ప్రఖ్యాతం లోకసమ్మతమ్
తత్స్యాత్సమవకారోఽస్య నిర్విమర్శాశ్చ సంధయః. 291

మృద్వీ స్యాత్కైశికీవృత్తిరంగీ వీరరసో భవేత్
ప్రఖ్యాతోదాత్తచరితా మిళితా దేవదానవాః. 292

పృథక్ప్రయోజనాస్తత్రనాయకా ద్వాదశ స్మృతాః
అంగాన్యన్యే రసాస్తత్ర సాత్త్వత్యాద్యాశ్చ వృత్తయః. 293

అంకైస్త్రిభిః త్రికపటః త్రిశృంగారః త్రివిద్రవః

సమవకారస్వరూప మిట్లున్నది. ప్రఖ్యాతము లోకసమ్మతము నయిన దేవాసురుల యితివృత్తము సమవకారమున నుండవలెను. విమర్శసంధి రహితముగా ముఖాదిసంధిచతుష్టయ మనుండును. మృదువయిన కైశికీవృత్తి, అంగియగు వీరరస ముండదగును. ప్రఖ్యాతోదాత్తచరితు లయిన దేవదానవులు పండ్రెండుగురు వేరు వేరు ప్రయోజనముల సంపత్తికై మిళితు లగుదురు. అన్యరసము లంగముగా నుండును. సాత్త్వత్యాదివృత్తులు నుండును. మూడంకములు; మూడు కపటములు; మూడు శృంగారములు; మూడు విద్రవములు సమవకారమున వర్ణితము లగును. దేవాసురులు కొంద రప్రఖ్యాతు లుందురు. ఇందు ప్రఖ్యాతులె యుండవలయును. సామాన్యముగా దేవు లుద్ధతులు. అయినను గాంభీర్యప్రధానముగా నుండవలయుట ఉదాత్తపదము సూచించును. అంకములలో నుపాయాంశమున కపటము, వ్యాపత్తి సంభావనాంశమున విద్రవము, ఫలాంశమున శృంగారము సముచితము. ప్రత్యంకము నను ద్వాదశనాయకు లుందురని కొందరు, నాయకప్రతినాయకులు తత్సహాయులు నలుగురె యుందురని కొందరు నందురు. ఇంక నీ విశేషములు కలవు.

అష్టాదశ స్యుర్నేతస్మిన్నాడికాః సముదాయతః. 294

తాభిస్త్రిధా విభిన్నాభిః త్ర్యంకకాలో నియమ్యతే
ముఖప్రతిముఖాభ్యాం చ ప్రథమాంకో ద్విసంధికః. 295

కాలస్తు ప్రథమాంకస్య భవేద్ద్వాదశనాడికాః
ద్వితీయాంకశ్చతసృభిః నాడికాభిః స్థితో భవేత్. 296

ముఖం ప్రతిముఖం గర్భః సంధయోఽస్య త్రయోఽపి చ
తృతీయాంకస్య కాలోఽపి నాడికాభ్యాం ప్రకల్ప్యతే. 297

సంధేయా నిర్విమర్శాశ్చ చత్వారస్సంధయోఽత్ర తు
ముహూర్తస్య తురీయాంశో నాడికా ఘటికాద్వయమ్. 298

సమవకారమునందు సముదాయరూపముగా పదునెనిమిది నాడిక లుండును. ఆ యష్టాదశనాడికలు మూడు విధముల విభిన్నములు కాగా మూడం కముల కాలము నియమిత మగును. ప్రథమాంకమున ముఖప్రతిముఖము లుండును. కావున నది ద్విసంధికము. ప్రథమాంకమునకు ద్వాదశనాడికల కాలము పరిమితమై యున్నది. ద్వితీయాంకము నాలుగునాడికల కాలపరిమితితో నుండదగును. ముఖము ప్రతిముఖము గర్భము నను మూడు సంధు లుండును. తృతీయాంకమునకు రెండు నాడికల కాలము పరిమితము. విమర్శ సంధిరహితముగా నాలుగు ముఖ ప్రతిముఖ గర్భ నిర్వహణ సంధు లుండదగును. ముహూర్తము యొక్క నాల్గవ యంశము నాడిక. నాడిక ఘటికాద్వయమితము. సమవకారమున కపట శృంగార విద్రవముల నిరూపింప వలసి యున్నది. అందు కపటము.

వస్తుస్వభావదైవారికృతాః స్యుః కపటాస్త్రయః
కపటస్య స్వరూపం తు భ్రమో మోహాత్మకః స్మృతః. 299

వస్తుస్వభావకపటః క్రూరసత్త్వాది సంభవః
దైవికః కపటో వహ్నివర్షవాతాది సంభవః 300

శత్రుజః కపటస్త్వత్ర సంగ్రామాదిసముద్భవః
విద్రవః ప్రాయశస్తద్వత్తయోర్భేదోఽత్ర కథ్యతే. 301

జీవగ్రాహోఽథ మోహో వా కపటేన ప్రకాశ్యతే
విద్రవస్తు ఫలం తత్తద్ధేతో స్తస్మాత్పలాయనమ్. 302

కపటము మూడు విధములు – వస్తుస్వభావకృతము దైవకృతము అరికృతము నని. మోహాత్మక మయిన భ్రమము కపటము యొక్క స్వరూపము. క్రూరమృగాదుల వలన గలిగినది వస్తుస్వభావ కపటము వహ్నివర్షవాతాది సంభవము దైవిక మయిన కపటము. సంగ్రామాదిసముద్భవము శత్రుజన్య మయిన కపటము. సామాన్యముగా విద్రవము కూడ నిట్టిదె. వీని కొంత భేదము కలదు. శత్రువును ప్రాణము లుండగా పట్టుకొనుట (జీవగ్రాహము)గాని, మోహముకాని కపటమున ప్రకాశిత మగును. విద్రవ మనునది ఫలరూపము తత్తద్ధేతువు వలన శత్రువు నుండి పలాయన మొనరించుట. ఇక శృంగారము.

శృంగారో ధర్మకామార్థభేదేన త్రివిధో భవేత్
వ్రతనియమతపోయోగాద్యస్మిన్ బహుధా నివేశితః కామః
పుత్రాదిభోగసుఖకృత్స జ్ఞేయో ధర్మశృంగారః. 303

అర్థావాప్తిర్యస్మిన్కామేన నివేశితేన సంభవతి
తదధీనవిభవభోగాస్వాదసుఖేనార్థశృంగారః. 304

పరదారద్యూతసురామృగయాద్యాస్వాద కేలివినివిష్టః
తత్తద్విషయాస్వాదనసుఖలలితః కామశృంగారః. 305

శృంగారము మూడు విధములు – ధర్మశృంగారము కామశృంగారము అర్థశృంగారము నని. వ్రతనియమములు తపోయోగమున కామనివేశ మున్నచో పుత్రాదిభోగసుఖము కలిగించునది ధర్మశృంగార మగును. నివేశిత మగు కామమున నర్థావాప్తి యున్నచో నర్థాధీనముగా విభవభోగాస్వాదసుఖ మున్నచో నర్థశృంగార మగును. ఇవి ధర్మార్థశృంగారములు. కామశృంగార మీ విధమున నుండును. పరకీయా రతి ద్యూతము సురాపానము మృగయాసక్తి మొదలగువాని యాస్వాదమున కేలివిధానమున వినివేశము కలిగి యుండుట, తత్తద్విషయాస్వాదన సుఖవిశేషములచే లలితముగా నుండుట కామశృంగార స్వభావములు.

వీథ్యంగాని యథాలాభమాముఖం నాటకాదివత్
శృంగారత్రితయం యత్ర నాత్ర బిందప్రవేశకౌ. 306

ఇత్థం సమవకారస్య లక్షణం దర్శితం బుధైః
ఉదాహరణమేతస్య భవేదమృతమంథనమ్. 307

ఈ సమవకారమునందు వీథ్యంగములను యథాలాభముగా గూర్పవలెను. నాటకాదులందువలె నాముఖమును గూర్పునది. శృంగారత్రితయమున్న స్థలమున బిందుప్రవేశకములను గూర్ప దగదు. ఇంతవరకు చెప్పిన విధముగా సమవకార లక్షణ ముండుటను బుధులు నిరూపించిరి. సమవకారరూపకమున కమృత మంథన ముదాహరణము.

ప్రథమేఽంకేఽత్ర శృంగారకపటాశ్చ సవిద్రవాః
యుద్ధజలసంభ్రమో వా వాయ్వగ్నిగజే ద్రసంభ్రమకృతో వా
నగరోపరోధజో వా విజ్ఞేయో విద్రవస్త్రివిధః. 308

ఉష్ణిగ్గాయత్ర్యాద్యన్యాని చ యాని బంధకుటిలాని
వృత్తాని సమవకారే కవిభిస్తాని ప్రయోజ్యాని. 309

వీథీప్రహసనాంగాని భవేయుర్వా న వా క్వచిత్
అన్యథా వర్ణయంత్యన్యే కపటం విద్రవం బుధాః. 310

వస్తుక్రమసముద్భూతో దైవసంపాదిత స్తథా
తథా శత్రుకృతశ్చేతి కపటాః స్యుస్త్రయః క్రమాత్. 311

ఇంకను సమవకార విశేషములు కొన్ని యున్నవి. ప్రథమాంకమున శృంగార కపట విద్రవము లుండవలెను, విద్రవము మూడు విధములు-యుద్ధకృతము జలకృత మయిన సంభ్రమము వలన గలుగు విద్రవము, వాయు వహ్ని గజకృత సంభ్రమము వలన గలుగు విద్రవము, నగరోపరోధజన్య మయిన విద్రవము నని యిది త్రివిధము. ఉష్ణిక్ - గాయత్రి మొదలయిన బంధకుటిలములగు వృత్తములను సమవకారమున కవులు ప్రయోగింపవలెను. వీథ్యంగములు ప్రహసనాంగములు సమవకారములలో కొన్నిటిలో నుండవు. ఈ భావాభావముల నౌచిత్యానుసారమున గూహించునది. కపటము విద్రవము అనువాని నన్యబుధు లన్యథా వర్ణించుచున్నారు. వస్తుక్రమ సముద్భూత మగు కపటము, దైవసంపాదితమగు కపటము, శత్రుకృతమగు కపటము నని కపటము మూడు విధములు. విద్రవము వాతాదికృతము సమముగ నున్నందున నిచట వేరుగా ప్రతిపాద్యము కాదు. ఈ కపటవిభాగము నీ విధముగా లక్ష్యమున భావించునది.

తథాహి చిత్రశాలాంకే దండకాష్ఠోపసంగమాత్
జ్వరో విదూషకస్యైష కపటః ప్రథమః స్మృతః. 312

దైవాద్వధ్యశిలారోహో నాగానందే ప్రకల్పితః
జీమూతవాహనస్యైష ద్వితీయః కపటః స్మృతః. 313

యథా పుంసవనాంకేఽత్ర చింతామూర్ఖస్య మాయయా
కైకేయీమంథరావేషధారణం కపటోఽంతిమః
(వాతాదిజన్యసామ్యాత్తు) విద్రవో నాత్రకథ్యతే. 314

చిత్రశాలాంకమున వస్తుక్రమసముద్భూతమయిన కపట మున్నది. విదూషకుడు కఱ్ఱ చేతబట్టి తనకు జ్వరము వచ్చిన దని యడుగు దీసి యడుగు పెట్టలేనని యనును. విదూషకునకు వంకర టింకరగా నుండు దండకాష్ఠము రంగ సంచారమున నుండును. ఇట్లు దండకాష్ఠోపసంగ్రహమున విదూషకుని జ్వరము మొదటి కపటము. నాగానంద నాటకమున దైవసంపాదిత మయిన కపట మున్నది. జీమూతవాహనుడు సముద్రతీరమున కేగి శంఖచూడు డను నాగ కుమారుని వధ్యశిల నారోహింపగా గరుడుడు హరించి భక్షించుట కుపక్రమిం చును. ఇది దైవకృతముగా గలిగినది. ఇది ద్వితీయకపటము. మూడవకపటము శత్రుకృతము. పుంసవనాంకమున చింతామూర్ఖుని కైకేయీ మంథరావేష ధారణ మంతిమకపటము. ఇది యే నాటకమున గలదో స్పష్టము కాలేదు. ఈ యుదాహృతాంశములు గలవి సమవకారరూపరూపకములు కాకున్నను, కపట స్వరూపము గుర్తించుట కుదాహృతము లయిన వనుట స్పష్టము.

## వీథీ లక్షణము

ముఖనిర్వహణే సంధీ వీథ్యాం వృత్తిస్తు కైశికీ
ద్వాభ్యాం ప్రయోజ్యా పాత్రాభ్యాం క్వచిదేకేన వా భవేత్. 315

అంగీ సర్వరసస్పర్శీ శృంగారోఽస్యాః ప్రధానతః
యుక్తా లాస్యాంగవీథ్యంగైః సమ్యగుద్ఘాత్యకాదిభిః. 316

భవేయుర్వా న వేత్యస్యాం లాస్యాంగాన్యాహ కోహలః
వీథ్యాః శృంగారరూపత్వాద్విధేయానీతి భోజరాట్. 317

ఏకాంకైవ భవేద్వీథీ రసః సూచ్యోఽత్ర సంభృతః
యథా వకులవీథీ స్యాదిందులేఖాదయో యథా. 318

వీథీలక్షణ మిట్లు పరిగ్రాహ్యము. వీథిలో ముఖసంధి నిర్వహణసంధి రెండు మాత్రమె యుండును. కైశికీవృత్తి యుండును. ఇద్దరు పాత్రలు ప్రయోగింతురు. క్వచిత్ ఒక పాత్రయేని ప్రయోగించును. శృంగారము ప్రధానరసము. అంగిగా నుండును. సర్వరసస్పర్శిగా నుండును. ఉద్ఘాత్యకాదులగు వీథ్యంగము లన్నియు నిందుండవలెను. లాస్యాంగములు నుండును. వీథిలో లాస్యాంగము లుండవచ్చును, ఉండక పోవచ్చునని కోహలు డనెను. వీథి శృంగారరూప మయినందున నవశ్యముగా లాస్యాంగము లుండవలెనని భోజరాజనెను. వీథిలో నొకయంకమెయుండును. సంభృత మయిన శృంగారరసమును సూచింపవలెను. వకులవీథి యనునది వీథి. ఇందులేఖాదులు వీథీపదవాచ్యములు.

## ఉత్సృష్టికాంక లక్షణము

ఉత్సృష్టికాంకే ప్రఖ్యాతమితివృత్తం క్వచిద్భవేత్
కదాచిదేతదుత్పాద్య మప్రఖ్యాతం కవేర్ధియా. 319

దివ్యైరయుక్తః పురుషైః శేషైరన్యైః సమన్వితః
కైశికీవృత్తిహీనశ్చ సాత్త్వత్యారభటీయుతః. 320

నియుద్ధ యుద్ధ సంఫేట ప్రహార నిధనోద్భటః
ప్రభూతతరుణస్త్రీణాం పరిదేవితమేదురః. 321

నిర్వేదభాషితైః స్త్రీణాం నానావ్యాకులచేష్టితైః
క్వచిద్భయానకప్రాయః కర్తవ్యోఽభ్యుదయాంతిమః. 322

ఏవముత్సృష్టికాంకస్తు కర్తవ్యః కావ్యవేదిభిః

ఉత్సృష్టికాంకమును అంకమనియు నందురు. ఇందితివృత్తము ప్రఖ్యాతము. ఇది యొకచో నుండును. మరియొకచో కవి యిచ్ఛానుసారమున నప్రఖ్యాత మగు నుత్పాద్యవస్తువు నుండదగును. దివ్యపురుషు లిందుండరు. అదివ్యు లన్యులతో నిది కూడి యుండును. ఇందు కైశికీవృత్తి యుండదు. సాత్త్వతి యారభటి వృత్తు లుండును. యుద్ధము నియుద్ధము సంఫేటము ప్రహారము నిధనములతో నిది యుద్భటముగా నుండును. సమధిక తరుణ వనితల పరిదేవితములతో నిది యతిశయితముగా నుండును. స్త్రీల నిర్వేదభాషితములతో నుండును. నానావ్యాకులచేష్టితములతో నుండును. ఒకచో భయానక

ప్రాయముగా ఉచితము కావలెను. కాని యంతమున నభ్యుదయముతో నుండ దగును. కావ్యవేదు లుత్సృష్టికాంకము నేవంప్రకారముగ రచింపవలెను. ఇందింకను కొన్ని విశేషములు కలవు.

అస్యాంక మేకం భరతో ద్వావంకావితి కోహలః. 323

వ్యాసాంజనేయగురవః ప్రాహురంకత్రయం సదా
విష్కంభకోఽత్ర సంకీర్ణ స్తత్ర తత్ర ప్రవేశకః. 324

ముఖనిర్వహణే సంధీ ఇతి కోహలభాషితం
ఈహామృగవదిత్యన్యే కేఽప్యాహుర్డిమసంధిభిః. 325

ఈ యంకమున నొక యంకమె యుండునని భరతు డనెను. రెండంకము లుండవలెనని కోహలు డనెను. వ్యాసుడాంజనేయుడు మా గురువు దివాకరుడు అంకత్రయ ముండుట యుక్త మనిరి. దీనిలో విష్కంభకము సంకీర్ణముగ నుండుట, అచ్చటచ్చట ప్రవేశక ముండుట యితివృత్తానుసారమున నపేక్షితము కాగా నంకత్రయ మావశ్యక మగును. అంకద్వయ మావశ్యక మనిన కోహలుడు ముఖసంధినిర్వహణసంధి యుండ దగు ననెను. కొంద రీహామృగము నందు వలె నుండవలె ననిరి. కొందరు డిమము లోని సంధుల వలె నుండదగు ననిరి. ఇట్లిందరి భాషితములు భావనీయములు.

దశరూపకములలో నీహామృగము లక్షితము కావలసి యున్నది. ఈ లోపుగా శారదాతనయుడు భారతవర్షోచిత మగున వ్యవహారము నిరూపింప దలచెను. భారతవర్షము కర్మభూమి. వివిధవస్తుసమావేశవర్ణనము భారతము నందే యుక్తము. తదౌచిత్య మిందే యున్నది. ఈ యంశమును సోదాహరణ ముగా నిరూపించుట కీ యంశ మావశ్యకము.

యద్దివ్యనాయకకృతం కార్యం సంగ్రామబంధువధయుక్తం
తద్భారతే తు వర్షే కర్తవ్యం కావ్యబంధేషు. 326

కస్మాద్భారతమిష్టం వర్షేభ్యస్తస్య కర్మభూమిత్వాత్
న వధాదయః క్వచిత్స్యుః నిబంధనీయాః ప్రయోజ్యాశ్చ. 327

భవేయుః క్వాపి యద్యేతే ప్రత్యుజ్జీవంత్యనంతరం
లక్ష్మణస్య వధః శక్త్యా రావణేన యథాకృతః. 328

యత్ర ప్రత్యుజ్జీవనాంతోఽభూత్తత్తు రామానుజాహ్వయే
జీమూతవాహనస్యాపి నాగానందే వధో యథా. 329

తత్ర ప్రత్యుజ్జీవనాంతశ్చ తథైవాన్యత్ర కల్ప్యతాం
చంద్రాపీడస్య మరణం యత్ర ప్రత్యుజ్జీవనాంతిమమ్. 330

కల్పితం భట్టబాణేన యథా శారదచంద్రికా
దివ్యేన మర్త్యస్య వధః కావ్యాన్యపశ్యభావతః. 331

నిబంధే సూచ్య ఏవాయం విచ్ఛిత్త్యైవ ప్రవేశకైః
యథా సగరపుత్రాణాం కపిలేన వధః కృతః. 332

ప్రవేశకైః సూచితోఽయం ఛేద్యైర్గంగాభగీరథే
యథా వధః ప్రయోజ్యః స్యాత్తథా బంధాది కల్ప్యతామ్. 333

ఇత్యాహుర్భారతే వర్షే ఇతి శంకుకభాషితం
దేశేష్వన్యేషు కవిభిర్న వధాదిః ప్రకల్ప్యతే. 334

హృద్యా తత్తద్భూమిః శోభనగంధా చ కాంచనీ యస్మాత్
ఉపవనసలిలక్రీడావిహారనారీరతిప్రమోదాశ్చ. 335

తేషు చ వర్షేషు సతాం భవతి న దుఃఖం నవా శోకః
ఏతే దేశవిశేషాః పురాణశాస్త్రైరిహోపరిగణితాః 336

కర్మారంభో న భవేత్తేషు సువతే యత్ఫలం భోగ్యాః
సుఖతోత్సవసంభోగా దేశేష్వేతేషు బంధనీయాః స్యుః.
రత్యుపచారాంగతయా గీతాంగాని ప్రయోజనీయాని. 337

అన్యే రసా న ప్రయోజ్యాస్తత్తద్దేశవిశేషతః
ప్రాయేణోత్సృష్టికాంకస్తు వర్షే భారత ఏవ హి
అనుషంగేణ కథితో విశేషోఽత్రావధారితః. 338

కావ్యబంధము లొనరించు కవు లీ విషయముల నవధరింప వలయును. దివ్యనాయకకృత మగు సంగ్రామము బంధువధము మొదలగు వానితో గూడు కొనిన కార్యమును భారతవర్షముననె నిరూపింపదగును. ఇతరవర్షముల కన్న భారతవర్షమె యేల అభీష్టము కావలెను? భారతవర్షము కర్మభూమి కావున సర్వ

వర్షముల కన్న భారతవర్షమె యిష్టము. భారతవర్షమున నాయకాదుల వధాదు లెచ్చట నుండవు. అవి యిచట నిబంధనీయములు కావు. ప్రయోజ్యములునుగావు. ఎచ్చటనేని వధాదులు ప్రయుక్తము లగునేని వెంటనే ప్రత్యుజ్జీవనము నిరూపింప దగును. రామాయణకథలో రావణుడు శక్త్యాయుధముచే లక్ష్మణవధ మాచరించుట యున్నది. కాని యది ప్రత్యుజ్జీవనాంతముగా నున్నది. ఇది రామానుజ నాటకమున గలదు. హర్ష నాగానందనాటకమున గరుడుడు జీమూతవాహనుని రక్తము పీల్చి వధించుట యున్నది. కాని యదియు ప్రత్యుజ్జీవనాంతముగా నిరూపిత మయినది. ఇట్లే యితరము లందును నిబంధింప దగును. భట్టబాణుడు కాదంబరిగ్రంథములో చంద్రాపీడుని మరణమును ప్రత్యుజ్జీవనాంతిమముగనె నిరూపించెను. శారదచంద్రిక ప్రత్యుజ్జీవనాపాదికగా నిరూపిత మయినది. కావ్యమున వస్తుస్వభావావశ్యంభావిత ననుసరించి దివ్యుడు మర్త్యుని వధింప వలసి యుండుట నిరూపణీయ మయినను కావ్యబంధమున నది సూచ్యమె కావలయును కాని ప్రదర్శనీయము కారాదు. అంకమునకు విచ్ఛిత్తి నాపాదించి ప్రవేశకములచే నా యంశమును సూచింపవలెను. గంగాభగీరథమున కపిల మహర్షి సగరపుత్రుల వధ యొనర్చి నట్లు కలదు. అది యంకచ్ఛేదములతో ప్రవేశకములతో సూచిత మయినది. వధవృత్తాంతము నిబంధించిన విధముననె బంధాదికమును భారతవర్షమున నిబంధింపవలయు ననుట శ్రీశంకుక భాషితము.

అన్యదేశము లందును కవులు వధాదికల్పన నిబంధన కల్పన మొనరింపరు. ఆ యా దేశభూమి హృద్యము. శోభనగంధము. కాంచనభూమి. ఉపవనములు సలిలక్రీడలు విహారములు నారీరతి ప్రమోదము లుండును. ఆ యా వర్షములలో నివసించువారలకు దుఃఖము లేదు. శోకములేదు. ఇట్టిదేశవిశేషములు పురాణములలో నితిహాసములలో పరిగణితము లయినవి. ఆ దేశములందు కర్మారంభము లుండవు. వారి యా దేశము ధనము ప్రసాదించును. ఆ దేశములలో సురతోత్సవములు సంభోగములు నిబంధింపదగును. రత్యుపచారాంగముగా నచట గీతాంగములను ప్రయోగింపవలెను. ఆ యా దేశవిశేషమున నితరరసములు వారలకు ప్రయోజ్యములుకాదగవు. సామాన్యముగా నుత్సృష్టికాంకము భారతవర్షముననె యుచితమని యిది నిరూపిత మయినది. దీని యనుషంగమున నవధారిత మయిన విశేష మిచట నిట్లుపపాదిత మయినది.

### ఈహామృగ లక్షణము

ఈహామృగస్యేతివృత్తం ప్రఖ్యాతోత్పాద్యమిశ్రితం
ముఖప్రతిముఖోపేతం తథా నిర్వహణాన్వితమ్. ౨౨౫

ధీరోద్ధతశ్చ ప్రఖ్యాతో దివ్యో మర్త్యోఽథ నాయకః
బలాద్దివ్యాంగనాహేతుప్రవృత్తోద్దామసంగరః. 340

గణశః షట్చతుః పంచ నాయకాః ప్రతినాయకాః
యథా సమరసంరంభ తుల్యవృత్తి రసాశ్రయాః. 341

వృత్తిత్రయయుతో హీనః కైశిక్యా సహితోఽపి వా
భయబీభత్సరహితాః షడేవాత్ర రసాః స్మృతాః. 342

అంకాశ్చత్వార ఏవాత్ర సవిష్కంభప్రవేశకాః
వ్యాజాన్నిర్వర్తితోద్దామసంరంభారంభసంగరః. 343

వధం ప్రాప్తస్య నో కుర్యాన్నేతుః క్వాపి యశస్వినః
ఉక్తా వ్యాయోగధర్మా యే తే స్యురీహామృగేఽపి చ. 344

వ్యాయోగస్య విశేషోఽయమస్త్రీహేతుకసంగరః
ఈహామృగశ్చ కథితో యథా కుసుమశేఖరః. 345

భాణే వీథ్యాం ప్రహసనే వ్యాయోగోత్సృష్టికాంకయోః
డిమే సమవకారే చ తథైవేహామృగేఽపి చ. 346

ముఖం ప్రతిముఖం గర్భోఽవమర్శశ్చోపసంహృతిః
ప్రయోజ్యాస్సన్ధయస్సన్త్యైకద్విత్ర్యాదిలోపతః. 347

ఏకలోపే చతుర్థః స్యాద్ద్విలోపే త్రిచతుర్థయోః
ద్వితృతీయచతుర్థానాం త్రిలోపే లోప ఇష్యతే. 348

ఈహామృగ మను రూపకము నం దితివృత్తము ప్రఖ్యాతోత్పాద్య మిశ్రితమై యుండును. ముఖప్రతిముఖసంధి సముపేతముగా నుండును. నిర్వహణసంధి సమన్వితముగా నుండును. నాయకుడు ధీరోద్ధతుడు ప్రఖ్యాతుడు. దివ్యుడు మర్త్యుడు కావచ్చును. ఇష్టపడని దివ్యాంగనాహేతుకముగా ప్రవృత్తమయిన యుద్దామసంగర మిందుండును. నాయకప్రతినాయకులు గణరూపమున నారుగురు నలుగు రయిదుగురుగా నుండి సమరసంరంభానుకూలముగా తుల్యవ్యాపారమున రసాశ్రయులుగా నుందురు. కైశికీవృత్తి యుండదు. మిగిలిన మూడు వృత్తులుండును. ఒకచో కైశికీసహితముగ నయిన నుండును. బీభత్సభయానక రహితముగా నారురసము లిందుండును. విష్కంభక ప్రవేశకములతో గూడు

కొనిన అంకములు నాలుగె యుండును. ఉద్దామసంరంభారంభముతో నున్న సంగర మిందు వ్యాజమున జరుగకుండు నట్లొనర్పవలెను. యశస్వి నాయకుడు యుద్ధమున పట్టుబడినను అతని వధము నిరూపింపబాదు. వ్యాయోగమున నిరూపితము లయిన ధర్మము లీ యీహామృగమున నుండదగును. అస్త్రీహేతుక మయిన సంగరము మాత్రము వ్యాయోగమునను న్న విశేషముగా భావించునది. కుసుమశేఖరమను రూపక మీహామృగముగా నెన్నదగినది.

నాటకము ప్రకరణము తప్ప ఇతరము లయిన భాణ—వీథీ—ప్రహసన-వ్యాయోగ-ఉత్సృష్టికాంక—డిమ-సమవకార-ఈహామృగము లందు ముఖాదిపంచ సంధులను ఏకద్విత్ర్యాదిలోపవిధానానుసారమున కూర్పవలెను. ఒకసంధి లోపించుట యిష్టమయినచో నాలవది యయిన విమర్శసంధిని లోపింప జేయవచ్చును. ద్విలోప మిష్టమయిన మూడు నాలుగు సంధులు గర్భ విమర్శసంధులు లోపింప వచ్చును. త్రిలోపాభిమాన మున్నచో ప్రతిముఖ-గర్భ-విమర్శసంధులకు లోప ముండుట యుక్తముగా నుండును.

> ఇత్థం విచింత్య దశరూపకలక్ష్మమార్గ
> మాలోక్య వస్తు చ విభావ్య బృహత్కథాం చ
> కుర్యాదయత్నవదలంకృతిభిః ప్రబంధం
> వాక్యైరుదారమధురైః స్ఫుటమందవృత్తైః. 349

ఇతి శ్రీ శారదాతనయవిరచితే భావప్రకాశనే
దశరూపకలక్షణకథనో నామాష్టమోఽధికారః.

ప్రబంధనిర్మాణ మొనరించు కవి యిట్లు దశరూపకలక్షణమార్గమును బాగుగా సమీక్షింపవలెను. వస్తుస్వరూపమును విభాగమును విస్తరమును సమాలోచన మొనరింప వలెను. బృహత్కథాస్వరూపమును విభావింపవలెను. ఆ పిమ్మట నయత్నసిద్ధములగు నలంకృతులతో నుదారమధురములగు వాక్యములతో స్ఫుటములు మందములగు వృత్తములతో ప్రబంధము నిర్మింప వలెను. ఇట్టి నిర్మాణమె సముచితము. లక్షణము గుర్తింపక అనాలోచితముగ వస్తువు నిబంధించుట, అప్రయత్నముగా నలంకారములను గూర్చుట, అసంగతవాక్యములను కూర్చుట ప్రబంధకృతులకు శోభాసంపాదకము కాదు. కావున ప్రబంధ నిర్మాణమున కవికి సావధానత యపేక్షితమని భావము.

ఇది శ్రీ శారదాతనయవిరచితమైన భావప్రకాశమునందు
భావాలోకమున దశరూపకలక్షణకథనమనెడి
అష్టమాధికారము.

# నవమాధికారము

## నృత్యభేద స్వరూప ప్రకారనిర్ణయము

నృత్యభేదస్వరూపనిరూపణ మని యీ నవమాధికారమునకు సంకేతము కలదు. పదార్థాభినయాత్మకము లయిన వింశతివిధ నృత్యభేదముల నిరూపణ మిందున్నది. వీని యవాంతరభేదము లున్నవి. ప్రసంగానుసారమున నాటకశాస్త్రీల భాషానియమము వ్యవహారోపయోగి పారిభాషికశబ్దములు అభిప్రాయసూచకాక్షరములు నిరూపితము లయినవి. రసోపయోగిచ్ఛందములు ధీరోద్ధతాదినాయకజాతులు చతుర్విధనాయకుల కుపయుక్తు లగు విదూషకుల విశేషములు ప్రతిపాదితము లయినవి. ఈ ప్రసంగముననె యాఖ్యాయికాదుల స్వరూపలక్షణములు వివేచితము లయినవి. తుదకు కవిశిక్ష నిదర్శితము. కతిపయ గ్రంథములలో గోచరింపని విశేషము లీ యధికారమున గలవు.

ఆరంభమున క్షమాభ్యర్థన మొనరించియు శారదాదేవీప్రసాదముననె సర్వము సపన్న మయినదని శారదాతనయుడు స్వాత్మవిశ్వాసము విస్పష్టము చేయుట యిందు భావరమ్యముగా నున్నది.

భరతాదిప్రణీతత్వాదర్థే దోషో న కశ్చన
శబ్దే విభక్తివ్యత్యాసాల్లింగవ్యత్యాసతోఽపి వా. 1

ధాత్వర్థస్య విపర్యాసాద్దోషో యద్యపి దృశ్యతే
సద్భిః తత్క్షమ్యతామత్ర కో లోకే న ప్రమాద్యతి. 2

ఏతత్తు శారదాదేవ్యాః ప్రసాదాదేవ దర్శితం
తస్మాదభ్యసనీయోఽయం భావజ్ఞానాయ కోవిదైః. 3

లలితకలావిజ్ఞానసర్వస్వము నాట్యసర్వస్వము సాహిత్యసంవిత్సర్వస్వము భరతాదిమునిప్రణీతము. కావున నర్థమున దోష మేమియు నుండదు. ఋషిప్రణీతములందు దోషము లుండవు. వా రార్షదర్శనమున నతీతానాగతము సర్వము సాక్షాత్కరించు కొనగలరు. వారు నిరూపించినది యబాధిత మయిన

సిద్ధాంతము. నిర్దుష్ట మయిన నిర్ణయము. వారు నిరూపించిన యర్థము పర మార్థము. అందు దోషముండదు. శబ్దమున నేమేనిదోష ముండవచ్చును. భర తాది నిరూపిత నిర్దుష్టార్థమును నిబంధించుటలో శబ్దరచన నాదియె కావున నిందే మేని దోషముండును. వారి యర్థమునె నేను నిరూపించినందున నందు దోష మేమియు లేదు. తదర్థనిరూపణమున శబ్దము నందు దోషమేల రావలయును? ఎచటనేని విభక్తివ్యత్యాసమున, లింగవ్యత్యాసమున, ధాత్వర్థవిపర్యాసమున నేదేని దోషముండ వచ్చును. ఇట్లే ఛందోయోజనమున గురులఘువిన్యాస వ్యత్యాసమునను దోషముండి యుండును. ఇట్లు కొన్నిదోషములు సావధాన మతులగు దోషజ్ఞుల కవభాసించినను ఆ దోషజ్ఞసహృదయు లిట్టి దోషముల నంతగా పట్టవలదు. ఇందలి యర్థమును భావించి సంభావించి సహృదయులు సంవాదము కలవారుగ నుండుటయె సముచితము. దోషము లేవేని పురోభాసము కలవయినచో నా సద్భావులు క్షమింతురు గావుత. దోషమేరికి గలుగదు? "కో లోకే న ప్రమాద్యతి" లోకమున నెవరు ప్రమాద పడరు? ఇందలి నా దోషము లేవేని యున్నచో నవి ప్రమాదపతితము లనియె భావింప వలెను. అట్టి వజ్ఞాన కృతము లని భావింపరాదు. శ్రీ శారదాదేవీప్రసాదము గలవారల కజ్ఞాన మేమి? వాచాందేవి మాకు నిత్యప్రసన్న; తత్ప్రసాదపారవశ్యమున నున్నప్పుడు కించి త్ప్రమాద మనవధానత యుండును. దోషమేదేని యనవధానకృతము. ఈ భావ ప్రకాశనగ్రంథము శ్రీశారదాదేవీప్రసాదముననె ప్రదర్శిత మయినది. కావున కోవిదులగు సహృదయులు భావజ్ఞానమున కీ విధాన మభ్యసించుట యుక్తము. దోషమున్నదని భావించువారలు నొకప్పు డనవధానమున ప్రమాద పడ వచ్చును. "కో లోకే న ప్రమాద్యతి"? భరతాదిప్రణీతార్థ మదుష్టముగ నిందు గలదు కావున నా యర్థమును స్వానుసంధానమున నభ్యసించుట యాస్వాదించుట యుక్తమని భావము.

## ఉపరూపకములు

దశరూపేణ భిన్నానాం రూపకాణామతిక్రమాత్
అవాంతరభిదాః కాశ్చిత్పదార్థాభినయాత్మికాః. 4

తే నృత్యభేదాః ప్రాయేణ సంఖ్యయా వింశతిర్మతాః
తోటకం నాటికా గోష్ఠీ సంలాపః శిల్పక స్తథా. 5

డోంబీ శ్రీగదితం భాణో భాణీ ప్రస్థానమేవ చ
కావ్యం చ ప్రేక్షణం నాట్యరాసకం రాసకం తథా. 6

ఉల్లోప్యకం చ హల్లీస మథ దుర్మల్లికాఽపి చ
కల్పవల్లీ మల్లికా చ పారిజాతకమిత్యపి. 7

ఏతా నామాంతరైః కైశ్చిదాచార్యైః కథితా అపి
సంవిధానక్రమస్తాసాం న కదాచన భిద్యతే. 8

దశరూపభిన్నము లయిన రూపకముల కన్న వేరుగా నవాంతరభేదములు కొన్ని కలవు. అవి పదార్థాభినయాత్మకములు. రసము వాక్యార్థాభినయాత్మక మని నాట్యరూప మని పూర్వము నిరూపిత మయినది. కాగా భావము పదార్థాభినయాత్మకము నృత్యరూప మనుట యుక్తము కదా!. సామాన్యముగా నీ నృత్యభేదము లిరువది కలవని సంఖ్యాతము లయినవి.

తోటకము - నాటిక-గోష్ఠి - సల్లాపము-శిల్పకము-డోంబి - శ్రీగదితము - భాణము-భాణి-ప్రస్థానము-కావ్యము-ప్రేక్షణము-నాట్యరాసకము- రాసకము-ఉల్లోప్యకము-హల్లీసము-దుర్మల్లిక-కల్పవల్లి-మల్లిక-పారిజాతకము

అనునవి నృత్యభేదము లిరువది. ఇందు కొన్ని యితరుల పరిగణమున నామాంతరమున నున్నవి. అయినను సంవిధానక్రమ మేమియు భిన్నము కాదు. వీని విశేషము లిక ప్రస్తుతము లగును.

నాటికాయాస్తోటకస్య సట్టకస్య చ లక్షణం
అంశత్వాన్నాటకస్యాపి తథా ప్రకరణస్య చ. 9

అనుషంగిక మేతేషాం లక్షణం తత్ర దర్శితం
డోంబీ శ్రీగదితం భాణో భాణీ ప్రస్థాన రాసకాః. 10

కావ్యం చ సప్త నృత్యస్య భేదాః స్యుస్తేఽపి భాణవత్
ఇత్యాహుః కేచిదన్యే తాన్సర్వాన్నృత్యాత్మకాన్విదుః. 11

నాటకమునకు ప్రకరణమున కంశరూపము లగుట వలన నాటిక తోటకము సట్టకము అను వాని లక్షణ మానుషంగికముగా నిదర్శిత మయినది. వానికి మఱల నిచట స్వరూపనిరూపణ మావశ్యకముకాదు. డోంబి-శ్రీగదితము-భాణము-భాణి - ప్రస్థానము-రాసకము - కావ్యము అను నేడును నృత్యమునకు సంబంధించిన భేదములని ఈ సప్తకము భాణసదృశ మని కొందరనిరి. కొందరన్నిటిని నృత్యాత్మకము లనియె భావించిరి.

1. గోష్ఠి.

అథోత్పాద్యకథై కాంకా గోష్ఠీ శృంగారమంథరా
రూపసౌందర్యలావణ్యోపేత షట్పంచనాయికా. 12

ప్రాకృతైర్నవభిః పుంభిర్దశభిర్వాప్యలంకృతా
గర్భావమర్శసంధిభ్యాం శూన్యా శోదాత్తవాక్కృతా
అత్ర స్యాత్కైశికీ వృత్తిః మృద్వీ నాన్యరసాశ్రయా. 13

న కుంజరఘటాఘాతపాత్రం భవతి కందలీ
గోపీపతేర్విహారతో గోష్ఠబాలస్య చేష్టితం
యత్తు యమాలార్జునాదిదానవనిధనకృతం తత్తు గోష్ఠీ స్యాత్. 14

గోష్ఠి యను నృత్యరూపకములో నుండదగు విశేషము లీ విధమున నున్నవి. కథావస్తువు కల్పితము. అంక మొకటియె యుండును. మంథరముగ శృంగార ముండును. రూపము సౌందర్యము లావణ్యము కల నాయిక లయిదారుగు రుందురు. ప్రాకృతు లయిన పురుషులు తొమ్మిది పది యుందురు. గర్భసంధి యవమర్శసంధి యిందుండవు. ఉదాత్తవాక్యరచన యుండదు. ఇందు మృదు వయిన కైశికీవృత్తి యుండును. ఇట్టి గోష్ఠి యన్యరసముల కాశ్రయముగా నుండదు. కదలి కుంజరసమూహముల ఘాతప్రఘాతముల కాశ్రయముగా నుండదు కదా! గోష్ఠబాలకు డయిన గోపీపతి విహారచేష్టిత మిందు వర్ణితమగును. గోపనందను డొనరించిన యమలార్జున భంజనము దానవనిధనము ఈ గోష్ఠిలో నుండును. గోష్ఠవిహార మున్నందున గోష్ఠి. గోష్ఠిచరితము రమ్యము.

2. సల్లాపకము.

సల్లాపస్యేతివృత్తం యత్ఖ్యాతం చోత్పాద్యమేవ వా
మిశ్రం వా తత్ర శృంగారహాస్యౌ నైవార్హతః క్వచిత్. 15

శబలో వీరరౌద్రాభ్యామంగాన్యన్యే రసాః స్మృతాః
ప్రాయస్సపత్నశాంతశ్చ క్రుద్ధపాషండనాయకః. 16

దైవారిజన్యకపట యుద్ధస్థానోపరోధవాన్
సాత్త్వత్యారభటీవృత్తిసహితశ్చ సవిద్రవః. 17

అంకాస్త్రయః, ద్వితీయేఽంకే తాలప్రాచుర్యయుగ్భవేత్
తృతీయోఽంకః సకపటః ప్రథమోఽంకస్సవిద్రవః
చతుస్సంధిః ప్రతిముఖశూన్యః సల్లాపకో భవేత్. 18

సల్లాపము-సల్లాపకము పర్యాయములు. ఈ నృత్యరూపకము నందు కథావస్తువు ప్రఖ్యాతము కావచ్చును. ఉత్పాద్యమును కావచ్చును. మిశ్రమమును కావచ్చును. దీనిలో నెచ్చటను శృంగారహాస్యము లర్హములు కావు. వీరరౌద్రములతో నిండి శబలమై యుండును. ఇతరరసము లంగము లగుట యుక్తము. సామాన్యముగా నిందు విరోధము శాంత మగును. పాషండనాయకు లిందు క్రుద్ధులై ప్రవర్తింతురు. దైవజన్య మదైజన్య మయిన కపటము యుద్ధ ముండును. యుద్ధస్థానము నందుపరోధ ముండును. సాత్త్వతీవృత్తి యారభటీవృత్తి యిందు విద్రవసహితముగా నుండును. ఇందు మూడే యంకములు ప్రథమాంకము విద్రవముతో గూడి యుండును. రెండవ యంకమున తాలప్రాచుర్యము కల విద్రవము కపటము నుండుట గ్రాహ్యము. తృతీయాంకము కపటముతో కూడి యుండును. సల్లాపకమునందు ప్రతిముఖసంధి రహితముగా నాలుగుసంధు లుండదగును. ఇట్టిది సల్లాపకము.

౬. శిల్పకము.

శిల్పకశ్చతురంకః స్యాచ్చతుర్వృత్తివిరాజితః
హాస్యం వినా రసైః పూర్ణః స్వతో బ్రాహ్మణనాయకః. 19

హీనోపనాయకః క్వాపి శ్మశానాదిసమాకులః
ఊఢా పునర్యాః కన్యా వా తాః స్యుస్సచివవిప్రజాః. 20

మాలతీమాధవస్యేవ, కమలస్య కలావతీ
అంగాని సప్తవింశత్స్యురుత్కంఠాదీని చ క్రమాత్. 21

ఉత్కంఠా చావహిత్థం చ ప్రయత్నాశంసనే అపి
తర్కశ్చ సంశయస్తాప ఉద్వేగో మౌఢ్యమేవ చ. 22

ఆలస్యకంపానుగతివిస్మయాస్సాధనం తథా
ఉచ్ఛ్వాసశ్చ తథాఽఽతంకః శూన్యతా చ ప్రలోభనమ్. 23

నాట్యం సంఫేట ఆశ్వాసః సంతోషాతిశయ స్తథా
ప్రమదశ్చ ప్రమాదశ్చ యుక్తిశ్చాపి ప్రలోచనా. 24

ప్రశస్తిశ్చేతి కథితాన్యంగాన్యత్రైవ శిల్పకే
ఉదాహరణమేతేషాం పరస్తాదేవ వక్ష్యతే. 25

శిల్పకము నాలుగంకములతో నాలుగు వృత్తులతో నుండును. హాస్య రసరహితముగా నితరరసములతో నిది పూర్ణముగా నుండును. బ్రాహ్మణు డిందు నాయకుడుగా నుండును. ఒకచో హీను డుపనాయకుడుగా నుండును. శ్మశానాదివిధానములతో నిది సమాకులముగా నుండును. వివాహము చేసికొనిన వనిత గాని, భర్తయుండగా వేరొకని వివాహ మాడిన పునర్భూ వనిత గాని యిందుండును. మంత్రికూతురు బ్రాహ్మణుని కూతురు కన్యగా నుండునదియు నిందుండును. మాధవునకు మాలతివలె, కమలునకు కలావతి వలె (?) సచివ విప్ర కన్య యుండదగును. ఈ శిల్పకమున నిరువది యే డంగము లుండవలెను. అవి యుత్కంఠాదులు, వాని పేరు లీ విధమున నున్నవి:

ఉత్కంఠ-అవహిత్థ-ప్రయత్న - ఆశంసన-తర్క-సంశయ - తాప - ఉద్వేగ మౌఢ్య - అలస్య - కంప - అనుగతి - విస్మయ- సాధన-ఉచ్ఛ్వాస-ఆతంక- శూన్యత- ప్రలోభన-నాట్య-సంఫేట-ఆశ్వాస-సంతోషాతిశయ -ప్రమద- ప్రమాద - యుక్తి-ప్రలోచన-ప్రశస్తి అనునవి.

ఈ యంగము లీ శిల్పకము నందుమాత్రమె యుండును. వీని యుదాహరణ మనంతరము నిరూపితము కాగలదు. ఈ యంగనిర్దేశమున నన్యు లన్యనామముల సూచించిరి. లక్షణము స్పష్టమనియు ననిరి.

4. డోమ్బి.

డోమ్బ్యేవ భాండికోదాత్తనాయికైకాంకభూషితా
కైశికీ భారతీ ప్రాయా వీరశృంగార మేదురా. 26

శ్లక్ష్ణనేపథ్యభాక్ మందోత్సాహ పూరుష నాయికా
అంగాని తస్యాః సప్తస్యుః కామదత్తా యథా కృతా. 27

విన్యాసశ్చాప్యుపన్యాసో విబోధః సాధ్వసస్తథా
అనువృత్తిశ్చ సంహారః సమర్పణమితి క్రమాత్. 28

నిర్వేదవాక్యం విన్యాస ఇష్టార్థవిరహార్తిజం
కార్యాఖ్యానముపన్యాసః తత్తదర్థప్రసాధనే. 29

నివృత్తిస్సంశయభ్రాంత్యోః విబోధ ఇతి కథ్యతే
సాధ్వసః స్యాదభూతస్య భూతోదాహరణం భయాత్. 30

నిదర్శనోపన్యసనమనువృత్తిరితి స్మృతా
యథాభిలషితావాప్తిః సంహార ఇతి కథ్యతే. 31

సమర్పణముపాలంభః పీడయా విరహోత్థయా
అస్యాం లాస్యాంగదశకం యథాయోగం ప్రయుజ్యతే. 33

డోంబి యను నృత్యరూపకమునకు భాండిక యనియు పేరు. ఇందు నాయిక యుదాత్త. ఇందంక మొకటియె యుండును. కైశికీవృత్తి భారతీవృత్తి యుండును. వీరశృంగారము లుండును. ఇందలి నేపథ్యము శ్లక్ష్ణముగా నుండును. ఉత్సాహము మందముగా నుండు నాయకు డుండును. భాణిక యనదగు నీ డోంబిలో నే డంగము లుండును. "కామదత్త" యనునది డోంబి రూపకము. విన్యాసము - ఉపన్యాసము—విబోధము - సాధ్వసము—అనువృత్తి—సంహారము-సమర్పణము అనునవి యిందలి యంగములు. క్రమముగా వీని లక్షణ మిట్లుండును.

1. విన్యాసము. ఇష్టవిరహోద్రిజన్య మయిన నిర్వేదవాక్యమును విన్యాస మందురు. 2. ఉపన్యాసము. తత్తదర్థప్రసాధనమున నుచితకార్యము నిరూపించుట యుపన్యాసము. 3. విబోధము. సంశయభ్రాంతులు నివృత్తము లగుట విబోధ మందురు. 4. సాధ్వసము. భయమువలన నభూతార్థమును భూతార్థముగా నిరూపించుట సాధ్వసము. 5. అనువృత్తి. నిదర్శనరూప మగు నర్థము నుపన్యసించుట యనువృత్తి యగును. 6. సంహారము. అభిలషించిన యర్థప్రాప్తికి సంహార మని పేరు. 7. సమర్పణము. విరహజన్య మయిన పీడా విశేషమున నుపాలంభించుటను సమర్పణ మందురు. ఇట్లు సప్తాంగముల నిందు నిబంధింపదగును. ఈ డోంబిలో యథాయోగముగా లాస్యాంగదశకము నిరూపించుటయు నున్నది.

5. శ్రీగదితము.

అథ శ్రీగదితం విద్యాత్ప్రసిద్ధోదాత్తనాయకం
భారతీవృత్తిబహుల ముదాత్తవచనాన్వితమ్. 33

గర్భావమర్శసంధిభ్యాం శూన్యం ప్రఖ్యాతనాయకం
ఏకాంకం విప్రలంభాఖ్యరసప్రాయం క్వచిత్క్వచిత్. 34

యస్మిన్కులాంగనా పత్యుః శౌర్యధైర్యాదికాన్గుణాన్
సఖీనామగ్రతో వక్తి తానుపాలభతేఽథ వా. 35

విప్రలబ్ధా చ తేనైవ యది తత్సంగమాశయా
ఆసీనా యత్ర లలితం ప్రియాభోగవిభూషితమ్. 36

ఉత్కంఠితా పఠేద్గాయేత్పాఠ్యం వా గీతమేవ వా
ఏవంవిధం శ్రీగదితం రామానందం యథాకృతమ్. 37

శ్రీగదిత మను నృత్యరూపకమున ప్రసిద్ధు డుదాత్తుడు నగు నాయకు డుండును. ఇది భారతీవృత్తి బహులము. ఉదాత్తవచనాన్వితము గర్భసంధి యవమర్శసంధి యిందుండవు. ప్రఖ్యాతోదాత్తనాయకత్వ మనునది పునరుక్తము. ప్రసిద్ధోదాత్తనాయకత్వమునవె యిది సూచితము. ఇందంక మొకటియె యుండును. ఇందొక్కొకచో విప్రలంభశృంగారరస ముండును. దీని కులాంగన తన పతికి సంబంధించిన శౌర్యధైర్యాదిగుణము లను సఖీసముఖమున సమాదరచిత్తమున నిరూపించును. అథవా, విప్రలంభవ్యాకుల కావున నా శౌర్యాదిక ములు నుపాలంభించును. నాయకునిచే నామె విప్రలబ్ధ యయినచో, నాయక వంచిత యయినచో నాతని సంగమాశ కలదై యాసీనయై యుత్కంఠితయై ప్రియుని యాభోగభూషితము లలితము నయిన పాఠ్యము పఠించును. గీతమేని గాన మొనరించును. ఇట్లుండు నిది శ్రీగదితము. రామానంద మనునది శ్రీగదిత రూపకము.

6. భాణము.

హరిహర భాను భవానీ స్కందప్రమథాధిప స్తుతి నిబద్ధః
ఉద్ధతకరణ ప్రాయః స్త్రీవర్జ్యో వర్ణనా యుక్తః. 38

గుణకీర్తిన ప్రకాశన గాథాభిర్భూభృతాం స్తుతినిబంధః
గాయనసహోక్తియుక్తోదాత్తేన విభూషితప్రాయః. 39

త్రిచతురపంచవిభాగైః విశ్రామైః స ప్తభిః పరిచ్ఛిన్నైః
అర్థోద్గారిహానివారణసంఖ్యాతైః కుత్రచిన్నియతః. 40

సమవిశ్రామైర్ద్వివిధైః విభూషితః పంచమే వివరివర్తే
గాథామాత్రాద్ద్విపథకపార్శ్వేనాలంకృతో లలితః. 41

వర్ణోఽథ మత్తపాలీ సభగ్నతాళావనంతరం గాథా
యనుభగ్నతాలమాత్రే ప్రథమే స్యాదభగ్నతాలశ్చ. 42

గాథాద్విపథవసంతా విశ్రామే స్యుర్ద్వితీయే తు
మాత్రావిషమచ్ఛిన్నా సభగ్నతాలా భవేద్వృద్ధ్యా. 43

మాగధికా సాధ్యా స్యాత్తాలవితానే తృతీయే తు
రథ్యాద్విపథవసంతకరథ్యాతాలాశ్చతుర్థేస్యుః. 44

రథ్యాఽథ భగ్నతాలో మార్గణికా ద్విపథవిషమాశ్చ
పంచమకేఽప్యథ షష్ఠే రథ్యానవభగ్నతాలాః స్యుః. 45

ద్విపథమార్గణికే చ స్యాతామథ సప్తమే చ విశ్రామే
రథ్యాఽథభగ్నతాలః శుద్ధే భాణే క్రమప్రదిష్టోఽయమ్. 46

భాణ మను నృత్యరూపకలక్షణ మిచట నిరూపిత మగును. ఇచటి ప్రతిపాద్యాంశ మంతయు సంగీతశాస్త్రమునకు సంబంధించిన తాలవాద్య విశేషాంశములతో నున్నది. భాణము శుద్ధభాణము - సంకీర్ణభాణము - చిత్రభాణము నని నిరూపితము కాగలదు. భాణము రూపకములలో నొకటి. ఇచటి భాణము నృత్తరూపకము. ఇందు హరి - హర - భాను - భవానీ - స్కంద - ప్రమథాధిపతుల స్తుతు లుండును. వారి స్తుతులతో నిది నిబద్ధ మగును. ఒక్కొక భాణములో నొక్కొకరి స్తుతినిబంధ ముండుట యౌచిత్యప్రాప్తము. ఇందు ప్రయుక్తములగు కరణము లుద్ధతములుగా నుండును. కావుననే స్త్రీవర్జ్యము. ప్రయోగమున వనితలె యుందురేని వస్త్వౌచిత్యానుసారమున లలితములగు కరణము లుండుట నిషిద్ధము కాదు. ఈ భాణము నానావిధములగు వర్ణనములతో గూడియుండును. ఇట్లు కేవలము దేవస్తుతినిబద్ధమె కాదు. మానవులగు భూపాలకుల స్తుతినిబంధనముగూడ భాణ ముండును. వారి గుణకీర్తన ప్రకాశనములు కల గాథలతో నిది నిబద్ధ మగును. గాయన సహోక్తియుక్తమై యుదాత్తచరితముతో విభూషితప్రాయముగా నుండుట యుక్తము. త్రి - చతుః - పంచ వితాలవిధానములతో గూడినదై సప్తవిశ్రామములతో పరిచ్ఛిన్నమై యుండును. ఒక్కొకచో అర్ధోద్గ్రాహము

నివారణములతో సంఖ్యాతము లయిన విశ్రామములతో నియతము నగును. పంచమ వివరివర్తము నందు ఏవిధము లయిన సమవిశ్రామములతో విభూషిత మగును. భాణము గాథామాత్రాలంకృతము ద్విపథక పాఠ్యమున నలంకృత మునై లలితముగ నుండును. గాథ యనునది ప్రాకృతభాషానిబద్ధ మయిన యార్య. పురాణాదికావ్యసంబంధికథ గాథలో నుండును. ఇది త్రిపది పంచపది షట్పది యగును. ప్రాకృతము నందలి మాత్రావృత్తమునకు ద్విపథక మని పేరు. గానయోగ్య మగు ప్రబంధ మొకటి ద్విపదనామమున గాథామాత్రా విశేషమున ద్విపథకపాఠ్యమున నిది యలంకృతము కావలెనని భావము. భాణ రీతి యిట్లుండగా నిందుండదగిన విశ్రామసప్తకములో నుండవలయు రీతి యిట్లుండును.

ప్రథమవిశ్రామము నందు వర్ణము - మత్తపాలి - భగ్నతాలములు - గాథ - తదనుగత భగ్నతాలము - భగ్నతాలము ననునవి కూర్పుపొంద దగి యున్నవి. రెండవవిశ్రామమున గాథ - ద్విపథక - వసంతములు, మాత్రా విషమచ్ఛిన్న మయిన వృద్ధిసమేత మయిన భగ్నతాలవిధానము నుండును. వసంతపదార్థ మీ విధమున నున్నది. వీణపై వాదనక్రమాత్మక మయిన రాగాంగ రాగమును వసంత మందురు. వేణువాదన క్రమమున నున్న రాగము వసంతము. వసంతమను దేశీతాలము కలదు. ఇందు తొమ్మిది మాత్రలు నియతములు. హిందోలరాగాంగ మయిన వసంతరాగ మున్నది. రాగ మున్నది. రాగాంగరాగ మున్నది. భగ్నతాలము దేశీతాలము. భంగతాల మొకటి మార్గ తాలము కలదు. ఈ రెండిటికి సంబంధమున్నది. తృతీయవిశ్రామములో మాగధిక అను ప్రాకృతభాషానిబద్ధ మయిన మాత్రావృత్తము కూర్పవలెను. చతుర్థవిశ్రామములో రథ్య - ద్విపథక - వసంతక — రథ్యాతాలములను గూర్ప వలెను. రథ్య యనునది దేశీతాలము. పంచమవిశ్రామము నందు రథ్య - భగ్నతాల - మార్గణిక - ద్విపథ - విషమము లుండును. విషమ మనునది రంజనగుణము. అత్యుచ్చస్థానక మగు గీతము తాలపాతాలక్షితమై ప్రయోగ బహులము రూఢము కాగా విషమ మగును. ఇది వాది వల్లభము. విషమ మనునది యొక హస్తపాటము. పతాకాహస్తచలనము మణిబంధకంపనము పాదకంపము వలన విషమపాటము కలుగును. హస్తవైషమ్య ఘాతమున విషమ ముదయించును. విషమ మనునది యొక దేశీతాలము. షష్ఠవిశ్రామము నందు రథ్యా తాలము నవభగ్నతాలములు నుండును. సప్తమవిశ్రామము నందు ద్విపథక -

మార్గణికను లుండును. రథ్యాతాలము భగ్నతాలము లుండును. ఇది యంతయు శుద్ధభాణమున నుండదగు క్రమవిన్యాస మిట్లుపదిష్ట మయినది.

సంకీర్ణ భణితిభరితః సంకరనామాఽయముభయసంయోగాత్
కించిదనుద్ధతభావః తాలక్రియవర్జితశ్చ చిత్రోఽయమ్. 47

ఇతి శుద్ధః సంకీర్ణ శ్చిత్రోఽయమితి త్రిధా భవేద్భాణః
యది వైష శుద్ధభాషః శుద్ధః సంకీర్ణ యాఽథ సంకీర్ణః. 48

సర్వాభిర్భాషాభిశ్చిత్రైశ్చ విచేష్టితశ్చ చిత్రః స్యాత్
అయముద్ధతోఽథ లలితో భాణో లలితోద్ధతశ్చ భిన్నః స్యాత్. 49

అర్థానామౌద్ధత్యాల్లాలిత్యాదుభయభావాచ్చ
యద్దుష్కరాభిధేయం చిత్రం చాప్యుద్భటం చ యద్భవతి. 50

తద్భాణకేఽభిధేయం యుతమనుతాలైర్వితాలైశ్చ
తస్యాంతర్భావో యో భాణేఽసౌ నందిమాలినామా స్యాత్. 51

భాణక భేదము లిందు లక్షితము లగును. పైన నిరూపించిన భాణము సంకీర్ణ భణితి భరిత మయినచో నుభయసంయోగ ముండును గావున సంకరభాణ మగును. కొంతగా ననుద్ధతభావమున నున్నచో తాలక్రమవర్జిత మయినచో నిది చిత్రభాణ మగును. కావున భాణము శుద్ధము సంకీర్ణము చిత్రము నని త్రివిధ మగును. వేరొక విధమునను వీని లక్షింప వచ్చును. శుద్ధభాషతో నున్నచో శుద్ధభాణము, సంకీర్ణ భాషతో నున్నచో సంకీర్ణభాణము, సర్వభాషలతో కూడుకొని చిత్రవిధానములతో విచేష్టితమగు నేని చిత్రభాణ మగును. భాణము ఉద్ధతము - లలితము - లలితోద్ధత మనియు భావింపవచ్చును. భాణమున గ్రథితము లయిన యర్థము లుద్ధతములుగ నున్నచో భాణ ముద్ధత మగును. లలితములుగ నున్నచో లలిత మగును. ఉభయభావ మున లలితోద్ధత మగును. చిత్రభాణ మయినను దుష్కరాభిధేయముతో నుండగా నుద్భట మగును. భాణకము నందుండదగు నభిధేయము అనుతాల ములతో వితాలములతో నుండదగును. ఇట్లుండగా నిది నందిమాలి నామము కలదగును. ఈ నందిమాలికి ఈ భాణమున నంతర్భావము చెప్పదగును. ఇటు పై నందిమాలి లక్షణము, సప్తవిశ్రామము లందుండ దగువిధానము సూచిత మగును. భాణాంతర్భావమును ప్రతిపాదితమగును.

భిన్నః కైశ్చిత్కథితో భరతమతం సమ్యగవిదితాభ్యాం
ఆకాశపురుషముద్దిశ్య వస్తు యత్ప్రోచ్యతేఽథవా క్రియతే 52

విశిష్టోద్భావ్యభావప్రయోగవాన్నందిమాలీ సః
ఉద్ధతప్రాయకరణః క్వచిత్స్త్రీవర్ణవర్ణనః. 53

గాథాదిరాజస్తుతిభిః నిబద్ధో గుణకీర్తనైః
సుగాయనసహోక్త్యైవ యుక్తోదాత్తేనభూషితః. 54

నిబద్ధో బ్రహ్మరుద్రేంద్రస్కందాదిస్తుతిభిర్ధ్రుథం
వితాలైః పంచభిర్వా తు యద్వా త్రిచతురైరపి. 55

విశ్రామైః సప్తభిశ్చైవ పరిచ్ఛిన్నైస్తథాంతరా

భరతమతమును సరిగ గుర్తింపక కొందరు భాణము కన్న నందిమాలి భిన్న మని యనిరి. ఆకాశపురుషోద్దేశమున పలికినను ఆచరించినను విశిష్టమగు నుద్భావ్యభావప్రయోగము కలది నందిమాలి యగును. ఇందు కరణము లన్నియు నుద్ధతప్రాయములుగా నుండును. స్త్రీరహిత మగు వర్ణన మొకచో నుండును. గుణకీర్తన పరము లయిన రాజస్తుతిగాథలతో నిది నిబద్ధమై యుండును. శోభనగాన మొనరించువారి సహోక్తులతో గూడుకొనినదై యుదాత్తరీతి భూషితమై యుండును. బ్రహ్మ - రుద్ర - ఇంద్ర - స్కందాదుల స్తుతులతో నిబద్ధము నగును. అయిదు వితాలములతో నుండును. మూడు నాలుగు వితాలము లేని యుండును. అంతరాంతరా సప్తవిశ్రామములతో పరిచ్ఛిన్నమై యుండును. ఇంక నీ నందిమాలిలో నుండు సప్తవిశ్రామములలో నీ విశేషములు కలవు.

అర్ధోద్గ్రాహాదిసంఖ్యానై ర్నియతశ్చ క్వచిత్క్వచిత్. 56

భూషితః సమవిశ్రామైః పఠిత వర్తే చ పంచమే
గాథామాత్రాద్విపథక పాఠ్యేనాలంకృతః క్వచిత్. 57

వర్ణోఽథ మత్తపాలీ వా భగ్నతాలావనంతరం
గాథానుభగ్నతాలాశ్చ మాత్రా వా ప్రథమే భవేత్. 58

విశ్రామే భగ్నతాలాశ్చ గాథాద్విపథక స్తథా
వసంతోఽపి చ విశ్రామే ద్వితీయే ప్రవిశంత్యమీ. 59

మాత్రాచ విషమచ్ఛిన్నా భగ్నతాల స్తతః పరం
రథ్యా చ మాగధీత్యేతే విశ్రామే స్యు స్తృతీయకే. 60

రథ్యాద్విపథకశ్చాపి వసంతో రథ్యయా సహ
తాలశ్చతుర్థే విశ్రామే ప్రవిశంతి యథాక్రమమ్. 61

రథ్యా చ భగ్నతాలశ్చ తథా మార్గణికాపి చ
ద్విపథో విషమశ్చాపి విశ్రామే పంచమే స్మృతాః. 62

షష్ఠేఽథ రథ్యాతాలశ్చ నవతాలం తతః పరం
భగ్నతాలో ద్విపథక స్తథా మార్గణికాఽపిచ. 63

విశ్రామే సప్తమే రథ్యా భగ్నతాలశ్చ కల్ప్యతే
ఏవం క్రమః శుద్ధభాణే నాట్యవిద్భిరుదాహృతః. 64

ఒక్కొకచో నర్తోద్గాహాదిసంఖ్యానములతో నియతముగా నుండును. సమవిశ్రామములతో భూషిత మగును. పంచమ పరివర్తము నందు గాథా - మాత్రా - ద్విపథక పాఠ్యమున నలంకృత మగును. ప్రథమవిశ్రామము నందు వర్ణము కాని మత్తపాలి కాని యుండును. అనంతరము రెండు భగ్నతాలము లుండును. గాథానుగతముగా భగ్నతాలములు కాని మాత్ర కాని యుండును. ద్వితీయవిశ్రామమునందు భగ్నతాలములు - గాథ - ద్విపథకము - వసంతము నుండును. తృతీయవిశ్రామమున విషమస్థానమున ఛిన్నమయిన మాత్రాభిధానము భగ్నతాలము రథ్య మాగధి యనునవి సంగతము లగును. చతుర్థవిశ్రామమును నందు రథ్య - ద్విపథకము - వసంతము - రథ్యా తాలము యథాక్రమముగా సంగత మగును. పంచమ విశ్రామమున రథ్య - భగ్నతాల - మార్గణిక - ద్విపథ - విషమము లుండుట ప్రసిద్ధ మగును. షష్ఠవిశ్రామమున రథ్యాతాలము భగ్నతాలము ద్విపథకము మార్గణిక యుండును. సప్తమవిశ్రామమున రథ్య-భగ్నతాల ముండును. శుద్ధభాణమునం దీ క్రమమును నాట్యవిదులుదాహరించిరి.

భాణః శుద్ధో భవేచ్ఛుద్ధభాషయా కల్పితో యది
భాణః సంకీర్ణనామా స్యాద్భాషాసంకరకల్పితః. 65

భాణశ్చిత్ర ఇతి ఖ్యాతః సర్వభాషావిచిత్రితః
ఉక్తతాలక్రమాశ్లిష్టః శుద్ధభాణ ఇతి స్మృతః. 66

ద్వయోస్త్రయాణాం తాలానాం సంకీర్ణః సంకరోద్భవః
చిత్రో భాణో భవేదుక్తతాలక్రమవివర్జితః. 67

యస్మిన్నౌద్ధత్యమర్థానాం స భాణస్తూద్ధతో భవేత్
లాలిత్యం యత్ర చార్థానాం స భాణో లలితః స్మృతః. 68

యత్ర లాలిత్యమౌద్ధత్యం స భాణో లలితోద్ధతః
చిత్రం యదభిధేయం స్యాద్దుష్కరం చోద్ధతం చ యత్. 69

భాణేఽభిధేయం తద్వ్యుక్తమనుతాలైర్వితాలకైః
యద్రూపకవిశేషస్య భాణస్యోక్తం స్వలక్షణమ్. 70

అతిదేశ్యమిహానుక్తమంకసంధ్యాది కల్పనం
భాణో యో నందిమాల్యాఖ్యః సోఽంతర్భూతోఽత్ర లక్ష్యతే. 71

పాఠ్యే గీతే క్రియాయాం యదుద్దిశ్యాకాశపూరుషం
విశిష్టోద్భావ్యభావాత్మా ప్రయోగో యత్ర దృశ్యతే
భాణః స నందిమాలీతి నామ్నా కవిభిరుచ్యతే. 72

శుద్ధభాషతో కల్పిత మయినచో భాణము శుద్ధ మగును. భాషాసంకర కల్పిత మయినచో సంకీర్ణభాణ మగును. సర్వభాషావిచిత్రత మయినచో చిత్రభాణ మగును. ఇంతవఱకు నిరూపించిన తాలక్రమాశ్లిష్ట మయినచో శుద్ధభాణ మగును. రెండు మూడు తాలములతో సంకీర్ణ మయినచో సంకరోద్భవభాణ మగును. ఈ చెప్పిన తాలక్రమవివర్జిత మయినచో చిత్రభాణ మగును. అర్థముల కౌద్ధత్య మున్న నుద్ధతభాణ మని, అర్థములకు లాలిత్య మున్న లలితభాణ మని, లాలిత్య మౌద్ధత్య మున్నచో లలితోద్ధతభాణమని యందురు. దుష్కర ముద్ధత మగునది చిత్రభాణవ్యవహారము కల దగును. భాణము నందలి యభిధేయము అనుతాలములతో వితాలములతో గూడియుండును. ఇట్లుండుట రూపకవిశేష మయిన భాణమునకు సంబంధించిన లక్షణము. ఇందు నిరూపితములు కాని యంగములు సంధ్యాదులు అతిదేశ్యములు కాదగును. భాణరూపక లక్షణము నుండి నృత్తరూపకభాణమునలేని వానిని స్వీకరించుట యుక్తము. ఈ విధాన మతిదేశము. ఇట్లున్న నందిమాలి యను భాణము ఇందంతర్భూత మగును. పాఠ్యమున గీతమున క్రియలో ఆకాశపురుషు నుద్దేశించి నిరూపించు ప్రయోగము సవిశేషముగా భావింపదగు

భావముల స్వభావమున నుండును. ఇట్టి భావము నందిమాలి నామమున నుండు భాణమున నుండుటను కవులు నిరూపించిరి. ఇట్లే విధముగ భాణనృత్తరూపక మునకు సంబంధించిన కతిపయ విశేషములు సూచితము లయినవి.

7. భాణిక

ప్రాయో హరిచరితమితి స్వీకృతం గాథాదివర్ణమాత్రశ్చ
సుకుమారతః ప్రయోగాద్భాణోఽపి చ భాణికా భవతి 73

దివ్యాభిశ్చారీభిర్వివర్జితా లలితకరణసంయుక్తా
తాలాంతరాలనృత్తా క్వచిదపి రథ్యాదిసంకలితా. 74

అర్ధోద్గాహిహ నివారణ గాయన వసంత మత్తపాలీభిః
విశ్రామైశ్చ విహీనా స్త్రీయోజ్యా వర్జితోత్తాలైః. 75

వస్తూని భాణికాయాం నవ దశ వా నియమతో విధీయంతే
నవమాది పంచమేషు స్థానేషు చ భగ్నతాలః స్యాత్. 76

స్థానాంతరేషు తస్యా లయతాలో యస్మృచ్ఛయా క్రియతే
వివిధవచోవిన్యాసైః సభ్యజనోత్సాహసమ్వృత్తిః
లాస్యాంగసంధినియమో భాణవదేవాత్ర భాణికాయాం స్యాత్. 77

అథ భాణ్యంగిశృంగారా శ్లిష్టనైపథ్యనాయికా
గర్భావమర్శహీనా చ ముఖాదిత్రయభూషితా. 78

స్వల్పవృత్త ప్రబంధా చ పీఠమర్దవిటాన్వితా
విదూషకేణ సహితా దశలాస్యసమన్వితా
పాంచాలరీతినియతా భవేద్వీణావతీ యథా. 79

భాణికలో సామాన్యముగా హరిచరితమె యుండును. గాథాదులు వర్ణములు మాత్ర మిందు స్వీకృతము లగును. భాణ మయినను సుకుమార ప్రయోగమున భాణిక యగును. దివ్యచారీవిధానము లిందుండవు. దివ్యచారి యనుట ఆకాశచారి యని భావము. దీనిచే భౌమచారు లుండదగునని సూచి తము. లలితములగు కరణములతో నిది సంయుక్త మగును ఒక్కొక్కచో తాలాంతరాలములలో నృత్తము లుండును. రథ్యాదితాలవిధానములతో సంక లిత మగును. అర్ధోద్గాహిహ - నివారణ - గాయన - వసంత - మత్తపాలీ విశే

షము లుండును. భాణకములో నిందు విశ్రామము లుండవు. స్త్రీప్రయోజ్య మగును. ఉత్తాలవర్జిత మగును. భాణికలో వస్తువులు తొమ్మిది కాని పది కాని నియమముగా విహితములు కావలెను. తొమ్మిది మొదలుగా నయిదు స్థానము లలో భగ్నతాల ముండును. స్థానాంతరములలో లయతాలము లిచ్ఛానుసార మున నుండదగును. వివిధములగు వచోవిన్యాసములచే సభ్యుల కుత్సాహ సంపత్తిని గూర్పవలెను. భాణము నందు వలె భాణిక యందును లాస్యాంగము లను సంధులను తన్నియమప్రకారము కూర్చునది. ఈ విషయమునసే కొంద రీ విధముగా ననిరి. భాణి యను నీ భాణికలో శృంగార మంగిరసముగా నుండ దగును. శ్లక్ష్ణ నైపథ్యము ధరించిన నాయిక యుండదగును. ఇందు గర్భావ మర్శసంధు లుండవు ముఖ ప్రతిముఖ నిర్వహణ సంధు లుండును. స్వల్పము లగు వృత్తములు నిబద్ధము లగును. పీఠమర్దుడు విటుడు దీనిలో కూడి యుందురు. విదూషకుడు నిందుండ దగును. లాస్యాంగములు పదియు నిం దాయోజితములు కావలెను. పాంచాలరీతితో నిది నియత మగును. వీణావతి యనునది భాణిక యగును.

ఇచట నిరూపితము లయిన భాణ భాణికాదులు కొన్ని సంగీతశాస్త్రీయ విషయ బహులములుగా నున్నవి. ఇవి యన్నియు నృత్తరూపకము లయి నందున నీ విధాన మావశ్యకము. ఇందలి సాంకేతికము లయిన పారిభాషిక పద ములకు భావార్థము మాత్రమె సూచిత మయినది. ఇట్లె ప్రస్థానకావ్యాది నృత్య రూపకలక్షణములందును గ్రహింపవలసి యున్నది. నృత్యసంగీతశాస్త్రాభిజ్ఞులగు వారు హరచరిత హరిచరిత కథకు లగువారు సావధానముగ వీనిని సంగతపఱచు కొని ప్రయోగానుకూల పదవి సిద్ధ మొనరించినచో వీని రమ్యత భాసించును. కేవల లక్షణకథన మాసక్తి నీయదు. ఆ యా నృత్యరూపకములకు లక్ష్యము లుగా నున్న వానిని శారదాతనయాదులు పేర్కొనిరి కాని యీ నృత్యరూపక ములు లభింప నందున ప్రయోగ మాలోచనీయము.

8. ప్రస్థానము

ప్రస్థానం కైశికీవృత్తియుతం హీనోపనాయకం
ఆపానకేళిలలితం లయతాలలయానుగమ్. 80

దాసాదినాయకం ద్వ్యంకం విటచేటాదినాయకం
ముఖనిర్వహణోపేతం శృంగారతిలకం యథా. 81

ప్రస్థాన మనునది కైశికీవృత్తితో నుండును. హీనోపనాయకముగా నుండును. పానగోష్ఠి కేలీవిలాసములతో లలితముగా నుండును. లయ తాల కలానుగతముగా నుండును. దాసాదు లిందు నాయకులుగా నుందురు. అంక ములు రెండే యుండును. విటచేటాదులు నాయకులుగా నుందురు. దాసాది నాయక మనుటచే నిది సూచింపబడిన నిందు కించిద్విశేష ముండుట విశే షము. ముఖనిర్వహణ సంధులు రెండే యుండును. ఇట్టిది ప్రస్థానము. శృంగారతిలక మనునది ప్రస్థాన నృత్యరూపకము.

9. కావ్యము

కావ్యం సహాస్యశృంగారం సర్వవృత్తిసమన్వితం
సభగ్నతాల ద్విపదీఖండ మాత్రా పరిష్కృతమ్. 82

గర్భావమర్శసంధిభ్యాం హీనమేకాంకమేవ చ
క్వచిల్లాస్యయుతం వా స్యాద్విటచేటీసమన్వితమ్. 83

కులాంగనావేశయుతం లలితోదాత్తనాయకం
ఏవం ప్రకల్పయేత్కావ్యం తద్గౌడవిజయో యథా. 84

విప్రామాత్యవణిక్పుత్ర నాయికానాయకోజ్జ్వలం
ముదితప్రమదాభాషాచేష్టితై రంతరాఽంతరా. 85

గ్రథితం విటచేటాదివేషభాషాభి రేవ వా
ఏవం చ కల్పయేత్కావ్యం యథా సుగ్రీవకేలనమ్. 86

కావ్య మనునది యిచట నృత్యరూపకము. హాస్యశృంగారము లుండుట, సర్వవృత్తిసమన్విత మగుట, భగ్నతాలము, ద్విపదీఖండము అనువాని మాత్రావిశేషములతో పరిష్కృత మగుట, గర్భావమర్శసంధిరహిత మగుట, ఏకాంకమున నుండుట, ఆవశ్యకత ననుసరించి యొకచో లాస్యయుత మగుట, విటచేటీసమన్వితముగా నుండుట, కులాంగనాయుతము వేశయుతము నగుట, లలితోదాత్తనాయకముగా నుండుట - ఇది కావ్య మను నృత్యరూపకలక్షణము. ఇట్లీ కావ్యమును ప్రకల్పింప వలెను. గౌడవిజయ మనునది కావ్యము. ఈ నృత్యకావ్యమున నింకను విశేషము లుండును. విప్రామాత్యవణిక్పుత్రులతో నుండుట, నాయికానాయకోజ్జ్వల మగుట, "అంతరాంతరా" సంతుష్ట లయిన ప్రమదల భాషాచేష్టితములతో గ్రథిత మగుట, అథవా విటచేటాదుల వేషభాషా

విశేషముల గూడియుండుట కావ్య కల్పనారూపము. సుగ్రీవకేలన మనునది యిట్టి కావ్యము.

10. ప్రేక్షణకము

పదార్థాభినయం యస్య లలితం చ లయాన్వితం
కురుతే నర్తకీ యత్ర సోఽపి నర్తనకః పునః. 87

లాస్యం ద్విధా స్యాచ్ఛలికం సమరథ్యా సమన్వితం
సుతాల చతురశ్రాభ్యాం యత్ర కర్తుం ప్రవర్తతే. 88

గర్భావమర్శరహితం సర్వవృత్తిసమన్వితం
ప్రభూతమాగధీ శౌరసేనీకం రసభావయుక్. 89

ద్విసంధీతి వదంత్యేతదుత్తమాధమనాయకం
భారత్యారభటీయుక్తం క్వచిత్స్యాత్తస్య సాత్త్వతీ. 90

యథా వాలివధాఖ్యశ్చ నృసింహవిజయో యథా
పూర్ణనేపథ్యపాత్రైర్వా నాందీ తస్య విధీయతే. 91

క్వచిన్నేపథ్యవాక్యాఢ్యం న కదాచన సూత్రధృత్
ఏవం ప్రేక్షణకం విద్యాద్యథా త్రిపురమర్దనమ్. 92

ప్రేక్షణక మను నృత్యరూపకమున నర్తకి నర్తనకు లిద్దరు నుందురు. అందు నర్తకి పదార్థాభినయమును లలితముగను లయాన్వితముగ నొనరించును. నర్తనకు డట్లాచరించును. ఇందు లాస్యము రెండు విధముల నుండవలెను. ఒక లాస్యము ఛలికరూపము. మరియొకటి సమరథ్యావిధానమున సమన్విత మగును. వీనిని సుతాలవిధానమున చతురశ్రవిధానమున నాచరించుటకు నర్తకి నర్తనకుడు ప్రవర్తించును. ఈ ప్రేక్షణకము గర్భసంధిరహితము అవమర్శసంధి రహితము నగును. సర్వవృత్తు లిందుండును. మాగధీభాషాయుతముగా శౌరసేనీ భాషాబహులముగా నిది యుండుట యుక్తము. ఇది రసభావయుతము నగును. ఇది ద్విసంధికముగా నుండునని కొంద రందురు. ఉత్తమాధమ నాయకముగా నుండుట, భారత్యారభటీయుక్త మగుట, ఒకచో సాత్త్వతియు నుండుట యుక్తము. వాలివధము నృసింహవిజయము అనునవి ప్రేక్షణకములు. ఇందు నాంధి యుండును. ఎప్పుడును సూత్రధారుడు నాందీప్రయోగ మొన

రించుట యుండును. పూర్ణముగా నేపథ్యపాఠములతో నాంది విధాన ముండ దగును. ఒకచో గర్భావమర్శసంధు లుండును. ఒకచో వృత్తిచతుష్టయము నుండును. ఒకచో నేపథ్యవాక్యార్థ్యము నగును. సూత్రధారప్రయోగ మిందెప్పుడు నుండదు. ఇట్టిది ప్రేక్షణకము. త్రిపురమర్దన మనునది ప్రేక్షణకము.

11. నాట్యరాసకము

షోడశ ద్వాదశాష్టౌ వా యస్మిన్ నృత్యంతి నాయికాః
పిండీబంధాదివిన్యాసై రాసకం తదుదాహృతం
పిండనాత్తు భవేత్పిండీ గుంఫనాత్ శృంఖలా భవేత్. 93

భేదనాద్భేద్యకో జాతో లతా జాలోపనాహతః
ఏతే నృత్తాత్మనా కార్యా నాట్యవంతః క్రియావిధౌ. 94

సుకుమారోద్ధతై రంగైర్గాయికాభిర్విలక్షణాః
నాట్యస్యావధయో హ్యేతే పిండాద్యా దృశ్యజాతయః. 95

నవభేదా విధీయంతే హ్యనుకార్యానురాగిణః
కామినీభిర్భువో భర్తుః చేష్టితం యత్ర నృత్యతే. 96

నాట్యరాసక మొక నృత్యరూపకము. దీని స్వరూపలక్షణవిస్తర మీ విధముగ నున్నది. దీనిలో నాయికలు పదునారుగురు కాని పంద్రెండుగురు కాని యెనిమిదిమంది కాని నర్తన మొనరింతురు. పిండీబంధాదివిన్యాసములతో నర్తన మొనరింతురు. ఇట్టి దిది రాసకము. పిండీబంధాదు లనుటచే నిందు పిండి - శృంఖల - భేద్యకము - లత యనునవి గ్రాహ్యములు. పిండనమున పిండి యగును. గుంఫనమున శృంఖల యగును. భేదమున భేద్యకమగును. జాలముగా పంక్తిగా వరుసగా కూర్పుపొందుట వలన లత యగును. రంగ సంచార మొనరించు నాయిక లొకచో గుమి కూడుట, పరస్పరసంబంధమున శృంఖలాకారమున నుండుట, ఒకరొకరు వేరువేరుగా విడిపోవుట, లతాకృతిగ దోచు జాలాత్మకముగ నుండుట యిందు గ్రాహ్యము. ఈ యంశ మిదివరలో కొంతగా సూచిత మయినది. ఈ పిండీబంధాదివిన్యాసములను నృత్తాత్మకముగా నిరూపింపవలెను. క్రియావిధానమున నివి నాట్యశోభాసుందరము లగునట్లాచ రింపవలెను. పిండాదికము లయిన దృశ్యజాతు లన్నియు నాట్యమున కవధి

రూపములు. సుకుమారము ఉద్ధతము కలిగిన అంగవిన్యాసముల ప్రదర్శించి గాయికలు గాన మొనరించి విలక్షణత కల విశేషములతో నీ దృశ్యజాతులను నాట్యసుందరముగ జేయవలెను. అనురాగానురాగసమేతు డయిన భూప్రభువు చేష్టితమును కామినీమణు లనుకరించి నర్తన మొనరింప దగును. దీని వలన నవనవవిధానము లనుగతములు కాగలవు. రాగమున వసంత మాలోకించి నర్తకీమణులు భూపతిచరిత మనకరించుచు నర్తన మొనరింతురు కావున నిది నాట్యరాసకమను వ్యవహారము కల దయినది.

చర్చరీమితి తాం ప్రాహుర్న్యర్ణతాలేన తత్ర తు. 97

ప్రవిశేత్కామినీయుగ్మం సమచర్యాది శిక్షితం
వామదక్షిణసంచారై రంగైస్తత్పరిష్కృతమ్. 98

తత స్తదేవ వర్ణాంత ఆలీఢద్వయసంస్థితం
చోలికాభిద్రుతం తాలం వాదకానాం ప్రదర్శయేత్. 99

పంచఘాతకసంజ్ఞార్థభేద స్తస్మాత్ప్రవర్తతే
నృత్తేన విభజేత్ఖండైః చతుర్భిస్త్రిభిరేవ వా. 100

అన్యోన్యాంగికసంచారై ర్హస్తతాలైః మిథః కృతైః
పరిక్రమ్య చ నిష్క్రామే త్తతోఽన్యద్ద్వితయం విశేత్. 101

ఏకకాలస్తు నిస్సంధిః ప్రవేశో నిర్గమ స్తయోః
పుష్పాంజలిప్రయోగం తు మాత్రాతాలేన యోజయేత్. 102

ఉభయోః పాత్రయోః పశ్చాత్పాత్రాణి ప్రవిశంతి హి
బద్ధా పణవతాలేన రథ్యావర్ణాదివర్ణకైః. 103

శుష్కగీతప్రయోగేణ తతో గాయంతి గాయకాః
లతాభిర్భేద్యకైః గుల్మైః నానానృత్తప్రదర్శకైః. 104

పాత్రై ర్త్రిభిశ్చైకత్ర సంయుక్తం పిండీబంధం తు కారయేత్
తతో మల్లాభిధం తాలం శుష్కవర్ణప్రయోగతః. 105

మురజాక్షరవాద్యం తు హస్త్యార్ధదండద్విదండకైః
ఏవం నృత్తక్రమేణాద్యో వ్యాపసారః సమాప్యతే. 106

అపసారత్రయం చాన్యదేవమేవ ప్రకల్పయేత్
తత్రాపి పూర్వవన్నృత్తం కామకస్తు లయక్రమః
కథయేద్రాసకస్యాంతే శుభార్థః వచనక్రమమ్. 107

నాట్యరాసకమును చర్చరి యనియు నందురు. రాసకభేదములు మూడు కలవు — రాసకము—నాట్యరాసకము—చర్చరి యని. చర్చరీరూప మీ విధముగ నుండును. రాసకము నందలి క్రమమునను వినివేశిత లయిన నర్తకీమణులు వాద్యతాలాన్విత మయిన వాద్యమును వాదకులు వాదన మొనరించు నపుడు జంటలు జంటలుగా రంగము ప్రవేశింతురు. గానవస్తూచిత పదోత్తర మయిన ద్విపది గానము చేయుదురు. ఆ ద్విపది వసంతసమయోత్సవమున శృంగార వర్ణనోపేతమై యుండును. ఆ గీతానుసారమున వారు నర్తన మొనరింతురు. ఇట్లున్న నిది చర్చరి యగును. ఇట్టి చర్చరీరూపధారణమున నిచటి చర్చరి నిట్లు భావింపవలెను.

కామినీయుగ్మము వర్ణతాలమున ప్రవేశింపవలెను. వర్ణతాల మనునది దేశీతాలము. అది చతురశ్ర-త్ర్యశ్ర-మిశ్రప్రభేదమున త్రివిధము ఆ కామినీ యుగ్మము సమచర్యాదివిధానములలో శిక్షితము కావలెను. వామదక్షిణసంచారము కల యంగవిన్యాసములతో పరిష్కృతపిధానములతో నా కామినీయుగ్మ ముండదగును. ఆ కామిను లాలీఢప్రత్యాలీఢస్థాన సంస్థానమున నుండి తత్త ద్వర్ణాంతమున తాలమును చోలికాభిద్రుతముగా వాదకులకు నిర్దేశింపవలెను. అప్పుడు పంచఘాతమను దేశీతాలమునకు సంబంధించిన సంజ్ఞార్థకమగు ఛేదము ప్రవర్తించును. ఛేదమనగా నొక వాద్యప్రబంధము. వాద్యవిశారదులు వాద్య వాదనమును "విచ్ఛిద్య విచ్ఛిద్య" ఆపి ఆపి హస్తతలాఘాతములతో వేగముగ వాదన మొనరించుట వికృతముగ వాద్యవాదన మొనరించుట ఛేదమగును. అట్టి యా ఛేదమును మూడు నాలుగు ఖండములుగా నృత్తమున విభాగ మొనరింపవలెను. అప్పుడా కన్యలు అన్యోన్యాంగిక సంచారములతో మిథఃకృతములు-పరస్పరాచరితము లయిన హస్తతాలములతో రంగపరిక్రమ మొనరించి నిష్క్రమింప వలెను. ఆ పిమ్మట నన్యద్వితీయము-ఇద్దరు కన్యలు ప్రవేశింపవలెను. వారిప్రవేశము కాని నిర్గమము కాని ఏకకాలముగా నుండుటయు, రంగమున వారలకు సంధి-కలయిక లేకుండుటయు నావశ్యకము. మాత్రాతాలయోగమున పుష్పాంజలి ప్రయోగింపవలెను. ఆ యిద్దరిపాత్రల యనంతరము పాత్రలు ప్రవే

శింతురు. వారిప్రవేశమున కొంత గ్రాహ్యావిశేష మిట్లున్నది. ఆ పాత్రలు నానా వృత్తప్రదర్శన మొనరించుచు లతావేష్టనములతో భేద్యకపిధానములతో గుల్మ-శృంఖలారీతులతో నొకస్థలమున గూడుకొని పిండీబంధము నాచరింపవలెను. ఆ సమయముననె పణవతాలయుక్తముగా రథ్యావర్ణాదివర్ణక సంయుక్తముగా గాయకులు శుష్కగీతప్రయోగమున గానమొనరింతురు. ఈ సమయముననే లతాభేద్యకాదిసంబంధమున పాత్రలు పిండీబంధ మాచరించుట యుక్తము. ఇచట పణవతాల-రథ్యా-వర్ణ—శుష్కగీతములను సాంకేతిక పదము లున్నవి. వాని భావార్థ మిట్లుండును. ''పణవంతి స్తువంతీతి పణాః'' స్తోత్ర మొనరించు వారు. వారి యనుసారమున నుండునది పణవము. పణవధ్వని పురాణములందు నున్నది. ఇది హరప్రీతికరము. పణవమున శబ్దము విని శంకరుడు స్వయముగ నర్తన మొనరించును. కావున గీతకాసారితాదులలో పణవము నాయోజిత మొనరింపవలెను. పణవానుగత మయిన తాలము పణవతాలము. రథ్య యను నది దేశీతాల విశేషము. వర్ణము. వర్ణశబ్దమున గాన మభిహిత మగును. వర్ణము గానక్రియ. ఇది స్థాయి-సంచారి—ఆరోహి—అవరోహి యని నాలుగు విధములు. శుష్కగీతము. శుష్కాక్షరములతో నొనరించు ధ్రువాగీతము. ఇట్లువీని యనుసారమున పిండీబంధ మాచరించునది.

అనంతరము శుష్కవర్ణప్రయోగానుసారమున మల్లతాల మనుసరింప దగును. మల్లతాల మొక దేశీతాలము. ఇందు నాలుగు లఘువులు మూడు గురువు లుండును. మల్లతాలానుసరణముననె మురజాక్షరవాద్యము ననుసరింప వలెను. అపుడు మురజ వాద్యమును దండద్విదండక విధానానుసారమున నాహత మొనర్పవలెను. దండ దండకములు వాద్యవిశేషములు. వీణావాదన ప్రాణరూపము. ఇట్టిరీతుల యనుసారమున నృత్తక్రమ మనుసరించి పాత్రలు మొదటి యపసారమును సమాప్త మొనరింపవలెను. అనంతర మపసారత్రయము నిట్లే కల్పింపవలెను. ఈ యపసారము లందును పూర్వము వలె నృత్తక్రమ మనుసరణీయము. లయక్రమ మిం దిచ్ఛానుసారమున నుండవచ్చును. ఇట్లు రాసక మనుసరించి తదంతమున శుభార్థ మొక వచన క్రమమును నిరూపింప వలెను.

లబ్ధ్వా దుగ్ధమహోదధౌ సురగణైః పీత్వాఽమృతం యస్తదా
పిండీశృంఖలికావిశేషవిహితో యుక్తో లతాభేద్యకైః

చిత్రాతోద్యవిచిత్రితై ర్లయయుతో భేదద్వయాలంకృతః
చారీఖండసుమండలై రనుగతః సోఽయం మతో రాసకః. 109

క్షీరసాగరమున సుర లమృతము పొంది త్రావి రాసకము నను సరించిరి. ఈ రాసకము పిండీబంధములతో శృంఖలికావిశేషములతో లతాభేద్యకములతో కూడి యున్నది. చిత్రము లయిన యాతోద్యవిధానములతో విచిత్రితమై యున్నది. లయ యుక్తముగా నున్నది. నాట్యరాసకము రాసకము అను భేదద్వయమున నలంకృతమై యున్నది. చారీఖండసుమండలములతో ననుగతముగా నున్నది. ఇట్లుండు నిది రాసకము నాట్యరాసకము.

12. రాసకము

రాసకము నాట్యరాసకము రాసక మని రెండు భేదములు కలది కావున నిందు నాట్యరాసకము నిరూపిత మయినది. ఇంక రాసకము నిరూపితము కావలసి యున్నది. రాసక లక్షణ మిట్లున్నది.

ప్రథమానురాగజనిత ప్రవాసశృంగార సంశ్రయం యత్స్యాత్
ప్రావృడ్వసంతవర్ణనపరమన్యద్వాపి సోత్కంఠమ్. 110

అంతే వీరరసాఢ్యం నిబద్ధమేతచ్చతుర్భిరపసారైః
ముఖనిర్వహణసమేతం ప్రస్థానం భవతి చైకాంకమ్. 111

అక్షిప్తికాల్పవర్ణో మాత్రాధ్రువకోఽథ భగ్నతాలశ్చ
వర్ధనికా చ ధ్వనికా యత్రత్స్యాదిహ కావ్యమితి. 112

యుక్తం లయాంతరై రచ్ఛధ్వనికాస్థాన నిర్మితైర్భవతి
కావ్యం విచిత్రరాగం చిత్రమితి తదుచ్యతే కవిభిః. 113

ఛన్నానురాగయుక్తా రుభిక్తిభిర్యత్ర భూపతేః
ఆవర్జ్యతే మనస్సా తు మసృణా డోంబికా మతా. 114

నృసింహసూకరాదీనాం వర్ణనా కల్ప్యతే యతః
నృత్తగీతేన భాణః స్యాదుద్ధతాంగ ప్రవర్తితః. 115

గజాదీనాం గతిం తుల్యాం కృత్వా ప్రవసనం తథా
అల్పావిద్ధం సుమసృణం తత్రప్రస్థానం ప్రచక్షతే. 116

సఖ్యాః సమక్షం పత్యుర్యద్వ్యనుద్ధతం వృత్తముచ్యతే
మసృణం తు క్వచిద్ధూర్తచరితం శిల్పికస్తు సా. 117

బాలక్రీడానియుద్ధాని తథా సూకరసింహాజా
ధ్వజాదినా కృతా క్రీడా యత్ర సా భాణికా స్మృతా. 118

అధ్యప్రాయం ప్రేక్షణకం స్యాత్ప్రవేశికయాఽన్వితం
ఋతువర్ణనసంయుక్తం కామాక్రీడం తు భాష్యతే. 119

మండలేన తు యన్నృత్తం తద్రాసకమితి స్మృతం
ఏకకస్తస్య నేతా స్యాద్గోపస్త్రీణాం యథా హరిః. 120

అనేకనర్తకీయోజ్యం చిత్రతాలలయాన్వితం
ఆచతుష్షష్టియుగలాద్రాసకం మసృణోద్ధతమ్. 121

రాసకస్వరూప మిచట నున్నది. నృత్యరాసకమున రాసకస్వరూప మున్నది. కాని యిచట రాసకస్వరూపగతము లయిన విశేషములు, ఇతరముల కన్న నీ రాసకమున గల విశిష్టత యిచట నిరూపిత మగును. మండలాకారమున నృత్త మొనరించుటను రాసక మందురు. గోపస్త్రీల కొక్కడే హరి నాయకు డయినట్లు రాసకమున నొక్కడే నాయకుడగును. రాసక మనేక నర్తకీ యోజ్య మగును. చిత్రతాల లయాన్వితము నగును. మసృణ ముద్ధతముగా నుండు నీ రాసకము చతుష్షష్టియుగల పర్యంతము నర్తకీ గణమున ప్రయోజ్య మగును. ఇట్టి విశిష్టరూప మితరములం దుండ దనుట ఇచట సూచిత మగును. ప్రస్థానము-కావ్యము—దోంబిక—భాణము-శిల్పకము-భాణిక-ప్రేక్షణకము అను నృత్యరూపక ముల స్వరూపపరిజ్ఞానముననె రాసక విశిష్టత గోచరించును గాని యథాస్థితభావ సమీక్షణమునకై యిదియు భావనీయము.

ప్రస్థానము నందు ప్రథమాను రాగజనిత మయిన ప్రవాసశృంగార ముండును. అట్టి ప్రవాసశృంగారాశ్రయముగా నుండునని భావము. ఇంకను ప్రావృడ్వసంతవర్ణన పరముగ నుండును. ఇతరవర్ణన మేదేని యిందుండును. సర్వము సోత్కంఠముగ నుండును. అంతమున నిది వీరరసాఢ్యము నగును. నాలుగవహారములతో నిది నిబద్ధ మగును. ముఖనిర్వహణసమేత మగును. ఏకాంకమున నుండును. ప్రస్థానరూప మిదివరలో కొంత సూచిత మయినది. ఈప్రఘట్టముననె కొంతప్రస్థాన పరిచయ మున్నది. "గజాదీనాం గతిం తుల్యాం"

శ్లోకమున ప్రస్థాన మున్నది. గజాదుల గమనము సమానముగ భావించి ప్రవసన మొనరించుట, అల్పావిద్ధముగా మసృణముగా కదలుట ప్రస్థానము. కావ్యమను నృత్యరూపకములో ఆడిక్షిక – అల్పవర్ణ ము-మాత్రాధ్రువకము-భగ్న తాలము-వర్ధనిక-ధ్వనిక యను వాద్యానుగుణ తాలానుగుణ విశేషము లుండగా కావ్య మయినది. ఇంకను కావ్యరూపకమునే చిత్రతాసంపాదకములగు నీ విశేషములు కలవు. అచ్ఛధ్వనికాస్థాన నిర్మితము లయిన అయాంతరములతో కూడినదై విచిత్ర రాగము కలదగునేని చిత్రకావ్యరూపక మగునని కవు లనగలరు. ఛన్నమగు ననురాగము కల వచనములతో భూపతి మనము ఆవర్జిత మగునేని మసృణ మగు నది డోంబిక యగును. ఇకభాణ మనునది మానవుల సింహసూకరాదుల వర్ణన మున నుండును. నర్తకీ నృత్తగీతముల గూడినదై యుద్ధతాంగవిన్యాసముల ప్రవర్తితమై యుండును. ప్రస్థానము గజాదిగతి ననుసరించి ప్రవసన మొనరించుటగా సూచిత మయినది. శిల్పకము నాయిక సఖిసమక్షమున తనపతియొక్క యుద్ధత చరితము నిరూపించుచు మసృణముగా నొకచో ధూర్తచరితము ప్రతిపాదించుటతో గూడి యుండును. భాణిక బాహ్యక్రీడలలోని నియుద్ధములు, సూకరసింహజ మయిన క్రీడ ధ్వజాదిధారణమున నుండగా రూపశోభ కలదగును. ప్రేక్షణక మాధ్యప్రాయము ప్రహేలికాన్వితము ఋతువర్ణన సంయుక్తము నగును. ఇవి యన్నియు నిట్లుండగా రాసకము ఈ ప్రఘట్టారంభమున నిరూపించిన విధముగా నుండును. ఇచట రాసకరూపక నిరూపణమున కయిన యీ ప్రఘట్టమున నితరనృత్యరూపకముల నిట్లు నిరూపించుట సుశ్లిష్టముగ లేదు. రాసకార్థము విశదముగా గ్రహించుటకు నా నృత్తరత్నావలి భాగభావము గుర్తించుట సముచితము.

13. ఉల్లోప్యకము

ఉల్లోప్యకం స్యాదేకాంకమవమర్శవినాకృతం
నిష్ప్రవృత్తివిధానం చ శిల్పకాంగవిభూషితమ్. 122

హాస్యశృంగారకారుణ్యాయుక్త ముజ్జ్వలవేషవత్
బహుపుస్తం చతురోజ్జ్వలనాయకనాయికమ్. 123

యథా దేవీమహాదేవం యథా చోదాత్తకుంజరం
యస్మిన్నుల్లోప్యకం నామ త్ర్యంకం గీతం ప్రవర్తతే
తల్లక్షణం చ గాంధర్వనిర్ణయే స్పష్టమీరితమ్. 124

ఉల్లోప్యకనృత్యరూపకము నం దొక యంకముండును. అవమర్శ సంధి యుండదు. నిష్ప్రవృత్తివిధానం-ప్రత్యేకము గా వృత్తివిధాన మేదియు నిందుండదు. శిల్పకరూపకమున నిర్దిష్టము లయిన యంగములచే నిది విభూషిత మగును. హాస్యశృంగారములతో కారుణ్యముతో నిది కూడి యుండును. కారుణ్య మనుట కరుణరసరీతి దయాస్వభావము నగును. ఉల్లోప్యక ముజ్జ్వల వేషములతో నుండుట యుక్తము. నానావిధము లగు పుస్తరీతులు ఆహార్య విధానము లిందుండును. ఇందు నాయికా నాయకులు చతురులు నుజ్జ్వలవేష ధారులు నగుదురు. ఇందు మూడంగములతో నున్న గీతమును ప్రవర్తించును. దేవీ మహాదేవము ఉదాత్తకుంజరము అనునవి ఉల్లోప్యక రూపకములు. గీత మంగత్రయముతో నుండుట తల్లక్షణము గాంధర్వనిర్ణయ గ్రంథమున స్పష్ట ముగా నిరూపిత మయినది.

## 14. హల్లీసకము

అథ హల్లీసకం సప్త నవాష్ట దశ నాయికం
సానుదాత్తోక్తి చైకాంకం కైశికీవృత్తిభూషితం
ఏకాంకం వా భవేద్వ్యంకం విమర్శముఖసంధిమత్. 125

సగేయలాస్యం యతిమత్ఖండతాలలయాన్వితం
ఏకవిశ్రామసహితం యథా స్యాత్కేలిరైవతమ్. 126

లలితా దక్షిణాః ఖ్యాతాః నాయకాః పంచషా అపి
విప్ర క్షత్ర వణిక్పుత్రాస్సచివాయత్తసిద్ధయః
ద్వ్యంకే ముఖావమర్శౌ స్తః ఏకాంకే గర్భనిర్గమః. 127

హల్లీసమె హల్లీసకము. ఇది సప్త - అష్ట - నవ దశ - నాయికలతో నుండును. ఉదాత్తవచనము లిందుండవు. ఒక యంకమె యుండును. రెండంకము లేని యుండును. ముఖసంధి విమర్శసంధి యుండును. గేయలాస్య ముండును. యతి యుండును. యతి = ఒక విధమగు వాద్యరీతి. హల్లీసకము ఖండతాలముతో లయవిధానముతో నుండును. విశ్రామ మొక్కటియె యిం దుండును. కేలిరైవత మనునది హల్లీసము. ధీరలలితులు దక్షిణులు ప్రఖ్యా తులు నగు నాయకు లయిదారుగురుందురు. బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్యపుత్రులు సచివాయత్తసిద్ధులై యిందు గోచరింతురు. ఇందు రెండంకము లుండునేని ముఖ

సంధి విమర్శసంధి యుండదగును. ఒక యంకమె యుండునేని "గర్భ నిర్గమః"- దీని భావ మాలోచనీయము.

15. దుర్మల్లిక

అథ దుర్మల్లికా నామ ప్రౌఢనాగరనాయికా
చతురంకా చతుస్సంధిర్గర్భసంధివినాకృతా
విటో విలసతి స్వైరం ప్రథమాంకేఽత్ర త్రినాడికాః 128
విదూషకో ద్వితీయేఽంకే విలసత్పంచనాడికః
పీఠమర్దో విహరతి తృతీయే సప్తనాడికాః
విటాదిత్రితయక్రీడా చతుర్థే దశనాడికాః. 129
చౌర్యరతిం ప్రతిభేదం యూనోరనురాగవర్ణనం క్వాపి
యత్ర గ్రామ్యకథాభిః కురుతే కిల దూతికా రహసి. 130
మంత్రయతి చ తద్విషయం న్యగ్జాతిత్వేన యాచతే చ వసు
లబ్ధ్వాపి లబ్ధుమిచ్ఛతి యా సా దుర్మల్లికా నామ్నా. 131

దుర్మల్లిక యను నృత్తరూపకమున నాయిక ప్రౌఢ నాగర యగును. ఇందు నాలుగంకములు, గర్భసంధిరహితముగా నాలుగు సంధు లుండును. ప్రథమాంకములో విటుడు స్వైరవిహార మొనరించును. ఈ యంకము నాడికాత్రయ పరిమితము. రెండవ యంకమున విదూషకుని విలాస ముండును. ఇది పంచ నాడికాపరితము. పీఠమర్దుడు తృతీయాంకమున విహరించును. ఇది సప్తనాడికా పరిమితము. చతుర్థాంకమున విటాది త్రితయ క్రీడ యుండును. ఇది దశ నాడికాపరిమితము. దూతిక యిందు చేరి రహస్యముగా గ్రామ్యకథలతో చౌర్య రతిని జెప్పును. నాయికానాయకుల ప్రతిభేదమును యువతి యువకుల యనురాగవర్ణనమును నిరూపించును. ఆ విషయముల విస్తరము మంత్రణము చేయును. అధమజాతి వనిత యయినందున ద్రవ్య మిమ్మని యడుగును. అట్టి వార్తలు చెప్పినందులకై ద్రవ్యము కాంక్షించును. ధనము గైకొనియు మఱల ధనలాభమునకె యిష్టపడును. ఇట్టి కథావస్తునిబంధన ముండగా నిది దుర్మల్లిక యగును. ఈ దుర్మల్లికనె కొందరు మత్తల్లిక యందురు. తల్లక్షణము.

ఏనాం దుర్మల్లికామన్యే ప్రాహుర్మత్తల్లికామితి
యస్యాముద్భావ్యః స్యాత్పురోహితామాత్యతాపసాదీనాం
ప్రారబ్ధానిర్వాహః సాఽపి చ మత్తల్లికా భవతి. 132

క్షుద్రకథా మత్తల్లికా యేహ మహారాష్ట్రభాషయా భవతి
గోరోచనే చ కార్యాఽనంగవతీ భావరసవిద్ధా. 133

ఈదుర్మల్లికను కొందరు మత్తల్లిక యందురు. దీనిలో పురోహితామాత్యతాపసాదుల ప్రారబ్ధానిర్వాహము-ప్రారంభించిన కార్యము నిర్వహింపక పోవుట సముద్భావితము కావలెను. ఇది మత్తల్లిక. ఇందు క్షుద్రకథ యుండును. మహారాష్ట్రభాషా రీతితో నుండును. "గోరోచనే చ కార్యాఽనంగవతీ భావరసవిద్ధా" భావములతో రసములతో నిది కూడుకొని యుండ దగును. ఈ పాదమున వివక్షితార్థము స్పష్టమగుట లేదు.

16. మల్లిక.

మల్లికా భోగశృంగార కైశికీవృత్తిమంథరా
ఏకద్వ్యంక క్రమాశ్లిష్ట విదూషక విట క్రియా. 134
గాథాద్విపథకోపేతా రథ్యావాసక తాలయుక్
అనాలక్ష్యకథా పూర్వం పశ్చాదుత్థ వస్తుకా
గర్భావమర్శ హీనా చ సంధిత్రయసమన్వితా. 135
మణికుల్యాయాం జలమివ న లక్ష్యతే యత్ర పూర్వతో వస్తు
పశ్చాత్ప్రకాశతే యా సా మణికుల్యాఽపి మల్లికా జ్ఞేయా. 136

మల్లికా రూపకము భోగశృంగారముతో కైశికీవృత్తితో గూడుకొనినదై మంథరముగా నుండును. ప్రథమాంకమున విదూషకక్రియ లుండును. ద్వితీయాంకమున విటక్రియ లుండును. ప్రథమద్వితీయాంకములందు విదూషక విట క్రియలు క్రమాశ్లిష్టములై యుండుట యిట్టిది. గాథలతో ద్విపథకములతో నుండుట, రథ్యా—వాసకములను తాలవిధానముల నుండుట మల్లికా లక్షణము. ఇందలి కథ మొదట లక్ష్యము కాదు. అనంతరము బాగుగా నిందలి వస్తువు గోచరించును. గర్భావమర్శసంధు లుండవు. మిగిలిన సంధిత్రయముతో నిది సంగత మగును. మణిమయ మగు కుల్యలో కాలువలో జలము గోచరింపదు. అట్లె యిందలి వస్తువు మొదట భాసింపదు. అనంతరము ప్రకాశించును. ఇట్టిది మణికుల్య యయినను మల్లిక.

17. కల్పవల్లి

కల్పవల్లీ భవేద్ధాస్యశృంగారరసభావయుక్
ఉదాత్తనాయకోపేతా పీఠమర్దోపనాయకా. 137

అస్యాం వాసకసజ్జా స్యాన్నాయికాఽథాభిసారికా
ద్విపదీఖండగేయాఢ్యా రథ్యావాసకతాలయుక్. 138

లయత్రయయుతా లాస్యదశకేన సమన్వితా
ఈదృశీ కల్పవల్లీ స్యాద్యథా మాణిక్యవల్లికా. 139

ముఖసంధి ప్రతిముఖసంధి నిర్వహణై ర్యుతా
ఉదాత్తవర్ణనోత్కర్షా లలితోదాత్తనాయకా. 140

కల్పవల్లీ నృత్తరూపక మీ విధముగా నుండును. ఇదిహాస్యరసముతో శృంగారరసముతో తదుచితభావములతో నుండును. ఉదాత్తనాయకోపేత మగును. ఇందు పీఠమర్దు డుపనాయకుడుగా నుండును. ఇందు వాసకసజ్జిక నాయిక కాదగును. అభిసారిక యేని నాయిక కాదగును. ద్విపదీఖండ గేయములతో నిది పూర్ణముగా నుండును. రథ్యా-వాసకములను తాలములతో నుండును. లయత్రయ యుతము. లాస్యాంగదశకసము పేతము. ఇట్టిది కల్పవల్లి. మాణిక్య వల్లిక యనునది కల్పవల్లి. ముఖసంధి ప్రతిముఖసంధి నిర్వహణసంధులతో నిది యుండును. ఉదాత్తనాయకోత్కర్ష కలదై లలితోదాత్తనాయకమై కల్పవల్లి యుండును.

18. పారిజాతకము

పారిజాతలతై కాంకముఖనిర్వహణాన్వితా
వర్ణమాత్రా ఖండతాలవతీ గాథాసమన్వితా. 141

వీరశృంగారభూయిష్ఠా దేవపుత్రాదినాయకా
కలహాంతరితావస్థా నాయికోదాత్తనాయకా. 142

అథవా భోగినీ స్వీయా గణికా నాయికాన్వితా
తాః స్యురష్టౌ చతస్రః స్యుర్దండరాసక నర్తనాః (?) 143

సాపసారత్రయా చిత్రకథా గేయసమన్వితా
క్వచిద్విదూషకక్రీడా పరిహాసమనోహరా. 144

పారిజాతలతా సేయం యథా గంగాతరంగికా
పారిజాతకమిత్యేవ కైశ్చిదేషాఽభిధీయతే. 145

ఇది పారిజాతలత. ఇది పారిజాతకము. ఇందొకటియె యంకము, ముఖసంధి యుండును. వర్ణతాలము మాత్రాతాలము ఖండతాల ముండును. గాథా సమన్విత మగును. వీరిశృంగార భూయిష్ఠము దేవతుత్రావినాయకము. ఇందలి నాయిక కలహాంతరితావస్థతో నుండుటయు నాయకు డుదాత్తుడుగా నుండు టయు గలదు. అథవా; భోగిని–స్వీయ-గణిక నాయికగా నుండుటయు సంభా వ్యము. దండరాసకవిధానమున నర్తించు పాత్ర లెనిమిదిమంది కాని నలుగురు కాని యుందురు. ఇం దపసారత్రయు మండును. ఇది చిత్రకథలతో గేయము లతో సమన్విత మగును. ఇందొకొక్కచో విదూషకుని క్రీడలుండును. పరిహాసము లుండును. అందుచే నది మనోహరము నగును. ఇట్టిది పారిజాతలత. గంగాతరంగిక యనునది యిట్టిది. ఈ లతనే పారిజాతక మనియు నందురు.

ఇట్లు ద్దేశానుసారమున నృత్తరూపకముల స్వరూపము నిరూపిత మయి నది. వీనిలో ప్రథమనిర్దిష్టము లయిన నాటిక తోటక మనువాని నీ ప్రసంగమున నిరూపించుట యావశ్యకము. కాని యవి నాటకమునకు ప్రకరణమున కంశ రూపము లగుట వలన నాటిక తోటకము సట్టక మనువాని లక్షణ మానుషంగిక ముగా నిదర్శిత మయినదని యిదివరలో నిదర్శిత మయినది. ఇచట సట్టకము నిరూపించుట యావశ్యక మని శారదాతనయు డీ విధమున నిరూపించుచున్నాడు.

## సట్టకము

సట్టకం నాటికాభేదో నృత్యభేదాత్మకం భవేత్
కైశికీభారతీయుక్తం హీనరౌద్రరసాదికమ్. 146

సర్వసంధివిహీనం చ నాటికాప్రతిరూపకం
శూరసేన మహారాష్ట్రి వాచ్యభాషాదికల్పితమ్. 147

అంకస్థానీయవిచ్ఛేద చతుర్యవనికాంతరం
ఛాదన స్ఖలన భ్రాంతి నిహ్నవాదేరసంభవాత్. 148

న వదేత్ప్రాకృతీం భాషాం రాజేతి కతిచిజ్జగుః
మాగధ్యా శౌరసేన్యా వా వదేద్రాజేతి కేచన. 149

నాటికాప్రతిరూపం యద్విశేషో రూపకస్య తత్
సట్టకం తేన తస్యాహుః భాషాం తాం ప్రాకృతీం పరే. 150

రాజశేఖరకు సం వద[illegible]

సట్టకము నాటికాభేదము. అయినను నృత్యభేదాత్మకము. కైశికీ భారతీయుక్తముగా నుండును. రౌద్రరసాదిహీనముగ నుండును. ఏ సంధియు నిందుండదు. అయినను నాటికాప్రతిరూపకముగా నుండును. శూరసేనదేశమున మహారాష్ట్రదేశమున వ్యవహృత మగు భాషావిధానమున నిది కల్పిత మగును. అంకస్థానీయము లయిన విచ్ఛేదము లిందుండును. చతుర్యవనికాంతరములతో నిది యుండును. ఛాదనము స్ఖలనము భ్రాంతి నిహ్నవము మొదలగు నవి యిందుం డవు కావున "చతుర్యవనికాంతరం". రాజిందు ప్రాకృతభాషను పలుక రాదని కొందరనిరి. మాగధి భాషలో గాని శౌరసేని భాషలో గాని పలుకవగునని కొందరనిరి. ఈ సట్టకము నాటికాప్రతిరూపము కావున రూపకవిశేషము. ఇందలి భాష పాకృతముగా నుండవగునని కొందరనిరి. రాజశేఖరరచిత మయిన కర్పూరమంజరి సట్టక మనిరి.

పూర్వనిరూపిత మయిన రాసకమునకు మతాంతరమున నిట్లు లక్షణ మున్నది.

### రాసకము-మతాంతరము

ప్రకారాంతరతో లక్ష్మ రాసకస్య పరే జగుః. 151

అథ రాసకమేకాంకం సూత్రధారేణ వర్జితం
సుశ్లిష్టనాందీయుక్తం చ పంచపాత్రం త్రిసంధికమ్. 152

పూర్ణం భాషావిభాషాభిః కైశికీభారతీయుతం
వీథ్యంగమండితం ముఖ్యనాయకం ఖ్యాతనాయికమ్. 153

గర్భావమర్శశూన్యం చ కలాపోద్దేశభూషితం
ఉదాత్తభావవిన్యాసభూషితం సోత్తరోత్తరమ్. 154

ఏవం లక్షణముద్దిష్టం రాసకస్యాత్ర కైశ్చన

కొందరు రాసకలక్షణమును ప్రకారాంతరమున నిరూపించిరి. రాసక మేకాంకము. సూత్రధారవర్జితము. నాందీసంబంధము సుశ్లిష్టముగ నుండును. అయిదుగురు పాత్రలుందురు. మూడు సంధులుండును. భాషావిభాషారీతులతో నిది నిండుగా నుండును. కైశికీభారతీయుక్తముగా నుండును. వీథ్యంగములతో శోభితమై యుండును. ముఖ్యనాయకముగా నుండును. ఖ్యాతనాయికముగా నుండును. గర్భావమర్శసంధు లుండవు. "కలాపోద్దేశభూషితం" కలాపోషణ మొనరించు ప్రభువునుద్దేశములతో నిది భూషితమై యుండును. ఉత్తరోత్తరముగా

సముదాత్తభావవిన్యాసములతో భూషితమై యుండును. ఇది యన్యులు నిరూపించిన రాసకలక్షణము. అన్యలక్షణ మఱియున సాదరపాత్రమని భావము.

ఇతి నానామతేనోక్తా నృత్యభేదాః ప్రదర్శితాః. 155

వైకల్పికం లక్ష్మ తేషాం న క్వచిన్న నిషిధ్యతే

అనేకు లనేకవిధముల జెప్పిన నృత్యభేదముల సంకలనమున నేకరీతి నిశ్చిత మొనర్చికొని వీనిని నిరూపించితిని. ఇంక నిరూపించిన లక్షణము కన్న నితరులు నిరూపించిన లక్షణము వేరుగా నుండవచ్చును. ఇట్లు వైకల్పికముగా నున్న లక్షణమును వారి నిశ్చయమును నే నెచటను నిషేధింప దలచలేదు. అన్యాన్యమతము లన్న పేరిట యవి యవి యచట నాదరముననె నిరూపితము లయినవి ప్రయోగాసక్తులు తమ ప్రయోగమునకు దగిన విధమున లక్షణము గ్రహించి రచించి ప్రయోగింప వచ్చును. ఇట్లే యనుక్తముల ప్రయోగమున నిరూపింపరాదు. అనుక్తము లయిన ననుగతము లగునేని ప్రయోగసంగతములు కావచ్చును. కాని దురుక్తగ్రథన ముచితము కాదు. అట్టివియు నుండుటచే నిదియనవలసి వచ్చినది.

నామపరిగణనమునను కొందరు కొందరు వేరు వేరు నామములను నిరూపించిరి. నామభేదమున్నను లక్షణభేద ముండదని సూచికమె యయినది. కొంద రుపరూపకముల నామముల నీ విధముగ సంకేతించిరి.

నాటిక-తోటక — గోష్ఠి-సట్టక—నాట్యరాసక—ప్రస్థాన - ఉల్లాప్య—కావ్య-ప్రేంఖణ—రాసక-సంలాపక-శ్రీగదిత-శిల్పక-విలాసిక-దుర్మల్లిక-ప్రకరణి-హల్లీశ—భాణిక—18 - పదునెనిమిది. వీని లక్షణప్రతిపాదనమున భేద మున్నది. కొందరిపరంపరలో ననుగతముగా వచ్చిన వీనికి సాహిత్యదర్పణమున విశ్వనాథకవిరాజు లక్షణములను వేరుగా జెప్పెను. ఇట్లె నామనిర్దేశములో లక్ష్మనిర్దేశములలో భావభేదము లుండును. వానిని నిషేధింపనక్కర లేదని శారదాతనయు డనుట సర్వాంగీకార పర మని భావింపరాదు. దురుక్త నిషేధపరము.

## భాషానియమము

యథా నియమితా భాషాః సంస్కృతాద్యాః పురాతనైః. 156

నాయికాదిషు పాత్రేషు నియమోఽత్ర ప్రదర్శ్యతే

పాఠ్యం తు సంస్కృతం నృణామనీచానాం కృతాత్మనామ్. 157

లింగినీనాం మహాదేవ్యా మంత్రిజావేశ్యయోః క్వచిత్
స్త్రీణాం తు ప్రాకృతం ప్రాయః శౌరసేన్యధమేషు చ. 158

పిశాచాత్యంతనీచాదౌ పైశాచం మాగధం తథా
యద్దేశ్యం నీచపాత్రం స్యా త్తద్దేశ్యం తస్య భాషితమ్. 159

కార్యతశ్చో త్తమాదీనాం కార్యో భాషావ్యతిక్రమః
సదిబ్రాహ్మణముండశాక్యేషు చేటేషు క్షత్రియేషు చ. 160

విశిష్టాః పరలింగస్థాః సంస్కృతం తేషు యోజయేత్
ఐశ్వర్యేణ ప్రమ త్తస్య దారిద్ర్యోపప్లుతస్య చ. 161

ఉ త్తమస్యాపి పఠతః ప్రాకృతం సంప్రయోజయేత్
అతిర క్తేషు తత్కార్యం పాఠ్యం పునరు క్తిసంయు క్తమ్. 162

రాజవిప్రవిటామాత్యసుభటాధీతయోషితాం
నటన ర్తకధూర్తానాం సంస్కృతం పాఠ్యముచ్యతే. 163

దేవదానవగంధర్వసిద్ధనాగేశరక్షసాం
కంచుకీయప్రతీహారలింగినీవణిజామపి. 164

విద్యాధరీవర్ష వరమహాదేవీవిలాసినాం
యోగినాం యోగినీనాం చ సంస్కృతం సంప్రయోజయేత్. 165

ఛద్మలింగప్రవిష్టానాం నిర్గ్రంథానాం జటావతాం
శాక్యచక్రచరాణాం చ సంస్కృతం చ ప్రయోజయేత్. 166

యో వేషవిద్యాసమయలింగనిష్ణాతధీర్భవేత్
స చక్రచర ఇత్యు క్తః ప్రాయో వై తండికోఽపి చ. 167

అధమానాం కువిద్యానామజ్ఞానామల్పచేతసాం
క్షుత్పీడావికలాంగానాం సంస్కృతం న ప్రయోజయేత్. 168

నాటకపాత్ర లుపయోగింప దగిన భాషావిషయమున గల విశేషముల నిచట గ్రహింపదగును. నాయకాదిపాత్రలలో సంస్కృతాదిభాషల వ్యవహార మును పురాతనులు నియమిత మొనరించిరి. పాత్రలలో నుండదగు నా భాషా నియమ మిచట ప్రదర్శిత మగును. అనీచులు కృతాత్ములు నయిన మానవులకు

సంస్కృపాఠ్యము నియతము. లింగిని మహాదేవి మంత్రికన్య వేశ్యలకు సహాయానుసారమున నెచట నేని సంస్కృతపాఠ్యము కూర్చునది. సామాన్యముగా స్త్రీలకు ప్రాకృతపాఠ్యమె యుక్తము. అధముల విషయమున శౌరసేనీ భాషా వ్యవహారము యుక్తము. పిశాచముల వలె నీచులుగా నుండువారలకు పైశాచ ప్రాకృతము మాగధీప్రాకృతము కూర్పదగును. ఏ దేశమున నే నీచపాత్ర యుండునో యా నీచపాత్ర కా దేశభాషాభాషిత మావశ్యకము. ఉత్తమాదుల కును కార్యానుసారమున భాషావ్యతిక్రమ మొనరింపదగును. పరివ్రాజక ముండి శాక్యులలో చేటులలో క్షత్రియులలో భాషావ్యతిక్రమము కూర్ప దగును. విశిష్టు లయిన పరలింగస్థులు కొందరుందురు. వారలలో సంస్కృత యోజనము యుక్తము. ఉత్తము డయిన నైశ్వర్యప్రమత్తు డయినచో దారిద్ర్యమున నుపప్లుతు డయినచో ప్రాకృతప్రయోగ ముచితమె యగును. ఇతరప్రకృతులలో పాఠ్యము పునరుక్తియుక్తముగా గూర్పజనును.

రాజ-విప్ర-విట-అమాత్య-సుభటవ్యక్తులకును విద్యాధ్యయన మొనరించిన వనితలకును నటనర్తకధూర్తులకును సంస్కృతపాఠ్యము నియతము. దేవ-దానవ-గంధర్వ-సిద్ధ-నాగ-రక్షోవర్గముల వారలకు, కాంచుకీయ-ప్రతీహార-లింగినీ-వణిగ్వర్గముల వారలకు, విద్యాధరీ-వర్షవర-మహాదేవీ-విలాసినీ వ్యక్తులకు, యోగినీయోగులకు సంస్కృత ప్రయోగము యుక్తము. కపటముగా సన్యాస ధర్మ ప్రవిష్టు లయిన వారలకు, నిర్గ్రంధు లనదగు దిగంబరులకు, జటాధారులకు, శాక్యవ్రతులకు, చక్రచరులకు సంస్కృతము ప్రయోగింపరాదు. చక్రచరు డనగా వేష-విద్యా-సమయ-లింగధారణవిధానము లందు నిష్ణాతబుద్ధియగువాడు. చక్రచరులకు సామాన్యముగా సంస్కృతము తగదు. కార్యావసరమున గూర్ప వచ్చును. ఇట్టివాడు చక్రచరుడు. వితండవాద మొనరించు వైతండికు డయినను చక్రచరు డగును. అధములకు అల్పచేతసులకు కుత్సితవిద్యులకు అజ్ఞానులకు అల్ప చేతసులకు క్షుత్పీడావ్యధితులకు వికలాంగులకు సంస్కృతపాఠ్యము ప్రయోగింప దగదు.

భాషా యా నాయకాదీనాం తత్తన్నాట్యోపయోగినీ
పరస్పరం చ వర్గ్యాణాం అహ్వానార్థాఽభిధీయతే. 169

నేతుర్యా మహిషీ యుక్తా రూపసంపద్గుణాదిభిః
తద్భృత్యవనితావర్గైః వక్తవ్యా భట్టినీతి సా. 170

యదృచ్ఛాధిగమే ప్రాయః దుర్లభస్యైవ వస్తునః
నాయికా వృత్తిసంతోషాన్నిత్యమంమహా ఇత్యలమ్. 171

యేన కేనాపి మాన్యేన ప్రార్థ్యమానస్య వస్తునః
అంగీకారేషు వక్తవ్యం బాఢమిత్యేవ నాయకైః. 172

బహుధా చింత్యమానస్య దుర్విజ్ఞేయస్య వస్తునః
సహసా జ్ఞానసంపత్తౌ 'ఆ' ఇత్యార్యైర్నిగద్యతే. 173

కాంతేతి నాయకో బ్రూతే దక్షిణః పూర్వవల్లభాం
శఠః స్వస్యానభిప్రేతాం ప్రియేతి వదతి స్త్రియమ్. 174

సావజ్ఞమంగీకరణే తద్జ్ఞైః ఆమేతి కథ్యతే
జాతేతి పుత్రవాత్సల్యాన్మాత్రా పుత్రోఽభిధీయతే. 175

హుం మిత్యవజ్ఞావిద్వేషకామచారాదిభాషణే
హుం ఇత్యేవాభిధాతవ్యం సర్వైరింద్రియగోపనే. 176

భర్తృమాతాఽంగనాభిర్వా చేటీభిర్గణికాఽథవా
వార్తాసు సర్వదా కామం అజ్జుకే త్యభిధీయతే. 177

అభీష్టవస్తుసంసిద్ధివిధావన్యేన చోదితః
ప్రథమః కల్ప ఇత్యేవ ప్రవదత్యాప్తనాయకః. 178

ఆయుష్మన్నితి వక్తవ్యో రథీ సారథినా సదా
సమీపావస్థితేష్వేవమనేకేష్వాప్తబంధుషు. 179

నాటకప్రయోగమునందు పరస్పరవ్యవహారోపయోగి పారిభాషిక శబ్దము లిచట నిరూపితములు కానున్నవి. సుప్రసిద్ధము లగు రూపకములలో నంతట నిట్టి పారిభాషికములు గోచరించుచునే యున్నవి. భట్టిని-అంమహే-బాఢం-ఆః-కాంతా-ప్రియా-ఆమ-జాత-హుం-అజ్జుక-ప్రథమఃకల్పః-ఆయుష్మన్ పదములను రూపకము లం దుపయోగించుట లోని భావవిశేషముల యనుసంధానమునకు ఈ ప్రఘట్టార్థ ముపకారి యగును. ఇచట నిరూపితార్థముల కన్న నితరార్థము లందు నివి ప్రయుక్తము లగుట గోచరించును. అప్పుడు వీని నుపలక్షణప్రాయముగ భావించునది. రూపకపాత్రలయిన నాయకాదులకు తత్తన్నాట్యమున నుపయోగించు భాష యుండును. ఆ యా వర్గము లందున్నవారు పర

స్వర మాహ్వాన మొనరించుటకుగా నీ భాషావ్యవహార మావశ్యకము. అది యిచట నిరూపిత మగును.

రూపసంపద్గుణాదులతో కూడుకొనిన భట్టమహిషి యగు సంయకుని భార్యను భృత్యవనితావర్గముల వారు "భట్టిని" అని వ్యవహరింపవలెను. అట్లా మహిషిని పిలువ వలెను. దుర్లభవస్తువు యదృచ్ఛాసంప్రాప్త మయినచో క్రియా సంతోషమున నాయిక "అమ్మహే" అనుట యుక్తము. ఎవరేని యేదేని వస్తువు ప్రార్థింపగా నాయకు లంగీకరించు నప్పుడు "బాఢం" అన దగును. దుర్విజ్ఞేయము బహుధా చింత్యమాన మగు వస్తువు జ్ఞానసంపత్తి సహసా కలుగునేని "ఆః" యని యార్యు లందురు. దక్షిణనాయకుడు పూర్వ వల్లభ యగు నామెను 'కాంత' యనును. శఠుడు తన క్లిష్టను కాని యామెను 'ప్రియ' యనును. అవజ్ఞాసహితముగ నంగీకరించు నప్పుడు 'ఆమ' అందురు. తల్లి పుత్రవాత్సల్యమున పుత్రుని "జాత" యనును. అవజ్ఞ-విద్వేషము -స్వేచ్ఛ సూచించుటలో పలుకునప్పుడ "హుం" అందురు. అందరు నింద్రియ గోపన సమయమున "హుం" అనవలెను. రాజమాతను అంగనలు చేటి గణిక పలుకు నప్పుడు సర్వవార్తలలో "అజ్జుక" యన వలెను. ఆప్తనాయకు డభీష్టవస్తుసిద్ధివిధానమున నన్యులు చోదన మొనరింపగా "ప్రథమః కల్పః" అన వలెను. రథిని సారథి "ఆయుష్మన్" అన వలెను. ఈ సూచించిన భాషావిధానములు ఆప్తబంధువులు సమీపమున నుండగా ననదగిన వని గుర్తించునది.

మనసా యన్నరో వక్తి స్వగతం తన్నిగద్యతే
మనస్యవస్థితం కార్యం పురతః పార్శ్వవర్తినామ్. 180

నిశ్శంకముచ్యతే యత్తు తత్ప్రకాశం విదుర్బుధాః
త్రిపతాకం కరం కృత్వా యదన్యస్య మనోగతమ్. 181

అప్రకాశం నరో వక్తి తజ్జనాంతికముచ్యతే
అప్రత్యక్షేణ పాత్రేణ సహ రంగస్థితో నరః 182

యద్వ్యక్త్యభిముఖీకృత్య తదాకాశ ఉదాహృతం

స్వగతాదినాటకభాషల స్వరూప మిచట నున్నది. రంగపాత్రలు మనసుతో పలుకుట స్వగతము. మనసులో నున్నదాని నెదుట పార్శ్వమున నున్నవారలకు నిశ్శంకముగా నిరూపించుట ప్రకాశము. త్రిపతాక హస్తమును

కూర్చి మనోగతము నిజరున క్రప్రకాశముగా బలుకుట జనాంతికము. రంగమున నున్న వ్యక్తి రంగమున లేని యప్రత్యక్షపాత్రతో సభిముఖముగా నుండి పలుకుట అకాశభాషిత మగును. ఇంకను అపవారితకము స్వప్నాయితము మొదలగు వానిని నాట్యవేదాదుల నుండి గ్రహించుట యుక్తము.

విద్యమానేషు మనసి కార్యజాతేష్వనేకధా. 183

తదోపదమిత్యాహుః ప్రధానం యన్మనీషిణః (?)
భయాహంకారసమ్మాన మోహాకంఠగ్రహాదిషు. 184

హీం హీ శబ్దః ప్రయోక్తవ్యః చేట చేటీ విదూషకైః
పశ్చాత్తాపప్రవాసోర్వీచలనప్రాణహానిషు. 185

నాయికాహ్వాదయే క్షేపః పురోభాగ ఇతి స్మృతః
నియమేనైవ వక్తవ్యా హంజేతి పరిచారికా. 186

గణికాభిరథాచార్యా భీమార్యేతి నిగద్యతే
నటో విదూషకప్రాయో యో నరః స వధూజనైః. 187

అంగ ఇత్యేవ వక్తవ్యో హీనోఽపి బ్రాహ్మణో యది
పీఠమర్ద శఠ క్రూర ధూర్త చేటీ విటాదిభిః. 188

కార్యజాతము లనేకవిధముల మనసులో నుండగా మనీషులు ప్రధానముగా వ్యవహరింపదగిన కార్యమును "తదోపదం" అందు రనుట స్పష్టముగ గోచరించుట లేదు. "ఓం పదం" అని యుండదగునా? యనిపించును చేటచేటీ విదూషకు భయ-అహంకార-సమ్మాన-మోహ-కంఠగ్రహ ప్రభృతులలో "హీ హీ" శబ్దము ప్రయోగింపదగును. పశ్చాత్తాప-ప్రవాస-భూకంప-ప్రాణహాని సమయములందును "హీ హీ" శబ్దమునె ప్రయోగింపవలెను. నాయికాహ్వాదయమున నిక్షేపించుటకు 'పురోభాగ' మందురు. పరిచారికను నియమముగా "హంజ" యని వ్యవహరింపదగును. గణికలు ఆచార్యగా నున్న వనితను "భీమార్య" యందురు. విదూషకప్రాయు డయిన వానిని స్త్రీలు "అంగ" యని వ్యవహరింపదగును. అతడు హీనుడయినను బ్రాహ్మణు డయినచో "అంగ" పదముననె వ్యవహార్యుడు. పీఠమర్దుడు-శఠుడు—క్రూరుడు—ధూర్తుడు-చేటి—విటాదు లాతని నట్లే వ్యవహరింప దగును. ఇది యంతయు నాటకపాత్రల భాషానియమము. వారి వ్యవహారమున నుపయోగింపదగు పారిభాషికపదము

లీ విధమున నున్నవి. ఈ ప్రసంగమునసె తత్తదభిప్రాయసూచకము లగు నక్షర ములను సూచించుటయు నావశ్యకము.

అక్షరవిధి

నిందాయామథవా గర్వే ఈ శబ్దః సంప్రయుజ్యతే
త్రివిధం హ్యక్షరం కావ్యే విజ్ఞేయం నాటకాశ్రయమ్. 189

హ్రస్వ దీర్ఘప్లుతం చైవరసభావ విభావకం
స్మృతే చాసూయితే చైవ తథా చ పరిదేవితే. 190

పఠతాం బ్రాహ్మణానాం చ ప్లుతమక్షరమిష్యతే
ఆకారశ్చ స్మృతే కార్యమీకారశ్చాప్యసూయితే. 191

పరిదేవితే చ హాకార మోంకారోఽధ్యయనే తథా
హ్రస్వదీర్ఘప్లుతానీహ యథాభావం యథారసమ్. 182

పాఠ్యయోగేషు సర్వేషు హ్యక్షరాణి ప్రయోజయేత్.

నిందలో గాని గర్వమున గాని 'ఈ' శబ్దము ప్రయోగింతురు. కావ్యము నందు నాటకాశ్రయమయిన యక్షరము త్రివిధముగా నుండునని గుర్తింపదగును. హ్రస్వము దీర్ఘము ప్లుతము నను నక్షరము రసభావవిభావకముగా నుండును. ఏది యేని విషయము స్మృత మయినప్పుడు అసూయితము నందు పరిదేవితము నందు బ్రాహ్మణులు పఠించు నప్పుడు ప్లుతాక్షర ముండుట యిష్టము. స్మృతార్థమున ఆ కారము, అసూయితమున ఈ కారము, పరిదేవితమున హా కారము, బ్రాహ్మణాధ్యయనమున ఓం కారముండుట యుక్తము. హ్రస్వదీర్ఘ ప్లుతము లయిన యక్షరములు సర్వవిధపాఠ్యవిధానము లందు యథాభావముగా యథారసముగా ప్రయుక్తములు కావలెను.

లఘ్వక్షరప్రాయకృశముపమారూపకాశ్రయమ్. 193

కావ్యం కార్యం తు నాట్యజ్ఞైర్వీరరౌద్రాద్భుతాశ్రయం
గుర్వక్షరప్రాయకృతం బీభత్సే కరుణేఽపి చ. 194

కదాచిద్రౌద్రవీరాభ్యాం క్రోధామర్షణజం భవేత్
రూపకాదిసమావృత్తమార్యావృత్తసమాశ్రయమ్. 195

శృంగారే చ రసే కార్యం కావ్యం యన్నాటకాశ్రయం
ఉత్తరోత్తరసంయుక్తం వీరే కావ్యం తు యద్భవేత్. 196

నాట్యవిదులగువారు కావ్యమును లఘ్వక్షరప్రాయముగను ఉపమారూపకాశ్రయమగు నట్లును వీరరౌద్రాద్భుతాశ్రయముగ నుండునట్లు రచింపవలెను. బీభత్సమున కరుణమున గుర్వక్షరప్రాయముగ కావ్యము రచింపవలెను. కావ్యము రౌద్రవీరములతో నుండవగు నది యగునేని క్రోధామర్షణజము కాదగును. రూపకాదిసమావృత్త మార్యావృత్తసమాశ్రయము కావలెను. శృంగారరసమున నాటకాశ్రయముగ నుండు కావ్యము త్తరోత్తరసంయుక్తముగా నుండదగును. వీరము నందు నుత్తరోత్తరసంబంధవిశేష ముండుట యావశ్యకము.

జగత్యతిజగత్యో ర్వా సంకృత్యా వాపి తద్భవేత్
తథైవ యుద్ధసంఫేటావుత్కృత్యా సంప్రకీర్తితా. 197

కరుణే శక్వరీ జ్ఞేయా తథైవాతిధృతిర్భవేత్
యద్వీరే కీర్తితం ఛందః తద్రౌద్రేఽపి ప్రయోజయేత్. 198

శేషాణాం చార్థయోగేన ఛందః కార్యం ప్రయోక్తృభిః

## ఛందోవిధానము

నాటకోపయోగిఛందస్సంకీర్తన మిందున్నది. ఉత్తరోత్తర సంయుక్తముగా నుండు వీరవిశేషమును జగతి అతిజగతి ఛందస్సులలో నిరూపింపదగును. అట్లే యుద్ధసంఫేటము ఉత్కృతిచ్ఛందమున నిరూపణీయములు. కరుణమున శక్వరి అతిధృతి తగును. వీరమున నిరూపితమగు ఛందము రౌద్రమునను ప్రయోజ్య మగును. మిగిలిన రసములకు తత్ప్రయోజనానుసారమున ఛందఃప్రయోగ మొనరించునది. ఇది దిక్ప్రదర్శనము.

ఉపసర్గవిశేషాః స్యుః నాటకాద్యుపయోగినః. 199

కవేర్వివక్షితార్థస్య సూచకాంస్తాన్బ్రువేఽధునా
సముచ్చయా నిపాతానామిత్యేవం కేచిదూచిరే. 200

నిరర్థకాస్తు శబ్దా యే ఉపసర్గా ఇతి స్మృతాః
తే పరస్పరసంసర్గాద్ధాతుసంసర్గతః క్వచిత్. 201

తత్తదర్థవిశేషస్య వాచకాః స్యుర్న తు స్వతః
ప్రత్యభిజ్ఞాతదృష్టార్థస్మృతేషు స్యాదయే ఇతి. 202

ప్రార్థనాభిముఖీకారచింతాహ్వానోపలబ్ధిషు
అయే ఖల్వాభిముఖ్యే చ క్రోధే హర్షవితర్కయోః. 203

యదృచ్ఛానునయప్రీతివిషాదోద్భావ్యసిద్ధిషు
ప్రాగుక్తసూచనే ప్రశ్నే విచారే నన్వితీర్యతే. 204

సంభావ్యాతీతసిద్ధార్థచింతాసు నను ఖల్వితి
అపి కించిదితి ప్రశ్నే స్వల్పే హేయేఽప్యనాదరే. 205

అపి నామ ప్రసిద్ధ స్స్యాదపి ఖల్వితి కాకువాక్
కిమితి ప్రశ్నయోగే స్యాద్గౌరవే లాఘవేఽపి చ. 206

కించిచ్చ కిమపీతి స్యాదౌదాసీన్యవిచారయోః
వృత్తే యదపి కించిత్స్యాత్ప్రసిద్ధే ప్రార్థనాల్పయోః. 207

కర్తవ్యేఽపి చ వక్తవ్యే చింతయామపి కించన
సాపేక్షసిద్ధకథనే ప్రసిద్ధే గోపనేఽపి చ. 208

సామ్యే ప్రసిద్ధే సంభావ్యే స్వాభిలాషవితర్కయోః
అపి నామ భవేత్ప్రశ్నే వృత్తవర్తిష్యమాణయోః. 209

## ఉపసర్గవిధి

నాటకోపయుక్తము లయిన యుపసర్గవిశేషముల నిరూపణ మీ ప్రఘట్టము నుండి కొంతవఱకు నిరూపిత మగును. నాటకాదుల కుపయోగించు నుపసర్గ విశేషములు కొన్ని కలవు. అవి కవి వివక్షితార్థమునకు సూచకములు. వాని నిచట నిరూపింతుము. ఉపసర్గలనగా నిపాతముల సముచ్చయము అని కొందఱనిరి. అవి స్వతః తత్తదర్థవిశేషవాచకములు కాజాలవు. పరస్పరసంసర్గమున నుపసర్గ లర్థవిశేషవాచకములు కాగలవు. ఒకచో ధాతుసంసర్గమున నర్థ విశేషవాచకము లగును. 'అయే' అను నుపసర్గము ప్రత్యభిజ్ఞాతార్థమున దృష్టార్థమున స్మృతార్థమున ప్రయుక్త మగును. ఇంకను ప్రార్థనాభిముఖీకార మున చింతలో నాహ్వానమున నుపలబ్ధిలో 'అయే' ప్రయుక్త మగును. 'ఖలు' అనునది యాభిముఖ్యమున క్రోధమున హర్ష వితర్కములలో ప్రయుక్తమగును. 'నను' అనునది యదృచ్ఛలో ననునయమున ప్రీతిలో విషాదమున నుద్భావ్య సిద్ధిలో ప్రాగుక్తసూచనమున ప్రశ్నలో విచారమున ప్రయుక్త మగును. ఇంకను సంభావ్యార్థమున నతీతార్థమున సిద్ధార్థమున చింతలో "నను ఖలు" ప్రయుక్త మగును. "అపి కించిత్" అనునది ప్రశ్నమున స్వల్పమున హేయమున ననాదర మున ప్రయుక్త మగును. "అపినామ ప్రసిద్ధం స్యాత్ అపి ఖలు" అనునది కాకువచనము. 'కిం' అనునది ప్రశ్నయోగమున గౌరవమున లాఘవమున

ప్రయుక్తమగును. "కించిచ్చ–కిమపి" అనునది యౌదాసీన్యమున విచారమున నుండును. అతీతార్థమున "యదపి కించిత్" ప్రయుక్త మగును. ప్రసిద్ధార్థమున ప్రార్థనమున నల్పమున కర్తవ్యమున వక్తవ్యమున చింతలో "అపి కించన" ప్రయుక్తమగును. "అపినామ" అను ప్రశ్నము సాపేక్షసిద్ధకథనమున ప్రసిద్ధమున గోపనమున ప్రసిద్ధసామ్యమున సంభావ్యార్థమున స్వాభిలాషమున వితర్కమున వృత్తవర్తిష్యమాణములలో ప్రయుక్త మగును.

కాక్వామపి ఖలు ప్రశ్నే ప్రహర్షే ప్రగ్రహేఽపి చ
విస్మయే యది కించిత్స్యాద్వితర్కేఽనుశయేఽపి చ. 210

ఉదర్కచింతా కర్తవ్యా కామకారపరాభవే
యది నామ ప్రసిద్ధే స్యాద్యదుతేతిచ విచారణే. 211

ప్రవృత్తాదన్యచింతాయాం తద్వద్యద్వేతి నిశ్చయే
యది కించన సంసిద్ధే సమృద్ధే సామ్యబాధ్యయోః. 212

యదిదం ఖల్వితి గతే ప్రభూతే హృద్గతే కృతే
కారణేఽపి కథం తర్కే విస్మయే సంపదుద్భవే. 213

ఇష్టార్థోపగమేఽశక్యే భావికార్యప్రయోజనే
నూనం ప్రాయోఽసమాప్తేఽర్థే నూనం ఖల్వితి చ స్మృతే. 214

ప్రాయః ఖలు పరామర్శే కృత్యాకృత్యవిచారణే
కిం ను ఖల్వితి సంభావ్యే కిం ఖలు ప్రశ్నతర్కయోః. 215

తద్యావదితి నిష్కర్షే వృత్తవర్తిష్యమాణయోః
ఆజ్ఞాకృత్యే యావదహం యావత్ఖల్వితి చింతనే. 216

యావన్నామేతి సాధ్యే స్యాద్యావన్నామేతి నిశ్చయే
యావదాగామికాలే స్యాత్కర్మారంభావసానయోః. 217

తద్యావదితి సందేశే తన్నిర్దేశనియోగయోః
కర్మవిఘ్నవితర్కే స్యాద్దుష్కరేఽపి కథంచన. 218

ఇత్థమన్యోన్యసంసర్గాదుపసర్గాః పృథక్పృథక్
యథా విశేషార్థకృతస్తథా కవిభిరూహ్యతామ్. 219

"అపిఖలు" అనునది కాకువునందు ప్రశ్నలో ప్రహర్షముతో పట్టుదలలో విస్మయమున ప్రయుక్త మగును. "యది కించిత్" వితర్క-అనునయ - చింతా-కర్తవ్య-స్వేచ్ఛా-పరాభవార్థము లందు ప్రయుక్త మగును. ఇచటి మూలము "ఉదర్క-చింతా కర్తవ్యా కామకారపరాభవే" అనునది యనుగతముగా నన్విత మగుట లేదు. "యదినామ" ప్రసిద్ధార్థమునను, "ఉత" విచారమునను, "యద్వా" ప్రవృత్తమునకన్న నన్యచింతలో నిశ్చయమున నుండును. "యది కించన" సంసిద్ధమున సమృద్ధమున సామ్యమున బాధ్యమున ప్రయుక్త మగును. "యదిదం ఖలు" గతమున ప్రభూతమున హృద్గతమున కృతమున నుండును. "కథం" కారణమున తర్కమున విస్మయమున సంపదుద్భవమున ప్రయుక్త మగుటయు, "నూనం ప్రాయః" ఇష్టార్థప్రాప్తిలో నశక్యమున భావికార్యప్రయోజనమున నసమాప్తార్థమున ప్రయుక్త మగుట, "నూనం ఖలు" స్మృతార్థమున ప్రయుక్త మగుట గ్రాహ్యము. "ప్రాయః ఖలు" పరామర్శమున కృత్యాకృత్యవిచారణమున నుండును. "కిన్ను ఖలు" సంభావ్యార్థమున, "కిం ఖలు" ప్రశ్నతర్కములలో, "తద్యావత్" నిష్కర్షమున వృత్తవర్తిష్యమాణములందు నుండును. "యావదహం" ఆజ్ఞాకృత్యమున, "యావత్ఖలు" చింతనమున, "యావత్స్వామ" సాధ్యమున నిశ్చయమున నుండును. "యావత్" అనునది యాగామి కాలమున నుండును. కర్మారంభావసానము లందుండును. "తద్యావత్" సందేశమున ప్రయుక్త మగును. నిర్దేశనియోగముల నియుక్త మగును. కర్మవిఘ్నవితర్కమున దుష్కరమున "కథంచన" యుండును. ఈ విధముగా నుపసర్గలు వేరు వేరుగను పరస్పరసంసర్గమునను వివక్షితవిశేషార్థసూచకములుగా నుండుటను కవు లభ్యూహింపవలెను.

ఈ ప్రదర్శితము లన్నియు ప్రసిద్ధకవుల కావ్యప్రబంధముల నన్వేషించి శారదాతనయుడు సంగ్రహించి యుండును. అతడు సంభావించిన గ్రంథములు నేడన్నియు లభించుట లేదు. కొన్ని రూపకముల పేరుల నీతడు చెప్పెను. అవియు నన్నియు లభింపవు. ఉన్నవాని ననుసరించి యిట్టి పరీక్షాసమీక్షాసక్తులు కావచ్చును. ఉన్నవానిలో నిట్టి వినియోగమె యున్నదా? అన్యవినియోగము సంభావ్యము కాగలదా? కావచ్చుననియె తనయుడు భావించెను. అందువనె "కవిభిరూహ్యతాం" అనెను. ఉన్నవాని గతి గౌరవము గుర్తించి యీ పరిజ్ఞానసంప్రాప్త వివేకప్రాచుర్యమున నితరముల నిశ్చయించి కావ్యబంధముల కూర్పవలెనని యిది కవియుపదేశపరము. ఇష్టార్థవ్యంజకము లగునట్లుగా నిట్టి

వానిని గూర్చవలెనని యానందవర్ధన సూక్తి. అభినవశాసనము. ఇట్టి భావమున గాకున్నచో పాదపూరణార్థములె యగును గాపున నవ్యుత్పత్తిసంభావన గలుగును. ఇదియంతయు సంస్కృతభాషానుగతమయిన వ్యంజకసామగ్రి. సంస్కృతము వ్యవహార పదవీపరిష్కృతముగా నున్న రీతి గుర్తించిన వా రిట్టి పరిష్కారములను సూచింప గలరు. సంస్కృతభాషావ్యవహారమును వ్యాహారమున గూర్చుకొనని వారు వీని విశిష్టతను గుర్తించుట కలవడుట యుక్తము, ఈ యల వాటు దేశభాషాపదవ్యంజకతను స్ఫురింపజేయగలదు. ఇట్టి స్ఫురణమున నాంధ్రమున నాచ్ఛికపదము లందు నిట్టిశక్తి యోగము సుకరము కాగలదు. ఇట్టి భావమునసె "కవిభిరూహ్యాతాం" అనుట.

## నామవ్యవహారము

నాయకాదేః పరివారసహితస్య చ నాటకే
పాత్రస్య యోగ్యనామాని శాస్త్రోక్తాన్యభిదధ్మహే. 220

ప్రతాపవీర్యవిజయమానవిక్రమసాహసాః
పరాక్రమాదయో౽ంతే౽ంకే భూషణోత్తంసశేఖరాః. 221

అంకురా ఇతి నేతౄణామాహ్వయా విజయావహాః
ధీరోద్ధతాదయశ్చాత్ర నాయకాః కవిభిః స్మృతాః. 222

దివ్యా కులస్త్రీ గణికేత్యేతాస్తేషాం చ నాయికాః
తాశ్చ వీరావతీ వీరసేనాఖ్యా విజయాహ్వయాః. 223

భోగావతీ కాంతిమతీ కమలా కామవల్లరీ
ఇత్యాదయో భోగినీనామాఖ్యాః స్యుర్నాటకాశ్రయాః. 224

దత్తా సేనాంతనామాని వేశ్యానాం కల్పయేత్సుధీః
గంభీరార్థాని నామాని చోత్తమానాం ప్రయోజయేత్. 225

యస్మాన్నామానుసదృశం కర్మ చైషాం భవిష్యతి

నాటకమున పరివారసహితు లయిన నాయకాదులకు శాస్త్రోక్తము లయిన యోగ్యనామములు కలవు. వాని నిట నిరూపింతుము. నాటకము అంకము తుదిలో నాయకుల పేర్లు విజయావహములుగా నున్నవి. ప్రతాప-వీర్య-విజయ - మాన - విక్రమ - సాహసములు పరాక్రమాదులు భూషణ-

ఉత్తంస-శేఖర సంకేతములు నాయకుల కంకురములుగా నవదగినవి. ఇట్లే నాయకులు ధీరోద్ధతాదులుగ నుండుటను కవులు కీర్తించిరి. ప్రతాపాంకురము వీర్యాంకుర మను సంకేతమున నాయకుల వ్యవహార మున్నది. ఇట్టి నాయకుల నాయికలు దివ్య కులస్త్రీ గణిక లుందురు. వారును వీరావతి వీరసేన విజయ నామమున నందురు. ఇందు భోగిని నామమున నాటకాశ్రయముగ నుండువారు భోగావతి కాంతిమతి కమల కామవల్లరి మొదలగు నామముల నుందురు. వేశ్యాంగనలకు దత్త సేనాంతము లయిన నామములను కల్పింపదగును. ఉత్తములకు గంభీరార్థము లయిన నామములను కల్పింప వలెను. వారలకు నామానుసదృశ మయిన కర్మ యుండును.

మహిషీ భోగినీ నామ్నా వ్యాహార్యా దివ్యయోషితః. 226

సింధుదత్తాదినామానో వణిజో నాటకాశ్రయాః
శశిలేఖా కుందలేఖా మదలేఖా మనోహరా. 227

కర్పూరమంజరీలేఖా చంద్రలేఖే త్యాహ్వయాః స్మృతాః
లతాకుసుమనామాని చేటీనామాని కారయేత్. 228

సిద్ధానందదృష్టిసిద్ధముఖాఖ్యా యోగినః స్మృతాః
యోగసుందరికా వంశప్రభా వికటముద్రికా. 229

కల్పసుందరికేత్యాఖ్యా యోగిన్యో నాటకాశ్రయాః
కాలప్రియశ్చిత్రవర్ణః కపటేశ్వర ఇత్యపి. 230

గంధకేశ్వర ఇత్యాఖ్యా నాటకే నాందిదేవతాః
వర్ణకశ్చ ప్రస్తరకో నందకః కరభోఽపి చ. 231

తథా భాసురకశ్చేతి వ్యాహార్యా హీనపూరుషాః
గోమాయుకో గోముఖశ్చ బిల్వకశ్చిత్రకోఽపి చ. 232

ఇత్యాదినామభిర్వాష్యాశ్చండాలా నాటకాశ్రయాః
చిత్రాంగదో రత్నచూడః తథా రత్నశిఖండకః. 233

ఇత్యాదినామభిర్వాచ్యా నాట్యే విద్యాధరాశ్చయే
కపాలశేఖరాద్యాఖ్యాః పాషండా నాటకాశ్రయాః. 234

నిర్గ్రంథో గంధకో వైద్యః కాయస్థశ్చ కృషీవలః
శాక్యశ్చ కారుర్వందీ చ స్మృతా హ్యధమనాయకాః. 235

క్షీరోదస్తైత్తిలశ్చైవ జాల్మలిర్వినయంధరః
ఇత్యాదినామభిర్భాష్యా నాట్యే కంచుకినో జనాః. 236

నాటకము నందుండు దివ్యవనితలను మహిషి భోగిని నామమున వ్యవహరింపవలెను. నాటకాశ్రయ వణిజులు సింధు దత్తాది నామమున నుందురు. శశిలేఖ కుందలేఖ మదలేఖ మనోహర కర్పూరమంజరీలేఖ చంద్రలేఖ మొదలగు నామములు వనితల కుండును. చేటీనామములు లతాకుసుమనామములుగ నుండదగును. యోగులు సిద్ధానంద దృష్టి సిద్ధ మొదలగు నామముల నుందురు. నాటకాశ్రయ యోగినీవర్గము యోగసుందరిక వంశప్రభ వికటముద్రిక కల్ప సుందరిక నామముల నుందురు. నాటకమున నాందిదేవతలు కాల ప్రియ చిత్ర వర్ణ కపటేశ్వర గంధకేశ్వర నామముల నుందురు. హీనపురుషులు వర్ణక ప్రస్తరక నందక కరభ భాసురక పదములు వ్యవహార్యులు. నాటకాశ్రయ చండాలవ్యక్తులను గోమాయుక గోముఖ బిల్వక చిత్రక మొదలగు నామముల వ్యవహరింప వలెను. నాట్యమున విద్యాధరులను చిత్రాంగద రత్నచూడ రత్నశిఖండక నామమున వ్యవహరింపవలెను. నాటకాశ్రయ పాషండులు కపాలశేఖరాది నామముల నుందురు. నిర్గ్రంథుడు గంధకుడు వైద్యుడు కాయస్థుడు కృషీవలుడు శాక్యుడు కారువు వందిగా నుండువారు నాట్యమున నధమ నాయకులు. నాట్యమున కంచుకిజనులను క్షీరోద తైత్తిల జాల్మలి వినయంధర మొదలగు నామముల నాభాషింప వలెను. ఇంక నిట్టి వ్యవహారములు కలవు.

వాత్స్యాయనశ్చ శాకల్యో మౌద్గల్యశ్చ వసంతకః
గాలవశ్చేత్యేవమాదినామానః స్యుర్విదూషకాః. 237

విపులా వత్సలేత్యాది నామ ధాత్ర్యాః ప్రకల్పయేత్
హిరణ్యశృంగోఽంజనాద్రిరిత్యాఖ్యాః స్యుర్మహీధరాః. 238

ఆర్యేతి వాచ్యా విద్వాంసో బ్రాహ్మణా గురవోఽపి చ
భగవన్నితి వాచ్యాః స్యుః దేవతా మునయోఽపి చ. 239

సంభాష్యాః శాక్యనిర్గ్రంథాః భదంతేతి ప్రయోక్తృభిః
సేనాపతిరమాత్యశ్చ స్యాలో భావేతి భాష్యతే. 240

నాట్యవిత్కర్మకుశలః కించిన్న్యూనస్తు మారిషః
సమానస్తు వయస్యేతి సఖే హండేతి భాష్యతే. 241

వత్స పుత్రక తాతేతి నామ్నా గోత్రేణ వా పునః
శిష్యశ్చార్థోపకారీ చ వ్యాహార్యో గురుభిస్సదా. 242

స్వభావచపలో నేతుః ప్రియాయాః కలహప్రియః
దక్షిణః కార్యవిచ్చైవ సర్వదా భోజనప్రియః. 243

సర్వభాషావికల్పజ్ఞః సర్వేషాం పరిహాసకః
సత్యాసత్యవచోవక్తా పండితః స్యాద్విదూషకః. 244

విదూషకులకు వాత్స్యాయన శాకల్య మౌద్గల్య సాంకృత్య గాలవ మొదలగు నామములుండును. విపుల వత్సల మొదలగునవి ధాత్రీనామములు. హిరణ్యశృంగము అంజనాద్రి యనునవి మహీధర నామములు. విద్వాంసులు బ్రాహ్మణులు గురువులగు వారలను ఆర్య పదమునఁ వ్యవహరింపవలెను. దేవతలు మునులు 'భగవన్' అనదగినవారు. శాక్యనిర్గ్రంథులను 'భదంత' యనవలెను. సేనాపతిని 'స్యాల' పదమున, అమాత్యుని 'భావ' పదమున వ్యవహరింపదగును. మారిషుడగు నాతడు నాట్య విదుడు కర్మకుశలుడు గుణముల కించిత్ న్యూనుడు వగును. సమానుని 'వయస్య సఖే' యనవలెను. 'హండ' యనవలెను. గురువులు కార్యోపకారి యగుశిష్యుని "వత్స పుత్రక తాత" యను నామమున గాని గోత్రమున గాని వ్యవహరింప వలెను. విదూషకుడు స్వభావచపలుడు. నాయకునకు ప్రియురాలికి కలహము కూర్చుటలో నాసక్తుడు. సమర్థుడు కార్యవిదుడు సర్వదా భోజనప్రియుడు. సర్వభాషావికల్పముల గుర్తించినవాడు. అందరను పరిహాసించువా డగును. అయినను సత్యాసత్యవచోవక్త పండితుడు నగును.

ఇట్లు సముచిత నామనిర్దేశము భావనీయము. నాట్యమున కేవలము లోకతంత్రముండదు. నాట్యధర్మసంగతి నాట్యమున నావశ్యకము. ఈ నామ వ్యవహారములు సంస్కృతానుగతముగ నుండుటలో నీ రీతి యున్నది. భాషాకృతులలో గూడ సంస్కృతచ్ఛాయాసంపాదనము శోభాసంపాదకము. అన్నియు చెప్పుట కిట్టి వరస యాధ్మాత మయినది. అపేక్షిత మయిన క్రమమును పాఠకు లందుకొనుట కిది సహకరించును. ఇవి యన్నియు కవిసమయానుగతములు.

## కవిసమయములు

అనిబంధనమర్థానాం సతామపి విశేషతః
నిబంధనం పదార్థానాం అసతామపి తత్త్వతః. 245

సతో నిబంధనం తద్వదసతోఽప్యనిబంధనం
ఏవం కవీనాం సమయస్త్రిధైవ పరికల్ప్యతే. 246

వసంతే చూతపుష్పాదేరనుత్పాదో న దుష్యతి
అనిబంధనమేకం స్యాత్సతోఽర్థస్య తత్త్వతః. 247

సముద్రనదోశ్చ శైవాలపద్మాదేరప్యవర్ణనం
అయశఃపాపయోః కార్ష్ణ్యం హాసకీర్త్యోశ్చ శుక్లతా. 248

యశస్యావర్ణనీయం స్యాల్లౌహిత్యం క్రోధరాగయోః
భూభృన్మాత్రే సువర్ణాదివర్ణనం న నిబధ్యతే. 249

ఉదకాశయమాత్రేఽపి హంసాద్యైరేవ వర్ణ్యతే
కుముదాదివికాసస్తు రాత్రావేవేతి వర్ణ్యతే. 250

శిఖండితాండవం వర్షాస్వేవేతి పరికల్ప్యతే

ఆ యా యర్థములు నిబంధనానిబంధమున నొక విధాన మున్నది. ఇట్టి విధానమునె కవులు కావ్యములు నిబంధింతురు. ఇట్టి ప్రక్రియానుసంధానమునకు కవిసమయ మని సంకేతము. ఆ త్రివిధసమయము లిచట సంకీర్తితము లగును. ప్రసిద్ధములగు పదార్థములను విశేషవిధానమున నిబంధింప కుండుటయు, అప్రసిద్ధములగు పదార్థములనేని తత్త్వతః నిబంధించుటయు సన్నిబంధనము అసన్నిబంధనము నిమిషయములుగా ప్రసిద్ధము. ఇది యిట్లు త్రివిధముగా నున్నది. వసంతమున చూతపుష్పాదుల యనుత్పాదము దుష్టము కాదు. వసంతమున చూతపుష్పాదులు లుండును. ఇది సహజమె. అయినను నిబంధింపక పోవుట మొదటివిధము. నదీసముద్రములందు శైవాలపద్మాదుల వర్ణనము లేకుండుట, అపయశమునకు పాపమునకు నలుపుదనము హాసమునకు యశమునకు శుక్లత, క్రోధరాగములకు లౌహిత్యము వర్ణనీయము కాకున్నను వర్ణింతురు. ఇట్టిది కవిసమయము. పర్వతము లందెప్పటికి సువర్ణాదివర్ణనము నిబద్ధము కాదు. ఉదకాశయము లందింటి హంసాదస్థితి వర్ణితము కాదు. రాత్రులందే కుముదాది వికాసము వర్ణిత మగును. వర్షాసమయములందే శిఖండితాండవము పరికల్పిత మగును. ఇట్లు కవిసమయములు అనేకములు కలవు. వాని నితరగ్రంథముల నుండి తెలియదగును.

## శిల్పకము-అంగలక్షణము

నృత్తరూపకముల ప్రసంగములో డోంబీశిల్పకములు సూచితములు. లక్షితములు. తత్సముచితము లయిన యంగముల లక్షణము చెప్పుట కీ ప్రఘట్ట మారబ్ధ మగుచున్నది.

అథ శిల్పకడోంబ్యో_స్త్వంగానాం లక్షణముచ్యతే. 251

ఉత్కంఠా మాధవస్యాపి తత్ప శ్యేయమితీర్యతే
అవహిత్థం తదేవ స్యాద్యత్ప్రాణిర్న నివారితః. 252

ఇత్యాది ప్రణయక్రోధాచ్ఛాదనం తద్విభావ్యతే
తత్ప్రయత్నోఽనిరుద్ధస్య దర్శనే చిత్రలేఖితా. 253

దంపత్యోర్యోగ్యసంపర్కప్రార్థనాఽఽశంసనం భవేత్
యథా కులేన కాంత్యా చ వయసేత్యాది కథ్యతే 254

వితర్కః కాస్విదిత్యాది దుష్యంతవచనం యథా
కిమేషా కౌముదీ కిం వా లావణ్యసరసీ సఖే. 255

ఇత్యాది రామానంధాయాం సంశయః కృష్ణభాషితే
విశేషోఽనుశయో_ శైర్యస్సంతాప ఇతి కథ్యతే. 256

తం వినా కైకయీపుత్రమితి రామేణ భాషితం
ఉద్వేగో హా హతోఽస్మీతి కపింజలవచో యథా. 257

మౌఢ్యం ప్రగియమిత్యాది యదజేనాపి భాషితం
అంగాని చందనాంభోభిః సించేత్యాది వచో యథా. 258

శిల్పకము డోంబి యనువాని యంగముల లక్షణము నిరూపిత మగును. శిల్పకాంగములు పూర్వము సూచితము లయినవి. ఈ నవమాధికారము నందే శిల్పకలక్షణ కథన సమయమున నుత్కంఠాదు లిరువది యేడంగముల నామములు నిరూపితములు వీని యుదాహరణ ముత్తరగ్రంథమున నిరూపిత మగు ననియు సూచితము. డోంబీలక్షణ కథన సమయమున విన్యాసాదు లే డంగములు లక్షణయుక్తముగా నిరూపితములయినవి. సంకలనమున ముప్పది నాలుగంగముల యుదాహరణ లిచట ప్రదర్శితములు కానున్నవి. వివిధగ్రంథముల నుండి యీ యుదాహరణము లుద్ధృతము లయినవి. ఆ గ్రంథము లన్నియు లభించుట లేదు. ఉపలభ్యమానము లగు గ్రంథములలోని యుదాహరణములు

తద్గ్రంథభావకులకు సుజ్ఞేయములు కాగలవు. కావుననె శారదాతనయుడు సూచనామాత్రముగ నందించెను. ఆ యా యంగములు స్వరూపోదాహరణము లిట్లున్నవి.

1. ఉత్కంఠ. మాలతీమాధవము నందు "తత్ప్రేక్ష్యేయం" అనుస్థలమున నుత్కంఠ యున్నది. ఆ మాలతీమాధవపంచమాంకమున నీ శ్లోక మున్నది.

సంగమేవ సుఖాని చేతసి పరం భూమాన మాతన్వతే
యత్రాలోకపథావతారిణి రతిం ప్రస్తౌతి నేత్రోత్సవః
యద్బాలేందుకలోచ్చయాదవచితైః సారైరివోత్పాదితా
తత్ప్రేక్ష్యేయమనంగ మంగళగృహం భూయోపి తస్యా ముఖమ్.

శ్మశానాంకమున సంచరించు మాధవుడు మాలతీభావనమున నిట్లనుట. మాలతి కన్పించగనె సుఖము లన్నియు ప్రాపై మనసులో నిరతిశయానందము గలిగించును. నేత్రోత్సవము రతి కలుగును. చంద్రకలాసారాంశనిర్మిత మయిన మన్మథమంగళగృహ మయిన మాలతీవదనమునేని చూడ గలుగుదునా! ఇందాతని యుత్కంఠ సాతిశయముగ నున్నది.

2. అవహిత్థము. "పాణిర్న నివారితః" యను వాక్యముకల శ్లోకమున నవహిత్థ మున్నది.

యత్పాణిర్న నివారితో నివసనగ్రంథిం సముద్గ్రంథయన్
భ్రూభేదో న కృతో మనాగపి ముహుర్వ్యత్తం దధ్యా మానేఽధరే
యన్నిశ్శంకమిహార్పితం వపురహో ప్రత్యుత్సమాలింగనే
మానిన్యాః కథితోఽనుకూలవిధినా తేనైవ మన్యుర్మహాన్.

ధరించినవస్త్రము ముడివిడదీయునపుడు హస్తమును నిషేధింప లేదు. పెదవి కొఱుకు నప్పుడును కొంచెమేని భ్రూభంగ మొనరింపలేదు. ప్రియు డాలింగన మొనరించునపుడు దేహమును నిశ్శంకముగా నర్పించినది. ఆ మానిని యనుకూలవిధిచే గూడ మహాకోపమునె చూపినది. ఇందవహిత్థ మభ్యూహ్యము. తన కోపము లేమి సూచించుట కామె యత్నము. కావున ప్రణయకోపాచ్ఛాదనము విభావిత మగుచున్నది.

3. ప్రయత్నము. అనిరుద్ధదర్శనమున చిత్రలేఖనకర్మలో ప్రయత్న మున్నది. 4. ఆశంసనము. ఆశంసన మనునది దంపతుల యోగ్యసంపర్కప్రార్థనము. 'కులము కాంతి వయసులచే' నని రచిత మయిన పద్యమున నాశంసన మున్నది. ఇవికలవి లభింప లేదు.

5. వితర్కము. శాకుంతలమున పంచమాంకములో శకుంతలను జూచి దుష్యంతుడు 'కాస్విదవగుంఠనవతీ'యనిన శ్లోకమున నున్నది. ఆ శ్లోక మిట్లున్నది.

కాస్విదవగుంఠనవతీ నాతిపరిస్ఫుటశరీరలావణ్యా
మధ్యే తపోధనానాం కిసలయమివ పాండుపత్రాణామ్.

"తపోధనుల మధ్యలో నవగుంఠనము ధరించిన, పాండుపత్రములలో చిగురుటాకువలె నీమె యెవరో?" అని దుష్యంతుడనుటలో వితర్కము కలదు.

6. సంశయము. రామారాధాగ్రంథములో కృష్ణుడు పలికిన మాటలలో సంశయ మున్నది. "ఓయీ! సఖుడా! ఈమె కౌముదియా? లావణ్యాసరసియా?" ఇందు సంశయము భావనీయము. ఈ గ్రంథము లభింపలేదు. 7. సంతాపము. పశ్చాత్తాపోక్తివలని విశేషము సంతాపమగును. "తం వినా కైకయీ పుత్రం"అను రామభాషితమున సంతాప మభ్యూహ్యము. ఈగ్రంథము లభింపలేదు.

8. ఉద్వేగము. బాణకాదంబరిలో కపింజలవచనమున ఉద్వేగ మున్నది. మహాశ్వేతకు పుండరీకుని స్థితిని తెలిపి కపింజలు డాశ్రమమునకు పోవునప్పటికి పుండరీకుడు విగతజీవు డయ్యెను. మహాశ్వేత యాశ్రమమునకు బోవుచు నీ మాటలు వినినది.

హా హతోఽస్మి హా దగ్ధోఽస్మి హా వంచితోఽస్మి హా కిమిదమాపతితం
ఇత్యేతాని చాన్యానిచ విలపంతం కపింజలమశ్రౌషమ్.

ఈ మాటలలో కపింజలుని యుద్వేగము గోచరించును.

9. మౌఢ్యము. రఘువంశములో నిందుమతి గతించి నప్పు డజవిలాపమున మౌఢ్య మున్నది. ఆ విలాపవచన మిట్లున్నది.

స్రగియం యది జీవితాపహా హృదయే కిం నిహితా న హంతి మాం
విషమప్యమృతం క్వచిద్భవేదమృతం వా విషమీశ్వరేచ్ఛయా.

"ఈ పూలమాల జీవితము హరించునదియే యైన నా హృదయమున నిహితమయ్యు నన్ను చంపదేమి? విష మొకచో నమృతము, అమృత మొకచో

విషము నగును. సర్వ మీశ్వరేచ్ఛచే నగును." "నా యంగములను చందనోదకము లచే సేచన మొనర్పు" మనుటలో గూడ నిది కలదు. ఇది యేమో లభింపలేదు.

వైవర్ణ్యం యన్మనోఽంగానాం తదాలస్యముదాహృతం
తద్దృశ్యతే పరివారప్రార్థనాభిః క్రియాస్వితి. 259

మనసశ్చాపలం కంపోఽకాండేనాకామతో భవేత్
అకామోపనతేస్నైవ సాధోరిత్యాదినోచ్యతే. 260

యథా వామేన వానీరమిత్యాద్యనుగతిః స్మృతా
యథైవ కులపత్యంకే దోర్దండాః క్వేతి విస్మయః. 261

ప్రాకైస్తపోభిరిత్యాది యద్వచః సాధనం భవేత్
ఆశ్వాసనం విహ్వలస్య యత్స ఉచ్ఛ్వాస ఈరితః. 262

ప్రీతిర్నామ సదస్యానామిత్యాది వచనం యథా
క్రూరక్రమకృతత్రాసః సుకుమారస్య వస్తునః. 263

యస్స ఆతంక ఇత్యుక్తో రాహోశ్చంద్రకలాదివత్
యథా సీతాఽపి తత్రాసేత్యాదావపి చ దృశ్యతే. 264

శూన్యతా విస్మృతిః సర్వకర్మణాం సర్వదా స్మృతా
మాధవస్య పరిచ్ఛేదాతీత ఇత్యత్ర దృశ్యతే. 265

ప్రలోభనం గుణాఖ్యానపూర్వమిష్టార్థలంబనం
విజిత్య పృథివీం సర్వామిత్యాదౌ తద్విలోక్యతే. 266

నాట్యం స్వపౌరుషోత్కర్షావేశస్య ప్రతిపాదనం
తత్రాదామోఽహం యదీత్యాది మహానాటకకల్పితమ్. 267

10. ఆలస్యము. మనోంగముల వైవర్ణ్యము. మాలతీమాధవము నందలి పద్యములో నిది యున్నది.

పరిమృదితమృణాలీమ్లానమంగం ప్రవృత్తిః
కథమపి పరివారప్రార్థనాభిః క్రియాసు
కలయతి చ హిమాంశోర్నిష్కలంకస్య లక్ష్మీ
మభినవకరిదంతచ్ఛేదకాంతః కపోలః.

అంగము నలిగిన మృణాళి వలె వాడినది. వాడువీరు ప్రార్థింపగా పనులలోనెట్లో ప్రవృత్తి. కపోలము కరిదంతకాంతమై కలంకము లేని కళాధరుని లక్ష్మీకలన మొనరించు చున్నది.

11. కంపము. కంపమనగా మనశ్చలనము. అకాండమున నకామమున గలుగును. ఒక గ్రంథములోని "అకామోపనతేనైవ" మొదలగు వాక్యమున విశద మయినది. ఈ గ్రంథము లభింపలేదు. 12. అనుగతి. అనుగతి యనునదియు "వామేన వానీరం" అనుచోట గలదు. ఇదియు లభింపదు.

13. విస్మయము. కులపత్యంకమున "దోర్దండాః క్వ" అనుశ్లోక మున గలదు.

దోర్దండాః క్వ ధృతాంగదాః క్వ ను శిరానద్ధౌ భుజౌ ద్వావిమౌ
వక్త్రాణి క్వ ను కాంతిమంతి వలిమత్త్వేదం మమేదం ముఖం
వాచస్తాః క్వ జితార్ణవధ్వనిఘనాః క్వాయం వచఃసంయమో
హేలాకంపితభూధరః క్వ చరణన్యాసః క్వ మందా గతిః.

అంగదములు ధరించిన దోర్దండము లెక్కడ? నరములు దేలిన నా రెండు భుజములెక్కడ? కాంతికల యా వదనము లెక్కడ? ముడుతలు కూడిన యా నాముఖ మెక్కడ? సాగరగంభీరఘోషకల యా వాక్కు లెక్కడ? నా యీ వచఃసంయమ మెక్కడ? కుధరముల కుదిలించు ఆ చరణన్యాస మెక్కడ? నా యీ మందగతి యెక్కడ? ఇందు విస్మయము స్పష్టము.

14. సాధనము. మాలతీమాధవములోని కామందకీవచనము "ప్రాణైస్తపోభిః అను స్థలమున గలదు."

యన్మాం విధేయవిషయే స భవాన్నియుంక్తే
స్నేహస్య తత్ఫలమసౌ ప్రణయస్య సారః
ప్రాణైస్తపోభిరథవాఽభిమతం మదీయైః
కృత్యం ఘటేత సుహృదో యది తత్కృతం స్యాత్.

నీవు నన్ను విధేయవిషయమున నియమించుట యది స్నేహఫలము. ప్రణయసారము. నా ప్రాణములచే తపములచే నీకార్యము ఘటించినచో కృతార్థత కలుగును. ఇందు కర్తవ్యమునకై సాధన మున్నదనుట స్పష్టము.

15. ఉచ్ఛ్వాసము. విహ్వలుని యాశ్వసింప జేయుట యుచ్ఛ్వాసము. అనర్ఘరాఘవము ప్రథమాంకములో—

ప్రీతిర్నామ సదస్యానాం ప్రియమా రంగోపజీవినః
జిత్వా తదపహర్తారమేష ప్రత్యాహరామి తామ్.

నటునకు సదస్యప్రీతిసంపాదనము ముఖ్యము. దాని హరించిన వాని జయించి దాని నాహరింతును. అను సూత్రధారవచనమున ఉచ్ఛ్వాసమున్నది.

16 ఆతంకము. సుకుమారవస్తువునకు క్రూరక్రమకృత మయిన త్రాసము ఆతంక మగును. మాలతీమాధవములో సుకుమారమాలతికి క్రూరా ఘోరఘంటుని వలన నేర్పడిన త్రాస మిందుదాహార్యము "రాహోశ్చంద్రకలా" అను శ్లోకమున నిది స్పష్టము.

రాహోశ్చంద్రకలామివాననచరీం దైవాత్సమాసాద్య మే
దస్యోరస్య కృపాణపాతవిషయాదాచ్ఛిందతః ప్రేయసీం
ఆతంకాద్వికలం ద్రుతం కరుణయా విక్షోభితం విస్మయాత్
క్రోధేన జ్వలితం ముదా వికసితం చేతః కథం వర్తతామ్

రాహుముఖమున నున్న చంద్రకలను వలె ఈ దస్యు వయిన యఘోరఘంటుని ఖడ్గపాతము నుండి ప్రేయసిని విడిపింగా నా మన సాతంక మున వికలము కరుణమున ద్రుతము విస్మయమున విక్షోభితము క్రోధమున జ్వలితము మోదమున వికసితమునై యెట్లున్నదో! ఇందాతంకము విశదము. ఒక గ్రంథము నందున్న "సీతాఽపి తత్రాస" సీతయు భయపడిన దను స్థలమున నాతంక మున్నది. ఆ గ్రంథము లభింపలేదు.

17. శూన్యత. సర్వకర్మలను సర్వసమయములందును విస్మరించుట శూన్యత. మాలతీమాధవమున మాధవునకు "పరిచ్ఛేదాతీతః" పద్యమున నిది యున్నది.

పరిచ్ఛేదాతీతః సకలవచనానామవిషయః
పునర్జన్మన్యస్మిన్ననుభవపథం యో న గతవాన్
వివేకప్రధ్వంసాదుపచితమహామోహగహనో
వికారః కోఽప్యంతర్జడయతి చ తాపం చ కురుతే.

చెప్పుటకు శక్యము కాని వికార మేదో చిత్తము జడము చేయుచున్నది. తాపము కలిగించుచున్నది. ఈ వికారము పరిచ్ఛేదాతీతము. ఏమాటకును విషయముకానిది. ఈ జన్మలో ననుభూతము కానిది. వివేకరాహిత్యమున

వృద్ధి పొందిన మోహమున గహనముగా నున్నది. దీనిలో మాధవుని శూన్యత స్పష్టము. 18. ప్రలోభనము. ప్రలోభన మను నంగ మిష్టార్థలాభమున నుండు గుణాఖ్యానము. ''విజిత్య పృథివీం సర్వాం'' పద్యమున గలదు. ఈ పద్యము లభింపలేదు.

19. నాట్యము. స్వపౌరుషోత్కర్షావేశము ప్రతిపాదించుట నాట్యము. మహానాటకపద్యమున నిది యున్నది.

> రామోయం భువనేషు విక్రమగుణైః ప్రాప్తః ప్రసిద్ధిం పరాం
> అస్మద్భాగ్యవిపర్యయాద్యది పరం దేవో న జానాతి తం
> బందీ వైష యశాంసి గాయతి మరుద్యస్యైకబాణాహతి
> శ్రేణీభూతవిశాలతాలవివరోద్గీర్ణైః స్వరైః సప్తభిః.

ఈ రాముడు విక్రమ గుణములచే భువనములలో పరప్రసిద్ధి పొందిన వాడు. మా భాగ్యవిపర్యయమున మీకు దెలియదు. ఈ వాయువు వందివలె రాముని యశమును ఒక బాణము దూసికొనగా నీ వరుసగా నున్న తాలవృక్షముల వివరముల నుండి వెలువడిన సప్తస్వరములతో గాన మొనరించు చున్నది. ఇందు రాముని పౌరుషోత్కర్షావేశము కలదు.

> సంఫేటః కథితః సద్భిః క్రోధాదిభిరతిక్రమః
> యథార్థ్యం మర్ఘ్యమిత్యాదౌ జామదగ్న్యవ్యతిక్రమః. 268

> శోకప్రణోదనం వాక్యం యత్స ఆశ్వాస ఉచ్యతే
> శపే సత్యేన తే దేవి ప్రమేష్యతి రాఘవః. 269

> చమూం ప్రకర్షన్మహతీమిత్యాది హనుమద్వచః
> సంతోషాతిశయో హర్షాద్వ్యాపారో నిస్త్రపాభరః. 270

> తం దృష్ట్వా శత్రుహంతారమిత్యాదౌ స తు దృశ్యతే
> మదప్రకర్షః ప్రమదః పురస్తాత్స చ వర్ణితః. 271

> ప్రియప్రాయేతి వాక్యాదౌ మదః స్త్రైణ ఉదాహృతః
> ప్రమాదః స్యాత్పిశాచాదేః యదృచ్ఛాగమజం భయమ్. 272

> సత్వాంతైః కల్పితేత్యాదిమాలతీమాధవాదివాక్
> యోగ్యతాపాదనం యుక్తిరన్యోన్యస్య పదార్థయోః. 273

తుల్యశీలవయోజాతామిత్యాదౌ తద్విలోక్యతే
గుణై రతిశయారోపః పదార్థస్య ప్రరోచనా. 274

నేదం ముఖమితీత్యాదౌ దృశ్యతే సా ప్రరోచనా
స్తుతిర్విద్యాభిజాత్యాదేః ప్రశస్తిరితి కథ్యతే. 275

ఉత్పత్తిర్దేవయజనాదిత్యాదౌ సా విలోక్యతే
ఇత్థమర్థాన్విచార్యాథ శిల్పకాంగాని యోజయేత్. 276

20. సంఫేటము. క్రోధాదులచే నతిక్రమము సంఫేటము. అర్ఘ్యమర్ఘ్యమను దానిలో జామదగ్న్యవ్యతిక్రమము సంఫేటము. కాళిదాసరఘువంశములో నిది యున్నది.

అర్ఘ్యమర్ఘ్యమితి వాదినం నృపం సోఽనవేక్ష్య భరతాగ్రజో యతః
క్షత్రకోపదహనార్చిషంతతః సందధే దృశముదగ్రతారకామ్.

అర్ఘ్యమర్ఘ్యమని పలుకు రాజును లక్షింపక పరశురాముడు క్షత్రకోపాగ్నిజ్వాల కల తీక్ష్ణదృష్టిని రామునిపై ప్రసరింపజేసెను. ఇందు సంఫేటమూహ్యము.

21. ఆశ్వాసము. శోకము పోగొట్టు వాక్య మాశ్వాసము. హనూమంతునివచనమున నాశ్వాస మున్నది. "దేవి! రాఘవుడు గొప్ప సేనగూడి వేగమె వచ్చును. సత్యముగా నొట్టు." ఇందాశ్వాసమున్నది. 22. సంతోషాతిశయము. త్రపాభరములేని హర్షకృత మగు వ్యాపారము సంతోషాతిశయము."తం దృష్ట్వా శత్రుహంతారం" అను స్థలమున గలదు. 23. ప్రమదము. మదప్రకర్ష ము ప్రమదము. పూర్వము వర్ణిత మయినది. ప్రియప్రాయేత్యాదివాక్యాదికమున స్త్రీప్రమదమున్నది. ఇది యెందున్నదో తెలియలేదు.

24. ప్రమాదము. పిశాచాదుల వలన నాకస్మికముగా కలిగిన భయము ప్రమాదము. మాలతీమాధవములోని శ్లోకమున నిది యున్నది.

ఆంత్రైః కల్పితమంగలప్రతిసరాః స్త్రీహస్తరక్తోత్పల
వ్యక్తోత్తంసభృతః పినహ్య సహసా హృత్పుండరీకస్రజః
ఏతాః శోణితపంకకుంకుమజుషః సంభూయ కాంతైః పిబ
న్త్యస్థిస్నేహసురాః కపాలచషకైః ప్రీతాః పిశాచాంగనాః.

పిశాచాంగనలు ప్రేమలతో కంకణములు కట్టుకొని స్త్రీల హస్తము లనెడు రక్తోత్పలాభరణములు వ్యక్తము కాగా హృత్పుండరీకమాలలు కట్టు కొని నెత్తురు కుంకుమ ధరించి ప్రియులతో గూడి పుర్రెల పాత్రలతో అస్థిసార సురను త్రావుచున్నవి. శ్మశానమున పిశాచములు యాగమనమున గలిగిన విశేష మిం దభివర్ణితము.

25. యుక్తి. యుక్తి యను నంగము పదార్థముల కన్యోన్యము యోగ్యతాపాదనము. తుల్యశీలవయోజాతా మను స్థలమున గలదు. 26. ప్రరో చన. పదార్థమునకు గుణములచే నతిశయారోపము. ''నేదం ముఖ్యం'' ఇత్యాదు లలో ప్రరోచనయున్నది.

27. ప్రశస్తి. విద్యాభిజాత్యాదుల స్తుతి ప్రసక్తి. మహావీరచరితము లోని "ఉత్పత్తిర్దేవయజనాత్'' అను స్థలమున ప్రశస్తి యున్నది.

ఉత్పత్తిర్దేవయజానాద్బ్రహ్మవాదీ నృపః పితా
సుప్రసన్నోజ్జ్వలా మూర్తిరస్యాః స్నేహం కరోతి మే.

సీతాదేవి దేవయజనమున నుత్పన్న. ఈమె తండ్రి బ్రహ్మవాది జన కుడు. ఈమె మూర్తి సుప్రసన్నోజ్జ్వలము. నా కాదరము కలిగించుచున్నది. ఈ విధముగా నర్థములను భావించి శిల్పకాంగములను కూర్పవలెను. ఈ యంగ ముల యుదాహరణములు జ్ఞాతాజ్ఞాత గ్రంథముల నుండి యుదాహృతములు. కావ్యముల నుండియు సూచితములు. అయినను స్వరూపపరిజ్ఞానమున నిబంధించుట యుక్తము. ఇటుపై విన్యాసాది డోంబ్యంగముల నిరూపింపవలసి యున్నది.

### డోంబి–అంగలక్షణము

రాజ్యాద్భ్రంశో వనే వాసేత్యాదౌ విన్యాస ఉచ్యతే
కార్యాఖ్యానముపన్యాస ఇతి విద్వద్భిరుచ్యతే. 277

ఏష కంచుకినా తాత స్తిష్ఠతీత్యాదినోచ్యతే
పాపైర్నివృత్తిరేషాత్ర విబోధ ఇతి కథ్యతే. 278

సందేహానిర్ణయో జాత ఇత్యాదౌ సా విలోక్యతే
... ... ... . ... ... ... ... ... ... 279

సా వ్యాహృతా ప్రతివచో న సందధే ఇతీర్యతే
నిదర్శనస్యోఽపన్యాసో వ్యానువృత్తిరుదాహృతా. 280

నీల మేఘాశ్రితా విద్యుదిత్యాదౌ సా విలోక్యతాం
క్రియాసమాప్తిః సంహారః ఫలస్యావాప్తిరేవ వా. 281

దేవతాభ్యో వరం ప్రాప్యేత్యాదౌ సంహార ఇష్యతే
లీలాదిభిరుపాలంభః సమర్పణ ముదాహృతమ్. 282

ధన్యా కేయం స్థితేత్యాదౌ దృశ్యతే తత్సమర్పణం
డోంబ్యంగాన్యేవమాలోచ్య యథార్థాని ప్రయోజయేత్. 283

విన్యాసాదుల లక్షణము డోంబీలక్షణకథన సమయమున నిరూపితము. 1. విన్యాసము. ఇష్టవిరహజన్య మయిన నిర్వేదవాక్యము. "రాజ్యాద్భ్రంశః వనేవాసః "అను స్థలమున విన్యాస మున్నది. 2. ఉపన్యాసము. తత్తదర్థసాధనమున కార్యాఖ్యాన ముపన్యాసము. కంచుకితో మా తండ్రి యిచట నున్నాడను టలో నుపన్యాస మున్నది. 3. విబోధము. సంశయభ్రాంతి నివృత్తి విబోధమని పూర్వలక్షణము. "ప్రాప్తైః నివృత్తిః" అని యిచటి సూచనము. శాకుంతము లోని "సంప్రతి సందేహనిర్ణయో జాతః" అను స్థలమున విబోధమున్నది. 4. సాధ్వసము. అభూతమునకు సాధ్వసమున భూతోదాహరణము చెప్పుట. కుమార సంభవకావ్యమున నెనిమిదవసర్గలో నిది యున్నది.

వ్యాహృతా ప్రతివచో న సందధే
గంతుమైచ్ఛదవలంబితాంశుకా
సేవతే స్మ శయనం పరాఙ్ముఖీ
సా తథాఽపి రతయే పినాకినః.

ప్రథమసంగత మయిన పార్వతివర్ణన మిచట నున్నది. పలుకరించినను పలుకదు. పట్టుకొనినను పో నిష్టపడును. అటు మొగమై శయ్య సేవించును. అయినను శివుని రతి కయినది. దీనిలో సాధ్వసస్వరూప మున్నది. "అభూతస్య భూతోదాహరణం భయాత్" అని డోంబీలక్షణ కథనసమయమున జెప్పిన సాధ్వస లక్షణము సంగతమేయగునా? ప్రకృతమున సాధ్వసనిరూపకపంక్తి త్రుటితమయి నది. ఇచటి సాధ్వస మెట్టిదో?

5. అనువృత్తి. నిదర్శనోపన్యాస మనువృత్తి. "నీలమేఘాశ్రితా విద్యుత్" నల్లని మేఘము నాశ్రయించిన మెఱుపు అనుటలో శ్యామసుందరు నాశ్రయించిన గోపికను భావించిన ననువృత్తి యగును.

6. సంహారము. యథాభిలషితావాప్తి సంహార మని పూర్వరూపము. ఇచట క్రియాసమాప్తి ఫలప్రాప్తి సంహారమని యున్నది. రెండిటి నేకార్థపరముగా సంగతపరచుకొనవచ్చును. ''దేవతల నుండి వరము పొందె'' యను స్థలమున సంహార మున్నది. ఇది యెచటిదో?

7. సమర్పణము. విరహజన్యపీడచే నుపాలంభ మొనరించుట సమర్పణమచటిది. లీలాదులచే నుపాలంభ మిచటిది. అది యిది నొకటి. ముద్రారాక్షస నాందిలో సమర్పణ మున్నది.

> ధన్యా కేయం స్థితా తే శిరసి శశికలా కిన్ను నామైతదస్యాః
> నామైవాస్యాః తదేతత్పరిచితమపి తే విస్మృతం కస్య హేతోః
> నారీం పృచ్ఛామి నేందుం కథయతు విజయా న ప్రమాణం యదీందుః
> దేవ్యా నిహ్నోతుమిచ్ఛోరితి సురసరితం శాఠ్యమవ్యాద్విభోర్వః.

గంగను దాచు శివుని శాఠ్యము రక్షించు గావుతమని నాందీవచనము. దేవీశివుల సంభాష యిందున్నది. నీ శిరమున నున్న యీ ధన్య యెవరు? శశికల. ఈమె నామమేమి? తెలియునుగదా! ఏలమరచితివి?. చంద్రునడుగుట లేదు. స్త్రీనడుగుచున్నాను. చంద్రుని కాకున్న విజయనే యడుగుము. ఇది దేవుల భాష. దీనిలో సమర్పణ మున్నది. ఇట్లివి డోంబి యంగములు. తత్తదర్థానుకూలమున వీని నాయోజన మొనరించునది.

## నాయకులు, సహాయులు

> దేవా ధీరోద్ధతా జ్ఞేయా ధీరోదాత్తా నృపాదయః
> అమాత్యసేనాపతయో లలితాశ్చ స్వభావతః. 284
>
> ధీరప్రశాంతా విజ్ఞేయా బ్రాహ్మణా వణిజశ్చ యే
> కథారసవశాత్తేఽపి వ్యత్యస్తాః స్యుః కదాచిత్. 285

ధీరోద్ధతాదినాయకుల లోని విశేషము లిచట నిరూపితము లగును. దేవులు ధీరోద్ధతులు. రాజాదులు ధీరోదాత్తులు. అమాత్యసేనాపతులు ధీరలలితులు. బ్రాహ్మణులు వణిజులు ధీరప్రశాంతులు. కథావశమున రసవశమున వీరును వ్యత్యస్తు లగుదురు. దేవులు ధీరోదాత్తు లగుదురు. బ్రాహ్మణులు ధీరోద్ధతు లగుదురు. వీరలకు సంబంధించి యుండు విదూషకులలో స్వరూప భేదమున్నది. అది విశదముగా నిచట నిరూపణార్హము.

నాయకానామథైతేషాం చత్వారః స్యుర్విదూషకాః
విదూషకస్తు దేవానాం సత్యవాక్చ త్రికాలవిత్. 286

కృత్యాకృత్యవిశేషజ్ఞ ఊహాపోహవిశారదః
యథాదృష్టార్థవాదీ చ నాట్యవిత్పరిహాసకః. 287

విదూషకస్తు భూపానామగ్రామ్యపరిహాసకః
అర్థేషు స్త్రీషు శుద్ధశ్చ దేవీపరిజనప్రియః. 288

ఈర్ష్యాకలహకారీ స్యాదంతఃపురచరః సదా
నర్మవిత్ప్రణయక్రోధే దేవ్యాః కించిత్ప్రసాదకః. 289

భూపతేర్భోగినీనాం చ మిథః ప్రీతిం రతిం తథా
క్వచిచ్చ ఘటయత్యేవ క్వచిద్విఘటయత్యపి. 290

విదూషకశ్చ భూపానామేవమాదిగుణో భవేత్
అశ్లీలవాక్చ దంపత్యోరపరాధం వ్యనక్తి చ. 291

భక్ష్యాభక్ష్యప్రియో నిత్యం మర్మస్పృక్ నర్మవక్తి చ
అర్థలాభే ప్రీతిదానం రమయత్యేవ భోగినీః. 292

పరిహాసప్రాయవాక్యః పరిహాసకథారుచిః
ఏవమాదిరమాత్యాదేర్విదూషకగుణక్రమః. 293

శఠో విరూపవేషశ్చ విరూపాంగవచఃక్రమః
విరూపపరిహాసశ్చ విరూపాభినయాన్వితః
ఇత్యాదిభిర్గుణైర్యుక్తో వణిజశ్చ విదూషకః. 294

ఇందు దేవ - రాజ—బ్రాహ్మణ-వణిగ్విదూషకుల స్వరూప మున్నది. దేవాదినాయకులకు నలుగురు విదూషకు లుందురు. దేవవిదూషకుడు సత్యవచనుడు త్రికాలవిదుడు కార్యాకార్యవిశేషవిదుడు ఉహాపోహ విశారదుడు నగును. యథాదృష్టార్థవాది నాట్యవిదుడు పరిహాసకుడు. ఇట్టివాడు దేవవ్యక్తుల విదూషకుడుగా నుండును. భూపాలకుల విదూషకు డిట్లుండును. ఈత డగ్రామ్యపరిహాసకుడు. ద్రవ్యవిషయమున స్త్రీవిషయమున దోషముండదు. శుద్ధుడు. దేవిపరిజనుల కిష్టుడు. ఈర్ష్య నుత్పాదించును. కలహము కలిగించును. నిత్య మంతఃపురమున సంచరించును. నర్మవిదుడు. ప్రణయకోపము కలదయినచో దేవి

నొకింత ప్రసన్ననుజేయును. భూపతి భోగినీవనితలకు పరస్పరము ప్రీతికలిగించును. రతి నుత్పాదించును. ఒకరొకరితోడ ఘటనము కూర్చును. విఘటనము కూర్చును. రాజులవిదూషకు డేవమాదిగుణుడు.

అమాత్యాదుల విదూషకుల గుణక్రమ మీ విధమున నుండును. అశ్లీలము పలుకును. దంపతుల యపరాధము వ్యక్త మొనరించును. భక్ష్యాభక్ష్యము లందుకొనును. ఇట్లే పేయాపేయములు. ఇది నిత్య మాతని విధి. మర్మస్పృగ్వచనములు పలుకును. ద్రవ్యము లభించినా ప్రీతి ప్రదర్శించును. "భోగినీః రమయతి" భోగినీవనితల సంతోషపెట్టును. భోగినీభోగసంభోగముల పొందుననియు గ్రాహ్యము కావచ్చును. వా[illegible]ముచెప్పుట యావశ్యకము. పరిహాసవాక్యము పరిహాసప్రాయకథ వీనియందాసక్తి గలవాడు. ఇట్లు అమాత్యాదుల విదూషకుని గుణక్రమరీతి గ్రహించునది. ఇక వణిగ్విదూషకు డొకడున్నాడు. వీడు శఠుడు. విరూపవేషుడు. విరూపాంగుడు విరూపవచనుడు. విరూపపరిహాసుడు. విరూపాభినయాన్వితుడు. అంతయు విరూపముగా నుండును. ఇట్టి గుణములతో వణిజుల విదూషకుడుండుట పరిగ్రాహ్యము.

ఇక నిటుపై కావ్యభేదముల పరిశీలనము ప్రస్తుత మగును. ఆఖ్యాయికాది కావ్యభేదములు శృంగారప్రకాశమున నిరూపితము లయినవి. వాని వీని సంవాదము సంభావించుట యుక్తము.

## కావ్యభేదములు

దివ్యమర్త్యమయీ యత్ర క్రియతే కవిభిః కథా
ఆఖ్యాయికైవ సోచ్ఛ్వాసా థాంకావందురితి స్మృతా (?). 295

యత్ర శ్రుతీతిహాసార్థాః పేశలా వాప్యపేశలాః
నిబద్ధా వర్ణనోపేతాః సర్గబంధః స ఇష్యతే. 296

సర్గబంధేన తుల్యో యః ప్రాకృతేన నిబధ్యతే
ఆశ్వాసబంధః స ఇతి సేతుబంధ వదుచ్యతే. 297

అపభ్రంశేన బద్ధో యః మాత్రాచ్ఛందోభిరన్వితః
స సంధిబంధో విజ్ఞేయో యథాబ్ధిమథనాదికః. 298

వృత్తాంతా విప్రకీర్ణాః స్యుః సంహితా యత్ర కోవిదైః
సా సంహితేత్యభిహితా రఘువంశో యథాకృతః. 299

యత్ర శ్లోకకృతో యుక్తిసముదాయో రసాన్వితః
ఏకప్రఘట్టకే సోఽయం సంఘాత ఇతి కథ్యతే. 300

నానాప్రఘట్టకైర్బద్ధః కోశ ఇత్యభిధీయతే
ఆఖ్యాయికా చ శాస్త్రం చ గద్యేనైవాభిధీయతే. 301

మహాకావ్యాది పద్యేన తాభ్యాం చంపూర్నిగద్యతే
ప్రాకృతేన కృతే కావ్యే లంబచ్ఛేదః ప్రశస్యతే. 302

వివక్షితార్థక్రమవర్త్మోక్తే పద్ధతిరిష్యతే
మంత్రార్థగుమ్ఫనప్రాయే సందర్భే పటలం భవేత్. 303

యత్ర లక్షణముచ్యేత పరిచ్ఛేదోఽత్ర లక్ష్యతే
గ్రన్థస్య దుర్బోధార్థస్య వ్యాఖ్యా యత్రాభిధీయతే. 304

తత్రాధికార ఇతి చ విచ్ఛేదః కథ్యతే బుధైః
శాస్త్రేషు తత్తదర్థస్య నామ్నా వాద ఇతీరితః. 305

అధ్యాయైర్వా పర్వభిర్వా పురాణచ్ఛేదకల్పనా
అధ్యాయైరితిహాసాదౌ విచ్ఛేదః కథ్యతే బుధైః. 306

ఉచ్ఛ్వాసాశ్వాసవిచ్ఛేదగ్రన్థాః స్యుర్యమకాదయః
అఙ్కచ్ఛేదో విధాతవ్యః ప్రబన్ధేఽభినయాత్మకే. 307

ఇత్యాదిభేదా దృశ్యన్తే విచ్ఛేదస్య క్వచిత్క్వచిత్
కేచిద్దర్శనసిద్ధాశ్చ కేచిత్సామయికా అపి. 308

ఇత్యాది సర్వమవధార్య కవిః ప్రబన్ధం
కుర్యాద్యథా బుధజనః శృణుయాత్సుఖేన
విద్వజ్జనశ్రవణవర్త్మసుఖాత్ప్రబన్ధో
నేతుః కవేరపి విధాస్యతి భుక్తిముక్తీ. 309

ఇతి శ్రీశారదాతనయవిరచితే భావప్రకాశనే
నృత్యభేదస్వరూపప్రకారనిర్ణయో నామ
నవమోఽధికారః.

ఆఖ్యాయిక సర్గబంధము ఆశ్వాసబంధము సంధిబంధము సంహిత సంఘాతము కోశము చంపువు అను కావ్యభేదముల లక్షణము లిచట విచారితము లగును. వీనిలో నాఖ్యాయిక యిట్లుండును. ఇందలి కథ దివ్యమర్త్యమయముగా నుండు నట్లొనర్పవలెను. ఇది యుచ్ఛ్వాసవిభాగములతో పరిచ్ఛిన్న మగును. ఇట్టిది యాఖ్యాయిక. ఇట్టి వాని విశేషలక్షణము లితరగ్రంథములలో నింకను గలవు. సర్గబంధ మను కావ్యమున శ్రుతీతిహాసార్థములు పేశలము లపేశలములును నిబద్ధములై వర్ణనోపేతములై రూపసంపాదకము లగును. అట్టిది సర్గబంధము. సర్గబంధతుల్యను ప్రాకృతభాషానిబద్ధము నగునది యాశ్వాసబంధమను కావ్య మగును. ప్రవరసేనరచిత సేతుబంధ మిట్టిది. అపభ్రంశభాషానిబద్ధము మాత్రాచ్ఛందస్సమన్వితము నగునది సంధిబంధకావ్య మగును. అబ్ధిమథనాదికావ్యము లిట్టివి. విప్రకీర్ణము లయిన వృత్తాంతములు కోవిదులగు వారిచే సంహితము లయినచో సంహిత యగును. రఘువంశమీ విధముగనిర్మితము. యుక్తిసముదాయము శ్లోకనిబద్ధమై రసాన్వితమై యొకే ప్రఘట్టమున సంగతముగ నుండు నేని సంఘాతకావ్య మగును. నానాప్రఘట్టములతో నిర్మిత మగునది కోశము. శాస్త్రము నాఖ్యాయికను గద్యముననె నిబంధింతురు. మహాకావ్యాదులు పద్యనిబద్ధము లగును. చంపూకావ్యము గద్య పద్య నిబద్ధ మగును.

ప్రాకృతమున నిబద్ధము లయిన కావ్యము లందు లంబము లంబకము అను విధమున విభాగము సముచితముగా నుండును. కోశము నందు వివక్షితార్థక్రమవిధానమున పద్ధతి యుండుట శోభించును. మంత్రార్థముల గుంభన ప్రాయ మయిన సందర్భమున పటల మను విభాగ ముచితము. లక్షణము నిరూపిత మగు నేని పరిచ్ఛేద మను విభాగము యుక్తము. దుర్బోధార్థక మయిన గ్రంథమునకు వ్యాఖ్యానమభిహిత మగు నేని అధికార మని విచ్ఛేదము నిరూపించుట బుధసమ్మతము. శాస్త్రములలో తత్తదర్థములకు వాద మని నామము యుక్తము. పురాణములలో ఛేదకల్పనము అధ్యాయపదములతో పర్వపదములతో చేయుట యుచితము. ఇతిహాసాదులలో నధ్యాయములతో విచ్ఛేద ముండుటను బుధులు చెప్పిరి. యమకాదులు కల గ్రంథములలో నుచ్ఛ్వాసవిచ్ఛేదము శ్వాసవిచ్ఛేదము యుక్తము. అభినయాత్మక మయిన ప్రబంధమున అంకచ్ఛేద మొనరించుట యుక్తము. గ్రంథములలో విచ్ఛేదము కూర్చుట కచ్చటచ్చట నిట్టిభేదములు గోచరించుచున్నవి. కొన్ని నామసంకేతములు దర్పనసిద్ధములు. కొన్ని సామ

యికములు. కావ్యధర్మవిదుల సంప్రదాయపరంపరాసమాగతము లయిన సంకేతములు సామయికములు. ఇట్టి వన్నియు నుపాదేయములు.

మహాకవుల మార్గానుసారమున నిరూపితము లయిన యిట్టి సర్వవిధ విశేషములను సావధానముగా కవు లవధరించి ప్రబంధములను రచింపవలెను. బుధజను లిట్టి ప్రబంధమును సుఖముగా విందురు. ఆస్వాదింతురు. విద్వజ్జనుల శ్రవణమార్గమున సుఖము సంపాదించుట వలన ప్రబంధము నాయకునకు కవికి భుక్తిముక్తులను కూర్పగలదు. బుధజనాభినందనాస్పద మగు నటుల నిర్మించుటలో కవి సావధానుడు కావలయునని యుపదేశపరముగా నిరూపించుట పునరుక్తప్రాయ మనినను ముఖ్యాపేక్షితము.

ఇది శ్రీ శారదాతనయ విరచితమైన భావప్రకాశమునందు
భావాలోకమున నృత్యభేదస్వరూపప్రకారనిర్ణయమనెడి
నవమాధికారము.

# దశమాధికారము

## నాట్యప్రయోగభేద ప్రకారనిర్ణయము

ఈ దశమాధికారమునకు నాట్యప్రయోగభేదప్రకారవిశేష నిర్ణయమని నామసంకేతమున్నది. పూర్వాధికారముల నామసంకేతము వలె నిదియు సాభిప్రాయము. ఒకవిధముగా నిది ప్రకీర్ణాధికారము. పూర్వాధికారములలో నిరూపితాంశావశేషవిశేషముల నిరూపణ మిందు కొంత కలదు. నాట్యవేదావతారకథ యిందు భావనీయము. తత్ప్రసంగమున నాట్యప్రయోక్తల స్వరూపములు, నటుడు గుర్తింపవలసిన రాజపరివార స్వరూపమున్నది. రంగమండప స్వరూపమున్నది. సందర్భానుసారమున మార్గదేశి నృత్యనృత్తములు, నాట్యాదులలో బృందావశ్యకత, బృందవిశేషములు, ధ్రువారూపములు నిరూపితము లయినవి. రసభావరీతి, తద్వాక్యార్థత, రసేతరవాక్యార్థత ప్రతిపాదిత మయినవి. భారతవర్ష స్వరూపము, అందలి భాషా వ్యవస్థ, నాట్యోపయోగి భాష గోష్ఠి స్వరూపము నిరూపితమయినది. శారదాతనయుడు శ్రీమదభినవగుప్తానుయాయియగుట ప్రామాణ్యసంపాదనమునకు నిర్దిష్టమయినది.

ఉక్తా నాట్యస్య నృత్యస్య భేదాః సర్వే యథార్థతః
భరతాదిభిరాచార్యైః ప్రణీతేనైవ వర్త్మనా. 1

మార్గదేశీవిభాగేన తే ద్విధా పరికీర్తితాః
తేషాం ప్రబంధభేదానాం ప్రయోగక్రమ ఉచ్యతే. 2

భరతాదులు నిర్మించిన మార్గమున నాట్యభేదములు నృత్తభేదములన్నియు యథార్థానుసారమున ప్రతిపాదితము లయినవి. ఆ నాట్యనృత్తములు మార్గదేశీభేదమున ద్వివిధము లనిరి. ఇక నిచట నా మార్గదేశీప్రబంధభేదముల ప్రయోగక్రమము నిరూపిత మగును. మార్గదేశీప్రయోగోత్పత్తి సూచనమునకు ప్రాక్తనేతివృత్తసూచన మావశ్యకము.

### నాట్యోత్పత్తి

పురా మనుమహీపాలః సప్తద్వీపవతీం భువం
పాలయన్ దుర్భరేణాస్యా భారేణ శ్రాంతచేతనః. 3

కేనాస్య భూమిభారస్య విశ్రాంతిసుఖమాప్నుయాం
ఇతి సంచింత్య పితరం సవితారముపైత్ తత. 4

పురాకల్పమున మను మహీపాలుడు సప్తద్వీపములు కూడిన భూమిని పాలించుచు దుర్భరభూభారమున శ్రాంతచేతను డయినాడు. "ఈ భూభారవిశ్రాంతి సుఖమును నేనెట్లు పొందుదును?" అని చింతపడి యాలోచించి తండ్రియగు సవితృదేవు నీక్షించెను. ఆతని యనుగ్రహమున నుపాయము లభింపవలెను.

తథైవాభ్యాగమత్తత్ర భాస్కరః పుత్రవత్సలః
మనుర్న్యవేదయత్తస్మై భూభారక్లేశమాత్మనః. 5

స మనోర్భారఖిన్నస్య విశ్రామోపాయమబ్రవీత్

అప్పుడే పుత్రవత్సలుడయిన భాస్కరుడు విచ్చేసెను. మను వా భాస్కరునకు తన భూభారక్లేశమును నివేదించెను ఆ భాస్కరుడు భారఖిన్ను డయిన మనువునకు విశ్రామోపాయము నిరూపించెను. తానుగా తానై నిరూపింపలేదు. చిరకాలాగత మయిన యభిజ్ఞసంప్రదాయసమాగత మయిన యుపాయము సూచించెను. ఒకప్పుడు స్రష్టయు నిట్లయ్యెను. విష్ణువు నుపాయ మడిగెను. విష్ణువు శివసన్నిధి కేగుమనెను. బ్రహ్మ శివునడిగెను. శివునకాలోచన మక్కర లేదు. "నా నుండి గుర్తించిన నాట్యవేద మీతనికి జెప్పుము." అని శివుడు నందికేశ్వరునకు సూచించెను. నందికేశ్వరుడు బ్రహ్మకుపదేశించెను. బ్రహ్మ నుండి భరతులకు నాట్యవేదము లభించినది. ఇట్లు సంప్రదాయ విశుద్ధతా బోధనమున కిచట భూతార్థసూచన మావశ్యక మయినది. అది యిచట నున్నది. భాస్కర కథనములో నిది యున్నది.

పురా దుగ్ధాబ్ధినాథస్య నాభికమలసంభవః. 6

బ్రహ్మాఽసృజదిమాన్ లోకాన్ జంగమస్థావరాత్మకాన్
ఏతేషాం పాలనాయాసవ్యాపారపరిఖేదితః. 7

విశ్రాంతిసుఖమన్విచ్ఛన్నుపాగచ్ఛచ్ఛ్రియః పతిం
ప్రజాపాలనఖేదస్య విశ్రామాయ వ్యజిజ్ఞపత్. 8

అచింతయద్దేవదేవః శ్రాంతం వీక్ష్యాత్మసంభవం
కేనైవాస్య వినోదేన విశ్రామః సంభవేదితి. 9

విచింత్య భావం స్వచేత్రభావినం విధిమబ్రవీత్

పూర్వము దుగ్ధాబ్ధినాథుని నాభీకమల సంభూతు డయిన బ్రహ్మ జంగమస్థావరాత్మకము లయిన నీలోకములను సృజించెను. ఈ లోకముల పాలనాయాసవ్యాపారమున పరిఖిన్నుడయ్యెను. విశ్రాంతిసుఖ మభిలషించుచు శ్రీపతి సమీపమున కేగెను. ప్రజాపాలనఖేదవిశ్రామమునకై విజ్ఞాపన మొన రించెను. అప్పుడు దేవదేవుడు శ్రీపతి బ్రహ్మ శ్రాంతు డగుట చూచి యాలో చించెను. "ఏ వినోదమున నీతనికి విశ్రామము లభించునో!" ఇట్లాలోచించి భావము నిశ్చయించి తన సన్నిధి నున్న బ్రహ్మ నిట్లు పలికెను.

గచ్ఛ! బ్రహ్మన్! పురారాతిమంబికాపతిమీశ్వరమ్. 10

స తే విశ్రాంతిసుఖదముపాయముపదేక్ష్యతి
ఇత్థమాజ్ఞాపితో బ్రహ్మా దేవదేవముమాపతిమ్. 11

అభిష్టూయాత్మనః ఖేదం సర్వం తస్మై వ్యజిజ్ఞపత్

"బ్రహ్మా! పురారాతి యంబికాపతి యయిన శివుని సమీపమున కేగుము. శివుడే నీకు విశ్రాంతిసుఖ మిచ్చు నుపాయ ముపదేశించును." ఇట్లు విష్ణువాజ్ఞా పింపగా బ్రహ్మ యుమాదేవీవల్లభు డయిన దేవదేవుని స్తుతించెను. తన సర్వ ఖేదము శివునకు నివేదించెను.

విజ్ఞాయ శంభుస్తత్ఖేదం నందికేశ్వరమభ్యధాత్. 12

మత్సకాశాదధీతం త్వం నాట్యవేదమశేషతః
అధ్యాపయైనం బ్రహ్మాణం సప్రయోగం సవిస్తరమ్. 13

అప్పుడు శంభునాథుడు బ్రహ్మఖేదము గుర్తించి నందికేశ్వరు నిట్లు పలికెను—నా సమీపమున నధ్యయన మొనరించిన నాట్యవేదము సర్వము సవిస్త రముగా ప్రయోగసహితముగా నీ బ్రహ్మ కధ్యాపన మొనరింపుము-అని.

స తథేత్యబ్జజన్మానమధ్యాపయదశేషతః
అధ్యాప్యావోచదేతస్య వేదస్యైవ ప్రయోగతః. 14

జగతాం పాలనాయాసవిశ్రాంతి సుఖమాప్నుహి
ఇత్థం స నందినాఽఽజ్ఞప్తః సమాగత్య స్వమందిరమ్. 15

నాట్యవేదప్రయోక్తారం భారతీసహితోఽస్మరత్
స్మృతమాత్రే మునిః కశ్చిచ్ఛిష్యైః పంచభిరన్వితః. 16

పురోఽవతస్థే భారత్యా సహితస్యాబ్జజన్మనః
తానబ్రవీన్నాట్యవేదం భరతేతి పితామహః. 17

ఆ నంది "తథా" అనెను. సమగ్రముగా బ్రహ్మకు నాట్యవేద మధ్యాపనము చేసెను. అధ్యాపనము చేసి "ఈ నాట్యవేదప్రయోగముననె జగముల పాలనాయాసవిశ్రాంతిసుఖము పొందుము." ఇట్లు నందీశ్వరాజ్ఞప్తు డయిన బ్రహ్మ స్వమందిరము చేరి భారతీసహితుడై నాట్యవేదము ప్రయోగించు వానిని స్మరించెను. అట్లు స్మరింపగనె యొక ముని యయిదుగురు శిష్యులతో గూడి విచ్చేసెను. భారతీసహితు డయిన బ్రహ్మ యెదుట నిలబడెను. పితామహుడు వారలను జూచి "నాట్యవేదం భరత" నాట్యవేదమును భరించుము అనెను.

తేఽధీత్య నాట్యవేదం తత్ప్రయోగాంశ్చ పృథగ్విధాన్
పురావృత్తాని దేవానాం ప్రబంధేషూపదిశ్య తే. 18

రసైర్భావై రభినయైః ప్రయోగైశ్చ పృథగ్విధైః
నాట్యవేదోదితైః సమ్యక్పద్మయోనిమతూతుషన్. 19

తుష్టస్తేభ్యో వరం ప్రాదాదభీష్టం పద్మవిష్టరః
నాట్యవేదమిమం యస్మాద్భరతేతి మయేరితమ్. 20

తస్మాద్భరతనామానో భవిష్యథ జగత్త్రయే
నాట్యవేదోఽపి భవతాం నామ్నా ఖ్యాతిం గమిష్యతి. 21

ఇత్యాదిశ్య తతో బ్రహ్మా తైరేవ భరతైస్సహ
వినోదయతి లోకానాం రక్షావ్యసనజం శ్రమమ్. 22

వారు నాట్యవేదమధ్యయనము చేసిరి. నానావిధము లయిన ప్రయోగములను తెలిసికొనిరి. దేవతల పురావృత్తములను వారు ప్రబంధములందు సంధానించిరి. రసభావములతో నభినయములతో నాట్యవేదోదితము లయిన నానావిధప్రయోగములతో లెస్సగా బ్రహ్మను సంతోష పరిచిరి. అట్లు సంతుష్టు డయిన పద్మవిష్టరుడు వారి యభీష్ట మనుగ్రహించెను. "నాట్యవేదం భరత అని నే నంటిని గావున మీరు జగత్త్రియమున భరతనామము కలవారగుదురు.

గాపుత. ఈ నాట్యవేదమును మీ చేరట ప్రఖ్యాతి పొందగలదు " అని బ్రహ్మ యాదేశించెను. బ్రహ్మ యాభరతులతో గూడి లోకరక్షావ్యసనజన్య మయిన శ్రమమును విడనాడినాడు ఇది భాస్కరుడు మనువునకు జెప్పి యింక నిట్లనెను.

త్వమప్యారాధ్య తం దేవం మనో! బ్రహ్మాణమచ్యుతం
విజ్ఞాప్య వసుధాభార క్లేశవిశ్రామహేతవే. 23

తేన ప్రణీతై ర్భరతప్రయోగైః భువి కల్పితైః
ఆత్మానం భూభరశ్రాంతం వినోదయ యథాసుఖమ్. 24

ఇత్థమాదిశ్య చ మనుం దినేశస్త్రిదివం యయౌ

ఓయి మనూ! నీవును బ్రహ్మదేవుని విష్ణుదేవుని ఆరాధించి భూభార క్లేశవిశ్రామమునకై విజ్ఞాపన మొనరింపుము. బ్రహ్మ నిరూపించిన భూమిలో కల్పితము లయిన భరతప్రయోగములచే భూభరశ్రాంత మయిన నీ యాత్మను యథాసుఖముగా వినోద పెట్టుకొనుము. ఈ విధముగా భాస్కరదేవు డాదేశించి త్రిదివమున కేగెను.

మనుర్బ్రహ్మసదోఽభ్యేత్య ప్రణిపత్య పితామహమ్. 25

ఆత్మనో భూభరశ్రాంతిం వ్యజిజ్ఞపదశేషతః
చతుర్ముఖోఽపి విజ్ఞాయ మనోర్భూమిభరక్లమమ్. 26

ఆహూయ భరతాన్ సర్వానిదం వచనమబ్రవీత్

తండ్రియగు భాస్కరుని వచనానంతరము మనువు బ్రహ్మ సభ కేగెను. పితామహుని నమస్కరించెను. తన భూభరశ్రాంతి నశేషముగా విజ్ఞాపనము చేసెను. అప్పుడు చతుర్ముఖుడు మనువు యొక్క భూభరక్లమము తెలిసికొని భరతుల నందరను బిలిచి యీ వచనము పలికెను.

యాతయూయం మహీం విప్రాః మనునా త్రిదివాదితః. 27

భారతం వర్షమాశ్రిత్య వర్తధ్వం మనునా సహ
ఇతి సంచోదితాస్తేన భరతాః పద్మయోనినా. 28

అయోధ్యాం మానవేంద్రేణ మనునా సార్థమాయయుః

ఓ విప్రులారా! మీ రీ త్రిదివము నుండి మనువుతో జనుడు. భారత వర్ష మాశ్రయించి యుండుడు. మనువుతో నుండుడు. ఈ విధముగా బ్రహ్మచే

సంచోదితులై భరతులు మానవేంద్రు డయిన మనువుతో గూడ నయోధ్యా పట్టణ మేగిరి.

తత్ర రాజర్షిచరితం పురా కల్పాంతరే కృతమ్. 29
ప్రబంధేషూపదిశ్యైత త్తత్తన్నేతృపరిచ్ఛదం
రసై ర్భావై రభినయైః ప్రయోగై శ్చ విచిత్రితైః. 30
నాట్యవేదోపదిష్టేన సదా సంగీతవర్త్మనా
భూభారవహనశ్రాంతిం మనోః సమ్యగపానుదన్. 31

అయోధ్యపట్టణమున పురాకల్పాంతరమున నిర్మిత మయిన రాజర్షి చరితమును ప్రబంధములందు నిర్దేశించిరి. ఆయా నాయకపరివారసహితముగ నిరూపించిరి. రసములచే భావములచే నభినయములచే చిత్రవిచిత్రము లయిన ప్రయోగములచే నాట్యవేదోపదిష్ట మయిన సంగీతమార్గమున మనువు యొక్క భూభారవహనశ్రాంతిని తొలగించిరి. ఇట్లీ నాట్యము విశ్రాంతిజనన మయినది. మనువు శ్రాంతి పోగా సంతుష్టు డయ్యెను.

పరిగృహ్య తతః శిష్యాన్భరతాన్ కాంశ్చన ద్విజాన్
దేశే దేశే నరేంద్రాణాం వినోదం తై రచీకరత్. 32

తత్ర ప్రయుక్త సంగీతం దేశరీతిపరిష్కృతం
ప్రయోగాణాం చ వైచిత్ర్యాద్దేశీత్యాఖ్యాముపాగమత్. 33

నాట్య వేదాచ్చ భరతాః సారముద్ధృత్య సర్వతః
సంగ్రహం సుప్రయోగార్హం మనునా ప్రార్థితా వ్యధుః. 34

ఏకం ద్వాదశసాహస్రైః శ్లోకై రేకం తదర్థతః
షడ్భిః శ్లోకసహస్రై ర్యో నాట్యవేదస్య సంగ్రహః. 35

భరతై ర్నామతస్తేషాం ప్రఖ్యాతో భరతాహ్వయః
యదిదం భారతే వర్షే మనునా సుప్రకాశితమ్. 36

అనంతరము మనువు భరతు లయిన కొందరు శిష్యులను బ్రాహ్మణు లను స్వీకరించి వారలచే దేశ దేశమునను నరేంద్రులకు వినోదమును సంపాదింప జేసెను. అచట ప్రయుక్త మయిన సంగీతము దేశరీతి పరిష్కృత మయినది.

ప్రయోగముల వై చిత్ర్యమున 'దేశి' యను నామ ప్రఖ్యాతి పొందినది. భరతులు నాట్యవేదము నుండి స్వతః సారము సంగ్రహించి సుప్రయోగార్హ మయిన సంగ్రహాత్మకముగా నిర్మించిరి. అట్లొనరింపవలయునని ప్రార్థించిన మనువుకాంక్ష కారణము. ఒక సంగ్రహము ద్వాదశసహస్రశ్లోకపరిమితము. వేరొకటి యందు సగ మయిన షట్సహస్రశ్లోకపరిమితము. ఇది నాట్యవేద సంగ్రహము. అది వారి పేరున భరతనామమున ప్రఖ్యాత మయినది. భారతవర్షమున మనువు ప్రకాశింప జేసిన నాట్యవేదసంగ్రహము భరతనామమునసె ప్రసిద్ధ మయినది.

సంగీతశాస్త్రం సర్వత్ర రాజ్ఞాం విశ్రాంతిసౌఖ్యదం
తస్మాదిదం వినోదార్థం రాజ్ఞామేవ పురాకృతమ్. 37

విశ్రామాయ మహీభారవిశ్రాంతానాం సుఖప్రదం

## నాట్యప్రయోక్తలు

సంగీతశాస్త్రము లోకమంతట రాజులకు విశ్రాంతిసౌఖ్యప్రదము. కావుననే రాజుల వినోదమునకే పూర్వము నిర్ణీతమయినది. మహీభారవిశ్రాంతుల విశ్రాంతి సంపాదనమున సంగీతశాస్త్రము సుఖప్రదము. ఈ భూమిలో భార విశ్రాంతుల కందరకు నిది సుఖమిచ్చి విశ్రాంతి నీయగలదు.

అస్య సంగీతశాస్త్రస్య ప్రయోక్తౄణాం చ లక్షణమ్. 38

స్వరూపం కర్మ చైతేషాం యథావత్ప్రతిపాద్యతే
సూత్రధారః ప్రథమతో నటః పశ్చాత్తతో నటీ. 39

స పారిపార్శ్వకః పశ్చాత్తతః తే చ కుశీలవాః
విదూషకేణ సహితా నాట్యకర్మోపయోగినః. 40

ఈ సంగీతశాస్త్రలక్షణము తత్ప్రయోక్తల లక్షణము ప్రయోక్తల స్వరూపము వారి కర్మ యథాశాస్త్రముగా నిచట ప్రతిపాదిత మగును. మొదట సూత్రధారుడు, అనంతరము నటుడు, పిమ్మట నటి, అనంతరము పారిపార్శ్వకుడు, ఆ పిమ్మట కుశీలవులు విదూషకుడు—వీరు నాట్యకర్మలో నుపయోగించు వారని గ్రహింపదగును.

నాట్యకర్మప్రయోక్తా యః స తద్విద్భిరుదీర్యతే
శైలూషో భరతో భావో నట ఇత్యాఖ్యానామభిః. 41

నానాశీలస్య లోకస్య భావాన్భాసయతీహ యః
భూమికాస్థాః ప్రవిశ్యాతః శైలూష ఇతి కథ్యతే. 42

భాషావర్ణోపకరణై ర్నానాప్రకృతిసంభవం
వేషం వయః కర్మ చేష్టాం బిభ్రద్భరత ఉచ్యతే. 43

అతీతం లోకవృత్తాంతం రసభావసమన్వితం
స్వభావవన్నాటయతి యత స్తస్మాన్నటః స్మృతః. 44

సూత్రయన్కావ్యనిక్షిప్త వస్తు నేతృ కథా రసాన్
నాందీశ్లోకేన నాంద్యంతే సూత్రధార ఇతి స్మృతః. 45

అసూత్రయన్గుణాన్నేతుః కవేరపి చ వస్తునః
రంగప్రసాధనప్రౌఢః సూత్రధార ఇహోచ్యతే. 46

భరతేనాభినీతం యద్భావం నానారసాశ్రయం
పరిష్కరోతి పార్శ్వస్థః స భవేత్పారిపార్శ్వకః. 47

చతురాతోద్యవిద్వాగ్మీ ప్రియవాగ్గీతతాలవిత్
ఉపధార్య ప్రయోక్తా యః స సూత్రధృగితీరితః. 48

నాట్యకర్మలో నుపయోగించువారి స్వరూప మిచట నిరూపిత మగును. నాట్యకర్మప్రయోక్త యగువానిని నాట్యవిదులు శైలూష-భరత-భావ-నటాది నామముల వ్యవహరింతురు. వీరి స్వరూపలక్షణ మీ విధముగ నుండును. వీరిలో శైలూషుడను వాని లక్షణ మిట్లున్నది. నానాశీలములతో నుండు లోకము యొక్క అనగా, లోకము నందలి జనుల యొక్క భావములను వారి వారి భూమికాప్రవేశమున భాసింపజేయువానిని శైలూష పదమున వ్యవహరింప వలెను. భరతుడు. భాషావర్ణోపకరణములతో నానా ప్రకృతిసంభవ మయిన వేషమును వయసును కర్మను చేష్టను అనుసరించువాడు భరించువాడు భరతు డన దగును. నటుడు. అతీతమగు లోకవృత్తాంతమును రసభావసమన్వితముగా స్వభావ ముగా నటించువాడు నటింప జేయువాడు నటుడని వ్యవహార్యు డగును. సూత్ర ధారుడు. కావ్యములందు నిక్షిప్తము లయిన వస్తు నేతృ కథా రసములను నాందీ శ్లోకమున నాంద్యంతమున సూత్రణ మొనరించునేని సూత్రధారు డగును. నాయ కుని గుణములను కవివిశేషములను వస్తుగుణములను అసూత్రణ మొనరించుచు రంగప్రసాధన ప్రౌఢు డగు నాతని సూత్రధారు డందురు. పారిపార్శ్వకుడు.

భరతాభినీతమగు భావమును నానారసాశ్రయముగా పార్శ్వము నందుండి పరిష్క రించు నాతని పారిపార్శ్వకు డందురు. సూత్రధారుని స్వరూప మింక నీవిధ ముగా నున్నది. చతుర్విధాతోద్య విదుడు వాగ్మి ప్రియవాక్కు గీతతాల విదుడు సర్వము ధారణ మొనరించి ప్రయోగించువాడు సూత్రధారు డగును.

ఉజ్జ్వలా రూపవంతశ్చ నృపోపకరణక్రియాః
మేధావినో విధానజ్ఞాః స్వస్వకర్మణి పండితాః. 49

సూత్రధారహితా దక్షా యథోద్దేశప్రయోగినః
ఏభిరేవ గుణైర్యుక్తా నటా నాట్యే భవంతి హి. 50

భూమికాభిరనేకాభిః కర్మవాగంగచేష్టితైః
యథాప్రకృతిసంధాన కుశలాస్తే కుశీలవాః. 51

చతురాతోద్యభేదజ్ఞాస్తత్కలాసు విశారదాః
కరణాభినయజ్ఞాశ్చ సర్వభాషావిచక్షణాః. 52

నటానుయోక్త్రి కృత్యేషు నాటస్య గృహిణీ నటీ

నట కుశీలవ నటీ లక్షణ మిందున్నది. నటులుజ్జ్వలముగా నుందురు. మంచి రూపము కలవారుగా నుందురు. రాజుల కుపకరణక్రియాత్మకులుగా నుందురు. మేధావులు. విధానము తెలిసినవారు. తమతమ కర్మలలో పండితులు. సూత్రధారహితులు. దక్షులు. ఉద్దేశానుసారమున ప్రయోగ మొనరింప గల వారు. ఇట్టి గుణములతో నుండువారు నాట్యమున నటు లగుదురు. కుశీలవులు. నానావిధముల భూమికల ధరించువారై కర్మవాగంగచేష్టితములు కలవారై ప్రకృత్యనుసారమున ననుసంధాన మొనరించుటలో కౌశలము కలవా రయినచో కుశీలవ పదవ్యవహార్యు లగుదురు. ఈకుశీలవులు చతురాతోద్యభేదజ్ఞులు తత్తత్కలా విశారదులు. నానాకరణముల నాచరించుటలో నభినయించుటలో సమర్థులు నానా భాషావిచక్షణులు నగుదురు. నటి. నటుల నానాకార్యములలో నటు ననుసరించి యుండునదియై యుండును. నటుని గృహిణియు నగును.

విదూషకోఽపి సర్వత్ర వినోదేషూపయుజ్యతే. 53

విటశ్చ కామసావిద్యకరణేనోపయుజ్యతే
తదాత్వప్రతిభో నర్మచతురైకదప్రయోగవిత్. 54

వేదవిన్నర్మవేదీ యో నేతుః స స్యాద్విదూషకః
ఖలతిః పింగలాక్షశ్చ హాస్యానేకవిభూషితః. 55

పింగకేశో హరిశ్మశ్రుర్నర్తకశ్చ విదూషకః

విదూషకుడు వినోదములం దంతట నుపకరించువా డగును. విటుడను నాతడు కామసాచివ్యకరణమున నుపయోగించును. విదూషకుడు తదాత్వప్రతిభుడు. ఆయా సమయములకు తగిన విధమున తన ప్రతిభను ప్రదర్శించు వాడగును. ఇది ప్రత్యుత్పన్నమతిరూపము. శృంగారాంగము అయిన నాలుగు విధములగు నర్మవిశేషముల తెలిసినవా డగును. భేదప్రయోగమునను సమర్థు డగును వేదవిదు డగును. నర్మవేదియు నగును. నాయకుని శృంగారభావముల గుర్తించినవాడు నగును. ఇట్టి యాతడు విదూషకుడు. ఇంక నీతడు ఖలతి ఖర్వాటుడు బట్టతలవాడు. పింగలాక్షుడు. హాస్యకరములగు వేషభూషావిశేషములు కలవాడు. పింగకేశుడు. హరితవర్ణము కల శ్మశ్రువులు కలవాడు నర్తకుడు నగును. ఇట్టి యాతడు విదూషకుడు. విటు డిట్లుండును.

వేశ్యోపచారకుశలో మధురో దక్షిణః కవిః. 56

ప్రతిపత్తిపరో వాగ్మీ చతురశ్చ విటో మతః
మాల్యభూషోజ్జ్వలః కుప్యత్యనిమిత్తం ప్రసీదతి. 57

విటః ప్రాకృతవాదీ చ ప్రాయో బహువికారవాన్
ఏతే నాట్యప్రయోక్తారో రాజ్ఞాం స్యుఃస్సుఖభోగినామ్. 58

విటుడు వేశ్యల నుపచరించుటలో కుశలుడు. మధురుడు. దక్షిణుడు. కవి. విజ్ఞానాసక్తుడు. వాగ్మి, చతురుడుగా నుండును. పూలమాలలు భూషలు ధరించి యుజ్జ్వలముగా నుండును. అనిమిత్తముగ కోపించును. అట్లే ప్రసన్నుడగును. విటుడుప్రాకృతవాదియు నగును. తఱచుగా బహువికారములు కలవాడు. ఇట్టివాడు విటుడు. ఈ నిరూపితు లయిన వారందరు సుఖభోగులయిన రాజుల నాట్యప్రయోక్తలు. రాజు సూచనమున సిద్ధమయిన నాట్యమున నిట్టి వారందరు ప్రయోక్తలుగ నుందురు.

## రాజపరివారము

ప్రథమం తత్ర రాజానం ప్రకృతిం చ త్రిధా స్థితాం
మహిషీం చ మహాదేవీం దేవీం చ సహభోగినీమ్. 59

ఆశ్రితాం నాటకీయాం చ కాముకాం శిల్పకారికాం
విజ్ఞాయ చాంతఃపురికాః పశ్చాచ్చ పరిచారికాః. 60

శయ్యాపాలీం ఛత్రపాలీం తథా చామరధారిణీం
సంవాహికాం గంధయోక్త్రీం మాల్యాభరణయోజికే. 61

ఏతా విజ్ఞాయ తత్పశ్చాద్విద్యాత్తదనుచారికాః
నానాకక్ష్యామధిష్ఠాత్ర్యః తథోపవనభూమికాః. 62

దేవతాయజనక్రీడా హర్మ్యప్రాసాదమాలికాః
ఏతా విజ్ఞాయ భూపానాం విద్యాత్సంచారికా అపి. 63

పీటికాదాయినీః వేత్రధారిణీ రసిధారిణీః
ఆహ్వాయికాః ప్రేక్షణికాః తథా యామినికీరపి. 64

ఏతాః సంచారికా రాజ్ఞస్తథైతా హ్యనుచారికాః
అవియుక్తాశ్చరంత్యేతాః సర్వావస్థాసు భూభృతః. 65

మహత్తర్యః ప్రతీహార్యో వృద్ధా ఆయుక్తికా అపి
కంచుకీయా వర్షవరాః కిరాతాః కుబ్జవామనాః. 66

ఔపస్థాపకినిర్ముండా అభ్యాగారాశ్చ మూకినః
ఏతే హ్యంతఃపురచరాస్తేషాం లక్షణముచ్యతే. 67

ఈ ప్రఘట్టమున నటులు గుర్తింప దగిన రాజపరివారము నిర్దిష్టమగును. ఈ పరివారమున అంతఃపురిక-పరిచారిక-అనుచారిక - సంచారిక-అంతఃపురచరు లను నయిదు వర్గముల వారున్నారు. ఒక్కొకవర్గమున గొందరున్నారు. వారి నామములిం దుల్లిఖితము లయినవి. నటు లంతఃపురసంచారుల నందరిని గుర్తింపవలెను. అందు మొదట రాజును త్రివిధముగా నున్న ప్రకృతిని గుర్తింపవలెను. మహిషి-మహాదేవి-దేవి- భోగిని-ఆశ్రిత - నాటకీయ-కాముక - శిల్పకారిక యను నీ యెనిమిది విధముల నున్న అంతఃపురికా వనితల దెలియవలయును. పిమ్మట పరిచారికల దెలియ వలయును. శయ్యాపాలి-ఛత్రపాలి-చామరధారిణి-సంవాహిక-గంధయోక్త్రి - మాల్యయోజిక-ఆభరణయోజిక యను వా రేడుగురు పరిచారికలు. వీరి పేరులు వీరి కార్యవిశేషములను సూచింపగలవు. వీరిని గుర్తించి యనుచారికల గుర్తింపవలెను. ఇట్టివారు నానాకక్ష్యాభాగముల నాశ్రయించి యుందురు. ఉపవన భూమికల ననుసరించి యుందురు. దేవతాయజనభాగము

లను క్రీడాహర్మ్యములను ప్రాసాదమాలికల నాశ్రయించి యుందురు. వీరిని దెలిసికొని రాజుల సంచారికలను దెలియవలయును. వీటికాదాయిని- వేత్రధారిణి-అసిధారిణి-ఆహ్వాయిక-ప్రేక్షణిక - యామినిక యను వీరు ఆరుగురు రాజునకు సంచారికలు. అనంతర మనుచారికల దెలియ దగును. వీరు సర్వావస్థలందును రాజు ననుసరించి యవియుక్తలై సంచరింతురు. అట్లే మహత్తరి-ప్రతీహారి-వృద్ధ-ఆయుక్తిక యనువారును సంచారికలుగా నుందురు. ఇక కంచుకీయ—వర్ష వర—కిరాత—కుబ్జ-వామన—ఔపస్థాపకి-నిర్ముండ-అభ్యాగార—మూకి అనువారు నంతఃపురచరులుగా నుందురు. వీరందరు తమతమ నియుక్తనామవిశేషముననె కథిత లక్షణ లయినను వీరి లక్షణము నిరూపిత మగును.

అభిగమ్యగుణోపేతో నేతా వా ప్రేక్షకోఽపి వా
విజిగీషుర్మహోదాత్తః సమ్యక్సంగీతవేదితా. 68

చతుర్ణామపి వర్ణానాం రాజా సంగీతమర్హతి
తస్య త్రిధాస్యాత్ప్రకృతిరుత్తమాధమమధ్యమా. 69

స్త్రీణాం తథా స్యాదేతాసాం శీలం భావాన్ విశేషతః
జ్ఞాత్వా తతస్తాః ప్రకృతీః సుఖేనాభినయేన్నటః. 70

ప్రథమముగా రాజును గుర్తింపవలెనని యున్నది. రాజభిగమ్యగుణములతో నుండును. నాయకుడు ప్రేక్షకుడు నగును. విజిగీషువు. మహోదాత్తుడు. బాగుగా సంగీతవేది. నాలుగు వర్ణముల వారలలో రాజు సంగీతార్హుడగును. ఆతని ప్రకృతి యుత్తమ-మధ్యమ—అధమ రూపమున మూడు విధముల నుండును. స్త్రీల ప్రకృతియు త్రివిధముగ నుండును. వారల శీలమును భావమును సవిశేషముగ గుర్తించి యా ప్రకృతులను నటుడు సుఖముగా నభినయింప దగును. ఇట్లు రాజును తెలిసికొని యనంతర మామె మహిషి - పట్టమహిషి—మహారాజ్ఞి యనదగిన యుదాత్తవనితారూపమును ముందుగా గుర్తించుచునది. ఆమె తరువాత జెప్పదగిన మహాదేవీ దేవీ ప్రభృతులను దెలియవలయును. వారి లక్షణము లిట్లున్నవి.

మూర్ధాభిషిక్తా మహిషీ తుల్యశీలకులాన్వితా
అనభిజ్ఞా సపత్నీనాం సహధర్మచారీ భవేత్. 71

అంతఃపురహితా సాధ్వీ శాంతిస్వస్త్యయనైర్యుతా
అనీర్ష్యా పతిశీలజ్ఞా మహాదేవీ పతివ్రతా. 72

పభిర్గుణై ర్యుతా కించి త్తత్సత్కారవివర్జితా
గర్వితా రతిసంభోగతత్పరా చ సమత్సరా. 73

రూపయౌవనసంపన్నా రాజ్ఞా దేవీతి కథ్యతే
నిత్యం ప్రసాధనవతీ శీలరూపగుణాన్వితా. 74

స్వయం ప్రవృత్తసురతా ప్రవృత్తే భోగవర్త్మని
సపత్నీనామసహనా భోగినీతి నిగద్యతే. 75

భోగోపస్కరసంస్కర్త్రీ నృపతేశ్ఛందవర్తినీ
గతేర్ష్యా భోగకుశలా దయాలుశ్చాశ్రితా భవేత్. 76

నృపతేర్గీతవస్తూని గాయినీ రతిమందిరే
స్వాభిః శృంగారచేష్టాభిః పత్యుర్మన్మథవర్ధినీ. 77

ముఖపాఠేన నృత్యంతీ నాటకీయేతి కథ్యతే
నిషీదంతం నిషీదంతీ గచ్ఛంతమనుయాయినీ. 78

భుంజానమనుభుంజానా శయానమనుశాయినీ
సా కాముకేతివిజ్ఞేయా దేశకాలానువేక్షిణీ. 79

వాసోఽంగరాగాభరణ మాల్యశిల్పవిధాయినీ
విచిత్రసురతక్రీడా పత్యుర్వైచిత్ర్యదాయినీ. 80

శయనాసనశిల్పజ్ఞా సా భవేచ్ఛిల్పకారికా
ఆసాం స్వభావమాలోచ్య యథాభావం ప్రయోజయేత్. 81

1. మహిషి. మహిషి యనదగిన రాజపత్ని మూర్ధాభిషిక్త. పట్టాభిషేక వైభవము కలది. తుల్యశీల కులాన్విత. సవతు లెవరో యీమెకు తెలియదు. తెలిసికొనదలచదు. రాజునకు సహధర్మచారిణి యగును. ధర్మకార్యము లందు రాజసన్నిధిలో నుండుట కర్హత కలది యగును. 2. మహాదేవి. అంతఃపురహిత సాధ్వి శాంతిస్వస్త్యయనములతో నుండును. ఈర్ష్యారహిత పతిశీలజ్ఞ పతివ్రత యగునీమె మహాదేవీ పద వ్యవహార్య. 3. దేవి. ఈమె మహాదేవీగుణములు కలది యగును. మహాదేవికి కల సత్కారము లంతగా నీమె కుండవు. గర్విత. రతిసంభోగతత్పర. స్వయముగా రతిపండిత. పతిసంభోగ సముచిత. నిత్య మట్టి యాసక్తిలాలస. ఇంతగా నుండియు నీమె సమత్సర.

ఈమె రూపసంపన్న. యౌవనసంపన్న, ఈమెను 'దేవి' యని రాజనును. 4. భోగిని. నిత్య మలంకారప్రియ. శీలరూపగుణాన్విత. భోగరీతి ప్రవృత్తము కాగా స్వయముగ తనయంతట తానే సురతప్రవృత్త యగును. సవతుల కసహన. వారీమెను సహింపజాలరు. ప్రియుని సురతాసక్తు నొనరించి తన దగ్గరనే యుండు నట్లు చేసిన దాని వారు సహింపలేరు. 5. ఆశ్రిత. భోగసామగ్రిని అలంకారసామగ్రిని సంస్కరింప గలదు. రాజుచ్ఛందోనుసారమున ప్రవర్తించును. ఈర్ష్యారహిత యగును. భోగకుశల. దయాళువు. ఇట్టి యీమె యాశ్రిత యగును. 6. నాటకీయ. రతిమందిరము నందు రాజు గీతవస్తువులను గాన మొన రించును. తన శృంగారచేష్టలచే పతి మన్మథభావములను వృద్ధి పొందించును. ముఖపాఠమున నర్తన మొనరించుచు రాజును రంజింజేయును. ఈమె నాటకీయ. 7. కాముక. ఈ యమ రాజు కూర్చొనినచో కూర్చొనును. గమన మొనరిం చుచో ననుయాయిని యగును. రాజు భుజించుచో తోడ భుజించును. ఆతడు శయనించునేని యనుశాయిని యగును. ఈమె దేశము కాలము పరీక్షింపదు. 8. శిల్పకారిక. ఈమె వాసోంగరాగ—ఆభరణ-మాల్య—శిల్పముల నిర్మించునదై విచిత్రసురతక్రీడల నాచరించును. బంధసంభోగముల విచిత్రత జూపును. పతికి వైచిత్ర్యము కూర్చునది యగును. శయనాసనశిల్పముల గుర్తించినదియు నగును. ఇట్టి యీమె శిల్పకారిక. ఇట్లు వీరి స్వభావముల సమీక్షించి భావాను కూలముగా నటుడు నాట్యప్రయోగ మొనరింపవలెను.

రాజ్ఞో మహిష్యాస్సర్వత్ర సర్వావస్థాసు సర్వదా
స్వాధికారైర్యథాయోగం ఘటంతే పరిచారికాః. 82

ఆసాం శీలం స్వభావం చ యథాభావం ప్రయోజయేత్
సంచారికాణాం కర్మాణి తత్ర తత్ర ప్రయోజయేత్. 83

సంచారికా యథా యోజ్యాః తథా స్యురనుచారికాః

సర్వావస్థ లందును సర్వస్థలము లందును సర్వసమయము లందును యథాయోగముగా రాజు మహిషి స్వాధికారముల ననుసరించి పరిచారికలు నియుక్త లగుదురు. రాజు మహిషి పరిచారికల నా యా పరిచర్యలలో నియ మింతురు. వీరి శీలస్వభావాదులను భావానుసారమున ప్రయోగింపవలెను. సంచారికల కర్మలను గూడ నాయా స్థలము లందు సముచితముగ ప్రయోగింప

దగును. సంచారికల యోజన మొనరించిన విధముననె యనుచారికల గూడ యోజన మొనరింపదగును.

కామోపభోగ సంభోగ గుహ్యాగుహ్య సమర్థనే. 84

యా రాజ్ఞా వినియుజ్యంతే తాః స్యుః ప్రేషణికాః స్త్రియః
ప్రీత్యాఽఽంతఃపురికా నిత్యమాశీఃస్వస్త్యయనాదిభిః. 85

పృచ్ఛంత్యః కుశలం దేవీస్తా మహత్తర్య ఈరితాః
తా నియోజ్యాస్సదా రాజ్ఞా సర్వాంతఃపురరక్షణే. 86

యాః పంచమాబ్దాదధికా దశమాబ్దావరాః స్త్రియః
కుమార్యస్తాః కుమారీణాం ప్రతీహార్య ఇతి స్మృతాః. 87

ప్రత్యంతఃపురికం తాస్తు సుఖదుఃఖసమన్వితాః
నివేదయంతి వృత్తాంతం కుమార్యా సహ సర్వదా. 88

అజాతరతిసంభోగా నిభృతా లజ్జయాఽన్వితాః
అంతఃపురవిహారిణ్యః కుమార్యః కులజాః స్మృతాః. 89

తా లాలనీయా నృపతేరవరోధవధూజనైః

ప్రేషణికలను వనితలను రాజు ఆయాకార్యములలో వినియోగింవ జేయును. ప్రేషణికలు చక్కగా తమకు నియుక్తము లయిన కార్యములను సమీక్షింతురు. కామోపభోగరీతులలో సంయోగవిధానములలో రహస్యములుగా నుంచదగువాని సమర్థనములో, రహస్యములు కాని వానిని సమర్థించుటలో వారు వినియుక్త లగుదురు. మహత్తరీ పదమున జెప్పదగినవారు కొందరుందురు. మహత్తరిక లనియు వీరి వ్యవహారము. వీరు సర్వాంతఃపురికా ప్రధానలు. అంతఃపురికల నందరిని నిత్యము ప్రీతిపురస్సరముగా నాశీఃస్వస్త్యయనాదులతో కుశలప్రుచ్ఛ చేయుదురు. అంతఃపురమున నున్న దేవీపదవాచ్యల నందరిని కుశల మడుగుదురు. వీరు మహత్తరికలు. రాజిట్టి వారిని సర్వదా సర్వాంతఃపురరక్షణమున నియమింపవలెను. కొందరు ప్రతీహారీపదమున నెన్నదగిన వారుందురు. వీరయిదు వత్సరముల వయసుపైగా నున్న వారు పదిసంవత్సరముల వయసు లోపుగా నుండువారు నగుదురు. వీరు కుమారీజనములకు ప్రతీహారులుగా నుందురు. వయసున కుమారీభావముననె యుందురు. ప్రత్యంతఃపురమున నిట్టివారుందురు. వీరు సుఖదుఃఖసమన్వితలై యుందురు. అంతఃపురకుమారీజనముతో

సంచరించు చుందురు. వీరు అజాతరతిసంభోగాః. రతి సంభోగము వీరల కింకను గలుగదు. నిబ్బరముగా నుందురు. లజ్జాన్వితలు నగుదురు అంతఃపురమున విహరించునీ కుమారికలు కులజలయిన కన్యలు. వీరందరు రాజావరోధజనములచే లాలనీయలు. అంతఃపురమున నుండు వారలందరు వీరలను లాలనమొనర్ప వలెను.

పూర్వరాజనయజ్ఞాశ్చ తైః క్రమేణైవ మానితాః. 90
పూర్వరాజోపచారజ్ఞా యాస్తా వృద్ధా ఇతీరితాః
కథయంత్యః కథాశ్చిత్రాః వాక్యైః ప్రహసనైరపి. 91

వినోదయంతి తా రాజ్ఞః స్త్రియోఽంతఃపురవర్తినీః
ఫలమూలౌషధీ మాల్య గంధాభరణ వాససామ్. 92

భాండాయుధాసనానాం స్యురష్టావాయుక్తికాః స్మృతాః
తాశ్చాంతఃపురచారిణ్యః నియోజ్యాస్తేషు కర్మసు. 93

రాజాంతఃపురములందు వృద్ధలాయుక్తికలు నుందురు. వారి వారి పనులతో వారిందున్నారు. వృద్ధలు పూర్వరాజుల నయనీతి విశేషముల దెలిసియుందురు. పూర్వతనులచే గూడ క్రమముగా సమ్మానితలు. పూర్వరాజుల యుపచారములను దెలిసినవారు. వీరాదరముగ మానింప దగిన వృద్ధలు. ఆయుక్తికలు చిత్రకథల నంతఃపురములందు జెప్పుదురు. ప్రహసనపరము లయిన వాక్యములను బలుకుదురు. అంతఃపురములం దుండు రాజవనితలను వీరు వినోద పెట్టుచుందురు. ఫల-మూల-ఓషధీ-మాల్య-గంధ-ఆభరణ-వస్త్రముల నియోజనమున, భాండ-ఆయుధ-ఆసనముల నియోజనమున వీరు నియుక్త లగుదురు ఇట్టి యాయుక్తిక లెనిమిది మంది యుందురు.

అకామా బ్రాహ్మణాశ్చైవ కంచుకోష్ణీషవేత్రిణః
జ్ఞానవిజ్ఞానసంపన్నాః కంచుకీయాః స్మృతా బుధైః. 94

అల్పసత్త్వాః స్త్రీస్వభావాః క్లీబా నిష్కామినః స్వతః
జాత్యా వా కామనిర్ముక్తాః తే తు వర్షవరాః స్మృతాః. 95

వన్యమూలఫలాహారాః పల్లీపర్వతవాసినః
చిత్రస్త్రీకాః సుభాషాజ్ఞాః చిబుకాః కర్కశాంగకాః. 96

తే కిరాతా బలాద్రాజ్ఞా వారం వారం నియోజితాః

అంతఃపురములందు బ్రాహ్మణులు కొందరుందురు. వారు రకాములు. ధార్మికులు. వేదవిదులు. శాస్త్రపురాణకోవిదులు. మంత్రానుష్ఠాతలు. మరి కొందరు కాంచుకీయు లుందురు. వారు కంచుకము ధరింతురు. ఉష్ణీషము ధరింతురు. వేత్రము ధరింతురు. జ్ఞానవిజ్ఞానసంపన్నులు నగుదురు. వీరు కాంచుకీయులు. ఇంకను కొందరుందురు. వారు వర్షవరులు కిరాతులు. వీ రెందులకుం దురో ముందు విశదమగును. వర్షవరు లల్పసత్త్వులు. స్త్రీ స్వభావులు. నపుంసకులు. స్వతః నిష్కాములు. జాతిసహజముగనె కామనిర్ముక్తు లగుదురు. వీరిని వర్షవరు లందురు. కొందరు కిరాతు లుందురు. వారు వన్యమూలఫలాహారులు. పల్లీవాసులు. పర్వతవాసులు. "చిత్రస్త్రీకాః" వీరల స్త్రీలు చిత్రముగ నుందురు. మంచి భాష పలుకుదురు. వీరలకు చిబుకములు గడ్డము లుండును. అంగములు కర్కశముగ నుండును. వీరు కిరాతులు. రాజు బలమున వారం వారం తెప్పించి నియమించును. కాంచుకీయులు వర్షవరులు కిరాతు లంతఃపురముల నేమి చేయుదురు?

కంచుకీయా నృపాభ్యాశవర్తినోఽంతఃపురాశ్రయాః. 97
భవనాంతరకృత్యేషు నియోజ్యాః ప్రేష్యకర్మణి
సాహాయ్యే కామచారస్య రాజ్ఞః ప్రచ్ఛన్నకామినః. 98
వారవ్యత్యాసకథనే స్త్రీణాం వర్షవరాః స్మృతాః
రాజావరోధభోగ్యానాం భాండాభరణవాససామ్. 99
సద్యోఽంతఃపురదండేషు కిరాతా యోజితా నృపైః
పరిహాసవినోదేషు స్త్రీణాం స్యుః కుబ్జవామనాః. 100

కాంచుకీయులు రాజు సమీపమున నుందురు. అంతఃపురము నాశ్రయించి యుందురు. వీరు భవనాంతరకృత్యము లందు నియమింప దగినవారు. ప్రేష్యకర్మ లందును నియుక్తు లగుదురు. వర్షవరుల కార్యము వేరు. రాజు స్వేచ్ఛాసంచారి ప్రచ్ఛన్నకామి యయినప్పుడు రాజునకు సంబంధించిన సాహాయ్యమున నియుక్తు లగుదురు. స్త్రీల వారవ్యత్యాస కథనమునను నియుక్తు లగుదురు. ఏనాడే స్త్రీ వంతు కలదో, వంతు మారినదో వీరు సూచింతురు. కిరాతుల కార్య మిట్లుండును. రాజాంతఃపురములలో భోగ్యములగు భాండాభరణవస్త్రాదుల విషయమున నంతఃపురపరివారజనమును దండింపవలసి యున్నప్పుడు నృపులు కిరాతులను నియమింతురు. ఇంకను కుబ్జవామనులు కొందరు

కలరు. వారు వనితల పరిహాస వినోదముల నుపయోగింతురు. ఇంక నంతఃపుర మున నుండదగు వారు. ఔపస్థాపకులు నిర్ముండులు. వారి స్వరూప మిట్లుండును.

అవిద్ధకర్ణః క్లీబశ్చ హ్రస్వో వికటదంతకః
తుందిలోఽభ్యంతరచర ఔపస్థాపిక ఉచ్యతే. 101

అజ్ఞాతకామా నిష్కోశా నిర్ముండా ఇతి చ స్మృతాః
వధూపస్థాపనే రాజ్ఞామౌపస్థాపిక ఉచ్యతే. 102

ప్రస్థాపనే వధూనాం స నిర్ముండో యోజ్యతే నృపైః

ఔపస్థాపికుడు అవిద్ధకర్ణః చెవికట్టు లేనివాడు. క్లీబుడు. హ్రస్వా కారుడు. వికటదంతుడు. పెద్ద పొట్ట కలవాడు. అభ్యంతరమున సంచరించువాడు నగు నాతడౌపస్థాపికు డగును. నిర్ముండు లనదగు వారు కామము తెలియని వారు. నిష్కోశులు. అండకోశ ముండదు. రాజుల సన్నిధిలో వధువుల నుప స్థాపింప జేయుటలో నౌపస్థాపికుడును, వచ్చిన వధువుల పంపుటలో నిర్ముండులు నుపయోగింతురు.

పుంస్త్రీలింగవిలుప్తాంగాః స్వల్పశ్మశ్రు స్తనాన్వితాః. 103

అభ్యాగారా ఇతి జ్ఞేయా అభ్యాగారాధికారిణః
నియోగకారకా రాజ్ఞాం సర్వావస్థాసు సర్వదా. 104

మూకాః కుహకలీలాభిః సర్వత్ర పరిహాసకాః
తేషాం భావం పరిజ్ఞాయ తథైవాభినయేన్నటః. 105

అభ్యాగార—మూకసంజ్ఞ కలవారు నంతఃపురమున నుందురు. ఇంద భ్యాగారులకు పుంలింగాంగములు గాని స్త్రీలింగాంగములు కాని విలుప్తము లగును. స్వల్పముగా శ్మశ్రువు లుండును. చిన్న స్తనము లుండును. వీరభ్యాగా రాధికారులు. రాజులకు సర్వావస్థలలో నిత్యము నియోగకారకులుగా నుందురు. మూకు లనువారు మూగవారు. సర్వత్ర కుహకలీలలతో - వంచనాత్మకముల యిన మోసగింపుచేష్టలతో పరిహాసకులుగా నుందురు. వీరందరి భావముల గుర్తించి నటు డావిధముగనె యభినయింపవలెను. ఇది యంతయు నటజ్ఞానోప యోగిమాత్రమె కాదు. పాఠకజ్ఞానోపయోగియు నగును. ఇటుపై సభాసదాదుల రూపము నిరూపణీయము.

సభాసదులు

రాజా సేనాపతిశ్చైవ యువరాజః పురోహితః
ప్రాశ్నికాః ప్రాడ్వివాకా స్త అయుక్తాః సచివా స్తథా. 106

ఏతే సభాసదః కార్యాః ప్రాశ్నికాః ప్రాగుదాహృతాః
నానాభావవిశేషజ్ఞా నానాశిల్పవిచక్షణాః. 107

శయనే చాసనేవాఽపి లేఖ్యేఽలంకారయోజనే
పరిహాసేంగితజ్ఞానే చతురాతోద్యవేదనే. 108

నృత్తే గీతే చ కుశలా నానాభావవిచక్షణాః
మనస్వినో మానధనా ఊహాపోహవిశారదాః. 109

అర్థేషు స్త్రీషు శుద్ధాశ్చ సదస్యాః కథితా బుధైః

రాజు-సేనాపతి-యువరాజు — పురోహితుడు-ప్రాశ్నికులు - ప్రాడ్వివాకులు-ఆయుక్తులు-సచివులు; వీరు సభాసదులుగా నుందురు. ప్రాశ్నికుల స్వరూపము పూర్వము నిరూపిత మయినది. సభాసదులు రాజాదులు తదితరు లందరు సదస్యులు. నానాభావవిశేషవిదులుగా నుందురు. నానాశిల్పవిచక్షణు లగుదురు. శయనమున నాసనమున లేఖ్యమున నలంకారయోజనమున పరిహాసేంగితజ్ఞానమున చతుర్విధాతోద్యవేదనమున నృత్తమున గీతమున సమర్థులై యుందురు. నానా భావ విచక్షణులు మనస్వులు మానధనులు ఊహాపోహవిశారదులు నగుదురు. అర్థముల విషయమున స్త్రీల విషయమున శుద్ధులై యుందురు. ఇట్టివారు సదస్యులుగా నుండదగుదు రని బుధుల నిర్ణయము.

వైతాలికా వందినశ్చ నాందీమంగలపాఠకాః. 110

సూతాశ్చ మాగధాశ్చైవ సదస్యాః స్యుః కదాచన
తత్తత్ప్రహరకయోగ్యైరాగైః తత్కాలవాచిభిః శ్లోకైః
సరభసమేవ వితాలం గాయన్ వైతాలికో భవతి. 111

వక్త్రీం చాఽపరవక్త్రీం వా నేపథ్యే గాతుమర్హతి
వంద్యమానేశ్వరక్ష్మాప వంశ వీర్య గుణ స్తవైః
వంద్యభూభృద్గుణోత్కర్ష శ్రావకా వందినః స్మృతాః. 112

ఆశీఃపురస్కృతై ర్వాక్యైర్మంగలార్థప్రకాశకైః
మంగలాని ప్రశంసంతో నాందీమంగలపాఠకాః. 113

నందనీయాని వాక్యాని మంగలాని చ భూభృతాం
పఠంతి భోగార్థానీతి నాందీమంగలపాఠకాః. 114

ఇంకను కొందరు సదస్యు లుందురు. వైతాలిక-వంది-నాందీమంగల పాఠక - సూత - మాగధులు సదస్యులుగా నొకప్పు డుందురు. వీరెల్లప్పుడు సద స్యులుగా నుండరు. వైతాలికుడు వితాలముగా గాన మొనరించును. తత్తద్వ్య వహారక యోగ్యము లయిన రాగములతో తత్తత్కాలవాచకములగు శ్లోకములతో సరభసముగా వితాలగాన మొనరించును. వంది యనదగు వాడు వక్త్రి మపర వక్త్రి మను వృత్తబద్ధముగా గేయపద్యమున గాన మొనరింపదగును. వంద్యమాన దేవుని గుణస్తవములతో ప్రభువు వంశవీర్యగుణస్తవములతో గాన మొనరింప దగును. వందులు వంద్యమాన ప్రభు గుణోత్కర్ష శ్రావకులుగా నుందురు. ఇట్టి వారు వందులు. నాందీమంగలపాఠకులు ఆశీఃపురస్కృతము లయిన మంగలార్థ ప్రకాశకము లయిన వాక్యములతో మంగలప్రశంస లొనరింతురు. ఇట్టి వీరు నాందీమంగలపాఠకులు, రాజులకు సంబంధించిన నందనీయములగు వాక్యము లను మంగలములను రాజభోగార్థముగా పఠింతురు. కావున నాందీమంగలపాఠకు లగుదురు.

సుఖస్వాపవిదో రాజ్ఞాం సుప్రభాత ప్రశంసకాః
సూతాః సవనయోగ్యానాం కర్మణాం బోధకాః స్మృతాః. 115

రాజ్ఞః పురజనస్యాపి మంగలాచారశంసినః
మాన్యైర్మాగధికాగీతైర్మాగధా ఇత్యుదీరితాః. 116

ఏవం సపరివారస్య నేతుశ్చ ప్రేక్షకస్య చ
స్వభావమవగమ్యైవ నాట్యేనాభినయేన్నటః. 117

వర్ణకై రంజనైస్స్నానైః భూషణైశ్చాప్యలంకృతః
గాంభీర్యౌదార్యసంపన్నో రాజవత్తు భవేన్నటః. 118

ఏవం స్వభావతో రాజ్ఞాం నిత్యమేవోజ్జ్వలో భవేత్
రాజోపచారోఽభినేయో యథాభావం యథారసమ్. 119

సూతులు కొంద రుందురు. వారు రాజుల సుఖస్వాపము గుర్తింతురు. సుప్రభాతప్రశంసకు లగుదురు. సవనయోగ్య కర్మలను బోధింతురు. నివేదింతురు. మాగధులు కొంద రుందురు. వీరు రాజులకు పురజనులకు మంగలాచారశంస

కులుగా నుందురు. మాననీయములను మాగధికాగీతములతో "మంగలాచార శంసినః"- ఇట్టివారు మాగధు లనదగుదురు.

నటు డీ విధముగా సపరివారనాయకస్వభావము గుర్తించి, ప్రేక్షక స్వభావము తెలిసికొని నాట్యమున నభినయింప వలెను. నటు డాకారమున రాజువలె నుండదగును. వర్ణకములతో నంజనములతో స్నానములతో భూషణము లతో నలంకృతుడై గాంభీర్యౌదార్యసంపన్నుడై రాజువలె నుండదగును. ఇట్లు రాజస్వభావమున నిత్య ముజ్జ్వలుడుగా నుండదగును. యథాభావముగా యథారసముగా నటుడు రాజోపచార మభినయింప వలెను. ఇట్లుపచారాభినయ మున నిత్యము సావధానుడు కావలెను. ఇందు కించిదనవధానమున నయినను అభిజ్ఞసన్నిధిలో నవ్యుత్పత్తిసంభావన గలుగును.

## రంగమంటపము

రాజా సపరివారశ్చ భరతశ్చ కుశీలవైః
నాట్యకృత్యాభినిష్పన్నం విశంతో రంగమంటపమ్. 120

యత్ర రజ్యంతి భావేన గానేవాదనన ర్తనైః
సభ్యాః సభాపతిసఖాః సదేశో రంగమంటపః. 121

పరివారముతో గూడుకొనిన రాజు, కుశీలవులతో గూడుకొనిన భరతు డును నాట్యప్రయోగమునకుగా నభినిష్పన్న మయిన రంగమంటపమును ప్రవే శింపవలెను. సభాపతిసహితు లయిన సభ్యులు భావమున గానమున వాదనమున న ర్తనమున నెచట రంజితు లగుదురో యా దేశమును రంగమంటప మందురు. రంగమంటపప్రసక్తి ననుసరించి రంగమంటప స్వరూపలక్షణములు ప్రతిపాదనీయ ములు. రంగమంటప మిట్లుండును.

చతురశ్ర త్ర్యశ్ర వృత్తభేదా త్సోఽపి త్రిధా భవేత్
పరమంటపికైః సద్భిః పౌరజానపదైః స్సహ. 122

రాజ్ఞః సంగీతకం యత్ర వృత్తాఖ్యో రంగమంటపః
వారకన్యాఽమాత్య వణిక్సేనాపతి సుహృత్సుతైః. 123

యత్ర సంగీతకం రాజ్ఞాం చతురశ్రః స కథ్యతే
ఋత్విక్పురోహితాచార్యైః సహాంతఃపురికాజనైః. 124

మహిష్యా సహ యత్రస్యాత్ త్ర్యశ్రోఽసౌ రంగమంటపః
మార్గప్రక్రియయా కార్యం సంగీతం త్ర్యశ్రమంటపే. 125

చతురస్రే మార్గదేశమిశ్రం స గీతకం భవేత్
మిశ్రే తు చిత్రం సంయోజ్యం వృత్తాఖ్యే రంగమంటపే. 126

రంగమంటపము మూడు విధములు—చతురస్రము త్ర్యస్రము వృత్తము నని. ఇతరుల రంగమంటపమున ప్రయోగములను చర్చించిన సత్పురుషులు విచ్చేసి నప్పుడు వారలతో పౌరజనసమూహతో కూడుకొనిన రాజు సంగీతకము ప్రవర్తింప వలయు నేని వృత్తరూపమగు-వర్తులాకారముగ నున్న రంగమంటప ముచితము. వారకన్యలు -అమాత్యులు-వణిజులు - సేనాపతులు - సుహృదులు - కుమారులతో గూడిన రాజసంగీతము ప్రవృత్తము కావలయునేని చతురస్రమంటపము యుక్తము. ఋత్విక్కులు-పురోహితులు-ఆచార్యులు-అంతఃపురికాజనులు-రాజ మహిషీ—వీరలతో నుండు సంగీతకమునకు త్ర్యస్రరంగమంటప ముచితము. త్ర్యస్ర మంటమ నందు మార్గప్రక్రియానుసారమున నుండు సంగీతకమును ప్రవర్తింప జేయదగును చతురస్రమున మార్గదేశమిశ్రమగు సంగీతక ముండును. వృత్త రంగమంటపమునందు, మిశ్రమున చిత్రసంగీతమును కూర్పజనును. ఇంకను రంగమంటమునకు సంబంధించిన యష్టాదశభేదములను తద్విశేషములను తన్ని ర్మాణవిధానములను నా నాట్యవేదమున నృత్తరత్నావలీ గ్రంథమున జూడదగును.

యే నాట్యభేదాః కథితా స్తేషు సంగీతకక్రియాః
త్రిమార్గతాలనియమసిద్ధత్వాన్మార్గసంజ్ఞితాః. 127

నృత్తధర్మాః క్వచిన్మార్గాః క్వచిద్దేశ్యా భవంతి తే
మార్గప్రక్రియయా శుద్ధం సంగీతం యది కల్ప్యతే. 128

శుద్ధప్రయోక్తా భరతః సూత్రధృక్సకుశీలవః
దేశరీతివిమిశ్రం చేచ్ఛుద్ధం మిశ్రాఖ్యతామియాత్. 129

నటన ర్తకన ర్తక్యః చిత్రసూత్రభృతా సహ
నాట్యం శుద్ధమితిఖ్యాతం నృత్యం చిత్రమితి స్మృతమ్. 130

మార్గప్రక్రియ శుద్ధమిశ్రప్రయోగము లిందు నిర్దిష్టము లగును. నిరూ పితములయిన నాట్యభేదములలోని సంగీతక క్రియలు త్రిమార్గతాలనియమసిద్ధ ములు కాగా మార్గప్రక్రియ లన్న సంజ్ఞ కలవగును. నృత్తభేదము లొకచో మార్గరూపములు నొకచో దేశ్యరూపములు నగును. భరతుడు సూత్రధారుడు

కుశీలవుడుననువారు శుద్ధప్రయోక్తలు. శుద్ధమగు సంగీతప్రక్రియ దేశరీతి విమిశ్రమయినచో మిశ్రనామమును బొందును. నటనర్తకీనర్తకులు సూత్రధారుడు నొనరించు నాట్యము శుద్ధము. వారొనరించు నృత్యము చిత్రము నగును.

నాట్యస్య ప్రవిభాగస్తు యథాశాస్త్రం ప్రదర్శ్యతే
నాటకస్థితవాక్యార్థపదార్థాభినయాత్మకమ్. 131

నటకర్మైవ నాట్యం స్యాదితి నాట్యవిదాం మతం
పదార్థమాత్రాభినయరూపం నర్తకకర్మ యత్. 132

తన్నృత్తనృత్యభేదేన తద్ద్వయం ద్వివిధం భవేత్
తత్ర భావాశ్రయో మార్గో దేశీ తద్రహితా మతా. 133

త్రిమార్గతాలనియతః మార్గమిత్యభిధీయతే
దేశీభవేత్పునస్తాలలయైరాశ్రయమిష్యతే. 134

## నృత్త-నృత్య—నాట్యములు

ఇకనిచట నాట్యప్రవిభాగము యథాశాస్త్రముగా నిర్దిష్ట మగును. నటకర్మయే నాట్యము. అది నాటకము నందున్న పదార్థాత్మకము. వాక్యార్థాత్మకము. ఇట్టిది నటకర్మ. ఇది నాట్యము. ఇది నాట్యవిదుల మతము. పదార్థాభినయాత్మక మయిన నర్తకకర్మ నృత్య మని నృత్త మని రెండు విధములు. అందు భావాశ్రయ మగునది మార్గము. దేశి తద్రహితము. త్రిమార్గతాల నియత మగునది మార్గము. తాలలయాశ్రయ మగు నది దేశి యగును. చంచత్పుటాది తాలవిధానములకు, ద్రుతాదితాలవిధానములకు నాశ్రయముగా నుండునది దేశి యగును. “దేశీభవేత్పునస్తాలలయైరాశ్రయ మిష్యతే” అను శ్లోకమున కీ భావము నె చెప్పికొనవలయును. ధనిక ధనంజయ దశరూపకావలోకమున నీ విషయము స్పష్టముగా నున్నది.

1. నాట్యము. రసప్రధానము. వాక్యార్థాభినయాత్మకము. రసాశ్రయము. సాత్త్వికాభినయబహులము. నాట్యమొనరించు వారు నటులు.

2. నృత్యము. భావప్రధానము. పదార్థాభినయాత్మకము. భావాశ్రయము. ఆంగికాభినయబహులము. నృత్య మొనరించువారు నర్తకులు. అనకారాత్మకము. పదార్థాభినయరూప మగుటచే మార్గము నగును.

3. నృత్తము. తాలలయాశ్రయము. అభినయ శూన్యము. గాత్రవిక్షేప ముండును గాని యది తాలలయాపేక్షము. నృత్త మొనరించువారును నర్తకులే. నృత్తము దేశి యను వ్యవహారము పొందును.

ఈ దశరూపక భావానుసారమున నీ గ్రంథము నందలి యీ విషయ మును సంగతపఱచు కొనునది. నాట్య నృత్య నృత్త పదముల ప్రయోగ మచట నచట సంకీర్ణముగ కన్పించినను పై భావార్థానుసారమున సమన్వయించు కొనుట సముచితము.

పునరేతద్ద్వయం ద్వేధా మధురోద్ధతభేదతః
మధురం లాస్యమాఖ్యాతముద్ధతం తాండవం విదుః. 135

ఈ నృత్యనృత్తములు మరల రెండు విధములు—మధురము ఉద్ధతము నని. మధురము లాస్య మని యుద్ధతము తాండవ మని యందురు. మధురమును సుకుమారమనియు నందురు. కాగా వీని భేదము లిట్లు పరిగ్రాహ్యములు.

మధురనృత్యము లాస్యము—ఉద్ధతనృత్యము తాండవము
మధురనృత్తము లాస్యము—ఉద్ధతనృత్తము తాండవము

ఇవి నాటకాదుల కుపకారకములు. నృత్య మవాంతరపదార్థాభినయమున నుపక రించును. నృత్తము శోభాహేతువుగా నుపకరించును. ఇట్లు వీని యుప యోగము భావనీయము.

సర్వం త్రిధా భవేదేతద్గీతవాద్యోభయాన్వయాత్
రసప్రధానాభినయం మార్గం నృత్తం నటాశ్రయమ్. 136

భావాభినేయం మార్గం తన్నృత్యం యన్నర్తకాశ్రయం
రసభావసమాయుక్తమంగచాలన సంశ్రయమ్. 137

మార్గదేశీవిమిశ్రం తు నటనర్తకసంయుతం

ఈ సర్వము మూడు విధము లగును—గీతసంబంధమున, వాద్యసంబం ధమున, తదుభయసంబంధమున త్రివిధ మగును. రసప్రధానమగు నభినయము నటాశ్రయముగా నుండునది నాట్యపదమున వ్యవహరింపదగి యున్నది. 'నృత్తం' అని మూలమున నున్నది. "నాట్యం" అని యుండుట యుక్త మనిపించును. భావాభినేయ మగునది అనగా పదార్థాభినయాత్మకముగా నుండునది నర్తకా

శ్రయముగా నుండునది మార్గము నృత్తము అగును. రసభావసమాయుక్తము అంగచాలనసమాశ్రయము మార్గదేశిప్రకారానుసరణీయమగు నృత్యము పైవిధముగా సంగతపరచునని భావింపదగును.

లలితైరంగహారైశ్చ నిర్వర్త్యం లలితైర్లయైః. 138

వృత్తిః స్యాత్కైశికీ గీతిర్యత్ర లాస్యముచ్యతే
ఉద్ధతైః కరణైరంగహారైర్నిర్వర్తితం యదా. 139

వృత్తిరారభటీ గీతకాలే తత్తాండవం విదుః
ఉభయం పూర్వరంగస్య నాటకాదౌ భవిష్యతః. 140

నటకర్మాత్మకత్వాత్తద్ద్వయం నాట్యమితీరితం
తాలే గీతే చ వాద్యే చ నృత్తే చాభినయక్రమే. 141

సుకుమారప్రయోగో యో నియతో లాస్యముచ్యతే

లాస్యతాండవముల లోని కొన్ని విశేషములు ప్రతిపాదనీయములు కలవు. లలితము లగు నంగహారము లుండునప్పుడు, లలితములగు లయవిధానము లుండునపుడు, కైశికీవృత్తి యుండునప్పుడు గీతి ప్రవర్తించు నప్పుడు లాస్యము సంగతము కాదగును. లలితాంగహారములతో లలితలయరీతులతో లాస్యము నిర్వర్త్య మగును. అందు సాంగముగా కైశికీవృత్తి గీతి యుండదగునని భావము. లాస్య మిట్లుండగా తాండవ మీ విధముగా నుండును. ఉద్ధతములగు కరణములతో నంగహారములతో నిది నిర్వర్తిత మగును. నానాకరణసమూహాత్మకము లయిన యంగహారములు ముఖ్యముగా నుండును. అంగహారముల ప్రయోగములలో నంగహారమున కంగహారమునకు ననుసంధానరూపముగా నుద్ధతము లగు కొన్ని కరణముల ప్రయోగ మావశ్యకము. ఇట్టిట్టి కరణము లున్నందున నంగహారములందు ధారావాహిక ప్రయోగరమ్యత భాసించును. ఇట్టి కరణప్రయోగము ఛిద్రచ్ఛాదనమున కుపకరించును. ప్రయోగరమ్యత సంపాదించును. ఇట్లే లలితాంగప్రయోగమునను లలితకరణప్రయోగ మభ్యూహ్యము. ఈ తాండవమున గీతకాలము నం దారభటీవృత్తి యుండదగును. ఈ లాస్యము తాండవము అను నుభయము నాటకాదులలో పూర్వరంగమునకు సంబంధించి యుండును. ఈ ద్వయము నటకర్మాత్మక మయినందున నాట్య మనదగును. తాలమున గీతమున వాద్యమున నృత్తమున నభినయక్రమమున నియతమగు

సుకుమారప్రయోగము లాస్య మగును. ఇట్టి లాస్యమున గొన్ని విశేషములు గలవు.

తచ్ఛృంఖలా లతా పిండీ భేద్యకైః స్యాచ్చతుర్విధమ్. 142

లతా రాసకనామ స్యాత్తత్త్రిధా రాసకం భవేత్.
దండరాసకమేకం తు తథా మండలరాసకమ్. 143

ఏకం తు యోషిన్నియమాన్నాట్యరాసకమీరితం
శృంఖలా భేద్యకం చాపి దశధా భిద్యతే పునః. 144

తద్గేయపదమిత్యాది లాస్యాంగత్వేన కథ్యతే
పిండీబంధే తు బహుధా భేదస్తత్తాండవస్య తు. 145

పిండీబంధాత్మకం నృత్తం తద్దేవత్వప్రహర్షణం
భవేజ్జర్జరపూజాయాం తత్తద్గతిపరిక్రమే. 146

అట్లు సుకుమారప్రయోగ మయిన లాస్యము శృంఖల లత పిండి భేద్యక మని నాలుగు విధములు. శృంఖలాదుల స్వరూప మిదివరలో లక్షణ యుక్తముగా నిరూపిత మయినది. వీనిలో లత యనునది రాసకనామమున నున్నది. రాసకము మూడు విధములు — దండరాసకము మండలరాసకము నాట్యరాసకము నని. ఈ రాసకములలో నుండవలయు స్త్రీల సంఖ్యానియమము ననుసరించి యీ భేదనియమనము సంగత మగును. శృంఖల భేద్యక మనునవి దశవిధములుగా భిన్నము లగును. గేయపదము మొదలగు లాస్యాంగదశక మీ విధముగా పరిగణింపదగి యున్నది. పిండీబంధమున నందలి తాండవమునకు బహుధా భేదములు కలవు. నాట్యవేదము నందు గణేశపిండి కుమారపిండి మొదలగు పిండీబంధములు కొన్ని సూచితము లయినవి. జర్జరపూజ యొనరింపవలసి యున్నప్పుడు ఆ యా గతి పరిక్రమము సూచిత మగునప్పుడు పిండీబంధాత్మక మగు నృత్త మావశ్యకము. ఇట్లావశ్యకమగు నా యా పిండీబంధములు ఆ యా పిండీబంధాధిదేవుల తత్త్వారోపమున ప్రహర్షణాత్మకముగా నుండును. ఆ యా దేవులకును ప్రహర్షణ మాపాదించును.

జర్జరపూజాసంప్రదాయ మిచట నిట్లు పరిగ్రాహ్యము: భరతనిరూపిత మయిన నాట్యమును భరతపుత్రులు బ్రహ్మసన్నిధిలో ప్రదర్శించునప్పుడు ప్రేక్షకులుగా నున్న దానవులు తమపై దేవతలు సంపాదించిన విజయ మందున్నదని,

దేవచరిత మెయందు నిబద్ధ మగుచున్నదని, దానవుల కది యవమానజనకముగా నున్నదని, కుపితులై నాట్యవిఘ్న మాపాదింపగా ప్రయోక్త లప్రతిభు లయిరి. అప్పుడు దేవేంద్రుడు దానవదమనమునకై జర్జరము-దండము సృష్టించి దానవులను శీర్ణుల నొనర్చెను. బ్రహ్మ సాంత్వనవచనములతో తత్త్వము తెలియ జెప్పి యందరను ప్రశాంతుల జేసెను. అప్పటి నుండి రంగవిఘ్నోపశాంతికై జర్జరపూజ సేయుదురు. అట్టి జర్జరపూజాసమయమున నుద్ధతములగు గతుల పరిక్రమమున పిండీబంధాత్మక నృత్తప్రయోగమావశ్యక మని యిందు సూచిత మగుచున్నది.

భావభేదాల్లాస్యభేదో బహుధా కథ్యతే బుధైః
తదేవ నియమైర్హీనం దేశే రుచ్యా ప్రవర్తితమ్. 147

గుండలీనృత్తమిత్యుక్తం తత్స్యాద్దేశేష్వనేకధా
దేశీతాలైశ్చ వాద్యైశ్చ దేశీగీతైశ్చ కల్పితమ్. 148

చతుష్షష్ట్యంగసంయుక్తగతిశ్చాలీయరీతియత్
శుద్ధం చిత్రం చ మిశ్రం చ గుండలీనర్తనం త్రిధా. 149

కదాచిత్కందుకక్రీడా కదాచిద్వర్ణమానతః
తత్తద్దేశగుణోత్థాభిర్లీలాభిః పరికల్ప్యతే. 150

భావభేదమున లాస్యభేద మనేకవిధముల నుండునని బుధు లందురు. ఆ లాస్యమె నియమహీనమై దేశము నందలి రుచ్యనుసారమున ప్రవృత్త మగును. దేశదేశము లందుండు పామరజనులు శాస్త్రీయమగు మార్గరీతి నంతగా నవగతము చేసికొనలేరు. తాత్కాలిక మయిన చిత్తవినోదము మాత్ర మభిలషింతురు. రంజన ప్రాయము లయిన హాస్యశృంగారరీతులనే యభిలషింతురు. కొందరు సంఘర్షణాత్మకము లయిన వీరరౌద్రావేశప్రక్రియలనె యవలంబింతురు. ఇట్టి వారి యభిరుచివిశేషము లనేకవిధముల నుండును. తత్తదభిరుచ్యనుసారమున ప్రవర్తిత మగు లాస్యవిధాన మనేకవిధముల నుండును. అది యంతయు దేశీరీతి యగును. ఇట్టి రీతులలో గుండలీనృత్త మొకటి యున్నది. అదియు దేశమున ననేకవిధముల నున్నది. దేశీతాలములతో దేశీవాద్యములతో దేశీగీతములతో నిది కల్పిత మగును. "చతుష్షష్ట్యంగసంయుక్తగతిశ్చాలీయరీతిమత్" అను పద్య పాదార్థము స్పష్టార్థముగ లేదు. చతుష్షష్ట్యంగములతో నున్న దేశీలాస్యాంగములు గతివిధానములు చాలీరీతులు నిందుండును. నా రచితనృత్తరత్నావళిలో నలుబదియారు

దేశీలాస్యాంగములు సంకేతితము లయినవి. ఇంకను గొందరు కొన్ని యంగముల సంకేతించి యుందురు. ఇట్టి గుండలీనర్తనము శుద్ధము చిత్రము మిశ్రము నని త్రివిధ మగును. ఒకప్పు డిందు కందుకక్రీడ యుండును. ఒకప్పుడు వర్ణమానాను సారమున నియతి యుండును. ఒకప్పుడు తత్తద్దేశగుణ సముత్పన్నము లయిన లీలావిశేషము లుండును. ఇట్టిది పరికల్పిత మగును. ఇంక నిందు పఠిగ్రాహ్యా విశేషములను నృత్తరత్నావలి నుండి గ్రహించునది. ఈ గుండలీనృత్తము గొండలీనృత్తమని కుండలీనృత్త మనియు వ్యవహృతమగును.

ఇటుపై నాట్యాదుల బృందావశ్యకత నిరూపిత మగును. బృంద మనేకవిధముల నున్నది. బృందమున నుండవలయు వారిసంఖ్యయు నిరూప ణీయము. బృందము మార్గమున నావశ్యకము; దేశి యందు నావశ్యకము. ఇట్టి యంశవిశేషము లిచట ప్రస్తుతము లగును.

## బృందరీతి

నాట్యం నృత్యంచ నృత్తం చ బృందహీనం న శోభతే
అతో బృందం ప్రకల్ప్యం స్యాదిత్యాహుర్భరతాదయః. 151

నటాశ్చ నర్తకాశ్చైవ గాయకా వాదకాదయః
యస్మిన్ప్రయోగే మిలితాః తత్ర తద్బృందముచ్యతే. 152

నాట్యము కాని, నృత్యము కాని, నృత్తము కాని బృందహీన మగుచో శోభింపదు. కావున బృందమును నిర్మింపవలెనని భరతాదు లందురు. నటులు నర్తకులు గాయకులు వాదకులు మొదలగు వారు ఏ ప్రయోగమున మిలితులై యుందురో యచట నది బృందమను వ్యవహారము కలదగును.

తదేవాభ్యంతరం బాహ్యమితి ద్వేధా విభిద్యతే
అభ్యంతరే స్యాత్ స్త్రీబృందం బాహ్యే స్త్రీమర్త్యమిశ్రితమ్. 153

జ్యేష్ఠ మధ్య కనిష్ఠాది భేదాద్బృందం త్రిధా భవేత్
అంగైరుపాంగైః ప్రత్యంగైః గీతమాత్రానుగామిభిః. 154

పదార్థాభినయో నృత్యం డోంబీ శ్రీగదితాదిషు
అంగవిక్షేపమాత్రం యల్లయతాల సమన్వితమ్. 155

తన్నృత్తం నాటకాద్యేషు రూపకేషు ప్రయుజ్యతే
అంగప్రత్యంగవిక్షేపకూన్యో యోఽభినయేన చ. 156

తన్నృత్తం తత్ర నృత్యం తు యథోక్తాభినయాత్మకం

బృందాంశములె యిందున్నవి. బృందము రెండు విధములు — అభ్యంతరము బాహ్యము నని. అభ్యంతరము నందు స్త్రీబృందమును, బాహ్యమున స్త్రీపురుషమిశ్రిత మయిన బృందము నుండవలెను ఇందు మరల మూడు భేదము లున్నవి—జ్యేష్ఠబృందము మధ్యబృందము కనిష్ఠబృందము నని. ఇంకనిట్టి భేదము లుండును. గీతమాత్రము ననుసరించినట్టి యంగోపాంగప్రత్యంగములతో పదార్థాభినయమున నుండు నృత్యము డోంబీశ్రీగదితాదులలో నుండును. నాటకాది రూపములలో లయ తాల సమన్విత మంగవిక్షేపము మాత్ర ముండుట యను నృత్త ముండుట యుచితము. అంగప్రత్యంగశూన్య మభినయశూన్యము నగు నృత్తమున్న నచట యథోక్తాభినయాత్మక మయిన నృత్య ముండుటయు యుక్తము.

తాండవం తత్త్రిధా చండప్రచండోచ్చండభేదతః. 157

తత్ర హ్యారభటీవృత్తి స్తథైవ పరికల్ప్యతే
విలంబితో లయో యత్ర గ్రహశ్చాతీతకల్పితః. 158

తద్వదారభటీ యత్ర తత్ ఖ్యాతం చండతాండవం
సమ గ్రహో మధ్యలయ స్తథై వారభటీ యుతః. 159

ప్రచండతాండవం తత్స్యాదితి తత్ర ప్రయోజితం
అనాగతో గ్రహో యత్ర లయో యత్ర ద్రుతో భవేత్. 160

తాదృశ్యారభటీ యత్ర తత్స్యాదుచ్చండతాండవం
ఏతత్త్రియం భవేత్త్రేధా గీతావాద్యోభయాన్వయాత్. 161

తాండవము మూడు విధములు—చండతాండవము ప్రచండతాండవము ఉచ్చండతాండవము నని. అందు చండతాండవ మీవిధముగా నుండును. ఇం దారభటీవృత్తి పరికల్పిత మగును. లయరీతి విలంబితముగ నుండును. గ్రహ మతీత కల్పిత మగును. గ్రహమనునది తాలప్రాణము. తాలము నందలి గ్రహము మూడు విధములు—సమగ్రహము అతీతగ్రహము అనాగతగ్రహము నని. గీత నృత్తవాద్యములతో నాదిమధ్యావసానము లందు న్యూనాధిక్యవర్జితముగా తాల మాయోజిత మయినచో సమగ్రహ మని, తాలానంతరము గీతాదు లాయోజితము లయినచో నతీతగ్రహమని, గీతాదుల ప్రయోగప్రవర్తన సమయ మధ్య

మున తాలసంయోజన మున్నచో ననాగతగ్రహ మని నిశ్చయింప వలెను. ప్రకృత తాండవమున నతీతగ్రహాల్పనము వివక్షితము. ఇచట నారభటీవృత్తియు నతీత గ్రహాసంబంధమైననె యుండును ఇట్లున్న నిది చండతాండవ మగును. ప్రచండ తాండవ మీ విధముగ నుండును. ఇందు సమగ్రహ ముండును. మధ్యలయ ముండును. అట్లే యారభటీయుత మగును. ఇట్టిగి ప్రచండతాండవమగును. ఉచ్చండతాండవమున ననాగతగ్రహ ముండును. ద్రుతలయ ముండును. ఆరభటీ వృత్తియు నట్టిదె యగును. ఇట్టిది యుచ్చండతాండవము. ఈ మూడు విధము లగు తాండవమును గీతవాద్యోభయాన్వయమున త్రివిధ మగును.

> కరణాద్యంగహారాశ్చ గీతవాద్యోభయాన్వితాః
> యత్రోద్ధతం ప్రయుజ్యంతే క్రమాత్తత్తాండవత్రయమ్. 162
>
> చండాఖ్యం తాండవం వీరరౌద్రమిశ్రరసే భవేత్
> ప్రచండతాండవం ఖ్యాతం రౌద్రబీభత్సమిశ్రణే. 163
>
> ఉచ్చండం రౌద్రబీభత్సభయానకసముచ్చయే
> కరణై రంగహారైశ్చ ద్రుతం త్రిగుణవేగతః. 164
>
> ఆకాశచారీ భ్రమరీ యుతముచ్చండతాండవం
> ప్లుతలంఘితభూయిష్ఠకరణం భ్రమరీయుతమ్. 165
>
> ప్రచండతాండవం భౌమచారీయుగ్ద్విగుణమానతః
> నృత్తాంగైః కరణై రంగహారై స్త్ర్యకచ్చండతాండవమ్. 166

తాండవము నందలి రసవినియోగపటము లయిన విశేషము లిట్లు భావ నీయములు తాండవత్రయమునందు కరణము లంగహారములు గీతవాద్యోభ యాన్వితములై క్రమముగా నుద్ధతముగా ప్రయుక్తము లగునేని యీ తాండవ త్రయము రూపవైభవము కలదగును. చండతాండవము వీరరౌద్రమిశ్రరసమున ప్రయుక్తము కాదగును ప్రచండతాండవము రౌద్రబీభత్సమిశ్రణమున ప్రఖ్యాత మయినది. ఉచ్చండతాండవము రౌద్రబీభత్సభయానకసముచ్చయమున విని యుక్తము కావలెను. ఈ యుచ్చండ తాండవములో కరణము లంగహారములు ద్రుతలయానుసారమున త్రిగుణవేగమున నుండదగును. ప్రయుక్తము లయిన కరణము లంగహారములు త్రిరావృత్తములుగా ప్రయుక్తము లగుట సముచితము. ఎప్పటి కరణ మప్పుడే యావృత్త మగుటయు నంగహారప్రయోగానంతర మా

వృత్త మగుటయు ఒకక్రమమున కరణాంగహారములు ప్రయుక్తము లయిన పిమ్మట కరణములు పునః ప్రయుక్తము లగుటయు నౌచిత్యానుసారమున సభ్యమోదానుసారమున నిశ్చయించి ప్రయోగించునది. ఇట్లు చెప్పుట యనుచితమయినను సాంకర్యము నిషేధించుట కగును. ఇంక నీ యుచ్చండతాండవమున ప్లుతములు లంఘితములు బహుళముగా నున్న కరణముల ప్రయోగ మావశ్యకము. ఎగురుటలు దూకుటలు కొన్ని కరణములలో నధికముగా నుండును. అట్టి కరణము లిం దావశ్యకములు. ప్రచండతాండవము నందు ద్రుతలయ ప్రమాణానుసారమున భౌమచారీగతు లుండవలయుటను గ్రహించునది. చండతాండవమున నిట్టి వావశ్యకములు కావు. అందు నృత్తాంగము లయిన కరణము లంగహారములు కూడి యుండుట గ్రాహ్యము.

హాస్యశృంగారసంసర్గే లాస్యనృత్తం ప్రశస్యతే
శృంగారే చాద్భుతే చాపి తద్భిదా వినియుజ్యతే 167

ఉద్ధతప్రాయకరణం రుచ్యా యద్దేశ్యకల్పితం
కరణం వక్త్రగం చేతి తద్దేశీతాండవం విదుః. 168

దేశీతాలలయోపేతం దేశభాషావిమిశ్రితం
తద్వీరాద్భుతశృంగారహాస్యేషు వినియుజ్యతే. 169

నృత్యభేదే క్వచిత్తైః కైశ్చిత్ప్రయోగో దేశ్యుపయుజ్యతే
న కదాచన సర్వత్ర రూపకేషూపయుజ్యతే. 170

హాస్యశృంగార సంసర్గ మున్నపుడు లాస్యనృత్తము ప్రశస్త మగును. శృంగారమునందు నద్భుతము నందును లాస్యనృత్తభేదముల వినియోగము సముచితము. దేశీతాండవము నొకటి కలదు. ఆ యా దేశవాసుల యభిరుచ్యనుసారమున నుద్ధతము లగు కరణము లధికముగా నుండదగును. ఇది యా యా దేశీవిధానమున కల్పిత మగును. ఇట్లు దేశ్యప్రకల్పిత మగు నిది "కరణం వక్త్రగం" కరణాత్మకము లయిన కరణములతో నుండుటయు వక్త్రగతము లయిన శబ్దవిన్యాసములతో నుండుటయు గ్రాహ్యము. ఇట్లుండగా నిది దేశీ తాండవ మగును. ఈ దేశీతాండవము దేశీతాలలయవిధానములతో నుండును. దేశభాషావిమిశ్రితము నగును. ఇట్టిదిది వీరమున నద్భుతమున శృంగారమున హాస్యమున వినియుక్త మగును. కొంద రొకొక్కచో నృత్యభేదము నందు

సామాన్యముగా దేశీరీతి నుపయోగింతురు. ఇట్టి విధానమును రూపకములలో నంతట నెప్పుడు ప్రయోగింపరాదు.

## బృందభేదములు

ఈ దృక్తాండవ లాస్యాదిభేదాంగేషూపయోగినాం
సమాజం బృందమిత్యాహుః తత్త్రిధా పంచధాఽపి వా. 171

ఉత్తమోత్తమమాద్యం స్యాదుత్తమాఖ్యమతః పరం
మధ్యమోత్తమమధ్యం చ కనిష్ఠం చేతి పంచధా. 172

బృందమేతత్సముద్దిష్టం కోలాహలమతః పరం

ఇంతవరకు నిరూపించిన తాండవభేదములలో లాస్యాంగములలో నుపయోగించువారల సమాజమును బృంద మందురు. ఈ బృందము మూడు విధములు. అయిదు విధములు నేని యుండును. ఉత్తమోత్తమము మొదటిది, ఉత్తమము రెండవది, మధ్యమోత్తమము మూడవది, మధ్యమము నాల్గవది, కనిష్ఠ మయిదవది. ఇట్లు బృందము పంచవిధముగా నుండుట యుక్తము. సముద్దిష్టమును. ఇంత కధికముగా నుండునది కోలాహల మగును. ఇక నుత్తమోత్తమాదిబృందములలో నుండదగు వారి సంఖ్యానియమము సంకేతితముకావలయును.

ముఖ్యా ద్వాదశ గాతారో ద్వాదశైవ తు గాయికాః. 173

అష్టౌవిహోలకాశ్చాపి తతః షడ్వాంశికా అపి
ఓతాకారాశ్చ పంచ స్యుః తతః పాటహికాస్త్రయః. 174

యత్ర మార్దంగికాః షట్స్యుః బృందం స్యాదుత్తమోత్తమం

ఉత్తమోత్తమబృందము నందుండదగిన పాత్రల సంఖ్య యిందున్నది. ముఖ్యగాయకులు—12. గాయికలు— 12. విహోలకులు—8. వాంశికులు—6. ఓతాకారులు — 5. పాటహికులు — 3. మార్దంగికులు—6. మొత్తము వీరు 52. ఇట్లున్నచో బృంద ముత్తమోత్తమము. ఇందలి వారి స్వరూపపరిచయము నిరూపితము కాగలదు. ఇటుపై నుత్తమబృందము.

షడ్గాతారోఽష్ట గాయిన్యః పంచ షడ్వా విహోలకాః. 175

చత్వారో వాంశికాశ్చాపి చోతాకార చతుష్టయం
మార్దంగికాశ్చ చత్వారః తతః పాటహిక ద్వయమ్. 176

ఇదముత్తమమాఖ్యాతం బృందం బృందవిశారదైః

ఉత్తమబృందమీ విధముగ నుండునని బృందవిశారదు లనిరి. గాయకులు 6. గాయికలు 8. విహోలికులు 5 కాని 6 కాని. వాంశికులు 4. ఓతాకారులు 4. మార్దంగికులు 4. పాటహికులు 2. మొత్తము వీరందరు 34. ఇది యుత్తమబృందము.

పంచ ముఖ్యగాతారః పంచాపి సమగాయనః. 177

గాయికా వాంశికీనాం చ యత్ర స్యుః షట్ పంచకం
ఓతాకారత్రయం చాపి తథా పాటహిత్రయమ్. 178

మార్దంగికత్రయం యత్ర బృందం స్యాన్మధ్యమోత్తమం

మధ్యమోత్తమ బృందము మూడవది. ఇందు ముఖ్యగాయకులు 5. సమగాయకులు 5. గాయికలు 6. వాంశికులు 5. ఓతాకారులు 3. పాటహికులు 3. మార్దంగికులు 3. మొత్తము వీరందరు ముప్పదిమంది. ఇది మధ్యమోత్తమ బృందము.

ద్వౌ గాయకౌ చ గాయిన్యౌ తిస్రః స్యుః సమగాయికాః. 179

త్రయో విహోలకా వంశ్యాః తిస్రశ్చాపి విహోలికాః
ఓతాకారత్రయం యత్ర మార్దంగికచతుష్టయమ్. 180

యత్ర పాటహికద్వంద్వం బృందమేతత్తు మధ్యమం

మధ్యమబృందములో పాత్రధారు లిట్లుందురు. గాయకులు 2. గాయికలు 2. సమగాయికలు 3. విహోలకులు 3. వాంశికులు 3. విహోలికలు 3. ఓతాకారులు 3. మార్దంగికులు 4. పాటహికులు 2. మొత్తము వీరందరు 25. తరువాతి పరిగణనములో 26 అని యున్నది గాయికలు 3 అయినచో 6 సంఖ్య యుపపన్నమగును.

ఏకో ముఖ్యో భవేద్గాతా ద్వౌ స్యాతాం సమగాయకౌ. 181

గాయకౌ వాంశికౌ ద్వౌ ద్వౌ వోతాకారత్రయం తథా
ఏకః పాటహికో యత్ర మార్దంగికయుగం తథా. 182

ఏకో విహోలకో యత్ర కనిష్ఠం బృందముచ్యతే

కనిష్ఠబృంద మను దవది. ఇందు ముఖ్యగాయకుడు 1. సమగాయకులు 2. అనుగాయకులు 2. వాంశికులు 2 ఓతాకారులు 3. పాటహికుడు 1. మార్దంగికులు 2. విహోలకుడు 1. మొత్తము వీరందరు 14. ఈ కనిష్ఠబృందమున 18 పాత్ర లుండుటయు సూచిత మగును. అందు హుడుక్కికాదులు నుందురు.

ద్విపంచాశత్-చతుస్త్రింశత్-త్రింశత్-షడ్వింశతి స్తథా. 183
చతుర్దశ- అష్టాదశ వా సంఖ్యా బృందేషు పంచసు.

బృందపంచకమునందు పాత్రసంఖ్య యీ విధముగా నుండును. ద్విపంచాశత్ 54 ఉత్తమోత్తమ బృందము. చతుస్త్రింశత్ 34 ఉత్తమబృందము. త్రింశత్ 30 మధ్యమోత్తమబృందము. షడ్వింశతి 26 మధ్యమ బృందము. చతుర్దశ 14 లేదా అష్టాదశ 18 కనిష్ఠబృందము. బృందపంచకమున నుండువారి యందరి సంఖ్య 156 లేదా 160. ఇట్లు నియతసంఖ్యగా నున్న నే యా యా బృందములు రమ్యము లగును. ఇంత కధిక మయిన కోలాహలమె.

ముఖ్యగాతా సమం గాతా గాయినీ వాంశిక స్తథా. 184

ఓతాకారాః పాటహికో యత్ర మార్దంగికద్వయం
హుడుక్కికా కోహలికా యత్ర జర్ఘరికాద్వయమ్. 185

వైణికా యత్ర సుసమౌ బృందం తత్స్యాత్కనిష్ఠకం

కనిష్ఠబృందము నం దష్టాదశపాత్రలుండుట సూచిత మయినది. వాని సంఖ్య యిట్లున్నది. 1 ముఖ్యగాయకుడు. 1 సమగాయకుడు. 1 గాయిని. 1 వాంశికుడు. 1 ఓతాకారుడు. 1 పాటహికుడు. 2 మార్దంగికులు. 1 హుడుక్కిక. 1 కోహలికుడు. 2 జర్ఘరికులు. 2 వైణికులు. 2 సుసము లన దగిన వారు. మొత్తము వీరందరు 16 అయినారు. 18 సంఖ్యాసంగతికై యిద్దరిని కలుపుకొన వలసియున్నది. ఇచటి విషయవివేకమునకు నృత్తరత్నావళిలోని బృందసంఖ్యా వివేక మావశ్యకము.

ముఖ్యానువృత్తిచాతుర్యం తత్ర్ప్రయోగ ప్రగల్భతా. 186

తాలానువర్తన న్యూనపదపూరణ నైపుణం
లయతాలావధానం చ సాదృశ్యైక్యవిభావనా. 187

భిన్నరాగజ్ఞతా స్థానత్రితయప్రాప్తి శక్తతా
ఏతే బృందగుణాః ప్రోక్తా బృందకోలాహలం వినా. 188

ఇందు బృందగుణకీర్తనము కలదు. ముఖ్యార్థము ననువర్తించి యుండుటలో చాతుర్యము ముఖ్యార్థము నందుండవలయు ప్రయోగమున ప్రగల్భత, తాలానువర్తనము నందలి నైపుణ్యము, న్యూనములుగా నున్న పదములను పూరించుటలో నైపుణ్యము, లయవిధానము లందవధానము, తాలప్రక్రియ లందవధానము, సాదృశ్య మైక్యము విభావనము చేయుట, భిన్నరాగములను గుర్తించుట, స్థాన త్రయ ప్రాప్తిలో శక్తి కలిగి యుండుట యనునవి బృంద గుణములు. బృందకోలాహలము నివి పరిహరింపగలవు. బృందమున నుండు వారందరు బృందగుణములు కలవారై ప్రయోగాసక్తు లయినచో ప్రయోగము రమ్యముగ నుండును.

ఏతన్మార్గస్య దేశ్యాశ్చ సామాన్యమభిధీయతే
నాట్యాభిధాననిష్పత్తే రేతద్ద్వితయమీరితమ్. 189

నృత్తనృత్యవిభాగేన ద్విధా మార్గ ఉదాహృతః
నృత్తం తు తాండవం నృత్యం లాస్యమిత్యభిధీయతే. 190

అంగవిక్షేపమాత్రం యత్తాలమానలయైర్యుతం
నృత్తం తదుద్ధతై రంగహారాద్యైస్తాండవం భవేత్. 191

ప్రేరణం ప్రాపణం దేశీతాండవం స్యాదనుద్ధతైః
లాస్యం లతాభేద్యకాది లాస్యాంగసహితం విదుః. 192

తదేవ భూమిచారీభిః మృద్వీభిర్లలితాలయైః
దేశీలాస్యాంగసంయుక్తం దేశీలాస్యమితీరితమ్. 193

ప్రాయేణ తత్కుండలీతి దేశరీత్యైవ కల్ప్యతే
భాణాదినృత్యభేదేషు ప్రాయో లాస్యం ప్రయుజ్యతే. 194

తాండవం పూర్వరంగే స్యాద్రూపకేషు రసానుగం
యత్ర ధ్రువాః ప్రయుజ్యంతే చతస్రో గీతయోఽపి చ. 195

తాలామార్గాశ్చ సలయాః సమార్గ ఇతి కథ్యతే
ధ్రువాః పంచ ప్రయోక్తవ్యా రసాభినయసిద్ధయే. 196

బృందమనునది మార్గమార్గముననే కాదు, దేశిమార్గమునను గలదు. ఈ నిరూపిత మయిన బృందము మార్గమునకు దేశీరీతికిని సామాన్యరూపము.

అందు నిందు బృంద మేకరూపమె. నాట్యోత్పత్తికై యీ ద్వితీయము నిరూపిత మయినది. మార్గము దేశి యనువాని విశేషము లింకను ప్రతిపాదనీయము లగునవి కలవు. నృత్తనృత్యభాగమున మార్గము రెండు విధములు. నృత్తము తాండవ మని, నృత్యము లాస్యమని వ్యవహృత మగుచున్నది. తాలమాన సంయుత మయిన యంగవిక్షేపమాత్రము నృత్తమగును. అదియే యుద్ధతము లయిన కరణములతో నంగహారములతో గూడుకొనగా తాండవ మయినది. అనుద్ధతము లయిన కరణాంగహారములతో నుండగా దేశీతాండవ మగును. అది ప్రేరణము ప్రాపణ మన దగి యున్నది. లాస్యాంగసహిత మయిన లాస్యము లతాభేద్యకాదుల గూడినది లాస్య మయినది. ఇట్టి లాస్యమె భూచారీవిశేషములతో నుండగా దేశీలాస్యాంగములతో గూడుకొనినది కాగా దేశీలాస్యమను వ్యవహారము కలదగును. ఇందలి చారీవిశేషములు మృదువులుగా నుండుటయు లలితాలయము లగుటయు-లాలిత్యాశ్రయము లగుటయు వివక్షితము. సామాన్యముగా నిట్టి దేశీలాస్యమును దేశీరీతి ననుసరించి "కుండలి" యని యందురు. సామాన్యముగా భాణాదినృత్యభేదములలో లాస్యము ప్రయుక్త మగును. రూపకములలో పూర్వరంగమునందు తాండవము రసానుగత మగునట్లుగా ప్రయోగింపవలెను. పూర్వరంగము నందే పంచవిధము లయిన ధ్రువారీతులు ప్రయుక్తము లగును. ఇందే గీతివిశేషములు నాలుగు ప్రయుక్తము లగును. కావున నిచటనే యీ పూర్వరంగమునందే రసానుగతముగా తాండవము ప్రయోగింప వలెనని భావము. లయసహితము లయిన తాలమార్గము లుండగా మార్గమని వ్యపదేశింపదగును. రసాభినయసిద్ధికై యయిదు ధ్రువావిశేషములను ప్రయోగించుట యుక్తము. ధ్రువాప్రసక్తి వలన ధ్రువారీతులను నిర్దేశించుట యావశ్యకము.

## ధ్రువారీతి

ప్రావేశికీ తు ప్రథమా ద్వితీయాఽఽక్షేపికీ స్మృతా
ప్రాసాదికీ తృతీయా తు చతుర్థీ చాంతరా ధ్రువా. 197

నైష్క్రామికీ పంచమీతి జ్ఞేయాః క్వాపి క్వచిద్ధ్రువాః

ఇచట ధ్రువాపంచకము పేరులు కలవు. ప్రావేశికి ప్రథమధ్రువ. ఆక్షేపికి ద్వితీయధ్రువ. ప్రాసాదికి తృతీయధ్రువ. అంతర చతుర్థధ్రువ. నైష్క్రామికి పంచమధ్రువ. ఈ ధ్రువావిశేషముల నా యా యౌచిత్యానుసారమున గూర్పవలెను. వీని లక్షణవివేక మీ విధమున నుండును.

నానార్థరససంయుక్తా పాత్రాణాం నాట్యకర్మణి, 198

ప్రవేశసూచనీ గాథా యా సా ప్రావేశికీ స్మృతా
ఉల్లంఘితక్రమో యస్యామన్య ఆక్షిప్యతే లయః. 199

ధ్రువా సాఽఽక్షేపికీ నామ విజ్ఞేయా నృత్తవేదిభిః
ఆక్షేపవశతో యాసామంతరం సముపాగతా. 200

రంగం ప్రసాదయతి యా సైవ ప్రాసాదికా ధ్రువా
సర్వాసామంతరా వస్తురసాదివశకల్పితా. 201

అంతరా సా ధ్రువా జ్ఞేయా నాట్యాభినయరంజనీ
ప్రస్తుతార్థస్య నిర్యోగే సర్వస్యాంకాంతనిష్క్రమే. 202

యా నిష్క్రామగుణోపేతా సైవ నైష్క్రామికీ ధ్రువా

1. ప్రావేశికి. ఆ యా పాత్రల నాట్యకర్మలో నానార్థరససంయుక్తమయిన వారి ప్రవేశ సూచక మయిన గాథ ప్రావేశికీ ధ్రువ యగును. 2. ఆక్షేపికి క్రమ ముల్లంఘించి వేరొక లయ యాక్షిప్త మగునేని యట్టి యాక్షేపాంశమును సూచించు గాథ ఆక్షేపికి ధ్రువ యగును. 3. ప్రాసాదికి. ఆక్షేపవశాన మధ్యలో జేరినదై రంగమున ప్రసాదన మొనరించు గాథ ప్రాసాదికీ ధ్రువ యగును. 4. అంతర. అన్నిటి యంతరమున వస్తురసాదివశమున కల్పితమైనదై నాట్యాభినయరంజనిగా నుండు గీతి యాంతరధ్రువ యగును. 5. నైష్క్రామికి. ప్రస్తుతార్థ సంబంధము లేకపోగా నంకాంతమున సర్వులు నిష్క్రమింపగా నిష్క్రామగుణోపేత మయిన గాథ నైష్క్రామికీ ధ్రువ యగును.

అలంకారా లయా వర్ణా గీతయో యతిపాణయః. 203

అపరస్పరసంబంధా యస్మాత్తస్మాద్ధ్రువా స్మృతా
జాతిః స్థానం ప్రమాణం చ ప్రకారో నామకల్పనా. 204

జ్ఞేయా ధ్రువాణాం నాట్యజ్ఞైః వికల్పాః పంచ హేతుకాః
వృత్తాక్షరప్రమాణం యత్సా జాతిరితి సంజ్ఞితా. 205

ప్రవేశాక్షేప నిష్క్రామ ప్రాసాదికమథాంతరం
ఇతి పంచవిధం స్థానం కేచిదాహుర్మనీషిణః. 206

షట్కలాఽష్టకలా చేతి ప్రమాణమితి కథ్యతే
ప్రకారశ్చప్రయోగో యః సమార్ధవిషమాదికః. 207

ధ్రువావిధానే కథితం నామ జ్ఞేయం ధ్రువాగతం
స్వేచ్ఛానామాని కతిచిద్విద్యాద్వృత్తవిశేషతః. 208

గీత రోదన సంభ్రాంతి ప్రేషణోత్పాత విస్మయాః
యత్ర యత్ర ధ్రువాస్తత్ర న యోజ్యా నాట్యయోక్తృభిః 209

ఇచట ధ్రువాస్వరూపము ధ్రువావికల్ప హేతువులు ధ్రువానామ కల్పనము ధ్రువారీతిలో వర్జ్యములు నిరూపితము లగును. అలంకారములు లయ రీతులు వర్ణములు గీతివిశేషములు మొదలగు ప్రాణములు పరస్పరసంబంధరహితములై ప్రయుక్తము లగుచు గానమున "ధ్రువ" యను వ్యవహారము కలిగినది. ఇవి ధ్రువా హేతువులు. ధ్రువా నామ కల్పనమున నీ విశేషము లున్నవి. జాతి-స్థానము-ప్రమాణము-ప్రకారము-నామకల్పన యనునవి ధ్రువావికల్పములు ఇట్లివి పంచ హేతుకములుగా నున్నవని నాట్యవిదులు గ్రహింప వలెను. వీని స్వరూపము లిట్లుండును. వృత్తానుసారప్రమాణమును జాతి యని పేరు. స్థాన మనునది ప్రవేశము క్షేపము నిష్క్రామము ప్రాసాదికము అంతరము నని పంచవిధము. ఈ విధముగా కొందరు మనిషు లందురు. ప్రమాణము షట్కలాప్రమాణ మని యష్టకలా ప్రమాణ మని రెండు విధములై యున్నది. సమార్ధవిషమాదిక మయిన ప్రయోగమును ప్రకార మని యందురు. నామకల్పన యనునది ధ్రువావిధానమున నిరూపింపబడు ధ్రువాగత మయిన నామము. కొన్ని స్థలము లందు స్వేచ్ఛాకృతము లయిన నామము లుండును. అవి విద్యా వృత్త విశేషానుసారముగా కల్పితము లగును. ధ్రువావర్జ్యస్థలము లు కొన్ని కలవు. గీతము రోదనము సంభ్రాంతి ప్రేషణము ఉత్పాతము విస్మయము నిరూపితములు కావలసియున్నప్పుడు ధ్రువా ప్రయోగ మనుచితము కాదని నాట్యప్రయోక్తలు గుర్తింప వలెను.

యాని గీతకలాంగాని నానాతోద్యాని తాన్యథ
విజ్ఞేయాని ధ్రువాస్వస్తుప్రవృత్తైశ్ఛందోగతై రిహ. 210

నాస్తి కించిదవృత్తం యద్వాద్యమానకృతాశ్రయం
గానం యద్వృత్తతో వాద్యం తద్వృత్తేన ప్రయోజయేత్. 211

ఛందోవృత్తాని సర్వాణి విజ్ఞేయాని ధ్రువాస్విహ
యద్వృత్తప్రభవం వాద్యమంగం వాద్యసమం తథా. 212

పూర్వమంగం తతో వాద్యం తతో నృత్తం ప్రయోజయేత్
గీతవాద్యాంగసంయోగః ప్రయోగ ఇతి కథ్యతే. 213

ధ్రువాంగములు కొన్ని కలవు. అవి యిందు గలవు. గీతకలాంగములు నానాతోద్యములును ధ్రువానుగతములుగా నుండు సౌష్ఠవోపేతము లయిన ఛందోగీతము లగు వృత్తములతో గూడి యుండదగును. అన్నియు ఛందోను వర్తనమున నుండుట శోభావహమని గుర్తింపవలెను. వాద్యమానకృతాశ్రయ మగు గాన మేది యయినను వృత్తరహితముగా నుండదు. ఛందోవిహీనముగ నుండదు. వృత్తము ననుసరించి వాద్య ముండుటయు, నృత్తవిధానమునవె వాద్యముండుటయు గుర్తించి ప్రయోగింప వలెను. సర్వవిధము లయిన ఛందో వృత్తముల నీ ధ్రువారీతులలో ననుగతము లగుటను గుర్తించునది. వాద్యము వృత్తప్రభవము. అంగవిన్యాసము వాద్యసమముగా నుండుట యుక్తము. అంగము వాద్యము నృత్తము అను వానిని యథోచిత క్రమమున గూర్చుట యుక్తము. గీతవాద్యాంగసంయోగము ప్రయోగ మగుననీ యభిజ్ఞు లనిరి.

భాషా చ శౌరసేనీతి ధ్రువాణామభిధీయతే
దివ్యానాం సప్రమాణం చ జ్ఞేయం సంస్కృతభాషయా. 214

గానం మర్త్యస్య కథితమర్ధసంస్కృతభాషయా
ఛందః ప్రమాణసంయుక్తం స్తుత్యాశీర్వాదసంయుతమ్. 215

దేవద్విజమహీపానాం సంస్కృతం గానమిష్యతే
వైశ్యానాం తు భవేద్గానమర్ధప్రాకృతసంస్కృతైః 216

పైశాచ్యా భాషయా గానం శూద్రాణాం మాగధీ తు వా
ఇతరేషామపభ్రంశ భాషయాగానమిష్యతే, 217

అపభ్రష్టా విభాషా వా శకారాదేరుదీర్యతే.

ధ్రువాపదములలో నుపయోగింపదగిన భాషానియమ మిచట నిర్దిష్ట మగును. శౌరసేనీభాష ధ్రువాగీతములకు తగియుండునని యనిరి. దివ్యవ్యక్తు లకు ప్రమాణోపేతముగా సంస్కృతభాషతో వ్యవహారముండుటను గుర్తించునది. మానవవ్యక్తుల కర్ధసంస్కృతభాషతో గాన ముండుట గ్రాహ్యము. దేవద్విజ మహీపాలకులకు సంబంధించిన గానము ఛందఃప్రమాణసంయుక్తము స్తుత్యా శీర్వాదసంయుతము నగుట సమ్మతము. వైశ్యులకు సంబంధించిన గాన మర్ధ

ప్రాకృతసంస్కృతములతో నుండదగును. శూద్రులకు సంబంధించియుండు ధ్రువా గానము పైశాచీభాషలో నుండదగును. మాగధీభాషానిబద్ధమేని కాదగును. ఇతరుల కపభ్రంశభాషానిబద్ధమయిన గానముండుట సమ్మతము. శకారాదులకు విభాష కాని యపభ్రష్ట భాష కాని నిర్ణీత మయినది. ఇట్లీవిధముగా భాషానియమము గుర్తించునది.

ఉపమేయగుణా యే స్యుర్నేత్రాదీనాం గుణాశ్రయాః 218

ఉత్తమాధమమధ్యానాం స్త్రీణామపి చ తత్త్వతః.
యథావదవగమ్యైతే ప్రయోజ్యా నాట్యకోవిదైః. 219

నేత్రాదేర్దేవతౌపమ్యే సూర్యాగ్నిపవనాః స్మృతాః
రక్షోదైత్యోద్ధతానాం చ మేఘపర్వత సాగరాః. 220

సిద్ధగంధర్వయక్షాదేః కుంజరర్షభశాఖినః
రాజహంసర్షభగజశార్దూలాః పృథివీభుజామ్. 221

ఏత ఏవ ప్రయోజ్యాః స్యురుదాత్తోత్తమయోరపి
నాగశార్దూలవృషభాన్ న దివ్యేషు ప్రయోజయేత్. 222

క్రవ్యాదా మహిషర్క్షాశ్చ విప్రాణాం రురవః స్మృతాః
సారసాః శిఖినః క్రౌంచాశ్చక్రాహ్వాః కుముదాకరాః. 223

మధ్యమైరుపమేయాః స్యుః ప్రయోజ్యా నాట్యకర్మణి
కోకిలాః షట్పదాః కాకా బకాశ్చాషాశ్చ కౌశికాః. 224

అధమైరుపమేయాః స్యుస్తత్తదర్థానుకూలతః
శర్వరీ వసుధా జ్యోత్స్నా పద్మినీ ద్యౌః కరేణుకా. 225

నాయికానాముదాత్తానాముపమేయగుణాః స్మృతాః
దీర్ఘికా కలికా మల్లీ సారసీ శిఖినీ మృగీ. 226

నాయికానాం మధ్యమానాముపమేయాః స్యురర్థతః
భ్రమరీ కురరీ కాకీ పరపుష్టా చ మాలికా. 227

వేశ్యానామధమానాం స్యురుపమేయగుణా అమీ
యద్వస్తు సుభగం హృద్యమ్మతం దైవతమానుషైః. 228

ఉపమేయం భవే త్తచ్చ గీతవృత్తిషు గాయనైః.
ఏవం విభావ్య భరతైః యథాభావం యథారసమ్. 229

యథార్థమే న్నాట్యం చ ప్రయోజ్యోఽభినయస్సదా

కావ్యప్రబంధము లందు నాయకాదుల నుపమించి చెప్పుటలో ననుసరణీయములు కొన్ని కలవు. అందలి విశేషము లీ ప్రకట్టమున నున్నవి. నాయకాదుల గుణాశ్రయము లయిన యుపమేయగుణములను, ఉత్తమాధమ మధ్యములకు స్త్రీలకు సంబంధించియుండువాని స త్త్వశః యథాశాభముగా గుర్తింపవలెను. నాట్యకోవిదు లట్లు గుర్తించి ప్రయోగింపవలెను. ఇట్లనుట యిది వారి శిక్షాపరము. నాయకాదులకు దేవతౌపమ్యము చెప్పునప్పుడు సూర్యాగ్నిపవనములను, రాక్షసులకు దైత్యుల కుద్ధతులకు నౌపమ్యము నిరూపించునప్పుడు మేఘపర్వతసాగరములను, సిద్ధగంధర్వయక్షాదులకు కుంజర ఋషభ వృషభములను నిరూపింపనగును. పృథివీపాలకుల కౌపమ్యమున రాజహంస ఋషభ గజ శార్దూలములను నిరూపింపవలెను. ఉదాత్తులకు ఉత్తములకును రాజహంసాదులనే ప్రయోగింపదగును. దివ్యుల విషయమున నాగ శార్దూల వృషభములను నిర్దేశింపరాదు. అట్లు వానిని ప్రయోగింపరాదు. అట్లే క్రవ్యాదములను మహిషములను ఋషభములను దివ్యులకు గూర్పరాదు. విప్రులకు రురువులను జెప్పవచ్చును. సారస శిఖి క్రౌంచ చక్రవాక కముదాకరములను మధ్యములు నాట్యకర్మలో ప్రయోగింపదగును. నాట్యకర్మలో నధములు ప్రయోగించుటలో కోకిల షట్పద కాక బక చాష కౌశికములు తత్తదర్థానుకూలమున నుండదగును. ఉదాత్తనాయికల యుపమేయగుణములుగా శర్వరి వసుధ జ్యోత్స్న పద్మిని ద్యౌః కరేణుక యుండదగును. మధ్యమనాయికలకు దీర్ఘికా కలిక మల్లి సారసి శిఖిని మృగి యర్థానుసారమున నుపమేయగుణము లగును. భ్రమరి కురరి కాకి కోకిల మాలిక యనునవి వేశ్యల కథమల కుపమేయగుణము లగును. ఏ యే వస్తువు దైవత మానుషవ్యక్తుల కుపమింపదగినదిగా సుభగము హృద్యము నగునో దానిని గాయనులు గీతవృత్తులతో నుపమేయముగా నిరూపింప దగును. ఇట్లు విభావన మొనరించి యథాభావముగా యథారసముగా యథార్థముగా భరతు లీ నాట్యమును ప్రయోగింప దగును. అభినయ మొనరింప దగును. ఉపమేయగతము లయిన గుణములనుగా నభినయించి నిర్దేశించుటలో నానావిశేషముల నభినయించి ప్రయోగింపవలసి యుండును.

### రసభావములు—తాదాత్మ్యత

వృక్షత్వ శింశుపాత్వాదేర్యథా తాదాత్మ్యముచ్యతే. 230
తథా భవేత్కావ్యబంధే తాదాత్మ్యం రసభావయోః
వాగంగసత్త్వాభినయా భావాః స్యుర్నాట్యకోవిదైః. 231
రసోఽభినేయో వాగంగసత్త్వాహార్యసముచ్చయాత్
ఉభౌ పదార్థవాక్యార్థవాచ్యౌ భవితుమర్హతః. 232
స్థాయీ వా సాత్త్వికో వాపి సంచారీ వా క్వచిత్క్వచిత్
భావో వాక్యార్థతామేతి తద్వ్యాపారవిశేషతః. 233
కేవలం న రసః కావ్యే వాక్యార్థత్వముపైష్యతి
అలంకారోఽపి వాక్యార్థః స్యాద్గుణోఽపి చ వాక్యతః. 234
వాక్యవాక్యార్థవశతో ధ్వన్యంతే తేఽపి కుత్రచిత్
భావా రసాశ్చ యోజ్యాః స్యుర్గుణ్యత్వన్యత్వాత్మనా నరైః. 235

ఇక నిటుపై కొన్ని సాహిత్యశాస్త్రీయము లయిన విషయములు పరామృష్టము లగును. రసభావముల తాదాత్మ్యము అభినేయత వాక్యార్థత రసేతరము లయిన గుణాలంకారములకును వాక్యార్థత యుండుట సోదాహరణముగా ప్రపంచిత మగును. కావ్యబంధము నందు రసభావములకు తాదాత్మ్యమును భావింపవలెను. ఇందీ దృష్టాంతము విభావనీయము. వృక్షత్వమునకు శింశుపాత్వమునకు తాదాత్మ్యమున్నది. అట్లే రసభావములకు తాదాత్మ్య మున్నేయము. వృక్షధర్మము వృక్షత్వము సర్వవృక్షములం దనుగతముగా నుండును. శింశుపావృక్షధర్మము శింశుపాత్వము. శింశుపాత్వము శింశుపావృక్షమునందె యుండును, వృక్షత్వము ఇతర వృక్షము లందు వలె శింశుపావృక్షము నందు నుండును. శింశుపావృక్షము నందు శింశుపాత్వ మున్నది. వృక్షత్వ మున్నది. ఈ వృక్షత్వ శింశుపాత్వములకు తాదాత్మ్య మంగీకృత మయినది. అట్లె భావత్వము భావమునందును రసము నందు నుండును. రసమునందు రసత్వము భావత్వము కలదు. భావత్వ రసత్వములకు తాదాత్మ్యము చెప్పవచ్చును. రసభావములకు తాదాత్మ్యమనుటలో నీ భావమునె గ్రహింపవలెను.

వాగంగసత్త్వాభినయములు భావములు. వాగంగసత్త్వాహార్య సముచ్చయమున నాట్యకోవిదులు రస మభినయింపదగును. భావరసములు రెండును పదార్థవాక్యార్థము లనదగి యున్నవి. ఒక్కొక్కచో స్థాయి కాని సాత్త్వికము

కాని సంచారి గాని తత్తద్వ్యాపవిశేషమున వాక్యార్థత్వమును పొందవు. కావ్యమున రస మొక్కటియె వాక్యార్థత్వమును పొందుట కాదు అలంకారమును వాక్యార్థ మగును. గుణమును వాక్యార్థ మగును వాక్యవాక్యార్థవశమున నవియు ధ్వన్యమానము లగును. ఇది సార్వత్రికము కాదు. ఔచిత్యము భావములను రసములను నటులు వృత్త్యనృత్తగానములన సామ్యోజన మొనరించుట యుక్తము.

ఉదాహరణ మేతేషాం దిఙ్మాత్రేణ విధీయతే
తాదాత్మ్యం భావరసయో ర్వ్యాకరోత్ స్పష్టమూచివాన్. 236

ఈ నిరూపించిన వాని యుదాహరణము సంగ్రహముగా ప్రదర్శిత మగును. భావరసములకు తాదాత్మ్య ముండుటను భారవి కవి స్పష్టముగా నిరూపించెను. ఆ యుదాహరణ మిట్లున్నది—

"ప్రియేఽపరా వాంఛతి వాచమున్ముఖీ
నిబద్ధదృష్టిః శిథిలాకులోచ్చయా
సమాదధే నాంశుకమాహితం వృథా
వివేద పుష్పేషు న పాణిపల్లవమ్." 237

ప్రియుడు వచనము పలుకు నప్పు డున్ముఖి యగు నొక వనిత యాతనిపై దృష్టి నిలిపి నీవిజారినను నిలుపలేదు. తన హస్తము పుష్పములు లందుండుటను గుర్తింపలేదు ఇందామె రాగపారవశ్యము ప్రియాసక్తచిత్తత వ్యక్తమగుచున్నది. ఈ శ్లోకసమన్వయము సూచించుచు గ్రంథకారుడు గద్యము రచించెను. అది యిట్లున్నది.

వాచాం యచ్ఛతః ప్రియస్యావలోకనా దోన్ముఖ్యా నిబద్ధ దృష్టిత్వ శ్లథ కేశపాశత్వ పుష్పస్పర్శానభిజ్ఞత్వ విభావ్యమాన స్తంభ సంభ్రమాంగసాదాది భావైః సంభోగశృంగారః ప్రకాశ్యత ఇతి తాదాత్మ్యమ్. 238

మాటలాడు ప్రియుని యవలోకనమున కున్ముఖి యయిన వనిత యొక్క నిబద్ధదృష్టిత్వము శ్లథకేశపాశత్వము పుష్పస్పర్శానభిజ్ఞత్వములచే విభావ్యమానములగు స్తంభ-సంభ్రమ- అంగసాదాదిభావములచే సంభోగశృంగారము ప్రకాశితమగుచున్నది. కావున భావరసముల తాదాత్మ్యమును గ్రహించునది.

భారవి శ్లోకములలోని "శిథిలాకులోచ్ఛ్రయా" యను పదమున శారదా తనయుడు "శ్లథకేశపాశత్వ" మును భావించెను. ఈ శ్లోకవ్యాఖ్యానమున మల్లినాథు డుచ్ఛ్రయపదమునకు నీవీబంధమను నర్థమును వ్రాసి "నారీకట్యంశుక గ్రంథౌ నీవీ స్యాదుచ్ఛ్రయోఽన్యథ" యని మార్తండ వచనము ప్రమాణముగా జూపెను. ఉచ్ఛ్రయపదము కేశపాశపర మయినచో శిథిలత్వ మాకులత్వము రెండును సంగతము లగును. అది నీవీపరమె యగునేని యాకులత్వ మంతగా సముచిత మగునా? శిథిలత యుండవచ్చును. ఆకులతయు నున్నచో నుండున దేమి? ఉచ్ఛ్రయము పోగనుడి యని యె తెలుగు నిఘంటువులలో నున్నది. ఇందు నిరూపితము లయిన భావములు రసప్రకాశకములుగ నుండుటచే ప్రకాశ్యప్రకాశక భావాపన్నము లయిన రసభావములకు తాదాత్మ్యము స్పష్టముగా నున్నది.

### రసభావములు — వాక్యార్థత

వాక్యార్థతా స్థాయినోఽపి కాళిదాసేన దర్శితా—
"వ్యాహృతా ప్రతివచో న సందధే
గంతుమైచ్ఛదవలంబితాంశుకా
సేవతే స్మ శయనం పరాఙ్ముఖీ
సా తథాపి రతయే పినాకినః"
ఏభిర్భావవిశేషైరేషా రతయేఽభూదితి స్థాయినో వాక్యార్థతా. 239

ప్రథమసమాగమ సమయమున పార్వతీదేవి పలుకరించినను పలుక లేదు. పైట పట్టినను పోదలచెను. శయ్యకు దార్చినను పరాఙ్ముఖముగనె శయనము సేవించెను. అయినను శివునకు శివ రతికే యయ్యెను. ఇం దిట్టి భావవిశేషములచే నామె రతి కలిగించిన దనుట రతిస్థాయి భావమునకు వాక్యార్థత వ్యక్తమయినది.

సాత్త్వికభావస్య వాక్యార్థతా యథా—
"ప్రయచ్ఛతోచ్చైః కుసుమానీ" తి భారవిదర్శితా
బాష్పాకులలోచనత్వం సాత్త్వికోభావః." 240

సాత్త్వికభావము వాక్యార్థమగుట భారవి కావ్యమున "ప్రయచ్ఛతోచ్చైః" యను శ్లోకమున గలదు—

ప్రయచ్ఛతోచ్చైః కుసుమాని మానినీ
విపక్షగోత్రం దయితేన లంభితా

న కించిదూచే చరణేన కేవలం
లిలేఖ బాష్పాకులలోచనా భువమ్.

కుసుమముల నిచ్చు దయితుడు సపత్నీనామమున బిలువగా నా మానిని యేమియు ననలేదు. బాష్పాకులలోచనయై పాదమున నేల లిఖించెను. గోత్రస్ఖలనమున నీర్ష్య కలదైనది. దీనిలో బాష్పాకులలోచనత సాత్త్వికభావము వాక్యార్థ మయినది.

బృహద్వకులవీథ్యాం సంచారిణాం వాక్యార్థతా యథా — "గమన మలసం శూన్యాదృష్టి" రిత్యాది అత్రసంచారిణ ఏవ వాక్యార్థః. "పాణిపీడన విధేరనంతర" మిత్యత్ర కామదౌహృది సుఖమన్వభూదితి సంభోగ శృంగారో వాక్యార్థః. "గగనం గగనాకారం సాగరః సాగరోపమః" ఇత్యత్ర ఉపమాఽలంకార ఏవవాక్యార్థః. "అధరః కిసలయరాగః కోమలవిటపానుకారిణా" విత్యత్ర రూపకాలంకార ఏవ వాక్యార్థః. ఏవముభయాలంకారా ఊహ్యాః. 241

సంచారిభావము వాక్యార్థ మగుట వకులవీథీ సంచారములో "గమన మలసం శూన్యా దృష్టిః" యను శ్లోకమున నున్నది. మాలతీమాధవము ప్రథమాంకమున నిది యున్నది. మదనోద్యానమున మాధవుని మకరందు డభివర్ణించుట యిచటి ప్రకృతార్థము.

గమనమలసం శూన్యా దృష్టిః శరీరమసౌష్ఠవం
శ్వసితమధికం కిం న్వేతత్స్యాత్ ? కిమన్యదతోఽథవా
భ్రమతి భువనే కందర్పాజ్ఞా వికారి చ యౌవనం
లలితమధురాస్తే భావాః క్షిపంతి చ ధీరతామ్.

ఈతని గమన మలసముగా నున్నది. దృష్టి శూన్యము. శరీరము సౌష్ఠవముతో లేదు. శ్వాసమధికము. ఇది యేమగునో? ఇంతకన్న నేమగును. లోకమున కామాజ్ఞ యున్నది. యౌవనము వికారి. లలితమధురము లయిన యా యా విశేషములు ధీరతను నిలుపవు. ఇందు సంచారిభావములు వాక్యార్థముగా నున్నవి. ఆలస్య—చింతా_గ్లాని_శ్రమ_విషాద - మోహాదులు మాధవగతములు. వితర్కము మకరందగతము. మదనోద్యానమున మదనోత్సవదర్శనమునకు వచ్చిన మాధవుడు ఒక వనిత యం దాసక్తుడై మదనావస్థాభిభూతు డయ్యెనని మకరందనిశ్చయము. మాధవుని సంచారభావములు వాక్యార్థరూపమున నున్నది.

సంభోగశృంగారము వాక్యార్థ మగుట "పాణిపీడనవిధే రనంతరం" అను శ్లోకమున గోచరించును.

పాణిపీడనవిధేరనంతరం శైలరాజదుహితుః హరం ప్రతి
భావసాధ్వసపరిగ్రహాదభూత్కామదోహదమనోహరం వపుః.

కుమారసంభవమున నీశ్లోక మష్టమసర్గలో నున్నది. వివాహానంతరము పార్వతీదేహము భావసాధ్వస పరిగ్రహమున కామదోహద మనోహరముగా నయినది శారదాతనయు పాఠము "కామదౌహృదసుఖమన్వభూత్". శైలరాజతనయ యట్టి సుఖమనుభవించె ననుట సంభోగశృంగారము వాక్యార్థముగ నున్నది.

## అలంకార, గుణములు — వాక్యార్థత

అలంకారము వాక్యార్థమగుట.

గగనం గగనాకారం సాగరస్సాగరోపమః
రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ.

గగనము గగనాకారమున నున్నది. సాగరము సాగరసదృశము. రామరావణుల యుద్ధము రామరావణుల యుద్ధమువలె నున్నది. ఇందుపమాలంకారమె వాక్యార్థముగా నున్నది. ఇట్లె యితరాలంకారములును వాక్యార్థము లగును.

రూపకాలంకారము వాక్యార్థమగుట కుదాహరణము—

అధరః కిసలయరాగః కోమలవిటపానుకారిణౌ బాహూ
కుసుమమివ లోభనీయం యౌవనమంగేషు సన్నద్ధమ్.

ఈ శ్లోకము శాకుంతలనాటకమున గలదు. ఇది శకుంతలావర్ణనపరము. ఈమె యధరము కిసలయము. బాహువులు కోమలవిటపములు. అంగముల సన్నద్ధమయిన యౌవనము కుసుమము. ఇట్టి యర్థభావమున నిందు రూపకాలంకారమె వాక్యార్థమని శారదాతనయు డనెను. ఈ యంశ మాలోచనీయము. సుశ్లిష్టముగ లేని యిట్టి యంశములను శారదాతనయుడె రచించెనా? యని సందేహించుట కవకాశము కలదు. ఇట్లె యుభయాలంకారములు వాక్యార్థరూపమున నుండుట నభ్యూహింప దగును.

శబ్దో గుణీభవేత్ స్వస్వవాచ్యార్థగుణ గౌరవాత్. యథా — 'తన్వీ శ్యామా శిఖరిదశనే' త్యత్రాలంబనగతవిశిష్ట గుణాభిధాయక తయా ప్రసాదాఖ్యః శాబ్దోగుణవిశేషో వాక్యార్థ ఇత్యవగమ్యతే. 242

గుణములును వాక్యార్థీభావమున నుండుట సూచిత మయినది. మేఘదూతము నందలి శ్లోకములో—

తన్వీ శ్యామా శిఖరిదశనా పక్వబింబాధరోష్ఠీ
మధ్యే క్షామా చకితహరిణీప్రేక్షణా నిమ్ననాభిః
శ్రోణీభారాదలసగమనా స్తోకనమ్రా స్తనాభ్యాం
యా తత్ర స్యాద్యువతివిషయే సృష్టిరాద్యేవ ధాతుః.

## రసభావాదులు — వ్యంగ్యత

ఆలంబనగత విశిష్టగుణములను నిరూపించునదిగా నున్న ప్రసాద గుణము వాక్యార్థముగ నున్నది.

ఇక నిటుపై స్థాయిసాత్త్వికసంచారులకు వాక్యార్థత యుండుటయ కాక వ్యంగ్యత యుండుటయు నిరూపితమగును.

యథాక్రమమథై తేషాం ధ్వనివాక్యార్థతోచ్యతే- "యాంత్యాముహు ర్వలితకంధరమాననం త" దిత్యత్ర "హృదయే గాఢం నిహితః కటాక్షః" ఇత్యత్ర చ వాక్యార్థ ఉభయోరపి స్థాయినీ రతి ర్వాక్యార్థతా వ్యజ్యతే. 243

స్థాయ్యాదులకు యథాక్రమముగా ధ్వన్యాత్మక మయిన—వ్యంగ్యాత్మక మయిన వాక్యార్థత నిరూపితము కాగలదు. "యాంత్యా ముహుర్వలిత కంధరమాననం" అను మాలతీమాధవము నందలి పద్యములో "గాఢం నిఖాత ఇవ మే హృదయే కటాక్షః" అను నిరూపణమున నిందలి వాక్యార్థము నందు మాలతీమాధవుల కిద్దరకును స్థాయిభావరూపముగా నున్న రతిభావము వాక్యార్థాత్మకముగా వ్యజ్యమాన మగుచున్నది.

సాత్త్వికభావవిశేషము వాక్యార్థముగా ధ్వన్యమాన మగుట కిది యుదాహరణము—

జాతః సోఽపి విలక్షో మయాఽపి హసిత్వా గాఢముపగూఢః
ప్రథమాపసృతస్య నివసనస్య గ్రంథిం విమార్గయమాణః. 244

అత్ర సోఽపి విలక్షో జాత ఇతి వాక్యార్థాదంగసాదవైవర్ణ్యాది సాత్త్విక విశేషో వ్యజ్యతే.

ఆతడంగసంగమునకు దరిజేరగనె విలక్షు డయినాడు. నేనును నవ్వి గాఢముగా నాలింగన మొనర్చితిని. ఆ సమయమున నాతడు మొదటనే యూడదీసిన వసనగ్రంథిని వెదకువాడయ్యెను. ఇం దాతడు విలక్షుడయ్యెనను వాక్యార్థమున నంగసాదవైవర్ణ్యాదిక మగు సాత్త్విక విశేషము వ్యంగ్య మయినది.

సంచారిభావములకు వ్యంగ్యతాస్థితి యుండుటకు నిది యుదాహార్యము—

నిశి నిశి విరహే తవ ప్రియాయా
భవతి విలోచనమిందుకాంతలీలం
భవతి చ వదనం సరోజమస్యా
బిసతనుసూత్రసమా తనుశ్చ తన్వీ. 246

అత్ర లోచనమిందు కాంతం భవతి వదనం సరోజం భవతి బిససూత్రసమాతనురితి వాక్యైః బాష్పజాడ్య కార్శ్య పాండి మో ద్భావ్య వ్యాధ్యాదయో భావా వ్యజ్యంతే ఇతి సంచారిణాం ధ్వనితాస్థితిః ప్రదర్శ్యతే. 247

ప్రతిరాత్రి యందును విరహమున నీ ప్రియురాలి విలోచన మిందుకాంతలీల కల దగుచున్నది. ఆమె వదనము సరోజమగుచున్నది. తన్వి యయిన తనువును బిససూత్రసమాన మగుచున్నది. ఇందు లోచన మిందుకాంత మనుటచే బాష్పము, వదనము సరోజ మనుటచే జాడ్యము, తనువు బిససూత్రసమ మనుటచే కార్శ్యము పాండిమము గోచరింపగా వీనిచే నుద్భావ్యమానము లగు వ్యాధ్యాదిభావములు వ్యజ్యమానము లగుట వలన సంచారిభావములకు ధ్వన్యమానత ప్రదర్శిత మగుచున్నది.

రసధ్వని వాక్యార్థరూపమున గోచరించుట కిది యుదాహరణము కాగలదు—

అహం లజ్జాలుః తస్య చోన్మత్తస్వరాణి ప్రేమాణి
సఖీజనోఽపి నిపుణః హాలా! కిం పాదరాగేణ. 248

అత్రసఖ్యాః కిం పాదరాగేణే నిషేధరూపాద్వాక్యా దుభయోరపి
సంభోగసంపద్వ్యజ్యత - ఇతిరసధ్వనిః. 249

నేను లజ్జావతి నయితిని. ఆతని ప్రేమరీతు లున్మత్తస్వరములు. సఖీ జనమును నైపుణ్యము కలది. పాదరాగమున నేమిటె. పోనిమ్ము - నా పాదముల పారాణి పెట్టు టేలనే? సఖి! నేనాతని దగ్గర లజ్జావతినై యేమియు జేయజాలను. ఆతడు నా లజ్జ గుర్తించియు నూరకొనడు. ఏమేమో ప్రేమ కార్యము లాచరించును. వానిలో నెట్టి పొరపును లేదు. పరిసరమున నున్న చెలియలు నిపుణలు. సర్వము గ్రహింపగలరు. ఇంక నీపాదరాగ మేలనే చెలీ! అని యిందు భావసారము. దీనిలో పాదరాగ మేల? యను నిషేధరూప మగు వాక్యమున నాయికానాయకుల సర్వవిధ సంభోగసంపద వ్యజ్యమాన మగుచున్నది. కావున నిందు రసధ్వని వాక్యార్థముగా నున్నది.

అలంకారము ధ్వన్యమాన మగుట కీ పద్య ముదాహరింపను సంభావ్యము నగును—

లావణ్యసింధురపరైవ హి కేయమత్ర
యత్రోత్పలాని శశినా సహ సంప్లవంతే
ఉన్మజ్జతి ద్విరదకుంభతటీ చ యత్ర
యత్రాపరే కదలికాండమృణాలదండాః. 250

అత్రోపమానభూతోత్పల శశి ద్విరదకుంభ కదలికాండ మృణాలదండై రుపమేయా నేత్రవక్త్రస్తనోరు బాహా వ్యజ్యంతఇతి కదాపి దలంకారోఽపి చిద్ధ్వనిర్భవతి. 251

ఈ లావణ్యసింధు వెవరో యిచట? ఇందుత్పలములు చంద్రునితో నీదుచున్నవి. గజకుంభతటి మునుగు చున్నది యచటి కదలికాండములు మృణాల దండములు వేరుగా నున్నవి. ఇందుసమానభూతము లయిన యుత్పలాదులచే నుపమేయము లయిన నేత్రాదులు వ్యజ్యమానము లగుచున్నవి. తథాహి—ఉత్పలము - నేత్రము, శశి - వక్త్రము, ద్విరదకుంభములు - స్తనములు, కదలికాండము—

మృణాలండము - బాహువ్యక్తి యున్నది. ఇట్లలంకారము కూడ వ్యంగ్య మయినది.

అలంకారము వ్యంజకముగా నుండుటయు వస్తు వభివ్యంగ్య మగుటయు గోచరించుచున్నదనుట కిది యుదాహార్యము.—

సముద్ర ఇవ గాంభీర్యే ధైర్యేణ హిమవానివ
విష్ణునా సదృశో వీర్యే సోమవత్ప్రియదర్శనః. 252

ఏతై రుపమానైః సర్వసత్త్వాశ్రయ యోగ్యత్వ స్థిరప్రతిజ్ఞత్వ విపత్ప్రతీకార సామర్థ్య సర్వాభి గమ్యత్వాదయో వ్యజ్యంత ఇత్యలంకారోఽపి వ్యంజకః. 253

గాంభీర్యమున సముద్రుడు వలె, ధైర్యముచే హిమవానుడు వలె, వీర్యముచే విష్ణుసదృశుడై, సోముని వలె ప్రియదర్శనుడై యున్నాడు. ఇచట సముద్రాద్యుపమానములచే క్రమముగా సర్వసత్త్వాశ్రయయోగ్యత్వము, స్థిరప్రతిజ్ఞత్వము, విపత్ప్రతీకార సామర్థ్యము, సర్వాభిగమ్యత్వము మొదలగు నవి వ్యజ్యమానము లగుచున్నవి కావున నలంకారమును వ్యంజకముగ నున్నది.

గుణములును వ్యంజ్యమానము లగుట కలదు. ఇందిది యుదాహరణము కాగలదు—

మహాసత్త్వోఽతిగంభీరః క్షమావా నవికత్థనః
స్థిరో నిగూఢాహంకారో ధీరోదాత్తో దృఢవ్రతః. 254

అత్రార్థగుణనామ్నా శబ్దవిశేషణ స్వస్వ వాచ్య గుణాశ్రయ భూత సమవాయ మహాబలత్వ దురవగాహత్వాపరాధసహత్వ సత్యవాది త్వానతిలంఘనీయత్వ సర్వస్వ దానక్షమ త్వాభేద్యత్వాదయోఽర్థా వ్యజ్యంతే. అత్ర గుణ గుణినోస్తాదాత్మ్యాద్గుణా అపి వ్యజ్యంత ఇత్యర్థః.

ఈదృగర్థాశ్చ దృశ్యంతే ప్రబంధేషు మహాకవేః 255

ఇందలి మహాసత్త్వాది శబ్దవిశేషములచే మహాబలత్వాద్యర్థములు వ్యజ్యమానము లగుచున్నవి. మహాసత్త్వాదిపదములు గుణాశ్రయము లయిన

వారి నభిధచే జెప్పును. ఆ గుణాశ్రయులందు సమవాయి సంబంధమున నున్న మహాబలత్వాద్యర్థము లు గోచరించును. మహాసత్త్వ - మహాబలత్వ—అతిగంభీర - దురవగాహత్వ—క్షమావాన్ - అపరాధసహత్వ - అవికత్థనత్వ - నిగూఢాహంకారత్వ—స్థిరత్వ - అనతిలంఘనీయత్వ — నిగూఢాహంకారత్వ - స్థిరసమున్నత్వ—దృఢవ్రతత్వ - అభేద్యత్వము మొదలగునవి వ్యంగ్యము లగుచున్నవి. ఇందు గుణగుణితాదాత్మ్యమున గుణములును వ్యజ్యమానములగుచు యున్నది. ఇచట గుణము లనగా కావ్యసామగ్రీప్రవిష్టము లయిన మాధుర్యాది గుణములు కావు.

మహాకవుల ప్రబంధములలో నిట్టి యర్థవిశేషములు గోచరించు చున్నవి. ధ్వనికారు లానందవర్ధనులు ధ్వని మూడు విధములని — వస్తుధ్వని యలంకారధ్వని రసాదిధ్వనియని సోదాహరణముగా నిరూపించిరి. ఆ భావానుసార మునసె శారదాతనయుడు రసేతరములగు వస్త్వలంకారములు వాక్యార్థాత్మక ముగా నుండుటను ధ్వన్యమానముగా నుండుటను ఉదాహరణములందు సంగత పరచెను. వ్యజ్యమానమగు వస్తు వయిన నలంకార మయినను రసాదిపర్యవసా నము పొందుట ధ్వనిప్రస్థానమున నిరూఢమై యున్నది. ప్రాధాన్య ప్రతీతిలో నుండునది రసాదికమె. ముక్తకము లందును రసభావపర్యవసానప్రాధాన్యమున నే కవితాత్మ యుండును. ప్రబంధములందు రసాదిపర్యంతత యనన్యమై యుండును. శారదాతనయు డుదాహరించిన శ్లోకములందును పర్యవసానమున రసప్రతిష్ఠ సహృదయాస్వాదమున నున్నది. ఇట్టి సర్వసాహిత్యార్థమును సంభావించి శారదాతనయుడు రసమె మహావాక్యార్థముగా నుండుటను పూర్వాద్యధికారము లలో నిరూపించినాడు. ఆ యర్థానుసంధానమునసె ప్రకృతార్థమును సంభా వించుట సముచితము.

ఇంతవరకు మార్గప్రక్రియ యీ విధముగా విస్తృత మయినది. మార్గప్రక్రియోపసంహారమున నీ విషయముల నిట్లవధరింప వలెను.

నృత్తనృత్యవిభాగోఽయం విజ్ఞేయో నాట్యకోవిదైః
నృత్తనృత్యవిభాగాత్మా నాట్యే యోఽభినయో భవేత్. 256

స మార్గసంజ్ఞాం లభతే సర్వాతోద్యసమన్వితః
సుకుమారప్రయోజ్యం యత్తన్నృత్యమితి కథ్యతే. 257

ప్రయోజ్యముద్ధతం యత్తు తన్నృత్తమితి కథ్యతే
నృత్తప్రాధాన్యతో నాట్యప్రయోగో రూపకాదిషు. 258

ప్రయోగస్తోటకాదీనాం నృత్యప్రాధాన్యతో భవేత్
ఉభయత్ర ప్రయోక్తవ్యం దేశరీతియుతం నటైః. 259

విశేషస్తోటకాది దేశరీతిమదుచ్యతే
దేశభాషాక్రియాయుక్తం గీతే వాద్యే చ నర్తనే. 260

తోటకాదిప్రయోక్తవ్యం నటైర్నాట్యవిశారదైః
దేశాన్పృథగ్విజానీయాన్నటస్తద్రీతిసిద్ధయే. 261

నాట్యవిషయమున పూర్వనిరూపితార్థములు దృఢధారణమునకై యిచట క్రోడీకృతము లగుచున్నవి. నాట్యకోవిదుఁడు నృత్తనృత్యవిభాగము నీ విధముగా గ్రహింప వలెను. నాట్యము నందలి యభినయము నృత్తనృత్య విభాగమున నున్నది. ఆ యభినయము సర్వాతోద్యసమన్వితమై మార్గమను సంజ్ఞల దయినది. సుకుమారప్రయోజ్య మగునది నృత్యమని, యుద్ధతముగా ప్రయోజ్య మగునది నృత్త మని యనదగును. రూపకాదు లందలి నాట్యప్రయోగము నృత్యప్రాధాన్యమున నుండును. తోటకాదుల ప్రయోగము నృత్యప్రాధాన్యమునసెయుండును. నృత్యనృత్తప్రయోగములలో రెండిటను నటులు దేశరీతి యుతముగా ప్రయోగ మొనరింప వలెను. విశేషముగా తోటకాదికము దేశరీతి యుత మందురు. నాట్యవిశారదులగు నటులు గీతమున వాద్యమున నృత్తమునను తోటకాదికమును దేశభాషాక్రియాయుక్తముగనె ప్రయోగింప వలెను. ఇట్లు దేశభాషాదేశక్రియాయుక్తముగా నాచరించుటకు తత్తద్రీతి విజ్ఞానమునకు నానా విధములయిన దేశములను నటుడు తెలియవలయును. ఆ యా దేశము లందు సంచరించి యా యా దేశభాషావ్యవహారములను నీతి రీతి గీతి మతులను తెలియ వలెను.

## దేశవిభాగము

దేశో భారతవర్షాఖ్యో నవసాహస్రయోజనః
ఆసేతోరాహిమగిరేరాయామః పరికీర్తితః. 262

తారః పూర్వాపరాద్యంతః సప్తసాహస్రయోజనః
వసంతి మర్త్యాః సర్వత్ర ప్రాప్తే కృతయుగే సుఖమ్. 263

భారతవర్షమను పేరు గల యీ దేశము తొమ్మిదివేల యోజనముల నున్నది. ఆసేతుశీతాచలము భారతవర్షము యొక్క యాయామముగా పరికీర్తిత మయినది. దీనివెడల్పు పూర్వసాగరముల మధ్య సప్తసాహస్రయోజనము. కృతయుగము ప్రాప్తము కాగా మర్త్యులంతట సుఖముగా వసింతురు. అప్పట హిమాక్రాంతి భయము లుండవు. జనుల వలని బాధలు జనుల కుండవు. దేవులు జనులు పరస్పరభావసంభావనముతో నుందురు.

త్రేతాయుగే ద్వాపరే చ హిమాక్రాంతిభయాజ్జనాః
పాదం పాదం విసృజ్యైతే శ్రయంతే దక్షిణాపథమ్. 264

యోజనానాం సహస్రే ద్వే సపంచాశచ్ఛతద్వయం
ప్రాప్తే కలియుగే మర్త్యాశ్చరంతి వసుధాతలే. 265

త్రేతాయుగము నందును ద్వాపరము నందును జనులు హిమాక్రాంతి భయమున పాదము పాదము-నాల్గవ భాగ మనుట-పరిత్యజించి దక్షిణాపథ మాశ్రయించిరి. అప్పటి దేశము రెండువేల యోజనముల పొడవు, రెండునందల యేబది యోజనముల వెడల్పు కలది. కలియుగము రాగా వసుధాతలమున మానవులు సంచరింతురు. కలియుగసమయమున దేశపరిమాణ మట్లున్నది.

యథా విద్యాధరాః సిద్ధా గంధర్వాశ్చ మహర్షయః
క్రీడంతి స్త్రీగణైస్సార్థముత్తరాపథభూమిషు. 266

అస్య భారతవర్షస్య చతుర్థో దక్షిణాపథః
చతుష్షష్టిభిదా భిన్నో నానాజనపదాశ్రయః. 267

పాండ్యాః సకేరలాశ్చోలాః సింధు సింహల పామరాః
కలింగ యవన మ్లేచ్ఛ పారసీక శకాహ్వయాః. 268

గౌడ లాట విదర్భాశ్చ కామరూపాంధ్ర కోంకణాః
కర్ణాట సుహ్మ కాంభోజ హూణ కారూశ గుర్జరాః. 269

సౌరాష్ట్ర మహారాష్ట్ర హిమ్మీరావంత్యనూపజాః
అంగా వంగాశ్చ బంగాలాః కాశీకోసల మైథిలాః. 270

కిరాత వర్ధ్రికారట్ట కురు పాంచాల కేకయాః
ఔడ్ర మాగధ సౌవీర దశార్ణ మగధాహ్వయాః. 271

నేపాల జైన బాహ్లీక పల్లవ క్రథకైశికాః
సుశూరసేనకాజాన కారూశ యవనాదయః. 272

యదవశ్చక్ర కురవ పార్వతీయాః సహైమనాః
కాశ్మీర మరు కేంకాణ నగ్నాశ్చ సహ మంకణాః. 273

మహేంద్రదుహితుస్సేతో రేతే మధ్యముపాశ్రితాః
ఏతేఽష్టాదశభిర్భాషాభేదై ర్వ్యవహరంతి చ. 274

ఉత్తరాపథభూములలో యక్ష-విద్యాధర-సిద్ధ - గంధర్వ వర్గముల వారు మహర్షులు నుందురు. వీరు స్త్రీ గణములతో గూడి క్రీడించుచుందురు. మహర్షులు తపోధ్యానముల నుందురు. ఈ భారతవర్షమునకు నాల్గవభాగము దక్షిణాపథము. ఇది నానాజనసదాశ్రయము. అరువది నాలుగు భేదములతో నిది భిన్నమై యున్నది. ఆ భేదవిశేషము లిట్లున్నవి.

పాండ్య-కేరల-చోల-సింధు-సింహల-
పామర-కలింగ-యవన-మ్లేచ్ఛ-పారసీక-
శక-గౌడ-లాట-విదర్భ-కామరూప-
ఆంధ్ర-కోంకణ-కర్ణాట-సుహ్మ-కాంభోజ-
హూణ-కారూశ-గుర్జర-సౌరాష్ట్ర-మహారాష్ట్ర-
హిమ్మీర-అవంతి-అనూప-అంగ-వంగ-
బంగాల-కాశి-కోసల-మైథిల-కిరాత-
వర్ధ్రిక-ఉరట్ట-కురు-పాంచాల-కేకయ-
ఔడ్ర-మాగధ - సౌవీర - దశార్ణ-మగధ-
నేపాల - జైన - బాహ్లీక-పల్లవ-క్రథకైశిక-
శూరసేన-అజాన-కారూశ-యవన-యదు-
చక్ర-కురవ-పార్వతీయ-హైమన-కాశ్మీర-
మరు-కేంకాణ-నగ్న-మంకణములు.

భారతవర్షము నందున్న ఈ అరువదినాలుగు దేశములు "మహేంద్ర దుహితుస్సేతో రేతే మధ్యముపాశ్రితాః" సప్తకులపర్వతములలో నొకటియగు మహేంద్రపర్వతమున నుత్పన్న మయిన నదికిని సేతువునకును మధ్యభాగము నాశ్రయించి యున్నవి. ఇందు యవనపదము పునరుక్త మయినది. ఆ స్థానమున

నుండదగు పదము నితరముల నుండి కూర్చుకొనవలసి యున్నది. ఇందలి నామము లన్నియు నానాటివి. ఈనాటి దేశవ్యవస్థలతో గుర్తించుటకు సావధానత యపేక్షితము. ఈ దేశవాసు లందరు ప్రధానముగా పదునెనిమిది భాషాభేదములతో వ్యవహరించుచున్నారు. ఆ విశేషములిక ప్రస్తుతము లగును.

## దేశభాషలు

తా భాషాస్తేషు కేషాంచద్దేశానాం నామభిః కృతాః
ద్రమిడాః కన్నడాంధ్రాశ్చ హూణ హిమ్మీర సింహలాః. 275

పల్లవా యవనా జైనాః పార్వతీయాః సపామరాః
కష వర్ధ్రిక కాంభోజ శక నగ్నాః సవాకటాః. 276

ఏతేఽష్టాదశభాషాణామాశ్రయాః సహకోంకణాః
ఏతా భాషాశ్చ సర్వత్ర మ్లేచ్ఛభాషేత్యుదాహృతాః. 277

తత్తద్దేశేషు సంగీతం తత్తద్భాషాభిరన్వితం
దేశీతి దేశికమపి కథయంతి మనీషిణః. 278

ఆ భాషలు భారతవర్షము నందలి దేశముల నామములతో నిర్మితములై యున్నవి. ద్రవిడ-కన్నడ-ఆంధ్ర-హూణ-హిమ్మీర - సింహళ-పల్లవ - యవన-జైన-పార్వతీయ-పామర-కష-వర్ధ్రిక-కాంభోజ-శక-నగ్న-వాకట- కోంకణము లను పదునెనిమిది దేశములు పదునెనిమిది భాషల కాశ్రయములుగా నున్నవి. ఈ యష్టాదశభాషలు మ్లేచ్ఛభాషలని పరిభాషితము లయినవి. వ్యాకరణ మహాభాష్యమున "నాపభాషితవై, న మ్లేచ్ఛితవై" యనుచు "మ్లేచ్ఛామా భూమ ఇత్యధ్యేయం వ్యాకరణం" అని నిరూపిత మయినది. ఆ భావమున భాష లన్నియు జానపదసంకేతమున మ్లేచ్ఛభాష లగును. ఆ యా దేశములందు సంగీత మా యా భాషలతో నన్వితమై యున్నది. దానిని దేశి యని దేశిక మని విద్వాంసులు వ్యవహరించుచున్నారు. ఇన్ని భాష లీ విధమున నుండగా, నా యా భాషలలో సంగీతము ఉపనిబద్ధమై యుండగా వీని నుండి నాట్యమున కుపయోగించు భాషలను పరిగణింప వలసి యున్నది. ఆ పరిగణన మిచట నున్నది.

భాషా నాట్యోపయోగిన్యః స్యుః షట్పంచాథ సప్త వా
సంస్కృతప్రాకృతాఖ్యా చ పైశాచీ మాగధీ తథ. 279

శౌరసేనీతి పంచ స్యురపభ్రంశయుతాశ్చ షట్
అపభ్రంశాహ్వయాం భాషాం సప్తమీమపరే విదుః. 280

ఏతా నాగరక గ్రామ్యోపనాగరక భేదతః
త్రిధా భవేయు రేతాసాం వ్యవహారో విశేషతః. 281

నాట్యమున కుపయోగించు భాషలయిదారేడుండును. సంస్కృతము-ప్రాకృతము-పైశాచి-మాగధి-శౌరసేని యను నయిదు భాషలు నాట్యోపయోగి భాషలు. అపభ్రంశభాషను గూడ గలుపుకొనగా నారు భాషలగును. అపభ్రంశాన్తగతముగా నుండు భాషను కలుపుకొని సప్తభాష లుపయోగించు ననిరి. ఈ భాషలు నాగరక-గ్రామ్య-ఉపనాగరక భేదమున మూడు విధములగు టను తద్విదు లంగీకరించిరి ఆ యా భాషల విశేషమున సిద్ధమగు వ్యవహార మా విధమున నున్నది.

ఏవం దేశవిభాగాంశ్చ దేశభాషా దశాష్టచ
దేశ్యోపచారాన్ దేశ్యాంశ్చ తాలాన్ సంగీతకాని చ. 282

సంఖ్యాశ్చ పరివర్తానాం గీతే మాత్రాః కలాకృతాః
విశ్రామానపి తత్సంఖ్యాన్ గీతే వాద్యే కలావశాత్. 283

గీతే ధాతుషు సర్వత్ర సమార్ధవిషమాదిషు
ప్రవేశాంశ్చ విదారీణాం కాలసంఖ్యాః సమాత్రికాః. 284

వితాలమనుతాలాంశ్చ భగ్నతాలక్రమానపి
యథావదభిగమ్యైతాన్ప్రయుంజ్యాన్నాట్యకోవిదః. 285

ఇట్లిరువదినాలుగు దేశవిభాగములను పదునెనిమిది దేశభాషలను దేశీయములగు నుపచారములను దేశ్యములగు తాలములను సంగీతకములను, పరివర్తముల సంఖ్యలను గీతము నందు కలాకృతము లయిన మాత్రలను, అదియే సంఖ్య కల విశ్రామములను నాట్యకోవిదుడు బాగుగా గుర్తింప వలెను. కలావశమున గీతము నందును వాద్యమునందు నెట్లు విశ్రామములు కలుగుచున్నవో గ్రహింపవలెను. సర్వత్ర గీతము నందును సమ-అర్ధ-విషమాదిరూపమున నుండు ధాతువు లందును పరిజ్ఞానము సంపాదింపవలెను. విదారి విశేషముల ప్రవేశములను గ్రహింపవలెను. మాత్రావిధానమున నున్న కాలసంఖ్యలను, వితాల రీతిని, అనుతాలములను, భగ్నతాలక్రమములను యథావిధిగా గుర్తించి నాట్యకోవిదుడు నాట్యము ప్రయోగింప వలెను. సర్వము తెలిసి ప్రయోగించిననె నాట్యశోభ కలుగును. కేవల మనుకరణమున రక్తి కలుగదు.

పౌరజానపదానాం చ దేశేదేశే మహీభృతాం
ఆచారాశ్చోపచారాశ్చ వ్యవహారా అలంక్రియాః. 286

ఆకారాశ్చైవ వేషాశ్చ విహారాశ్చ పృథక్పృథక్
తాంస్తాన్విశేషాన్ జానీయాత్తత్తద్దేశానురూపతః. 287

దేశమున దేశమున నున్న పౌరజానపదుల రాజుల యాచారముల నుప
చారములను వ్యవహారముల నలంక్రియల నాకారములను వేషములను విహారము
లను ఆ యావివేషములను తత్తద్దేశానుసారముగ దెలియవలయును. సర్వము
తెలిసి ప్రయోగింప వలెను.

తాం తాం ప్రకృతిమాస్థాయ నాట్యేనాభినయేన్నటః
వైభాషికా ద్విభాషాశ్చ యథావత్పరికల్పయేత్. 288

శకారాభీరచండాలపులిందాశ్శబరాస్తథా
హాలికా భైరవాశ్చేతి సప్త వైభాషికాః స్మృతాః. 2·9

నటు డా యా ప్రకృతి ననుసరించి నాట్యమున నభినయింప వలెను.
వైభాషికు నుండి విభాషలను యథాతథముగా కల్పింపవలెను. శకార -
ఆభీర - చండాల - పులింద - శబర-హాలిక - భైరవు లనదగిన వారేడుగురు వైభా
షికులు.

విశ్రామే గీతపాఠ్యాదేః సదస్యానాం నటాదిభిః
పరిహాసాయ యోక్తవ్యా దేశభాషాభిరన్వితాః. 290

గీతపాఠ్యాదుల విశ్రామములో సదస్యుల రంజనమున కయిన పరిహాస
మునకై దేశభాషాన్వితము లయిన విశేషములను నటాదులు ప్రయోగించుట
యావశ్యకము. తీక్ష్ణభావనా భావ్యములను నాట్యాదిరీతులను సంభావించు
సహృదయులు చిత్తవృత్తుల సమీకరణమునకై మధ్యమధ్యలో నొకింత విశ్రాంతి
నభిలషింతురు. అప్పుడు హాస ముత్పాదించు చిత్తసముల్లాసము కలిగించు విశేషము
లను వా రాస్వాదింపగలరు. నటాదులు కరణాంగహారప్రయోగమున నలసట
కలవారు కావచ్చును. ఆ సమయమున ప్రకృతావిరుద్ధముగా హాసజనక విన్యాస
ములను గూర్చుట యావశ్యకము. అట్టివారి విశ్రాంతిలో సభ్యరంజనమున కిట్టివి
ప్రయోజ్యములు. కాని సముదాత్తప్రదర్శనమున హాసగంధ ముచితము కాదు.

మండు బహులమగుటను కాగలడు. నాట్యవిదుడు సర్వసహృదయులను దర్శింప జాలడు. ఇట్టి గోష్ఠిలో సర్వసహృదయులు సమావిష్టులై యుందురు. కావున నిట్టి గోష్ఠిలో నాట్యవిత్తముడు చేరి సర్వతః భావప్రకటనములతో ప్రీణన మొనరింప దగును. సహృదయ సభాసదుల ప్రీణనమే ముఖ్యము. సహృదయప్రీతి నాట్య మము త్తేజకము. ప్రశస్తాప్రశస్తగోష్ఠీవిశేషము లిట్లున్నవి. ఇక రసాశ్రయ నాటక ఫలము నిర్దేశించి తన చరితార్థతను వ్యక్తము చేయవలసి యున్నది.

ఇత్థము క్త్క్ర మోపేతం నాట్యం సర్వం సాశ్రయమ్. 309
ప్రేక్షకస్య ప్రయోక్తుశ్చ కవేః స్యాద్భుక్తిముక్తిదం

ఇట్లు క్రమోపేతముగా నాట్యము నిరూపిత మయినది. ఇది సర్వ రసముల కాశ్రయము. రసాశ్రయ మనుట భావాదులకు నుపలక్షణము. నాట్య మనుటయు నృత్తనృత్యములకు గ్రాహకము. ఇట్లు సర్వాశ్రయ మగు నాట్యము ప్రేక్ష కునకు ప్రయోక్తకు కవికిని భుక్తిప్రదము ముక్తిప్రదమునగును. కొన్నిట భుక్తి. కొన్నిట ముక్తి. ఇందు భుక్తిముక్తి భోగరతులు మోక్షరతులు నాట్యరతులు కాదగును

గ్రంథేఽస్మిన్ అవిభిన్నోఽపి యోఽర్థో బహుశ ఈరితః. 310
న తస్య పునరుక్తత్వం మతాంతరసమర్థనాత్
సంతి చైకశతం శిష్యా భరతస్య మహామునేః. 310
తేషాం మతై రభిన్నోఽపి భిన్నవత్ప్రతిభాతి సః

ఈ భావప్రకాశన గ్రంథమున నవిభిన్నమగు నర్థము బహుళవ్యాఖ్యాయ ములు నిరూపిత మయినది. చెప్పిన యర్థమునె యనేకవ్యాఖ్యానములు చెప్పుట పునరుక్తి యగును. కాని యిందు పునరుక్తత్వమును భావింపవలదు. మతాంతర ములను సమర్థించుటకై చెప్పినదే చెప్పుట యయినది. పునఃకథనము మతాంతర ప్రదర్శన పరమగుట పునరుక్తి లేదు. భరతమహాముని శిష్యు లేకశతసంఖ్యాకు లున్నారు. వారి వారి మతములు కొన్ని వేరుగా నుండవచ్చును. అందువలన నభిన్నార్థమును భిన్నముగా నవభాసించును. శిష్యభేదమున ప్రక్రియలలో భేద ముండును గాని పరమ మహార్థము నందు భేదము లేదు. అది యభిన్నమె. అది భిన్నముగ నవభాసించుటయ కాని యభిన్నము.

న స్వాతంత్ర్యాన్న మౌర్ఖ్యాచ్చ కోఽప్యర్థో నిహితః క్వచిత్. 311
భట్టాభినవగుప్తార్యపాదప్రోక్తేన వర్త్మనా
అయం ప్రబంధః కథితః శారదాయాః ప్రసాదతః. 312

శ్రీశారదాతనయుని యాత్మనిశ్చయాత్మక మయిన భావ మిందున్నది. నేని ప్రబంధమును శ్రీశారదాదేవీప్రసాదమున నిరూపించితిని. శ్రీమదభినవగుప్తాచార్యపాదప్రోక్తమార్గమున నీ ప్రబంధము వ్రాసితిని. నాట్యవేదమున శ్రీమదభినవగుప్తులు వివృతిగా రచించిన అభినవభారతి యాధారమున రచించితిని. మహామహేశ్వరు డయిన శ్రీమదభినవగుప్తుని గ్రంథార్థముల ననుసరించి యీ ప్రబంధము రచించితిని. అంతియే కాని, నా స్వాతంత్ర్యమున నేమియు వ్రాయలేదు. మౌఢ్యమున వ్రాయ లేదు. విషయము తెలియక తెలిసికొనజాలక వ్రాయలేదు. నా దివాకరగురువు సర్వము తెలిసి నా కుద్బోధించెను. ఇందు నిరూపిత మయిన యర్థము సర్వము స్వాతంత్ర్యహేతుకము కాదు. మౌఢ్యహేతుకమును గాదు. సర్వార్థము భట్టాభినవగుప్తపాదప్రోక్తమార్గము ననుసరించియె యున్నది. ఈ ప్రబంధము సర్వము శ్రీశారదాప్రసాదసిద్ధము. కట్టిది ప్రమాణసిద్ధము.

యః కశ్చిదవగంతా చేత్ప్రబంధస్యాస్య తత్త్వతః
స మాననీయో భవతి రాజభిర్భావకోవిదైః. 313

ఇతి శ్రీశారదాతనయ విరచితే భావప్రకాశనే నాట్యప్రయోగ భేద ప్రకార విశేషనిర్ణయో నామ దశమోఽధికారః.

శ్రీ శారదాదేవీ ప్రసాదలబ్ధ శ్రీ శారదాతనయ విరచిత శ్రీభావప్రకాశన ప్రబంధమును తత్త్వతః అవగతము చేసికొను నాతడు రాజులచే భావకోవిదులచే మాననీయు డగును.

ఇది శ్రీశారదాతనయ విరచితమైన భావప్రకాశమునందు
భావాలోకమున నాట్యప్రయోగ భేదప్రకార విశేష నిర్ణయమనెడి
దశమాధికారము.

భావప్రకాశనము సర్వము సంపూర్ణము.

భావానాలోచ్య భావానాం సూర్యచంద్రానుయాయినాం
లోకాలోకవిలోకాయ భావాలోకోఽయమీదృశః
సాహిత్యశాస్త్రగ్రంథార్థభావనాభవకోవిదైః
దేశభాషానిబంధానాం ద్వాదశోఽయం విభావ్యతాం
ఉమాదేవీ మహాదేవీ మహాదేవేన తుష్యతు
లోకస్తుష్యతు సంవాదీ సూర్యచంద్రేణ శ్రీమతా.

ముడు బహుమతుడు కాగలడు. నాట్యవిదుడు సర్వసహృదయులను దర్శింప జాలడు. ఇట్టి గోష్ఠిలో సర్వసహృదయులు సమావిష్టులగుదురు. కావున నిట్టి గోష్ఠిలో నాట్యవిత్తముడు చేరి సర్వతః భావప్రకటనములతో ప్రీణన మొనరింప దగును. సహృదయ సభాసదుల ప్రీణనమే ముఖ్యము. సహృదయప్రీతి నాట్య సముత్తేజకము. ప్రశస్తాప్రశస్తగోష్ఠివిశేషము లిట్లున్నవి. ఇక రసాశ్రయ నాటక ఫలము నిర్దేశించి తన చరితార్థతను వ్యక్తము చేయవలసి యున్నది.

ఇత్థముక్తక్రమోపేతం నాట్యం సర్వరసాశ్రయమ్. 308
ప్రేక్షకస్య ప్రయోక్తుశ్చ కవేః స్యాద్భుక్తిముక్తిదం

ఇట్లు క్రమోపేతముగా నాట్యము నిరూపిత మయినది. ఇది సర్వ రసముల కాశ్రయము రసాశ్రయ మనుట భావాదులకు నుపలక్షణము. నాట్య మనుటయు నృత్తనృత్యములకు గ్రాహకము. ఇట్లు సర్వాశ్రయ మగు నిది ప్రేక్ష కునకు ప్రయోక్తకు కవికిని భుక్తిప్రదము ముక్తిప్రదమునగును. కొన్నిట భుక్తి. కొన్నిట ముక్తి. ఇందు భుక్తిముక్తి భోగరతులు మోక్షరతులు నాట్యరతులు కాదగును

గ్రంథేఽస్మిన్ అవిభిన్నోఽపి యోఽర్థో బహుశ ఈరితః. 309
న తస్య పునరుక్తత్వం మతాంతరసమర్థనాత్
సంతి చైకశతం శిష్యా భరతస్య మహామునేః. 310
తేషాం మతైరభిన్నోఽపి భిన్నవత్ప్రతిభాతి సః

ఈ భావప్రకాశన గ్రంథమున నవిభిన్నమగు నర్థము బహుపర్యాయ ములు నిరూపిత మయినది. చెప్పిన యర్థమునె యనేకపర్యాయములు చెప్పుట పునరుక్తి యగును. కాని యిందు పునరుక్తత్వమును భావింపవలదు. మతాంతర ములను సమర్థించుటకై చెప్పినదే చెప్పుట యయినది. పునఃకథనము మతాంతర ప్రదర్శన పరమగుట పునరుక్తి లేదు. భరతమహాముని శిష్యు లేకశతసంఖ్యాకు లున్నారు. వారి వారి మతములు కొన్ని వేరుగా నుండవచ్చును. అందువలన నభిన్నార్థమును భిన్నముగా నవభాసించును. శిష్యభేదమున ప్రక్రియలలో భేద ముండును గాని పరమ మహార్థము నందు భేదము లేదు. అది యభిన్నమె. అది భిన్నముగ నవభాసించుటయ కాని యభిన్నము.

న స్వాతంత్ర్యాన్న మౌఢ్యాచ్చ కోఽప్యర్థో నిహితః క్వచిత్. 311
భట్టాభినవగుప్తార్యపాదప్రోక్తేన వర్త్మనా
అయం ప్రబంధః కథితః శారదాయాః ప్రసాదతః. 312

శ్రీశారదాతనయుని యాత్మనిశ్చయాత్మక మయిన భావ మిందు న్నది. నేని ప్రబంధమును శ్రీశారదాదేవీప్రసాదమున నిరూపించితిని. శ్రీమ దభినవగుప్తార్యపాదప్రోక్తమార్గమున నీ ప్రబంధము వ్రాసితిని. నాట్యవేదమున శ్రీమదభినవగుప్తులు వివృతిగా రచించిన అభినవభారతి యాధారమున రచించితిని. మహామహేశ్వరు డయిన శ్రీమదభినవగుప్తుని గ్రంథార్థముల ననుసరించి యీ ప్రబంధము రచించితిని. అంతియే కాని, నా స్వాతంత్ర్యమున నేమియు వ్రాయ లేదు. మౌఢ్యమున వ్రాయ లేదు. విషయము తెలియక తెలిసికొనజాలక వ్రాయలేదు. నా దివాకరగురువు సర్వము తెలిసి నా కుద్బోధించెను. ఇందు నిరూపిత మయిన యర్థము సర్వము స్వాతంత్ర్యహేతుకము కాదు. మౌఢ్యహేతు కమును గాదు. సర్వార్థము భట్టాభినవగుప్తపాదప్రోక్తమార్గము ననుసరించియె యున్నది. ఈ ప్రబంధము సర్వము శ్రీశారదాప్రసాదసిద్ధము. ఇట్టిది ప్రమాణ సిద్ధము.

యః కశ్చిదవగంతా చేత్ప్రబంధస్యాస్య తత్త్వతః
స మాననీయో భవతి రాజభిర్భావకోవిదైః. 313

ఇతి శ్రీశారదాతనయ విరచితే భావప్రకాశనే నాట్యప్రయోగ భేద ప్రకార విశేషనిర్ణయో నామ దశమోఽధికారః.

శ్రీ శారదాదేవీ ప్రసాదలబ్ధ శ్రీ శారదాతనయ విరచిత శ్రీభావ ప్రకాశన ప్రబంధమును తత్త్వతః అవగతము చేసికొను నాతడు రాజులచే భావ కోవిదులచే మాననీయు డగును.

ఇది శ్రీశారదాతనయ విరచితమైన భావప్రకాశమునందు
భావాలోకమున నాట్యప్రయోగ భేదప్రకార విశేష నిర్ణయమనెడి
దశమాధికారము.

భావప్రకాశనము సర్వము సంపూర్ణము.

భావానాలోచ్య భావానాం సూర్యచంద్రానుయాయినాం
లోకాలోకవిలోకాయ భావాలోకోఽయమీదృశః
సాహిత్యశాస్త్రగ్రంథార్థభావనాభవకోవిదైః
దేశభాషానిబంధానాం ద్వాదశోఽయం విభావ్యతాం
ఉమాదేవీ మహాదేవీ మహాదేవేన తుష్యతు
లోకస్తుష్యతు సంవాదీ సూర్యచంద్రేణ శ్రీమతా.